శ్రీరస్తు.

వాగ్భటాచార్యకృత

# అష్టాంగహృదయము

## సూత్రస్థానము

ఆంధ్రతాత్పర్యసహితము.



చెన్నపురి

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచేం

ప్రకటితము.

శ్రీరస్తు.

శ్రీమద్ధన్వంతరయే నమః.

# అష్టాంగహృదయము

---

## యంత్రములు.



సింహాముఖస్వస్తిక యంత్రము.



మృగముఖస్వస్తిక యంత్రము.



వ్యాఘ్రముఖస్వస్తిక యంత్రము.

# యంత్రములు



సృగాలముఖస్వస్తిక యంత్రము.



అవభంజనస్వస్తిక యంత్రము.



క్రౌంచస్వస్తిక యంత్రము.



నాసాశోధన యంత్రము.



శల్యనిర్ఘాతననాడీ యంత్రము.



కార్పాససహిత శలాకా.



క్షారకర్మోపయుక్త శలాకా.



అగ్నికర్మోపయుక్తశలాకా.



మసూరదళవక్త్ర శలాకా.



బడిశశంకు యంత్రము.



సర్పఫణశంకు యంత్రము.



శర[illegible] యంత్రము.



గం[illegible] ముఖ శలాకా.



ఏకతాలు యంత్రము.



ద్వితాలు యంత్రము.



ఉదకోదరనాడీ యంత్రము.



కర్ణ[illegible] యంత్రము.



ము[illegible] యంత్రము.



అనేకద్వారనాడీ
యంత్రము.



ఏకద్వారనాడీ
యంత్రము.



ద్విదారనాడీ
యంత్రము



బంధనయుక్తసం
దంశయంత్రము.

బంధనరహితసం
దంశయంత్రము.



వస్తియంత్రము.



పశ్చాద్వ్యాకర్షణ
సందంశయంత్ర



అర్శోయంత్రము.



అర్శోదర్శననాడీ
యంత్రము.



గర్భయంత్రము.





కర్ణశల్యదర్శనీయంత్రములు.



కర్ణనాసాశల్యదర్శనీ యంత్రము.



కర్ణనాసాశల్యదర్శనీ యంత్రము.





ధూమపానయంత్రములు.

# విషయసూచిక.

## త్రయోదశాధ్యాయము

## ఏకోనవింశాధ్యాయము

## వింశాధ్యాయము

విషయము. పుట.



విషయము. పుట.

సప్తవింశాధ్యాయము

## ఏకోనత్రింశాధ్యాయము

శ్రీ ర స్తు.

# అష్టాంగహృదయము

## సాంధ్రతాత్పర్యము



# సూత్రస్థానము

## ప్రథమాధ్యాయము

అవతారిక.—ఈగ్రంథకర్తయగు వాగ్భటాచార్యుడు తాజేయంబూనిన అష్టాంగహృదయమను నీగ్రంథము నిర్విఘ్నముగ పరిసమాప్తియగుటకై శిష్టాచారము ననుసరించి గ్రంథారంభమునందు "రాగాదిరోగాన్" అనుశ్లోకముచే తన యిష్టదేవతానమస్కారాత్మకమైనమంగళమును జేయుచున్నాడు.

### మంగళాచరణము

శ్లో. రాగాదిరోగాన్ సతతానుషక్తా
నశేషకాయప్రసృతానశేషాన్,
ఔత్సుక్యమోహారతిదాన్జఘాన
యోఽపూర్వవైద్యాయ నమోస్తు తస్మై.

తాత్పర్యము. ఎల్లప్పుడు శరీరముతో సంబంధించియుండుటచే సహజములైనవియును, పాదాదిశిరఃపర్యంతమైన సకలశరీరమునందుగాని, లేక గజాశ్వసర్పాది సకలజంతువులయొక్క శరీరమునందుగాని వ్యాపించియుండునవియును, నిదానాదులతో గూడినవియును, విషయాభిలాష, మోహము, సర్వకార్యములయందు ద్వేషము అను అసాధ్యలక్షణములతో గూడియుండునవియును నైన, రాగ, లోభ, మోహ, మద, మాత్సర్యరూపముగ నుండురోగములను, నిశ్శేషముగ బోకడమనట్టి యాశ్చర్యభూత వైద్యుడు, లేక అనాదివైద్యుడు నగు భగవంతునిగురించి నమస్కరించెదము. ప్రపంచమునందుండువైద్యులందరు భగవంతునితప్ప నితరులగువైద్యులనగ శరీరైకదేశమునందు

కిత్కాలమున జనించి సాధ్యలక్షణములతోగూడియుండు జ్వరాదిరో[illegible]సాధ
నిశ్శేషముగ బోకడచుటయం దసమర్థులుగనుండెదరు. అయితే,

"అనుపక్రమ ఏవ స్యాత్ స్థితో ఒత్యంతవి. గ్రహే,
ఔత్సుక్య మోహారతికృద్దృష్టోఒ ష్టనాశనః."

అనువచనప్రకారము విషయాభిలాష, మోహము, స్వకార్యములందు ద్వేషము అను అసాధ్యలక్షణములతో గూడియుండు రాగాదిరోగములను భగవంతుడు నిశ్శేషముగ బోకడచుచున్నాడు. దానంజేసియే భగవంతుడు ఆశ్చర్యభూతవైద్యుడని జెప్పబడెను. "రుజంతీతి రోగాః" అనువ్యుత్పత్తిచేత శరీరము, మనస్సు వీనికి సంతాపమును గలుగజేయు నది రోగమని చెప్పబడును. రాగాదులు మనస్సునాశ్రయించియుండుటచే మనస్సును మాత్రము తపింపజేయునే కాని శరీరమును తపింపజేయ లేవు. కావున రాగాదుల నెటుల రోగమని చెప్పవచ్చుననెడి శంక గలుగును. అయితే ఆధేయమగు శస్త్రమైన ఇనుపగుండుచే నాధారమైనకటాహాదులకు తాపము, ఆధారమగు [illegible]మైన కటాహాదులచే ఆధేయమైన ఘృతాదులకు తాపము గలుగనటులనే [illegible]రము మనస్సు ఇవి పరస్పరము ఆధారాధేయ ములుగ నుండుటవలన ఆధారాధేయములం [illegible]నొకదానికి తాపముగలిగినయెడల మఱి యొకదానికిని తాపముగలుగును. కావున [illegible]రీరమును, మనస్సును [illegible]పింపజేయునట్టిరాగా దులు రోగములని చెప్పబడినవి.

"ధాతుసామ్యక్రియా చోక్తాతంత్రస్యాస్య ప్రయోజనమ్"

అనెడి చరకవచనప్రకార మీతంత్రమునకు వాతాదిధాతుసామ్యస్వరూపమైన యారోగ్యమే ముఖ్యప్రయోజనము. హేతులింగౌషధప్రతిపాదకమైనయీతంత్రమునకు స్కంధములు [illegible]యంబులు. ఆయురారోగ్యమోక్షములకు పరస్పరార్థజ్ఞానానుష్ఠానములచే సాధకంబగుట వలన ఉపాయోపేయరూపసంబంధము. హితాహితశరీరవిహారాదులచే నాయుర్వృద్ధికోరు వారు అధికారులు. ఇటుల నీతంత్రమునకు విషయప్రయోజనసంబంధాదులు యుక్త్యను సారముగ గ్రంథకర్తచే నిరూపింపబడినవి.

## ఆయుష్కామీయాధ్యాయ ప్రారంభము

**సూ. అథాత ఆయుష్కామీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః.**

"ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా,
కంఠం భిత్వా వినిర్యాతౌ తేనేమౌ మంగళౌ స్మృతౌ."

అనువచనప్రకారము మంగళకరమైన "అథ" అనుశబ్దము,

"మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే వీర పురుషకాణ్యాయుష్మత్పురుషకాణి చ భవంతి,"

అనెడు మహాభాష్యకారవచనానుసరణి మంగళార్థమై ప్రతియధ్యాయమునందును ప్రయోగించబడును. "అతః" అనుశబ్దము ఆనంతర్యార్థకము. అట్లగుటచే మంగళానంతరము "ఏతీత్యాయుః" అనువ్యుత్పత్తినిబట్టి,

"శరీరేంద్రియసత్వాత్మసంయోగాధారి జీవితం,

నిత్యగశ్చానుబంధశ్చ పర్యాయైరాయురుచ్యతే."

అను వచనముచేత నెల్లపుడు గమనస్వభావముగలయాయువును హితాహారవిహారసేవనము వలనను, అహితాహారవిహారవర్జనమువలనను, స్థిరపరచికొనుటయందిచ్ఛగల ఆయుష్కాముల కు మిక్కుటముగ హితకరంబును, ఆయుష్కాములైన మహర్షులచే తొలుత తెలిసికొనబడినందున ఆయుష్కామీయ మను పేరంబరగునదియును, నగు నీయధ్యాయమును పలుతెఱంగుల పద, అర్థ, ప్రయోజన, ఆక్షేప, పరిహారాదులచే (అనగా ఆయుః అను పదముచేతను, ఏతీత్యాయుః అను అర్థముచేతను ధర్మార్థసుఖసాధనం అను ప్రయోజనము చేతను, ఆయుఃపరిపాలనార్థము కాక గృధ్రభాసాది పక్షులను జంపి వానిమాంసమును భుజింపవలయునని రాజయక్ష్మచికిత్సాప్రకరణమునందు జెప్పి యుండుట శ్రుతిస్మృతివిరుద్ధమైన జీవహింసవలనను, మాంసభక్షణమువలనను అధర్మమే కలుగుచున్నది, కాబట్టి ఆయువు ధర్మార్థసుఖసాధనమని చెప్పియుండుట అసంగత మను ఆక్షేపముచేతను, యజ్ఞముమొదలగు ధర్మార్థములకు ముఖ్యసాధనమైన శరీర సంరక్షణార్థమైచేయబడిన కాకాదిజీవహింస "యజ్ఞార్థమై చేయబడిన పశుహింసవలెనే" ధర్మసాధనమే యగుచున్నది, కావున నధర్మసాధనము కానేరదను పరిహారముచేతను) విశదముగ వివరించెదము.

"ఉత్తరవచనశ్రవణాదున్నయనం యత్ర పూర్వవచనానాం

క్రియతే తదుత్తరం స్యాత్."

అను ప్రమాణమునుబట్టి, "అథాతః" అనుసూత్రము ఉత్తరాలంకారము. దానం జేసియే లోకమునందలి ప్రాణులు పలువిధములగువ్యాధులవలన నుత్పన్నంబులగు వివిధ వేదనలచే పీడితులై రక్షకులు లేక ధర్మాదిపురుషార్థచతుష్టయసంపాదనమునం దశక్తులై చరించుచుండెదరు. అట్టివారింగాంచిన మనోవ్యాకులం బగుచున్నది. కావున నటుల రోగపీడితులై సౌఖ్యముచెందగోరువారి రోగపరిహారంబునకును, ఆయుర్వృద్ధికిని, ప్రజాహితార్థంబునకును, నలయుసాధనముల నుపదేశించి యనుగ్రహింపుడని ఆచార్యుని గూర్చి శిష్యుడుప్రార్థించినందుమీాపటు నియధ్యాయమును సలక్షలాదిసుగుణసంపన్నుడగు శిష్యావధానార్థమై పైజెప్పిన పద, అర్థ, ప్రయోజన, ఆక్షేప, పరిహారాదులచే

పలు తెఱంగుల వివరించెదమని ఆచార్యుడు ప్రతిజ్ఞ చేసినట్టుల వ్యాఖ్యానించుచున్నది. పద సముదాయము వాక్యము, వాక్యసముదాయము ప్రకరణము, ప్రకరణ సముదాయము అధ్యాయము, అధ్యాయసముదాయము స్థానము, స్థానసముదాయము తంత్రము, అని పలుగును, అధ్యాయ మనగా —

'అధికృత్యేయమధ్యాయనామసంజ్ఞా ప్రతిష్ఠితా"

అనువచనముచేత నర్థగతి గలుగునంది యధ్యాయ మని చెప్పబడెను. మఱియు నాయుష్కాములకు హితకరంబులును, మహర్షిప్రణీతంబులును గు నిర్మలమైన యనేకాయుర్వేదతంత్రములు గలవు. అందును, వానిలో చరకమహర్షిప్రణీతంబగు చరకతంత్రము సముద్రమువలె బహువిస్తారముగ, దురవగాహముగ, అత్యావశ్యకములైన కొన్ని విషయములు లేనిదిగ నుండుటంజేసి, దోషయుక్తముగ నుండును. మఱియు ఉదకప్రకరణమునందు —

"జలమేకవిధం సర్వం పతత్యైంద్రం నభస్తలాత్,
తత్తం తత్పతితం చైవ దేశకాలావపేక్షతే."

ఆకసములోనుండిపడునట్టి సర్వజలము నొకటేవిధముగ నుండుననియు, అట్టుల నాకసమునందుండి పడినజలమును, పతితమైనజలమును దేశకాలముల నపేక్షించుచుండుననియును జెప్పి గాంగ సముద్రోదకభేదములను వాని పరీక్షలను చెప్పక యుపేక్షించి యుండుటచేతను, అటులనే నారికేళోదకగుణము, అజాశ్వకఖరక్షీరగుణము మొదలైనవి చెప్పియుండనందు చేతను, కషాయప్రకరణమునందు చేర్చతగిన ద్రవ్యప్రమాణంబింత యని కాచిదించికొనతగిన కషాయప్రమాణంబింతయని చెప్పియుండనందుచేతను, మిశ్ర ప్రకరణమునందు:—

"త్రివృతాం త్రిఫలాం దాలీం ననమూలంపలోన్మితాన్,
చతుర్గుణం జలం దత్వా."

అనగా తెగడ, త్రిఫలములు, ఈమొదలగునవి దినుసు కొక పలమయినట్టు, దానికి నాలుగింతలు నీరుబోయవలయుననియు, స్థూలముగ జెప్పియుండుటచే సేరుకు ద్రవ్యమునకు తగిన ఉదకప్రమాణంబింతయని సులభముగ నిశ్చయించుట దుర్లభమైయుండుటచేతను, కాగిచల్లారినయుదకము నింతకాలమువరకు పానము చేసిన యారోగ్యకరంబగునని చెప్పియుండనందు చేతను, ద్రవ్యగుణప్రకరణమునందు —

"కషాయమధురో రూక్షః శీతః పాకే కటుర్లఘుః,
విశదశ్శ్లేష్మపిత్తఘ్నో ముద్గస్సూప్యోత్తమోత్తమః."

[illegible]ముగ, రూక్షగ, శీతలముగ, పాకమువలనకటువుగ, లఘువుగనుండినదై శ్లేష్మపిత్తములను హరింపంజేయునదెడిగుణములను జెప్పి దానియందుగల మలబంధకారిత్వ గుణమును జెప్పక యుపేక్షించియుండుటచేతను,

"పారాసుహాసరీశాకం వాస్తుకం సునిష్ణకమ్,
విద్యాత్ గ్రాహి త్రిదోషఘ్నం భిన్నవర్చస్తు వాస్తుకమ్."

పార (అనగా చిరుబొద్ది,) సుష, చక్రవర్తికూర, చెంచలికూర, ఇవి మలబంధమును జేయును. చక్రవర్తికూరమాత్రము మలమును భేదించును అనిచెప్పి, పారాదిశాకములకు లఘుత్వాదిగుణములు గలిగియుండునని చెప్పియుండనందుచేతను, ఇక్షువర్గమునందు,

"శైత్యాత్ప్రసాదాన్మాధుర్యాత్ పౌండ్రకాద్వాంశికో వరః"

వాంశికమను చెఱుకుకంటె పౌండ్రమనుచెఱుకు ఉత్కృష్టమైనదని లోకప్రసిద్ధమై యుండగా పౌండ్రకమనుచెఱుకుకంటె వాంశికమనుచెఱుకు శైత్యాదిగుణములచే నుత్కృష్టమైనదని చెప్పియుండుటచేతను, కొన్ని అధ్యాయసంజ్ఞలయందు కూడ వ్యాకరణవిరుద్ధమైన దోషములు గన్పట్టుచుండుటచేతను, చరకతంత్రము అగ్రాహ్యముగ నుండును. ఇవ్విధమైన యనేకదోషములే ఆత్రేయతంత్రమునందును గన్పట్టుచున్నవి. ఇవియును గాక ఆత్రేయతంత్రముయొక్క ప్రథమాధ్యాయమునకు "వేదోత్పత్తి" అను సంజ్ఞ ఇవ్వబడియున్నది. వేదోత్పత్తియనుశబ్దముచే గ్రంథకర్తకు అభిమతమైనవిషయము ఫలానిదని స్పష్టంబగుచుండలేదు. వేదోత్పత్తియనుచో ఆయుశ్శబ్దములోపమైనందున, ఆయుర్వేదోత్పత్తియని యర్థముజేసికొనవలయుననుట గ్రంథకర్తయగు ఆత్రేయుని యొక్క యభిప్రాయమని కొందరు వచించెదరు. అయితే తంత్రారంభమునందే ఆయుశ్శబ్దమును లోపముజేసిచెప్పుట అశుభకరమైనది. మఱియును వేదము నిత్యంబైనదగుటచే దానికి నుత్పత్తియే లేకుండుటవలన వేదోత్పత్తియని జెప్పియుండుటయుకూడ అసంగతము; కావుననే యెట్టిదోషములేనుండ సర్వవిషయములను ప్రతిపాదించునట్టి ఆయుష్కామీయమనుసంజ్ఞ యీ తంత్రమునందు జెప్పబడినది. మహాత్మప్రణీతంబగు చరక, ఆత్రేయతంత్రములయందే యిట్టిదోషములు గన్పట్టుచుండగా నితరతంత్రములను గురించి చెప్పనేల? ఈతంత్రముయొక్క ప్రతిస్థానమునందుండు అధ్యాయసంజ్ఞలచేతనే ఆయా యధ్యాయమునందుండు అర్థములు స్పష్టముగ దెలియును. కావున పై జెప్పిన చరకాదితంత్రములకంటె నీతంత్రమే మిగుల సర్వోత్కృష్టమైనదనియును, దానంజేసి యీతంత్రమున నాచార్యుడు శిష్యునకుపదేశించునట్టుల ప్రతిజ్ఞ జేసినట్టులను కరతలామలకంబగుచున్నది.

ఆయుష్కామయమానేన ధర్మార్థసుఖసాధనం,
ఆయుర్వేదోపదేశేషు విధేయః పరమాదరః 2

ధర్మ, అర్థ ఆత్యంతికసుఖరూపమైన మోక్షములకు ముఖ్యసాధనమైన ఆయువునిచ్ఛయించువాడు ఆయుర్వేదతంత్రమును (అనగా ప్రకృతిజ్ఞానము, రసాయనము, దూతారిష్టము ఈ మొదలగువాని నుపదేశించుటచే నాయువును నిరూపించునట్టివేదమును) పఠన, అర్థజ్ఞాన, అనుష్ఠానములచే దెలిసికొనుటకు మిగులప్రయత్నము చేయవలయును. అనేకాయుర్వేదతంత్రముల నవలోకనము చేయువానికి చికిత్సయందు స్వల్పమైనసందేహముకూడ జనింపకుండునని తెలియజేయుటకై, "ఆయుర్వేదోపదేశేషు" అనుబహువచనము ప్రయోగింపబడినది.

ఆగమశుద్ధి.

బ్రహ్మా స్మృత్వాయుషో వేదం ప్రజాపతిమజిగ్రహత్,
సోఽశ్వినౌ తౌ సహస్రాక్షం సోఽత్రిపుత్రాదికాన్ మునీన్. 3
తేఽగ్నివేశాదికాం స్తేతు పృథక్తంత్రాణి తేనిరే,

బ్రహ్మ ఆయుర్వేదమును స్మరించి, దక్షప్రజాపతికి నుపదేశించెను. దక్షప్రజాపతి అశ్వినీదేవతలకును, అశ్వినీదేవతలు ఇంద్రునికిని ఇంద్రుడు ఆత్రేయ ధన్వంతరి నిమి కాశ్యపాది మహర్షులకును, వారు అగ్నివేశాదులకును నుపదేశించిరి. పదంపడి అగ్నివేశాదులు 6 గురును వేర్వేరుగ అగ్నివేశ, భేడ, జాతుకర్ణ, పరాశర, హారీత, క్షారపాణియను పేరులం బరంగుతంత్రములను సవిస్తరముగ రచియించిరి. ఆయుర్వేదము నిత్యమైనదగుటవలన బ్రహ్మకు స్మరణాధికారముకంటె వేరువిధమైనకర్తృత్వము లేదని యీశ్లోకమునందలి "స్మృత్వా" అనశబ్దము సూచింపుచున్నది.

"ఆయుర్వేదామృతం సర్వం బ్రహ్మా బుద్ధ్వా ప్రజాపతిః,
దదౌ దక్షాయ సోఽశ్విభ్యాం తౌ శతక్రతవే తతః.
ధర్మార్థకామమోక్షాణాం విఘ్నకారిభిరామయైః,
నరేషు పీడ్యమానేషు పురస్కృత్య పునర్వసుమ్.
ధన్వంతరి భరద్వాజ నిమి కశ్యప కాశ్యపాః,
మహర్షయో మహర్షయ స్తథాలంబాయనాదయః.
శతక్రతుముపాజగ్ముః శరణ్యమమరేశ్వరమ్,
తాన్ దృష్ట్వైవ సహస్రాక్షో నిజగాద యథాగతాన్.
ఆయుషః పాలనం వేదముపవేదమథర్వణః,

## అష్టాంగహృదయసంజ్ఞ

తేభ్యోఽతివిప్రకీర్ణేభ్యః ప్రాయస్సారతరోచ్చయః ౪
క్రియతేఽష్టాంగహృదయం నాతిసంక్షేపవిస్తరం,

సుశ్రుత తంత్రమునందు శల్యచికిత్స విశదముగ జెప్పియుండునటుల అగ్నివేశాది తంత్రములయందు విశదముగ జెప్పియుండలేదు. విదేహతంత్రమునందు ఊర్ధ్వాంగ (శాలాక్య) చికిత్స విశదముగ జెప్పియుండునటుల సుశ్రుతతంత్రమునందు విశదముగ జెప్పియుండలేదు కాని ఒక్కొకతంత్రమునం దొక్కొకవిషయము ప్రధానముగ జేసి విశేషముగ జెప్పబడియుండును. కాబట్టి "అనేకక్షేత్రములలో చెదరియుండు యవాది ధాన్యముల నొకచో సంగ్రహించునటుల" అగ్నివేశాద్యనేకతంత్రములయందు జెప్పబడిన సారతరమైనయంశములను తఱచుగ సంగ్రహించి అష్టాంగహృదయమను సార్థకనామముతో గూడినదియును, అతిసంక్షేపాతివిస్తరరహితం బైనదియునునగు నీతంత్రమును నేజేయుచున్నాడను. అతిసంక్షేపముగనుండు సిద్ధసారాదితంత్రములు మందబుద్ధిగలవారి కుపయోగింపవు. అతివిస్తారముగనుండు సంగ్రహాదితంత్రములు పరనార్థజ్ఞానాదుష్ఠానముల కశక్యములుగ నుండును. కాబట్టి స్వల్ప మధ్యమ ఉత్కృష్టబుద్ధిగలవారియొక్క హితార్థమై యీతంత్రము అతిసంక్షేపవిస్తారరహితముగ జేయబడుచున్నదని భావము. శరీరమునందలి సర్వావయవములకు హృదయము ప్రధానంబైయుండునటుల అష్టాంగములుగల యాయుర్వేదమునకు నీతంత్రమే ప్రధానంబైయుండునని "అష్టాంగహృదయం" అను శబ్దమువలన సూచితంబగుచున్నది. ఇటులనే యీతంత్రాంతమునందును "హృదయమివ హృదయమేతత్" అని యీతంత్రకారుడు చెప్పియున్నాడు.

## అష్టాంగములు

కాయబాలగ్రహోర్ధ్వాంగశల్యదంష్ట్రాజరావృషాః. ౫
అష్టావంగాని తస్యాహుశ్చికిత్సా యేషు సంశ్రితా,

తా. ఆయుర్వేదమునకు కాయచికిత్స, బాలచికిత్స, గ్రహచికిత్స, ఊర్ధ్వాంగ చికిత్స, శల్యచికిత్స, విషచికిత్స, రసాయనచికిత్స, వాజీకరణచికిత్స, అనునవి యెనిమిది అంగములుగలవని బ్రహ్మాత్రేయాదులు వచించెదరు. చికిత్స యనుశబ్దముచేతనే కాయచికిత్స ద్యోతకంబగుచుండినను "చీయతే ప్రశస్తధాతుదోషమలైరితి కాయః" అను వ్యుత్పత్తినిబట్టి సంపూర్ణధాతుయుక్తంబై యౌవనావస్థతో గూడియుండు శరీరమే చికిత్సార్హమని తెలియజేయునిమిత్తము కాయశబ్దము ప్రత్యేకముగా నుదహరింపబడి

నవి. సర్వశరీరమును తపింపజేయునవియును, అనుపన్యాశయములయందు జనించినవి యునునైన జ్వర, రక్తపిత్త, అతిసారాది రోగములకు ఉపశమనయోగము చెప్పబడి యుండునట్టి ప్రకరణమే కాయచికిత్స యనబడును. బాలురకు యుక్తమగు నౌషధములు, దాదులయొక్క లక్షణము, దాదుల పాలలక్షణము, పాలవలన జనించినరోగములకు శమనోపాయము ఇవి మొదలగునవి చెప్పబడియుండునట్టి ప్రకరణమే బాలచికిత్స యనబడును. మఱియును కాయచికిత్సయందే బాలశరీరచికిత్సయు నంతర్గతమై యుండినను బలము, ధాతువులు, వయస్సు ఇవి బాలశరీరమునందు స్వల్పముగ నుండుట జేసి తదనుగుణముగ బాలచికిత్స ప్రత్యేకముగ చెప్పబడెను. [illegible] గ్రహపీడితులగు ప్రాణులకు శాంతికర్మ చెప్పబడియుండునట్టి ప్రకరణము గ్రహచికిత్స యనబడును. మెడకొంకులకు పైభాగమునందుండు నేత్రములు, [illegible], [illegible] మొదలగునంగములయందు జనించినరోగములకు [illegible] శమనము చెప్పబడి యుండునట్టి ప్రకరణమే ఊర్ధ్వాంగచికిత్స యనబడును. దీనికే శాలాక్యమనియు నామాంతరముగలదు. శస్త్రచికిత్స [illegible] ప్రకరణమే శల్యచికిత్స యనబడును. [illegible] చెప్పబడి యుండునట్టి ప్రకరణమే విషచికిత్స యనబడును. [illegible] గలుగునపుడు రసాయనోపయోగము చెప్పబడియుండునట్టి ప్రకరణము రసాయనచికిత్స యనబడును.

“వాజీకరణమన్విచ్ఛేత్సంతతం విషయీ పుమాన్.”

అను వచనప్రకారము అల్ప, దుష్టరేతస్సుగలవారికి ఆహ్యాయకప్రసాదజనక రూపమైన చికిత్స చెప్పబడియుండునట్టి ప్రకరణమే వాజీకరణచికిత్స యనబడును. ఇవియే ఆయుర్వేదమునకుగల యెనిమిది అంగములు. మఱియును పైచెప్పబడినందు కాయాదులనే చికిత్స ఆశ్రయించియుండును.

“చతుర్ణాం భిషగాదీనాం శస్తానాం ధాతువైకృతే.
ప్రవృత్తిర్ధాతుసామ్యార్థా చికిత్సేత్యభిధీయతే.”

వాతాదిధాతువులు వికారమును జెందియుండునపుడు ధాతుసామ్యార్థము ప్రశస్తమైన వైద్యులు మొదలగువారియొక్క ప్రవృత్తియే చికిత్సయనబడునని చికిత్సా లక్షణము జెప్పబడియున్నది. అయిన నాలక్షణము చికిత్సకు [illegible] సిద్ధించుచుండుటంజేసి యాతంత్రకారు డిచట ప్రత్యేకముగ జెప్పక విడిచెను. [illegible] మొదలుకొని చికిత్స యావశ్యకంబగుటచే తొలుతనే బాలచికిత్సను చెప్పవలసినది

న్యాయ్యంబైయున్నది. ఐనను సర్వచికిత్సలలోను కాయచికిత్సయే ప్రధానంబు. అట్లగుటచేతనే తొలుత కాయచికిత్స, పిదప బాలచికిత్స, దానికి పిదప బాలగ్రహచికిత్స, దానికి పిదప ఊర్ధ్వాంగచికిత్స, ఈప్రకారము చికిత్సలు క్రమముగా

## వాతాదిదోషములు

వాయుః పిత్తం కఫశ్చేతి త్రయో దోషా స్సమాసతః. ౬

వాయువు, పిత్తము, కఫము అని దోషములు సంక్షేపముగా మూడువిధంబులు. ప్రకృతమునందు వాతాదులను ధాతుసంజ్ఞచేతనే నిర్దేశించుట యుక్తంబైనను అవి రసరక్తాదులను జెరచి వికారమును గలుగజేయుటయందు సమర్థంబులని తెలియపరచు నిమిత్తము దోషములని చెప్పబడినవి.

"వాయుః పిత్తం కఫశ్చోక్తశ్శరీరే దోషసంగ్రహః."

అనువచనముచేత చరకాచార్యుడుకూడ వాతాదులను దోషములనియే చెప్పియున్నాడు.

"వాతపిత్తకఫా దోషా స్త్రయఏవ సమాసతః."

అని చెప్పుట యుక్తంబైనను వాతాదులలో నొక్కొకటియు ప్రధానం బని సూచించుటకై "వాయుః పిత్తంకఫశ్చేతి" అని వేరువేరుగ విభజించి చెప్పబడినది. ఇతరతంత్రకారులు వాత పిత్త కఫములకు స్థానలక్షణ కార్య వికార చికిత్సాదుల జెప్పియుండునటులనే రక్తమునకును యకృత్ప్లీహములుస్థానమని, తామరపువ్వు ఇంద్రగోపపురుగులు బంగారు వీనితో సదృశమైనవర్ణము గలిగియుండుటయే లక్షణమని, శరీరముయొక్క ఉత్పత్తి స్థితులుకార్యమని, విసర్పప్లీహాదులు వికారమని, సిరావ్యధాది క్రియలు చికిత్సయని స్థాన లక్షణము కార్య వికార చికిత్సాదుల జెప్పియుండుటవలన రక్తముకూడ దోషములలోనే అంతర్గతంబగుచున్నది. కాబట్టి దోషములు వాత పిత్త కఫ రక్తభేదంబులచే నాల్గువిధంబులుగ నుండునని కొందరు తంత్రకారులు వచియించెదరు. అది యుక్తియుక్తము కాదు. ఏలననగా—"దూషయంతీతి దోషాః" అనువ్యుత్పత్తినిబట్టి వాతాదులు రక్తాదులను జెరచుటవలనను, ప్రధానంబులైయుండుటవలనను, రక్తాదులచే నొకప్పుడును దూష్యముకాకుండుటవలనను, ప్రకృతిలక్షణనిరూపణములో వాతప్రకృతి, పిత్తప్రకృతి, శ్లేష్మప్రకృతి అనువానికి లక్షణములనుమాత్రము జెప్పి రక్తప్రకృతికి లక్షణము చెప్పకుండుటవలనను, జ్వరప్రకరణమునందు వాతజ్వరము, పిత్తజ్వరము, శ్లేష్మజ్వరము అని తంత్రకారులు చెప్పియుండునటుల నేతంత్రమునందును రక్తజ్వరము జెప్పబడియుండనందువలనను, రక్తము దోషములలో నంతర్గతమైనది కానే

వీనియొక్క అంత్యభాగమునందును, మధ్యభాగమునందును, ఆదిభాగమునందును, విశేషముగ వృద్ధినొందును. (అనగా పురుషాయుస్సుయొక్క అంతభాగమునందు వాతమును, మధ్యభాగమునందు పిత్తమును, ఆదిభాగమునందు కఫమును, ఇటులనే దినాంతమైన సాయంకాలమునందు వాతమును, మధ్యాహ్నమునందు పిత్తమును, ప్రాతఃకాలమునందు కఫమును, రాత్రియొక్క అంతభాగమునందు వాతమును, మధ్యభాగమునందు పిత్తమును, ఆదిభాగమునందు కఫమును, భోజనముయొక్క అంతభాగమునందు (అనగా జాఠరాగ్నిసంయోగమువలన రసాదులకుగలుగు జీర్ణప్రాయమైన అవస్థయందు) వాతమును, మధ్యభాగమునందు (అనగా విదాహావస్థయందు) పిత్తమును, ఆదిభాగమునందు (అనగా భుజించినయాహారము మాధుర్యమును జెందుకాలమునందు) కఫమును వృద్ధిజెందుననిభావము. జాఠరాగ్నిసంయోగమువలన నాహారమునకు సూక్ష్మమైన యనేకావస్థలు కలుగుచుండును. ఐనను,

"ఆదౌ షడ్రసమప్యన్నం మధురీభూతమీరయేత్,
ఫేనీభూతం కఫం యాతం విదాహాదమ్లతాం తతః.
పిత్తమామాశయాత్కుర్యాచ్చ్యవమానం చ్యుతం పునః,
అగ్నినా శోషితం పక్వం పిండితం కటుమారుతమ్."

అనువచనప్రకారము ఆహారమునకుగలుగు పూర్వోక్త అంత మధ్యఆద్యావస్థలే మిక్కుటముగ నుపయోగించుటవలన నిచట నామూడవస్థలే చెప్పబడినవి.

## అగ్నిస్వరూపము

**తైర్భవేద్విషమ స్తీక్ష్ణో మందశ్చాగ్నిస్సమైస్సమః. ౮**

ఆ వాతాదిదోషములచే జాఠరాగ్ని యథాక్రమముగ విషమము, తీక్ష్ణము, మందము, సమము అని నాల్గువిధంబులుగ నగును. అవి యెట్లనగా —వాతాధిక్యముచే విషమము, పిత్తాధిక్యముచే తీక్ష్ణము, కఫాధిక్యముచే మందము, న్యూనాధికభావములులేక సమముగానుండు వాతాదులచే సమత్వము గలదిగ నగునని తెలియవలయును. జాఠరాగ్నియొక్క విషమాది భేదలక్షణములు అంగవిభాగ శారీరాధ్యాయమునందు "యః పచేత్సమ్యగేవాన్నం" అనువచనము మొదలుకొని "యావద్భిరాల్ప పేత్" అనువచనమువరకు జెప్పబడును. ద్విదోషాధిక్యమునందు వాతమునకు యోగవాహిత్వముగలిగియుండుటవలన తీక్ష్ణాగ్నియు, వాతకఫాధిక్యమునందు మందాగ్నియు, కఫపిత్తాధిక్యమునం దాహారవిశేషమువలన నొకప్పుడు తీక్ష్ణాగ్నియు, మఱియొకప్పుడు మందాగ్నియు గలుగునని, సద్వైద్యుడగువాడు స్వబుద్ధిచే నూహించికొనవలయును.

### చతుర్విధకోష్ఠవివరము

కోష్ఠః క్రూరో మృదుర్మధ్యో మధ్యస్స్యాత్తైస్సమైరపి,

వాతాదిదోషములచే కోష్ఠమునకు యథాక్రమముగ క్రూర, మృదు, మధ్యములను మూడు అవస్థలు గలుగును. అవియెట్లనగా — వాతాధిక్యముచే క్రూరకోష్ఠము (అనగా కఠినకోష్ఠము), పిత్తాధిక్యముచే మృదుకోష్ఠము, కఫాధిక్యముచే మధ్యమకోష్ఠము అని తెలియవలయును. న్యూనాధిక్యము లేక సమముగనుండు వాతాది దోషములచే మధ్యకోష్ఠమే కలుగును. వాతపిత్తాధిక్యములచే క్రూర మృదు కోష్ఠ లక్షణమైన విరుద్ధక్రియ యేకకాలమునందే కలుగకుండును. మూడవదైన కఫము వాతపిత్తములతో విరోధించకుండుటవలన స్వాభావికమైన మృదుకోష్ఠమునే గలుగజేయును. తొలుతజెప్పిన మధ్యకోష్ఠము ప్రమాణాతీత కఫాధిక్యముచేతనే జనించును. "మధ్యస్స్యాత్తైస్సమైరపి" అను పైశ్లోకమునందు "సమ" అని చెప్పియుండుటవలన న్యూనాధిక్యము లేక సమముగనుండు వాతాదిదోషత్రయమునందు సమమై స్వప్రమాణము నందుండు కఫముచేతనే కడపటజెప్పిన మధ్యమకోష్ఠము జనించునని ద్యోతకంబగుచున్నది. కాబట్టి, యీ రెండు విధములైన కోష్ఠభేదములను పైప్రకారము తెలిసికొనవలయును.

"శ్లేష్మాధికశ్ఛర్ద్యతే హి దుఃఖం విరిచ్యతే మందకఫస్తు సమ్యక్."

మధ్యకోష్ఠము కఫాధికముగ నుండినచో బాగుగ విరేచనముకాక వమనము మాత్రంబగుచుండును. మధ్యకోష్ఠము సమమైనకఫముతో గూడియుండినచో బాగుగ విరేచనంబగును. కాబట్టి యీరెండువిధములైన మధ్యకోష్ఠములయొక్క భేదము తెలియుటకై వానిలక్షణము భిన్నముగ జెప్పబడినది. క్రూరకోష్ఠాదిలక్షణములు ముందున విరేచనవిధ్యధ్యాయమునందు సవిస్తరముగ జెప్పబడును.

### ప్రకృతిస్వరూపము

శుక్రార్తవస్థైర్జన్మాదౌ విషేణేవ విషక్రిమేః. ౯
తైశ్చ తిస్రః ప్రకృతయో హీనమధ్యోత్తమాః పృథక్,
సమధాతుస్సమస్తాసు శ్రేష్ఠా నింద్యా ద్విదోషజాః. ౧౦

"ప్రాణహరమైనవిషముచే విషక్రిములు జనించుచుండును" అనునట్లు స్వభావముగలపియును శుక్రశోణితములయందు స్వప్రమాణాధికముగ నుండునదియునునైన వాతాదిదోషములచే హీనము, మధ్యమము, ఉత్తమము అను మూడు ప్రకృతులు గర్భాధానకాలమునందు జనించును. అవి యెట్లనగా — వాతా

ధిక్యముచే హీనప్రకృతి, పిత్తాధిక్యముచే మధ్యమప్రకృతి,కఫాధిక్యముచే మూడుయుత్తమ ప్రకృతి అన్యూనవి.న్యూనాధిక్యములేక సమస్థితియుండు వాతాదిదోషములచే నాలవదియైన సమప్రకృతియు జనించును. ఈనాలుగుప్రకృతులలో సమధాతువుగలసమప్రకృతియే మిగులశ్రేష్ఠంబు. ద్విదోషములైన వాతపిత్త, వాతశ్లేష్మ, పిత్తశ్లేష్మములచే జనించిన ప్రకృతులు రోగోత్పత్తికి హేతువగుటవలన నింద్యంబులు.(ప్రకృతియనగా శరీరస్వరూపము. శుక్రమనగా పితృసంబంధమైన రెండు, లేక మూడు బిందువుల స్వరూపముగల రేతస్సు. శోణితమనగా ఋతుకాలమునందు స్రవించెడు మాతృసంబంధమైన రెండు, లేక మూడు బిందువులస్వరూపముగల శోణితము, అని యర్థము.)

### వాతగుణము

తత్ర రూక్షో లఘుశ్శీతః ఖరస్సూక్ష్మశ్చలోఽనిలః,

పైజెప్పిన వాతాదులలో వాతము, రూక్షత్వము, లఘుత్వము, కాఠిన్యము, సూక్ష్మము, ఎల్లపుడును చలించుస్వభావము అనునీగుణములు గల్గియుండును.

"యోగవాహః పరం వాయుస్సంయోగాదుభయార్థకృత్,
దాహకృత్తేజసా యుక్తశ్శీతకృత్సోమసంశ్రయాత్.
తథా. పవనే యోగవాహిత్వాచ్ఛీతం శ్లేష్మయుతే భవేత్,
దాహపిత్తయుతే."

అను వచనములనుబట్టి నైయ్యాయికులు జెప్పుప్రకారము వాయువునకు అనుష్ణాశీత లక్షణమే గలిగియుండును. మఱియు నావాయువునకు యోగవాహిత్వమాత్రముచే నుష్ణగుణము గలిగినను దానియొక్క స్వాభావికమైన శైత్యగుణము నశించినదనియును, ఉష్ణముచే వాతము శమించుననియును, తెలియపరచుటకై "శీతః" అను పదము ప్రయోగించబడినది.

### పిత్తగుణము

పిత్తం సస్నేహతీక్ష్ణోష్ణం లఘు విస్రం సరం ద్రవమ్. ౧౧

పిత్తము ఒకింత స్నిగ్ధముగ, తీక్ష్ణకారిగ, ఉష్ణముగ, లఘువుగ, మత్స్యమువలె దుర్గంధముగ, ఊర్ధ్వాధోభాగములయందు వ్యాపించునట్టి స్వభావముగలదై, ద్రవముగ నుండును.

### శ్లేష్మగుణము

స్నిగ్ధశ్శీతో గురుర్మందః శ్లక్ష్ణో మృత్స్నః స్థిరః కఫః,

కఫము స్నిగ్ధముగ, శీతలముగ, గురువుగ, చిరకాలమునకు కార్యమును చేయునట్టి స్వభావముగలదిగ, మృదువుగ, పిచ్ఛిలముగ, వ్యాపించక యొకచోటనే స్థానమునందు నిలుచునట్టి స్వభావముగలదిగ నుండును.

సంసర్గ-సన్నిపాత-స్వరూపము

సంసర్గస్సన్నిపాతశ్చ తద్విత్రిక్షయకోపతః. ౧౨

స్వప్రమాణమునకంటె నతిక్రమించినవియును, లేక క్షీణించినవియును నైన ద్విదోషములయొక్క సంయోగమే సంసర్గ మనబడును. స్వప్రమాణమునకంటె నతిక్రమించినవియును, లేక క్షీణించినవియునునైన త్రిదోషసంయోగమే సన్నిపాత మనబడును.

సప్తధాతువులు

రసాసృఙ్మాంసమేదోఽస్థిమజ్జశుక్రాణి ధాతవః,
సప్త దూష్యాః

రసము, రక్తము, మాంసము, మేదస్సు, అస్థులు, మజ్జ, శుక్రము అను నేడును,

"శరీరం ధారయంత్యేతే ధాత్వాఖ్యాశ్చ సర్వదా."

అనెడి అష్టాంగసంగ్రహవచనప్రకారము శరీరమును ధరించుచుండుటవలన ధాతువులన బరంగెను. వాతాదులు రసాదులను జెరచుటవలన నా వాతాదులకు దోషములని సంజ్ఞ గలిగినటుల వాతాదులచే రసాదులు జెరపబడుటవలన నా రసాదిధాతువులకే దూష్యములనియు సంజ్ఞ కలిగెను.

మలములు

మలా మూత్రం శకృత్స్వేదాదయోఽపి చ. ౧౩

మూత్రము, శకృత్తు, చెమట, ఈమొదలగునవి మలములని చెప్పబడును. రసాదులకు ధాతువులని, దూష్యములని సంజ్ఞ గలిగినటుల ధాతువులచే మూత్రాదులు చెరపబడుటచే వానికి మలములనియు, దూష్యములనియు, సంజ్ఞ గలిగినది "అపిచ" అనుశబ్దము తెలియజేయుచున్నది.

దోషాదివృద్ధిక్షయక్రమము

వృద్ధిస్సమానైస్సర్వేషాం విపరీతైర్విపర్యయః,
"సర్వేషాం సర్వదా వృద్ధిస్తుల్యద్రవ్యగుణక్రియైః,
భావైర్భవతి భావానాం విపరీతైర్విపర్యయః."

పచనముచేత శరీరమునాశ్రయించియుండు దోషధాతుమలాదులకు సమానమైన ద్రవ్యాదులచే వృద్ధియును, విరుద్ధమైన ద్రవ్యాదులచే క్షయమును గలుగును. మఱియు నావృద్ధిక్షయములు రెండును ద్రవ్యము, గుణము, కర్మ, వీనిభేదముచే త్రివిధంబుగ నగును. వానిలో రక్తముచే రక్తమును, మాంసముచే పృథివీసంబంధమైన మాంసమును వృద్ధిజెందును. అటులనే ఉదకస్వరూపముగల క్షీరముచే ఉదకస్వరూపముగల శ్లేష్మము వృద్ధిజెందును. క్షీరమునందు జనించిన ఘృతముచే ఉదకస్వరూపముగల శుక్రము వృద్ధిజెందును. జీవంతి (పాలకూర), కాకోళి మొదలగు కఫకర ద్రవ్యవిశేషములచే సౌమ్యమైనధాతువులకు కారణమైన స్నేహము, బలము, పుంస్త్వము, తేజస్సు, ఇవి మొదలగునవి వృద్ధిజెందును. మిరియములు, పంచకోలములు, జీడిగింజలు ఇవి మొదలగు ద్రవ్యములచే బుద్ధి, మేధ, అగ్నిదీపనము మొదలగునవి వృద్ధిజెందును. ఇటుల ద్రవ్యముచే వృద్ధిని తెలిసికొనవలయును. పృథివీసంబంధముగల నారికేళము, అరటి, ఖర్జూరము ఇవి మొదలగు ద్రవ్యములయొక్క గురుత్వ శైత్యాగుణములచే నుదకస్వరూపముగల శ్లేష్మము వృద్ధిజెందును. ఇటుల సమానగుణములచే వృద్ధిని తెలిసికొనవలయును. క్రియలు శారీరము, వాఙ్మానసికము, అని ద్వివిధంబులు. వానిలో పరుగులిడుట, దాటుట, దుముకుట, ఇవి మొదలగు చలనస్వరూపముగల శారీర క్రియలచే వాతము వృద్ధిజెందును. మాట్లాడుట, చదువుట, పాడుట ఇవిమొదలగు వాక్సంబంధముగల క్రియలచేతను, చింత, కామము, దుఃఖము, భయము, ఇవిమొదలగు మనస్సుకు క్షోభకరములైన మానసికక్రియలచేతను వాతము వృద్ధిజెందును. కోపము, అసూయ ఇవి మొదలగుమనస్సంతాపకరమైన మానసికక్రియలచే పిత్తము వృద్ధిజెందును. నిద్ర, ఆలస్యము, శయనము, సుఖము, ఇవిమొదలగుక్రియలు స్థిరముగనుండుటచే కఫము వృద్ధిజెందును. ఇటుల కర్మచే వృద్ధిని తెలిసికొనవలయును. అడవి గోధుమలయన్నముచే పృథివీసంబంధముగల మాంసాదులు క్షయించును. తేజస్సంబంధముగల క్షారములచే శ్లేష్మము క్షయించును. ఇటుల ద్రవ్యముచే క్షయమును తెలిసికొనవలయును. శ్లేష్మమునకు విపరీతమైన రూక్ష, ఉష్ణ, తీక్ష్ణాదిగుణములుగల ఆరనాళముచే ఉదకస్వరూపముగల శ్లేష్మము క్షయించును. ఇటుల గుణముచే క్షయమును తెలిసికొనవలయును. నిద్ర, ఆలస్యము ఇవి మొదలగు స్థిరమైన స్వభావముగల క్రియలచే వాతము క్షయించును. ఇటుల కర్మచే క్షయమును తెలిసికొనవలయును. ఈప్రకారము ద్రవ్య, గుణ క్రియాదులచే దోష ధాతు మలాదులయొక్క వృద్ధిక్షయములు నెఱుంగునది.

షడ్రసములు

రసా స్వాద్వమ్లలవణతిక్తోషణకషాయకాః॥ ౧౮

షడ్ద్రవ్యమాశ్రితాస్తే తు యథాపూర్వం బలావహాః,

మధురరసము (అనగా ఘృతము, బెల్లము మొదలగునవి) ఆమ్లరసము (అనగా మాదీఫలము మొదలగునవి) లవణరసము (అనగా సైంధవలవణము మొదలగునవి) తిక్తరసము, కటురసము (అనగా మిరియములు మొదలగునవి) కషాయరసము అనగా కరక్కాయ మొదలగునవి, అని రసములు ఆరు విధములు. ఇవి పంచభూతాత్మకమైన ద్రవ్యముల నాశ్రయించియుండును. పైనచెప్పిన ఆరు రసములలో పూర్వపూర్వము దుండునవి ఒకదానికంటెనొకటి యథాక్రమముగ బలకరమైయుండును. అనియుట్లనగా ఆరురసములలో మధురరసము ప్రాణులకు మిగుల బలకరమైనది. అన్నిరసములకంటె కషాయరసము స్వల్పబలకరమైనది అని తెలియవలయును. మధురాదులగు రసములు సంసర్గభేదములచే ననేకవిధములుగ నగును. అయినను నాస్వాదములంటె రసములు లేవని తెలియజేయునిమిత్తము "షట్" అనుపదము శ్లోకమునందు ప్రయోగింపబడినది.

## రసగుణములు

తత్రాద్యా మారుతం ఘ్నంతి త్రయస్తిక్తాదయః కఫం. ౧౫
కషాయతిక్తమధురాః పిత్తమన్యే తు కుర్వతే,

పైజెప్పిన ఆరు రసములలో మొదటివగు మధుర, ఆమ్ల, లవణరసములు మూడును వాతమును శమింపజేసి కఫమును ప్రకోపింపజేయును. ఇతరములగు తిక్త, కటు, కషాయరసములు మూడును వాతమును ప్రకోపింపజేసి కఫమును శమింపజేయును. కషాయ, తిక్త, మధురరసములు పిత్తమును శమింపజేయును. ఆమ్ల, లవణ, కటురసములు పిత్తమును ప్రకోపింపజేయును. (అనగా మధురరసము వాతపిత్తములను శమింపజేసి కఫమును ప్రకోపింపజేయును. ఆమ్లరసము వాతమును శమింపజేసి కఫపిత్తములను ప్రకోపింపజేయును. లవణరసముగూడ వాతమును శమింపజేసి కఫపిత్తములను ప్రకోపింపజేయును. తిక్తరసము కఫపిత్తములను శమింపజేసి వాతమును ప్రకోపింపజేయును. కటురసము కఫమును శమింపజేసి వాతపిత్తములను ప్రకోపింపజేయును. కషాయరసము కఫపిత్తములను శమింపజేసి వాతమును ప్రకోపింపజేయును. [కషాయరసము కఫపిత్తములను శమింపజేసి వాతమును ప్రకోపింపజేయును.] అని తాత్పర్యము.)

## రసాశ్రయద్రవ్య త్రైవిధ్యము

శమనం కోపనం స్వస్థహితం ద్రవ్యమితి త్రిధా. ౧౬

ద్రవ్యము శమనము, కోపనము, స్వస్థహితము, అని త్రివిధములుగ నుండును. వానిలో వాతాదిదోషములను శమింపజేయునది తైల, ఘృత, మాక్షికములు శమన

ద్రవ్యములనబఱంగును. వాతాదిదోషములను, రసాదిధాతువులను, మూత్రాదిమలము లను ప్రకోపింపజేసెడి యవకము (అనగా కొఱ్ఱుమిరుములు), పటలము (అనగా ధాన్య విశేషము) మినుములు, మత్స్యములు, లేతముల్లంగి, ఆనాలు, పువ్వులగ్గురువెంద, పెరుగు, విరుగుడుజున్ను, సంయోగముచే విరుద్ధములగు క్షీరమత్స్యాదులు, ఇవి మొద లగునవి కోపనద్రవ్యము లనబఱంగును. స్వప్రమాణమునందుండు వాతాదిదోషములకును రసాదిధాతువులకును, మూత్రాదిమలములకును సమత్వమును గలుగజేసెడి ద్రవ్యములును, ఋతుచర్య మాత్రాశితీయధ్యాయములయందు ప్రత్యహము సేవనార్హములని జెప్ప బడిన ఎఱ్ఱరాజనాలు, షష్టికధాన్యము, యవలు, గోధుమలు, జాంగలమాంసము, మను బాలకూర, దివ్యోదకము, క్షీరము ఇవిమొదలగుద్రవ్యములును బలకరముగ రసాయన వాజీకరణోపయోగముగ నుండుద్రవ్యములును, స్వస్థహితద్రవ్యము లనబఱంగును. వానిలో తైలము, స్నేహ గురుత్వగుణములు గలదియగుటంజేసి, విపరీతగుణములుగల వాతమును శమింపజేయును. ఘృతము, మాధుర్య, శైత్య, మాంద్యగుణములుగలదియగుట జేసి విపరీతగుణములుగలపిత్తమును శమింపజేయును. మాక్షికము (అనగా తేనె) రూక్ష, తీక్ష్ణ, కషాయగుణములుగలదియగుటంజేసి విపరీతగుణములుగల కఫమునుశమింపజేయును.

## వీర్య ద్వైవిధ్యము

### ఉష్ణశీతగుణోత్కర్షాత్తత్ర వీర్యం ద్విధా స్మృతం,

పైజెప్పిన ద్రవ్యములయందు ఉష్ణగుణాధిక్యమువలన ఉష్ణవీర్యము, శీత గుణాధిక్యమువలన శీతవీర్యము, అని ద్వివిధమైన వీర్యములు జెప్పబడియున్నవి. ఉత్త రత్ర జెప్పబడు గురుత్వమున్నగునిరువదిగుణములలో నంతర్గతమైయుండు ఉష్ణశీత గుణాధిక్యముచేతనే వీర్యము జనించునని సర్వాయుర్వేదములయందు ప్రసిద్ధముగ జెప్ప బడియున్నది. కాబట్టి, ఉష్ణము, శీతము, అను నీరెండుగుణములే వీర్యమునకు ముఖ్య కారణము. ద్రవ్యములయందు నానావిధగుణములు గలిగియుండినను ప్రపంచము అగ్ని సోమస్వరూపము గలదియగుటచే వానియందలివీర్యము (అనగా శక్తి) మాత్రము ద్వివిధంబుగనే యుండును.

## ద్రవ్యవిపాక త్రైవిధ్యము

### త్రిధా విపాకో ద్రవ్యస్య స్వాద్వమ్లకటుకాత్మకః. ౧౭

పైజెప్పిన ద్రవ్యములయందు మధురవిపాకము, ఆమ్లవిపాకము, కటువిపాకము, అని త్రివిధవిపాకములు గలిగియుండును. అట్లగుటచేతనే ద్రవ్యములలో కొన్నిటికి మధురవిపాకము, కొన్నిటికి ఆమ్లవిపాకము, మఱికొన్నిటికి కటువిపాకము కలిగియున్నవి.

వానిలో మధురలవణద్రవ్యములకు మధురవిపాకము, ఆమ్లద్రవ్యములకు ఆమ్లవిపాకము, తిక్తకటుకషాయద్రవ్యములకు కటువిపాకము గలిగియుండును. కావున నావిపాకమును కార్యముచే నూహించుకొనవలయును.

“జాఠరేణాగ్నినా యోగాద్యదుదేతి రసాంతరమ్,
రసానాం పరిణామాంతే స విపాక ఇతి స్మృతః.”

అను ప్రమాణమునుబట్టి సర్వద్రవ్యములకు జీర్ణాంతమునందు గలుగునట్టియు కార్యముచే నూహింపదగినదియు, జాఠరాగ్నిసంయోగముచే రసములకు గలుగునట్టియు నవస్థాంతరము విపాక మనబడును.

“రసో నిపాతే ద్రవ్యాణాం విపాకః కర్మనిష్ఠయా,
వీర్యం యావదధీవాసాన్నిపాతాచ్చోపలభ్యతే.”

అని భట్టారకచరకమునులుకూడ విపాకలక్షణమును పైజెప్పినప్రకారమే చెప్పియున్నారు. ద్రవ్యమునందలి రసము మధురామ్లాదిభేదములచే నారువిధములుగ నుండినను విపాకముమాత్రము పైజెప్పినప్రకారము త్రివిధముగ నేర్పడును.

## ద్రవ్యగుణములు

గురుమందహిమస్నిగ్ధశ్లక్ష్ణసాంద్రమృదుస్థిరాః,
గుణాస్ససూక్ష్మవిశదా వింశతిస్సవిపర్యయాః. ౧౮

పైజెప్పిన ద్రవ్యములయందుండు గురుత్వ, మాంద్య, హిమ, స్నిగ్ధ, శ్లక్ష్ణ సాంద్ర, మృదుత్వ, స్థిర, సూక్ష్మ, విశదములను యీ పదిగుణములు గుర్వాదులకు విపరీతగుణములతోజేరి యిరువదిగ నగును. అదియెట్లనగా.—గురుత్వమునకు లఘుత్వము విపరీతము, మాంద్యమునకు తీక్ష్ణము విపరీతము, హిమమునకు ఉష్ణము విపరీతము, స్నిగ్ధమునకు రూక్షము విపరీతము. శ్లక్ష్ణమునకు ఖరమువిపరీతము, సాంద్రమునకు ద్రవము విపరీతము, మృదువునకు కాఠిన్యము విపరీతము, స్థిరమునకు సరమువిపరీతము. సూక్ష్మమునకు స్థూలము విపరీతము, విశదమునకు పిచ్ఛిలము విపరీతము, అని గుర్వాదులకు విపరీతగుణములను తెలియవలయును. ఇటుల ప్రతిద్రవ్యమునకు విపరీతగుణములతోడ నిరువది గుణములు గలిగియుండును.

## రోగారోగ్యకారణము

కాలార్థకర్మణాం యోగో హీనమిథ్యాతిమాత్రకః,
సమ్యగ్యోగశ్చ విజ్ఞేయో రోగారోగ్యైకకారణమ్.

కాలము (అనగా శీతోష్ణవర్షలక్షణములతో గూడియుండు త్రివిధమైన కాలము.) అర్థము (అనగా పంచమహాభూతగుణములగు రూపరసగంధశబ్దస్పర్శములు) కర్మ (అనగా శరీరవాఙ్మనస్సులయొక్క క్రియారూపమైన కార్యము) అనియర్థము. కాలము, అర్థము, కర్మ అను నీమూటిలో ప్రతిదానికి గలుగునట్టి హీన, మిథ్య, అతిమాత్రయోగములు రోగమునకు ముఖ్యకారణము. అటులనే, కాలము, అర్థము, కర్మ అనువానియొక్క సమ్యగ్యోగము (మితమైనసంబంధము), ఆరోగ్యమునకు ముఖ్యకారణము. పూర్వోక్తకాలము అర్థము, కర్మ అనువానియొక్క హీనయోగ, మిథ్యాయోగ, అతిమాత్రయోగ, సమ్యగ్యోగ వివరణం బెట్లనగా —స్వస్వరూపము లేకుండుట (అనగా స్వల్పముగ శీతము, ఉష్ణము, వర్షము గలిగియుండుట,) కాలముయొక్క హీనయోగము. స్వరూపమునకంటె వ్యతిరిక్తంబగుట (అనగా శీతకాలమునందత్యుష్ణము, ఉష్ణకాలమునం దతిశీతము వర్షాకాలమునందు వర్షము లేకుండుట) కాలముయొక్క మిథ్యాయోగము, స్వరూపాధిక్యము (అనగా అతిశైత్యము, అత్యుష్ణము, అతివర్షము) కాలముయొక్క అతిమాత్రయోగము ఇంద్రియములకు స్వస్వవిషయములయందు స్వల్పమైనసంబంధము గలిగియుండుట అర్థములయొక్క హీనయోగము. ఇంద్రియములకు ఇష్టములేని పదార్థసంబంధము అర్థములయొక్క మిథ్యాయోగము, ఇంద్రియములకు విషయములయొక్క అధికసంబంధము అర్థములయొక్క అతిమాత్రయోగము, శరీరాదులకు క్రియయందు స్వల్పమైన ప్రవృత్తి కలిగియుండుట కర్మయొక్క హీనయోగము. మలాదుల నడ్డగించుట, తృప్తిగ భుజింపకుండుట, మిక్కుటముగ మాట్లాడుట, రాగద్వేషాదులు గలుగుట కర్మయొక్క మిథ్యాయోగము. శరీరాదులకు కర్మలయం దధికప్రవృత్తికలుగుట కర్మయొక్క అతియోగము అని తెలియవలయును. ఇవి యన్నియు రోగములకు ముఖ్యకారణము. కాలము తన ప్రమాణము నతిక్రమించక స్వస్వరూపమునందుండు కాలముయొక్క సమ్యగ్యోగము. ఇంద్రియములకు స్వస్వవిషయముల యందు ప్రమాణము నతిక్రమించని సంబంధము అర్థములయొక్క సమ్యగ్యోగము. శరీర, వాక్, మనస్సులు, సమక్రియలయందు ప్రమాణము నతిక్రమించక సమముగ వర్తించుచుండుట కర్మయొక్క సమ్యగ్యోగము అని తెలియవలయును. ఇవియన్నియు శరీరారోగ్యమునకు ముఖ్యకారణములు.

### రోగారోగ్యస్వరూపము

**రోగస్తు దోషవైషమ్యం దోషసామ్యమరోగతా,**

వాతాదిదోషములలో నొకటికైనను, రెంటికైనను, మూటికైనను స్వప్రమాణ

ప్రయోగింపబడినది. రజస్సుప్రధానమైనదగుటచే తొలుత జెప్పబడినది. వాతాదులుకూడ మనస్సు నాశ్రయించి వికారమును గలుగజేయుటచే నవియును మనోరోగమునకు కారణమని తెలియపరచుటకై "ద్వౌచ" అను చకారము ప్రయోగింపబడినది.

### రోగపరీక్షాక్రమము

## దర్శనస్పర్శనప్రశ్నైః పరీక్షేత చ రోగిణం,

దర్శనము (అనగా కాసము, మేహము మొదలగురోగములయందు శరీరముయొక్క పీతశుక్లవర్ణములు, శరీరాకారము, వ్యాధిప్రమాణము, ఛాయ, మలమూత్రములు, వాంతి మొదలగువానినిచూచుట), స్పర్శనము (అనగా జ్వరము, గుల్మము, విద్రధిమొదలగురోగములయందును, శీతము, ఉష్ణము, స్తబ్ధము, స్పందముఅనువాని యందును హస్తశరీరములను తాకిచూచుట) ప్రశ్న (అనగా శూల, అరుచి, ఛర్ది, మనస్సుయొక్కమంచిచెడ్డస్థితులు, మృదుక్రూరకోష్ఠములు, స్వప్నము, జన్మనక్షత్రము, రోగోత్పత్తినక్షత్రదినములు, శరీరసుఖము, దుఃఖము, పదార్థములయందు ప్రీతిద్వేషములు మొదలగువానినడుగుట), వీనిచే రోగిని పరీక్షింపవలయును.

### రోగవిశేషజ్ఞానోపాయము

## రోగం నిదానప్రాగ్రూపలక్షణోపశయాప్తిః. ౨౨

నిదానము, పూర్వరూపము, లక్షణము, ఉపశయము, సంప్రాప్తి, అను నైదుపాయములచే రోగమును పరీక్షించవలయును. నిదానము అనగా ఆదికారణము. అది ఆసన్నము, విప్రకృష్టము అని ద్వివిధంబులు. వానిలో మొదటిదియగు ఆసన్నమే ఆసన్నము, అత్యాసన్నము అని ద్వివిధంబుగనుండును. మఱియు రూక్ష, లఘుశీతాది ద్రవ్యోపయోగము ఆసన్నమనబడును. ఏవస్తువుయొక్క ఉపయోగమువలన వాతాది దోషములు ఉత్తరక్షణమునందే ప్రకోపించి రోగమును గలుగజేయునో అట్టివస్తువుయొక్క ఉపయోగము అత్యాసన్నమనంబడును. ఏవస్తువును తొలుత నుపయోగించినది మొదలుకొని జ్వరాదిరోగములు, మేహకుష్ఠాదిరోగములు గలిగియుండునో అట్టి వస్తువుయొక్క యుపయోగము విప్రకృష్టమనంబడును. ఫలానివస్తువు ఫలానిరోగమునకు కారణమని శాస్త్రములయందు జెప్పబడియున్నది. కాబట్టి జనించియుండురోగము ఫలానివస్తువుయొక్క భక్షణముచేసే జనించియుండవచ్చునని శాస్త్రముచే తెలిసికొనవలయును. రోగముజనించుటకుముందు వాతాదిదోషములు సంకలితంబులై సూక్ష్మంబులై స్పష్టముగ తెలియకుండుటయే పూర్వరూపమనబడును. వాతాదిసకలదోషములు ప్రకోపించి రోగముస్పష్టముగ గనుపించుచుండుటయే లక్షణమనబడును. సుఖకరమైన యాహారాద్యుపయోగము ఉపశయమ్మనబడును. మఱియు వివిధమైన యాహారమువలన

శరీరమునందు బాధకలిగినది. ఈవిధమైన యాహారమువలన శరీరమునందు బాధ కలుగ లేదు. కావున జనించియుండురోగము ఇయ్యదియని యీనియమములను తెలిసికొన వలయును. ఈప్రకారముగా దుష్టమై యిట్టివాటి స్థానమునందుండు నిదోషముచే నిట్టిరోగముజనించినదని తెలిసికొనుట ఆప్తయనబడును. ఇదియే సంప్రాప్తి, జాతి, ఆగతి యను పర్యాయపదములచే వ్యవహరింపబడును.

### దేశద్వైవిధ్యము

భూమిదేహప్రభేదేన దేశమాహురిహ ద్విధా,

ఈశాస్త్రమునందు భూమి, దేహము అను ద్వివిధమైన దేశము ఆచార్యులు వచించెదరు. శిరము, హస్తము మొదలగు శరీరదేశము ప్రసిద్ధమగుటచే నిచట జెప్పక విరమించెను.

### భూమిత్రైవిధ్యము

జాంగలం వాతభూయిష్ఠమనూపం తు కఫోల్బణమ్. ౨౩
సాధారణం సమమలం త్రిధా భూదేశమాదిశేత్,

భూప్రదేశము జాంగలము, అనూపము, సాధారణము అని త్రివిధము. జలము స్వల్పోదకముగలిగి వృక్షపర్వతాదులతో గూడియుండునది జాంగలదేశమనబడును. ఇది వాతాధిక్యముకలది. అట్లగుటచే నాదేశమునందు జనించిన వృషభ, పక్షి, పక్షి ఓషధులు మొదలగునవి వాతాధిక్యముగలవియై యుండును. అధికమైన జలవృక్షములతో గూడి గాలి యెండ లేకుండెడి ప్రదేశము అనూపదేశమనబడును. ఇది కఫాధిక్యముకలది. దానంజేసి యీదేశమునందుజనించిన ఓషధులు మొదలగునవి కఫాధిక్యముగలవియై స్నిగ్ధములుగనుండును. పైజెప్పినద్వివిధమైన జాంగల, అనూపదేశ లక్షణములతో గూడి యుండు ప్రదేశము సాధారణదేశమనబడును. దీనియందు వాతాదిదోషములు సమముగ నుండును.

### ఔషధోపయోగకాలస్వరూపము

క్షణాదిర్వ్యాధ్యవస్థా చ కాలో భేషజయోగకృత్. ౨౪

ఔషధోపయోగమైన కాలము క్షణాదిస్వరూపము, వ్యాధ్యవస్థాస్వరూపము గలదియని ద్వివిధంబుగనుండును. క్షణాది అను ఆదిశబ్దమువలన లవ, త్రుటి, ముహూర్త, యామ, అహోరాత్ర, పక్ష, మాస ఋతు, అయన సంవత్సరములను గ్రహించికొన వలయును. వానిలో —

"పూర్వాహ్ణే వమనం దేయం మధ్యాహ్నేతువిరేచనమ్,
మధ్యాహ్నే కించిదావృత్తే వస్తిం విద్యాద్విచక్షణః."

అనగా, పూర్వాహ్ణమునందు వమనమును, మధ్యాహ్నమునందు విరేచనమును, మధ్యాహ్నమొకింతమారినపిదప వస్తికర్మను జేయింపవలయునని యెడి కాలము క్షణాదికాల మనబడును.

"లంఘనం స్వేదనం కాలో యవాగూస్తిక్తకో రసః,
మలానాం పాచనాని స్యుః యథావస్థం క్రమేణ వా
జ్వరే పేయాః కషాయాశ్చ సర్పిః క్షీరం విరేచనం,
త్ర్యహం వా షడహం వింద్యాద్వీక్ష్య దోషబలాబలమ్.
మృదుర్జ్వరో లఘుర్దేహ శ్చలితాశ్చ మలా యదా,
అచిరజ్వరితస్యాపి భేషజం యోజయేత్తదా."

అనగా, యుక్తకాలమునందు లంఘనము, స్వేదకర్మ, యవాగూపానము, చేదైన కషాయాదులద్రాగుట, ఇవి యథాక్రమముగ నాయారోగావస్థను తగినటుల వాతాదిమల ములను పచనము జేయును. మఱియు దోషబలాబలముల ననుసరించియు మూడుదినము లైనను, ఆరుదినములైనను గడచిన జ్వరమునందు పానముచేయదగిన కషాయఘృత క్షీరవిరేచనముల నొసంగవలయును. జ్వరము మృదువుగను, దేహము లఘువుగను, మల ములు స్వస్థానమునుండి చలించినవిగ నుండునపుడు నూతనజ్వరితునికికూడ ఔషధము నియ్యవలయును. ఇటుల రోగములయొక్క సామ, నిరామ, మృదు, మధ్య, తీక్ష్ణాద్య వస్థలకు తగిన యౌషధము నొసంగవలయునని యెడి కాలము వ్యాధ్యవస్థాకాలమనబడును.

### ఔషధ ద్వైవిధ్యము

శోధనం శమనం చేతి సమానాదౌషధం ద్విధా,

ఔషధము సంగ్రహముగా శోధనము, శమనము అని రెండువిధములు. ఔషధ ములు ఛేదభేదాద్యనేకభేదములుగలవి యైనను అవియన్నియు నీ రెండువిధములగు నౌషధములలో నంతర్గతంబగుటచే నౌషధము రెండు విధములని చెప్పబడినది. ప్రకో పించినవాతాదిదోషములను వెలిపుచ్చి రోగమును శమింపజేసెడి యౌషధము [illegible] నౌషధమని పఱంగును; ప్రకోపించిన వాతాదిదోషములను స్వస్థానమునందే జేసి వానికి సమత్వమును గలుగజేసెడి యౌషధము శమనౌషధ మనబఱంగును.

### ఔషధ విషయము

శరీరజానాం దోషాణాం క్రమేణ పరమౌషధమ్.
వస్తిర్విరేకో వమనం తథా తైలం ఘృతం మధు,

వైద్యుడు క్రియలయందు సమర్థుడుగను, ఆయుర్వేదశాస్త్రము నెఱింగిన యుపాధ్యాయునివద్ద బాగుగ నాయుర్వేదశాస్త్రార్థముల నెఱింగినవాడుగను, విశేషముగ చికిత్సానుభవముగలవాడుగను, కాయవాక్మనస్సులయందు శుచిగలవాడుగను, ధర్మార్జనమునం దిచ్ఛ కలిగి ధనమునందు విశేషముగ నిచ్ఛలేనివాడుగ నుండవలయును.

ఔషధగుణము

బహుకల్పం బహుగుణం సంపన్నం యోగ్యమౌషధమ్ ౨౮

ఔషధము స్వరసము, క్వాథము, చూర్ణము ఈ మొదలగు ననేక కల్పములుగలదిగను, గురుత్వము, మాంద్యము మొదలగు ననేకగుణములు గలదిగను, ప్రశస్తమైన భూదేశములయందు జనించినదిగను, లేక పాకసంస్కారములతో గూడినదిగను, వ్యాధి, దేశ కాల, దోష్య, దూష్య, దేహ, వయో, బలాద్యనుగుణముగ నుపయోగింపదగినదిగ నుండును.

పరిచారకునిగుణము

అనురక్తశ్శుచిర్దక్షో బుద్ధిమాన్ పరిచారకః,

పరిచారకుడు రోగియందు దృఢమైనభక్తి కల్గి కాయ, వాక్, మనోవ్యాపారములయందు దోషములేక సర్వకార్యములయందు సామర్థ్యంబును, సుబుద్ధియు గలవాడై యుండవలయును.

రోగిగుణము

ఆఢ్యో రోగీ భిషగ్వశ్యో జ్ఞాపకస్సత్త్వవానపి. ౨౯

రోగి ధనవంతుడును, వైద్యుడు జెప్పినప్రకారము నడచువాడును, రోగ, ఆహార, విహారాదులయొక్క గుణాగుణములను, నిదానాదులను వైద్యునికి చక్కగ బోధించగలిగినవాడును, ధైర్యవంతుడును నై యుండవలయును.

సుఖసాధ్యరోగలక్షణము

సర్వౌషధక్షమే దేహే యూనః పుంసో జితాత్మనః,
అమర్మగోఽల్పహేత్వగ్రరూపరూపోనుపద్రవః.
అతుల్యదూష్యదేశర్తుప్రకృతిః పాదసంపది,
గ్రహేష్వనుగుణేష్వేకదోషమార్గో నవస్సుఖః ౩౦

తీక్ష్ణమృదుమధ్యస్వభావంబును, నానావిధదేశజనితంబును, శమనశోధనరూపంబును, విషక్షారాదిస్వరూపంబునుగల సర్వౌషధములను సహింపదగిన మంచి యౌవనవంతుడు, చాపల్యరహితుడునగు పురుషునియొక్క శరీరమునందు జనించినట్టియు

శిరస్సు, హృదయము, వస్తి మొదలగు మర్మస్థానములయందు వ్యాపించినట్టిగాను, స్వల్పమైన నిదాన, పూర్వరూప, లక్షణములతో గూడినట్టియు,

"వ్యాధేరుపరి యోవ్యాధిర్భవత్యుత్తరకాలజః,
ఉపక్రమవిఘాతీ చ సఉపద్రవ ఉచ్యతే"

అనువచన ప్రకారము తొలుత జనించిన రోగమునకు చికిత్సా ప్రతిబంధకమును గలుగ జేయునట్టి మఱియొకరోగము ఉత్తరకాలమునందు జనించుటకు ఉపద్రవ మనబడును. కావున నట్టి యుపద్రవములేనట్టియు, అతుల్యములైన (అనగా సమానములుకాని) మేదో మజ్జాదిదూష్యములు, అతుల్యములైన అనూపాదిదేశములు, అతుల్యములైన హేమంత శిశిరాదిఋతువులు, అతుల్యములైన వాతాదిప్రకృతులు గలిగినట్టియు, వైద్యుడు మొదలగు పాదచతుష్టయముతో గూడినట్టియు, వాతాదిదోషములు, శాఖాదిమార్గములు అనువానిలో నొకటినే ఆశ్రయించియుండునట్టియు, నవీనమైనదియు, నగువ్యాధి సూర్యాదిగ్రహములు అనుకూలముగ నుండునపుడు సుఖసాధ్యము. స్త్రీలశరము మిగుల మృదువుగ నుండుటవలన [illegible], మ్మ[illegible], నానా విధ [illegible] సహింపనేరరు గనుకను, చపలబుద్ధి, [illegible] గలవారు గనుకను వారిశరీరమునందు జనించురోగములన్నియు కష్టసాధ్యములగు గును. దానం జేసి స్త్రీశరీరచికిత్సానివారణార్థమై యీశ్లోకమునందు "పుంసః" అనుపదము ప్రయోగింపబడినది. ఇక అతుల్యదూష్య, అతుల్యదేశ, అతుల్యఋతు, అతుల్యప్రకృతులవలన జనించురోగవివరం బెట్లనగా —శీతస్వరూపముగల కఫముచే దూషితమైన ఉష్ణస్వభావముగల రక్తముచే జనించినరోగము అతుల్యదూష్యరోగ మనబడును. అనూపదేశము నందు పిత్తప్రకోపమువలన జనించినరోగము అతుల్యదేశరోగ మనబడును. శరత్కాలమునందు కఫప్రకోపమువలన జనించినరోగము అతుల్యఋతురోగ మనబడును, పిత్తప్రకృతిగల మనుజునికి, శ్లేష్మప్రకోపమువలన జనించినరోగము అతుల్యప్రకృతిరోగము.

ను. విషమక్రియ మహాక్రియగలప్త్తే, వాతజనితప్రమేహములవలనే విషమ

అతుల్యదూష్య దేశఋతు ప్రకృతులుగల రోగము సుఖసాధ్యముగ నగుచున్నది. కాబట్టి మూలశ్లోకమునందు సుఖసాధ్యమని చెప్పియుండుట అసంగతమని కొందరికి శంక కలుగును. అయినను సమానవిషమ మహాక్రియలు ప్రమేహరోగప్రభావములవలన శ్లేష్మపిత్తవాతజనిత ప్రమేహములయొక్క సాధ్య, యాప్య, అసాధ్యములకు హేతువు లగుచున్నవే కాని అతుల్యదూష్యదేశఋతుప్రకృతులుగల రోగమునందు హేతువులు కానేరవు; గనుక అతుల్యదూష్యదేశఋతు ప్రకృతిగలరోగము సాధ్య

మని చెప్పియుండుట యుక్తము. మఱియును కొన్నివ్యాధులయందు తుల్య, దూష్య దేశ, ఋతు ప్రకృతులుకూడ సుఖసాధ్యమునందు హేతువులుగ నుండును.

"జ్వరే తుల్యర్తుదోషత్వం ప్రమేహే తుల్యదూష్యతా,
రక్తగుల్మే పురాణత్వం సుఖసాధ్యత్వహేతవః."

జ్వరమునందు వసంతాదిఋతువులకు వాతాదిదోషములకును గుణములు సమానములుగ నుండుటయు, ప్రమేహమునందు దోషదూష్యములు సమానములుగ నుండుటయు, రక్తగుల్మమునందు చిరకాలము గడచుటయు సుఖసాధ్యహేతు వని గ్రంథాంతరమునందు చెప్పబడియున్నది. సుఖసాధ్య మనగా—

"సుఖసాధ్యస్సుఖోపాయః కాలేనాల్పేన సాధ్యతే"

అను ప్రమాణముచొప్పున సుఖోపాయమువలన స్వల్పమైనకాలముచే సాధింపతగిన రోగ మని యర్థము.

## కష్టసాధ్యరోగలక్షణము

### శస్త్రాదిసాధనః కృచ్ఛ్రే సంకరే చ తతో గదః,

శస్త్రము, క్షారకర్మ, అగ్నికర్మ, విషలేపనము ఇవి మొదలగువానిచే చికిత్స జేయవలసిన రోగంబులును, సాధ్యాసాధ్యలక్షణములతో గూడియుండు రోగంబులును, వయోవంతుడైనను చపలముతో గూడియుండువానికి జనించిన రోగంబును, చాపల్యరహితుడై వయోవంతుడుగ నుండువానికైనను మర్మస్థానము నాశ్రయించి జనించిన రోగంబును, సర్వౌషధములను సహించతగిన దేహపాటవము కల్గియున్నను ముసలితనమున జనించిన రోగంబును, వయోవంతుడైనను పాటవముచెడి సర్వౌషధములను సహించనేరని శరీరముగలవానికి జనించినరోగంబును కష్టసాధ్యంబు. కష్టసాధ్య మనగా—

"కృచ్ఛ్రైరుపాయైః కృచ్ఛ్రస్తు మహద్భిశ్చ చిరేణ చ."

అనువచనప్రకారము కష్టతరంబును, మహత్తయిన సాధనములచే చిరకాలముమీద సాధ్యంబును నగు రోగమని యర్థము.

## యాప్యరోగలక్షణము

### శేషత్వాదాయుషో యాప్యః పథ్యాభ్యాసాద్విపర్య

దీర్ఘమైన జీవితకాలముగలవానికి అసాధ్యలక్షణములతో గూడియుండు రోగము జనించినయెడల నది హితాహారవిహారములవలన యాప్యముగ నగును.

"దత్వాల్పం సుఖమల్పేన హేతునా నప్రతాయతే,

యాతి వా శేషతో రోగిః కర్మణో నియతాయుషః,

ప్రశాన్నివ విష్కంభై ధార్యస్తత్రాంతరా హితైః."

యాప్యరోగము చికిత్సాకాలమునందు స్వల్పముగ శమించి మరల స్వ... చేతనే ప్రకోపమును బొందును. మఱియు నారోగికి ఆయువు గట్టిగ నుండుటవలన కర్మజనితమైన యారోగము నిశ్శేషముగ శమించక ప్రాణములను హరింపజేయక బాధను గలుగజేయుచుండును; కావున అట్టియాప్యరోగములయందు పలుమారు హితాహారవిహారాది సేవనమును చేయుచుండవలయును.

### వర్జనీయరోగలక్షణము

అనుక్రమ ఏవ స్యాత్థితోఽత్యంతవిపర్యయే,
ఔత్సుక్యమోహారతికృద్దృష్టరిష్టోఽక్షనాశనః 33

మజ్జ శుక్రము మొదలగు ధాతువులను మర్మసంధుల నాశ్రయించి యుట్టి చికిత్సకును లోబడక అత్యాశ, చిత్తనాశము, ఏకార్యమునం దిచ్ఛలేకుండుట ఇవి మొదలగు లక్షణములతోడను, ప్రత్యక్షమైన మరణచిహ్నములతోడను గూడి చక్షురాదీంద్రియకార్యములను నశింపజేయదగిన రోగమును వర్జింపవలయును.

"వ్యాధిం పురా పరీక్ష్యైవమారభేత తతః క్రియాం,

స్వార్థవిద్యాయశోహానిమన్యథా ధ్రువమాప్నుయాత్."

అను అష్టాంగసంగ్రహవచనప్రకారము వైద్యుడు తొలుత రోగసాధ్యాసాధ్యములను బాగుగ బరీక్షించి చికిత్స నారంభించవలయును. అటుకానిచో వైద్యుని ధనము, విద్య, యశస్సు, ఇవి నశించును.

### వర్జ్యరోగిలక్షణము

త్యజేదార్తం భిషగ్భూపైర్ద్విష్టం తేషాం ద్విషం ద్విషం,
హీనోపకరణం వ్యగ్రమవిధేయం గతాయుషమ్. 34
చండం శోకాతురం భీరుం కృతఘ్నం వైద్యమానినం,

రాజ, వైద్యద్వేషములుగలవాడు, రాజు, వైద్యులు వీరిచే ద్వేషింపబడిన చికిత్సాసామగ్రి లేనివాడు, అనేకకార్యములయం దాసక్తికలవాడు, వైద్యుని అల్పాయువుగలవాడు, మిగుల రోషవంతుడు, సాహసవంతుడు, ఎల్లపుడు దుఃఖించుస్వభావము, భయపడుస్వభావముగలవాడు, పరోపకారమును మఱచువాడు తాను వైద్యుడు ననుకొనుచునపుడు వైద్యునివలె నటించి ఔషధసేవనమును నుపేక్షించువాడు నగురోగికి జనించిన రోగము సుఖసాధ్యంబైనను వానిని వైద్యుడు చికిత్సచేయక వర్జింపవలయును.

అధ్యాయ సంగ్రహము

[illegible]స్త్రాస్య పరం చాతో వక్ష్యతేఽధ్యాయసంగ్రహః. ౩౫

ఇక నీతంత్రమునందలి యధ్యాయసంగ్రహమును సుఖావబోధనార్థమై వివరించెదము.

సూత్రస్థానాధ్యాయసంగ్రహము

ఆయుష్కామదినర్తీహాః రోగానుత్పాదనద్రవాః,
అన్నజ్ఞా నాన్నసంరక్షా మాత్రాద్రవ్యరసాశ్రయాః. ౩౬
దోషాదివిజ్ఞానతద్భేద తచ్చికిత్సాద్వ్యుపక్రమః,
శుధ్యాదిస్నేహనస్వేద రేకాస్థాపననావనమ్. ౩౭
ధూమగండూషదృక్సేకతృప్తియంత్రకశస్త్రకం,
సిరావిధిశ్శల్యవిధిశ్శస్త్రక్షారాగ్నికర్మకాః. ౩౮
సూత్రస్థానమిమేధ్యాయాస్త్రింశచ్ఛారీర ముచ్యతే,

సూత్రస్థానమునందు —ఆయుష్కామీయము, దినచర్య, ఋతుచర్య, రోగానుత్పాదనీయము, ద్రవద్రవ్యవిజ్ఞానీయము, అన్నస్వరూపవిజ్ఞానీయము, అన్నసంరక్షణీయము, మాత్రాశితీయము, ద్రవ్యాదిజ్ఞానీయము, రసభేదీయము, దోషాది విజ్ఞానీయము, దోషభేదీయము, దోషోపక్రమణీయము, ద్వివిధోపక్రమణీయము, శోధనాది గణసంగ్రహణీయము, స్నేహవిధి, స్వేదవిధి, వమనవిరేచనవిధి, వస్తివిధి, నస్యవిధి, ధూమవిధి, గండూషవిధి, ఆశ్చ్యోతనాంజనవిధి, తర్పణపుటపాకవిధి, యంత్రవిధి, శస్త్రవిధి, సిరావ్యధవిధి, శల్యాహరణవిధి, శస్త్రకర్మవిధి, క్షారాగ్నికర్మవిధి అని ముప్పదియధ్యాయములు గలిగియుండును. "సూచ్యతే అనేన సకలస్తంత్రార్థః" అను వ్యుత్పత్తిప్రకారము ఈ తంత్రమునందలి సకలార్థములను సూచించుటంజేసి యిది సూత్రస్థానమని పఱంగెను. ఈసూత్రస్థానము సకలతంత్రములకు శిరముగ నుండును. ఇక శారీరస్థానాధ్యాయసంగ్రహమును వివరించెదము.

శారీరస్థానాధ్యాయసంగ్రహము

గర్భావక్రాంతితద్వ్యాప దంగమర్మవిభాగికమ్.
వికృతిర్దూతజం షష్ఠం,

శారీరస్థానమునందు — గర్భావక్రాంతిశారీరము, గర్భవ్యాపచ్ఛారీరము, అంగవిభాగశారీరము, మర్మవిభాగశారీరము, వికృతివిజ్ఞానశారీరము, దూతవిజ్ఞానీయశారీరము, అను నారు అధ్యాయములు గలిగియుండును,

## నిదానస్థానాధ్యాయసంగ్రహము

నిదానం సార్వరోగికం,
జ్వరాసృక్కాసశ్వాసయక్ష్మాదిమదాత్యయార్శోతిసారిణామ్. ౪౦
మూత్రాఘాతప్రమేహాణాం విద్రధ్యాద్యుదరస్యచ,
పాండుకుష్ఠానిలాస్రాణాం వాతస్య చ షోడశ. ౪౧

నిదానస్థానమునందు—సర్వరోగనిదానము, జ్వరనిదానము, రక్తపిత్తకాసనిదానము, శ్వాసహిక్కానిదానము, రాజయక్ష్మానిదానము, మదాత్యయాదినిదానము, అర్శోనిదానము, అతిసారగ్రహణీదోషనిదానము, మూత్రాఘాతనిదానము, ప్రమేహనిదానము, విద్రధివృద్ధిగుల్మనిదానము, ఉదరనిదానము, పాండుశోఫవిసర్పనిదానము, కుష్ఠశ్విత్రకృమినిదానము, వాతవ్యాధినిదానము వాతశోణితనిదానము అనుపదునారు అధ్యాయములు గలిగియుండును.

## చికిత్సాస్థానాధ్యాయసంగ్రహము

చికిత్సితం జ్వరే రక్తే కాసే శ్వాసే చ యక్ష్మణి,
వమౌ మదాత్యయేఽర్శస్సు విశి ద్వౌ ద్వౌ చ మూత్రితే ౪౨
విద్రధౌ గుల్మజఠరపాండుశోఫవిసర్పిషు,
కుష్ఠశ్విత్రానిలవ్యాధివాతాస్రేషు చికిత్సితమ్. ౪౩
ద్వావింశతిరిమేధ్యాయాః కల్పసిద్ధిరతః పరం,

చికిత్సాస్థానమునందు— జ్వరచికిత్స, రక్తపిత్తచికిత్స, కాసచికిత్స, శ్వాసహిక్కాచికిత్స, రాజయక్ష్మచికిత్స, ఛర్దిహృద్రోగతృష్ణాచికిత్స, మదాత్యయచికిత్స, అర్శోరోగచికిత్స, అతిసారరోగచికిత్స, గ్రహణీరోగచికిత్స, మూత్రాఘాతచికిత్స, ప్రమేహచికిత్స, విద్రధివృద్ధిరోగచికిత్స, గుల్మరోగచికిత్స, ఉదరరోగచికిత్స, పాండురోగచికిత్స, శ్వయథురోగచికిత్స, విసర్పరోగచికిత్స, కుష్ఠరోగచికిత్స, వాతవ్యాధిచికిత్స, శ్విత్రరోగచికిత్స అను ఇరువదిరెండు అధ్యాయములు గలిగియుండును. ఇక కల్పస్థానాధ్యాయసంగ్రహము వివరించెదము.

## కల్పస్థానాధ్యాయసంగ్రహము

వమిర్విరేకస్య తత్సిద్ధిర్వస్తికల్పనా. ౪౪
సిద్ధిర్వస్త్యాపదాం షష్ఠో ద్రవ్యకల్పోఽత ఉత్తరం,

కల్పసిద్ధిస్థానమునందు:—వమనకల్పము, విరేచనకల్పము, వమనవిరేచనవ్యాపత్సిద్ధికల్పము, వస్తికల్పము, వస్తివ్యాపత్సిద్ధికల్పము, భేషజకల్పము, అను ఆరధ్యాయములు కలిగియుండును. ఇక ఉత్తరతంత్రమును వచించెదము.

## ఉత్తరతంత్రస్థానాధ్యాయసంగ్రహము

బాలోపచారే తద్వ్యాధౌ తద్గ్రహే ద్వౌ చ భూతగే. ౪౫
ఉన్మాదే చ స్మృతిభ్రంశే ద్వౌద్వౌ వర్త్మసు సన్ధిషు,
దృ క్తమోలింగనాశేషు త్రయో ద్వౌద్వౌ చ సర్వగే. ౪౬
కర్ణనాసాముఖశిరోవ్రణే భగ్నే భగందరే,
గ్రంథ్యాదౌ క్షుద్రరోగేషు గుహ్యరోగే పృథగ్ద్వయమ్. ౪౭
విషే భుజంగే కీటేషు మూషకేషు రసాయనే,
చత్వారింశోఽనపత్యానా మధ్యాయో బీజపోషణః. ౪౮

ఉత్తరతంత్రమునందు —బాలోపచరణీయము, బాలామయప్రతిషేధము బాలగ్రహప్రతిషేధము, భూతవిజ్ఞానీయము, భూతప్రతిషేధము, ఉన్మాదప్రతిషేధము, అపస్మారప్రతిషేధము, వర్త్మరోగవిజ్ఞానీయము, వర్త్మరోగప్రతిషేధము, సంధిసితరోగవిజ్ఞానీయము, సంధిసితాసితప్రతిషేధము, దృష్టిరోగవిజ్ఞానీయము, తిమిరప్రతిషేధము, లింగనాశప్రతిషేధము, సర్వాక్షిరోగవిజ్ఞానీయము, సర్వాక్షిరోగప్రతిషేధము, కర్ణరోగవిజ్ఞానీయము, కర్ణరోగప్రతిషేధము, నాసారోగవిజ్ఞానీయము, నాసారోగప్రతిషేధము, ముఖరోగవిజ్ఞానీయము, ముఖరోగప్రతిషేధము. శిరోరోగవిజ్ఞానీయము, శిరోరోగప్రతిషేధము, వ్రణవిజ్ఞానీయము, సద్యోవ్రణప్రతిషేధము, భంగప్రతిషేధము, భగందరప్రతిషేధము, గ్రంథ్యర్బుదశ్లీపదాదివిజ్ఞానీయము, గ్రంథ్యాదిప్రతిషేధము, క్షుద్రరోగవిజ్ఞానీయము క్షుద్రరోగప్రతిషేధము, గుహ్యరోగవిజ్ఞానీయము గుహ్యరోగప్రతిషేధము, విషప్రతిషేధము, సర్పవిషప్రతిషేధము, కీటలూతాదిప్రతిషేధము, మూషికాళర్కవిషప్రతిషేధము, రసాయనీయము, వాజీకరణీయము, అనునలుబదియధ్యాయములు గలిగియుండును.

ఇత్యధ్యాయశతం వింశం షడ్భిస్స్థానైరుదీరితమ్

ఈప్రకారము నూటయిరువదియధ్యాయములు. సూత్రము, శారీరము, నిదానము, చికిత్స, కల్పసిద్ధి, ఉత్తరతంత్రము అను నారుస్థానములయందు నున్నయవి.

ప్రథమాధ్యాయము ముగిసెను.



(అనగా [illegible]జ్ఞానాధ్యయనాదులకు యోగ్యమైనరాత్రియొక్క కడపటి యామమునం దలి రెండు[illegible]యల కాలమునందు) నిదురలోనుండి మేలుకొన వలయును. అటుల మేలు కొనువానికి రోగంబును అలక్ష్మియు గలుగకుండును; వాతాదిధాతువులకు సమత్వము గలు గునిమిత్తము రోగి బ్రాహ్మముహూర్తమునందుకూడ నిద్రించవలయునని "స్వస్థః" అను శబ్దమువలన నూహ్యంబగుచున్నది.

దంతధావనవిధి

శరీరచింతాం నిర్వర్త్య కృతశౌచవిధి స్తతః. ౧
అర్కన్యగ్రోధఖదిరకరంజకకుభాదికం,
ప్రాతర్భుక్త్వా చ మృద్వగ్రం కషాయకటుతిక్తకమ్. ౨
భక్షయేద్దంత *ధవనం దంత మాంసాన్యబాధయ౯,

శరీరముయొక్క చింతను —

(అనగా "బ్రాహ్మే ముహూర్త ఉత్తిష్ఠేజ్జీర్ణాజీర్ణం నిరూపయ౯," అనెడి సంగ్రహవచనము వొప్పున పూర్వరాత్రియందు భుజించిన యన్నాదుల యొక్క జీర్ణాజీర్ణమును) బాగుగ దెలిసికొని మూత్రపురీషములను విసర్జించి ప్రక్షాళనము జేసికొని,

"అజగ్ధమనుపక్లిష్టం షడష్టద్వాదశాంగుళమ్,
ప్రదేశినీముఖసమం మృదుస్యాద్దంతధావనమ్."

అనెడి సుశ్రుతవచనప్రకారము మృదువైనకొనలుగలవిగ, వగరు, కారము, చేదుగల రసములతో గూడినవిగ నుండుజిల్లేడు, మఱ్ఱి, చండ్ర, క్రానుగు, మద్ది, జాజి, ఎఱ్ఱగన్నేరు యీ మొదలగువాని దంతకాష్ఠములను బాగుగ నమలి దంతమాంసములకు బాధకలుగ నీయక దంతధావనము జేసికొనవలయును. "అర్కన్యగ్రోధఖదిర" అనిచెప్పి నందుచేతనే దంతకాష్టములు కషాయాది రసయుక్తంబులుగ నుండునని యేర్పడు చుండినను,

"ఫలిన్యగ్రసమస్థౌల్యం ప్రగుణం ద్వాదశాంగుళమ్
విజ్ఞాతవృక్షక్షుణ్ణాగ్ర మృజ్వగ్రందిమభూమిజమ్."

దంతకాష్ఠములు ప్రేంకణపుకొనలతో సమానమైన స్థౌల్యముగలవిగ, ఉత్కృష్ట మైన గుణముగలవిగ, పండ్రెండంగుళముల నిడుపుగలవిగ, శాస్త్రమునందు చెప్పబడిన వృక్షములలోనుండి విరవబడినవిగ, వంకరలేక గ్రంథులులేనివిగ, ప్రశస్తమైన భూమియం

*పవనం ఇతి పాఠాంతరం.

నేత్రములు తేజోబాహుళ్యము గలవియగుటచే వానికి విశేషముగ కఫముచే నుపద్రవము కలుగును; కాబట్టినేత్రములయందు నీరుకారుటకై యేడు దినములకొక పర్యాయము దార్వీక్వాథసముద్భవమగు పేరుగల రసాంజనమును నేత్రములయందు అంజనము వేసికొనవలయును.

"భుక్తవంతం శిరస్స్నాతం శ్రాంతం ఛర్దనవాహనైః,
రాత్రౌ జాగరితం చాపి నాంజయేజ్జ్వరితం తథా."

భుజించినవాడు, శిరస్స్నానముచేసినవాడు, శ్రమనుచెందినవాడు, వమన విరేచనములు చేయించికొనినవాడు, రాత్రులయందు జాగరణముచేసినవాడు, జ్వరితుడు వీరలు అంజనము వేసికొనంజన దని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

## నస్యాది సేవనవిధి

తతోనావనగండూష ధూమతాంబూలభాగ్భవేత్,

అంజనసేవనానంతరము నస్యము, గండూషము, ధూమపానము, తాంబూలచర్వణము ఇవి మొదలగువాని చేయవలయును. నస్యాదిగుణవిధానములు ఉత్తరత్ర చెప్పబడుటచే నిచట చెప్పక విరమించబడినది.

"ఘనోన్నతిప్రసన్నత్వక్ స్కంధగ్రీవాస్యవక్షసః, సుగంధివదనస్నిగ్ధ నిస్స్వనా విమలేంద్రియాః. నిర్వలీపలితవ్యంగా భవేయుర్నస్యశీలినః. ఓష్ఠస్ఫుటన పారుష్య ముఖశోషద్విజామయాః. నస్యుస్స్వరోపఘాతాశ్చ స్నేహ గండూషధారణాత్, ధమన్యో హన్వ్యూర్ధ్వజత్రూత్థా నస్యుర్వాత కఫామయాః. అంజనోత్క్లేశితం నస్యైః కబలైర్లాపణేరితమ్, ధూమేన కబళోత్క్లిష్టం త్రయాద్వాతకఫం జయేత్. గంధమాల్యాదికం పుష్పమలక్ష్మీఘ్నం ప్రసాదనమ్, రుచివైశద్యసౌగంధ్య మిచ్ఛన్వక్త్రేణ ధారయేత్. జాతీలవంగకర్పూర కక్కోలకటుకైస్సహ, తాంబూలానాం కిసలయం హృద్యపూగఫలాన్వితమ్. పథ్యాం సుప్తోత్థితే భుక్తే స్నాతే వాంతే చ మానవః, త్రిసూత్రమేకపూగం చ సచూర్ణఖదిరం చ తత్."

నస్యకర్మ చేయించుకొనువారు దార్ఢ్యము, ఉన్నతము, ప్రసన్నత్వము గలత్వక్కు, భుజశిరస్సులు, కంఠము, ముఖము, వక్షస్సుకలవారుగను సుగంధమైన ముఖముకలవారుగను, గంభీరమైన స్వరముకలవారుగను, నిర్మలమైన యింద్రియములు కలవారుగను, వలీపలితములు, వ్యంగములేనివారుగను నగుదురు. స్నేహగండూషధారణమువలన పెదవులయందు పగుళ్ళు, ముఖశోషము, దంతరోగములు, స్వరభంగము, మెడకొంకుల పైభాగమున జనించువాత కఫరోగములు సంభవించకుండును. గంధము పుష్పములు మొదలగు

శిరము, కర్ణములు, అరికాళ్లు, వీనియందు విశేషముగ అభ్యంజనము జేసికొన వలయును.

"సుకేశ్యశ్శిలిత్వో మూర్ధ్ని కపాలేంద్రియతర్పణః, హనుమన్యాశిరః కర్ణశూలఘ్నం కర్ణపూరణమ్. పాదాభ్యంగోఽపి తత్ స్థైర్యనిద్రాదృష్టిప్రసాదకృత్, పాదసుప్తి శ్రమ స్తంభసంకోచస్ఫుటనప్రణుత్."

శిరోభ్యంగము కేశవృద్ధిని, కపాలము, ఇంద్రియములు వీనికి తృప్తిని కలుగజేయును. తైలముచే కర్ణపూరణముజేసికొనిన, అంకిళ్లు పెడదలపెద్దనరము, శిరము, కర్ణములు వీనియందు గలుగుశూలలను హరింపజేయును. పాదాభ్యంగము పాదమునకు దృఢత్వము, నిద్ర, దృష్టికి స్థైర్యము వీనిని గలుగజేయును. పాదమునందు సుప్తి, శ్రమ, స్తంభము, సంకోచము, పగుళ్ళు, వీనిని పోగొట్టును అని అష్టాంగసంగ్రహమునందు శిరఃశ్రవణ పాదాభ్యంగగుణము చెప్పబడియున్నది.

## అభ్యంగనిషేధము

వర్జ్యోఽభ్యంగః కఫగ్రస్త కృతసంశుద్ధ్యజీర్ణిభిః,

కఫరోగి, విరేచనాదులచే శుద్ధిని జేసికొనినవాడు, అజీర్ణముగలవాడు వీరు అభ్యంజనమును వర్జింపవలయును

## వ్యాయామగుణము

లాఘవం కర్మసామర్థ్యం దీప్తోగ్నిః మేదసః క్షయః　　౯
విభక్తఘనగాత్రత్వం వ్యాయామాదుపజాయతే,

లఘుత్వము, క్రియలయందు సామర్థ్యము, అగ్నిదీపనము, మేదస్సుయొక్క క్షయము, శరీరమునందు దార్ఢ్యము అను నీ యైదుగుణములు వ్యాయామమువలన గలుగును.

"శరీరాయాసజననం కర్మ వ్యాయామ ఉచ్యతే"

శరీరమునకు శ్రమ గలుగ జేయునట్టి కార్యము వ్యాయామమనబడునని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

## వ్యాయామనిషేధము.

వాతపిత్తామయీ బాలో వృద్ధోజీర్ణీ చ తం త్యజేత్.　　౧౦

వాతపిత్తరోగములగలవారు, పదునారు సంవత్సరములవయస్సునకు లోబడినబాలురు డెబ్బదిసంవత్సరములవయస్సునకు పైబడినవృద్ధులు, అజీర్ణరోగముగలవారు వీరు వ్యాయామమును వర్జింపవలయును.

## వ్యాయామసేవనాక్రమము

అర్ధశక్త్యా నిషేవ్యస్తు బలిభిస్స్నిగ్ధభోజిభిః,

ఉద్వర్తనము (అనగా నలుగుపెట్టికొనుట) కఫము, మేదస్సు, వీనిని హరింపజేయును. అవయవములయందు పటుత్వము, చర్మమునందధికకాంతిని గలుగజేయును.

స్నానగుణము

దీపనం వృష్యమాయుష్యం స్నానమూర్జాబలప్రదమ్  ౧౫
కండూమలశ్రమస్వేదతంద్రాతృడ్దాహపాప్మజిత్,

స్నానమువలన అగ్నిదీపనము, శుక్రవృద్ధి, ఆయుర్వృద్ధి, ఉత్సాహము, బలము గలుగును. దురద, శరీరమునందలిమురికి, శ్రమము, స్వేదము, తంద్ర, దప్పి, తాపము, పాపము వీనిని హరించును. స్నానముజాఠరాగ్నిలోనుండి రోమకూపముల మూలముగా వెలుపడుచుండు జ్వాలను అడ్డగించి, దానిని మరలలోననేజేర్చి అగ్నిదీపనమును గలుగజేయును. స్నానమువలన త్వక్కునాశ్రయించియుండు భ్రాజకమనుపిత్తములోన ప్రవేశించి ఉష్ణమును వృద్ధిజేయును. అట్లగుటచే స్నానము దీపనకారియని బాలాదిత్యుఁడు వచించెను.

"యత్కించిన్మధురం స్నిగ్ధం బృంహణం బలవర్ధనం,
మనసో హర్షణం యచ్చ తత్సర్వం వృష్యముచ్యతే."

అను వచనప్రకారము మధుర రసంబును స్నిగ్ధంబును, శరీరమునకు పుష్టినికల్గించునదియు, బలమును వృద్ధిజేయునదియు మనస్సుకు ఉల్లాసమును గల్గించునవి యన్నియు వృష్యములనబడును.

ఉష్ణోదకస్నానగుణము

ఉష్ణాంబునాధఃకాయస్య పరిషేకో బలావహః.  ౧౬
తేనైవ చోత్తమాంగస్య బలహృత్కేశచక్షుషాం,

ఉష్ణోదకముచే కంఠస్నానముజేసిన శరీరమునకు బలముగలుగును. శిరస్నానము జేసిన వెంట్రుకలకును కన్నులకునుగల బలమును హరించును. నేత్రములకు దౌర్బల్యము గలుగును.

స్నానమున కనర్హులు

స్నానమర్దితనేత్రాస్య కర్ణరోగాతిసారిషు.  ౧౭
ఆధ్మానపీనసాజీర్ణ భుక్తవత్సు చ గర్హితం,

అర్దితవాతము, నేత్రములు, ముఖము, కర్ణములు వీనియందుగల్గురోగములు అతిసారము, ఆధ్మానము, పీనసము, అజీర్ణము అను సిరోగములుగలవారును, భోజనము జేసినవారును స్నానము జేయంజనదు.

భోజనాది విధి

జీర్ణే హితం మితం చాద్యా న్న వేగానీరయేద్బలాత్ । ౧౮
న వేగితోఽన్యకార్యస్స్యాన్నాజిత్వాసాధ్యమామయం,

తొలుత భుజించిన యాహారము జీర్ణమైన పిదప హితముగనుండు నన్నమును మితముగ భుజించవలయును. మలమూత్రములను బలాత్కారముగ విసర్జనము చేయం జనదు. మలమూత్రములు వచ్చునపుడు వానిని విసర్జింపక నిరోధించి వేరు కార్యమును చేయంజనదు, అటులనే సుఖసాధ్యమైనరోగమును చికిత్సింపక యుపేక్షించి వేరుకార్యమును చేయంజనదు.

ధర్మప్రాధాన్యము

సుఖార్థాస్సర్వభూతానాం మతాస్సర్వాః ప్రవృత్తయః. ౧౯
సుఖం చ న వినాధర్మా త్తస్మాద్ధర్మపరో భవేత్,

సర్వభూతములయొక్క సమస్తమైన కృత్యములకు సుఖమే ప్రధానమైన ప్రయోజనమని చెప్పబడియున్నది. అట్టి సుఖమునకు ధర్మమునకంటె వేరుసాధనము లేదు. కాబట్టి ధర్మమునే ప్రధానముగ మనుజుడు గ్రహించవలయును.

మిత్రసంపాదనాది విధి

భక్త్యా కల్యాణమిత్రాణి సేవేతేతరదూరగః ౨౦

ఎల్లపుడును మంచినడతగల స్నేహితులను కపటరహితుడై సంపాదించుకొనవలయును దుష్టులగు స్నేహితులను దూరముగ వర్జించవలయును. చెడుస్నేహితులయొక్క సంసర్గముకూడ ఇహపరలోకములయందు చెరుపునుగలుగ జేయునని తెలియపఱచుటకై "దూరగః" అనుపదము ప్రయోగింపబడినది.

హింసాది వర్జనము

హింసాస్తేయాన్యథాకామం పైశున్యం పరుషానృతే,
సంభిన్నాలాపవ్యాపాద మభిధ్యాదృగ్విపర్యయమ్. ౨౧
పాపం కర్మేతి దశధా కాయ వాఙ్మనసైస్త్యజేత్,

జీవహింస, స్తేయము (అనగా చౌర్యము), అన్యథాకామము, (అనగా గురుదారగమనాది నిషిద్ధకామసేవ), పైశున్యము, క్రూరవచనము, అసత్యవచనము, సందర్భములేనివచనము, జీవద్రోహచింత, ఇతరులయొక్క మేలును మంచిగుణములు మొదలగువానిని సహించకుండుట. శాస్త్రములయందు విరుద్ధజ్ఞానము (అనగా నాస్తికత్వాదులు,) అను నీ పదియును పాపకృత్యంబులు. వానిలో జీవహింసమొదలగునవి

మూడును కాయికపాపకృత్యములు. పరస్పరద్వేషమును గలుగజేయునట్టి కలహము మొదలగునవి నాల్గును వాచికపాపకృత్యములు, జీవద్రోహ చింతమొదలగునవి మూడును మానసిక పాపకృత్యములు. ఈపదివిధములైన పాపకృత్యములను కాయము, వాక్కు, మనస్సు వీనిచే వర్జించవలయును.

ఉపకారవిధి

అవృత్తివ్యాధిశోకార్తా ననువర్తేత శక్తితః. ౨౨

జీవనోపాయములేనివారిని, వ్యాధి దుఃఖము వీనిచే పీడింపబడినవారిని, శక్త్యనుసారముగ నుపచరించవలయును.

సమదర్శన విధి

ఆత్మవత్సతతం పశ్యేదపి కీటపిపీలికం,

పురుగులు, చీమలు మొదలగు అల్పజంతువులనుకూడ తనవలెనే యెల్లపుడు భావించవలయును.

దేవాద్యర్చన విధి

అర్చయేద్దేవగోవిప్రవృద్ధవైద్యనృపాతిథీన్. ౨3

దేవతలు, గోవులు, బ్రాహ్మణులు, జ్ఞానము, శీలము, తపస్సు, వయస్సు, వీనిచే వృద్ధులు, వైద్యులు, రాజులు, అతిథులు మొదలగువారిని శక్త్యనుసారముగా పూజించవలయును.

యాచక పరాభవనిషేధము

విముఖాన్నార్థినః కుర్యా న్నావమన్యేత నాక్షిపేత్,

యాచకుల నసంతుష్టులుగ జేయంజనదు. (అనగా శక్త్యనుసారముగా వారికి సహాయము చేయవలయునని భావము.) అవమానింపంజనదు. క్రూరమైన వచనములను జెప్పంజనదు. (అనగా దూషించకూడదని తాత్పర్యము.)

ఉపకార ప్రాధాన్యము

ఉపకారప్రధానస్స్యా దపకారపరేప్యరౌ. ౨౪

అపకారమునుచేయునట్టి శత్రువులనుకూడ ఉపకారమునే ముఖ్యముగా చేయవలయును.

సమచిత్తత్వము

సంపద్విపత్స్వేకమనాః హేతావీర్ష్యేత్ఫలేనతు,

సంపత్తు, ఆపద వీనియందు సమమైన చిత్తముగలవాడై యుండవలయును. (అనగా సంపత్తు గలిగినపుడు అధికసంతోషమును, దుఃఖముగలిగినపుడు అతిదుఃఖమును జెంద

కూడదని భావము.) అయితే సంపత్తుకుకారణమైన యితరులయొక్క గుణములను గురించిమాత్రము అసూయపడందగునేకాని సంపత్తునుజూచిమాత్రము అసూయపడం జనదు.

### సంభాషణ విధి

కాలే హితం మితం బ్రూయా దవిసంవాది పేశలమ్. ౨౫

యుక్తమైన కాలమునందు హితముగను, మితముగను, సత్యముగను, మనోహరముగనుండు వార్తను జెప్పవలయును.

### వర్తన ప్రకారము

పూర్వాభిభాషీ సుముఖ స్సుశీలః కరుణామృదుః,
నైకస్సుఖీ న సర్వత్ర విస్రబ్ధో న చ శంకితః. ౨౬

మనుజుఁడు తొలుత నే మాటలాడుస్వభావంబును ప్రసన్నమైన ముఖంబును, మంచిప్రకృతియు, దయాళుత్వంబునుగలవాఁడై యుండవలయును. తానొకఁడే సుఖము ననుభవింపంజనదు. అందరిని నమ్మంజనదు.

"మాయాచారే మాయయా వర్తితవ్యం"

కపటముగలవారియందు తానును కపటముతో ప్రవర్తింపవలయునని వ్యాసుడుకూడ జెప్పియున్నాడు. అందరియందును సందేహింపంజనదు.

### నటించవలసిన విధి

న కంచిదాత్మనశ్శత్రుం నాత్మానం కస్య చిద్రిపుం,
ప్రకాశయేన్నావమానం న చ నిస్స్నేహతాం ప్రభోః. ౨౭

ఒకడు తనకుశత్రువని, తానొకనికిశత్రువని వెల్లడింపంజనదు. అట్లనే తనకు సంభవించిన యవమానమును, ప్రభువునకు తనపైగల ద్వేషమును వెల్లడింపంజనదు. వెల్లడించినచో కలహకారులు తనకునురాజునకునుగల ద్వేషమును తెలిసికొని విశేషముగా వృద్ధిజేయుదురు.

### లోకానుసరణక్రమము

జనస్యాశయమాలక్ష్య యో యథా పరితుష్యతి,
తం తథైవానువర్తేత పరారాధనపండితః. ౨౮

తానితరులను సంతోషింపజేయుటయందు సమర్థుడై యుండవలయును. జనులయొక్క ప్రకృతినెఱింగి వారివారిసంతోషానుసారముగా దానప్రియవచనాదులచే ననుసరించవలయును.

### ఇంద్రియ పీడనాది నిషేధము

**న పీడయేదింద్రియాణి న చైతాన్యతిలాలయేత్,**

నేత్రాదీంద్రియములను అహితములైన పదార్థదర్శనాదులచే పీడింపంజనదు. అటులనే ఇంద్రియములను తృప్తికరమైన వస్తువులచే విశేషముగా లాలనముచేయంజనదు.

### నిష్ప్రయోజన కార్యారంభ నిషేధము

**త్రివర్గశూన్యం నారంభం భజేత్తంచావిరోధయన్.** ౨౯

ధర్మార్థకామరహితమైన వ్యాపారముల నారంభింపజనదు. అటులనే ధర్మార్థకామాదులకు పరస్పరము విరోధములేకుండు కార్యముల నాచరింపవలయును.

### ధర్మాచరణ క్రమము

**అనుయాయాత్ప్రతిపదం సర్వధర్మేషు మధ్యమాం,**

సమస్తమైన యాచారములయందు మధ్యమమైన జ్ఞానమునుంచవలయును. (అనగా ఒకదానియందధికాసక్తి, మఱియొకదానియందు స్వల్పాసక్తి నుంచకూడదని భావము.)

### దీర్ఘరోమ ధారణాది నిషేధము

**నీచరోమనఖశ్మశ్రుః నిర్మలాంఘ్రిమలాయనః.** 30

మనుజుఁడు రోమములు (అనగా తలవెండ్రుకలు, శిరమునందలి వెండ్రుకలు,) నఖములు, గడ్డము, మీసములవెండ్రుకలు, వీనినధికముగ బెంచక పరిశుద్ధమైన కాళ్ళు, మలాయనములు (అనగా నాసికములు, కర్ణములు) గలవాడై యుండవలయును.

"పౌష్టికం ధన్యమాయుష్యం శుచి రూపవిరాజనమ్, కేశశ్మశ్రునఖాదీనాం కర్తనం సంప్రసాధనమ్."

కేశములు, నఖములు, గడ్డము, మీసములవెండ్రుకలు ఇవి మొదలగువానిని ఖండించుట, అలంకరించుట వీనివలన శరీరపుష్టి, పుణ్యము, ఆయువు, పరిశుద్ధత, సౌందర్యము గలుగును.

"మేధ్యం పవిత్రమాయుష్యమలక్ష్మీకలినాశనమ్, పాదయోర్మలమార్గాణాం శౌచాధానమభీక్ష్ణశః"

కాళ్ళు, మలమార్గములగు నాసికాకర్ణాదులు, వీనిని పలుమారు శుద్ధిచేయుటవలన బుద్ధి పరిశుద్ధత, ఆయువుగలుగుటయేగాక దారిద్ర్యంబును, పాపంబును హరించునని చరక గ్రంథమునందు ఫలము చెప్పబడియున్నది.

### రత్నాదిధారణ విధి

**స్నానశీలస్సురభిస్సువేషోఽనుల్బణోజ్జ్వలః,**

ధారయేత్సతతం రత్నసిద్ధమంత్రమహౌషధీః. 30

మనుజుడు స్నానముచేయునట్టి స్వభావముగలవాడును, సుగంధములను మేన నలది కొనువాడును, మంచివస్త్రాదులచే నలంకృతుడును, వినయవంతుడును, మంచి ప్రకాశముతో గూడినవాడునునై యుండవలయును. మఱియును పద్మరాగాదిరత్నములు, అపరాజితాదిమంత్రములు, సహదేవిమొదలగు మహౌషధములు వీనినెల్లప్పుడు ధరించుచుండవలయును.

సంచారక్రమము

సాతపత్రపదత్రాణో విచరేద్యుగమాత్రదృక్,

గొడుగును, పాదరక్షలను ధరించుకొని తనకుసెదుటనాలుగు హస్తముల ప్రమాణముగల మార్గమును జూచుకొనుచు సంచరింపవలయును. ఇటులజేయుమనుజునికి నెదురుగ వచ్చుగోవు, అశ్వము మొదలగు జంతువులచే నుపద్రవము గలుగకుండును.

"మారుతస్యానులోమ్యాయ ఖుడస్తంభశ్రమాపహమ్, అన్వర్థసంజ్ఞం పాదత్రం బలదృక్షుక్రరక్షణమ్, వర్ణ్యం నేత్రహితం ఛత్రం వాతవర్షాతపాపహమ్."

పాదరక్షలను ధరించుటవలన వాతమునకు అనులోమగతి గలుగును. ఖుడస్తంభము, శ్రమమును హరించును. బలము, నేత్రములు, శుక్రము వీనికి రక్షణము గలుగును. గొడుగును ధరించుటవలన శరీరకాంతి, నేత్రములకు హితముగలుగును. వాతము, వర్షము, ఎండ వీనిచేగలుగు నుపద్రవము నివర్తించును. అని గ్రంథాంతరమునందు జెప్పబడియున్నది.

రాత్రిసంచారక్రమము

నిశిచాత్యయికే కార్యే దండీ మౌళీ సహాయవాన్. 31

రాత్రియందు అత్యావశ్యకమైన కార్యముండునపుడు హస్తమునందు కఱ్ఱను ధరించి శిరోవేష్టనము జేసికొని మంచిసహాయముతో గూడికొనినవాడై సంచరించవలయును.

"స్ఖలతస్సంప్రతిష్ఠానం శత్రూణాంచ నిషేధనమ్, అవష్టంభనమాయుష్యం భయఘ్నం దండధారణమ్."

దండధారణము కాలుతొట్రుపడి పడునపుడు ఆధారణముగనుండును. శత్రువులను నిరాకరించును. ఆయుష్కరమైనది. భయమునువారించును. అని దండధారణగుణము జెప్పబడియున్నది. దండధారణమువలన సర్పాద్యుచ్చాటనమును, శిరోవేష్టనమువలన నాకసమునందు సంచరించుచుండు పక్షిమొదలగు వానియొక్క మూత్రపురీషాదులు శిరముపై బడకుండునటుల రక్షణమును, సహాయమువలన మనోధైర్యమును గలుగును.

### చైత్యాద్యతిక్రమనిషేధము

చైత్యపూజ్యధ్వజాశస్తఛాయాభస్మతుషాశుచీ౯,
నాక్రామేచ్ఛర్కరాలోష్ఠబలిస్నానభువో౽పిచ　　33

చైత్యస్థానముయొక్క నీడను (అనగా యజ్ఞశాల, లేక దేవతావాస వృక్షవిశేషము, లేక బౌద్ధాలయము వీనియొక్క నీడను) ఆచార్యులు మొదలగుపూజ్యులయొక్క నీడను, ధ్వజస్తంభముయొక్క నీడను, చండాలురు మొదలగు వారినీడను, బూడిద, ఊక, మలమూత్రములు, కంకరరాయి, మట్టిగడ్డలు, దేవతాబలిస్థానములు స్నానము చేయు ప్రదేశము మొదలగువానిని దాటంజనదు.

### నదీతరణాది నిషేధము

నదీం తరేన్న బాహుభ్యాం నాగ్నిస్కంధమభివ్రజేత్,
సంధిగ్ధనావం వృక్షం చ నారోహేద్దుష్టయానవత్　　3౪

ఈదుటవలన నదులను దాటంజనదు. అగ్నిసమూహమున కెదురుగ నేతెంచంజనదు. సందిగ్ధముగ (అనగా కట్లువదలి శిథిలమై మిగుల భారమునెక్కించ బడినదిగ) నుండునోడలయం దెక్కంజనదు. వృక్షము, దుష్టమైనగుఱ్ఱము మొదలగు వానిపై నెక్కంజనదు.

### క్షుత్యాదికరణ ప్రకారము

నాసంవృతముఖః కుర్యాత్ క్షుతిహాస్యవిజృంభణం,
హస్తాదులచేనోరును మూసికొనకనే దగ్గంజనదు. నవ్వంజనను. ఆవలింతను విడువంజనదు.

### నాసికాకర్షణాది నిషేధము

నాసికాన్న వికృష్ణీయాన్నాకస్మాద్విలిఖేద్భువమ్.　　3౫
నాంగైశ్చేష్టేత విగుణం నాశీతోత్కటకశ్చిరం,

కారణములేకయే నాసికము నాకర్షణము చేయంజనదు. భూమిపైగీరంజనదు. హస్తపాదాద్యంగమువలన విరుద్ధమైన కార్యములను జేయంజనదు. దీర్ఘకాలమువరకు గొంతుకూర్చుండంజనదు. కూర్చుండినచో అర్శోరోగాదులు జనించును.

### శరీరవాఙ్మనోవ్యాపారాది క్రమము

దేహవాక్చేతసాం చేష్టాః ప్రాక్ఛ్రమాద్వినివర్తయేత్.　　౩౬
నోర్ధ్వజానుశ్చిరం తిష్ఠేన్నక్తం సేవేత న ద్రుమం,

దేహము, వాక్కు, మనస్సు, వీనియొక్క క్రియలను శ్రమగలుగుటకు మున్నె

నిలుపవలయును. మోకాలునుపైకెత్తికొని చిరకాలమువరకు నిలువంజనదు. రాత్రి యందు వృక్షముయొక్క నీడలో పోవంజనదు.

చత్వరాదిసేవన నిషేధము

తథా చత్వరచైత్యాంతచతుష్పథసురాలయాన్. 3౭
సూనాటవీశూన్యగృహశ్మశానాని దివాపి న,

చత్వరము (అనగా నానావిధజనులుచేరి వృథామాటలాడుస్థలము, లేక మూడు త్రోవలు కలియునట్టిస్థలము), చైత్యప్రదేశము, నలుత్రోవలు కలియుస్థలము, దేవాలయము వీనిలో రాత్రులయందు పోవంజనదు. వధ్యస్థానము (అనగా ప్రాణమును తీయునట్టిస్థానము), అడవి, పాడుపడినయిల్లు, శ్మశానము వీనిలో పగటియందుకూడ పోవంజనదు.

ప్రాతఃకాల సూర్యదర్శనాది నిషేధము

సర్వథేక్షేత నాదిత్యం న భారం శిరసా వహేత్. 3౮
నేక్షేత ప్రతతం సూక్ష్మదీప్తామేధ్యాప్రియాణి చ,

ఒకప్పుడును సూర్యునిజూచుచుండజనదు. అటులనే ఉదయించుచుండుసూర్యుని, అస్తమించుచుండుసూర్యుని, ఉదకము, అద్దము మొదలగువానియందు ప్రతిఫలించుచుండు సూర్యుని, రాహువుచే గ్రస్తమైన సూర్యుని చూడంజనదు; శిరమునందు అధిక భారమును మోయంజనదు. సూక్ష్మమైనవస్తువు, జ్వలింపుచుండువస్తువు, మలమూత్రములు ఇష్టములేనివస్తువు వీనినెపుడును జూడంజనదు.

మద్యవిక్రయాది నిషేధము

మద్యవిక్రయసంధాన * దానాదానాని నాచరేత్. 3౯

మద్యమును విక్రయించుట, మద్యమును జేయుట, మద్యమును దానముచేయుట మద్యదానమును గ్రహించుట, ఇవిమొదలగువానిని చేయంజనదు. ఇది బ్రాహ్మణవిషయము, అటుగాక యీనిషేధము నెల్లరికీ చెప్పుపక్షములో లోకమునందు మద్యవిక్రయాదివ్యవహారమే లేకపోవును.

పురోవాతాది వర్జనీయము

పురోవాతాతపరజస్తుషారపరుషానిలాన్,
అనృజుః క్షువథూద్గారకాసస్వప్నాన్నమైథునమ్. ౪౦
కూలచ్ఛాయానృపద్విష్టవ్యాళదంష్ట్రివిషాణినః,

* దానపానాని ఇతి పాఠాంతరము.

హీనానార్యాతినిపుణసేవాం విగ్రహముత్తమైః ౪౧
సంధ్యాస్వభ్యవహారస్త్రీస్వప్నాధ్యయనచింతనం,
శత్రుసత్రగణాకీర్ణగణికాపణికాశనమ్. ౪౨
గాత్రవక్త్రనఖైర్వాద్యం హస్తకేశావధూననమ్,
తోయాగ్నిపూజ్యమధ్యేన యానం ధూమం శవాశ్రయమ్ ౪౩
మద్యాతిసక్తిం విస్రంభస్వాతంత్ర్యే స్త్రీషు చ త్యజేత్,

ఎదురుగాలి, ఎదురెండ, దుమ్ము, మంచు, దుష్టమైనగాలి వీనిని వర్జించవలయును; తుమ్ములు, గారియుమియుట, దగ్గు, నిద్ర, భోజనము, మైథునము వీనిని వక్రమైన శరీరముగలవాడై చేయంజనదు. నదీతీరమునందలి వృక్షములయొక్క నీడ, రాజద్వేషి, సింహము మొదలగు దుష్టజంతువులు, పాము మొదలగు విషజంతువులు, పశువు మొదలగు కొమ్ములుగలజంతువులు, కులశీలనాదులచేహీనులు, దుష్టచేష్టలుచేయువాడు, మిక్కుటముగ లెక్కలనుజూచువాడు (అనగా లుబ్ధుడు) మొదలగు వారిసేవనను, సన్మార్గులతో విరోధము, సంధ్యాకాలమునందుభోజనము, స్త్రీ సంభోగము, నిద్ర, అధ్యయనము, ఒకవిషయమునుగురించి యాలోచించుట మొదలగుకార్యములను, శత్రువు, సత్రము, సమూహము, దాసి, పంచెగాడు వీరియొక్క అన్నమును, శరీరము, నోరు, నఖములు మొదలగువానిచే వాద్యముచేయుట, చేతులను తలవెండ్రుకలను విదిలించుట, ఉదకము, అగ్ని, పూజ్యులు, వీని నడుమ సంచరించుట, ప్రేతధూమము, మద్యపానమునందత్యాసక్తి, స్త్రీలయందు నమ్మకముంచుట, స్త్రీలకుస్వాతంత్ర్యమునిచ్చుట మొదలగువానిని త్యజించవలయును యాగములో జేరియుండు ఋత్విక్కు మొదలగువారికంటె నితరమైనవారు యాగాన్నమును భుజించకూడ దని శాస్త్రముచే నిషేధింపబడియుండుటవలన సత్రాన్నమనుదానికి యాగాన్నమని కొందరు అర్థముచేయుచున్నారు.

లోకానుసరణము

ఆచార్యస్సర్వచేష్టాసు లోక ఏవ హి ధీమతః ౪౪
అనుకుర్యాత్తమేవాతో లౌకికేఽర్థే పరీక్షకః,

బుద్ధిమంతునికి ఈలోకమే సర్వకార్యములయం దాచార్యస్థానముగ నున్నది. (అనగా సర్వకార్యములను బాగుగ దెలియజేయుచున్న దని భావము) కాబట్టి పరీక్షించువాడు లౌకికవిషయములయం దీలోకాచారమునే అనుసరింపవలయును.

సద్వృత్తస్వరూపము

ఆర్ద్రసంతానతా త్యాగః కాయవాక్చేతసాం దమః, ✓ ౪౫

స్వార్థబుద్ధిః పరార్థేషు పర్యాప్తమితి సద్వ్రతం,

సర్వభూతములయందు దయాళుత్వము, దానముచేయుట, శరీరవాఙ్మనస్సులను నిగ్రహించుట, ఇతర ప్రయోజనములయందు స్వార్థబుద్ధి, ఇదియే శ్రేష్ఠమైన వ్రతము.

దుఃఖాభావోపాయము

నక్తం దినాని మే యాంతి కథం భూతస్య సంప్రతి. ౪౬
దుఃఖభాఙ్న భవత్యేవం నిత్యం సన్నిహితస్మృతిః,

నే నెటుల నుండగా అహోరాత్రము లిపుడు గతించుచున్నవని (అనగా నేను అహోరాత్రములయం దేమి చేసినానని) ప్రతిదినము బాగుగా విమర్శచేయుచుండువాడు ఒకానొకప్పుడును దుఃఖమును జెందకుండును.

ఆచార ఫలము

ఇత్యాచారస్సమాసేన సంప్రాప్నోతి సమాచరన్. ౪౭
ఆయురారోగ్యమైశ్వర్యం యశో లోకాంశ్చ శాశ్వతాన్. ౪౮

ఈప్రకారము సదాచారము సంక్షేపముగా జెప్పబడినది. కాబట్టి దానిని క్రమముగ ననుష్ఠించువానికి ఆయుువు, ఆరోగ్యము, ఐశ్వర్యము, యశస్సు శాశ్వతమైన స్వర్గాదిలోకములు సులభముగ గలుగును.

ద్వితీయాధ్యాయము ముగిసెను.

# తృతీయాధ్యాయము

అవ. పూర్వాధ్యాయమునం దాయాఋతువులతో నాచరింపతగిన నియమములు సామాన్యముగా జెప్పబడియుండినను ఆయాఋతుభేదమువలన నాహారవిహారసేవనములు భిన్నభిన్నంబులుగ నగునని ప్రతిపాదించుటకై దినచర్యాధ్యాయానంతరము ఋతుచర్యాధ్యాయము జెప్పబడుచున్నది —

ఋతుచర్యాధ్యాయ ప్రారంభము

సూ. అథాత ఋతుచర్యాధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

దినచర్యాధ్యాయానంతరము ఋతుచర్యాధ్యాయమును వివరించెదము.

షడృతువులు

మాసైర్ద్విసంఖ్యైర్మాఘాద్యైః క్రమాత్షడృతవః స్మృతాః,
శిశిరోథ వసంతశ్చ గ్రీష్మవర్షాశరద్ధిమాః. ౧
శిశిరాద్యాస్త్రిభిస్తైస్తువిద్యాదయనముత్తరం,
ఆదానం చ తదాదత్తే నృణాం ప్రతిదినం బలమ్. ౨

మాఘాదిమాసములలో క్రమముగ రెండేసి మాసములచొప్పున యథాక్రమముగ శిశిర, వసంత, గ్రీష్మ, వర్షా, శరత్, హేమంతంబు లన, నారుఋతువులు వెలయును. శిశిర, వసంత గ్రీష్మ ఋతువులు మూడును చేరిన ఉత్తరాయణ మనబడును. ఉత్తరాయణ మనగా — సూర్యుడు ఉత్తరమార్గమునందు సంచరించుట యని యర్థము. ఆ ఉత్తరాయణమునందు సూర్యుడు మనుజులయొక్క బలమును ప్రతిదినమును గ్రహించుచుండును; కావున నాయుత్తరాయణమునకు ఆదాన మనియు నామాంతరము కలదు. మాఘాదిమాసములలో నాలుగేసి మాసములు ఒక ఋతు వనియు, శీతోష్ణవృష్టిలక్షణములు గల హేమంత, గ్రీష్మ, వర్షములను మూడు ఋతులే కల వనియు, కొందరు వచించుచున్నారు. కాబట్టి వారిమతమును తిరస్కరించి ఋతువులు ఆరు. అని స్థిరపరచుటకై "షట్" అనుపదము ఈతంత్రకారునిచే ప్రయోగింపబడినది.

ఆదాననామ కారణము

తస్మిన్ హ్యత్యర్థతీక్ష్ణోష్ణ రూక్షా మార్గస్వభావతః,
ఆదిత్యపవనాస్సౌమ్యాన్ క్షపయంతి గుణాన్ భువః

తిక్తః కషాయః కటుకో బలినోత్ర రసాః క్రమాత్,
తస్మాదాదానమాగ్నేయం

ఉత్తరాయణమునందు సూర్యునియొక్క మార్గస్వభావమువలన నధికమైన తీక్ష్ణము, ఉష్ణము, రూక్షమును గల సూర్య వాయువులు భూమియొక్క సౌమ్యగుణములను (అనగా శీతగుణములను) నశింపజేయుచుండును; కావున నత్తరి తిక్త, కషాయ, కటురసములు యథాక్రమముగ(అనగా శిశిర ఋతువునందు తిక్తరసము గ్రీష్మ ఋతువునందు కటురసము, వసంత ఋతువునందు కషాయకటురసము) బలత్తవరంబులై యుండును. మఱియును శిశిరఋతువునందు తిక్తరసము బలవత్తరముగను, కషాయకటురసములు స్వప్రమాణముగను, వసంతఋతువునందు కషాయరసము బలవత్తరముగను తిక్తకటురసములు స్వప్రమాణముగను, గ్రీష్మఋతువునందు కటురసము బలవత్తరముగను తిక్తకషాయరసములు స్వప్రమాణములుగ నుండునని తెలియపరచుటకై తిక్తకషాయకటుకాః అని సమాసముగా జెప్పక తిక్తః కషాయః కటుకః అని ప్రత్యేకముగా జెప్పబడినవి, ఉత్తరాయణము భూమియొక్క సౌమ్యగుణములను బోకడచి రూక్షకరమైన రసములను వృద్ధిచేయుచుండును; కావున నది యాగ్నేయ మనియు బఱంగును.

### దక్షిణాయనము

ఋతవో దక్షిణాయనమ్. ౪
వర్షాదయో విసర్గశ్చ యద్బలం విసృజత్యయం,

వర్షాది మూడు ఋతువులును చేరిన దక్షిణాయన మనబడును. అది మనుజులకు బలమును గలుగజేయును. కావున విసర్గ మని పఱంగును. దక్షిణాయన మనగా— సూర్యునియొక్క దక్షిణదిగ్గమన మని యర్థము.

### విసర్గనామ కారణము

సౌమ్యత్వాదత్ర సోమో హి బలవాన్ హీయతే రవిః. ౫
మేఘవృష్ట్యనిలైః శీతైః శ్శాంతతాపే మహీతలే,
స్నిగ్ధాశ్చేహామ్లలవణమధురా బలినో రసాః. ౬

విసర్గ మను దక్షిణాయన కాలమునందు శీతముగ, మృదువుగ, స్నిగ్ధముగ నుండు మేఘ, వర్ష, వాతములచే భూమియందు తాపము శమించి సౌమ్యగుణ మధికముగ నగుటవలన చంద్రుడు బలవంతుడుగను, సూర్యుడు దుర్బలుడుగను నగుచున్నారు; కావున నట్టికాలమునందు అమ్ల లవణ మధుర రసములు యథాక్రమముగ(అనగా వర్ష ఋతువునందు అమ్లరసము, శరదృతువునందు లవణరసము, హేమంతఋతువునందు

మధురరసము) బలవత్తరముగ నుండును, ఇటుల జెప్పుటచే వర్షఋతువునందు ఆమ్లరసము బలవత్తరముగను, లవణమధురరసములు స్వప్రమాణముగను,శరదృతువునందు లవణరసము బలవత్తరముగను, ఆమ్లమధురరసములు స్వప్రమాణముగను, హేమంతమునందు మధుర రసము బలవత్తరముగను, ఆమ్లలవణరసములు స్వప్రమాణముగ నుండు ననిభావము.

హేమంతాదులయందు బలవిచారము.

శీతేఽగ్ర్యం వృష్టిఘర్మేఽల్పం బలం మధ్యం తు శేషయోః,

శీతస్వభావముగల హేమంత శిశిరఋతువులయందు మనుజులకు మిక్కుటముగ బలము కలుగును. వర్ష గ్రీష్మఋతువులయందు అల్పముగ బలము కలుగును. శరద్వసంత ఋతువులయందు మధ్యమ బలము కలుగును. ఆదానకాలమైన వసంతఋతువునందు మిగులతీక్ష్ణము, ఉష్ణము, రూక్షముగల సూర్యవాయువులచే బలవృద్ధికి హేతువైనభూమి యొక్క సౌమ్యగుణములు శోషనుజెందుచుండగా నట్టికాలమునందు మధ్యమబలం బెటుల గలుగు ననెడిశంక కొందరికి జనించును. అయినను వర్షాదిఋతువులయందు మను జులకు వృద్ధిజెందియుండు బలము కృష్ణపక్ష చంద్రునివలె క్రమముగ తగ్గుచుండును. అటులనే దీర్ఘకాలముగ జేరియుండు బలము వసంతఋతువులో క్రమముగ తగ్గుచుం డును. కాబట్టి వసంతఋతువునందు మనుజులకు మధ్యమబలమని చెప్పినది సయుక్తి కంబుగనే యున్నది. ఈహేతువుచేతనే యావద్విసర్గకాలమైన దక్షిణాయనముచే విశేషముగ వృద్ధిజెందియుండు బలము శిశిరఋతువునందు క్రమముగ తగ్గుచుండును. అటుల తగ్గుచుండుబలము కృష్ణపక్షారంభమునందు క్షయించుచుండు చంద్రునివలె దృశ్యము కాకుండుటవలన శిశిరఋతువునందు మిక్కుటముగ బలముకలుగు నని చెప్పినది యుక్తియుక్తంబగుచున్నది. ఇక వసంత శిశిరఋతు స్వరూపం బెట్లనగా —

"ధూమధూమ్రరజోమందా స్తుషారావిలమండలాః, దిగాని త్యా మరుచ్చైత్యా దుత్తరో రోమహర్షణః. లోధ్రప్రియంగుపున్నాగబల్యః కుసుమోజ్జ్వలాః, దృప్తా జాజమహిషవాజ వాయసనూకరాః హిమానిపటలాచ్ఛన్నా లీన మీనవిహంగమాః, నద్యస్సబాష్పాహోస్నిష్మాణః కూపాద్యాశ్చ హిమాగమే."

దిక్కులు, సూర్యుడు, పొగవలె ధూమ్రవర్ణముగ, మందముగ, మంచుచే కలకబారి యుండు మండలములు గలవిగ నుండును. ఉత్తరపుగాలి శైత్యమువలన రోమాంచమును గలుగజేయును. లొద్దుగ, ప్రేంకణము, పొన్న, ఉప్పి, మొదలగువృక్షములు పుష్పించి ప్రకాశించుచుండును. ఏనుగు, ఆడుమేక, దున్నపోతు, గుఱ్ఱము, కాకి, పంది ఇవి మదముతో గూడియుండును. నదులు మంచుసమూహాముచే కప్పబడి లోన మునిగి

యుండు మత్స్యములతోను గూడికొనియుండును. నెయ్యి మొదలగునవి కొంచెముగ ఉష్ణయుక్తముగనుండును. అని అష్టాంగసంహితయందు చెప్పబడియున్నది.

### హేమంతర్తుచర్య

బలినశ్శీతసంరోధాద్ధేమంతే ప్రబలోనలః. ౭
భవత్యల్పేంధనో ధాతూన్ స పచేద్వాయునేరితః,

బలిష్ఠుడుగనుండు పురుషునియొక్క జాఠరాగ్ని హేమంతఋతువులో శీత ప్రతిబంధమువలన వృద్ధిజెందును. (అనగా రోమకూపముల మూలముగా జాఠరాగ్ని యొక్క జ్వాల వెలిపడకుండ శీతవాతాదులు స్రోతోమార్గముల నడ్డగించి లోనికే ప్రవేశింపజేయుటవలన జాఠరాగ్ని మిక్కుటముగ వృద్ధిజెందు నని భావము.) ఈ యర్థమునే —

"ఊష్మా బహిః ప్రతిహతో హిమశీతవాతైరంతశ్శరీరవివరం ప్రతిపద్యమానః,
స్వస్థానపిండితవపుర్భవతి ప్రచండశ్శీతేనిలానలహరోऽధిరివ్యతేతః."

అనువచనముకూడ బోధించుచున్నది అటులు వృద్ధిజెందిన జాఠరాగ్ని భుజించిన యాహారమును బాగుగపచనముజేయును. పచనమైన యాహారమువలన అధికబలము గలుగును. కాబట్టి హేమంతమునందు జాఠరాగ్నికి అల్పాహారము గలిగినయెడల నది వాతముచే నుద్దీపనమునుజెంది రసాదిధాతువులను పచనముజేయును పైజెప్పిన ప్రకారము జాఠరాగ్ని హేమంతఋతువునందే ప్రబలముగ నగుటవలన దానికి గురుత్వము గల యనేకవిధములైన యాహారములు "అతో హిమేస్మిన్ సేవేత" ఇత్యాదిశ్లోకములచే యుత్తరత్ర విధింపబడుచున్నవి. మఱియు నితరమైనవర్షాది ఋతువులయందు శీతవాతములచే జాఠరాగ్నికి మాంద్యము కలుగునేకాని దీపనము కలుగనేరదు. కావుననే —

"వృష్టివాతాకులే త్వహ్ని భోజనం క్లేదవాతజిత్,
పరిశుష్కం లఘుస్నిగ్ధముష్ణామ్లలవణం భజేత్."

వృష్టి,వాతము వీనితో గూడియుండు దినమునందు క్లేదమును వాతమును శమింపజేయునదిగ, శుష్కముగ, లఘువుగ, స్నిగ్ధముగ, ఉష్ణముగ, ఆమ్లముగ, లవణముగ నుండు భోజనమును సేవింపవలయు నని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

### హేమంతమున మధురాదిరసోపయోగము

అతో హిమేస్మిన్ సేవేత స్వాద్వమ్లలవణాన్ రసాన్. ౮

అట్లగుటచే మధురామ్లలవణరసములను హేమంతఋతువునందు విశేషముగా సేవింపవలయును అటుల నితరఋతువులయందు విశేషముగా సేవింపంజనదు.

—— హేమంతమున ప్రాతఃకాలభోజనవిధి ——

దైర్ఘ్యాన్నిశానామేతర్హి ప్రాతరేవ బుభుక్షితః,
అవశ్యకార్యం సంభావ్యం యథోక్తం శీలయేదను. ౯

ఈ హేమంతఋతువునందు రాత్రికాలము దీర్ఘముగ నుండుటవలన నాకలి తీవ్రముగ నగును. కావున ప్రాతఃకాలమునందే ఆవశ్యకములైన మలమూత్రోత్సర్గాది కృత్యములను, దినచర్యాధ్యాయమున జెప్పబడిన కృత్యములను దీర్చికొని శీఘ్రముగ భుజించి పిదప నీయధ్యాయమునందు జెప్పబడు వాతఘ్నతైలాభ్యంగాదుల నభ్యసింప వలయును. "బుభుక్షితోఽవశ్యకార్యంసంభావ్యయథోక్తంశీలయేదను" అనిమూలము నందు చెప్పియుండుటవలన —

"ఆహారకాలే సంప్రాప్తే యో నభుఙ్క్తే బుభుక్షితః,
తస్య సీదతి కాయాగ్నిర్నిరింధన ఇవానలః."

అనువచనప్రకారము ఆకలిగలవానికి భోజనమే ఆవశ్యకమయిన కార్యముగ నున్నది; కాబట్టి ఆకలిగలవాడు భుజింపవలయు నని తెలిసికొనవలయును. పర్వకాలములయందు ఆకలిగలవాడే భుజింపవలయు నని జెప్పియుండుటవలన "బుభుక్షితః" అనుపదము యిచట వ్యర్థంబగుచున్న దనెడి శంక గలుగును. అయినను

"ముహుర్ముహురజీర్ణేఽపి భోజ్యాన్యస్యోపహారయేత్,
నిరింధనోంతరం లబ్ధ్వా యథైనం నవిపాదయేత్."

అనెడిసామాన్యవచనము హేమంతకాలమునందు జాఠరాగ్ని అగ్నితుల్యముగ నగుటచే అజీర్ణమునందుకూడ పలుమారు ఆహారము నియ్యవలయు ననియును, అటుల నియ్యనిచో జాఠరాగ్ని ఆహారములేనిదై మనుజుని జంపు ననియును బోధించుటవలన అజీర్ణమునందు ఆకలి లేనివానికి కూడ భోజనమునం దధికారముగలగ దనెడి భ్రమను నివారణముచే నిమిత్తమే "బుభుక్షితః" అనుపదము ప్రయోగింపబడినది. "నిశానాం దైర్ఘ్యాత్" అనిచెప్పినందుచే హేమంతఋతువునం దెపుడు రాత్రికాలము దీర్ఘముగ నగునో అపుడు మాత్రమే యీవిధుల నన్నిటి నాచరింపవలయు ననియు, హేమంతకాలప్రారంభము నందే ఆచరింపంబనిలే దనియు భావంబగుచున్నది. అతో హిమేస్మిన్ సేవేత అనుచో "సేవేత" అనుపదము హేమంతకాలమునందు మధురామ్లలవణరసములను వాతశమ నార్థము విశేషముగ నుపయోగ పరచవలయు ననియు, ఆఋతువులో నొకానొక సమయమున నుపయోగించుట చాల దనియు సూచించునిమిత్తంబును, యథోక్తంశీల యేత్ అనుచో "శీలయేత్" అనుపదము వాతహరతైలము మొదలగు వానినన్నిటిని సమానముగ సేవింపవలయు నని సూచించునిమిత్తంబును; ప్రావారాజినః అనుచో

"భజేత్" అనుపదము సమస్తమయిన ఆహారవిహారశయనవిధులను తుల్యముగ నాచరింపవలయు నని సూచించునిమిత్తంబును, ఒకటేవిధమైన యర్థముగల సేవేత శీలయేత్ భజేత్ అను మూడు పదములు ప్రయోగింపబడినవి.

## వాతహరతైలాభ్యంగాదులు

వాతఘ్నైస్తైలైరభ్యంగం మూర్ధ్ని తైలం విమర్దనం,
నియుద్ధం కుశలైస్సార్ధం పాదాఘాతం చ యుక్తితః ౧౦
కషాయాపహృతస్నేహ స్తతస్స్నాతో యథావిధి,
కుంకుమేన సదర్పేణ ప్రదిగ్ధోఽగరుధూపితః ౧౧

విశేషముగ వాతహరమైన బలాదితైలముచే నభ్యంగము, తైలముచే శిరోభ్యంగాదులు, శరీరమర్దనము (అనగా తైలమును లేపనము చేసికొని మర్దనము చేయించుకొనుట) సమర్థులగువారితో మల్లయుద్ధము, శక్త్యనుసారముగా పాదములచే మర్దనము ఇవి మొదలగువానిని చేయించుకొని లొద్దుగుమొదలగువాని కషాయములచే తైలము విడుచునటుల శరీరమును బాగుగ తోముకొని వైద్యశాస్త్రములో జెప్పియుండు ప్రకారము స్నానముచేసి కస్తూరిని కుంకుమపువ్వును నూరి మెనవలదికొని అగరుచెక్క పొడితో ధూపము వేసికొనవలయును.

## మాంసరస భోజనాది సేవనము

రసాన్ స్నిగ్ధాన్ పలం పుష్టం గౌడమత్స్యసురాం సురాం,
గోధూమపిష్టమాషేక్షుక్షీరోత్థవికృతీశ్శుభాః ౧౨
నవమన్నం వసాం తైలం శౌచకార్యే సుఖోదకం,
ప్రావారాజినకౌశేయ ప్రవేణీ *కౌచవాస్తృతం. ౧౩
ఉష్ణస్వభావైర్లఘుభిః ప్రావృతశ్శయనం భజేత్,
యుక్త్యార్కకిరణాన్ స్వేదం పాదత్రాణం చ సర్వదా ౧౪

హేమంతఋతువులో బలకరమైన మాంసరసము, పుష్టికరమైన మాంసములు, బెల్లముతో చేయబడినమద్యము, సురాముండము, మదిర యను మద్యము, గోధుమపిండి, మినుములు, చెరుకు, పాలు ఈమొదలగువానిచే చేయబడినపదార్థములు, నూతనమైన యన్నము, వస అనగా —

"శుద్ధమాంసస్య యః స్నేహః సా వసా పరికీర్తితా"

అనెడి వచనముచొప్పున శుద్ధమాంసస్నేహము, తైలము, శౌచాదులయందుష్ణోదకము

* కుథకౌస్తృతం ఇతిపా.

ఇవి మొదలగువానిని సేవింపవలయును. మఱియు దుప్పటి, మృదుస్పర్శగల చర్మములు, పట్టుబట్ట, రగ్గుకంబళి, శాలువ మొదలగు వానిచే పరచబడియుండు శయనమునందు ఉష్ణముగ, లఘువుగ నుండు కంబళిమొదలగువానిని కప్పుకొని సమ్యగ్యోగలక్షణముగల యుక్తిచే (అనగా యుక్తమైన కాలముపరకు) పరుండవలయును. పైజెప్పిన యుక్త్యనుసారముగ సూర్యకిరణములను, స్వేదకర్మను సేవింపవలయును. మఱియు నెల్లప్పుడు పాదుకలనె ధరింపవలయును.

శీతబాధనివర్తనోపాయము.

పీవరోరుస్తనశ్రోణ్యస్సమదాః ప్రమదాః ప్రియాః
హరంతి శీతముష్ణాంగ్యో ధూపకుంకుమయౌవనైః. ౧౫
అంగారతాపసంతప్తగర్భభూవేశ్మచారిణః,
శీతపారుష్యజనితో న దోషో జాతు జాయతే. ౧౬

బలసినతొడలు, స్తనములు, పిఱుదులు గలిగినట్టియు, యౌవనమద్యపాన కామోద్రేకములచే మదించియుండునట్టియు, అగరుమొదలగు వానిధూపము, కుంకుమపుష్పలేపనము, యౌవనము మొదలగువానిచే నుష్ణమైన శరీరము గలిగియుండునట్టియు, తన కత్యంతప్రియురాండ్రుగ నుండునట్టియు స్త్రీలనాలింగనము చేసికొనుటవలన శీతబాధ నివర్తించును. మఱియు నిప్పుకణముల వేడిచే నుష్ణమైన మధ్యగృహమునందు సంచరించుచుండు పురుషునికి శీతాధిక్యముచే జనించు కష్టము ఎపుడును గలుగకుండును.

శిశిరర్తుచర్య

అయమేవ విధిః కార్యశ్శిశిరేఽపి విశేషతః,
తదా హి శీతమధికం రౌక్ష్యం చాదానకాలజమ్ ౧౭

శిశిరఋతువునందు శీతమును, ఆదానకాలస్వభావముచే జనించిన రూక్షత్వంబును నధికముగ నుండుటవలన నా శిశిరఋతువునందుకూడ పూర్వముచెప్పిన హేమంతఋతువు యొక్క విధినే విశేషముగా ననుష్ఠింపవలయును.

వసంతర్తుచర్య

కఫశ్చితో హి శిశిరే వసంతేఽర్కాంశుతాపితః,
హత్వాగ్నిం కురుతే రోగానతస్తం త్వరయా జయేత్. ౧౮

శిశిరకాలమునందు మధురస్నిగ్ధాద్యాహారములచేతను, కాలస్వభావము చేతను మిక్కుటముగ ప్రకోపించియుండు కఫము వసంతఋతువునందు సూర్యకిరణములచే తప్తంబై ఉదకమువలె ద్రవించి జాఠరాగ్నిని జెరచి యనేకరోగములను గలుగజేయును.

కావున నటులు ప్రకోపించిన కఫమును వసంతఋతువునందు త్వరగా హరింపజేయవలయును. వసంతకాలమునందు సూర్యరశ్మికి మిగులపటుత్వము గలిగియుండు నని సూచించుటకై "అంశు" అనుశబ్దము ఈశ్లోకమునందు బ్రయోగింపబడినది.

"వసంతే దక్షిణో వాయు రాతామ్రకిరణో రవిః,
నవప్రవాళసంఛన్నాః పాదపాః కకుభోమలాః.
కింశుకాశోకచూతాదివనరాజవిరాజితాః,
కోకిలాళికులాలాపకల కోలాహలాకులాః."

వసంతకాలమునందు దక్షిణపుగాలి కలిగియుండును. సూర్యుడు ఎఱుపువర్ణముగల కిరణములతో గూడియుండును. వృక్షములు చిగుళ్ళచే గప్పబడియుండును. దిక్కులు నిర్మలముగ, మోదుగ, అశోకము, మామిడి మొదలగువృక్షములతో గూడియుండు అరణ్యముచే బాగుగ ప్రకాశించునవిగ, కోయిల, తుమ్మెదలు, వీనిశబ్దముచే మధురముగనుండును. అని వసంతఋతుపుస్వరూపము అష్టాంగసంహితయందు చెప్పబడియున్నవి.

వాసంతిక శ్లేష్మప్రకోపనివర్తకోపాయము

తీక్ష్ణైర్వమననస్యాద్యైర్లఘురూక్షైశ్చ భోజనైః,
వ్యాయామోద్వర్తనాఘాతైర్జిత్వా శ్లేష్మాణముల్బణమ్. ౧౯
స్నాతోఽనులిప్తః కర్పూరచందనాగరుకుంకుమైః,
పురాణయవగోధూమక్షౌద్రజాంగలశూల్యభుక్ ౨౦
సహకారరసోన్మిశ్రానాస్వాద్య ప్రియయార్పితాన్,
ప్రియాస్యసంగ సురభీన్ ప్రియానేత్రోత్పలాంకితాన్. ౨౧
సౌమనస్యకృతో హృద్యాన్వయస్యైస్సహితః పిబేత్,
నిర్గదానాసవారిష్టశీధుమార్ద్వీకమాధవాన్. ౨౨

ప్రకోపించినకఫమును తీక్ష్ణమైన వమన నస్యవిరేకాదులచేతను, లఘువులును జిడ్డులేక రూక్షములునైన యాహారములచేతను, సంచారము నలుగుపెట్టికొనుట శరీరమర్దనము అను నుపచారములచేతను, వసంతకాలమునందు హరింపజేయవలయును. పిదప స్నానముజేసి పచ్చకర్పూరము, చందనము, అగరుగంధము, కుంకుమపువ్వు మొదలగువానిని మేననలదికొని ప్రాతవియైన యవలు, గోధుమలు, తేనె, శూలముచే పక్వముచేయబడిన జాంగలమాంసము వీనిని భుజించి తియ్యనిమామిడిపండు రసముతో గూడినదియును, తొలుత తన భార్యచే భుజించి యివ్వబడినదియును, తన ప్రియురాలియొక్క ముఖపరిమళముతో గూడినదియును, ప్రియురాలియొక్క నల్లకలువవంటి

నేత్రములచే బాగుగ జూడబడినదియును, మనస్సంతోషకరంబైనదియును, హృదయమునకు హితకరంబైనదియును, దోషరహితంబైనదియునునైన ఆసవము, అరిష్టము, శీధు (అనగా చెఱకురసముతో చేయబడినది), మార్ద్వీకము (అనగా ద్రాక్షరసముతో జేయబడినది.) మాధవము (అనగా తేనెచేనైన లేక ఇప్పపువ్వుచేనైన జేయబడినది) అను యీమద్యములను స్నేహితులతోగూడి పానము చేయవలయును.

"మద్యాకారాధికద్రవ్య మదిరాద్యైః కృతస్తు యః,
సోరిష్టస్స్యాదాసవస్తు ద్రవ్యాణ్యాసుత్య యః కృతః"

మద్యకరమైన అధిక ద్రవ్యములవలన చేయబడినది అరిష్ట మనియు, మద్యకరమైన ద్రవ్యములను దంచి పిడిచి యారసముచే చేయబడినది ఆసవ మనియు జెప్పబడును.

### శుంఠీకషాయాది సేవనము

శృంగిబేరాంబు సారాంబు మధ్వంబు జలదాంబు వా,

శొంఠియుక్తముగగాని, లేక వేగిసచెక్క, చందనము మొదలగువాని యుక్తముగగాని, లేక తుంగముస్తెలతోడగాని కాచబడినసీళ్లను, తేనెతో జేర్పబడిన సీళ్లను పానముచేయవలయును.

### వసంతకాలమధ్యాహ్నవాసయోగ్యస్థానము

దక్షిణానిలశీతేషు పరితోజలవాహిషు. ౨౩
అదృష్టనష్టసూర్యేషు మణికుట్టిమకాంతిషు,
పరపుష్టవిఘుష్టేషు కామకర్మాంతభూమిషు. ౨౪
విచిత్రపుష్పవృక్షేషు కాననేషు సుగంధిషు,
గోష్ఠీకథాభిశ్చిత్రాభిర్మధ్యాహ్నం గమయేత్సుఖీ ౨౫

వసంతకాలమునందు మధ్యాహ్నమునందు దక్షిణపుగాలివలన మిక్కుటముగ శీతలమైనదియును, నలుదిక్కులయందు ఉదకము ప్రవహించుచుండునదియును, ఒకచో సూర్యరశ్మి కలిగి మరియొకచో సూర్యరశ్మిలేకుండునదియును, వజ్రమరకత రత్నాదులచే నలంకరింపబడిన మిట్టలు గలదియును, కోకిల శబ్దములతో గూడియుండునదియును, కామోద్దీపనకరంబైనదియును, నానావిధపుష్పవృక్షములతో గూడియుండునదియును, మంచిపరిమళముకలదియు నైన యుద్యానవనమునందు విచిత్రమైనకథలను సంభాషించుచు సుఖముగ నుండవలయును.

### వసంతమున వర్జనీయరసాదులు

గురుశీత దివాస్వప్నస్నిగ్ధామ్లమధురాంస్త్యజేత్,

గురువుగ శీతలముగ నుండు పదార్థములు, పగటినిద్ర, ఆమ్లరసము, మధుర రసము వీనిని వసంతకాలమునందు వర్జింపవలయును.

## గ్రీష్మర్తుచర్య

తీక్ష్ణాంశురతితీక్ష్ణాంశుర్గ్రీష్మే సంక్షిపతీవ యత్.
ప్రత్యహం క్షీయతే శ్లేష్మా తేన వాయుశ్చ వర్ధతే, ౨౬

గ్రీష్మర్తువులో సూర్యుడు అతి తీక్ష్ణమైన కిరణములుగలవాడై మను జులయొక్క బలమును హరింపజేయుచుండుటచే ప్రత్యహము శ్లేష్మము క్షయింపుచుండును. అట్టి శ్లేష్మము క్షయించుచుండుటవలన వాతము వృద్ధిచెందును. ఈశ్లోకమునందు "తీక్ష్ణాంశు రతితీక్ష్ణాంశుః" అని చెప్పియుండుచో "స్నేహమర్కో౽తి తీక్ష్ణాంశుః" అని కొందఱు పఠించుచున్నారు. స్నేహమనుపదమునకు "స్నేహా స్తేజో౽బలం సారం" అను నిఘంటువు వలన బల మనియర్థము.

"గ్రీష్మే తసీపుష్పనభ స్తీక్ష్ణాంశుర్దుష్ప్రతిధితిః, దిశో జ్వలంత్యో భూమిశ్చ మారుతో నైఋతో సుఖః. పవనాతపసంశ్లిష్టై ర్జంతవో జ్వలితా ఇవ, తాపా ర్తతుంగమాతంగ మహిషైః కలుషీకృతాః. దివాకరకరాంగారనికరైః క్షపితాంభసః, ప్రరుద్ధరోధసో నద్యశ్ఛాయాహీనా మహీరుహాః. విశీర్ణ జీర్ణ పత్రాశ్చ శుష్కవల్లీభిరంకితాః."

గ్రీష్మకాలమునందు ఆకాశము నల్లయగసిపుష్పమువలె నుండును. సూర్యుడు మిగుల తీక్ష్ణమును ప్రకాశమునుగల కిరణములతో గూడికొనియుండును. వాతము, ఎండ వీని సంబంధముచే జంతువులు తపించును. నదులజలము అగ్నితో సమానముగ నుండు సూర్య కిరణములచే శోషించి తాపముచే పీడింపబడిన ఏనుగు, దున్నపోతు మొదలగు జంతువు లచే కలకబారియుండును. వృక్షములయొక్క ఆకులు రాలి నీడ లేక యెండినతీగలచే జుట్టబడియుండును. అని గ్రీష్మకాలస్వరూపము అష్టాంగసంహితయందు చెప్పబడి యున్నది.

## గ్రీష్మర్తువర్జనీయ రసాదులు

అతో౽స్మిన్ పటుకట్వమ్లవ్యాయామార్కకరాం స్త్యజేత్. ౨౭

కాబట్టి గ్రీష్మకాలమునం దధికముగా ఉప్పు, కారము, పులుసు, వ్యాయామము, సూర్యకిరణములు వీనిసేవనను వర్జింపవలయును.

## గ్రీష్మమున అన్నాదిసేవనక్రమము

భజేన్మధురమేవాన్నం లఘుస్నిగ్ధం హిమం ద్రవం,
సుశీతతోయసిక్తాంగో లిహ్యాత్సక్తూన్ సశర్కరాన్. ౨౮

మద్యం న పేయం పేయం వా స్వల్పం సుబహువారి వా,
అన్యథా *శోషశైథిల్యదాహమోహాన్ కరోతి తత్. ౨౯
కుందేందుధవళం శాలిమశ్నీయాజ్జాంగలైః పలైః,
పిబేద్రసం నాతిఘనం రసాలాం రాగ † ఖాండవౌ ౩౦
పానకం పంచసారం వా నవమృద్భాజనస్థితం,
మోచచోచ దళైర్యుక్తం సామ్లం మృణ్మయశుక్తిభిః. ౩౧
పాటలావాసితం చాంభ స్సకర్పూరం సుశీతలం,
శశాంకకిరణాన్ భక్ష్యాన్ రజన్యాం భక్షయన్ పిబేత్. ౩౨
ససితం మాహిషం క్షీరం చంద్రనక్షత్రశీతలం,

గ్రీష్మర్తువునందు మధురమైనయన్నమును, లఘువుగ స్నిగ్ధముగ శీతలముగ ద్రవముగ నుండు పదార్థములను, మిక్కుటముగ భుజింపవలయును, "మధురమేవ" అను ఏవకారమువలన ఇతరరసముల నటులవిశేషముగ సేవింపజన దని సూచ్యంబగుచున్నది. అతిశీతలమైన జలములో స్నానముచేసి పంచదారతో గూడియుండు వరి పేలాలపిండిని భుజింపవలయును. గ్రీష్మకాలములో మద్యమును పానముచేయం జనదు. వాతశ్లేష్మప్రకృతిగలవారు వాతశమనార్థమై మద్యమును పానముచేయవలసియుండినచో స్వల్పముగా పానముచేయవలయునేకాని యితరఋతువులయందువలె నధికముగ పానముచేయం జనదు. పిత్తశ్లేష్మప్రకృతిగలవారు శ్లేష్మపిత్తశమనార్థమై పానముచేయవలసి యుండినచో అధికమైన యుదకములో స్వల్పముగ మద్యమునుజేర్చి పానముచేయదగునేకాని యితరఋతువులయందువలె నధికముగ పానముచేయంజనదు. అటుగాక నధికముగ పానముజేసినచో వాపు, అంగశైథిల్యము, సర్వాంగములయందు తాపము, మోహము కలుగును. జాంగలమాంసముతోడ మొల్లపువ్వును చంద్రుడు వీనివలె తెల్లగ నుండు శాల్యన్నమును భుజింపవలయును. కొంచెముగ ద్రవమైన, మాంసరసము, రసాలా (అనగా పెరుగులో ననేకద్రవ్యములను జేర్చిచేసినది), రాగ, ఖాండవములు, నూతనమైనమట్టిపాత్రలో నుంపబడినదియును, అరటిపండ్లు, పనసపండు, వీనితో గూడినదియును,ఒకింత పులుసుగనుండునదియు నగుపంచసార మను పానకము మొదలగువాని నన్నిటిని మట్టిదుత్తతోడనే పానముచేయవలయును. ఇక రాగ ఖాండవవివరణం బెట్లన్న —

"సితామధ్వాదిమధురా రాగాస్తత్రాచ్ఛకాంతయః. తేసామ్లాః ఖాండవా లేహ్యాః పేయాశ్చాంశుకగాలితాః స్వాద్వమ్లపటుకట్వాద్యాః ప్రలేహాస్తత్ర ఖాండవాః, గుడ

* శోష ఇతి పా. † షాడబా ఇతి పా.

దాడిమమాంసాద్యాః రాగాశ్చాంశుకగాలితాః. హృద్యావృష్యారుచికరాః గ్రాహిణో రాగఖాండవాః."

అనువచనముల ప్రకారము పంచదార, మధ్వాదిగుణము వీనిచే మధురంబై ఒకింతపులుపుగ, స్వచ్ఛముగ నుండునది రాగమనబడును. మధురామ్లకటులవణరసాదులుగల ప్రలేహములు ఖాండవములనబడును. వడకట్టిన బెల్లము, దాడిమపండురసము, మాంసరసము మొదలగునవి రాగ మనబడును. మఱియును—

"గుడదాడిమాదియుక్తా విజ్ఞేయా రాగఖాండవాః,
త్రిజాతమరిచాద్యైస్తు సంస్కృతాః పానకా స్తథా."

బెల్లము, దానిమ్మపండు మొదలగు వానితో గూడినదై త్రిజాతకము, మిరియములు మొదలగు వానిచే సిద్ధముజేయబడినది రాగఖాండవము లనబడు నని గ్రంథాంతరమునందు జెప్పబడియున్నది. పంచసారపానక వివరం బె ట్లన్న —

"ద్రాక్షామధూకఖర్జూరకాశ్మర్యస్సపరూషకాః, తుల్యాంశైః కల్పితం పూతం శీతం కర్పూరవాసితమ్, పానకం పంచసారాఖ్యం దాహతృష్ణానివర్తకమ్."

అనువచనముల ప్రకారము ద్రాక్ష, ఇప్పపూలు, ఖర్జూరము, గుమ్ముడు, పెద్దయీత, వీనిని సమభాగములుగ నుదకములో వైచి యొకింతసేపు నుని చి నడియగట్టి పచ్చకర్పూరముకూర్చి వాసెన గట్టిన నది పంచసారపానక మనబడును. మఱియును ఘృతము, పిప్పలి, పచ్చకర్పూరము, తేనె, శర్కర వీనితోడ సిద్ధము చేయబడినపాలు పంచసారపానక మనబడునని కొందరుచెప్పుచున్నారు. మిక్కిలి చల్లనైనయుదకమును మట్టిపాత్రలో పోసి గలిగొట్టుపూలనుజేర్చి వాసెనగట్టి పచ్చకర్పూరమునుజేర్చి మట్టిదుత్తతోడనే పానము చేయవలయును.

"పరిపేలవమాతుల్యా స్తథా గుగ్గులుము స్తకాః, చూర్ణితాశ్శశినోపేతా నవభాజనధూపనమ్. కుష్ఠము స్తకసంయుక్తైః పేలవోశీరవాలుకైః, మృదితామ్రత్వుస్పిష్టైస్తైః ఖదిరాంగారపాచితాః. సహకారరసాభ్యక్తాః, చంపకోత్పలవాలుకైః, పద్మకుంజకకుందైశ్చ యథాలాభాధివాసితాః, శ్రేష్ఠస్సలిలవాసోయంస్మృతస్సర్వర్తుకో బుధైః."

అనెడి సుశ్రుతవచన ప్రకారము తుంగముస్తెలు, గుగ్గిలము, కోలతుంగముస్తెలు, వీనిని సమభాగములుగ చూర్ణముజేసి పచ్చకర్పూరముతో జేర్చి క్రొత్తకుండకు ధూపము నివ్వవలయును. మఱియు చెంగల్వకోష్టు, కోలతుంగముస్తెలు, తుంగముస్తెలు, వట్టివేరు, కురువేరు వీనిని మట్టితోడజేర్చి బాగుగపిసికి కుండకులోపలబూసి చంద్రనిప్పులతో కాచి పిదప నాకుండలోపల తియ్యమామిడిపండ్లరసమును బూసి దానిలో ఉదకము పోసి

సంపెంగపువ్వు, కలువ, కురువేరు, తామరపువ్వు, కుంజకము, మొల్ల పీనిచేగాని, వానిలోదొరకినవానిచేగాని వాసెనగట్టవలయును. ఇటుల వాసెనగట్టుట సర్వఋతువుల యందు హితకరం బనియు, శ్రేష్ఠం బనియు పండితులు వచింపుచున్నారు. కర్పూరనాళీ కాయనుభక్ష్యములను రాత్రులయందు భుజించి చంద్రనక్షత్రములవలన శీతలంబై యుండు (అనఁగా శైత్యార్థము బయలుప్రదేశమునం దుంపబడిన) ఎనుపపాలలో పంచ దారను కలిపి పానముచేయవలయును.

గ్రీష్మమున మధ్యాహ్నవాసయోగ్యస్థానము

అభ్రంకషమహాసాలతాలరుద్ధోష్ణరశ్మిషు. 33
వనేషు మాధవీశ్లిష్టద్రాక్షాస్తబకశాలిషు,
సుగంధిహిమపానీయసిచ్యమానపటాలికే. 34
కాయమానే చితే చూతప్రవాళఫలలుంబిభిః,
కదలీదళకల్హారమృణాళకమలోత్పలైః 35
కల్పితే కోమలై స్తల్పే హసత్కుసుమపల్లవే,
మధ్యందినేర్కతాపార్తః స్వప్యాద్ధారాగృహేథవా. 36
పుస్తస్త్రీస్తనహస్తాస్యప్రవృత్తోశీలవారిణి,

ఆకాశమునంటునట్లు మిక్కిలి పొడవైన గొప్పవృక్షములచే సూర్యరశ్మినడ్డగించుచు బండిగురిగింజతీగెలతో చుట్టబడిన ద్రాక్షగుత్తులచే ప్రకాశించుండు వనములో పందిలి నిర్మించి దానిచుట్టు సువాసనగల పన్నీరుచే లడుపబడిన వస్త్రములను జుట్టి మామిడిపండ్లు, మామిడిచిగుళ్లు, మామిడిపూలగొత్తులు వీని నధోముఖముగ వ్రేలాడుచుండునటులగట్టి దానిలో నతిమృదువైన అరటిచిగుళ్లు, చెంగలువ, తామర తూండ్లు, తామరపువ్వులు, నల్లకలువలు మొదలగువానిచే నిర్మింపబడిన శయనము నందు గ్రీష్మకాలమున మధ్యాహ్నములో సూర్యకిరణతాపమును సహింపలేని మనుజుడు నిద్రించవలయును. లేక పుష్పములు చిగుళ్లుకట్టబడి విచిత్రమైన వస్త్రాభరణాదులచే నలంకరించబడి స్తనములు, హస్తములు, ముఖము వీనిమూముగల సుగంధమైన జలము వెలిపడుచుండునట్లు మ్రానుమొదలగువానిచే జేయబడిన స్త్రీరూపమైనబొమ్మ నునిచియుండు ధారాగృహమునందుగాని నిద్రించవలయును.

గ్రీష్మకాలమున రాత్రి వాసయోగ్యస్థానము

నిశాకరకరాకీర్ణే సౌధపృష్ఠే నిశాసు చ 37
ఆసనా

రాత్రులయందు చంద్రకిరణములచే వ్యాప్తమైన మేడమీద వసింపవలయును.

**గ్రీష్మమున శ్రమహరణోపాయము**

స్వస్థచిత్తస్య చందనార్ద్రస్య మాలినః,
నివృత్తకామతంత్రస్య సుసూక్ష్మతనువాససః. ౩౮
జలార్ద్రాస్తాలవృంతాని విస్తృతాః పద్మినీపుటాః,
ఉత్క్షేపాశ్చ మృదూత్క్షేపాః జలవర్షిహిమానిలాః. ౩౯
కర్పూరమల్లికామాలా హారాస్సహరిచందనాః,
మనోహరకలాలాపా శ్శిశవస్సారికాశ్శుకాః. ౪౦
మృణాళవలయాః కాంతాః ప్రోత్ఫుల్లకమలోజ్జ్వలాః,
జంగమా ఇవ పద్మిన్యో హరంతి దయితాః క్లమమ్. ౪౧

స్వస్థచిత్తుడు, చందనముచే తడుపబడిన శరీరముగలవాడు, పుష్పమాలికలను ధరించినవాడు, కామసుఖమును నివృత్తించినవాడు, అతిసూక్ష్మమైన వస్త్రమును ధరించినవాడునైనపురుషునికి జనించిన బడలికను జలముచే తడుపబడిన విసనకఱ్ఱలు, మెల్లనిగాలి రావగిన తాటియాకులు సెమలియాకలు మున్నగువానిచే చేయిబడిన విసనకఱ్ఱలు జలకణములను వర్షించునట్టి మందవాతము, పచ్చకర్పూరము, మల్లెపువ్వులమాలికలు, ముక్తాహారము, హరిచందనము, ముచ్చటగ మాటలాడుశిశువులు, గోరువంక, చిలుకలు, తామరపువ్వులవలె ప్రకాశించునట్టి నేత్రములుగలవారై తామరతూండ్లను గాజులవలె ధరించియుండునట్టియు, సంచరించునట్టి తామరమడుగువలె నుండునట్టియు, అత్యంతప్రియులైనట్టియు, యౌవనముసం దుండునట్టియుస్త్రీలు మొదలగువాని సేవనచే నివర్తించును. క్లమ మనగా —

"యో నాయాసః శ్రమో దేహే ప్రవృద్ధశ్శ్వాసవర్జితః,
క్లమస్స ఇతి విజ్ఞేయ ఇంద్రియార్థప్రబాధకః."

అనెడి సుశ్రుతవచనప్రకారము ఆయాసము, శ్వాసములేకయే దేహమున వృద్ధిచెంది ఇంద్రియార్థములను బాధించునట్టి శ్రమ మని తాత్పర్యము.

**వర్షర్తుచర్య**

ఆదానగ్లానవపుషా మగ్నిస్సన్నోఽపి సీదతి,
వర్షాసు దోషైః.

ఆదానకాలమైన గ్రీష్మఋతువువలన బడలినశరీరముగల పురుషులయొక్క జాఠరాగ్ని మిగుల మందగించి వర్షాకాలమునందు కాలస్వభావముచే దుష్టమైన వాతపిత్తశ్లేష్మములవలన మరల దూషింపబడి నశించును.

"వర్షాసు వారుణోవాయుస్సర్వసస్యసముద్భవః, భిన్నేంద్రనీలసంకాశాభ్రబృందబంధావిలం నభః. దీర్ఘికా నవవాప్యో యాః మగ్నసోపానపంక్తయః, వారిధారా

భృశాఘూర్ణవికాసితసరోరుహాః. సరితస్సాగరాకారా భూరక్తజలదస్థలా, మందస్తనిత జీమూతశిఖదర్దురనాదితా. ఇంద్రగోపకుశిఖండవిద్యుదుద్యోతదీపితా, ప్రశస్త శ్యామల తృణశాలినీ కుటజోజ్జ్వలా."

వర్షాకాలమునందు పడమటిదిక్కుగాలి సమస్తమైనపంటలు గలిగియుండును. ఆకాశము ఇంద్రనీలమణివలె నల్లగనుండు మేఘములచే మూయబడియుండును. నుయ్యి, నడ బావివీనిపడిగట్లు ఉదకములో మునిగియుండును. తామరపూలు వర్షధారలచే నభిఘాత మును జెందియుండును. నదులు సముద్రమువలె ఉదకముతో నిండియుండును. మేఘ గర్జనము, నెమళ్ళు, కప్పలు వీనిశబ్దము విశేషముగ నుండును. ఇంద్రధనుస్సు, ఇంద్ర గోపపురుగులు, మెరుపులు, భూమియందు పచ్చనైగలకసువు, గిరిమల్లికలు ఇవి ప్రకా శించుచుండును. అని వర్షాకాలస్వరూపము అష్టాంగసంహితయందు చెప్పబడియున్నది.

## వర్షర్తువునందు వాతాదులకు దుష్టత్వము

దుష్యంతి తేంబులం బాంబుదేఽంబరే. 42

సతుషారేణ మరుతా సహసా శీతలేన చ,

భూబాష్పేణామ్లపాకేన మలినేన చ వారిణా. 43

వహ్నినైవ చ మందేన

వర్షాకాలమునందాకాశము మేఘములచే నావరింపబడియుండునపుడు జలకణ ములతో గూడియుండునట్టియు, గ్రీష్మకాలతాపానంతరమే శీతలముగనుండునట్టియు గాలివలన శీతనుండు వాతము దూషింపబడును. అటులనే భూమియొక్క ఉష్ణము వలనను, కాలస్వభావముచే ఆమ్లపాకమును జెందియుండు ఉదకపానమువలనను పిత్తము దూషింపబడును. సాలెపురుగులయొక్క విణ్మూత్రాదులచే కలిగియుండు వర్షో దకపానమువలనను, కాలస్వభావమువలనను, మిక్కుటముగ మాంద్యమును జెందియుండు జాఠరాగ్నిచే శ్లేష్మము దూషింపబడును. పైజెప్పన హేతువువలన వాతపిత్తశ్లేష్మములు మూడును వర్షాకాలమునందు దూషింపబడును. ఇటులనే ఆకాశము మేఘములవలన గప్పబడుచుండు ఇతరకాలములయందును వాతాదులు దూషింపబడునని "తేంబులం బాంబుదేంబరే" అను వాక్యము సూచింపుచున్నది. దూషింపబడుట అనగా—త్తమతమ కృత్యములయందు దసమర్థంబులుగ నగుటయని భావము. ఈశ్లోకమునందు వాతపిత్తకఫరక్త ములు నాల్గు నేకకాలమున ప్రకోపము జెందునని చెప్పబడియున్నది.

"చయప్రకోపప్రశమా వాయోర్గ్రీష్మాదిషు త్రిషు".

వాతమునకు గ్రీష్మము మొదలగు మూడుబుతువులయందు యథాక్రమముగ చయము, ప్రకోపము, ప్రశమము గలుగునని ఉత్తరత్ర జెప్పబడును. కాబట్టి దుష్యంతీత్యాదివచన

ము, చయప్రకోపప్రశమా ఇత్యాదివచనమును పరస్పరము విరోధించుచున్న వనే శంక కలుగును. అయితే మూలశ్లోకమునందలి "దుష్యంతి" అనుపదమునకు స్వస్థానమునందే ప్రకోపమును జెందియుండు వాతాదిదోషములు విషాదిసంబంధముగల ద్రవ్యమువలె స్వకార్యమునం దసమర్థంబులుగ నగుచున్నవనిభావము. "చయప్రకోపప్రశమాః" అను శ్లోకమునకు వాతాదిదోషములు స్థానాంతరమును జెంది ప్రకోపించునని భావము. కాబట్టి "దుష్యంతి తేంబులంబాంబుదేంబరే" అనువచనమునకును ఉత్తరత్ర జెప్పబడు 'చయప్రకోపప్రశమాః" అనువచనమునకును పరస్పరవిరోధము లేదు.

### వర్షర్తువునందు వాతాదిప్రకోపశమనోపాయము

తేష్వితన్యోన్యదూషిషు,
భజేత్సాధారణం సర్వమూష్మణస్తేజనం చ యత్. ౪౪

ఈప్రకారము వాతాదిదోషములు పరస్పరము దూషింపబడుస్వభావముగలవై యుండునపుడు వాతాదిప్రకోపము నేకకాలమున శమింపజేయునవియు, జాఠరాగ్నికి దీపనమును గలుగజేయదగినవియునగు వస్తువుల సేవింపవలయును.

"శాంతేగ్నౌ మ్రియతే యుక్తే చిరంజీవత్యనామయః,
రోగీ స్యాద్వికృతే మూల మగ్నిస్తస్మాన్నిరుచ్యతే."

అను వచనప్రకారము జాఠరాగ్ని చల్లారిన మరణముగలుగును. క్రమముగనుండిన చిరకాలమువరకు జీవించియుండును. వికారమునుజెందిన రోగిగ నగును. కాబట్టి అన్నిటిలోను జాఠరాగ్నియే ప్రధానము. దానంజేసి జాఠరాగ్నికి వృద్ధికరమగు వస్తువులనే ముఖ్యముగ భుజింపవలయునని తెలియపరచుటకై "తేజనం చ" అని చకారము ప్రయోగింపబడినది.

### వర్షర్తువునందు నిరూహవస్త్యాదిసేవనాక్రమము

ఆస్థాపనం శుద్ధతనుః జీర్ణం ధాన్యం రసాన్ కృతాన్,
జాంగలం పిశితం యూషాన్మధ్వరిష్టం చిరంతనమ్. ౪౫
మస్తుసౌవర్చలాఢ్యం వా పంచకోలావచూర్ణితం.
దివ్యం కౌపం శ్రుతం చాంభో భోజనం త్వతిదుర్దినే. ౪౬
వ్యక్తామ్లలవణస్నేహం సంశుష్కం క్షౌద్రవల్లఘు,

విరేచనాదులవలన శరీరమును శుద్ధిజేసికొనినవాడు వర్షాకాలమునందు నిరూహవస్తిని జేయించుకొనుటయేగాక ప్రాతవియైన యవగోధూమాది ధాన్యములు, స్నేహశుంఠ్యాదులలో జేర్చి సిద్ధముచేయబడియుండు మాంసరసము, లేడి మొదలగు జాంగలమాంసము, పెసరకట్టు, పురాతనమైన మార్ద్వీకము, అరిష్టమను మద్యము, సౌవర్చ

లవణము, పిప్పలి, మోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి వీనితో జేరియుండు పెరుగుమీఁదిమీగడ, ఆకాశోదకము, కూపోదకము, కాచినయుదకము. వాతవర్షాదులతో గూడి సూర్యరశ్మిలేకుండునట్టి దుర్దినమునందు ఆమ్ల లవణ స్నేహరసము లధికముగ జేరియుండు భోజనము, వగరు మొదలగు రసములు, లఘువుగ, లేనెతోగూడినదిగ నుండు శుష్కమైన పదార్థములు మొదలగువానిని సేవింపవలయును.

వర్షర్తువునందు వర్తనప్రకారము

అపాదచారీ సురభిస్సతతం ధూపితాంబరః. ౪౭
హర్మ్యపృష్ఠే వసేద్బాష్పశీతశీకరవర్జితే,

పురుషుడు వర్షాకాలమునందు పాదగమనముచేయక సువాసనగలగంధమును సువాసనగలద్రవ్యములచే ధూపము వేయబడిన వస్త్రములను ధరించుకొని ఉష్ణము, శీతము, జలకణములు లేకుండెడి పైమేడలో వసింపవలయును.

వర్షర్తువునందు వర్జనీయములు

నదీజలోదమంథాహస్స్వప్నాయాసాతపాం స్త్యజేత్. ౪౮

నదీజలము, ఉదమంథము (అనగా ఉదకములో కలపబడి నేతితోగూడియుండు పరిపేలపిండి) పగటినిద్ర, ఆయాసకరమైన పనులు, ఎండ వీనిని వర్షాకాలమునందు వర్జింపవలయును.

"ఉదమంథం దివాస్వప్నమవశ్యాయం నదీజలమ్,
వ్యాయామమాతపం చైవ వ్యవాయం చాత్ర వర్జయేత్."

అను వచనముచే పైజెప్పిన నదీజలాదులను, మంచును, మైథునమును వర్జింపవలయు నని చరకాచార్యుడుకూడ చెప్పియున్నాడు.

శరదృతుచర్య

వర్షాశీతోచితాంగానాం సహసైవార్కరశ్మిభిః,
తప్తానాం సంచితం వృష్టౌ పిత్తం శరది కుప్యతి.
తజ్జయాయ ఘృతం తిక్తం విరేకో రక్తమోక్షణం,

వర్షాకాలమునందు శీతపదార్థాభ్యాసముగల పురుషులు శరత్కాలము ప్రాముఖ్యవించినతోడనే సూర్యకిరణములచే తపించుచుండగా వారికివర్షాకాలమునందు వృద్ధిజెంది యుండు పిత్తము శరత్కాలమునందు ప్రకోపమును జెందును. కాబట్టి తన్నివారణార్థంబై కుష్ఠచికిత్సయందు చెప్పబడిన తిక్తఘృతమును గాని, లేక తిక్తద్రవ్యములచే సిద్ధము చేయబడిన ఘృతమును గాని పానముచేయవలయును. మఱియును విరేచనరక్తమోక్షణములనుగూడ చేయించుకొనవలయును. "విరేచనం పిత్తహరాణాం" అనెడి వచన

ప్రకారము పిత్తప్రకోపమునందు చికిత్సలన్నింటిలో విరేచనమే ముఖ్య చికిత్సయగుట వలన విరేచనమే తొలుత జెప్పబడినది. పిత్తమునకు రక్తము ఆధారముగ నుండుటవలన రక్తమోక్షణము తదనంతరము జెప్పబడినది.

"స్నేహస్వేదావనభ్యస్య కుర్యాత్సంశోధనం తు యః,
దారుశుష్కమివానామే శరీరం తస్య దీర్యతి."

అనగా స్నేహస్వేదములను తొలుత జేసికొనక విరేచనము జేయించుకొనువాని యొక్క శరీరము వంచబడిన యెండినకట్టెవలెనే విరిగిపోవును అని చెప్పియుండుట వలన విరేచనమునకు తొలుత స్నేహస్వేదకర్మలు అంగములుగ నుండుటవలన తిక్త ఘృతము ముందుగా చెప్పబడినది. విరేచనము, రక్తమోక్షణము జేయించుకొనినవానికి వాతప్రకోపమును, కాలస్వభావమువలన పిత్తప్రకోపము గలుగును. కాబట్టి తన్నివార ణార్థంబును, శరీరపుష్ట్యర్థంబును, జాఠరాగ్నిదీపనార్థంబును తిక్తఘృతమును ముఖ్య నుపయోగింపవలయు నని చెప్పియుండుటవలన విరేచనాదులకు ముందుగా తి జెప్పబడినది. వసంతకాలములో శ్లేష్మహరణార్థము వమనకర్మయు, వర్షాకాలమునందు వాతహరణార్థము వస్తికర్మయు నావశ్యకంబై యుండునటులనే శరత్కాలమునందు పిత్తహరణార్థము విరేచనకర్మయు నావశ్యకంబై యుండును.

"శరది వ్యోమ శుభ్రాభ్రం కించిత్పంకాంకితా మహీ, ప్రకాశకాశసప్తాహ్వ కుముదా శాలిశాలినీ. విక్షిప్తతీక్ష్ణకిరణో మేఘాఘనిగమాద్రవిః; రక్తవర్ణోఽతివిమలః క్రౌంచమాలాకులా దిశః. కమలాంతరసంలీనమీనహంసవిఘట్టనైః, తరంగభంగతుంగాని సరాంసి విమలాని చ."

శరత్కాలమునందు ఆకాశము తెల్లనిమేఘములతో గూడియుండును. భూమికొంచెము బురదగనుండును. వికసించియుండురెల్లు, ఏడాకులపొన్న, తెల్లకలువ, శాలిధాన్యము వీనిచే భూమి ప్రకాశించుచుండును. మేఘప్రతిబంధము లేకుండుటవలన సూర్యుడు తీక్ష్ణమయినకిరణములు రక్తవర్ణముగలవాడై అతి నిర్మలముగనుండును. దిక్కులు క్రౌంచ పక్షియొక్క సమూహముచే వ్యాప్తముగనుండును. గుంటలు తామరపుష్పములలో మరుగుపడియుండు మత్స్యములు, హంసలు, వీనితోగూడి అలలచే వ్యాప్తమయి నిర్మలముగ నుండును, అని శరత్కాలస్వరూపము అష్టాంగసంహితయందు చెప్పబడి యున్నది.

### శరదృతువునం దన్నాదిసేవనక్రమము

తిక్తం స్వాదు కషాయం చ క్షుధితోఽన్నం భజేల్లఘు. ౫౦
శాలిముద్గసితా ధాత్రీ పటోలమధుజాంగలం,

శరత్కాలమునందు ఆకలిగలమనుజుడు తిక్త, మధుర, కషాయరసములతో గూడి లఘువుగనుండు అన్నమును, శాలిధాన్యము, పెసలు, పంచదార, ఉసిరికకాయ, చేదిపొట్ల, తేనె, జాంగలమాంసము మొదలగువానిని భుజింపవలయును.

శరదృతువునందు హంసోదకసేవనక్రమము

తప్తం తప్తాంశుకిరణైః శీతం శీతాంశురశ్మిభిః. ౫౧
సమంతాదప్యహోరాత్రమగస్త్యోదయనిర్విషం,
శుచి హంసోదకం నామ నిర్మలం మలజిజ్జలమ్. ౫౨
నాభిష్యంది నవా రూక్షం పానాదిష్వమృతోపమం,

(మధ్యాహ్నమున నలుదిక్కులయందును సూర్యకిరణములచే తపింపబడి రాత్రులయందు చంద్రకిరణములచే చలువకెక్కినదియు,అగస్త్యోదయమువలన నిర్విషమైనదియు, పరిశుద్ధమైనదియు, హంసోదకమను నామముగలదియు, కలకబారనదియు, పిత్తశ్లేష్మములను బోకడచునదియునగు సరస్సు, తటాకము మొదలగువానియందలి జలమును, శరత్కాలమునందు పానముచేయవలయును.) అట్టిజలము శ్లేష్మమును, వాతప్రకోపమును చేయకుండును. మఱియు నాహంసోదకము స్నానపానాదులవలన ప్రకోపించిన వాతాదిదోషములను శమింపజేయుటవలనను, స్వభావమునందుండు వాతాదిదోషములకు సామ్యావస్థను గలుగజేయుచుండుటవలనను, అమృతమువలె మనుజులకు మిగుల హితకరమైనది. కాబట్టి దానిని శరత్కాలమునందుపయోగించుకొనవలయును. పైజెప్పిన యుదకము హంసవలె తెల్లగనుండుటవలన, లేక హంసలకు పానయోగ్యమైనదిగనుండుటవలన, ఆయుర్వేదతంత్రకారులచే హంసోదకమని చెప్పబడినది. ఆకులు మొదలగువానిచే మూయబడియుండు ఉదకముకూడ సూర్యచంద్రులచే తపింపబడును. ఐన నది ప్రత్యక్షముగ సూర్యచంద్రులచేతపించబడిన ఉదకమువలె గుణకరమైనదికానేరదని సూచించుటకై “కిరణ, అంశు” అను నీ రెండుపదములు ప్రయోగింపబడినవి.

శరదృతువున చందనాద్యనులేపము

చందనోశీరకర్పూరముక్తాస్రగ్వసనోజ్జ్వలః. ౫౩
సౌధేషు సౌధధవళాం చంద్రికాం రజనీముఖే,

చందనము, వట్టివేరు, పచ్చకప్పురము, ముక్తాహారము, పుష్పమాలికలు, మంచి పట్టుబట్టలు మొదలగువానిచే నలంకృతుడై పైమేడయందెక్కి మిగుల తెల్లనైనవెన్నెలను ప్రదోషకాలమునందు సేవించవలయును. ప్రదోషకాలము గడచినపిదప మంచు కురియును. కాబట్టి గ్రీష్మకాలమువలె వెన్నెలను సేవింపంజనదు.

◆ శరదృతువున వర్జ్యములు ◆

తుషారక్షారసౌహిత్యదధితైలవసాతపాన్. ౫౪
తీక్ష్ణమద్యదివాస్వప్నపురోవాతాన్ పరిత్యజేత్,

మంచు, యవక్షారము మొదలగు లవణములు, తృప్తి, పెరుగు, నువ్వులనూనె, వస (అనగా మాంసములోని క్రొవ్వు), ఎండ, తీక్ష్ణకరమైన ద్రవ్యములతో జేయబడిన మద్యములు, పగటినిద్ర, తూర్పుగాలి వీనిని శరత్కాలమునందు వర్జింపవలయును.

◆ షడృతువులలో షడ్రససేవనక్రమము ◆

శీతే వర్షాసు చాద్యాంస్త్రీన్ వసంతేఽంత్యాన్ రసాన్ భజేత్,
స్వాదుం నిదాఘే శరది స్వాదుతిక్తకషాయకాన్,

హేమంత శిశిర వర్షర్తువులయందు మధురామ్లలవణరసములను, వసంత ఋతువునందు తిక్తకటుకషాయరసములను, గ్రీష్మఋతువునందు మధురరసమును, శరదృతువునందు మధురతిక్తకషాయరసములను సేవింపవలయును.

◆ షడృతువులలో అన్నపానసేవనక్రమము ◆

శరద్వసంతయో రూక్షం శీతం ఘర్మఘనాంతయోః ౫౬
అన్నపానం సమాసేన విపరీతమతోఽన్యదా,

శరద్వసంతఋతువులయందు రూక్షకరములగు అన్నపానాదులను తఱచుగ సేవింపవలయును. హేమంత, శిశిర, గ్రీష్మ, వర్షఋతువులయందు స్నిగ్ధమైన యన్నపానాదులను సేవించవలయును. గ్రీష్మశరదృతువులయందు శీతలమైన అన్నపానాదులను సేవింపవలయును. హేమంత, శిశిర, వర్ష, వసంతఋతువులయందు ఉష్ణకరమైన అన్నపానాదులను సేవించవలయును.

◆ షడ్రససేవనక్రమము ◆

నిత్యం సర్వరసాభ్యాసస్స్వస్వాధిక్యమృతావృతౌ. ౫౭
"సర్వరసాభ్యాసో బలకారణమ్"

అనువచన ప్రకారము సర్వఋతువులయందు మధురాదిషడ్రసములను సేవింపవలయును. అయినను "శీతే వర్షాసు" ఇత్యాదిశ్లోకములలో జెప్పియుండు ప్రకారము ఆయా ఋతువులయందు సేవనార్హమని చెప్పబడిన రసములను విశేషముగా సేవింపవలయును.

◆ ఋతుసంధ్యాచరణము ◆

ఋత్వోరంత్యాదిసప్తాహావృతుసంధిరితి స్మృతః.

తత్ర పూర్వో విధిస్త్యాజ్యస్సేవనీయోఽపరః క్రమాత్. ౫౮
అసాత్మ్యజా హి రోగాస్స్యుస్సహసా త్యాగశీలనాత్.

శిశిరవసంతాది రెండు రెండు ఋతువులయొక్క కడపటి యేడు దినములు, రాబోద్యో ఋతువులయొక్క మొదటి యేడుదినములును జేరి పదునాల్గు దినములు ఋతుసంధియని పఱంగును. వానిలో ముందుండు ఋతువుయొక్క విధిని వర్జించి రాబోయ్యెడి ఋతువుయొక్క విధిని యథాక్రమముగ (అనగా ఆయాఋతువులో జెప్పియుండుప్రకారము) అనుసరింపవలయును. తక్షణముననే ఒక ఋతువుయొక్క విధిని వదలి మఱియొక్క విధిని అనుసరించినచో అనుచితపదార్థసేవవలన జనించునట్టి రోగములే గలుగును.

తృతీయాధ్యాయము ముగిసెను.



# చతుర్థాధ్యాయము



అవ. స్వస్థవృత్తుడుగ మలమూత్రాదివేగమును ధరింపని స్వభావముగలవాడుగ నుండుపురుషునికి ఆరోగ్యము గలుగును; కాబట్టి మలమూత్రవేగము నడ్డగించకుండు వానికి రోగము గలుగదని యీ యధ్యాయమునందు జెప్పబడుచున్నది.

## రోగానుత్పాదనీయాధ్యాయప్రారంభము

సూ. అథాతో రోగానుత్పాదనీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః

ఋతుచర్యాధ్యాయానంతరము రోగానుత్పాదనీయాధ్యాయమును (అనగా రోగోత్పత్తి కాకుండుటకు హితకరములగు విషయముల బోధించు నధ్యాయమును) వివరించెదము. "అనుత్పత్త్యై సమాసేన విధిరేష ప్రదర్శితః, నిజాగంతువికారాణాముత్పన్నానాం చ శాంతయే." అను వచనప్రకారము వాతాదుల నడ్డగించుటచే జనించు రోగములకు శాంతియు నీయధ్యాయమునందు చెప్పబడియుండుటవలన నిది రోగోపశమనీయాధ్యాయమనియు యుక్తిచే జెప్పబడును.

## వాతాదివేగధారణనిషేధము

వేగాన్న ధారయేద్వాతవిణ్మూత్రక్షవతృట్క్షుధాం,
నిద్రాకాసశ్రమశ్వాసజృంభాశ్రుచ్ఛర్దిరేతసామ్. ౧

అపానవాతము, మలము, మూత్రము, తుమ్ములు, దప్పి, ఆకలి, నిద్ర, దగ్గు, శ్రమమువలన గలిగెడి శ్వాసము, ఆవలింత, కంటినీరు, వాంతి, రేతస్సు వీనియొక్క వేగమును అడ్డగింపజనదు.

## వాతధారణమువలన జనించురోగములు

అధోవాతస్య రోధేన గుల్మోదావర్తరుక్క్లమాః,
వాతమూత్రశకృత్సంగదృష్ట్యగ్నివధహృద్గదాః. ౨

అపానవాతము నడ్డగించుటవలన గుల్మము, ఉదావర్తము, బడలిక, వాత మల మూత్రములయొక్క ప్రతిబంధకము, నేత్రములకు చెరుపు, అగ్నినాశము, రొమ్మునొప్పి మొదలగు రోగములు జనించును. అన్నిటిలోను వాతము ప్రధానంబగుటవలన దాని నడ్డగించుటచే జనించురోగములు తొలుత జెప్పబడినవి. ఉద్గారరూపముగల ఊర్ధ్వవాతము నడ్డగించుటచే జనించునట్టి అరుచి మొదలగు రోగములు సుఖసాధ్యం

బులు; కావున నవి తొలుత జెప్పబడవయ్యెను. ఉదావ_ర్తరోగలక్షణము అర్శోరోగ నిదానమునందు జెప్పబడును.

వాతప్రతిబంధ జనితరోగోపచారము

స్నేహస్వేదవిధ_స్తత్ర వ_ర్తయో భోజనాని చ,
పానాని వ_స్తయశ్చైవ శ_స్తం వాతానులోమనమ్. 3

అపానవాతము నడ్డగించుటచే జనించు రోగములయందు స్నేహవిధి, స్వేదవిధి, ఫలవర్తులు వాతహరపదార్థభోజనము, సుఖోష్ణోదకాది పానము, వ_స్తికర్మ, వాతమునకు అనులోమగతిని గలుగజేసెడి కృత్యములు మొదలగువానిని జేయవలయును.

మలరోధజనితరోగములు

శకృతః పిండికోద్వేష్టప్రతిశ్యాయశిరోరుజః,
ఊర్ధ్వవాయుః పరికర్తో హృదయస్యోపరోధనమ్. ౪
ముఖేన విట్ప్రవృత్తిశ్చ పూర్వోక్తాశ్చామయాః స్మృతాః,

మలము నడ్డగించుటవలన పిక్కలయందు శూల, పీనసము, శిరోరోగము, ఊర్ధ్వ వాతము, పరికర్తము, రొమ్ముపట్టుకొనుట, నోటివలన మలము నడలుట యీ మొదలగు రోగములును, అపానవాతము నడ్డగించుటచే జనించునట్టి గుల్మాది రోగములును గలుగును.

మూత్రరోధ జనితరోగములు

అంగభంగాశ్మరీవ_స్తిమేఢ్రవంక్షణవేదనాః.
మూత్రస్య రోధాత్పూర్వే చ ప్రాయో రోగాః

మూత్రము నడ్డగించుటచే శరీరమునందు బ్రద్దలుచేయునటుల వేదన, రోగము, పొత్తికడుపు, మేఢ్రము, గజ్జలు వీనియందు పోటు మొదలగు నుపద్రవ లును, అపానవాతము మలము వీని నడ్డగించుటచే జనించునట్టి రోగములును గలుగును.

తదౌషధం,

వ_ర్త్యభ్యంగావగాహాశ్చ స్వేదనం వ_స్తికర్మ చ

వాతాదుల నడ్డగించుటచే జనించురోగములయందు మ్రంగపండు మొదలగు వానిచే జేయబడిన ఫలవర్తులు, అభ్యంజనస్నానము, అవగాహము (అనగా వాతహర ద్రవ్యములచే సిద్ధముచేయబడినకషాయము నొకతొట్టిలో బోసి దానియందు గుదప్రదే శమునుంచుట,) స్వేదకర్మ, వ_స్తివిధ్యధ్యాయమునందు మలప్రవృత్తినిమిత్తమై జెప్పబడు వ_స్తికర్మ మొదలగు సామాన్యచికిత్సలను చేయవలయును.

మలరోధజరోగోపచారము

అన్నపానం చ విడ్భేది విడ్రోధోత్థేషు యక్ష్మసు,

మలము నడ్డగించుటచే జనించునట్టి రోగములయందు మలమును భేదించునట్టి కాటుమినుములు, పెఱుగుమీద మీగడ, చక్రవర్తికూర మొదలగువాని సేవనను, పైజెప్ప నవర్త్యాదిక్రియలను చేయవలయును.

మూత్రరోధజరోగోపచారము

మూత్రజేషు చ పానే చ ప్రాగ్భక్తం శస్యతే ఘృతమ్. ౭
జీర్ణాంతికం చోత్తమయా మాత్రయా యోజనాద్వయం,
అవపీడక మేతచ్చ సంజ్ఞితం

మూత్రము నడ్డగించుటచే జనించు రోగములయందు ప్రాగ్భక్తమను ఘృతపానమును (అనగా భోజనాత్పూర్వము పానముజేసెడి ఘృతమును,) జీర్ణాంతికమను ఘృతపానమును (అనగా ముందుదినము భుజించిన యన్నాదులు జీర్ణమైనతోడనే పానముజేసెడిఘృతమును) ఉత్తమమాత్రగా చేయవలయును. అటుల భోజనాత్పూర్వమును, ముందుదినము భుజించి యన్నము జీర్ణించినతోడనే చేయబడు ఘృతపానము ఈతంత్రమునందు అవపీడక మను పేరం బఱగును. "తతశ్చానేకథా ప్రాయః పవనో యత్ప్రకుప్యతి" అనెడి యీతంత్రవచనప్రకారము వాతాది వేగధారణముచేత తఱుచుగ వాతము ప్రకోపించును. అటుల ప్రకోపించిన వాతమును శమింపజేయుట యందు తైలమువలె ఘృతము ఉత్కృష్టమైనదికాదు. కాబట్టి మూత్రాదివేగరోధజనిత రోగములయందు ఘృతావపీడక ప్రయోగమును చెప్పినది అయుక్తమనే శంక గలుగును. అయితే తైలము వాతహరమైనదిగ నుండినను దానికి మలబంధ, అల్పమూత్రత్వ గుణములు గలిగియుండుటచే మూత్ర రోధజనితరోగములయందు ఘృతమువలె తైలావపీడక ప్రయోగము హితకరమైనది కాదు, అట్లగుటచేతనే ఘృతావపీడక ప్రయోగం బిచట జెప్పబడినది.

ఉద్గారరోధజరోగోపచారము

ధారణాత్పునః. ౮
ఉద్గారస్యారుచిః కంపో విబంధో హృదయోరసోః,
ఆధ్మానకాసహిధ్మాశ్చ హిధ్మావత్తత్ర భేషజమ్. ౯

త్రేనుపు నడ్డగించుటచే అరుచి, కంపము, హృదయము, రొమ్ము పట్టుకొనుట, ఆధ్మానము, కాసము, హిధ్మ (ఎక్కిళ్లు) యీరోగములు గలుగును. వీని నివారణార్థంబై

శ్వాస హిక్కా చికిత్సితాధ్యాయమునందు జెప్పియుండు హిక్కాచికిత్సలను జేయవల యును.

### క్షుతరోధజనితరోగములు

శిరోర్త్యింద్రియదౌర్బల్యం మన్యాస్తంభార్దితం క్షుతేః,

తుమ్ము నణచుటచే శిరోరోగము, నేత్రాదీంద్రియములకు దౌర్బల్యము (అనగా విషయగ్రహణమునం దశక్తి) పెడఛల పెద్దనరములయందు పట్టు, అర్దితవాతము గలుగును.

### క్షుతరోధజనితరోగోపచారము

తీక్ష్ణధూమాంజనాఘ్రాణనావనార్కవిలోకనైః		౧౦
ప్రవర్తయేత్క్షుతిం సక్తాం స్నేహస్వేదౌ చ శీలయేత్,

అడ్డగింపబడిన తుమ్మువెడలుటకై ధూమపాన విధ్యధ్యాయమునందు జెప్పి యుండెడు తీక్ష్ణమైన ధూమపానము, అంజనము, మిరియములు మొదలగు తీక్ష్ణమైన వస్తువుల నాఘ్రాణించుట, తీక్ష్ణమైన నస్యము, స్నేహకర్మ, స్వేదకర్మ, ఇవి మొద లగు వానిని చేయవలయును. "ప్రాణాపానౌ సమౌ స్యాతాం మూర్ధ్నిస్రోతః పథే స్థితౌ, నస్తఃప్రవర్తతే శబ్దః క్షుతం తత్ర వినిర్దిశేత్." శిరముయొక్క స్రోతో మార్గము నందుండు ప్రాణాపానవాయువులు సమముగ నుండునపుడు నాసికములోనుండి శబ్దము బయలువెడలును. అదియే క్షుతమనబడును, అనిసుశ్రుతమునందు జెప్పబడియున్నది.

### తృష్ణానిరోధజరోగములు, ఉపచారములు

శోషాంగసాదబాధిర్యసంమోహభ్రమహృద్గదాః.		౧౧
తృష్ణాయా నిగ్రహాత్తత్ర శీతస్సర్వో విధిర్హితః,

దప్పినడ్డగించుటచే శోష, శరీరకృశత్వము, చెవిటితనము, మూర్ఛ, భ్రమము, రొమ్మునొప్పి ఇవి మొదలగురోగములు గలుగును. వీనియందు శీతలమైన స్నానాన్న పానాదులను సేవించుట హితకరము.

### క్షుద్రోధజరోగములు వానియుపచారములు

అంగభంగారుచిగ్లాని కార్శ్యశూలభ్రమాః క్షుధః.		౧౨
తత్ర యోజ్యం లఘుస్నిగ్ధ ముష్ణమల్పం చ భోజనం,

ఆకలి నడ్డగించుటచే శరీరమునందు బ్రద్దలుచేయునటుల వేదన, అరుచి, బడలిక, కృశత్వము, పక్వాశయమునందు శూల, భ్రమము కలుగును. వీనియందు స్నిగ్ధముగ ఉష్ణముగ, లఘువుగనుండు నాహారములను మితముగ భుజింపవలయును.

## నిద్రారోధజరోగములు వానియుపచారము

నిద్రాయా మోహమూర్ధాక్షి గౌరవాలస్యజృంభికాః. ౧౩
అంగమర్దశ్చ తత్రేష్టస్స్వప్నస్సంవాహనాని చ,

నిద్ర నడ్డగించుటచే మోహము, తలబరువు, నేత్రశూల, సోమరితనము, ఆవలింతలు కలుగును. మఱియు,—"జాడ్యగ్లాని భ్రమాపక్తితంద్రారోగాశ్చ వాతజాః" అనగా జాడ్యము, గ్లాని, భ్రమము, అజీర్ణము, తంద్ర, వాతరోగములు ఇవియును గలుగునని అధికపాఠము గ్రంథాంతరములయందు గన్పట్టుచున్నది. వీనియందు శరీర మర్దనము, నిద్ర, శరీరమును పిసుకుట వీనిని చేయవలయును.

## కాసరోధజరోగములు వానియుపచారము

కాసస్య రోధాత్తద్వృద్ధిశ్శ్వాసారుచిహృదామయః. ౧౪
శోషో హిధ్మా చ కార్యోఽత్ర కాసహా సుతరాం విధిః,

దగ్గు నడ్డగించుటచే కాసవృద్ధి, శ్వాసము, అరుచి, రొమ్మునొప్పి, శోష, ఎక్కిళ్లును కలుగును. వీనియందు కాసచికిత్సాప్రకరణములో జెప్పియుండు చికిత్సలను విశేషముగా జేయవలయును.

## శ్రమశ్వాసరోధజరోగములు వానియుపచారములు

గుల్మహృద్రోగసంమోహాశ్శ్రమశ్వాసాద్విధారితాత్. ౧౫
హితం విశ్రమణం తత్ర వాతఘ్నశ్చ క్రియాక్రమః,

ఆయాసకరమైన పనులచే జనించినశ్వాసము నడ్డగించుటవలన గుల్మము, రొమ్మునొప్పి, మోహము కలుగును. వీనియందు అలసటను తీర్చికొనుట, వాతహరమైన చికిత్స లను జేయుట హితకరము.

## జృంభారోధజ రోగోపచారము

జృంభాయాః క్షువద్రోగాస్సర్వశ్చానిలజిద్విధిః. ౧౬

ఆవలింత నడ్డగించుటవలన తుమ్మునడ్డగించుటచే జనించునట్టి రోగములే కలుగును. వీనియందు వాతహరమైన సమస్తచికిత్సలను జేయవలయును.

## అశ్రురోధజరోగతదుపచారములు

పీనసాక్షిశిరోహృద్రుఙ్మన్యాస్తంభారుచిభ్రమాః,
సగుల్మాబాష్పతస్తత్ర స్వప్నో మద్యం ప్రియాః కథాః. ౧౭

శోకముచే జనించు కంటినీరు నడ్డగించుటవలన పీనసము, నేత్రరోగము, శిరోరోగము, రొమ్మునొప్పి, పెడతల పెద్దనరములయందు పట్లు, అరుచి, భ్రమము,

గుల్మము గలుగును. వీనియందు నిద్ర, మద్యపానము, ప్రియమైన సంభాషణము మొదలగువానిని చేయవలయును.

### వమనరోధజరోగములు

విసర్పకోఠకుష్ఠాక్షి కండూపాండ్వామయజ్వరాః,
సకాసశ్వాసహృల్లాసవ్యంగశ్వయథవో వమేః. ౧౮

వాంతి నడ్డగించుటచే విసర్పము, కోఠము, కుష్ఠము, కండ్లయందు దురద, పాండువు, కాసశ్వాసములు, హృల్లాసము, వ్యంగము, వాపును కలుగును.

### వమనరోధజ రోగోపచారములు

గండూషధూమానాహారా భుక్త్వా తదుద్వమః,
వ్యాయామస్స్రుతిరస్రస్య శస్తం చాత్ర విరేచనమ్. ౧౯
సక్షారలవణం తైల మభ్యంగార్థం చ శస్యతే,

వాంతినడ్డగించుటచే జనించు రోగములయందు గండూషము, ధూమపానము, ఆహారములేకుండుట, వేడిగానుండు వస్తువులను భుజించి వమనముచేయుట, వ్యాయామము, రక్తమోక్షణము, విరేచనము, క్షారలవణములతో గూడియుండు తైలముచే నభ్యంజనము మొదలగు చికిత్సలను జేయుట హితకరము.

### శుక్రరోధజ రోగము

శుక్రాత్తత్స్రవణం గుహ్యవేదనా శ్వయథుర్జ్వరః. ౨౦
హృద్వ్యథామూత్రసంగాంగభంగవృద్ధ్యశ్మషండతాః,

రేతస్సు నడ్డగించుటచే శుక్రస్రావము, ఆసనమునందు శూల, (వృషణములయందు శూల), ఆసనమునందు వాపు, జ్వరము, రొమ్మునొప్పి, మూత్రప్రతిబంధము, శరీరమునందు పోట్లు, ఆంత్రవృద్ధి, అశ్మరి, నపుంసకత్వము కలుగును.

### శుక్రరోధజ రోగోపచారము

తామ్రచూడసురాశాలివస్త్యభ్యంగావగాహనమ్.
వస్తిశుద్ధికరైస్సిద్ధం భజేత్క్షీరం ప్రియాః స్త్రియః,

రేతస్సు నడ్డగించుటచే జనించురోగములయందు కోడిమాంసభక్షణము, సుర యను మద్యమును త్రాగుట, శాల్యన్నము, వస్తికర్మ, అభ్యంగస్నానము, పొత్తికడుపును శుద్ధిజేసెడి కూశ్మాండాది వస్తువులతో సిద్ధము జేయబడిన క్షీరపానము, మంచి వయసున నుండు ప్రియురాండ్రతో రమించుట మొదలగు పనులు చేయవలయును.

### వర్జనీయవేగరోధులు

తృట్ఛూలార్తం త్యజేత్క్షీణం విడ్వమం వేగరోధినమ్. ౨౨

మలమూత్రముల నడ్డగించుటచే ద్దప్పి, శూల వీనిచే పీడితుడు, అంగములు శుష్కించినవాడు, నోటివలన మలమును గ్రక్కువాడు నగురోగిని చికిత్సలయందు వర్జింపవలయును.

సర్వరోగోత్పత్తికారణము

రోగాస్సర్వేఽపి జాయంతే వేగోదీరణధారణైః,

మలమూత్రాదులు సాధారణముగ వెడలకుండునపుడు బలవంతముగా వెడలింప జేయుట, ధారాళముగ వచ్చునపుడు అడ్డగించుట, వీనిచే మనుజులకు సకల రోగములు జనించును.

"శాఖాగతాః కోష్ఠగతాశ్చరోగా మర్మోర్ధ్వ సర్వావయవాంగజాశ్చ, యేసంతి తేషాంనతు కశ్చిదన్యో వాయోః పరం జన్మని హేతురస్తి, విట్ శ్లేష్మ పిత్తాది మలాయసానాం విక్షేపసంహారకరస్స యస్మాత్."

అను వచనముల ప్రకారము మలాదులను వెడలింపజేయుట, లేక అడ్డగించుట, అను నీరెండును వాతకృత్యము, కాబట్టిమలమూత్రాదులను బలవంతముగ వెలిపుచ్చుటచేతను, లేక యడ్డగించుటచేతను వాతము ప్రకోపించి సమస్తరోగములను గలుగజేయును.

వాతప్రకోపశమనోపాయము

నిర్దిష్టం సాధనం తత్ర భూయిష్ఠం యే తు తాన్ ప్రతి. ౨౩
తతశ్చానేకధా ప్రాయః పవనో యత్ప్రకుప్యతి,
అన్నపానౌషధం తత్ర యుంజీతాతోఽనులోమనమ్. ౨౪

మలమూత్రాదుల నడ్డగించుటచే జనించునట్టి సర్వరోగములయందును గుల్మోదారోగములకు తఱుచుగ వర్త్యభ్యంగాదిచికిత్సలు ఈ యధ్యాయారంభమునందే యున్నవి. అయినను ముఖ్యముగ మలమూత్రాదుల నడ్డగించుటచే వాతము ప్రకోపించి యనేకరోగములను గలుగజేయును, కావున వాతప్రకోపమును శమింపజేసి వాతమునకు అనులోమగతిని గలుగజేసెడు అన్నపానౌషధములను సేవింపవలయును. మలమూత్రాదులను బలాత్కారముగ వెలిపరచుట, అడ్డగించుట వీనిచే సమస్తరోగములు జనించునని చెప్పబడియుండినను మలమూత్రాదుల నడ్డగించుటచే నెటువంటి కఠినమైన రోగములు జనించునో అటువంటిరోగములు వానిని వెలిపరచుటవలన గలుగనేరవు, కాబట్టి యీతంత్రకారుడు వానికి విశేషముగా చికిత్సలను జెప్పక విరమించెను.

లోభాదివేగ ధారణము

ధారయేత్తుసదా వేగాన్ హితైషీ ప్రేత్య చేహ చ,
లోభేర్ష్యాద్వేషమాత్సర్యరాగాదీనాం జితేంద్రియః. ౨౫

ఇహపరలోకములయందు హితమును గోరునట్టిపురుషుడు మనస్సు, చక్షుస్సు మొదలగు నింద్రియములను జయించి లోభాసూయాద్వేషమాత్సర్యరాగాదుల వేగము నెల్లపుడు నడ్డగింపవలయును. మాత్సర్యము అనగా పరులగుణమును సహింపకుండుట, రాగాదులు అనగా ప్రీతి మొదలగునవి.

## వాతాదిశోధనము

యతేత చ యథాకాలం మలానాంశోధనం ప్రతి,
అత్యర్థసంచితాస్తే హి క్రుద్ధాః స్యుర్జీవితచ్ఛిదః. ౨౭

వాత, పిత్త, శ్లేష్మ, పురీష, మూత్రాదిమలములు స్వస్థానమునందు విశేషముగ వృద్ధిజెందియుండినయెడల అవి మిథ్యాహారవిహారాదులవలన ప్రకోపించి ఒకానొక సమయమునందు మనుజుని చంపును. కావున నట్టి మలమూత్రాదులను యుక్తకాలమునందు (అనగా ఆయామలములకు అర్హమైన శోధనకాలమునందు) శోధించుటకై ప్రయత్నింపవలయును. మలములు అధికముగ వృద్ధిజెందియుండునపుడు చికిత్సలన్నిటి కంటె శోధనరూపమైన చికిత్సయే ఉత్కృష్టమైనదని తెలియపరచుటకై "అత్యర్థ సంచితాః" అనుపదము ప్రయోగింపబడినది.

## శోధనప్రాశస్త్యము

దోషాః కదాచిత్కుప్యంతి జితా లంఘనపాచనైః,
యే తు సంశోధనైశ్శుద్ధా న తేషాం పునరుద్భవః. ౨౮

లంఘనపాచనాదులచే శుద్ధిచేయబడినవాతాదులు మరల నొకానొకప్పుడు ప్రకోపమును జెందును. వమనము, విరేచనము మున్నగు శోధనచికిత్సలచే శుద్ధి చేయ బడిన వాతాదులెపుడును ప్రకోపమును జెందకుండును. కాబట్టి లంఘనాదులకంటె శోధనలనే చేయవలయును.

## రసాయనప్రయోగక్రమము

యథాక్రమం యథాయోగమత ఊర్ధ్వం ప్రయోజయేత్,
రసాయనాని సిద్ధాని వృష్యయోగాంశ్చ కాలవిత్. ౨౯

కాలము, దేశము, బలము, శరీరము, ఆహారము, సాత్మ్యము, సత్వము, ప్రకృతులు ఇవి మొదలగువానిని జక్కగ నెఱిగినవైద్యుడు తనకనుభవసిద్ధమైన బ్రాహ్మావాసిష్ఠాదిరసాయనములను యథాక్రమముగను (అనగా "హరీతకీమామలకం సైంధవం నాగరంపచామ్." అనువచనము మొదలుకొని "ఇత్థం సంశుద్ధకోష్ఠస్య రసాయనముపాచరేత్." అను వచనమువరకు జెప్పియుండు ప్రకారము వమన, విరేచన, ఆస్థాపన, అనువాసనము, నావన

రూపమైన పంచవిధక్రియలవలన ఊర్ధ్వాధస్సకలశరీరమును శుద్ధిజేసి) వాజీకరణౌషధములను యథాక్రమముగను (అనగా —

“అథశ్చస్నిగ్ధవిశుద్ధానాం నిరూహాన్ సానువాసనాన్, ఘృతతైలరసక్షీరశర్కరాక్షౌద్రసంయుతాన్, యోగవిద్యోజయేత్పూర్వం క్షీరమాంసరసాశినామ్, తతో వాజీకరాన్యోగాన్.”

అను వచనప్రకారము స్నేహ, శోధన, నిరూహ, అనువాసనాదిక్రియలచే శుద్ధిజేసికొని) యథాయోగముగను (అనగా వాతప్రకృతిగలవారికి ఫలానిరసాయనము పిత్తప్రకృతిగలవారికి ఫలానిరసాయనము, శ్లేష్మప్రకృతిగలవారికి ఫలానిరసాయనము ఇట్టికాలము. ఇట్టిదేశము, ఇట్టివయస్సు, ఇట్టిదేహమునందు ఫలానిరసాయనము యుక్తమని తెలిసికొని) ఉపయోగింపవలయును. ఇటులనే వాతప్రకృతి మొదలగువాని నెఱింగి వాజీకరణౌషధముల నుపయోగింపవలయును. రసాయనప్రయోగమునందు ఇచట వాతాతపిక మను రసాయనమునే యుపయోగింపవలయునుకాని స్వస్థశరీరుల కుపయోగించునట్టి కుటీప్రావేశక రసాయనముల నుపయోగింపంజనదు.

### శరీరబృంహణోపచారము

భేషజక్షపితే పథ్యమాహారైర్బృంహణం క్రమాత్,
శాలిషష్టికగోధూమముద్గమాంసఘృతాదిభిః.
హృద్యదీపనభైషజ్యసంయోగాద్రుచిపక్తిదైః,
సాభ్యంగోద్వర్తనస్నాననిరూహస్నేహవస్తిభిః. ౩౦

శోధనౌషధములచే శుద్ధిచేయబడిన శరీరముగల రోగికి అభ్యంజనము, ఉద్వర్తనము, స్నానము, నిరూహవస్తి, అనువాసనవస్తి యీ మొదలగు వానిని చేయించి మనోహరములును, దీపనకరద్రవ్యములునైన శొంఠి, పిప్పలి, అల్లము, లవంగములు, ఏలకులు మొదలగువానిసంయోగముచే రుచిని, జీర్ణమును గలుగజేయునట్టి పథ్యకరమైన శాలిధాన్యము, షష్టికము, గోధుమలు, పెసలు, మాంసము, నెయ్యి మొదలగు బలకరమైన యాహారములచే యథాక్రమముగ శరీరపుష్టిని గలుగజేయవలయును.

### శోధనాద్యౌషధసేవనఫలము

తథా స లభతే శర్మ సర్వపావకపాటవం,
ధీవర్ణేంద్రియవైమల్యం వృషతాం దైర్ఘ్యమాయుషః. ౩౧

ఇటులశోధన, బృంహణ, రసాయనౌషధములను యథాక్రమముగ సేవించియుండు పురుషునికి సౌఖ్యము, అన్నివిధములైనయగ్నుల పాటవము (అనగా భౌమ, ఆగ్నేయ, వాయువ్య నాభసములను పంచమహాభూతాగ్నులు, రసమజ్జాది సప్త

వాక్వాగ్నులు, జారరాగ్ని అను నీ పదమూడగ్నులకు పుష్టిత్వము) బుద్ధి, కాంతి, చక్షు రాదీంద్రియములయందు ప్రసన్నత, స్త్రీసంభోగమునందు సామర్థ్యము దీర్ఘాయువు గలుగును.

### ఆగంతుకరోగములు

యే భూతవిషవాయ్వగ్ని క్షతభంగాదిసంభవాః,
*కామక్రోధభయాద్యాశ్చ తే స్యురాగంతవో గదాః. 3౨

భూతములు, విషము, వాయువు, అగ్ని, గాయము, అవయవములు విరుగుట మొదలగువానివలన గలిగిన జ్వరాదిరోగములును, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యభయాదులును ఆగంతుకరోగము లనబడును.

### నిజాగంతుకరోగశమనోపాయము

త్యాగః ప్రజ్ఞాపరాధానామింద్రియోపశమః స్మృతిః,
దేశకాలాత్మవిజ్ఞానం సద్వృత్తస్యానువర్తనమ్. 33
అనుత్పత్త్యై సమాసేన విధిరేష ప్రదర్శితః,
నిజాగంతువికారాణా ముత్పన్నానాం చ శాంతయే. 3౮

నిజాగంతుకరోగములకు బుద్ధిపూర్వకముగా చెడునడతలను విడుచుట, మనస్సు మొదలగు నింద్రియములను జయించుట, (అనగా రూపాదివిషయములయందును, అయుక్తమైన విషయములయందును ప్రవర్తింపనీయక యడ్డగించుట), అనుభూత పదార్థజ్ఞానము, జాంగలాదిదేశజ్ఞానము, శీతాదికాలజ్ఞానము, వాతప్రకృత్యాదిజ్ఞానము, వృద్ధాచారానుష్ఠానము ఇవియే చికిత్సలుగ నుండును. నిజాగంతుకరోగములు జనింపకుండుటకును, ఉత్పన్నమైన నిజాగంతుకరోగములు శమించుటకును ఇటుల సంక్షేప చికిత్సలు చెప్పబడినవి.

### వాతాదిదోషశోధనకాలము

శీతోద్భవం దోషచయం వసంతే విశోధయన్ గ్రీష్మజమభ్రకాలే,
ఘనాత్యయే వార్షికమాశుసమ్యక్ ప్రాప్నోతిరోగానృతుజాన్న జాతు.

హేమంత శిశిరఋతువులయందు జనించినదోషములను వసంతఋతువుయొక్క ప్రారంభమునందే (అనగా చైత్రమాసమునందే) శోధించవలయును. అటులుచేయనియెడల ననేకరోగములు గలుగును. గ్రీష్మఋతువునందు జనించినదోషములను వర్షాకాల ప్రారంభమునందు శోధింపవలయును. వర్షాకాలమునందు జనించినదోషములను శరత్కాలముయొక్క అంతమునందు (అనగా కార్తికమాసమునందు) శోధింపవలయును. ఇటుల

* రాగద్వేష ఇతి పాఠాంతరమ్.

నాయాఋతువులయందు జనించినదోషముల నాయాకాలములందు తప్పక బాగుగ శుద్ధిజేసికొనిన పురుషుడు ఆయా ఋతుసంబంధమువలన జనించురోగముల నెప్పుడుఁ బొందకుండును.

"శ్రావణే కార్తికే చైత్రే మాసి సాధారణే క్రమాత్,
గ్రీష్మవర్షాహిమచితాన్వాయ్వాదీనాశు నిర్హరేత్."

అను ప్రమాణమునుబట్టి గ్రీష్మ, వర్ష, హేమంత, శిశిరఋతువులయందు వృద్ధిజెందిన వాతాదిదోషములను శ్రావణ, కార్తిక, చైత్రమాసములయందు క్రమముగ నాయా కాలమును తప్పక శుద్ధిజేయవలయును.

### హితాహారాదిసేవనఫలము

నిత్యం హితాహారవిహారసేవీ సమీక్ష్యకారీ విషయేష్వసక్తః,
దాతా సమస్సత్యపరః క్షమావానాప్తోపసేవీ చ భవత్యరోగః. ౩౬

ఎల్లప్పుడు హితాహారవిహారముల చేయునట్టి స్వభావముగలవాడును, గుణాగుణముల నాలోచించి కార్యములను చేయువాడును, శబ్దాదివిషయములయందు విశేషముగ నాసక్తిలేనివాడును, శక్త్యనుసారముగా దానము చేయువాడును, సర్వభూతములయందు సమానచిత్తముగలవాడును, సత్యవచనప్రవర్తకుడును, మిగుల నోర్పుగలవాడును,—

"యేషాం త్రికాలమమలం జ్ఞానమవ్యాహతం సదా,
ఆప్తాశ్శిష్టాశ్చ విబుధాస్తేషాం వాక్యమసంశయమ్."

అను ప్రమాణమునుబట్టి ఆప్తులైన పెద్దలను సేవించునట్టి స్వభావముగలవాడును నగు పురుషున కెట్టిరోగములును గలుగకుండును.

"అర్థేష్వలభ్యేష్వకృతప్రయత్నం కృతాదరం నిత్యముపాయవత్సు, జితేన్ద్రియం నానుపతంతి రోగాస్తత్కాలయుక్తం యదినాస్తిదైవమ్. 'కాలో ఉపపన్నో విషయో మనోజ్ఞో ధర్మ్యాః క్రియాః కర్మసుఖానుబంధి, సత్వం విధేయం విశదా చ బుద్ధిర్భవంతి ధీరస్య సదా సుఖాయ."

తనకు లభింపని వస్తువులనుగురించి ప్రయత్నముచేయనివాడు, ప్రయోజనముగలకార్యములయందు సదా సక్తిగలవాడు, ఇంద్రియములను నిగ్రహించినవాడు నగు పురుషునికి దైవము అనుకూలముగనుండునపుడు రోగములు గలుగ నేరవు. మఱియు అనుకూలమైన కాలము, మనోహరమైనవిషయములు, ధర్మముతోఁగూడియుండు క్రియలు, సుఖమును గలుగజేయదగిన వ్యాపారములు, సత్వగుణము, నిర్మలమైనబుద్ధి ఇవి యెప్పుడును బుద్ధిమంతులకు సుఖమును గలుగజేయును అని అష్టాంగసంహితయందు జెప్పబడియున్నది.

## చతుర్థాధ్యాయము ముగిసెను.

# పంచమాధ్యాయము

అవ. క్రిందియధ్యాయమునందు "నిత్యం హితాహారవిహారసేవీ" అనువచనము చేత ప్రతిదినము హితాహారవిహారసేవనము చేయుచుండవలయునని చెప్పబడియున్నది. ఐననట్టి హితాహారవిహారనియమములు దినచర్య, ఋతుచర్య అను నీ రెండధ్యాయములయందు "గురుశీతదివాస్వప్నస్నిగ్ధామ్లమధురాంస్త్యజేత్. తథా. వ్యక్తామ్ల లవణస్నేహం సంశుష్కం క్షౌద్రవల్లఘు, అన్నపానంచ విడ్భేది" అనువచనములచేత గురుశీతాది పదార్థములను త్యజింపవలయు ననియును, అధికముగ ఆమ్లలవణరసాదులను, మలమును భేదింపతగిన యన్నపానములను సేవింపవలయు ననియును జెప్పబడియున్నదే కాని ఫలానివస్తువు గురుత్వము, శీతలము, లఘుత్వము, స్నిగ్ధోష్ణత్వము, మలభేదక గుణము గలది యని జెప్పబడియుండలేదు. మఱియును, వస్తువులయొక్క గుణాగుణజ్ఞానములేనియెడల దినచర్య, ఋతుచర్యాధ్యాయములయందు జెప్పబడియుండు నియమముల ననుష్ఠించుటకు సాధ్యము కాకుండును. కాబట్టి హితాహారవిహారసేవనాదులకు వస్తుస్వరూపజ్ఞాన మావశ్యకము. అట్లగుటచే నీయధ్యాయమునందు వస్తుగుణములు జెప్పబడుచున్నవి. ఆవస్తువులలో ద్రవద్రవ్యములు పంచవర్గస్వభావము గలవిగ నుండుటవలనను, వానినిగురించి చెప్పవలసినవిషయము స్వల్పముగ నుండుటవలనను, తొలుత ద్రవద్రవ్యవిజ్ఞానీయాధ్యాయము ప్రారంభింపబడుచున్నది.

## ద్రవద్రవ్యవిజ్ఞానీయాధ్యాయప్రారంభము

సూ. అథాతో ద్రవద్రవ్యవిజ్ఞానీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

రోగానుత్పాదనీయాధ్యాయానంతరము ద్రవద్రవ్యములయొక్క స్వరూపమును తెలిసికొనుటకు హితకరమైన ద్రవద్రవ్యవిజ్ఞానీయాధ్యాయమును వివరించెదము. ద్రవముగనుండుట జలమునకే స్వభావమైన గుణము. కాబట్టి ద్రవస్వరూపముగ నుండు క్షీరదధ్యాదులన్నియు జలసంబంధముగలవి యని తెలియపరచుటకై ద్రవద్రవ్యమని చెప్పబడినది.

## ఆకాశోదకగుణము

జీవనం తర్పణం హృద్యం హ్లాది బుద్ధిప్రబోధనం,

తన్వవ్యక్తరసం మృష్టం శీతం లఘ్వమృతోపమమ్. ౧
గంగాంబునభసో భ్రష్టం స్పృష్టం త్వర్కేందుమారుతైః,
హితాహితత్వే తద్భూయో దేశకాలావపేక్షతే. ౨

ఆకాశోదకము జీవనకారి (అనగా బలవృద్ధికరమైనది). "జీవనం" అనుపదమునకు సౌమ్యధాతువులను వృద్ధిజేయునది యని కొందరు వ్యాఖ్యానము చేయుచున్నారు. అది బడలికను పోగొట్టును హృదయమునకు మేలుజేయును. ఆహ్లాదకరమైనది. బుద్ధికి వికాసము గలుగజేయును. స్వచ్ఛముగ నుండును. మనఃప్రీతికరమైనది. అస్పష్టమైన షడ్రసములుగలది. ఐన నది,

"శ్వేతే కషాయం తత్స్వాదు కృష్ణే తిక్తం చ పాండురే."

అనెడి అష్టాంగసంగ్రహవచనప్రమాణముచొప్పున భూభేదసంబంధమువలన కషాయమధురతిక్తాదిరసములు గలదై యుండును. శీతమైన వీర్యము, స్పర్శముగలది, లఘువుగ నుండును. అమృతముతో తుల్యమైనది. అనగా—

"సూర్యేందువాతప్రయుక్తత్వాల్లఘువాతకఫాపహం,
శైత్యజీవనసౌమ్యత్వైః పిత్తరక్తవిషార్తిజిత్."

అమృతమువలెనే త్రిదోషములను బోకడచి ధాతువులకు సమత్వమును గలుగజేసి విషబాధ హరింపజేయునని భావము. భూమిపై బడుటకుముందే వస్త్రాదులచే గ్రహింపబడునది గాంగోదక మనబడును. అది చంద్రసూర్యవాతసంబంధముగలదై పథ్యాపథ్యములయందు దేశకాలముల నపేక్షించుచుండును. అనగా నీయుదకము అనూపదేశములో వర్షించినదా, లేక జాంగలదేశములో వర్షించినదా, లేక తెల్లనిభూమిలో వర్షించినదా, లేక నలుపు మొదలైనరంగుకల భూమిలో వర్షించినదా అని దేశభేదమును, శీతకాలమున వర్షించినదా, లేక ఉష్ణకాలమున వర్షించినదా, లేక వర్షకాలమున వర్షించినదా, అను కాలభేదమును యోచించి పథ్యాపథ్యములను తెలిసికొనవలయునని భావము. సూర్యచంద్రవాతములు అను నీమూటియొక్క సంబంధముగల ఉదకమే దేశకాలముల ననుసరించి పథ్యాపథ్యంబులుగ నుండునని తెలియజేయుటకై "అర్కేందుమారుతైః" అనుపదము పైశ్లోకమునందు ప్రయోగింపబడినది.

"అన్నపానేషు సలిలమేవశ్రేష్ఠం సర్వరసయోనిత్వాత్ సర్వభూతసాత్మ్యాత్ జీవనాదిగుణయోగాచ్చ. తథా పానీయం ప్రాణినాం ప్రాణాఃశ్వమేవహి తన్మయమ్."

అనెడి అష్టాంగసంగ్రహప్రమాణమునుబట్టి అన్నపానాదులలో నుదకమే శ్రేష్ఠముగ నుండును. దానంజేసియే ఉదకము తొలుత జెప్పబడినది. వానిలో నాకాశోదకము మిగుల శ్రేష్ఠంబగుటవలన తొలుదొలుత దానిగుణమే చెప్పబడినది,

### గాంగోదకలక్షణము

యేనాభివృష్టమమలం శాల్యన్నం రాజతస్థితం,
అక్లిన్నమవివర్ణం చ తత్పేయం గాంగ

రజతపాత్రలో శాల్యన్నము నునిచి దానిపైన యేవర్షోదకమును బోసినయెడల వివర్ణముగాక చెడకయుండునో అదిగాంగోదకమని తెలియవలయును. అట్టిగాంగోదకము స్నానపానములయందు పథ్యకరంబు.

### సాముద్రోదకలక్షణము

మన్యథా. 3

సాముద్రం తన్న పాతవ్యం మాసాదాశ్వయుజాద్వినా,

ఏయుదకసంబంధమువలన రజతపాత్రయందుంచబడిన శాల్యన్నము వివర్ణమై చెడిపోవునో అట్టిదానిని సాముద్రోదక మని తెలియవలయును. దాని నాశ్వయుజ మాసమునందు తప్ప నితరమాసములయందు స్నానపానముల కుపయోగించికొనంజనదు. అది ఆశ్వయుజమాసమునందు మాత్రము కాలస్వభావమువలన పథ్యకరముగ నగును. మఱియును

" గాంగమాశ్వయుజే మాసి ప్రాయో వర్షతి మాధవః, తదుపాదదీత "

అనువచనముచేత గాంగోదకము ఆశ్వయుజమాసమునందు పథ్యకారి యని సుశ్రుతాచార్యుడును జెప్పియున్నాడు.

### పానమునకు యోగ్యమైన జలము

ఐంద్రమంబు సుపాత్రస్థమవిపన్నం సదా పిబేత్.
తదభావే చ భూయిష్ఠమాంతరిక్షానుకారి యత్,
శుచిపృథ్వసితశ్వేత దేశేఽర్కపవనాహతమ్

రజతము మొదలగు మంచిపాత్రలయం దుంచబడినదియును, దోషములేనిదియు నైన ఆకాశోదకమును సర్వదా పానము చేయవలయును. ఆకాశోదకము దొరకనిచో నైర్మల్యాదిగుణములవలన తరుచుగ నాకాశోదకమునకు సమానంబైనదియును పరిశుద్ధము కారిన్యము నలుపు తెలుపు మొదలగు ప్రదేశములయందుండునదియును, సర్వత్ర సూర్యచంద్రకిరణవాతసంబంధముగలదియు నైనయుదకమును పానముచేయవలయును. ఇది అంతరిక్షోదకమునకు సమానమైన గుణముగలదై యుండును.

' ఖాతధౌతశిలాపృష్ఠవస్త్రాదిభ్యశ్చ్యుతం జలమ్ "

త్రవ్వబడిన పల్లమునందలి జలమును, నిర్మలమైన రాతిప్రదేశమునందలి జలమును, నిర్మల

మైనవస్త్రముచే గ్రహింపబడినజలమును పానముచేయందగునని అష్టాంగసంహితయందు జెప్పబడియున్నది.

పానానర్హమైన యుదకము

న పిబేత్పంకశైవాలతృణపర్ణావిలాస్తృతం,
సూర్యేందుపవనాదృష్టమభివృష్టం ఘనం గురు. ౬
ఫేనిలం జంతుమత్తప్తం దంతగ్రాహ్యాతిశైత్యతః,

బురద, నాచి, గడ్డి, ఆకులు, మొదలగువానిచే గప్పబడి కలకబారి సూర్య చంద్రకిరణవాతసంబంధము లేనిదియును, తత్క్షణమున వర్షించినదియును, నైర్మల్యము జెందకుండునదియును, గురుత్వముగలదియును, నురుగుతో గూడినదియును, పురుగులు మొదలగువానిచే వ్యాప్తంబైనదియును నైనజలమును పానముచేయంజనదు.

"వార్షికం తదహర్వృష్టం భూమిస్థమహితం జలం,
వృష్టం త్రిరాత్రం తచ్చైవ ప్రసన్న మమృతోపమ్."

అనగా అపుడే వర్షించి భూసంబంధమును జెందినయుదకము అహిత మనియును, వర్షించి మూడు దినములైన పిదపనిర్మలమైన యుదకము అమృతతుల్యమైనదనియును ఖరనాద మను గ్రంథమునందు జెప్పబడియున్నది.

పానాయోగ్యదివ్యోదకము

అనార్తవం చ యద్దివ్య మార్తవం ప్రధమం చ యత్. ౭
లూతాదితంతువిణ్మూత్రవిషసంశ్లేషదూషితం,

వర్షఋతువుతప్ప సితరమైనఋతువునందు వర్షించిన దివ్యోదకమును పానమే యంజనదు. దివ్యోదకము వర్షాకాలమునందు వర్షించినదైనను మొదట నది సాలె పురుగు మొదలగుజంతువులయొక్క తంతువులు, మలమూత్రములు, విషము, వీని సంబంధముచే దూషింపబడియుండును; కాబట్టి దానిని పానముచేయంజనదు. వర్షాకాలమునందు తొలుత వర్షించినజలమును, లూతాతంతాద్వదులచే దూషింపబడినజలమును పానము చేయకూడదని కొందరు వ్యాఖ్యానము చేయుచున్నారు.

"ఘనవస్త్రపరిస్రావైః క్షుద్రజంత్వభిరక్షణం,
వ్యాపన్నస్యాస్యతపనమగ్న్యర్కాయసపిండకైః.
పర్ణీమూలబిసగ్రంధియుక్తాకతకశైవలైః,
వస్త్రగోమేదకాభ్యాం వా కారయేత్తత్ప్రసాదనమ్.
పాటలా కరవీరాదికుసుమైర్గంధనాశనమ్."

అను వచనములచేత బురద, ప్రాచి, గడ్డి, ఆకులు, లూతాతంత్వాదివిషము మొదలగు వానిచే దూషింపబడి దుర్గంధముతో గూడియుండుజలమును మిగుల దళసైన మురికి లేకుండు వస్త్రముచే వడియగట్టి అగ్ని, సూర్యుడు, బాగుగ కాలిన ఇనుపగుండు వీనిచే తపింపజేసి దానిలో మోదుగువేరు, తామరగడ్డలు, చిల్లగింజ, నాచు, గోమేదకము మొదలగువానిని వేసి తేరనిచ్చి పాదిరిపువ్వు, వాడగన్నేరు మొదలగు పుష్పములచే దుర్గంధమును పోకడచి పానము చేయందగునని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడి యున్నది.

## నదీజలగుణము

పశ్చిమోదధిగాశ్శీఘ్రవహా యాశ్చామలోదకాః. ౮
పథ్యాస్సమాసాత్తా నద్యో విపరీతాస్త్వతోఽన్యథా,

పశ్చిమసముద్రమున జేరునవియును, శీఘ్రముగ ప్రవహించునవియును, నిర్మలమైన యుదకము గలిగియుండునవియునైన నదులు సంక్షేపముగా పథ్యకరంబులు. ఈ నదులకంటె విపరీతలక్షణములు గలవి అపథ్యకరంబులు.

## హిమవన్మలయజనదీజలగుణాగుణములు

ఉపలాస్ఫాలనాక్షేపవిచ్ఛేదైః ఖేదితోదకాః. ౯
హిమవన్మలయోద్భూతాః పథ్యాస్తా ఏవ చ స్థిరాః,
కృమిశ్లీపదహృత్కంఠశిరోరోగాన్ ప్రకుర్వతే ౧౦

హిమవత్పర్వతము, మలయపర్వతము వీనియందు జనించినదియును, రాళ్లపైబడుటచే కలకబారి తేటనుజెంది వేగముగ ప్రవహించుచుండునదియునైన నదీజలము పథ్యకరంబు. హిమవత్పర్వతమున జనించి యచటనే స్థిరముగ నిలిచియుండు జలము కృమిరోగము, శ్లీపదము, రొమ్మునొప్పి, కంఠరోగము, శిరోరోగము వీనిని కలుగజేయును. మఱియు హిమవత్పర్వతమున జనించినజలమంతయు పథ్యకరమని చరకాచార్యుడు చెప్పియున్నాడు. అయితే హిమవత్పర్వతమున జనించినజలము అపథ్యకరమని కృష్ణాత్రేయుడును, సుశ్రుతాచార్యుడును జెప్పియున్నారు. దానంజేసి రాళ్లపైబడి వేగముగ ప్రవహించు హిమాలయజలము పథ్యకరమనియు, ప్రవహింపక యచటనే స్థిరముగ నిలిచియుండు జలము అపథ్యకరమనియు వాగ్భటాచార్యుడు విభజించి పైగ్రంథకర్తలమతమును సంగ్రహించియున్నాడు.

## వర్జనీయనదీజలము

ప్రాచ్యావంత్యాపరాంతోత్థా దుర్నామాని మహేంద్రజాః,

ఉదరశ్లీపదాతంకాః సహ్యవింధ్యోద్భవాః పునః. ౧౧
కుష్ఠపాండుశిరోరోగాః దోషఘ్న్యః పారియాత్రజాః,
బలపౌరుషకారిణ్యస్సాగరాంభస్త్రిదోషకృత్. ౧౨

గౌడము, మాలవము, కొంకణము అను నీదేశములయందును, మహేంద్రపర్వతమునందును జనించిననదులజలము ఉదరరోగము, శ్లీపదము, దుర్నామరోగము వీనిని గలుగజేయును. సహ్య, వింధ్య పర్వతములయందు జనించిన నదులజలము కుష్ఠరోగము, పాండువు, శిరోరోగము వీనిని గలుగజేయును. పారియాత్ర పర్వతములయందు జనించిన నదీజలము త్రిదోషములను బోగొట్టును. మఱియు బలమును, పుంస్త్వమును గలుగజేయును. సముద్రోదకము త్రిదోషములను జేయును.

కూపాదిజలగుణము

విద్యాత్కూపతటాకాదీన్ జాంగలానూపశైలతః,

కూపము (అనగా నుయ్యి), తటాకము (అనగా చెరువు), చౌండ్యము, సారసము (అనగా తామరకొలను, ప్రాస్రవణము (అనగా సెలయేఱు), కౌద్భిదము, వాపి (అనగా పెద్దకొనేరు, లేక నడబావి), నాదేయము, అను మూడువిధములైన కూపతటాకాదులయందలి జలగుణములు జాంగలదేశము, అనూపదేశము, పర్వతప్రదేశము మొదలగుస్థానభేదముల ననుసరించి తెలిసికొనవలయును.

"ధన్వానూపమహీధ్రాణాం సామీప్యాద్గురులాఘవమ్".

జాంగలదేశములో జనించిన కూపాదిజలమునకు బహుజలసంబంధము లేకుండుటచే లఘువుగ నుండును. అనూపదేశములో జనించిన కూపాదిజలమునకు అధికోదక సంబంధము గలిగియుండుటచే గురువుగ నుండును పర్వతములో జనించిన జలమునకు స్వల్పోదకసంబంధము గలిగియుండుటచే మిగుల లఘువుగ నుండును. అని అష్టాంగసంగ్రహము నందు జెప్పబడియున్నది.

"భూమ్యుత్ఖాతసముద్భూతమింద్రనీలసమప్రభం,
విమలం మధురాస్వాదం కౌపం జలముదాహృతమ్.
నద్యాశ్శైలవగాద్వాపి స్రుతమేకాంతసంస్థితం,
కుముదాంభోజసంఛన్నం వారి సారసముచ్యతే.
ప్రశస్తభూమిభాగస్థం నైకసంవత్సరోషితం,
కషాయమధురాస్వాదం తాటాకం సలిలం స్మృతమ్.
స్వయం శీర్ణశిలాశ్వభ్రో నీలోత్పలనిభం జలం,

లతావితానసంఛన్నం బుద్ధైశ్చాండేయముచ్యతే.
శైలసానుసముద్భూతం స్పృష్టం వాతహిమాతపైః,
లఘుశీతామలం స్వాదు స్మృతం ప్రాస్రవణం జలమ్.
విదార్యభూమియుద్భూతం మహత్యా ధారయా స్రవత్,
యజ్జలం వేదితవ్యం తదౌద్భిదం స్వాదు శీతలమ్.
పాషాణై రిష్టకాభిర్వా బద్ధాస్యాత్ యాతు కూపవత్,
వాపీ సా ఖలు విజ్ఞేయా కృతసోపానపఙ్క్తికాః.
నద్యాం శైలప్రసూతాయాం గోమేదకమణిప్రభం,
ప్రశస్తభూమిభాగస్థం జలం నాదేయముచ్యతే."

భూమిలో త్రవ్వబడిన పల్లమునందు జనించినదియును, ఇంద్రనీలముతో సమానమైన కాంతిగలదియును, నిర్మలమైనదియును, మధురమైనదియునైనజలము కౌపమనబడును, నదిలోనుండిగాని, ఉన్నతమైన పర్వతములో నుండిగాని, ప్రవహించి యొకచో నిండి కదలక అల్లి తామర మొదలగువానిచే గప్పబడియుండు జలము సారస మనబడును. ఉత్కృష్టమైన భూమిలో నిండినదియును, ఒకసంవత్సరమునకు తగ్గకుండునదియును, కొంచెము కషాయముగ, మధురముగ నుండునదియు నైనజలము తాటాక మనబడును. జాతియొక్క పల్లమునందు స్వయముగబడి నల్లకలువలతో సమానవర్ణముగలదై తీగలచే గప్పబడియుండుజలము చౌండ్య మనబడును. పర్వతముయొక్క చరియయం దుత్పన్నమై గాలి, మంచు, ఎండ మొదలగువానితో గూడి లఘువుగను, శీతలముగను, నిర్మలముగను, మధురముగ నుండుజలము ప్రాస్రవణమనబడును. స్వయముగ భూమిని బ్రద్దలు చేసి గొప్పధారగా బ్రవహించుచు మధురముగ, శీతలముగ నుండుజలము ఔద్భి దమనబడును. కత్తిరిరాళ్లచేగాని ఇటికరాళ్లచేగాని పడిగట్లు నునిచి నుయ్యివలె యుండునది వాపి యనబడును. దానియందలి జలము వాప్య మనబడును. గొప్పపర్వతములోనుండి ప్రవహించునదియును, ప్రశస్తమైన భూమియం దుండునదియును, గోమేదకమణితో సమానమైన కాంతిగలదియు నైనజలము నాదేయ మనబడును అని కౌపాది జలలక్షణములు సుశ్రుతమునందు జెప్పబడియున్నవి.

"కౌపం సారసతాటాక చౌండ్యప్రాస్రణౌద్భిదం,
వాపీనదీతోయమితి తత్పునః స్మృతమష్టధా.
కౌపం స్వాదు త్రిదోషఘ్నం లఘు పథ్యం చ సర్వదా,
క్షారం తు కఫవాతఘ్నం దీపనం పిత్తకృత్పరమ్.
కషాయబహుళం శ్లేష్మపిత్తఘ్నం వాతకృచ్చ తత్,

తృష్ణాఘ్నం సారసం బల్యం కషాయమధురం లఘు.
ఔద్భిదం స్వాదు పిత్తఘ్నం దీపనం గురు కించన,
సక్షారం కటు వాప్యంబు పిత్తఘ్నం కఫవాతజిత్.
లఘ్వల్పదోషం సుస్వాదు నవవాపీష్వవార్షికం,
అనభిష్యందినాదేయం కటుకం కఫపిత్తజిత్,
విశదం వాతలం రూక్షమనవస్థితలాఘవమ్."

ఉదకము, కౌపము, సారసము, తాటాకము, చౌండ్యము, ప్రాస్రవణము, ఔద్భిదము, వాప్యము, నాదేయము అని ఎనిమిదివిధంబులు. వానిలో కూపోదకము మధురముగను లఘువుగను, ఎల్లప్పుడు పథ్యకారిగ నుండును. త్రిదోషములను పోకడచును. ఉప్పగ నుండు కూపోదకము కఫవాతములను పోగొట్టును. దీపనకారి, మిగుల పిత్తమును జేయును. వగరుగనుండు కూపోదకము శ్లేష్మపిత్తములను పోగొట్టును. వాతకారి, సారసోదకము దప్పిని హరింపజేయును. బలకారి, కషాయముగ, మధురముగ, లఘువుగ నుండును. ఔద్భిదోదకము మధురముగ నుండును. పిత్తమును బోకడచును. దీపనకారి, స్వల్పముగ గురుత్వముజేయును. ఒకింత ఉప్పగ, కారముగ నుండు వాపీజలము పిత్తము, కఫము, వాతము వీటిని పోగొట్టును. నూతనమైన వాపియందు వర్షసంబంధము లేకుండ జనించినజలము మిగుల మధురముగ, లఘు గ నుండును. స్వల్పముగ దోషమునుజేయును. నదీజలము కఫమును పోగొట్టును. కొంచము కారముగ నుండును కఫపిత్తముల నణచును. నిర్మలముగ నుండును. ఒకింత వాతకారి, రూక్షముగ నుండును. ఒకకాలమునందు లఘువుగ, మఱియొకప్పుడు గురువుగ నుండును. అని కౌపాదిజలగుణము అష్టాంగసంగ్రహ జెప్పబడియున్నది.

"పౌషాదిద్వితయేష్విష్టం విశేషేణ క్రమాజ్జలం
సరస్తటాకయోః కూపచుండయోః ప్రస్రవోద్భిదోః,
కూపేంద్రయోః కూపచుండ్యోస్సర్వం పథ్యం తతః పరమ్." ఇతి.

పుష్యమాసము మొదలు యథాక్రమముగ రెండేసి మాసములలో సరస్తటాకజలంబును, కూపచౌండ్యజలంబును, ప్రస్రవణ, ఉద్భిదజలంబును, కూప ఆకాశజలంబును, కూప చౌండ్యజలంబును పథ్యకరంబులు.


ఉదకపాననిషిద్ధులు

నాంబు పేయమశక్త్యా వా స్వల్పమల్పాగ్నిగుల్మిభిః. ౧౩
పాండూదరాతిసారార్శోగ్రహణీదోషశోషిభిః,
ఋతే శరన్నిదాఘాభ్యాం పిబేత్స్వస్థోఽపి చాల్పశః. ౧౪

అల్పమైనఅగ్ని, గుల్మము, పాండువు, ఉదరరోగము, అతిసారము, అర్శస్సు, గ్రహణి అనురోగములు గలవారును, వమనవిరేచనములకు ఔషధమును సేవించిన వారును, జలపానము చేయంజనదు. అట్టివిషయములయందును దప్పిని సహించలేనివారు స్వల్పముగా జలమును పానము చేయవచ్చును. శరత్, గ్రీష్మము అను నీ రెండుఋతువులయందుతప్ప తక్కినఋతువులయందు స్వస్థుడుకూడ స్వల్పముగ జలమును పానము జేయవలయును.

"కామమల్పమశక్తౌతు పేయమౌషధసంస్కృతమ్
పాషాణరూప్యమృద్హేమజాతతాపార్కతాపితమ్,
పానీయముష్ణం శీతం వా త్రిదోషఘ్నం తృడర్తిజిత్."

దప్పిని సహింపలేనపుడు ఔషధములతోడచేర్చి కాచబడినజలమునుగాని, ఇటికరాయి, వెండి, మంటిగెడ్డలు, బంగారు మొదలగువానిని బాగుగా నిప్పులోకాచి జలములో వేసి యొడయం దుంచుటచే ఉష్ణమైనజలమునుగాని, లేక కొంచెము చల్లార్చబడిన జలమును గాని పానముచేయవలయును అట్టి జలము త్రిదోషములను, దప్పిని బోకడచును. అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

### భోజనకాలజలపానగుణము

## సమస్థూలకృశాభుక్తమధ్యాంతప్రథమాంబుపాః,

ఆహారముయొక్క మధ్యమునందును, అంతమునందును, ప్రథమమునందును జలపానముచేసినచో శరీరమునందు యథాక్రమముగ సమత్వము, స్థౌల్యము, కృశత్వము గలుగును. (అనగా ఆహార మధ్యమునందు చేయబడిన ఉదకపానము ధాతుసామ్యమును గలుగజేయును. ఆహారాంతమునందు చేయబడినజలపానము ఆమాశయమునందు కఫ వృద్ధిజేసి శరీరస్థౌల్యమును గలుగజేయును. భోజనమునకు ఆదియందు చేయబడిన పానము జాఠరాగ్నిని చల్లార్చును. అందువలన భుజించిన యాహారము బాగుగ పాకము కానేరదు. ఆహారము పాకము కాకుండినచో శరీరము పుష్టిజెందక కృశత్వమునుజెందును అని భావము.) మఱియును —

"భక్తస్యాదౌ జలం పీతమగ్నిసాదం కృశాంగతాం
అంతేకరోతి స్థూలత్వ మూర్ధ్వమామాశయాత్కఫం,
మధ్యే మధ్యాంగతాం సామ్యం ధాతూనాం జరణం సుఖమ్."

భోజనమున కాదియందు చేయబడినజలపానము జాఠరాగ్నినాశనమును, శరీరకృశత్వమును గలుగజేయును. భోజనాంతమునందు చేయబడినజలపానము శరీరస్థౌల్యమును ఆమాశయమునందు కఫమును గలుగజేయును. భోజనమధ్యమునందు చేయబడిన జల

పానము ధాతుసామ్యములు, జీర్ణమును, సుఖమును, మధ్యమమైన శరీరమును గలుగ జేయును అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

శీతోదకగుణము

శీతం మదాత్యయగ్లానిమూర్ఛాఛర్దిశ్రమభ్రమాన్. ౧౫
తృష్ణోష్ణదాహపిత్తాస్రవిషాణ్యంబు నియచ్ఛతి,

శీతోదకము మదాత్యయము (అనగా మద్యపానమువలన జనించినరోగము) బడలిక, మూర్ఛ, వాంతి, చెమట, భ్రమము, దప్పి, ఉష్ణము, తాపము, పిత్తరక్తము, విషము వీనిని బోగొట్టును

"అనవస్థితదోషాగ్నేర్వ్యాధిక్షీణబలస్య చ,
నాల్పమప్యాయముదకం హితం తద్ధి త్రిదోషకృత్."

వాతాదిదోషములును జాఠరాగ్నియు నొకటేరీతిగ నుండక అప్పుడప్పుడు మారుచుండు వారికిని, వ్యాధివలన క్షయించినవారికిని, దౌర్బల్యముగలవారికిని, స్వల్పమైన శీతోదకము కూడ అపథ్యకరముగ నుండును. కాబట్టి దానిని పానముజేసినచో త్రిదోషములను ప్రకోపింపజేయును అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

ఉష్ణోదకగుణము

దీపనం పాచనం కంఠ్యం లఘూష్ణం వస్తిశోధనమ్. ౧౬
హిధ్మాధ్మానానిలశ్లేష్మసద్యశ్శుద్ధే నవజ్వరే,
కాసామపీనసశ్వాసపార్శ్వరుక్షు చ శస్యతే. ౧౭

ఉష్ణోదకము దీపనపాచనములను జేయును. కంఠమునకు హితకరమైనది. ...టముగా లఘువుగ నుండును. మూత్రమును శుద్ధిజేయును. హిధ్మయు (ఎక్కిళ్లు), ఆధ్మానము, వాతరోగము, శ్లేష్మరోగము, నూతనజ్వరము, కాసము, అజీర్ణము, పీనసము, శ్వాసము, పార్శ్వశూల ఇవి గలిగియుండునపుడును, వమనవిరేచనములకు ఔషధమును సేవించియుండునపుడును పథ్యకరమైనది. శ్లోకమునందలి కాసామపీనస యనుచో ఆమ పీనసము అని శబ్దవిభజనముచేసి అపక్వపీనసమని కొందరు వ్యాఖ్యానము చేసెదరు.

క్వథితశీతోదకగుణము

అనభిష్యంది లఘు చ తోయం క్వథితశీతలం,

కాగి చల్లారినయుదకము శ్లేష్మమును జేయదు. మిగుల లఘువుగ నుండును.

"సంసర్గే పిత్తకఫయోః సన్నిపాతే చ పూజితమ్."

అనగా కాగి చల్లారిన జలము పిత్తకఫములయొక్క సంసర్గమునందును, సన్నిపాతము నందును పథ్యముగనుండును అని అధికపాఠము కొన్నిగ్రంథములయందు గనపట్టుచున్నది.

ఉదకము స్థానభేదమువలన గురువుగనుండినను దానిని బాగుగకాచి చల్లార్చినచో మిగుల లఘువుగనగునని కొందరు వచించెదరు. శీతజలమునకు గలిగియుండుగుణములే కాగిచల్లారిన యుదకమునకును గలిగియుండును.

"క్వచిదుష్ణం క్వచిచ్ఛీతం క్వచిత్క్వథితశీతలం,
క్వచిద్భేషజసంయుక్తం న క్వచిద్వారివార్యతే."

కొన్ని కాలములయందు ఉష్ణోదకమును, కొన్ని కాలములయందు శీతోదకమును, కొన్ని కాలములయందు కాగి చల్లారినయుదకమును, కొన్ని కాలములయందు ఔషధముతో గూడియుండు జలమును పానముచేయవలయునని జెప్పియుండుటచే ఉదకము ఎప్పుడు నిషేధించబడదని అష్టాంగసంహితయందు చెప్పబడియున్నది.

## క్వథిత శీతజలోపయోగక్రమము

పిత్తయుక్తే హితం దోషే వ్యుషితం తత్త్రిదోషకృత్. ౧౭

వాతపిత్తము, పిత్తశ్లేష్మము, సన్నిపాతము అను నీరోగములలో దేనియందేని పిత్తాధిక్యము గలిగియుండునపుడు కాగిచల్లారినయుదకము హితకరముగ నుండును. కాగి చల్లారిన ప్రాచినీరు త్రిదోషములను ప్రకోపింపజేయును

"క్షీణపాదత్రిభాగార్థం దేశర్తుగురులాఘవాత్,
క్వథితం ఫేనరహితమవేగ మమలం హితమ్."

జాంగలాది దేశములు, ఋతువు వీనియొక్క గురుత్వలాఘవముల ననుసరించి యథాక్రమముగ నాలుగులో నొకభాగము తగ్గునటుల, మూడుభాగములు తగ్గునటుల ఒకటిన్నర భాగము తగ్గునటుల కాచబడినదియును, నురుగు లేనిదియును, నిర్మలమైనదియునైన జలము హితకరమైనది. ఏలనఁగా —జాంగలదేశములో వాతము, తేజస్సు, వీనిసంబంధ మధికముగ నుండుటవలన నందలిజలము శీఘ్రముగ శుద్ధిజెందును. కాబట్టి దానిని నాలుగింట నొకభాగము తగ్గునటుల కాచవలయును. అనూపదేశములో శీతగుణము, గురుత్వము అధికముగ నుండుటవలన నందలిజలము చిరకాలముమీద శుద్ధిజెందును. కాబట్టి దానిని మూడుభాగములు తగ్గునటుల కాచవలయును. సాధారణదేశములో వాతాదులు సమముగనుండుటవలన నందలిజలము మధ్యమకాలమువలన శుద్ధిజెందును. కాబట్టి దాని నొకటిన్నరభాగము తగ్గునటుల కాచవలయును. ఇటులనే ఆయా ఋతువులయొక్క శీతాదిగుణముల ననుసరించి జలమును కాచవలయును.

"యత్క్వాథ్యమానం నిర్వేగం నిష్ఫేనం నిర్మలం లఘు,
చతుర్భాగావశిష్టం తు తత్తోయం కఫరోగనుత్,
తత్పాదహీనం పిత్తఘ్నం హీనమర్థేన వాతనుత్."

నాలుగులో నొకభాగము నిలుచునటుల కాచబడినదియును, నురుగులేనిదియును, నిర్మలమైనదియు నైనయుదకము లఘువుగ నుండును, కఫరోగమును పోగొట్టును. మూడు భాగములు నిలుచునటుల కాచబడినయుదకము పిత్తమును పోగొట్టును. రెండుభాగములు (సగము) నిలచునటుల కాచబడినయుదకము వాతమును పోగొట్టును. అని సుశ్రుతాచార్యుడు క్వాథానుసారముగా గుణమును జెప్పియున్నాడు.

"పానీయం న తు పానీయం పానీయేన్యప్రదేశజే,
అజీర్ణే క్వథితం చామే పక్వే జీర్ణే పి నేఽరత్.
శీతే విధిరయం తప్తే త్వజీర్ణే శిశిరం త్యజేత్,
అతియోగేన సలిలం తృష్యతోఽపి ప్రయోజితమ్.
ప్రయాతి శ్లేష్మపిత్తత్వం జ్వరితస్య విశేషతః."

పానముచేయబడిన అన్యప్రదేశజనితజలము జీర్ణము కాకుండునపుడు మఱియొకప్రదేశమునందలి జలమును పానము చేయంజనదు. (అనగా కూపోదకమును పానముచేసియుండగా నది జీర్ణము కాకుండునపుడు తటాకోదకమును పానము చేయంజనను. ఇటులనే తటాకోదకము జీర్ణము కాకుండునపుడు కూపోదకమును పానము చేయంజనదు అని భావము.) మఱియు పానముచేయబడిన శీతోదకము జీర్ణము కాకుండునపుడు ఉష్ణోదకమును, పానముచేయబడిన ఉష్ణోదకము జీర్ణమైయుండునపుడు శీతోదకమును పానము చేయంజనదు. (అనగా ఒకటేవిధమైన ఉదకమును పానము చేయవలయు నని భావము) ఈవిధి, కాగి చల్లారినయుదకమునకే ఉపయోగించును, కాగిన ఉదకము జీర్ణము కాకుండునపుడు శీతోదకమును త్యజింపవలయును. దప్పివలన నుదకము నధికముగ పానముజేసినచో స్వస్థముగనుండు మనుజునికిగూడ శ్లేష్మపిత్తములు వృద్ధిజెందును. జ్వరి శీతోదకమును పానముచేసినచో అగ్ని మందగింపి జ్వరము విశేషముగా వృద్ధిజెందును.

"రూక్షస్తనురవశ్యాయ శీతో వాతాస్రకోపనః,
పామతృడ్దాహపిత్తాస్రకుష్ఠోరుస్తంభమేహజిత్.
గ్రీష్మేషు సర్వజంతూనాం స్పర్శనాఽపి శస్యతే,
పద్మిన్యంబు చ పిత్తఘ్నం కఫకృత్స్వాదురసం గురు.
హిమం తు శీతలం రూక్షం దారుణం సూక్ష్మమేవ చ,
కఫం న సందూషయతి న పిత్తం నచ మారుతమ్.
తథాశ్మవర్షప్రళయే హిమాదల్పతరం గుణైః,
చరాచరాణా మహితం తుషారం త్వగ్నినాశనమ్.

వైకరం లఘు సక్షారం శ్లేష్మఘ్నం వహ్నిదీపనం,
కైదారం మధురం ప్రోక్తం విపాకే గురు దోషలమ్.
తద్వత్పాల్వలముద్దిష్టం విపాకే దోషలం తు తత్,
అనేకదోషమానూపం వార్యభిష్యంది గర్హితమ్.
ఏభిర్దోషైరసంయుక్తం నిరవద్యంతు జాంగలం,
పాకే విదాహి తృష్ణాఘ్నం ప్రశస్తం ప్రీతివర్ధనమ్.
దీపనం స్వాదు శీతం చ తోయం సాధారణం లఘు,
చంద్రకాంతభవం రక్షోవిషపిత్తజ్వరాపహం,
రత్నాకరసముత్థం చ సర్వదోషకరం మతమ్."

మంచునీరు శీతలముగ నుండును. వాతరక్తము నధికపరచును దురద, దప్పి, తాపము, పిత్తరక్తము, కుష్ఠువు, ఊరుస్తంభము, ప్రమేహము వీనిని హరింపజేయును. గ్రీష్మ ఋతువునందు సర్వజంతువులకు స్నానాదులయందు హితకరమైనది. తామరగుంటనీరు పిత్తమును పోగొట్టును. కఫము నధికపరచును. రసములేనిది గురుత్వముజేయును. హిమోదకము శీతలముగ నుండును రూక్షము జేయును. లఘువుగ నుండును. కఫము, పిత్తము, వాతము వీనిని తమతమస్థానములయందు స్థిరపరచును. వడగండ్లనీరు హిమోదకము కంటె స్వల్పమైనగుణముగలది. ప్రాతఃకాలమునందు పడినమంచునీరు జంగమము, స్థావరములైన సర్వభూతములకు అహితకరమైనది. జాఠరాగ్నిని నశింపజేయును. వైకరోదకము లఘువుగ, కొంచెము ఉప్పగనుండును శ్లేష్మమును హరింపజేయును. అగ్నిదీపనకారి. మడినీళ్లు మధురముగ, పాకమువలన గురువుగనుండును. దోషకారి; పడియగుంట నీరు మిగుల దోషకరమైనది. అనూపదేశమునందలి యుదకము అనేకదోషములుగలది. శ్లేష్మము నధికపరచును. నిందితమైనది. జాంగలదేశోదకము దోషరహితమైనది, దప్పిని పోగొట్టును. తృప్తినిచ్చును. ప్రశస్తమైనది. పాకమువలన కొంచెము తాపము నిచ్చును. సాధారణదేశమునందలి యుదకము దీపనకారి. మధురముగ శీతలముగ లఘువుగనుండును. చంద్రకాంతోదకము రాక్షసులబాధ, విషము, పిత్తజ్వరము వీనిని పోగొట్టును. సముద్రజలము సర్వదోషముల నధికపరచును అని తంత్రాంతరములయందు జెప్పఁబడియున్నది.

### నారికేళోదకగుణము

నారికేళోదకం స్నిగ్ధం స్వాదు వృష్యం హిమం లఘు,
తృష్ణాపిత్తానిలహరం దీపనం వస్తిశోధనమ్. ౧౯

నారికేళోదకము స్నిగ్ధముగ, మధురముగ నుండును శుక్రమును వృద్ధిజేయును. శీతలమైనది. లఘువుగ నుండును. దప్పిని, పిత్తవాతములను హరింపజేయును. దీపనకారి. మూత్రమును వృద్ధిజేయును.

దివ్యోదకప్రాశస్త్యము

వర్షాసు దివ్యనాదేయే పరం తోయే వరావరే,

వర్షాకాలమునందు ఆకాశోదకము మిగుల హితకరమైనది. నదీజలము మిగుల నిందితమైనది

ఉదకవర్గము ముగిసెను.



అవ. అన్నివర్గములకంటె జలవర్గము బహుజనులకు ఉపయోగకారిగ నుండుట వలనను, సర్వజంతువులకు జన్మము మొదలుకొని హితకరమైనదిగ నుండుటవలనను, జీవనాదిగుణములుగలదిగ నుండుటవలనను, తొలుత జెప్పబడినది. బలము మొదలగు గుణములు పాలకు గలిగియుండుటచే నికమీఁదట క్షీరవర్గము చెప్పబడుచున్నది. ఆవర్గములో క్షీరము, పెరుగు మొదలగువానికి ముఖ్యకారణముగ నుండుటవలనను, "క్షీరం జీవనీయానాం క్షీరఘృతాభ్యాసో రసాయనానామ్" అనెడి అష్టాంగసంగ్రహ వచన ప్రమాణముచొప్పున జీవనీయౌషధములకును, రసాయనములకును, ముఖ్యముగ నుండుట వలనను, తొలుత క్షీరగుణము జెప్పబడుచున్నది. మఱియును "గవ్యం మాహిషమాజం చ కారభం స్త్రైణమావికమ్, ఐభమైకశఫం చేతి క్షీరమష్టవిధం స్మృతమ్." అనెడి అష్టాంగసంహిత వచనప్రకారము ఆవుపాలు, ఎనుముపాలు, మేకపాలు, ఒంటెపాలు, చనుబాలు, గొఱ్ఱెపాలు, ఏనుగుపాలు, ఒకటే డెక్కగలజంతువులపాలు, అని పాలు ఎనిమిది విధంబులు.

క్షీరగుణము

స్వాద్పాకరసం స్నిగ్ధమోజస్యం ధాతువర్ధనమ్. ౨౦
వాతపిత్తహరం వృష్యం శ్లేష్మలం గురు శీతలం,
ప్రాయః పయోఽత్ర

క్షీరము తరుచుగ మధురమైనపాకము రసముగలది. స్నిగ్ధముగ నుండును. బలము నిచ్చును. ధాతువులను వృద్ధిజేయును, వాతపిత్తములను హరింపజేయును. శుక్రమును విశేషముగా వృద్ధిజేయును. శ్లేష్మకారి, గురుత్వముచేయును; శీతకరమైనది. అయితే పై చెప్పినగుణములు కొన్నిక్షీరములకు లేకుండును. ఇందుకు దృష్టాంతము ఒంటెపాలు కొంచెము ఉష్ణముగ రూక్షగుణముకల్గి, లవణముగనుండునని జెప్పబడియున్నది. అటులనే

మేకపాలు లఘువుగ నుండు ననియును, గొఱ్ఱెపాలు ఉష్ణముగ నుండుననియును, ఒకటే డెక్కగల జంతువులయొక్క పాలు ఉష్ణముగ, కొంచెములవణముగ, పుల్లగ నుండు ననియును జెప్పబడియున్నది. కావుననే "ప్రాయః" అనుపదము ప్రయోగించబడినది. క్షీరము మధురమైన పాకరసములు గలది యని చెప్పినందుచేతనే పైజెప్పిన స్నిగ్ధాది గుణములు క్షీరమునకు గలిగియుండునని సిద్ధంబగుచుండగా మరల స్నిగ్ధాదిగుణములను జెప్పుట వ్యర్థమని కొందరుచెప్పెదరు. అయితే మధురరసాదులకంటె స్నిగ్ధత్వ శుక్ర వృద్ధికరత్వాదిగుణములు క్షీరమునకు బహుళముగా గలిగియుండు నని సూచించుటకై స్నిగ్ధాదిగుణములు ప్రత్యేకముగా జెప్పబడినవి. కాబట్టి వారియాక్షేపణ యుక్తి యుక్తము కాదు. పృధివ్యాది మహాభూతములయొక్క సంయోగాది విశేషములవలన మధురరసముగల ద్రవ్యములయందు ఆయుష్కరత్వాదిగుణములు, ఆమ్లరసముగల ద్రవ్యములయందు అగ్నిదీపనాదిగుణములు, ఇటుల రసమున కనుకూలమైనగుణములు ద్రవ్యములయం దుండును. రసమునకు ప్రతికూలముగనే రూక్షత్వము మున్నగు కొన్ని గుణములు మధురరసముగల మకుష్ఠతండులీయాదిద్రవ్యములయం దుండును. కాబట్టి మకుష్ఠాదిద్రవ్యములు మధురరసముతో గూడియుండుటచే వానికి మధురరసముయొక్క గుణమును చెప్పుట యుక్తము. అటు కావేని మధురాదిషడ్రసములకు ప్రత్యేకముగా జెప్పియుండు గుణములు వ్యర్థంబు లగును. కావున సిట్టిస్థలములయందు విషయములను విభజన జేసికొనవలయును అది యెట్లనగా — కొన్ని గుణములు రసములకనుగుణముగనే ద్రవ్యములయందుండును. ఆగుణములచె నా ద్రవ్యము రసగుణముల ననుసరించియుండును. ఇటువంటి విశేషము నుద్దేశించియే తంత్రకారులు షడ్రసములకు స్నిగ్ధాదిగుణములను జెప్పియున్నారని తెలియవలయును. కొన్నిగుణములు రసగుణము నపేక్షింపకయే ద్రవ్యమునందుండును కావుననే ఆద్రవ్యము రసగుణముల ననుసరించుట లేదు. ఈ విషయమునందు ద్రవ్యముయొక్క రసగుణములు చెప్పబడలేదని తెలియవలయును. కాబట్టి క్షీరమునకు స్నిగ్ధాదిగుణములుండుటచే మధురపాకరసములు గలిగియుండినను ప్రత్యేకముగా స్నిగ్ధాదిగుణములు చెప్పబడినవి అట్లగుటచే క్షీరమునకు స్నిగ్ధాదిగుణములు విశేషముగానుండునని తెలిసికొనవలయును. ఇటులనే యితరస్థలములయందును గుణవర్ణమునకు ప్రయోజనమును తెలియవలయును.

"స్వాదుః పటుశ్చ మధుర మమ్లోమ్లం పచ్యతే రసః."

అను వచనప్రకారము క్షీరము మధురరసము గలదిగ నుండుటవలననే దానికి మధురపాకము గలిగియుండునని సిద్ధంబగుచుండగా ప్రత్యేకముగా మధురపాకము గలది యని చెప్పుట వ్యర్థమనెడిశంక గలుగును. అయితే —

"శాలిపిష్టమయం సర్వం గురుభావాద్విదహ్యతే"

శాలిపిష్టముచే జేయబడిన సమస్తమైన భక్ష్యములు గురువుగ నుండుటవలన చిరకాలము వరకు విదాహావస్థను జెందియుండునని చెప్పబడియున్నది. అటులనే క్షీరము గురుత్వము గలదియైనను విదాహావస్థయందు చిరకాలమువఱకు నుండదు. విదాహావస్థను జెందక తొలుతనే మధురపాకమును జెందును. అనెడి యర్థమును సూచించుటకై "పాకః" అను పదము ప్రత్యేకముగ ప్రయోగింపబడినది.

"స్త్రీణామపత్యజాద్ధర్షాత్ రసః క్షీరాయ కల్పతే,
స్నేహాద్రసః క్షరత్యేవం హృదయాత్ క్షీరమేత్యతః."

అనెడి దారువాహి వచనప్రకారము స్త్రీలయొక్క ఆహారరసమే పుత్రప్రీతిచే క్షీరముగ పరిణమించును అని తాత్పర్యము.

### గోక్షీరగుణము

గవ్యం తు జీవనీయం రసాయనమ్. ౨౧
క్షతక్షీణహితం మేధ్యం బల్యం స్తన్యకరం పరం,
భ్రమశ్రమమదాలక్ష్మీశ్వాసకాసాతితృట్క్షుధః. ౨౨
జీర్ణజ్వరం మూత్రకృచ్ఛ్రం రక్తపిత్తంచ నాశయేత్,

సమస్తమైన క్షీరములలో ఆవుపాలు జీవనీయమైనది (అనగా విశేషబలకరమైనది.

"ఓజః క్షీయేత కోపాదిభిః"

అనగా ప్రకోపమువలన ఓజస్సు క్షయించియుండునపుడు,

"జీవనీయౌషధక్షీరరసాద్యాస్తత్ర భేషజమ్"

అను వచనముచేత క్షీరాదుల నౌషధముగ జెప్పియుండుటవలన "జీవనీయం" అను పదమునకు బలవృద్ధికర మని యర్థము. ఈశ్లోకములోని "జీవనీయం" అను శబ్దమువలననే క్షీర మని అర్థమేర్పడుచుండినను,

"ప్రవరం జీవనీయానాం క్షీరముక్తం రసాయనమ్"

అనెడి చరకవచనమునుబట్టి జీవనీయవస్తువుల కన్నిటికి క్షీరమే శ్రేష్ఠ మని తెలియపరచు నిమిత్తము క్షీరము, జీవనీయము, అను నీ రెండుపదములు ప్రత్యేకముగా నుదహరింపబడినవి. రసాయన మనగా —

"లాభోపాయో హి శస్తానాం రసాదీనాం రసాయనమ్."

అను వచనముచేత నిర్దిష్టమైన రసవీర్యవిపాకాదులకు క్షీరము సాధనమైనది. మఱియు గాయము, ధాతుక్షయముగలవారికి హితకరమైనది, ధారణాశక్తిని చ్చును. బలము

చనుబాలు పీనినిగలుగ జేయును. శరీరమునందు త్వరితముగా వ్యాపించును. శ్రమము, భ్రమము, మదము, అలక్ష్మి, శ్వాసకాసములు, అధికమైనదప్పి, ఆకలి, జీర్ణజ్వరము, మూత్రకృచ్ఛ్రము, రక్తపిత్తము, వీనినన్నిటిని పోగొట్టును అని తాత్పర్యము.


ఎనుముపాలగుణము

హితమత్యగ్న్యనిద్రేభ్యో గరీయో మహిషం హిమమ్. ౨౩

ఎనుముపాలు మిక్కుటముగ అగ్నిదీపనముగలవారికి, నిద్రలేనివారికి హితకరమైనవి. మిక్కుటముగ గురుత్వమును జేయును. శీతవీర్యముగలది. ఈయర్థమునే

"మహిషీణాం గురుతరం గవ్యాచ్ఛీతతరం పయః,
స్నేహాదూనమనిద్రాయ హితమత్యగ్నయే చ తత్."

అనెడి చరకవచనముకూడ బోధించుచున్నది.

'గవ్యం స్నేహోత్తమం క్షీరం గవ్యాచ్ఛ పయసః పయః,
యథోత్తరం స్నేహహీన మౌరభ్రిచ్ఛాగమాహిషమ్,
జాంగలానూపశైలేషు చరంతీనాం యథోత్తరమ్,
పయో గురుతరం పత్సో యథా తాసాం ప్రవర్తతే."

ఆవుపాలు మిగుల స్నిగ్ధముగనుండును. దానికంటె గొఱ్ఱె, మేక, ఎనుము యీ మొదలగువానిపాలు యథోత్తరము స్నేహహీనముగ, మిగుల గురువుగనుండును. వానిలోను జాంగలానూపదేశ భేదమువలన నొకదానికంటె నొకటి యథోత్తరము మిగుల గురువుగనుండునని ఖరనాదమహాగ్రంథమునందు జెప్పబడియున్నది.

"గురుశీతతరం గవ్యా న్మాహిషం స్వప్నలం పయః,
చతుర్థభాగస్నేహోనం పిత్తఘ్నం చ విశేషతః."

ఆవుపాలకంటె ఎనుముపాలు మిగుల గురుత్వముగలది. మిగుల శీతకరము. నిద్రను గలుగజేయును. ఆవుపాలకంటె నాలుగులో నొకభాగము స్నేహము తగ్గియుండును. పిత్తమును హరించును. అని తంత్రాంతరములయందు జెప్పబడియున్నది.

"గవ్యాత్స్నిగ్ధం గురుతరం మాహిషం స్వప్నకృత్పయః."

ఆవుపాలకంటె ఎనుముపాలు స్నిగ్ధముగనుండును. గురుత్వముగలవి. నిద్రనుబుట్టించును. అని సిద్ధసారమహాగ్రంథమునందు జెప్పబడియున్నది. అయితే "గవ్యాత్స్నిగ్ధం" అని సిద్ధసారమునందు జెప్పియుండువచనము చరకాదివచనములకు విరుద్ధముగ నుండుటవలన యోచింపదగినది. పైజెప్పిన రీతిగ గేదెపాలవిషయమై ద్వైవిధ్యముగనున్నది. అందు ఆవుపాలకన్న గేదెపాలు మిక్కిలి స్నిగ్ధమగుచునుటయే సమంజసము. అను

భవమునుబట్టియు అందలి గుణాదులబట్టియు సూక్ష్మదృష్టిచే గమనించినను మాహిషము స్నిగ్ధతర మనియే తోచును.

### మేకపాలగుణము

అల్పాంబుపానవ్యాయామకటుతిక్తాశనైర్లఘు,
ఆజం శోషజ్వరశ్వాసరక్తపిత్తాతిసారజిత్. ౨౪

మేక అల్పముగా జలపానము, విశేషముగా వ్యాయామము చేయుటవలనను, కారముగ, చేదుగ నుండువస్తువులను భుజించుటవలనను, దానిపాలు మిగుల లఘువుగ నుండును. శోష, జ్వరము, శ్వాసము, రక్తపిత్తము, అతిసారము వీనిని హరింపజేయును. అయితే మేక వ్యాయామము చేయక గురుపదార్థములను భుజించుచుండినచో దాని పాలకుకూడ పైజెప్పిన లఘుత్వాదిగుణములు లేక గురుత్వాదిగుణములు కల్గియుండును. ఇటుల జెప్పుటవలన ఆవు మొదలగువాని పాలకుకూడ ఆహారాదిభేదములచే వాని వానికి జెప్పబడిన లాఘవాదిగుణములు మారుచుండునని యూహ్యాంబగుచున్నది. కాబట్టి రాత్రులయందు ఆవు మొదలగునవి వ్యాయామము చేయకుండుటవలన సాయంకాలము నందు పితకబడినపాలకంటె ప్రాతఃకాలమునందు పితకబడిన ఆవు మొదలగువానిపాలు గురువుగ నుండును. ఆవు మొదలగువానికి మధ్యాహ్నమునందు పరుగులిడుట, లేచుట మొదలగు చేష్టలు కలిగియుండుటవలన సాయంకాలమునందు పితకబడిన పాలు లఘువుగ నుండును. ఇటులనే సర్వవిధములైన పాలయొక్క గురులాఘవములను తెలిసికొన వలయును.

"పిణ్యాకామ్లాశినీనాంతు గుర్వభిష్యంది తత్పయః శ్లేష్మ."

గానుగపిండి, కాడి మొదలగువానిని భుజించు ఆవుమొదలగువానిపాలు మిగుల గురువుగ, శ్లేష్మకారిగ నుండు నని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది. ఈయర్థము "అల్పాంబుపానవ్యాయామ" అను పైశ్లోకమువలన స్పష్టముగా నేర్పడుచుండుటవలన నీతంత్రమునందు తంత్రకారుడు ప్రత్యేకముగా జెప్పకవిరమించెను.

### ఒంటెపాలగుణము

ఈషద్రూక్షోష్ణలవణ మౌష్ట్రకం దీపనం లఘు,
శస్తం వాతకఫానాహకృమిశోఫోదరార్శసామ్. ౨౫

ఒంటెపాలు లఘువుగ నుండును. ఒకింతరూక్షగ, ఉష్ణముగ, ఉప్పగ నుండును. అగ్నిదీపనకారి. వాతరోగము, కఫము, ఆనాహము, కృమిరోగము, శోష, ఉదరరోగము, అర్శస్సు వీనియందు మిగుల హితకరమైనది.

చనుబాలగుణము

మానుషం వాతపిత్తాసృగభిఘాతాక్షిరోగజిత్,
తర్పణాశ్చోతనైర్నస్యైః

చనుబాలు ఉత్తరత్ర చెప్పబడు తర్పణము, ఆశ్చోతనము, నస్యము మొదలగు క్రియలవలన వాతము, పిత్తము, రక్తము, అభిఘాతము, నేత్రరోగము, వీనిని హరింప జేయును.

గొఱ్ఱెపాలగుణము

అహృద్యం తూష్ణ మావికమ్. ౨౬
వాతవ్యాధిహరం హిధ్మాశ్వాసపిత్తకఫప్రదం,

గొఱ్ఱెపాలు ఉష్ణవీర్యము గలది. హృదయమునకు అహితమైనది. వాతరోగమును పోగొట్టును. హిధ్మ(ఎక్కిళ్లు), శ్వాసము, పిత్తము, కఫము వీనిని గలుగజేయును.

ఏనుగు పాలగుణము

హాస్తినాస్థైర్యకృద్బాఢం

ఏనుగుపాలు మిక్కిలి స్థైర్యము నిచ్చును.

ఒకటేడెక్కగలజంతువులపాలగుణము

ఉష్ణం త్వైకశఫం లఘు. ౨౭
శాఖావాతహరం సామ్లలవణం జడతాకరం,

ఒకటేడెక్క గలగుఱ్ఱము మొదలగు జంతువులపాలు మిగుల ఉష్ణముగ, లఘువుగ నుండును. కాళ్లుచేతులు మొదలగు అవయవములయందు గలుగువాతరోగమును హరింప జేయును. కొంచెముపుల్లగ, ఉప్పగనుండును. శరీరమునందు జడత్వమును గలుగజేయును.

కాచని పాలగుణము

పయోభిష్యంది గుర్వామం యుక్త్యా శృతమతోఽన్యథా. ౨౮

కాచనిపాలు కఫమును ప్రకోపింపజేయును. గురుత్వముగలది, యుక్తివలన (అనగా ఉపాయముగా) కాచబడినపాలు లఘువుగ నుండును. శ్లేష్మమును ప్రకోపింప జేయదు.

* "వినా తు వనితా స్తన్య మామమేవ హితం పయః,
అర్ధోదకం క్షీరశిష్టమామాల్లఘుతరం శృతమ్."

స్త్రీలచనుబాలు కాచకయే హితకరమైనవి. ఇతరమైన సర్వజంతువులపాలకు సగపాలు ఉదకము పోసి ఉదకమంతయు శుష్కించి పాలుమాత్రము మిగులునటుల కాచబడినగి

మిగుల లఘువుగనుండునని ఖరనాదమను గ్రంథమునందు పాలను కాచునట్టియుక్తి స్ప ముగా చెప్పబడియున్నది.

అధికముగా-కాచబడిన పాలగుణము

భవేద్గరీయోఽతిశృతం ధారోష్ణమమృతోపమం,

గడ్డకట్టునటుల కాచబడిన పాలు మిగుల గురుత్వమును జేయును.

"స్యాన్నిర్జలం శృతం ద్విత్రిచతురష్టాంశశోషితమ్,
తథా శృతతమం సారం గురు బల్యతమం పయః."

ఉదకసంబంధము లేకయే రెండు, లేక మూడు, లేక నాలుగు, లేక ఎనిమిదిభాగములు తగ్గునటులకాచబడినపాలు మిక్కిలి గురువుగ, బలకరముగ, సారముగలదిగనుండునని ఖర నాదమను గ్రంథమునందు చెప్పబడియున్నది.

"శృతశీతంతు పిత్తఘ్నం శృతోష్ణం కఫవాతజిత్,
త్యజేద్వివర్ణం గ్రథితం విగంధం విరసం పటు,
రక్తపిత్తప్రశమనీ వృష్యా సంతానికా గురుః."

కాగిచల్లారినపాలు పిత్తమును పోగొట్టును. కాగి ఉష్ణముగనుండుపాలు కఫవాతముల పోగొట్టును. చెడ్డవర్ణముగలదై గడ్డలుకట్టి దుర్గంధముతో గూడి రసములేకుండునట్టియు ఉప్పగనుండునట్టియు నగుపాలను వర్జింపవలయును పాలమీదిమీగడ రక్తపిత్త పోగొట్టును. శుక్రము నధికపరచును. గురుత్వముగలది అని సుశ్రుతమునందు చెప్పబ యున్నది. ధారోష్ణమైనపాలు నిర్దోషమగుటవలన అమృతతుల్యమైనది.

"ధారోష్ణాత్సర్వశః క్షీరాచ్ఛృతం గురుతరం భవేత్"

ధారోష్ణములైన సర్వక్షీరములకంటె కాచబడినపాలు గురుతర మని ఖరనాదమనుగ్రం మునందు చెప్పబడియున్నది.

"పిణ్యాకామ్లాశినీనాంతు గుర్వభిష్యంది తత్పయః."

గానుగపిండి, ఆమ్లరసము వీనినిభుజించునట్టి ఆవుపాలు గురువుగ, శ్లేష్మకరముగనుండును

పెరుగుగుణము

ఆమ్లపాకరసం గ్రాహి గురూష్ణం దధి వాతజిత్. 2
మేదశ్శుక్రబలశ్లేష్మ పిత్తరక్తాగ్ని *శోషకృత్,
రోచిష్ణు శస్తమరుచౌ శీతకే విషమజ్వరే. 3
పీనసే మూత్రకృచ్ఛ్రే చ రూక్షంతు గ్రహణీగదే,
నైవాద్యాన్నిశి నైవోష్ణం వసంతోష్ణ శరత్సు న. 3

* శోఫ ఇతి పా.

నాముద్గసూపం నాక్షౌద్రం తన్నాఘృతసితోపలం,
న చానామలకం నాపి నిత్యం నామందమన్యథా.
జ్వరాసృక్పిత్తవీసర్పకుష్ఠపాండుభ్రమప్రదం,
పెరుగు ఆమ్లమయిన పాకము, రసముగలది.
"భేది తత్పిండితాన్ భావాన్ శకృదాదీన్ భినత్తి యత్,
విపరీతమతో గ్రాహి తచ్చ స్తంభనముచ్యతే."

అను వచనముచేత గ్రాహియనగా మలాది స్తంభనకారి, గురువుగ, ఉష్ణముగనుండును. వాతమును పోగొట్టును. మేదస్సు, శుక్రము, బలము, శ్లేష్మము, పిత్తరక్తము, అగ్ని దీపనము, శ్వాస్థ్య వీటిని గలుగజేయును. రుచినిపుట్టించును. అరుచిని పోగొట్టుటవలన అరుచియందు పథ్యకరమైనది. పెరుగు రుచిని పుట్టించుటచే నానావిధమైన వ్యంజనములతోడను, మాంసము, మండకము మొదలగువానితోడను తృప్తిజెందియుండువారికి పెరుగునందభిలాష గలుగుచున్నది. కావుననే పెరుగును ఆహారముయొక్క అంతము నందు భుజించుచున్నారు పెరుగు శీతలముతోగూడియుండు వాతజవిషమజ్వరము, పీనసము, మూత్రకృచ్ఛ్రము, వీనియందు హితకరమైనది. గ్రహణీరోగమునందు రూక్షముగనుండు పెరుగు హితకర మైనది. పెరుగు రాత్రులయందు భుజింపంజనదు. మఱియును అగ్న్యాదులచే తప్తమైన పెరుగును భుజింపంజనదు. వసంత గ్రీష్మ శరదృతువులయందును భుజింపంజనదు. ముద్గ సూపాదిరహితముగను, తేనెను జేర్పకయు, నెయ్యిని తెల్లశర్కరను జేర్పకయు, ఉసిరికకాయ సంబంధములేకయు భుజింపంజనదు. ప్రతిదినమును భుజింపంజనదు. ప్రతిదినము భుజించినచో శరీరములో నుండినదై ఉత్తరకాలమునందు రోగమును కలుగజేయును. పెరుగు అతిదోషము, శీతలమైన గుణముగలది. కావుననే "కిలాటదధికూర్చికా ఇత్యాది" వచనములచేత అన్నపాన విధియందు పెరుగు నిషేధింపబడియున్నది. మండకమును (అనగా క్షీరావస్థను దాటి దధ్యవస్థనుజెందక మధ్యమునందుండు పెరుగును) భుజింపంజనదు. ఏలనగా ఆమండకము స్నేహముండుటవలన నది పాకవిశేషముచే స్రోతస్సులయందంటుకొని త్రిదోషములను ప్రకోపింపజేయును. శాస్త్రము నతిక్రమించి భుజింపబడిన పెరుగు జ్వరము, రక్తపిత్తము, విసర్పము, కుష్ఠము, పాండువు, భ్రమము మొదలైనరోగములను విశేషముగా కలుగజేయును. పెరుగు శుక్రమును, బలమును వృద్ధిచేయునని చెప్పబడి యున్నది. శుక్రమును, బలమును వృద్ధిచేయునట్టిద్రవ్యములన్నియు తరుచుగా గురువులుగనేయుండును; కాబట్టి శుక్రబలవృద్ధికారిగనుండునట్టిదధి యెటుల దీపనకారిగనగుననెడి

శంక గలుగును. "అమ్లపాకరసం దధి" అను వచనముచేత చరకాచార్యుడుకూడ పెరుగు అమ్లమైన పాకరసములు గలదియని చెప్పియున్నాడు. అమ్లమైనపాకరసములుగల వస్తువు లన్నియు తఱచుగా శుక్రనాశకరములుగ నుండును. కాబట్టి పెరుగు శుక్రవృద్ధికారి యని చెప్పియుండుట అసంగత మనెడి శంకవచ్చును. అయినప్పటికిని,—

"కించిద్రసేన కురుతే కర్మ పాకేన చాపరమ్,
గుణాంతరేణ వీర్యేణ ప్రభావేనైవ కించన."

ఒక ద్రవ్యము రసమువలన నొకకృత్యమును, పాకమువలన మఱియొక కృత్యమును, వీర్యమువలన వేరొకకృత్యమును జేయు నని చెప్పుటచేతనే పెరుగు అమ్లపాకరసముగలది యనియును, వీర్యోష్ణముగలది యనియు నేర్పడుచుండుటవలన దీపనకారి యని చెప్పి యుండుట యుక్తమే యగును. అటులనే స్నిగ్ధత్వ, బృంహణత్వ, వాతహరత్వ, బలకరత్వాదిగుణములు పెరుగుకు కలిగియుండుటవలన నది శుక్రవృద్ధికారి యని చెప్పియుండుటయు యుక్తమగును. మఱియు బలకరముగ, స్నిగ్ధముగ, గురూష్ణముగనుండు ద్రవ్యము లన్నియు స్వయముగనే వాతహరములై యుండును; కాబట్టి పెరుగుకూడ బలకరత్వాది గుణయుక్తముగ నుండుటవలన నిచట "వాతజిత్" అని చెప్పియుండుట అసంగత మనే శంక కొందరికి కలుగును. అయితే,

"సక్తవో వాతలా వృష్యా రూక్షా బలకరాశ్చ తే, హర్షమూర్జప్రదం పుష్టి మారోగ్యం పౌరుషం పరమ్. యుక్త్యా పీతం కరోత్యాశు మద్యం", "కటుతిక్తాతి రూక్షశీతలలఘూని", "వాతాతపౌభయం శోకో హేతుర్వాతార్యసామ్", "త్రిదోషం మందకం మతమ్"

అను చరకవచనములచేత (బలకర, స్నిగ్ధత్వ, గురూష్ణాదిగుణములుగల) వేపుడు బియ్యపు పిండి, మద్యము, ఎండ, మందకము (అనగా కొంచెముగా పేరియుండు పెరుగు) ఈ మొదలగువానికిని వాతకరత్వగుణములు గలవని యేర్పడుచున్నది. కాబట్టి యిచట "వాతజిత్" అని చెప్పియుండుట యుక్తమగును. పాలు పెరుగుగా పరిణమించు చుండునపుడు దానికి అనభివ్యక్తామ్లము, అభివ్యక్తామ్లము, అత్యమ్లము అని మూడు అవస్థలు గలుగును. వానిలో పెరుగు బాగుగ పేరి గడ్డకట్టుటకుముందు పులుసురసము తెలియక కొంచెము మధురముగనుండిన అనభివ్యక్తామ్లమని, మందజాతమని చెప్పబడును. బాగుగ పేరి గడ్డలుకట్టి పులుసురసము స్పష్టముగా దెలియుచుండిన అభివ్యక్తామ్లమని, సమ్యగ్జాతమని చెప్పబడును. బాగుగ పేరి గడ్డలుకట్టి మిగులపులుసు రసముతో గూడి యుండిన అత్యమ్లమని, అతిజాతమని చెప్పంబడును. అనభివ్యక్తామ్లమను పెరుగు త్రిదోషములనధికపరచును. కాబట్టి నిషిద్ధంబు. అభివ్యక్తామ్లమను పెరుగునకే యిదివఱకు లక్షణ

ములు మూలశ్లోకమునందు చెప్పబడినవి. అత్యమ్లమగు పెరుగు పైజెప్పిన అభివ్యక్తామ్లమను పెరుగుకంటె తక్కువగుణము గలదైయుండును. బాగుగపేరిన పెరుగుయొక్క మిగులపుల్లగనుండు పెరుగులోను సరం (అనగా పెరుగుమీదిభాగము) (అనగా పెరుగుయొక్క క్రిందిభాగము) అనునీరెండును గలిగియుండును.

"త్రిదోషం మందకం జాతం వాతఘ్నం దధి శుక్రలమ్,
సరశ్శ్లేష్మానిలఘ్నస్తు మండస్స్రోతో విశోధనః."

కొంచెముగా పేరియుండు పెరుగు వాతమును పోగొట్టును. శుక్రమును వృద్ధిచేయును. సరం అనునది శ్లేష్మవాతములను పోగొట్టును. మండము స్రోతస్సులను శుద్ధిచేయును. అని చరకాచార్యుడు సరమండగుణములను జెప్పియున్నాడు. పెరుగువలన గలుగు దోషనివారణార్థంబై పెసరపప్పు మొదలగువానిని జేర్చి భుజింపవలయు నని జెప్పబడినది. పెరుగు ఆమ్లపాకరసము ఉష్ణవీర్యముగలది యని చెప్పుటచేతనే శ్లేష్మ, పిత్తరక్తమును చేయు నని స్పష్టమగుచుండగా నితరములగు ఆమ్లద్రవ్యములకంటె పెరుగు విశేషముగా రక్తపిత్తాదులను జేయు నని తెలియజేయుటకై మూలశ్లోకమునందు "పిత్తరక్తాగ్నిశోథకృత్" అని చెప్పబడినది. మఱియును శాస్త్రనిషిద్ధమయిన దధిభక్షణముచే నధికరోగములు కలుగు నని సూచించుటకై మూలశ్లోకమునందు నైవాద్యాత్ అనుచో అనేకనకారములు ప్రయోగింపబడినవి. నైవాద్యాన్నిశి అని చెప్పినందుచే మధ్యాహ్నమునందు పెరుగు భుజింపదగునని యేర్పడుచున్నది.

"దధ్యాజం కఫపిత్తఘ్నం లఘుపాకే విషాపహం,
దుర్నామశ్వాసకాసేషు హితమగ్నేశ్చ దీపనమ్.
విపాకే మధురం వృష్యం రక్తపిత్తప్రణాశనం,
బలాసవర్ధనం స్నిగ్ధం విశేషాద్దధిమాహిషమ్.
విపాకే కటుకం క్షార మమ్లం భేద్యౌష్ట్రకం దధి,
వాతార్శాంసి చ కుష్ఠాని క్రిమీన్ హంత్యుదరాణి చ.
వాతఘ్నం కఫకృత్స్నిగ్ధం విశేషాన్నచ పిత్తకృత్,
కుర్యాద్భక్తాభిలాషం చ దధి మస్తు పరిశ్రుతమ్.
శృతక్షీరాచ్చ యజ్జాతం గుణవద్దధి తత్ స్మృతం,
వాతపిత్తహరం రుచ్యం ధాత్వగ్నిబలవర్ధనం.
దధి త్వసారం రూక్షం తు గ్రాహి విష్టంభి వాతలం,
దీపనీయం విశేషేణ సకషాయం రుచిప్రదమ్."

మేకపెరుగు కఫము, పిత్తము వీనిని పోగొట్టును. పాకమువలన లఘువుగ నుండును విషమును హరింపజేయును. దుర్నామరోగము, శ్వాసము, కాసము వీనియందు హితకర

మైనది. అగ్నిదీపనమును జేయును. ఎనుము పెరుగు పాకమువలన మధురముగనుండును, శుక్రవృద్ధికారి, రక్తపిత్తమును పోగొట్టును. విశేషముగా కఫమును వృద్ధిచేయును. స్నిగ్ధ

ండును ఒంటెపెరుగు పాకమువలన కటువుగనుండును. కొంచెము ఉప్పగ పుల్లగ మలాదులను భేదించును. వాతమువలనజనించిన అర్శస్సు, కుష్ఠము, క్రిములు, రోగము వీనిని పోగొట్టును. బాగుగా కాగినపాలవలన జనించినపెరుగుమీది మీగడ వాతమును పోగొట్టును. కఫమును జేయును, స్నిగ్ధముగనుండును, స్వల్పముగాపిత్తమును జేయును. అన్నమునందిచ్ఛను గలుగజేయును. బాగుగా కాగినపాలలోనుండి జనించిన పెరుగు మిగులగుణకారి. వాతపిత్తములను హరింపజేయును. రుచిని బుట్టించును. ధాతువులు, జాఠరాగ్ని, బలము వీనిని వృద్ధిజేయును. మిగులపుల్లగనుండు పెరుగు సారహీనముగనుండును, మలాదులను బంధించును వాతకారి, కొంచెము వగరుగనుండు పెరుగు విశేషముగా అగ్నిదీపనమును, రుచిని పుట్టించును, అని సుశ్రుతమునందు చెప్పబడియున్నది.

## తక్రగుణము

తక్రం లఘు కషాయామ్లం దీపనం కఫవాతజిత్. 33
శోఫోదరార్శోగ్రహణీదోషమూత్రగ్రహారుచీః,
ప్లీహగుల్మఘృతవ్యాపద్గరపాండ్వామయాన్ జయేత్. 34

తక్రము (అనగా పాతికనీళ్లు కలిసినచల్ల) లఘువుగ, కొంచెము వగరుగ, పుల్లగనుండును. దీపనకారి. కఫము, వాతము, శోఫ, ఉదరము, అర్శస్సు, గ్రహణి, మూత్రప్రతిబంధము, అరుచి, ప్లీహము, గుల్మము, అధికఘృతపానమువలన గలిగిన రోగము, పాండువు, కృత్రిమవిషము, వీనిని పోగొట్టును.

"నైవ తక్రం క్షతే దద్యాన్నోష్ణకాలే న దుర్బలే,
న మూర్ఛాభ్రమదాహేషు న రోగే రక్తపైత్తికే.
శీతకాలేఽగ్నిమాంద్యే చ కఫోత్థేష్వామయేషు చ,
మార్గే విరోధే దుష్టే చ వాయౌ తక్రం ప్రశస్యతే.
తక్రమామం కఫం కోష్ఠే హంతి కంఠే కరోతి చ,
పీనసశ్వాసకాసాదౌ సిద్ధమేవోపయోజయేత్.
మందజాతం మరుతోఽపి రూక్షాభిష్యంది దుర్జరం,
అతిజాతం భృశామ్లోష్ణ తైక్ష్ణ్యాత్పిత్తకరం పరమ్.
దోషఘ్న ముద్ధృతస్నేహం సస్నేహమపి శోఫజిత్,
వాతేఽమ్లం సైంధవోపేతం స్వాదు పిత్తే సశర్కరం.
హితం పథ్యం కఫే సామ్లం వ్యోషసౌవర్చలాన్వితం,
తక్రాల్లఘుతరో మండో దర్జరా తక్రకూర్చికా."

గాయము, ఉష్ణకాలము, దౌర్బల్యము, మూర్ఛ, భ్రమ. సర్వాంగతాపము, రక్తపిత్త రోగము, ఇవిగలిగియుండునపుడు తక్రము నుపయోగింపంజనదు. శీతకాలము, అగ్నిమాంద్యము, కఫరోగములు, స్రోతోమార్గములు విరోధముగనుండుట, దుష్ట ఇవికలిగియుండునపుడు తక్రముహితకరమైనది. పచ్చిచల్ల కోష్ఠగతమైన పోగొట్టును. కంఠమునందుకఫమునుగలుగజేయును. పీనసము, శ్వాసము, కాసము, అను నీరోగములయందు కాగినచల్లనే యుపయోగింపవలయును. లేతపెరుగు వాతము నధికపరచును. రూక్ష జేయును. కఫకారి, జీర్ణముకాకుండును. మిగులపేరిపుల్లగనుండు పెరుగు మిగుల పుల్లగనుండుటవలన అధికముగా పిత్తమునుజేయును. బాగుగా వెన్నతీయబడిన చల్ల వాతాదులయొక్క ప్రకోపముననణచును. కొంచెము వెన్నతోగూడియుండు చల్ల శోఫను పోగొట్టును. వాతప్రకోపమునందు సైంధవలవణముతో గూడియుండు పుల్లనిచల్లయును, పిత్తప్రకోపమునందు శర్కరతోగూడి మధురముగనుండుచల్లయును, కఫప్రకోపమునందు త్రికటుకములు, సౌవర్చలవణము, వీనితో గూడి కొంచెము పుల్లగనుండు చల్లయును, హితకరముగ, పథ్యకరముగనుండును. పెరుగుమీది మీగడ తక్రముకంటె లఘువుగనుండును. తక్రకూర్చిక జీర్ణముకాకుండును. అని సుశ్రుతమనందు చెప్పబడియున్నది

### మస్తుగుణము

తద్వన్మస్తు సరం స్రోతశ్శోధి విష్టంభజిల్లఘు,

పెరుగుమీది మీగడకును తక్రగుణమే గలిగియుండును. శరీరమునందు వేగముగా వ్యాపించును. స్రోతస్సులను శుద్ధిపరచును. మలబంధమును పోగొట్టును. లఘువుగ నుండును.

"తృష్ణాక్లమహరం మస్తు లఘు స్రోతోవిశోధనం,
అమ్లం కషాయానురస మవృష్యం కఫవాతజిత్.
ఆహ్లాదనం ప్రీణనం చ భినత్త్యాశు మలం చ తత్,
బలమావహతి క్షిప్రం తథా భక్తస్య రోచనమ్."

పెరుగుమీది మీగడ దప్పిని, బడలికనుపోగొట్టును. లఘువుగనుండును. స్రోతస్సులను శుద్ధిపరచును. కొంచెము పుల్లగ, వగరుగనుండును. శుక్రమును కొంచెము తగ్గించును కఫవాతములను హరింపజేయును. మనస్సంతోషము, తృప్తి, బలము, అన్నమునందరుచి వీనిని కలుగజేయును. మలమును శీఘ్రముగా భేదించును అని సుశ్రుతమునందచెప్పబడియున్నది.

### వెన్నగుణము

నవనీతం నవం వృష్యం శీతం వర్ణబలాగ్నికృత్. 38
సంగ్రాహి వాతపిత్తాసృక్క్షయార్శోర్దితకాసజిత్,

నవీనమైన వెన్న శుక్రమును వృద్ధిచేయును. శీతలమైన వీర్యముగలది. శరీరమునందు వర్ణము, బలము, అగ్నిదీపనము, వీనిని కలుగజేయును. మలమును గట్టిపరచును, వాతము, పిత్తరక్తము, క్షయము, అర్శస్సు, అర్దితవాతము, కాసము వీనిని పోగొట్టును.

"శీతం స్వాదు కషాయామ్లం నవనీతం నవోద్ధృతం;
చక్షుష్యం బాలవృద్ధానాం ప్రశస్తం సౌకుమార్యకృత్."

తత్క్షణమున నెత్తబడినవెన్న శీతలముగ, మధురముగ, కొంచెము వగరుగ, పుల్లగనుండును. నేత్రములకు మేలుచేయును. బాలురకు, వృద్ధులకు మిగుల పథ్యకరమైనది. సౌకుమార్యమును గలుగజేయును, అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

### క్షీరజనవనీతగుణము

క్షీరోద్భవం తు సంగ్రాహి రక్తపిత్తాక్షిరోగజిత్. 36

క్షీరములోనుండి తీయబడినవెన్న మలమును గట్టిపరచును. రక్తపిత్తరోగము నేత్రరోగమును పోగొట్టును.

### ఘృతగుణము

శస్తం ధీస్మృతిమేధాగ్నిబలాయుశ్శుక్రచక్షుషాం,
బాలవృద్ధప్రజాకాంతి సౌకుమార్యస్వరార్థినామ్. 37
క్షతక్షీణపరిసర్పశస్త్రాగ్నిగ్లపితాత్మనాం,
వాతపిత్తవిషోన్మాదశోషాలక్ష్మీజ్వరాపహమ్. 38
స్నేహానాముత్తమం శీతం వయసః స్థాపనం ఘృతం,
సహస్రవీర్యం విధిభి శ్శృతం కర్మసహస్రకృత్. 39

నెయ్యి వస్తుగ్రహణశక్తి, స్మృతి (అనగా గతించిన విషయములను విచారించు శక్తి), మేధ (అనగా ధారణాశక్తి), జాఠరాగ్ని, బలము, ఆయువు, శుక్రము, నేత్రములు వీనికి హితముచేయును. బాలవృద్ధులకును, సంతతి, కాంతి, సుకుమారత్వము, మంచికంఠస్వరము, వీనినిచ్ఛయించువారికిని, గాయము, ధాతుక్షయముగలవారికిని, విసర్పరోగము, శస్త్రము, నిప్పువీనివలన పీడింపబడిన శరీరముగలవారికిని మిగుల హితకరమైనది. వాతము, పిత్తము, విషము, ఉన్మాదము, శోష, అలక్ష్మి, జ్వరము, వీనిని పోగొట్టును. తైలాదిస్నేహములకన్నిటికంటె శ్రేష్ఠమైనది శీతమైన వీర్యము గలది. ముసలితనము రాకుండా వయస్సును నిలుపును. యోగసంస్కారాదులవలన అనేకమయిన

శక్తికలది (అనగా ఏద్రవ్యముతో చేర్చి ప్రయోగింపబడునో, లేక యేద్రవ్యముతో చేర్చి సంస్కారముచేయబడునో అట్టిద్రవ్యముయొక్క శక్తిని అనుసరించియుండు నని భావము.) మఱియు నీఘృతముచేత వెయ్యిసంస్కారములు చేయంజను నని కొందరు వచించెదరు. ఘృతము అనేక కార్యములను జేయును.

### ప్రాతనెయ్యిగుణము

మదాపస్మారమూర్ఛాయ శిరఃకర్ణాక్షియోనిజాన్,
పురాణం జయతి వ్యాధీన్ వ్రణశోధనరోపణమ్. ౮౦

మిగుల పాతబడిన నెయ్యి మదము, అపస్మారము, మూర్ఛ, శిరోరోగము, కర్ణరోగము, నేత్రరోగము, యోనిరోగము, వీనిని పోగొట్టును. వ్రణములను శుద్ధిపరచి యూర్చును.

“వ్రణశోధనరోపణం,
పూర్వోక్తాంశ్చాధికాన్ కుర్యాద్గుణాం స్తదమృతోపమం,
తద్వచ్చ ఘృతమండోఽపి రూక్షతీక్ష్ణస్తనుస్తు సః.”

అమృతతుల్యమైనది. ఘృతముమీదిమీగడ రూక్షముగ, ఉష్ణముగ, లఘువుగ నుండును అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

“వరమేకాదశం ప్రాప్తం సర్వదోషహరం పరమ్, స్థితం వర్షశతం భూమౌ కౌంభమిత్యపదిశ్యతే, స్వల్పక్షీరో బహుస్తక్రః కిలాటస్స్వల్పశర్కరః.”

పదునొకండు సంవత్సరములుంచబడిన నెయ్యి సర్వదోషములను హరింపజేయును. నూఱు సంవత్సరములు భూమియందుంచబడిన నెయ్యి కౌంభమనబడును. కొంచెము పాలు, అధికముగా మజ్జిగ, స్వల్పముగా శర్కర చేరియుండునది కిలాటమనబడును. అని అధికపాఠము కొన్ని గ్రంథములయందు గన్పట్టుచున్నది.

### కిలాటాదిగుణము

బల్యాః కిలాటపీయూషకూర్చికామోరణాదయః,
శుక్రనిద్రాకఫకరా విష్టంభిగురుదోషలాః ౮౧

కిలాటము (అనగా ఒకింతపాలు అధికముగా మజ్జిగచేర్చి చేయబడినది.) పీయూషము (అనగా అపుడే యీనినపాలతో జేయబడునది.) కూర్చికా (అనగా పెరుగు మజ్జిగ చేర్చి చేయబడినది.) మోరణము (అనగా క్షీరతుల్యమైనది.) మొదలగునవి యన్నియు బలమునిచ్చును. శుక్రము, నిద్ర, కఫము, వీనిని విశేషముగా వృద్ధిచేయును. మలబంధము, గురుత్వముచేయును, దోషకారి, “విష్టంభి గురుదోషలాః” అని చెప్పియుండుటచేతనే జాఠరాగ్నిని నశింపజేయు ననిస్పష్టముగా దెలియుచున్నది. గనుక

"వహ్నినాశనా" అని గ్రంథకర్త ప్రత్యేకముగా జెప్పక విరమించెను. మోరటాది అను ఆదిశబ్దముచేత తక్రపిండకము, క్షీరశాకము వీనిని గ్రహింపవలయును.

క్షీరాదిగుణాగుణములు

## గవ్యే క్షీరఘృతే శ్రేష్ఠే నిందితే చావిసంభవే,

ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుపెరుగు, ఆవుమజ్జిగ మొదలగునవి శ్రేష్ఠంబులు, మేకపాలు, మేకనెయ్యి, మేకపెరుగు, మేకమజ్జిగ మొదలగునవి నిందితంబులు.

"విద్యాద్దధిఘృతాదీనాం గుణదోషాన్యథాపయః."

ఆయాజంతువులపాలకు చెప్పబడిన గుణాగుణములే పాలయొక్క వికారమైన పెరుగు, నెయ్యి మొదలగువానికిని కలిగియుండునని అష్టాంగసంగ్రహమునందు స్పష్టముగా చెప్పబడియున్నది. మఱియు నిటులనే —

"దధ్యాదీనాంతు లజ్జానాం సామాన్యే గుణకర్మణీ."

అనువచనముచేత ఖరనాదమను గ్రంథమునందు కూడ నీవిషయమే చెప్పబడియున్నది.

క్షీరవర్గము ముగిసెను.



అవ. చెఱుకు క్షీరమునకు సమానమైన గుణాగుణములు గలది యగుటచే నికమీదట ఇక్షువర్గము చెప్పబడుచున్నది.

చెఱకురసగుణము

## ఇక్షోరసో గురుస్స్నిగ్ధో బృంహణః కఫమూత్రకృత్. 

## వృష్యశ్శీతోఽస్రపిత్తఘ్నః స్వాదుపాకరసస్సరః, ౪౨

చెఱకురసము గురువుగ, స్నిగ్ధముగ నుండును. శరీరమునకు పుష్టినిచ్చును. కఫమూత్రములను, శుక్రమును వృద్ధిచేయును. శీతమైనవీర్యము గలది. రక్తపిత్తమును పోగొట్టును. మధురమైనపాకరసములు గలది. మలమును భేదించును. స్నిగ్ధముగ, శరీరపుష్టికారిగ, శుక్రవృద్ధికారిగ నుండు ద్రవ్యములన్నియు తరచుగా వాతమును పోగొట్టుటయందు ప్రసిద్ధంబు లగుటచే గ్రంథకర్త "వాతజిత్" అని ప్రత్యేకముగా చెప్పక విరమించెను.

"వృష్యశ్శీతః పవనజిద్భక్తే వాతప్రకోపనః."

చెఱుకును దంతములతో నమిలి భుజించిన వాతము ప్రకోపించునని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది. ఈయర్థమే —

"మారుతాధ్మానజననః చక్షుష్యో బృంహణో రసః"

అను వచనముచేత ఖరనాదమను గ్రంథమునందుకూడ చెప్పబడియున్నది.

## దంతపీడితఇక్షురసగుణము

స్యోఽగ్రే సలవణో దంతపీడితశ్శర్కరాసమః. ४3

చెఱకురసము చెఱకుయొక్క కొనలో కొంచెము ఉప్పగ నుండును. దంతములతో నములుటచే జనించినరసము శర్కరతో సమానమైనగుణము గలది.

"అతీవ మధురో మూలే మధ్యే మధుర ఏవ చ,

అగ్రే త్వక్షిషు విజ్ఞేయ ఇక్షూణాం లవణో రసః.

చెఱకు క్రిందిభాగమునందలి రసము మిగుల మధురముగ నుండును. మధ్యప్రదేశమునందలి రసము మధురముగ నుండును. గణుపులు, కొన వీనియందలి రసము ఉప్పగ నుండును అని సుశ్రుతమునందు చెప్పబడియున్నది. యంత్రము, దంతములు వీనిచే పీడించి తీయబడిన చెఱకురసమునకు ఈగ్రంథకర్త ప్రత్యేకముగా గుణములు చెప్పియుండుటవలన క్రింద చెప్పినగుణములు పాషాణాదులవలన నరికితీయబడిన చెఱకురసమున కని తెలియవలయును.

## యంత్రజఇక్షురసగుణము

మూలాగ్రజంతుజగ్ధాదిపీడనాన్మలసంకరాత్,
కించిత్కాలం విధృత్యా చ విక్రృతిం యాతి యాంత్రికః. ४४
విదాహీ గురువిష్టంభీ తేనాసౌ

యంత్రమువలన తీయబడినరసములో వేరు, కొన, పురుగుపట్టినచెఱకు సంబంధము గలిగియుండుటచేతను, మురికిచేరియుండుటచేతను, ఒకింతకాలవిళంబమువలన జనించుటచేతను, ఆరసము వికారమును జెందియుండును. కాబట్టి యంత్రముచే తీయబడినరసము విదాహగుణముతో గూడియుండును. (అనగా జారరాగ్ని సంయోగమువలన పాకంబై పిత్తమును చేయుచు చిరకాలమువరకు జీర్ణము కాకుండు నని భావము.) మలమును బంధించును. గురువుగనుండును. వేరు, కొన, పురుగుపట్టినచెఱకు, మురికి సంబంధము ఇవిలేకుండ యంత్రమునందు తీయబడిన చెఱకురసమునకు విదాహాది దుర్గుణములు లేకుండు నని తెలియవలయును.

## పౌండ్రకాదీక్షురసగుణము

తత్ర పౌండ్రకః,
శైత్యప్రసాదమాధుర్యైర్వర స్తమనువాంశికః. ४౫

చెఱకులలో పౌండ్రక మను చెఱకుయొక్కరసము శైత్యము ప్రసన్నత్వము, మాధుర్యము అను నీగుణములవలన శ్రేష్ఠంబైనది. వంశ మనుచెఱకుయొక్కరసము పౌండ్రకమను చెఱకుయొక్కరసమునకంటె తక్కువైన శైత్యాదిగుణములుగలది.

### శతపర్వాది ఇక్షురసగుణము

శాతపర్వకకాంతారనైపాలాద్యాస్తతః క్రమాత్,
సక్షారాస్సకషాయాశ్చ సోష్ణాః కించిద్విదాహినః. ౪౬

శతపర్వము, కాంతారము, నేపాళము మొదలగుభేదములుకల చెఱకుయొక్క రసములు యథాక్రమముగ నొకదానికంటె నొకటి శైత్యాదిగుణములవలన తక్కువగ నుండును. మఱియును కొంచెము ఉప్పగ, కషాయముగ, ఉష్ణముగ, విదాహగుణయుక్తముగ నుండును.

### ఫాణితగుణము

ఫాణితం గుర్వభిష్యంది చయకృన్మూత్రశోధనం,

ఫాణితము (అనగా కుండలో పోసియుంచెడు పెరుగువంటి పంచదార) మిగుల గురుత్వము గలది. శ్లేష్మమును వృద్ధిచేయును, త్రిదోషముల నధికముచేయును. మూత్రమును శుద్ధిపరచును.

"రూక్షం మధూకపుష్పోత్థం ఫాణితం వాతపిత్తకృత్,
కఫఘ్నం మధురం పాకే కషాయం వస్తిదూషణమ్"

ఇప్పపువ్వులలోనుండి జనించినఫాణితము రూక్షముగ నుండును. వృద్ధిచేయును. వాతపిత్తములను జేయును. కఫమును పోగొట్టును. మధురమైనపాకముగలది. వగరుగనుండును. పొత్తికడుపున చెరుపుచేయును. అని తంత్రాంతరమునందు చెప్పబడియున్నది.

### బెల్లముగుణము

నాతిశ్లేష్మకరో ధౌతస్సృష్టమూత్రశకృద్గుడః. ౪౭
ప్రభూతక్రిమిమజ్జాసృఙ్మేదోమాంసకఫోఽపరః,

సంస్కారాధిక్యముచే నిర్మలమైనబెల్లము కొంచెముగా కఫమును వృద్ధిచేయును. మూత్రమును, మలమును బైలుపరచును. సంస్కారములేక మురికితోగూడి యుండు బెల్లము, క్రిములు, మజ్జ, రక్తము. మేదస్సు, మాంసము, కఫము వీని నధికముచేయును.

### ప్రాతక్రొత్తబెల్లపుగుణము

హృద్యః పురాణః పథ్యశ్చ నవః శ్లేష్మాగ్నిసాదకృత్. ౪౮

ప్రాతబెల్లము హృదయమునకు మేలు చేయును. పథ్యకరమైనది. నూతనమైన బెల్లము కఫకారి, జాఠరాగ్నిని నశింపజేయును.

### మత్స్యండికాదిగుణము

వృష్యాః క్షతక్షీణహితా రక్తపిత్తానిలాపహాః,
మత్స్యండికాఖండసితాః క్రమేణ గుణవత్తమాః. ౪౯

మత్స్యండిక (అనగా ఘుటికయయ్యేలాగు కాచిన చెఱకుపాకు,) ఖండశర్కర, పంచదార అనునవి శుక్రమును వృద్ధిచేయును. గాయము, క్షీణధాతువుగలవారు, వీరలకు హితకరమైనది. రక్తపిత్తము, వాతము, వీనిని పోగొట్టును. ఇవి యొకటికన్న నొకటివరుసగ గుణోత్తరమైయుండును. (అనగా నిర్మలమైన బెల్లమునకంటె మత్స్యండికయు దానికంటె ఖండమును దానికంటె శర్కరయును విశేషముగా గుణకరమైనదనిభావము.)

### యవాస శర్కరగుణము

తద్గుణా తిక్తమధురా కషాయా యాసశర్కరా,

యవాసశర్కర కొంచెము చేదుగ, మాధుర్యముగ, వగరైన రసముగలదిగనుండును. శర్కరతో సమానమైన గుణముగలది. దూలగొండిరసముతో జేయబడినది యవాసశర్కరయనియు, యాసశర్కరయనియు చెప్పబడును.

### శర్కరగుణము

దాహతృట్ఛర్దిమూర్ఛాసృక్పిత్తఘ్న్యస్సర్వశర్కరాః. ౫౦

సమస్తమైనశర్కరలు తాపము, దప్పి, వాంతి, మూర్ఛ, రక్తపిత్తము వీనిని పోగొట్టును.

"యథాయథాసాం నైర్మల్యం మధురత్వం యథాయథా,
స్నేహలాఘవశైత్యాదిసారత్వం చ తథాతథా."

శర్కర మొదలగువాని నైర్మల్య, మాధుర్యగుణముల కనుగుణముగానే స్నేహ, లఘుత్వ, శైత్యాదివిశేషగుణములు అని చక్కెరలకును గలిగియుండునని గ్రంథాంతరమునందు చెప్పబడియున్నది.

### శర్కరాదలకు శ్రేష్ఠనికృష్టత్వములు

శర్కరేక్షువికారాణాం ఫాణితం చ వరావరే,

ఇక్షువికారములలో పంచదార శ్రేష్ఠమైనదిగను, ఫాణితము నికృష్టమైనదిగనుండును. (అనగా అన్నిటిలోను పంచదార శ్రేష్ఠమైనదని, ఫాణితము నికృష్టమైనదని భావము.) పంచదార ప్రసంగమువలన తేనెగుణము చెప్పబడుచున్నది.

### తేనెగుణము

చక్షుష్యం ఛేది తృట్శ్లేష్మ విషహిధ్మాస్రపిత్తనుత్. ౫౧
మేహకుష్ఠకృమిచ్ఛర్ది శ్వాసకాసాతిసారనుత్,
వ్రణశోధనసంధానరోపణం వాతలం మధు. ౫౨
రూక్షం కషాయమధురం తత్తుల్యా మధుశర్కరా,

తేనె నేత్రములకు హితముచేయును. అశ్చ్యోతనము, వ్రణలేపము మొదలగు వానియందు ప్రశస్తమైనది. దీనిని సేవించుటవలన శరీరమునందు ఉంటలుకట్టియుండు పదార్థములను విభజించును. ఎక్కిళ్ళు, శ్లేష్మ, విషము, హిధ్మ (ఎక్కిళ్లు), రక్తపిత్తము, మేహము, కుష్ఠము, క్రిములు, వాంతి, శ్వాసము, కాసము, అతిసారము వీనిని హరింప చేయును. వ్రణమును శోధించి, (అనగా వ్రణమునందలి నీరును వెలిపరచి) అర్చును, వ్రణమును సంధానముజేయును. (అనగా రెండు, లేక మూడుముఖములుగల వ్రణముల, కొకముఖమును గలుగజేయు ననిభావము) వ్రణచికిత్సయందు తేనెను వ్రణములపై లేపనముచేయవలయునే కాని పానము చేయంగజనదు. వాతము నధికముగ వృద్ధినొందించును. రూక్షగుణము కల్గియుండును. వగరుగ, మధురముగ నుండును. తేనెవలనబుట్టిన చక్కెర తేనెతో సమానమైన గుణముగలది.

"భ్రామరం పైత్తికం క్షౌద్రం మాక్షికం తద్యథోత్తరమ్,
తత్ర స్యాద్భ్రామరం శుక్లం ఘృతవర్ణం తు పైత్తికమ్.
క్షౌద్రం తు కపిలం విద్యాత్తైలాభం మాక్షికం మతమ్,
భ్రామరం తర్పణం స్వాదు త్రిదోషం పైత్తికం విదుః.
వరంచ గుర్వభిష్యంది క్షౌద్రం రూక్షం మనాగ్గురు,
మాక్షికం లఘుపవనం మధురం శస్యతే వ్రణే.
గరీయస్స్యాద్వభిష్యంది నవం జీర్ణమతోఽన్యథా,
మందః పురాణాన్మధునస్తీక్ష్ణో రూక్షో లఘుస్తనుః."

అను వచనములచేత తేనె భ్రామరమని, పైత్తికమని, క్షౌద్రమని, మాక్షికమని నాల్గు విధంబులు. వానిలో భ్రామరమను తేనె శుక్లవర్ణముగను, పైత్తికమను తేనె ఘృతవర్ణముగను, క్షౌద్రమను తేనె కపిలవర్ణముగను, మాక్షికమను తేనె తైలవర్ణముగ నుండును. భ్రామరమను తేనె ధాతువులకు తృప్తిని కల్గించును. పైత్తికమను తేనె త్రిదోషములను ప్రకోపింపజేయును. క్షౌద్రమను తేనె శ్రేష్ఠమైనది; గురువుగనుండును; శ్లేష్మమును వృద్ధిచేయును. మాక్షికమను తేనె రూక్షముగ నుండును; కొంచెము గురుత్వమును జేయును; వాతమును వృద్ధినొందించును; మధురముగనుండును, వ్రణములయందు మిగుల ప్రశస్తమయినది. నూతనమయిన తేనె మిక్కుటముగా గురుత్వము చేయును. మధురముగ నుండును. శ్లేష్మమునుజేయును. ప్రాతతేనె పైచెప్పినదానికన్న విరుద్ధముగనుండును. తేనెమీదమీగడ ప్రాతతేనెకంటె కొంచెము తీక్ష్ణముగ నుండును. రూక్షగుణముకల్గియుండును. లఘువుగనుండును. ఇటులనే లేనెకు కటుపాక, శైత్య, విషసంబంధ, యోగవాహిత్వాదిగుణములు గలిగియుండు నని యీ తంత్రకారుడే అష్టాంగసంగ్రహమున తేనెయొక్క భేదములను విశదముగా చెప్పియున్నాడు. మఱియును:—

"నవీనం గుర్వభిష్యంది విద్యాజ్జీర్ణమతోఽన్యథా,
నానాద్రవ్యాత్మకత్వాచ్చ యోగవాహిపరం మధు.
విశేషాద్గుర్వభిష్యంది భ్రామరం స్వాదు తర్పణమ్,
క్షౌద్రం సతిక్తం మధురం లఘు రూక్షం విశోధనమ్.
పైత్తికం బృంహణం క్షీణక్షతవ్రణహితం లఘు,
తస్మాల్లఘుతరం రూక్షం మాక్షికం ప్రవరం స్మృతమ్.
శ్వాసాదిషుచసర్వేషు ప్రశస్తం తద్విశేషతః,
నవం మధురభూయిష్టం మధ్వభిష్యంది రోచకమ్.
పురాణం నిరభిష్యంది క్రమాద్వర్జితగౌరవమ్,
ఖండః పురాణో మధునస్తీక్ష్ణో రూక్షో లఘుస్తథః."

తేనె నానాద్రవ్య స్వరూపముగలదిగ నుండుటవలన మిగుల యోగవాహిగ నుండును. భ్రామరమను తేనె మిగులగురువుగ, మధురముగనుండును. శ్లేష్మకారి తృప్తినిచ్చును. క్షౌద్రమను తేనె కొంచెము తిక్తముగ, మధురముగ లఘువుగ, రూక్షముగ శరీరశుద్ధికారిగ నుండును. పైత్తిక మను తేనె శరీరపుష్టిని గలుగజేయును. కృశించినవారు, గాయము గలవారు, వ్రణితులు వీరికి హితకరమైనది. లఘువుగ నుండును. మాక్షిక మను తేనె పైత్తిక మను తేనెకంటె మిగులలఘువుగ, రూక్షముగ, అన్నిటిలోను శ్రేష్ఠమైనదిగ నుండుట యేగాక శ్వాసము మొదలగురోగములయందు మిగుల హితకరమైనది. నవీనమైన తేనె మిగుల మధురముగ, శ్లేష్మకారిగనుండును. రుచిని పుట్టించును. ప్రాత తేనె శ్లేష్మకారి కాదు, గురుత్వహీనముగ నుండును. తేనెయొక్క ప్రాచీనమైనమండము తీక్ష్ణముగ, రూక్షముగ, లఘువుగనుండును అని అష్టాంగసంహితయందు చెప్పబడియున్నది.

### కాచిన తేనెగుణము

ఉష్ణముష్ణార్తముష్ణే చ యుక్తం చోష్ణైర్నిహంతి తత్. ౫౩

తా. తేనెను కాచిగాని, లేక ఉష్ణపీడితుడుగనుండు పురుషునివిషయములోగాని లేక ఉష్ణమైన కాలదేశములయందుగాని, లేక ఉష్ణకరమైనఆహారాదులతో చేర్చిగాని, ఉపయోగపరచినచో మనుజుని చంపును.

### ఉష్ణమధూపయోగానుజ్ఞ

ప్రచ్ఛర్దనే నిరూహే చ మధూష్ణం న నివార్యతే,
అలబ్ధపాకమాశ్వేవ తయోర్యస్మాన్నివర్తతే. ౫౪

తా. వమనము, నిరూహవస్తి, వీనియందు కాచబడినతేనె నుపయోగపరచినను

అది ఉదరమునందు పాకమును జెందక శీఘ్రముగా బయలువెడలును. కావున వమననిరూహవస్తులయందు కాచబడిన లేనె నిషేధించబడనేరదు.

ఇక్షువర్గము ముగిసెను.

అవ. క్షీరవర్గానంతరము స్నేహముతో తుల్యమైనగుణముగల తైలవర్గము వెంబడిగా చెప్పదగియుండినను, సమానమైన రసవీర్యవిపాక క్రియలుగలదియును, భక్ష్యభోజ్యాద్యాహారములయందు తఱుచుగ నుపయోగించునదియునైన ఇక్షువర్గము తైల, క్షీరవర్గములకు నడుమ చెప్పబడినది. తైలవర్గము భోజనమునం దధికముగా నుపయోగపడుటవలన మద్యవర్గమునకంటె ముందుగా తైలవర్గము నీతంత్రకారుడు చెప్పుచున్నాడు.

## నువ్వులనూనెగుణము

తైలం స్వయోనివత్తత్ర ముఖ్యం తీక్ష్ణం వ్యవాయి చ,
త్వగ్దోషకృదచక్షుష్యం సూక్ష్మోష్ణం కఫకృన్న చ. ౫౫

తా. సమస్తమైన తైలములు తమకారణవస్తులకు సమానమైనగుణములుగలవై యుండును. (అనగా ఏవస్తువులోనుండి తైలము తీయబడినదో ఆవస్తువుయొక్క గుణమే ఆతైలమునకు గలిగియుండు ననీ భావము.) తైలములలో నువ్వులలోనుండి తీయబడిన తైలమే ముఖ్యమైనది. ఇది తీక్ష్ణముగ నుండును. శరీరమునందంతట వ్యాపించునట్టి స్వభావము గలది. పానాభ్యాసమువలన చర్మమును దూషించును. నేత్రములకు అహితకరమైనది. సూక్ష్మమైన స్రోతస్సులలో సంచరించును. ఉష్ణమైన వీర్యముగలది. కఫకరమైనదికాదు.

"మేధ్యస్తిలస్స్పర్శశీతో మేధ్యం తైలం ఖలో హిమః,
తస్యైవ శ్లేష్మకర్తృత్వం న తైలస్య ఖలస్య చ."

నువ్వులు బుద్ధికి హితముచేయును. శీతలమైన స్పర్శగలవి. వానితైలము బుద్ధి నధికపరచును. నువ్వులపొట్టు శీతలముగనుండును. నువ్వులుమాత్రము శ్లేష్మకారి. నువ్వుల తైలము నువ్వులపొట్టు శ్లేష్మకారికావని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

"విపాకే కటుకం తైలం వాతఘ్నం కఫపిత్తకృత్"

తైలము పాకమువలన కటువుగనుండును. వాతమును హరింపంజేయును. కఫపిత్తములను చేయును. అని ఆయుర్వేదావతార మను గ్రంథములో చెప్పబడియున్నది. "తైలం" అను శబ్దమున కిచట తిలవికార మని యర్థము.

"అతైలమపి తైలమేవోపకృతోప్యపదేశ్యతే, తైలప్రాధాన్యాత్ స్నేహప్రాధాన్యాదితి."

నువ్వులవికారము కాకుండునదికూడ స్నేహప్రాధాన్యమువలన తైలమనబడు నని చరక గ్రంథమునందు చెప్పబడియున్నది. కాబట్టి తైలము, కౌసుంభము, ఏరండము అని తైలశబ్దమును జేర్చకుండ చెప్పినచో తిలకుసుంభాదులయొక్క ఆకులు, కాడలు మొదలగునవి యనికూడ నర్థంబగును. దానంజేసి ఏరండతైలము, కౌసుంభతైలము, తిలతైలము అని ద్రవ్యనామముతోడ తైలశబ్దమునుకూడ చేర్చియే చెప్పవలయును. అట్లుండగా "ముఖ్యం తీక్ష్ణం వ్యవాయ చ" అనగా తిలతైలము ముఖ్య మని శ్లోకములో చెప్పియుండుట అసంగత మని కొందరు శంకించెదరు. అయితే తైలశబ్దము నూనె విషయమునందే ప్రసిద్ధముగనుండునటుల గనుపట్టుచున్నదేకాని ఆకులు, కాడలు మొదలగువాని విషయమునందు ప్రసిద్ధిగనుండునటుల గనుపట్టదు. "తైలం" అని చెప్పినది. నువ్వుల నూనెకే ముఖ్యవాచకమగుటంచేసి ముఖ్యమని మూలములో చెప్పియుండుట యుక్తము. ఇతర స్నేహములలో కుసుంభతైలము ఏరండతైలము అను తైలశబ్దము గౌణప్రయోగము. (అనగా ముఖ్యమైనది కా దని తాత్పర్యము.)

### తైలగుణవిశేషము

కృశానాం బృంహణాయాలం స్థూలానాం కర్శనాయ చ,
బద్ధవిట్కం కృమిఘ్నం చ సంస్కారాత్సర్వదోషజిత్. ౫౬

తైలము కృశించినపురుషులకు శరీరమునందు పుష్టిని కలుగజేయును. స్థూలముగ నుండువారిశరీరమును కృశింపజేయును. మలమును బంధించును. క్రిములను పోగొట్టును. సంస్కారమువలన అనేకరోగములను పోగొట్టును. ఒకటే తైలమువలన పరస్పరవిరుద్ధమగు స్థూలకృశత్వరూపమగు కార్యము లెటుల గలుగు ననగా:—కృశించినశరీరముగల పురుషులయొక్క స్రోతోమార్గములు మిగుల సంకోచమును జెందియుండుటచే వాని యందితరములైన బృంహణద్రవ్యములు లోపల బ్రవేశించుట కసమర్థంబులుగ నుండును. అట్టియెడ తైలము మిగులసంకోచమును జెందిన స్రోతస్సులయందును తీక్ష్ణాదిగుణములచే శీఘ్రముగా బ్రవేశించి వానిని శుద్ధిచేయును. బాగుగ శుద్ధియైనచో శరీరపుష్టి గలుగును

"స్రోతస్సు తత్ర శుద్ధేషు రసో ధాతూనుపైతి యః,
తేన తుష్టిర్బలం వర్ణః పరం పుష్టిశ్చ జాయతే."

స్రోతస్సులు బాగుగా శుద్ధిచెందియుండునపుడు రసములు ధాతువులలో బాగుగా ప్రవేశించును. అందువలన తుష్టి, శరీరమునందు బలము, వర్ణము, విశేషముగా పుష్టి గలుగునని ఉత్తరత్ర చెప్పబడును. కాబట్టి తైలము కృశించినవారికి శరీరపుష్టికరమని చెప్పియుండుట యుక్తము. అటులనే స్థూలశరీరముగలవారియొక్క సూక్ష్మమైన సర్వస్రోతస్సులలో తైల

ము ప్రవేశించి తీక్ష్ణోష్ణాదిగుణములచే మేదస్సును క్షయింపజేసి స్థూలశరీరమును కృశింప జేయు ననుటయు యుక్తము. తీక్ష్ణాదిగుణములతో గూడిన యితరమైన వస్తువులుకూడ కృశించినశరీరమును స్థూలముగ జేయుటయందును, స్థూలమైన శరీరమును కృశింప జేయుటయందును సమర్థంబు లని తెలియపరచుటకై,—

"కృశానాం బృంహణాయాలం స్థూలానాం కర్శనాయచ"

అని తంత్రకారుడు చెప్పియున్నాడు.

ఆముదపుగుణము

సతిక్తోషణమేరండం తైలం స్వాదు సరం గురు,
వర్ధ్మగుల్మానిలకఫానుదరం విషమజ్వరమ్. ౫౮
రుక్షోఫౌ చ కటీగుహ్యకోష్ఠపృష్ఠాశ్రయౌ జయేత్,

ఆముదము కొంచెము తిక్తముగ, కారముగ, మధురముగ నుండును, శరీరము నందు వ్యాపించును. గురుత్వము గలది. వర్ధ్మరోగము, గుల్మము, వాతము, కఫము, ఉదరరోగము, విషమజ్వరము వీనిని హరింపజేయును నడుము, గుహ్యస్థలము, కోష్ఠము, వీపు, వీనియందలిశూలలను, శోఫను పోగొట్టును.

ఎఱ్ఱాముదపుగుణము

తీక్ష్ణోష్ణం పిచ్ఛిలం విస్రం రక్తైరండోద్భవం త్వతి. ౫౯

ఎఱ్ఱాముదము అధికతీక్ష్ణకారి. ఉష్ణముగ, పిచ్ఛిలముగనుండును. దుర్గంధముగలది.

ఆవనూనెగుణము

కటూష్ణం సార్షపం తీక్ష్ణం కఫశుక్రానిలాపహమ్,
లఘు పిత్తాస్రకృత్కోఠకుష్ఠార్శోవ్రణజంతుజిత్. ౬౦

ఆవనూనె కారముగ, ఉష్ణముగ, తీక్ష్ణముగనుండును. కఫము, శుక్రము, వాతము, కోరరోగము, కుష్ఠము, అర్శస్సు, వ్రణము, కృమిరోగము, వీనిని పోగొట్టును. లఘువుగ నుండును. పిత్తరక్తముజేయును.

తానికాయనూనె గుణము

ఆక్షం స్వాదు హిమం కేశ్యం గురు పిత్తానిలాపహమ్.

తానికాయనూనె మధురముగ, శీతలముగ నుండును. కేశములకు హితకరమైనది. గురువుగ నుండును. పిత్తవాతములను పోగొట్టును.

వేపనూనెగుణము

నాత్యుష్ణం నింబజం తిక్తం కృమికుష్ఠకఫప్రణుత్. ౬౧

వేపనూనె స్వల్పముగా నుష్ణముచేయును. చేదుగనుండును. కృమిరోగము, కుష్ఠము, కఫము వీనిని పోగొట్టును.

అగసినూనె కుసుమనూనెగుణములు

ఉమాకుసుంభజం చోష్ణం త్వగ్దోషకఫపిత్తకృత్,

అగసినూనెయు కుసుమనూనెయు ఉష్ణవీర్యముగలవి. చర్మరోగము, కఫము, పిత్తము, వీనిని కలుగ జేయును.

"దంతిమూలకరక్షోఘ్నకరంజారిష్టశిగ్రుజమ్,
సువర్చలేంగుదీపీలుశంఖినీనీపసంభవమ్.
సరళాగురుదేవాహ్వాశింశుపాసారజన్మ చ,
తువరారుష్కరోత్థం చ తీక్ష్ణం కట్వమ్లపిత్తకృత్.
అర్శఃకుష్ఠకృమిశ్లేష్మశుక్రమేదోఽనిలాపహమ్,
కరంజనింబజే తిక్తే నాత్యుష్ణే తత్ర నిర్దిశేత్.
కషాయతిక్తకటుకం సారళం వ్రణశోధనమ్,
భృశోష్ణతీక్ష్ణకటుకే తువరారుష్కరోద్భవే
విశేషాత్కృమికుష్ఠఘ్నే తథోర్ధ్వాధోవిరేచనే,
అక్షాతిముక్తకాక్షోటనారికేళమధూకజమ్.
త్రపుసైర్వారుకూష్మాండశ్లేష్మాతకప్రియాళజమ్,
వాతపిత్తహరం వృష్యం శ్లేష్మలం గురు శీతలమ్.
పిత్తశ్లేష్మప్రశమనం శ్రీపర్ణీకింశుకోద్భవమ్,
తిలతైలం వరం తేషు కౌసుంభం న వరం పరమ్."

దంతి, ముల్లంగి, ఆవాలు, క్రానుగ, వేప, మునగ, ఆదిత్యభక్తి (ప్రొద్దుతిరుగుడు గారచెట్టు, వరగోగు, కల్లైచెట్టు, నీరుకడిమి. సరళదేవదారు, అగరు, దేవదారు, ఇరుగుడు, సంబరేణి, కందులు, నల్లజీడి, వీనిగింజలలోనుండి తీయబడినతైలములు తీక్ష్ణముగ, కారముగ, పుల్లగనుండును. పిత్తమును జేయును. అర్శస్సు. కుష్ఠము, క్రిమిరోగము, శ్లేష్మము, శుక్రరోగము, మేదస్సు, వాతము వీనిని పోగొట్టును. క్రానుగ, వేప వీనిలోనుండి తీయబడినతైలము తిక్తముగనుండును. స్వల్పముగా నుష్ణముచేయును. సరళదేవదారుతైలము వగరుగ, చేదుగ, కారముగ నుండును. వ్రణమును శుద్ధిచేయును. కందులు, నల్లజీడి వీనితైలము అధికముగా నుష్ణముచేయును. తీక్ష్ణముగ కారముగ నుండును. విశేషముగా క్రిమిరోగమును, కుష్ఠమును పోగొట్టును, వమన విరేచనములను జేయించును. తానికాయ, నెమ్మి, గిరుకతాడి, టెంకాయ, ఇప్ప, ములుదోస, నక్క-

దోస, కూశ్మాండము, విరిగి, మొరలి వీనిగింజలతైలములు వాతపిత్తమును హరింపంజేయును. శుక్రవృద్ధికాని. ఒకింతశ్లేష్మమును జేయును. గురువుగ, శీతలముగ నుండును. గుమ్మడి, రేగు, మోదుగు వీని గింజలతైలము పిత్తమును, శ్లేష్మమును శమింపజేయును. పైజెప్పిన తైలములన్నిటిలో నువ్వులనూనె మిగుల శ్రేష్ఠము. కుసుమతైలము మిగుల నిందితము, అని అష్టాంగసంహితయందు చెప్పబడియున్నది.

## వసాదిగుణము

వసా మజ్జా చ వాతఘ్నౌ బలపిత్తకఫప్రదౌ. ౬౧

మాంసానుగస్వరూపౌ చ విద్యాన్మేదోఽపి తావివ,

వస (అనగా శుద్ధమాంసముయొక్క స్నేహము.) మజ్జ (మూలగ) అను నీరెండును వాతమును పోగొట్టును. బలము, పిత్తము, కఫము, వీనిని గలుగజేయును. ఏప్రాణియొక్క మాంసములోనుండి వసామజ్జాదులు తీయబడునో అట్టిప్రాణియొక్క మాంసగుణమే ఆ వసా మజ్జాదులకును గలిగియుండును. మఱియును వసామజ్జాదులయొక్క గుణమే మేదస్సుకును గలిగియుండును.

"వసా మజ్జా చ వాతఘ్నౌ బలపిత్తకఫప్రదౌ,
మాంసానుగస్వరూపౌ చ విద్యాన్మేదోఽపి తావివ.
శాలూకీసౌకరీపాకహంసజా కుక్కుటోద్భవా,
వసా శ్రేష్ఠా స్వవర్గేషు కుంభీరమహిషోద్భవా.
కాకమద్గువసా తద్వత్కారండోత్థా చ నిందితా,
శాఖాదమేదసాం ఛాగం హాస్తినం చ వరావరమ్."

వస, మజ్జ, అను నీరెండును వాతమును హరింపజేయును. బలము, పిత్తము, కఫము వీనిని వృద్ధిబొందించును. వసామజ్జాదులు స్వకారణమైన మాంసమునకు తుల్యమైన గుణము గలిగియుండును. మేదస్సుకు వసామజ్జాదులయొక్క గుణమే గలిగియుండును. కప్ప, పంది, హంసపిల్ల, కోడి అనువాని వస అన్నివసలలోను శ్రేష్ఠము. కారుమొసలి, దున్నపోతు, కాకి, నీరుకోడి, కారండము (అనగానీరుకాకి) అనువాని వస మిగుల నిందితము. ఆకులను మేసెడి జంతువులలో మేకలయొక్కవస మిగుల శ్రేష్ఠము. ఏనుగవస మిగుల నిందితము. అని తైలవర్గము నధికముగా నీతంత్రకారుడే అష్టాంగ సంగ్రహమునందు చెప్పియుండుటచే నిచట సంక్షేపించి సంగ్రహముగా చెప్పియున్నాడు.

తైలవర్గము ముగిసెను.

అవ. తీక్ష్ణోష్ణసూక్ష్మాదిగుణములు తైలవర్గమువలె మద్యవర్గమునకు గలిగియుండుటవలన తైలవర్గానంతరము మద్యవర్గము చెప్పబడుచున్నది.—

### మద్యగుణము

దీపనం రోచనం మద్యం తీక్ష్ణోష్ణం తుష్టిపుష్టిదమ్. ౬౨
సస్వాదు తిక్తకటుకమమ్లపాకరసం సరమ్,
సకషాయం స్వరారోగ్యప్రతిభావర్ణకృల్లఘు. ౬౩
నష్టనిద్రాతినిద్రేభ్యో హితం పిత్తాస్రదూషణం,
కృశస్థూలహితం రూక్షం సూక్ష్మం స్రోతోవిశోధనమ్. ౬౪
వాతశ్లేష్మహరం యుక్త్యా పీతం విషవదన్యథా,

పలుతెరంగులైన మద్యము లన్నియు కాయాగ్నిని దీపింపజేయును. రుచినిబుట్టించును, తీక్ష్ణముగ ఉష్ణముగనుండును. తుష్టి అనగా మనస్సంతోషమును, శరీరపుష్టిని కలుగజేయును. కొంచెము మధురముగ, చేదుగ, కారముగ, ఆమ్లమైనపాక రసములు గలవిగ నుండును. శరీరమునందు వ్యాపించునట్టి స్వభావము గలవి. కొంచెము వగరుగనుండును. కంఠస్వరము, ఆరోగ్యము, బుద్ధివికాసము, శరీరకాంతి వీనిని గలుగజేయును. లఘువుగ నుండును. నిద్రలేనివారికిని, అధికనిద్రగలవారికిని హితకరమైనవి. పిత్తరక్తమును పోగొట్టును. కృశించిన శరీరము కలవారికిని, స్థూలశరీరము గలవారలకును హితకరమైనవి. రూక్షగ నుండును. స్రోతస్సులయందు సంచరించును. స్రోతస్సులను శుద్ధిజేయును. వాతశ్లేష్మములను హరింపంజేయును. మదాత్యయరోగచికిత్సాప్రకరణమునందు జెప్పినవిధముగ యుక్త్యనుసారముగా పానముచేయబడిన మద్యము పైజెప్పిన గుణముల నన్నిటిని గలుగజేయును. అటుగాక అన్యథా పానముచేయబడినచో విషతుల్యంబగును. సమస్తమైన ద్రవ్యములు ఆరోగ్యార్థమే చెప్పబడియున్నవి. అయినను మద్యము ని[illegible]ముగా శరీరారోగ్యమును గలుగజేయునని తెలియపరచుటకై, "ఆరోగ్యం" అను మూలమునందు ప్రయోగించబడినది. నిద్రలేనివారికి శ్లేష్మాదులను హరింపజేయునట్టి సురాదిమద్యములు హితకరము లనియు, అతినిద్రగలవారికి శ్లేష్మాదులను హరింపజేయునట్టి మాధ్వాదిమద్యములు హితకరములనియు, "నష్టనిద్రాతినిద్రేభ్యోహితమ్" అను మూలవచనమునకు వెవ్వేరుగ కొందరు వ్యాఖ్యానముచేయుచున్నారు. ఇటులనే కొన్ని మద్యములు కృశించినవారికి హితకర మనియు, కొన్ని స్థూలశరీరముగలవారికి హితకర మనియు, "కృశస్థూలహితం" అను మూలవచనమునకు కొందరు వ్యాఖ్యానము చేయుచున్నారు. అయితే ఒకటే విధమైన మద్యమువలన పరస్పర విరుద్ధమైనస్థూల, కృశత్వ రూపమగు కార్యము లెటుల కల్గునని శంకకలిగినచో దన్నివారణార్థంబై తైలప్రకరణమునందు జెప్పబడియుండు న్యాయమునే యనుసరింపవలయును.

### నవీనపురాణమద్యగుణము

గురు*స్త్రిదోషజననం నవం జీర్ణమతోఽన్యథా. ౬౫

నూతనమైన మద్యము గురువుగ నుండును. త్రిదోషములను చేయును. నూతన మనగా ఒకసంవత్సరమునకు పైబడనిమద్యమని కొందరు వ్యాఖ్యానము చేయుచున్నారు. పురాతనమైన మద్యము నూతనమైన మద్యమునకంటె లఘువుగనుండును. త్రిదోషములను హరింపజేయును.

### మద్యపానమునకు అనర్హాలు

పేయం నోష్ణోపచారేణ న విరక్తక్షుధాతురైః,
నాత్యర్థతీక్ష్ణమృద్వల్ప సంభారం కలుషం న చ. ౬౬

ఉష్ణోపచారములు (అనగా ఉష్ణమైన ఆహారవిహారాద్యుపచారములు) గల పురుషుడును, విరేచనమునకు దీసికొనినవాడును, ఆకలివలన పీడింపబడినవాడును, మద్యమును పానముచేయరాదు. ఏలనగా అట్టి కాలమునందు వాతాదిదోషములు విషమములుగా నుండుటవలన రోగోత్పత్తికి కారణములగును. అతితీక్ష్ణముగ, అతి మృదువుగనుండుమద్యములు, అల్పమైనసంభారములతో గూడియుండుమద్యము (అనగా ఫలాసిమద్యమున కింతసంభారము చేర్పవలయునని శాస్త్రమునందును, లోకమునందును ప్రసిద్ధిగ నున్నదో అంతకంటెతక్కువైన సంభారములతో గూడిన మద్యము) స్వచ్ఛముకాకుండుమద్యము, ఇవి పానమునకు యోగ్యములు కావు.

### సురామద్యగుణము

గుల్మోదరార్శోగ్రహణీశోషహృత్స్నేహనీ గురుః,
సురానిలఘ్నీ మేదోసృక్స్తన్యమూత్రకఫావహా. ౬౭

తా. సుర యనుమద్యము గుల్మము, ఉదరరోగము, అర్శస్సు, గ్రహణి, శోష పోగొట్టును. శరీరమునందు జిడ్డును గలుగజేయును. గురువుగనుండును. వాతమును హరింపజేయును. మేదస్సు, రక్తము, చనుబాలు, మూత్రము, కఫము వీనినివృద్ధిచేయును.

### వారుణీమద్యగుణము

తద్గుణా వారుణీ హృద్యా లఘుతీక్ష్ణా నిహంతి చ,
శూలకాసవమిశ్వాసవిబంధాధ్మానపీనసాన్. ౬౮

వారుణి యనుమద్యము సురతో సమానమయిన గుణము గలది. హృదయమునకు హితకరమయినది. లఘువుగ, తీక్ష్ణముగ నుండును. శూల, కాసము, వమనము, శ్వాసము, విబంధము (అనగా స్రోతోమార్గములయందు మురికి చేరి అందు దోషాదులు సంచరింపకుండుట,) ఆధ్మానము, పీనసము వీనిని పోగొట్టును.

---

* త్వద్దోషశమనం ఇతిపా.

"జగలః పాచనో గ్రాహీ రూక్షస్తద్వచ్చ మేదకః,
వక్కసో హృతసారత్వాద్విష్టంభీ దోష కోపనః."

జగలము (అనగా వారుణీమద్యముయొక్క అధోభాగమునందు ఘనముగ నుండు మడ్డి) పాచనమును జేయును. మలమును గట్టిపరచును, మేదకము (అనగా జగలముయొక్క అధోభాగమునందలి మడ్డి) జగలమునకు సమానమైన గుణముగలది. రూక్షముగ నుండును. వక్కసము (అనగా మద్యకల్కములో జలమును చేర్చి చేయబడినది) నిస్సారముగ నుండుటచే మలమును బంధించును. త్రిదోషములను ప్రకోపింపజేయును. అని అష్టాంగ సంగ్రహమునందు జెప్పబడియున్నది. జగలాదులు మిగుల నుపయోగార్హములు కావు కావున వానిగుణముల నీతంత్రకారుడు చెప్పక విరమించెను.

### విభీతక(తానికాయల)మద్యగుణము

నాతితీవ్రమదా లఘ్వీ పథ్యా వైభీతకీ సురా,
వ్రణే పాండ్వామయే కుష్ఠేన చాత్యర్థం విరుధ్యతే ౬౯

తానికాయచే జేయబడిమద్యము అతితీవ్రమైన మదమును గలుగజేయదు. పథ్యకారి; లఘువుగ నుండును. పాండువు, వ్రణము, కుష్ఠము వీనియం దితరమద్యములవలె మిగుల నిషిద్ధమైనదికాదు.

"విష్టంభినీ యవసురా గుర్వీ రూక్షా త్రిదోషలా"

యవసుర యనుమద్యము మలబంధమును జేయును. గురువుగ, రూక్షగనుండును. మిక్కుటముగ దోషకరమైనది అని అష్టాంగసంహితయందు జెప్పబడియున్నది.

### అరిష్టమద్యగుణము

యథాద్రవ్యగుణోఽరిష్టస్సర్వమద్యగుణాధికః,
గ్రహణీపాండుకుష్ఠార్శశ్శోఫశోషోదరజ్వరాన్.
హంతి గుల్మకృమిప్లీహాన్కషాయకటువాతలః,

అరిష్టమను మద్యము తన యుత్పత్తికి కారణమైన ద్రవ్యములయొక్క గుణమే గలదైయుండును. మఱియు పలువెరంగులగు మద్యములకన్న గుణాధికముగ నుండును. గ్రహణి, పాండువు, కుష్ఠము, అర్శస్సు, శోఫ, శోష, ఉదరరోగము, జ్వరము, గుల్మము, కృమిరోగము, ప్లీహము వీనిని పోగొట్టును. కొంచెము కషాయముగ కటువుగ నుండును. వాతమును వృద్ధినొందించును.

"మద్యాకరాదికద్రవ్యం మదిరాద్యాత్మకం తతః,
యథాద్రవ్యగుణోఽరిష్టస్సర్వమద్యగుణాధికః."

మద్యమున కాకరమైన అధికద్రవ్యములు చేరియుండునదియే అరిష్టమనుమద్యమన

బడును. అందులో జేరునట్టి ద్రవ్యగుణములే దానికిని గలిగియుండును. మద్యములకన్నిటి కంటె నుత్కృష్టమైన గుణములు గలది. అని తంత్రాంతరములయందు జెప్పబడి యున్నది.

## మార్ద్వీకమద్యగుణము

మార్ద్వీకం లేఖనం హృద్యం నాత్యుష్ణం మధురం సరమ్. ౭౧
అల్పపిత్తానిలం పాండు మేహార్శఃకృమినాశనం,

ద్రాక్షారసములోనుండి జనించినమద్యము లేఖనకారి. (లేఖన మనగా —
"విలిఖత్యతితైక్ష్ణ్యాద్యద్ధాతూం స్తల్లేఖనం మతమ్".
అను వచనముచేత అతితైక్ష్ణ్యమువలన మాంసాదిధాతువులను శుద్ధిచేయునని యర్థము.) హృదయమునకు మేలు చేయును. మిక్కుటముగా నుష్ణముచేయకుండును. మధురముగ నుండును. శరీరమునందు త్వరగా వ్యాపించును. ఇతర మద్యములకంటె స్వల్పముగా పిత్తవాతములను వృద్ధిచేయును. పాండువు, మేహము, అర్శస్సు, కృమిరోగము, వీనిని పోగొట్టును.

"శుష్కద్రాక్షాంబుసంభూతో విశదో రోచనో హిమః,
ద్రాక్షాసవో మధుసమో బృంహణో భృశదీపనః"

ఎండిన ద్రాక్షపండ్లరసమువలన కలిగిన ద్రాక్షామద్యము శరీరమును శుద్ధిచేయును. రుచిని పుట్టించును. శీతలముగనుండును. తేనెతో తుల్యమైనగుణముగలది. శరీరమునకు పుష్టి నిచ్చును. మిక్కుటముగా అగ్నిదీపనమును గలుగజేయును అని ఇతరతంత్రములయందు జెప్పబడియున్నది.

## ఖర్జూరమద్యగుణము

అస్మాదల్పాంతరగుణం ఖర్జూరం వాతలం గురు. ౭౨

ఖర్జూర మద్యము ద్రాక్షామద్యమునకంటె స్వల్పమయినగుణము కలది. వాతమును 'ఒదించును. గురువుగనుండును.

## శర్కరామద్యగుణము

శార్కరస్సురభిస్స్వాదుర్హృద్యో నాతిమదో లఘుః,

శర్కరాసంబంధమయిన మద్యవిశేషము సుగంధముగ, మధురముగ నుండును. హృదయమునకు మేలుజేయును. స్వల్పముగా మదమును గలుగచేయును. లఘువుగ నుండును.

## గౌడమద్యగుణము

సృష్టమూత్రశకృద్వాతో గౌడ స్తర్పణదీపనః. ౭౩

గుడసంబంధమయినమద్యము మూత్రము, మలము, వాతము, వీనిని వెలిపరచును. తృప్తినిచ్చును. అగ్నిదీపనకారి.

### శీధుమద్యగుణము

వాతపిత్తకరశ్శీధు స్స్నేహశ్లేష్మవికారహా,

శీధు అనుమద్యము వాతపిత్తములను జేయును. స్నేహవికారమును, శ్లేష్మవికారము పోగొట్టును.

### పక్వరసశీధుమద్యగుణము

మేదశ్శోఫోదరార్శోఘ్న స్తత్ర పక్వరసో వరః.　౨౪

శీధు అనుమద్యము కాచిన చెఱకురసమువలన చేయబడినది యనియు, కాచని చెఱకురసమువలన చేయబడినది యనియు రెండువిధంబులు. వీనిలో కాచిన చెఱకురసము వలన చేయబడిన శీధుమద్యము మేదస్సు, శోఫ, ఉదరరోగము, అర్శస్సు, వీనిని హరింప జేయును.

### మాధవమద్యగుణము

ఛేదీ మధ్వాసవ స్తీక్ష్ణో మేహపీనసకాసజిత్,

తేనెవలనచేయబడిన మాధవ మను మద్యము శరీరమున గడ్డ కట్టియుండు పదార్థములను విభజించును. తీక్ష్ణముగనుండును. మేహము, పీనసము, కాసము, వీనిని పోగొట్టును.

"సురాసవ స్తీవ్రమదస్స్వాదుతీక్ష్ణోఽనిలాపహః,
మైరేయో మధురోవృష్యస్సరస్సంతర్పణో గురుః."

సురాసవము (అనగా సుర యనుమద్యములో తేనెనుజేర్చి చేయబడినది,) మిక్కుటముగా మదమును గలుగజేయును. మధురముగ తీక్ష్ణముగనుండును. వాతమును హరింపజేయును. మైరేయనుమద్యము మధురముగనుండును. శుక్రమును వృద్ధిచేయును. శరీరమున చునట్టి స్వభావముగలది. తృప్తినిచ్చును. గురువుగ నుండును. అని అష్టాంగసంగ్ర నందు చెప్పబడియున్నది.

### శుక్తగుణము

రక్తపిత్తకఫోత్క్లేదీ శుక్తం వాతానులోమనమ్.　౨౫
భృశోష్ణతీక్ష్ణరూక్షామ్లం హృద్యం రుచికరం సరం,
దీపనం శిశిరస్పర్శం పాండుదృక్క్రిమినాశనమ్.　౨౬

శుక్తము (అనగా పులిసినకల్లు) రక్తపిత్తమును, కఫమును, బోగొట్టును. వాతమునకు అనులోమగతిని గలుగజేయును. (అనగా వేరేమార్గమునందు సంచరించుచుండు వాతమును స్వస్థానమునందు జేర్చును అని తాత్పర్యము) మిగుల ఉష్ణముగ, తీక్ష్ణముగ,

రూక్షముగ, ఫల్లగ నుండును, హృదయమునకు హితము చేయును. మిక్కుటముగ రుచిని పుట్టించును. శరీరమునందు వ్యాపించును. మిక్కుటముగా అగ్నిదీపనమును జేయును. శీతలమైన స్పర్శగలది. పాండువు, నేత్రరోగము, కృమిరోగము, వీనిని పోగొట్టును.

గుడాదిశుక్తతారతమ్యము

గుడేక్షుమద్యమార్ద్వీకశుక్తం లఘు యథోత్తరం,

గుడము (అనగా బెల్లము), ఇక్షు (అనగా చెఱకు) మద్యము, ద్రాక్ష, వీని యొక్క శుక్తము ఒకదానికంటెనొకటి (అనగా గుడశుక్తమునకంటె ఇక్షుశుక్తము దాని కంటె మద్యశుక్తము, దానికంటె ద్రాక్షాశుక్తము) లఘువుగనుండును.

గుడశుక్తాద్యాసుతగుణము

కందమూలఫలాద్యం చ తద్వద్విద్యాత్తదాసుతమ్. ౭౭

గడ్డలు, వేళ్లు, పండ్లు మొదలగు గుడశుక్తాదిఆసుతమునకు గుడశుక్తాదుల యొక్క గుణమే గలిగియుండును. అనగా అధికశక్తిగలగుడాదిశుక్తము కందమూలాదుల గుణము నాకర్షించుకొని యాకందమూలాదులకు తనస్వరూపమునే గలుగజేయు నని భావము.)

శాండాకీగుణము

శాండాకీ చాసుతం చాన్యత్కాలామ్లం రోచనం లఘు,

ముల్లంగి, ఆవకూర, వీనినిజేర్చి పక్వముచేసి నల్లజీలకఱ్ఱ, నల్లఆవాలు, వీనిచే భావన చేయబడినది శాండాకి యనబడును. శాండాకియును, కాలవిశేషమువలన పులిసిన ను రుచిగ, లఘువుగ నుండును.

ధాన్యామ్లగుణము

ధాన్యామ్లం భేది తీక్ష్ణోష్ణం పిత్తకృత్స్పర్శశీతలమ్. ౭౮
శ్రమక్లమహరం రుచ్యం దీపనం వస్తిశూలనుత్,
శస్తమాస్థాపనే హృద్యం లఘు వాతకఫాపహమ్. ౭౯

ధాన్యామ్లము (అనగా కలి) గడ్డ కట్టియుండు మలాదులను భేదించును. తీక్ష్ణముగ, ఉష్ణమైనవీర్యము గలదిగనుండును. పిత్తమునువృద్ధిచేయును. స్వాభావికముగా శీతలమైనస్పర్శముగలది. శ్రమము (అనగా వ్యాయామాదులవలన శరీరమునందు గలుగునట్టి ఆయాసము, క్లమము, (అనగా వ్యాయామము లేకుండునపుడే శరీరమునందు గలుగునట్టి బడలిక) పొత్తికడుపునందుశూల వీనిని పోగొట్టును. రుచినిబుట్టించును. అగ్నిదీపనమును

గలుగజేయును. నిరూహవస్తియందు ప్రశస్తమైనది. హృదయమునకు మేలుచేయును. లఘువుగనుండును, వాతకఫములను పోగొట్టును. తండులకండనాదులచేగాని, లేక సౌవీరక తుషోదకములచేగాని, లేక ఉముకతోను, ఉముకలేకను నుండు యవధాన్యములచేగాని చేయబడినది ధాన్యామ్ల మనబడు నని తెలిసికొనవలయును.

గోమూత్రాదిగుణము

మూత్రం గోఽజావిమహిషీగజాశ్వోష్ట్రఖరోద్భవం,
పిత్తలం రూక్షతీక్ష్ణోష్ణం లవణానురసం కటు. ౮౦
కృమిశోఫోదరానాహశూలపాండుకఫానిలాన్,
గుల్మారుచివిషశ్విత్రకుష్ఠార్శాంసి జయేల్లఘు. ౮౧

ఆవు, ఆడుమేక, మేక, గేదె, ఏనుగు, గుఱ్ఱము, ఒంటె, గాడిదె వీనిమూత్రములు పిత్తమునుజేయును. రూక్షముగ, తీక్ష్ణముగ, ఉష్ణముగ, కొంచెము ఉప్పగ, కారముగ నుండును. కృమిరోగము, శోఫ, ఉదరరోగము, ఆనాహము, శూల, పాండువు, కఫము, వాతము, గుల్మము, అరుచి, విషము, శ్విత్రకుష్ఠము, అర్శస్సు వీనిని పోగొట్టును. లఘువుగ నుండును. "మూత్రం గోజావిమహిషీ" అని గోమూత్రమును తొలుత నందువలన మూత్రములన్నిటిలోను గోమూత్రమే శ్రేష్ఠ మని తెలియవలయును.

"శ్వాసకాసహరం ఛాగం పూరణాత్కర్ణశూలజిత్,
దద్యాత్క్షయే కిలాసే చ గజవాజిసముద్భవమ్,
హంత్యున్మాదమపస్మారం కృమీన్ మేహం తు రాసభమ్,
కషాయతిక్తమేతేషాం హిధ్మశ్వాసహరం శకృత్,
పిత్తం తిక్తం కృమిహరం రోచనాకఫవాతజిత్,
తిక్తం పామాహరం మూత్రం మానుషంతు విషాపహమ్."

మేకపోతుమూత్రము శ్వాసకాసలను హరింపజేయును. చెవిలో బోసినచో కర్ణశూలను హరింపజేయును. ఏనుగు, గుఱ్ఱము, వీనిమూత్రములను క్షయరోగమునందును, కిలాసము నందును ఉపయోగింపందగును. గాడిదెమూత్రము ఉన్మాదము, అపస్మారము, కృమిరోగము, మేహము వీనిని పోగొట్టును ఆవుమొదలగువాని పేడ కషాయముగ, తిక్తముగనుండును. హిధ్మ (ఎక్కిళ్లు), శ్వాసము, కృమిరోగము వీనిని పోగొట్టును. స్వల్పముగా పిత్తమును జేయును. ఆవు మొదలగువానిగోరోచనము కఫవాతములను పోగొట్టును. మనుష్యమూత్రము చేదుగ నుండును. గజ్జి, విషము వీనిని పోగొట్టును. అని అష్టాంగసంగ్రహమునందు మూత్రభేదతద్గుణములు విశేషముగా జెప్పబడియున్నవి.

" దీపనం పాచనం భేది తేషు గోమూత్రముత్తమమ్ "

పైజెప్పిన మూత్రములలో గోమూత్రము ప్రశస్తమైనది. దీపనకారి. జీర్ణమును జేయును. ఉంటకట్టియుండు మలాదులను భేదించును అని అధికపాఠము కొన్ని గ్రంథములయందు గనప్పట్టుచున్నది.

తోయక్షీరేక్షుతైలానాం వర్గైర్మద్యస్య చ క్రమాత్,
ఇతి ద్రవ్యైకదేశోయం యథాస్థూలముదాహృతః. ౮౨

ఈప్రకారముగా జల, క్షీర, ఇక్షు, తైల, మద్యవర్గములచే యథాక్రమముగా ద్రవ్యములయొక్క ఒకభాగము స్థూలముగా జెప్పబడినది.

పంచమాధ్యాయము ముగిసెను.



# షష్ఠాధ్యాయము



అథాతోఽన్నస్వరూపవిజ్ఞానీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

ద్రవద్రవ్య విజ్ఞానీయాధ్యాయానంతరము అన్నద్రవ్యస్వరూపమును (అనగా రసవీర్యవిపాక ప్రభావగుణ కర్మాదులను) తెలిసికొనుటకు హితకరమైన అన్నద్రవ్య స్వరూప విజ్ఞానీయాధ్యాయమును వివరించెదము. ఈసూత్రమునందు ద్రవ్యశబ్దము ప్రయోగింపబడకుండినను మధ్యమపదలోపిసమాసముచేతనే సిద్ధించును. పూర్వాధ్యాయముయొక్క ప్రథమసూత్రమునందు స్వరూపశబ్దమును ప్రయోగించకయే ద్రవద్రవ్య విజ్ఞానీయాధ్యాయ మని యీతంత్రకారుడు చెప్పియున్నాడు. అయినను మధ్యమలోపి సమాసముచేతనే పూర్వాధ్యాయమునందును స్వరూపశబ్దము సిద్ధించు ననుట గ్రంథకర్త యొక్క తాత్పర్యము. అన్నమనగా భుజింపబడు ధాన్యమాంసాదు లనియర్థము. వానిలో ధాన్యము, శూకము, శింబి అని ద్వివిధంబుగ నుండును. అందు శూకధాన్యము (ముండ్లుకల్గియుండు నెమలివరిమున్నగు ధాన్యము) విశేషోపయోగకారిగ, పథ్యకర మైనదిగ నుండుటంజేసి దానిగుణము తొలుత జెప్పబడుచున్నది. శింబిధాన్యము (అనగా కాయధాన్యము) స్వల్పోపయోగకారిగ, తఱుచుగ నపథ్యకర మయినదిగ నుండుటంజేసి అప్రాధాన్యముగ నుండుటవలన తొలుత జెప్పబడదయ్యెను.

### రక్తశాల్యాదిధాన్యభేదతద్గుణములు

రక్తో మహాన్ సకలమ స్తూర్ణకశ్శకునాహృతః,
సారాముఖో దీర్ఘశూకో లోధ్రశూకస్సుగంధికః.
పతంగా స్తపనీయాశ్చ యే చాన్యే శాలయశ్శుభాః,
స్వాదుపాకరసా స్నిగ్ధాః వృష్యా బద్ధాల్పవర్చసః. ౧
కషాయానురసాః పథ్యా లఘవో మూత్రలా హిమాః,

రక్తశాలి (అనగా ఎఱ్ఱరాజనాలు) మహాశాలి (అనగా లావుగ నుండు రాజనాలు పెద్దసంబావులు) అను నీరెండుధాన్యములు సుప్రసిద్ధములు. కలమ ధాన్యము (అనగా ఎఱ్ఱబుడమవడ్లు) మగధ మొదలగు దేశములయందు ప్రసిద్ధంబు. ఇదే కాశ్మీరదేశమునందు మహాతండులమని చెప్పబడును. తూర్ణకము (అనగా దాశువా సారువావడ్లు) కూడా కాశ్మీరదేశమునందే ప్రసిద్ధంబు. శకునాహృత మనుధాన్యము

మగధదేశమునందు ప్రసిద్ధము. ఇది ఉత్తరకురుదేశములలోనుండి హంసలచే తేబడినందున దానికి శకునాహృత మను నామము అన్వర్థముగ గలిగినది. సారాముఖ మను ధాన్యము నల్లుపైన శూకములు (అనగా వరిముల్లు) గలదైయుండును. దీర్ఘశూక మను ధాన్యము తెల్లగ, నిడుపైన ముండ్లుగలదిగ నుండును. లోధ్రశూక మను ధాన్యము యొక్క అగ్రభాగము లొద్దుగపుష్పులయాకారగముతో సమానముగ నుండును. సుగంధక మను ధాన్యము మగధాదిదేశములయందు గంధశాలి, దేవశాలి అను నామాంతరములచే ప్రసిద్ధిచెందియుండును. పతంగము, తపనీయము మొదలగు ధాన్యభేదములను నానాదేశములయం దుండు కర్షకులవలన తెలియవలయును. శూకధాన్యములలో రక్తశాల్యాది ధాన్యములు మధురమైన పాకరసము గలవిగ, మనోహరముగ నుండును. శుక్రమును వృద్ధిచేయును. స్వల్పముగా మలబంధముచేయును. ఒకింత వగరు రసము గలవి. స్వభావముగనే హితకరమైనవి. చులకనగ నుండును. మూత్రమును వెడలించును. శీత మయిన వీర్యము గలవి.

"పాండుకః పుండరీకశ్చ ప్రమోదీ గౌరశాలికః,

జాంగలో లోహవాలాఖ్యః కార్దమాశ్శీతభీరుకాః."

పాండుకము, పుండరీకము, ప్రమోది, గౌరశాలి, జాంగలము, లోహవాలము, కార్దమము, శీతభీరుకము అనునవి శాలిధాన్యభేదము లని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

### రక్తశాలిధాన్యగుణము

శూకజేషు వర స్తత్ర రక్త స్తృష్ణాత్రిదోషహా. 3

పైజెప్పిన మహాశాలి ధాన్యములలో రక్తశాలి యను ధాన్యము శ్రేష్ఠంబైనది. ఇది దప్పిని, త్రిదోషములను పోగొట్టును. "రక్తః" అని తొలుత జెప్పినందు రక్తశాలి సర్వధాన్యములలోను శ్రేష్ఠంబైన దని యేర్పడుచుండినను అది మిక్కి శ్రేష్ఠంబైన దని తెలియపరచుటకై "వరః" అను శబ్దము మరల ప్రత్యేకముగా జెప్పబడినది.

### మహాశాల్యాదిగుణము

మహాం స్తస్యానుకలమ స్తం చాప్యను తతః పరే,

మహాశాలి, కలమము, ఇతరములైన శాలిధాన్యములు, ఇవి రక్తశాలికంటె యథాక్రమముగ నొకదానికంటెనొకటి తక్కువయైన గుణము గలవిగ నుండును.

### యావకాదిధాన్యగుణము

యావకా హాయనాః పాంసుబాష్పనైషధకాదయః. ౪

స్వాద్వమ్లా గురవః స్నిగ్ధాః పాకేఽమ్లాః శ్లేష్మపిత్తలాః,

సృష్టమూత్రపురీషాశ్చ పూర్వం పూర్వం చ నిందితాః. ౫

యావకము, హాయనము, పాంసు, బాష్పము, నైషధము మొదలగు శాలిధాన్యములు మధురముగ, ఉష్ణముగ, గురువుగ, స్నిగ్ధముగ నుండును. పాకమువలన కొంచెము పుల్లగ నుండును. శ్లేష్మపిత్తములను గలుగజేయును. మూత్రపురీషములను వెడలించును. పైజెప్పిన యావకాది ధాన్యములలో పూర్వమందుండునవి ఒకదాని కంటె నొకటి సారహీనముగ నుండును. అనగా యావక మనునది శాలిధాన్యము లన్నిటిలో మిగుల నిందితము. దానికంటె నితరములైనవి యథాక్రమముగా స్వల్పముగా నిందితము. ఆదిశబ్దమువలన యవక పత్రకాదిశాలి ధాన్యములనుగూడ గ్రహింప వలయును.

### షష్టికధాన్యగుణము

స్నిగ్ధో గ్రాహీ లఘుస్స్వాదుస్త్రిదోషఘ్నః స్థిరో హిమః,
షష్టికో వ్రీహిషు శ్రేష్ఠః గౌరశ్చాసితగౌరతః. ౬

సర్వధాన్యములలోను షష్టికము రక్తశాలిధాన్యమువలెనే శ్రేష్ఠంబు. ఇది మలబంధమును, లఘుత్వమును చేయును. మధురముగ నుండును. త్రిదోషములను హరింపజేయును. శరీరమునకు దార్ఢ్యము నిచ్చును. శీతలముగనుండును. జ్వరము, శ్రమ, బడలిక వీనిని హరింపజేయును. కావున నది రసాయన ప్రయోగము, జ్వరాది రోగములు, శరీరకృశత్వము వీనియందు పథ్యకరం బని వైద్యశాస్త్రములయందు జెప్పబడియున్నది. యవధాన్యము స్థైర్యకారియైనను గురుత్వ, వాతకరత్వగుణములు గలది యగుటచే పథ్యకర మని చెప్పబడదయ్యె. షష్టికధాన్యము గౌరము, కృష్ణగౌరము అని ద్వివిధంబు. వానిలో గౌర మనునది శ్రేష్ఠంబు.

### మహావ్రీహ్యాదిధాన్యగుణము

తతః క్రమాన్మహావ్రీహిఃకృష్ణవ్రీహిజతూముఖాః,
కుక్కుటాండ *కపాలాఖ్యపారావతకశూకరాః. ౭
వరకోద్దాలకౌ జ్వాలచీనశారదదర్దురాః,
గంధనాః కురువిందాశ్చ గుణైరల్పాంతరాస్మృతాః. ౮

మహావ్రీహి, కృష్ణవ్రీహి, జతూముఖము, కుక్కుటాండము, కపాలాఖ్యము, పారావతకము, శూకరము, వరకము, ఉద్దాలకము, జ్వాలము, చీనము, శారదము, దర్దురము, గంధనము, కురువిందము, మొదలగు ధాన్యములు షష్టికధాన్యములకంటె తక్కువైన గుణములుగలవిగ నుండును.

---

* కపాలాక్ష ఇతి పా.

షష్టికవ్యతిరిక్తధాన్యగుణము

స్వాదురమ్లవిపాకోఽన్యో వ్రీహిః పిత్తకరో గురుః,
బహుమూత్రపురీషోష్మా త్రిదోషస్త్వేవ పాటలః. ౯

పైచెప్పిన షష్టికాదిధాన్యములకంటె నితరధాన్యములు మధురముగ, అమ్లపాకము గలవిగ నుండును. పిత్తమును జేయును. గురుత్వముగలవి. మూత్రపురీషములను విశేషముగా విసర్జింపజేయును. అత్యుష్ణకరమయినది. పాటలిపుష్పమువలె నుండుధాన్యము విశేషముగా త్రిదోషములను ప్రకోపింపజేయును. కావుననే యీతంత్రకారుడు పాటలధాన్యము నాహారమునందు నిషేధించుచున్నాడు.

కంగ్వాదితృణధాన్యగుణము

కంగుకోద్రవనీవారశ్యామాకాది హిమం లఘు,
తృణధాన్యం పవనకృల్లేఖనం కఫపిత్తహృత్. ౧౦

కంగు (అనగా కొఱ్ఱలు) కోద్రవము (అనగా వరగలు) నీవారము (అనగా నివ్వరివడ్లు) శ్యామాకము (అనగా చామలు) శిబిరము, ప్రశాంతికము, మధూళికము, గవేధుకము (అనగా అడవిగోధుమలు), కాండలోహితము అనునీ ధాన్యములు తృణధాన్యము లనబడును. ఇవి శీతలముగ, లఘువుగ నుండును. వాతమును ప్రకోపింపజేయును. లేఖనకారి (లేఖన మనగా —

"విలిఖత్యతితైక్ష్ణ్యాద్యద్ధాతూన్ తల్లేఖనం మతమ్."

అను వచనప్రకారము అతితీక్ష్ణతవలన రసాదిధాతువులను భేదించునది యని యర్థము.) కఫపిత్తములను హరింపజేయును, వాతమును ప్రకోపింపజేయు ననుటచేతనే మలమూత్ర బంధించు ననియును, కఫపిత్తములను హరింపజేయుననుటచేతనే వగరుగ, మధుర ముండు ననియును స్పష్ట మగుచున్నది. ఈ యర్థమునే,

త్తహరా రూక్షాః కషాయా మధురా హిమాః,
వాతలా బద్ధవిణ్మూత్రా లఘవో లేఖనాత్మకాః."

అనెడి అష్టాంగసంగ్రహవచనముకూడ బోధించుచున్నది.

కొఱ్ఱలగుణము

భగ్నసంధానకృత్తత్ర ప్రియంగుర్బృంహణో గురుః,

తృణధాన్యములలో కొఱ్ఱలు విరిగిపోయిన అంగముల నొకటిగ జేర్చును. శరీరమునకు పుష్టినిచ్చును. గురుత్వమును జేయును.

"రక్తాః పీతాశ్చ కృష్ణాశ్చ శ్వేతాశ్చైవ ప్రియంగవః,
యథోత్తరం ప్రధానాః స్యూరూక్షాః కఫహరాః స్మృతాః."

కొఱ్ఱలు ఎఱుపు, పసుపు, తెలుపు, నలుపువర్ణములు గలవి యని నాల్గు విధంబులు. వానిలో ఉత్తరత్రనుండునవి ఒకదానికంటె నొకటి శ్రేష్ఠంబు. అయ్యవి రూక్షగుణము కల్గియుండును. కఫమును హరింపచేయును. అని సుశ్రుతమునందు జెప్పబడియున్నది.

ఆళ్లగుణము

కోరదూషః పరం గ్రాహీ స్పర్శశీతో విషాపహః. ౧౧

ఆళ్లు మిక్కుటముగా మలమును బంధించును. శీతలమయిన స్పర్శముగలది. విషమును హరింపజేయును.

"ఉద్దాలకస్తు వీర్యోష్ణో నీవారః శ్లేష్మవర్ధనః"

ఉద్దాలకము ఉష్ణమైన వీర్యము గలది. నివ్వరివడ్లు శ్లేష్మమును వృద్ధిచేయును.

యవలగుణము

రూక్షశ్శీతో గురుస్స్వాదు స్సరో విడ్వాతకృద్యవః,
వృష్యస్థైర్యకరో మూత్రమేదఃపిత్తకఫాన్ జయేత్. ౧౨
పీనసశ్వాసకాసోరుస్తంభకంఠత్వగామయాన్,

యవధాన్యము రూక్షముగ నుండును. శీతలముగ, గురువుగ, మధురముగ నుండును. శరీరమునందు శీఘ్రముగా వ్యాపించును. మలమును వాతమును అధికముగ వృద్ధి నొందించును. శుక్రవృద్ధిని దార్ఢ్యమును గలుగజేయును. మూత్రరోగము, మేదస్సు, పిత్తకఫములు, పీనసము, శ్వాసకాసములు, ఊరుస్తంభము, గళరోగము, చర్మరోగము వీనిని హరింపజేయును.

వెదురుధాన్యగుణము

న్యూనో యవాదన్యయవో రూక్షోష్ణో వంశజో యవః

పైజెప్పిన యవధాన్యములకంటె నిసరములైన యవలు స్వల్పమైన వెదురుధాన్యము రూక్షగుణంబును ఉష్ణగుణంబును కల్గియుండును.

గోధుమలగుణము

వృష్యశ్శీతో గురుస్స్నిగ్ధో జీవనో వాతపిత్తహా,
సంధానకారీ మధురో గోధూమః స్థైర్యకృత్సరః. ౧౪

గోధుమలు శుక్రమును వృద్ధిచేయును. శీతలముగ నుండును. గురుత్వమును చేయును. జిగటగనుండును. బలము నిచ్చును. వాతపిత్తములను హరింపంజేయును. విరిగిన యంగముల నొకటిగ జేర్చును. మధురముగ నుండును. శరీరదార్ఢ్యమును గలుగజేయును. శరీరములో శీఘ్రముగా వ్యాపించును.

"స్థైర్యకృత్సకషాయశ్చ బలః శ్లేష్మవికారహా,
సంధానకృద్వాతహరో గోధూమః స్వాదుశీతలః."

గోధుమలు శరీరదార్ఢ్యమును బలమును కలుగజేయును. కొంచెము వగరుగ, మధురముగ శీతలముగనుండును. శ్లేష్మరోగమును, వాతమును హరింపజేయును. విరిగినయంగముల నొక్కటిగ జేర్చును. అని చరకమునందు వేరువిధముగ గుణము జెప్పబడియున్నది.

## నందీముఖీగుణము

పథ్యా నందీముఖీ శీతా కషాయమధురా లఘుః,

నందీముఖియనుధాన్యము (అనగా నిడుపుగసన్నముగనుండుగోధుమలు) శరీరమునకు హితకరమైనది. వగరుగ, మధురముగ, లఘువుగ నుండును. శీతవీర్యము గలది.

శూకధాన్యవర్గము ముగిసెను

---

## శింబీధాన్యగుణము

ముద్గాఢకీమసూరాదిశింబీధాన్యం విబంధకృత్. ౧౫
కషాయం స్వాదు సంగ్రాహి కటుపాకం హిమం లఘు,
మేదఃశ్లేష్మాస్రపిత్తేషు హితం *లేపోపసేకయోః ౧౬

పెసలు, కందులు, చిఱుసెనగలు, ఇవి మొదలగునవి శింబీధాన్యము లనబడును. ఇవిస్రోతస్సులను బంధించును. వగరుగ, మధురముగ నుండును. మలబంధమును జేయును. కటువైనపాకము శీతలమయిన వీర్యముగలవి. లఘువుగనుండును. మేదస్సు, శ్లేష్మము, రక్తపిత్తము, లేపనము, ఉపసేకము, వీనియందు హితకరమయినవి. మసూరాది అను ఆది శం. ప్రయోగమువలన మకుష్ఠమనుధాన్యమును, సెనగలను గ్రహించికొనవలయును. ఇవి రుముగ, శీతలముగ, రూక్షగుణముకలదిగ నుండుటచే వాతమును ప్రకోపింపజేయును. రము గలుగజేయును.

"హరితాస్త్వేష్వపి వరా మకుష్ఠాః క్రిమికారిణః,
పర్ణ్యాః పరం ప్రలేపాద్యైః మసూరా గ్రాహిణో భృశమ్."

ముద్గాదిధాన్యములలో పెల్ల పెసలు శ్రేష్ఠములు. మకుష్ఠము (అనగా ఏనుగు పెసలు) కృములనుగలుగజేయును. చిఱు సెనగలు లేపనము మొదలగువానిచే శరీరమునకు కాంతినిచ్చును. మిగులమలబంధమును జేయును. అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

## ముద్గాదిగుణము

నరోఽత్ర ముద్గోఽల్పచలః కలాయస్త్వతివాతలః,
రాజమాషోఽనిలకరో రూక్షో బహుశకృద్గురుః. ౧౭

---

* లేపావఇతిపా.

ముద్గాది శింబీధాన్యములలో పెసలు శ్రేష్ఠంబైనవి. స్వల్పముగా వాతమును జేయును. ఆంక లనునవి మిక్కుటముగా వాతమును జేయును. అలచందలు రూక్షగుణము కల్గి వాతమును వృద్ధినొందించును. విశేషముగా మలమునధికముచేయును; గురుత్వాకారి "అనిలకరః" అని చెప్పియుండుటవలన అలచందలు ఇతర శింబీధాన్యములకంటె విశేషముగా వాతమును జేయు నని భావంబగుచున్నది.

ఉలవలగుణము

ఉష్ణాః కుళుత్థాః పాకేమ్లాః శుక్రాశ్మశ్వాసపీనసాన్,
కాసార్శః కఫవాతాంశ్చ ఘ్నంతి పిత్తాస్రదాః పరమ్. ౧౭

ఉలవలు ఉష్ణమయినవీర్యముగలవి. పాకమువలన ఆమ్లమయినరసము గలదిగ నుండును. శుక్రదోషము, అశ్మరీరోగము, శ్వాసము. పీనసము, కాసము, అర్శస్సు, కఫవాతములు వీనిని హరింపజేయును. మిక్కుటముగ రక్తపిత్తమును గలుగజేయును. కషాయముగ, మధురముగనుండును. మలమును బంధించును. ఉష్ణమయినవీర్యముగలది అనెడిసామాన్యలక్షణముచేతనే నేత్రములకు విరోధముచేయు నని భావంబగుచున్నది.

"కషాయస్వాదుగా హ్యుష్ణాః కుళుత్థా రక్తపిత్తలాః,
పీనసశ్వాసకాసార్శో హిక్కానాహకఫానిలాన్.
ఘ్నంతి శుక్రాశ్మరీం శుక్రం దృష్టిం శోథం తథోదరమ్,
గ్రాహిణో లఘవస్తీక్ష్ణా విపాకేఽమ్లా విదాహినః."

ఉలవలు కషాయముగ, మధురముగ, రూక్షముగ, ఉష్ణముగ నుండును. రక్తపిత్తమును జేయును. పీనసము, శ్వాసము, కాసము, అర్శస్సు, ఎక్కిళ్ళును, కడుపుబ్బరము, కఫము వాతము, శుక్రాశ్మరి, శుక్రదోషము, దృష్టి, వాపు, ఉదరరోగము వీనినిహ[illegible] చేయును. మలమును బంధించును. లఘువుగ, తీక్ష్ణముగ, పాకమువలన పుల్లగనుం[illegible] తాపము నిచ్చును, అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

అనుములగుణము

నిష్పావో వాతపిత్తాస్రస్తన్యమూత్రకరో గురుః,
సరో విదాహీ దృక్శుక్రకఫశోఫవిషాపహః. ౧౮

అనుములు వాతము, పిత్తరక్తము, చనుబాలు, మూత్రము వీనిని వృద్ధిచేయును గురుత్వముగనుండును. వేగముగా శరీరమునందు వ్యాపించును. తాపమును బుట్టించును. నేత్రరోగము, శుక్రదోషము, కఫము, వాపు, విషము వీనిని హరింపజేయును. తాపమును బుట్టించుటవలన పాకముచే నమ్లరసముగలదిగ నగు నని భావంబగుచున్నది.

"నిష్పావా మధురా రూక్షాస్సకషాయా విదాహినః,
ఉదావర్తే ప్రశస్యంతే గురవో వాతపిత్తలాః."

అనుములు మధురముగ, రూక్షముగ, కొంచెమువగరుగ నుండును. తాపమునిచ్చును. గురుత్వముచేయును. వాతపిత్తముల నధికపరచును. ఉదావర్తరోగమునందు ప్రశస్తమయినది అని కృష్ణాత్రేయుడు చెప్పియున్నాడు.

మినుములగుణము

మాషస్స్నిగ్ధశ్శ్లేష్మమలబలపిత్తకరస్సరః,
గురూష్ణోఽనిలహా స్వాదుశ్శుక్రవృద్ధివిరేకకృత్. ౨౦

మినుములు స్నిగ్ధముగనుండును. బలమునిచ్చును. శ్లేష్మము, మలము, పిత్తము, వీనినివృద్ధినొందించును. శరీరమునందు వేగముగా వ్యాపించును. గురుత్వము చేయును ఉష్ణముగనుండును. వాతమునుహరింపజేయును. మధురముగనుండును. శుక్రవృద్ధి, శుక్రస్రావము వీనిని జేయును.

కాకాండోలా గుణము

ఫలాని మాషవద్విద్యాత్కాకాండోలాత్మగుప్తయోః,

కాకాండోలా అను తృణధాన్యము, లేకగినియ, దూలగోవెల వీనివిత్తులు మినుములతో సమానమయినగుణము గలవిగ నుండును.

నువ్వులగుణము

ఉష్ణస్త్వచ్యో హిమస్స్పర్శే కేశ్యో బల్యస్తిలో గురుః,
అల్పమూత్రః కటుః పాకే మేధాగ్నికఫపిత్తకృత్. ౨౧

నువ్వులు ఉష్ణమైనవీర్యము కలవి. చర్మము, కేశములు, వీనికి హితకరమయినవి. ...యినస్పర్శముగలవి. బలమును గురుత్వమును కల్గించును. స్వల్పముగా మూత్రమును ...చును. పాకమువలన కారముగ నుండును. బుద్ధిని జాఠరాగ్నిని కఫమును పిత్తమును ...ొందించును.

"స్నిగ్ధోష్ణతిక్తకటుకః కషాయమధుర స్తిలః,
త్వచ్యః కేశ్యోగురుర్వృష్యస్స్పర్శశీతోఽనిలాపహః,
అల్పమూత్రః కటుః పాకే మేధాగ్నికఫపిత్తకృత్,
కృష్ణః ప్రశస్తతమను శుక్లస్తమను చారుణః."

నువ్వులు స్నిగ్ధముగ, ఉష్ణముగ, చేదుగ, కటువుగ, వగరుగ,మధురముగ నుండును. చర్మము కేశములు, శుక్రము, వీనికి హితముచేయును. గురువుగ నుండును. శీతలమయిన స్పర్శ గలది. వాతమును హరింపజేయును స్వల్పముగా మూత్రమును వెడలించును. పాకమువలన కటువుగ నుండును. బుద్ధి, అగ్నిదీపనము, కఫము, పిత్తము వీనిని గలుగజేయును. నల్లనువ్వులు మిగుల ప్రశస్తమయినవి. వానికంటె తెల్లనువ్వులు కొంచెము నికృష్టమైనవి.

దానికంటె ఎఱ్ఱనువ్వులు నికృష్టమయినది, అని అష్టాంగసంగ్రహమునందు స్పష్టముగా జెప్పబడియున్నది. నువ్వులు నూనెకు ముఖ్యమయిన కారణమైనదిగ నుండుటవలన దానియందు జిగటగుణమును, "కఫపిత్తకృత్" అని చెప్పియుండుటవలన వాతమును హరింపజేయునట్టి గుణమును, శింబీధాన్యములకు స్వభావమయిన కషాయస్వాదుగుణము లును, పైశ్లోకము చేతనే స్పష్టముగా సిద్ధించుచున్న వని కొందరువ్యాఖ్యానము చేయు చున్నారు. ఇటులజెప్పువ్యాఖ్యాతల యభిప్రాయము ననుసరించి —

"కల్కం సంరోహణం కుర్యాత్తిలానాం మధుకాన్వితం,
స్నిగ్ధోష్ణతిక్తమధురకషాయత్వైస్స సర్వజిత్."

అనగా అతిమధురముతో గూడియుండు నువ్వులకల్కము వ్రణము నార్చును. నువ్వులు స్నిగ్ధముగ, ఉష్ణముగ, చేదుగ, మధురముగ, కషాయముగ నుండుటవలన సర్వదోషము లను హరింపజేయును. అని సద్యోవ్రణప్రతిషేధాధ్యాయమునందు ఈతంత్రకారుడే చెప్పబోవుచున్నాడు.

అగసిగుణము

స్నిగ్ధోమా స్వాదుతిక్తోష్ణా కఫపిత్తకరీ గురుః. ౨౨
దృక్ఛుక్రహృత్కటుః పాకే తద్వద్బీజం కుసుంభజం,

అగసివిత్తులు జిగటగ, మధురముగ, చేదుగ, ఉష్ణముగ నుండును. కఫము, పిత్తము, గురుత్వము వీనిని గలుగజేయును. నేత్రదృష్టిని, శుక్రమును నశింపజేయును. పాకమువలన కటువుగ నుండును. కుసుమవిత్తులు అగసితోతుల్యమైన గుణముగలవి.

మాషయవనికృష్టత్వము

మాషోఽత్ర సర్వేష్వవరః యవకశ్శూకజేషు చ.

శింబీధాన్యములయందు మినుములును, శూకధాన్యములయందు శ్రేష్ఠంబైనవికావు.

నూతనపురాణధాన్యగుణము

నవం ధాన్యమభిష్యంది లఘు సంవత్సరోషితం,
శీఘ్రజన్మ తథాసూప్యం నిస్తుషం యుక్తిభర్జితమ్. ౨౪

క్రొత్తధాన్యములు కఫమును వృద్ధినొందించును. ఇటులజెప్పుటచే ప్రాతధాన్యములు శ్లేష్మమును జేయ వనిభావము. సంవత్సరమునకు పైబడినధాన్యములు లఘువుగ నుండును. ఇటుల జెప్పుటచే క్రొత్తధాన్యములు గురుత్వముచేయు నని భావము.

"వర్షాతీతం సర్వమన్నం పరిత్యజతి గౌరవం,
న తు త్యజతి తద్వీర్యం వీర్యం ముంచత్యతః క్రమాత్"

సంవత్సరమునకుపైబడిన సర్వధాన్యములు గురుత్వమును జేయవు. అయినను వీర్యమును మాత్రము విడువకుండును. అంతకుపైన వీర్యమునుకూడ క్రమముగా విడుచును. అని తంత్రాంతరములయందు జెప్పబడియున్నది. పెసలు మొదలగు ధాన్యములును వాని తోలు పోయినప్పుడును, కొంచెముగ వేయించబడిన పెసలు మొదలగునవియును లఘువుగ నుండును.

"నవం ధాన్యమభిష్యంది సేక్యం కేదారజం చ యత్,
లఘు వర్షోషితం దగ్ధభూమిజం స్థలసంభవమ్."

క్రొత్తధాన్యములు శ్లేష్మమును జేయును. ఊడుపుమడియందు జనించినవియును, ఒక సంవత్సరమునకు పైబడినవియును, దగ్ధభూమియందు జనించినవియును నగు ధాన్యములు లఘువుగ నుండును, అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

శింబీధాన్యవర్గము, ముగిసెను.

---

అవ. ఈశింబీధాన్యగుణములను జెప్పిన పిదప పక్వముచేయబడిన శింబీధాన్యములు ఉపయోగపడుటవలన నికమీద కృతాన్నవర్గము చెప్పబడుచున్నది.

### మండ పేయాదిస్వరూపము

మండపేయావిలేపీనామోదనస్య చ లాఘవం,
యథాపూర్వం శివ స్తత్ర మండో వాతానులోమనః ౨౭
తృట్గ్లానిదోషశేషఘ్నః పాచనో ధాతుసామ్యకృత్,
స్రోతోమార్దవకృత్స్వేదీ సంధుక్షయతి చానలమ్. ౨౮

మండము, పేయము, విలేపి, అన్నము ఇవి యథాపూర్వముగా (అనగా అన్నముకంటె విలేపి, దానికంటె పేయము, దానికంటె మండము) మిగుల లఘువుగ నుండును. వానిలో మండము హితకరమైనది, వాతమునకు అనులోమమును గలుగజేయును. దప్పి, బడలిక, దోషశేషము (అనగా వమన, విరేచనకర్మలను జేసికొనినవానికి శేషించియుండు దోషము) వీనిని బోగొట్టును. జీర్ణకారి. వాతాది ధాతువులకు సమత్వము నిచ్చును. స్రోతస్సులకు మృదుత్వమును గలుగజేయును. చెమటను బుట్టించును. అగ్నిదీపనకారి. "మండపేయావిలేపీనాం ఓదనస్య" అని ప్రత్యేకప్రత్యేకముగా జెప్పియుండుటచే మండము, పేయము, విలేపి, ఇవి వరిపేలాలతో కాచబడు ననియును, అన్నము బియ్యముచే పక్వముజేయబడు ననియును తెలియుచున్నది.

"శృతః పిప్పలిశుంఠీభ్యాం యుక్తో లాజాంబుదాడిమైః,
మండస్సందీపయత్యగ్నిం వాతం చాప్యనులోమయేత్,

ద్రవ్యస్యార్ధపలం దత్వా తోయస్య ప్రస్థమావపేత్.
అర్ధశేషం గృహీత్వా తత్కర్షౌ ద్వౌ దాడిమస్య చ.
యుక్తం సైంధవవిశ్వాహ్వధాన్యకైశ్శాణమాత్రకైః,
ద్వికర్షమాత్రైః లాజైశ్చ భూయస్సంక్వథితం చ తత్.
పిప్పలీజీరకాభ్యాం చ శాణైకేనావచూర్ణితం,
పేయా స్త్వేష విధిః కల్ప్యో దాడిమాదికృతాస్వపి.”

శొంఠి, పిప్పలి, దానిమ్మ, పరిపేలాలు, వీనితో నుదకమును జేర్చి చక్కగా కాచిన మండ మనబడును. ఇది అగ్నిదీపనమును, వాతమునకు అనులోమగతిని గలుగజేయును. అరపలముగల ద్రవ్యములను ఒకపడి జలములో వేసి అర్ధావశేషముగా కాచి దీసికొని దానిలో దానిమ్మపండురసము రెండుకర్షములు, సైంధవలవణము, శొంఠి, ధనియాలు, ఇవి దినుసు కొకటింటికి శాణప్రమాణము, పరిపేలాలు రెండుకర్షములు ఈప్రకారము చేర్చి మరల కాచి, అందు పిప్పళ్లు, జీలకఱ్ఱ వీని చూర్ణము దినుసుకొకటింటికి శాణ ప్రమాణము చొప్పున గలిపిన పేయ మనబడును, అని మండ, పేయలక్షణములు చరకమునందు జెప్పబడియున్నవి. మఱియును,—

“సిక్థైర్విరహితో మండః పేయా సిక్థసమన్వితా.
ఘనసిక్థా విలేపి స్యాద్యవాగూర్విరళద్రవా.”

అనెడి చరకవచనప్రకారము అన్నకణములులేకుండా కాచబడినది మండ మనియును, కొంచెము మెతుకు లుండునటుల కాచబడినది పేయ మనియును, విశేషముగా మెతుకు లుండునటుల కాచబడినది విలేపి యనియును, తేటగా కాచబడినదియవాగు వనియును బఱంగును.

“లాజాంబుసైంధవకణాధాన్యనాగరదాడిమైః,
యుక్తో నిష్పీడితః పూతో మండస్సంస్కృత ఉచ్యతే.
నిర్గ్రీవ్యా ప్రావృతా పేయా తక్రదాడిమతండులైః.”

పరిపేలాలు, నీళ్లు, సైంధవలవణము, పిప్పళ్లు, ధనియాలు, శొంఠి, దానిమ్మ, వీనిని జేర్చికాచి బాగుగా పిసికి వడియకట్టబడినది మండ మనియును, మజ్జిగ, దానిమ్మపండ్ల రసము, బియ్యము, వీనిని జేర్చి అన్నకణములు లేకుండా కాచబడినది పేయమనియును గ్రంథాంతరమునందు వేరువిధముగ లక్షణము చెప్పబడియున్నది. మూలశ్లోకమునం దుండు “దోషశేషఘ్నీ” అనుపదముచేత వమనవిరేచన కర్మలయందధికముగా వమన విరేచనంబు లగు ననెడిభీతిచే దోషము శేషించియుండునటుల నాకర్మలను జేసికొన వలయు నని యూహ్యంబగుచున్నది.

### పేయాగుణము

క్షుత్తృష్ణాగ్లానిదౌర్బల్యకుక్షిరోగజ్వరాపహా,
మలానులోమినీ పథ్యా పేయా దీపనపాచనీ. ౨౭

పేయ యనునది ఆకలి, దప్పి వీనివలన గలిగినబడలిక, దౌర్బల్యము, కడుపు నొప్పి, జ్వరము, వీనిని హరింపజేయును. వాతాదులను తమతమమార్గములయందు సంచరించునటుల జేయును. శరీరమునకు హితకరమైనది. అగ్నిదీపనమును, జీర్ణమును గలుగ జేయును.

### విలేపీగుణము

విలేపీ గ్రాహిణీ హృద్యా తృష్ణాఘ్నీ దీపనీ హితా,
వ్రణాక్షిరోగసంశుద్ధదుర్బలస్నేహపాయినామ్. ౨౮

విలేపియనునది మలమును గట్టిపరచును, హృదయమునకు మేలుచేయును; దప్పిని హరింపజేయును. అగ్ని దీపనమును బుట్టించును. వ్రణము, నేత్రరోగములుగలవారికి దేహశుద్ధి చేసికొనినవారికి, స్నేహపానము చేసినవారికి, దుర్బలమైన శరీరముగలవారికి హితకరమైనది.

### అన్నగుణము

సుధౌతః ప్రస్రుతః స్విన్నోఽత్యక్తోష్మా చౌదనో లఘుః,
యశ్చాగ్నేయౌషధ క్వాథ సాధితో భృష్టతండులః. ౨౯
విపరీతో గురుః క్షీరమాంసాద్యైర్యశ్చ సాధితః,

చక్కగా బియ్యమునుకడిగి వండి గంజివార్వబడినదియును, సుఖోష్ణముగనుండు [illegible]యును నగు అన్నము లఘువుగ నుండును. చిత్రమూలము, శొంఠి ఇవి మొదలగు [illegible]యముతో సిద్ధము చేయబడిన యన్నము మిగుల లఘువుగ నుండును. వేయించిన [illegible]్యముచే జేయబడినయన్నము పైదానికంటె మిగులలఘువుగనుండును. పైప్రకారము [illegible]యబడని యన్నంబును, పాలు, మాంసము మధురపదార్థములు ఇవి మొదలగువానిని జేర్చి చేయబడినయన్నంబును మిగుల గురుత్వమును చేయును.

### అన్నాదిగురులాఘవజ్ఞానము

ఇతి ద్రవ్యక్రియాయోగమానాద్యైస్సర్వమాదిశేత్. ౩౦

ఇటుల ద్రవ్యము, క్రియ, సంయోగము, పరిమాణము, జాంగలాదిదేశభేదము వీనిచే సమస్తమైన అన్న పేయాదులయొక్కయు, క్రింద జెప్పబడు భక్ష్యాదులయొక్కయు, గురులాఘవములను దెలిసికొనవలయును. అదియెట్లనగా, రక్తశాల్యాదిధాన్యముల బియ్యముచే జేయబడినయన్నము లఘుతరమైనది. యావకాదులచే సిద్ధముచేయబడిన యన్నము గురుత్వము గలది అని ద్రవ్యముచేతను,

"వృష్యం వాతహారం బల్యం పథ్యం శూల్యామిషం లఘు,
అపథ్యం గురువిష్టంభి మాంసం యచ్చ రసోద్ధృతమ్,
స్విన్నం మాంసం గురుస్తంభి శూలపక్వం త్రిదోషజిత్."

అనెడితంత్రాంతరవచనప్రకారము శూల్యమాంసము పాకాదిసంస్కారములవలన లఘువుగ నుండును, ఇతరమైనమాంసములు గురువుగ నుండును, అనిసంస్కారము చేతను; అన్నాదులు ఆగ్నేయౌషధములగు చిత్రకాదిసంయోగమువలన లఘువుగ నుండును.అని సంయోగముచేతను; జాంగలదేశమునందు ఫలించిన బియ్యముయొక్క అన్నము లఘువుగ నుండును. అనూపదేశమునందు ఫలించినబియ్యముయొక్క అన్నము గురువుగ నుండును. అనిదేశభేదముచేతను, అన్నాదులలో లఘువైన పదార్థము లనేకముగ గురువైన పదార్థములు స్వల్పముగ జేరియుండినను వానికి లఘుత్వగుణమే గలిగియుండును. ఇటులనే గురువైన పదార్థము లధికముగ లఘువైనపదార్థములు స్వల్పముగ జేరియుండినను వానికి గురుత్వగుణమే గలిగియుండును అని పరిమాణముచేతను నెఱుంగవలయును.

## మాంసరసగుణము

బృంహణః ప్రీణనో వృష్యశ్చక్షుష్యో వ్రణహా రసః,

కృతాకృతమైన మాంసరసము శరీరపుష్టినిచ్చును. తృప్తిని గలుగజేయును. శుక్రమును వృద్ధిచేయును. నేత్రములకు హితకరమైనది. వ్రణము నార్చును. శొంఠిమొదలగు వస్తువులతో జేర్చిచేయబడిన మాంసరసము కృతరస మనబడును. అటుల జేర్చక చేయబడినది అకృతరస మనబడును.

"ఛాగలం పక్షిజం మాంసం నిరస్థి తైత్తిరం తథా,
చతుష్పలాన్వితం సూక్ష్మం కల్పితం క్షాళితం జలే,
పిప్పలీపిప్పలీమూలశుంఠీచిత్రకధాన్యకైః,
ద్వికార్షైస్సంయుతే తోయే క్వాథం సార్ధాఢకోన్మితే.
మాంసేస్మిన్ ద్విపలం తత్ర దాడిమాన్కుట్టితాన్ క్షిపేత్.
తం రసం మర్దితం పూతం హింగుసైంధవజీరకైః.
యుక్తం ప్రధూపితం పథ్యం శుద్ధానాంశుద్ధికాంక్షిణామ్,
శుష్యతాం వ్యాధియుక్తానాం వ్రణినాం వాతరోగిణామ్,
భగ్నవిశ్లిష్టసంధీనాం క్షీణధాత్వింద్రియౌజసామ్."

మేకపోతుమాంసము, తిత్తిరిపక్షిమాంసము, వీనియందలి యెముకలను తీసివేసి నీళ్ళలో కడిగి చిన్నచిన్నముక్కలుగ తరిగి నాల్గు పలములను గ్రహించి పిప్పళ్ళు, మోడి, శొంఠి, చిత్రమూలము, ధనియాలు వీనిని దినుసుకు రెండు శాణములచొప్పున జేర్చి ఒకటిన్నర

*ఆఢ ప్రమాణము నీళ్లలో వేసి అర్ధాఢక ప్రమాణముగా కషాయము కాచి దించుకొని దానిలో రెండుపలములు దానిమ్మగింజలను నలియగొట్టివేసి చక్కగాబిసికి వడియగట్టి దానిలో ఇంగువ, సైంధవలవణము, జీలకఱ్ఱ, వీనినిజేర్చి పరిమళద్రవ్యములచే వాసన గట్టిన కృతరసమనబడును. ఇది వమనవిరేచనౌషధముల బుచ్చుకొనినవారికి శరీరశుద్ధియు దిచ్చగలవారికి, శుష్కించిన శరీరముగలవారికి, వ్యాధిగలవారికి, వ్రణములు, వాత రోగముగలవారికి, శరీరములోనిసంధులు, విరిగినవారికి మాంసాదిధాతువులు, రేతస్సు, బలము క్షయించినవారికి, మిగులహితకరమైనదని తంత్రాంతరమునందు కృతరసమునకు లక్షణగుణములు చెప్పబడియున్నవి.

"రసస్తత్ర వరోఽ నమ్లశ్చాకునో బృంహణస్సరః,
తక్రసిద్ధస్తు విష్టంభీ లఘుర్వాతకఫాపహః.
ఫలామ్లగోరసోదారం న విశ్వాజాజిధాన్యకమ్,
స్నిగ్ధం మాంసం హితం బల్యం బృంహణం రోచనం గురు.
కాసమర్దకధాన్యామ్లదాడిమాదిరజః కృతాః,
లేహాస్తక్రాదిజాశ్చాన్యే యోనివద్గురురోచనాః.
మాలుధానీయవాసాదిపుష్పైర్యోతిగుణః ఖలః,
ఫలమూలైర్ఘనోదానం వ్యంజనం పాకతో ఘనమ్.
లేహావత్తల ఇత్యన్యే దోషలాస్సర్వయోనివత్,
తద్వచ్చ తిలకల్కామ్ల ప్రాయః కాంబళికో మతః.
కట్వరః ఫజిద్గ్రాహీ పిత్తలో రోచకో లఘుః,
మాంసాదజాతిశుంర్యాదిగళితస్సోదకో లఘుః."

నుండకుండు పక్షిమాంసరసము శ్రేష్ఠంబైనది. శరీరపుష్టినిచ్చును. శరీరమునందు ంచును. మజ్జిగలో సిద్ధముచేయబడిన పక్షిమాంసరసము మలబంధమునుజేయును. గ నుండును. వాతకఫములను పోగొట్టును. ఫలామ్లము (అనగా చింత) చల్ల, శొంఠి, జీలకఱ్ఱ, ధనియాలు వీనితోసిద్ధము చేయబడినమాంసము స్నిగ్ధముగ నుండును. శరీరమునకు హితకరమయినది. బలము, శరీరపుష్టి, రుచి వీనిని గలుగ చేయును; గురువుగ నుండును. కసివెంద, కలి, దానిమ్మ ఇవిమొదలగువస్తువులచే సిద్ధముచేయబడిన లేహము లును, తక్రముచే సిద్ధముచేయబడిన ఇతరము లగు లేహాదులును, కారణద్రవ్యమువలెనే గురువుగనుండును. రుచినిపుట్టించును. మాలుధాని, తీటకసింద మొదలగుపుష్పములచే సిద్ధము చేయబడినది ఖల మనబడును. అది మిగుల గుణకారి. ఫలములు, మూలములు వీనిచే సిద్ధము చేయబడినది వ్యంజన మనబడును. అది పాకమువలన మిగుల గురుత్వమునుచేయును.

* ఆఢక మనగా తూము,

ఖలమనునది లేహమువలె నుండు ననియును, స్వకారణద్రవ్యమువలెనె దోషకారిగనుండు ననియును, కొందరు వచించెదరు. నువ్వులకల్కము, అమ్లము (అనగా పులిచింత) వీనిచే సిద్ధముచేయబడినది కాంబళిక మనబడును. అది కఫమును పోగొట్టును. మలమును గట్టి పరచును. పిత్తమును జేయును. రుచిపుట్టించును. లఘువుగనుండును. మాంసము, జీలకఱ్ఱ, శొంఠి మొదలగువానిచే సిద్ధము చేయబడిన మాంసరసము సోదకమనబడును. అది లఘువుగ నుండును. అని యితరతంత్రములయందు మాంసరసగుణములు భిన్నముగా జెప్పబడి యున్నవి.

### పెసరకట్టుగుణము

మౌద్గస్తు పథ్యస్సంశుద్ధవ్రణకంఠాక్షిరోగిణామ్. 3౧

పెసరకట్టు వమన, విరేచనములకు పుచ్చుకొనినవారికి, వ్రణము, గళరోగము, నేత్రరోగము గలవారికి, మిగులహితకర మైనది.

"ముద్గానాం ద్విపలం తోయే శృతమర్ధావశేషితే,
పాదస్థం మర్దితం పూతం దాడిమస్య ఫలేన తు.
యుక్తం సైంధవవిశ్వాహ్వధాన్యకైః పాదకార్షికైః,
కణాజీరకయోశ్చూర్ణాచ్ఛాణైకేనావమూర్ఛితమ్.
సంస్కృతో ముద్గయూషోయం పిత్తశ్లేష్మహరో మతః. తథా.
పటోలపత్రాచ్ఛాణార్ధం ముద్గానాం ద్విపలం జలే.
ద్రవ్యే ద్వాత్రింశద్గుణితే తతశ్చ దాడిమాత్ఫలమ్,
కర్షమామలకానాం చ క్షిప్త్వా పునరధిశ్రయేత్.
పూతం స్సైంధవాద్యైశ్చ యుక్తమాజ్యేన యోజితమ్,
పటోలఫలకాభ్యోయం యూషః పిత్తోత్థరోగజిత్.
నింబపత్రైర్నింబయూషమేవ మేవ ప్రకల్పయేత్,
మూలకాచ్ఛుంఠికాస్విన్నా ఘృతభృష్టా సధాన్యకా.
హింగుజీరకసంయుక్తా తతోమధిశదాడిమే,
ససైంధవే వినిక్షిప్య పునరగ్నావధిశ్రయేత్.
తావద్యావన్మృదూభూతం తతస్త్ర్యూషణసంయుతమ్,
సుధూపితం హింగుఘృతైశ్చాతుర్జాతావమూర్ఛితమ్.
శుంఠీరసందీపనీయం వాతశ్లేష్మామయాపహమ్,
అకృతాకృతయూషాచ్చ రసాచ్చ జలసాధితాత్.
స్నేహామ్లపటుయుక్తాచ్చ పూర్వః పూర్వో లఘుర్మతః,

విద్యాద్యూషే రసే సూపే శాకే చైవోత్తరోత్తరమ్,
గౌరవం తను సాంద్రామ్ల స్వాదుష్వేషు పృథక్తథా."

అర్ధాఢకప్రమాణము గల జలములో రెండుపలములు పెసలపప్పును వేసి నాల్గవపాలు మిగులునట్లు కాచి గిలకొట్టి వడియగట్టుకొని దానిలో దానిమ్మపండు, సైంధవలవణము, శొంఠి, ధనియాలు వీనిచూర్ణము దినుసొకటింటికి కర్షప్రమాణము చొప్పునను, పిప్పళ్ళు, జీలకఱ్ఱ, వీనిచూర్ణము దినుసొకటింటికి శాణప్రమాణముచొప్పునను గలిపి సిద్ధము చేయబడినది పెసరకట్టు అనబడును. ఇది పిత్తశ్లేష్మములను హరింపజేయును. చేదుపొట్లాకు అర్ధశాణము, పెసరపప్పు రెండు పలములు, దాడిమఫలరసము, ఉసిరికెకాయల రసము ఇవి దినుసుఒకటింటికి కర్షప్రమాణము, ఇటుల వీనినెల్ల జేర్చి, అటుల జేర్చిన ద్రవ్యములకు ముప్పదిరెండుభాగములధికముగనుండు జలములోవేసి బాగుగాకాచి వడియగట్టికొని దానిలో సైంధవలవణము, ధనియాలు, పిప్పళ్లు, జీలకఱ్ఱ వీనిచూర్ణమును దినుసు ఒకటింటికి పాలుకర్షప్రమాణముచొప్పున జేర్చి ఘృతమును కలిపి సిద్ధముచేయబడిన కట్టు పటోలఫలక మనబడును. ఇది పిత్తవికారమువలన జనించిన రోగముల నన్నిటిని హరింపజేయును. ఇటులనే నింబపత్రము (అనగా సిమ్మాకును) జేర్చి సిద్ధముచేయబడినకట్టు నింబయూష మనబడును. ములక, శుంఠి వీనిని సగముపచనముచేసి నేతిలో వేఁయించి ధనియాలు, ఇంగువ, జీలకఱ్ఱ, సైంధవలవణము అనువానిచూర్ణముతో జేర్చి దాడిమపండ్లరసములో గలిపి అగ్నిలో మృదువగువరకు పక్వముచేసి పిదప త్రికటుకములను (అనగా శొంఠి, పిప్పలి, మిరియములను) జేర్చి ఇంగువ, నెయ్యి వీనిచే తిరగమాతబెట్టి చాతుర్జాతకములు (అనగా ఏలకులు, లవంగపుచెక్క, ఆకుపత్రి, నాగకేసరములు) వానిచూర్ణమును సమభాగములుగా కలిపిన శుంఠీరస మనబడును. ఇది అగ్నిదీపన గలుగజేయును. వాతశ్లేష్మరోగములను హరింపజేయును. తథా,—

"ఖలకాంబళికౌ హృద్యౌ సాధితౌ స్వౌషధానుగౌ,
పిశితేన రసస్తత్ర యూషో ధాన్యైః ఖలః ఫలైః.
మూలైశ్చ తిలకల్కామ్ల ప్రాయః కాంబళికః స్మృతః,
జ్ఞేయాః కృతాకృతాస్తే తు స్నేహాదియుతవర్జితాః,
అల్పమాంసాదయః స్వచ్ఛాదకలావణికాః స్మృతాః."

ఔషధములతో జేర్చి సిద్ధముచేయబడిన ఖలము, కాంబళికము, అనునీరెండును హృదయమునకు హితకరమైనవి. మాంసముతో జేర్చి సిద్ధముచేయబడినది రస మనబడును. ముద్గాది ధాన్యములతో సిద్ధముచేయబడినది యూష మనబడును. ఫలములు, వేళ్లు వీనితో సిద్ధము చేయబడినది ఖల మనబడును. నువ్వులకల్కము, పులిచింత వీనిచే సిద్ధముచేయబడినది

కాంబలిక మనబడును. వీనిలో స్నేహాదులను జేర్చి సిద్ధము చేయబడినది కృత మనబడును. స్నేహాదులను జేర్చకుండా సిద్ధము జేయబడినది అకృత మనబడును. స్వల్పముగా మాంసమును, స్వల్పముగా శుంఠి మొదలగు ద్రవ్యములను జేర్చి పిసికి తేటగ సిద్ధముచేయబడినది దకలా, వణికాయ మనబడును. ఇటులనే యూషమునందుగాని, లేక ఖడాదులయందుగాని స్వల్పముగా ధాన్యమును, లేక మూలాదులను జేర్చి సిద్ధము చేయబడినది కూడా దకలా, వణికా అని చెప్పబడును.

"అథ గోరసధాన్యామ్లఫలామ్లైరమ్లితం చ యత్,
యధోత్తరం లఘు హితం సంస్కృతాసంస్కృతం తథా.
ప్రభూతాస్తమలో యూషస్సూపాల్లఘుతరః స్మృతః,
సూపస్తు రసయూషాభ్యాం స్థైర్యాద్గురుతరో మతః.
తం సరోగో న చాశ్నీయాన్న చాల్పాశీ కథం చన."

మజ్జిగ, పులికడుగు, ఫలామ్లము (చింతపండు) వీనిలో జేర్చి సిద్ధముచేయబడిన యూషాదులును, అటుల సిద్ధము చేయబడని యూషాదులును ఒకదానికంటె నొకటి లఘువుగనుండును. హితకరమైనవి. విశేషముగా మలమును వెడలింపజేయును. ముద్గపప్పుకంటె యూషము లఘువుగ నుండును. పప్పు రసయూషములకంటె గురుత్వముగలది. శరీరబలకారి. రోగి, స్వల్పాహారము చేయువాడు వీర లెపుడును ముద్గపప్పును భుజింపంజనదు అని తంత్రాంతరమునందు పెసరకట్టు మొదలగు వానిస్వరూపగుణములు జెప్పబడియున్నవి

**ఉలవకట్టుగుణము**

వాతానులోమికౌలుత్థో గుల్మతూనిప్రతూనిజిత్,

ఉలవకట్టు వాతమునకు అనులోమగతిని గలుగజేయును. గుల్మము, ప్రతూని అనురోగములను హరింపజేయును. తూని ప్రతూనిలక్షణము గుల్మనమునందు జెప్పబడును.

**తెలికపిండి మొదలగువానిగుణము**

తిలపిణ్యాకవికృతిశ్శుష్కశాకం విరూఢకమ్. 3౨
శాండాకీవటకం దృగ్ఘ్నం దోషలం గ్లపనం గురు,

తెలికపిండి నువ్వులవికారములు, ఎండినకూరకాయలు, విరూఢకము (అనగా దిగిరించేకూరలు), శాండాకీ, వటకములు, ఇవి వాతాదిదోషములను ప్రకోపింపజేయును. దృష్టిని చెరుచును. బడలిక నిచ్చును. గురుత్వము జేయును.

**రసాలాగుణము**

రసాలా బృంహణీ వృష్యా స్నిగ్ధా బల్యా రుచిప్రదా. 3

పెరుగును చేతితో చిలికి దానిలో మిరియములు, శొంఠి, లవణము, శర్కర వీనినిజేర్చి సిద్ధముచేయబడినది రసాలాయన మనబడును. ఇది శరీరపుష్టి, శుక్రవృద్ధి, బలము వీనిని గలుగజేయును. జిగటగనుండును. రుచిని బుట్టించును.

## పానకగుణములు

శ్రమక్షు త్తృట్క్లమహరం పానకం ప్రీణనం గురు,
విష్టంభి మూత్రలం హృద్యం యథా ద్రవ్యగుణం చ తత్. 3౪

పానకము శ్రమ, ఆకలి, దప్పి, బడలిక వీనిని హరింపజేయును. తృప్తినిచ్చును. గురుత్వముజేయును. మలమును బంధించును. మూత్రము నధికముగ వెడలించును. హృదయమునకు హితకరమైనది. పానకములయందు జేరునట్టి వస్తుగుణానుగుణముగా వానిభేదములను, గురుత్వలాఘువములను తెలిసికొనవలయును.

"పర్పటా లఘవో రుచ్యా లఘీయాన్ క్షారపర్పటః,
హృద్యా వృష్యా రుచికరా గురవో రాగఖాండవాః.
ప్రీణనా భ్రమతృట్ఛర్ది మదమూర్ఛాశ్రమచ్ఛిదః."

పర్పటమునది లఘువుగ, రుచికరముగ నుండును. క్షారపర్పట మనునది మిగుల లఘువుగ నుండును. రాగఖాండవములు శుక్రమును వృద్ధిజేయును. రుచినిచ్చును. గురువుగ నుండును. తృప్తినిచ్చును. భ్రమ, దప్పి, వాంతి, మదము, మూర్ఛ, శ్రమ వీనిని హరింప జేయును. అని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

## వరిపేలాలగుణము

లాజా స్తృట్ఛర్ద్యతీసార మేహ మేదఃకఫచ్ఛిదః,
కాసపిత్తోపశమనా దీపనా లఘవో హిమాః. 3౫

వరిపేలాలు, దప్పి, వాంతి, అతిసారము, ప్రమేహము, మేదోరోగము, కఫము హరింపజేయును. కాసమును, పిత్తమును శమింపజేయును. అగ్నిదీపనకారి, లఘు శీతవీర్యము గలదిగ నుండును.

## అటుకులగుణము

పృథుకా గురవో బల్యాః కఫవిష్టంభ కారిణః,

అటుకులు గురుత్వము జేయును. బలము, కఫము, మలబంధము వీనిని గలుగ జేయును.

## వేపుడుబియ్యపుగుణము

ధానా విష్టంభినీ రూక్షా తర్పణీ లేఖనీ గురుః. 3౬

వేపుడుబియ్యము మలబంధకారి. రూక్షజేయును. తృప్తినిచ్చును. వాతాదులను ఛేదించును. గురుత్వము జేయును.

## సక్తుగుణము

సక్తవో లఘవః క్షుత్తృట్ శ్రమనేత్రామయవ్రణాన్,
ఘ్నంతి సంతర్పణాః పానాత్సద్య ఏవ బలప్రదాః 32
నోదకాంతరితా న ద్విర్న నిశాయాం న కేవలాన్,
న భుక్త్వా న ద్విజైశ్ఛిత్వా సక్తూనద్యాన్న వా బహూన్. 33

సక్తువు (అనగా వేపుడుబియ్యపుపిండి) లఘువుగనుండును. ఆకలి, దప్పి, శ్రమ, నేత్రరోగము, వ్రణము వీనిని హరింపజేయును తృప్తినిచ్చును. ఉదకయుక్తముగా పానముజేసినతోడనే బలమునిచ్చును. పేలపిండిని భక్షించునపుడు మధ్యకాలమునందు జలమును పానముచేయంజనదు. పేలపిండిని రెండు పూటలయందును, రాత్రికాలము నందును, భోజనాంతరమునందును భుజింపంజనదు. మఱియును పేలపిండిని ఉద కాదులసంబంధములేకయే భుజింపంజనదు. పిండిఉంటను దంతములతో నమిలి భుజింపంజనదు. అధికముగను భుజింపంజనదు. పేలపిండి లఘువుగ నుండునని జెప్పుట చేతనే రూక్షతను, వాతమును జేయునని స్పష్టమగుచున్నది. బలకారియని చెప్పియుం డుటచే ధాతుపుష్టిగలవారికేయని తెలియవలయును. ధాతుపుష్టిలేనివారికి రోగములను గలుగజేయును.

"తుల్యాజ్యస్సక్తుప్రాశస్తు వృష్యో భేదీ రసాయనః,
తృట్ఛర్దిశ్రమనున్మద్యపీతస్తర్పణ ఏవ తర్పకః.
ప్రమేహక్షయకష్ఠాని న చ స్యుర్మంథపాయినామ్,
నిచయాత్కారినా గుర్వీ పిండీ ప్రోక్తా మృదుర్లఘుః.
సక్తూనాం ద్రవతాయోగా ల్లఘీయస్యవలేహికా,
లాజసక్తుకృతాపి స్యాద్విలేపీ తు గరీయసీ."

సమముగా నెయ్యి కలపబడిన పేలపిండి శుక్రమును వృద్ధిజేయును. వాతాదులను— చును. విశేషబలకారి. దప్పి, వాంతి, శ్రమ వీనిని పోగొట్టును. మద్యముతో భక్షించిన విశేషముగా దప్పిని పోగొట్టును. మంథమును (అనగా పిండిసంబం దానిని) పానముజేసిన ప్రమేహము, కష్ఠము, క్షయము వీనిని హరింపజేయును. పిండి యుంటలు కఠినముగ, గురువుగనుండును. సక్తువు మృదువుగ, లఘువుగ నుండును. అవ లేహికయనునది మిగుల లఘువుగనుండును. వరిపేలాలపిండితో జేయబడిన విలేపె మిగుల గురుత్వముజేయును. ఆని సక్తువిశేషగుణములు తంత్రాంతరమునందు జెప్పబడియున్నవి.

## పిణ్యాకగుణము

పిణ్యాకో గ్లపనో రూక్షో విష్టంభీ దృష్టిదూషణః,

నువ్వులు మొదలగువాని 'గానుగుపిండి బడలికనిచ్చును, రూక్షతజేయును. మల మును బంధించును. దృష్టిని చెరుచును.

### వేసవారగుణము

వేసవారో గురుస్స్నిగ్ధో బలోపచయవర్ధనః. 38

శొంఠి, ధనియాలు, జీలకఱ్ఱ, ఇంగువ, నెయ్యి మొదలగు వస్తువులను జేర్చ కలియగొట్టి, పక్వము జేయబడినమాంసము వేసవార మనబడును. ఇది గురువుగ, జిగటగ నుండును. బలమును శరీరపుష్టిని గలుగజేయును.

### ముద్గాదివేసవారగుణము

ముద్గాదిజాస్తు గురవో యథాద్రవ్యగుణానుగాః,

పెసరపప్పు, ఉద్దిపప్పు మొదలగువానిచే చేయబడినవేసవారము గురుత్వము జేయును. వేసవారమునకు దానియందుజేరునట్టి ద్రవ్యములగుణమే గలిగియుండును.

"సర్పిస్తైలగుడక్షీరైర్యవగోధూమపైష్టికాః,
పూపా విష్టంభినశ్శీతాః పైష్టికా వాతలాః ఖరాః.
వృష్యా బల్యాస్సరా మాషైః వాతఘ్నా మృదుపిచ్ఛిలాః,
యథాన్నం గురవో బల్యా స్థూలాశ్చ కఠినాశ్చ యే.
తైలపక్వాస్తు దృష్టిఘ్నా గరీయాంసో విదాహినః,
కాసారసారలఘవో లాజైర్లఘుతరాః స్మృతాః.
వాతపిత్తహరో వృష్యో ఘృతపూరః కఫప్రదః,
సద్యః ప్రాణకరో రుచ్యో మాంసలో రక్తలో గురుః.
లఘీయాన్మండకకృతో గరీయాన్ ఫలపూరితః,
మధురోత్కారికా వృష్యా కాసారః పిచ్ఛిలో గురుః.
గుడమత్స్యండికాఖండక్షీరేక్షురసమాక్షికైః,
పూపాశ్శుక్రబల శ్లేష్మరుచిదాస్తర్పణాః క్షణాత్.
నానాద్రవ్యైస్సమాయుక్తాః పక్వామక్లిన్నభర్జితాః,
నిమర్దకో గురుః స్నిగ్ధో వృష్యో బలవతాం హితః.
ఖారికేందురికాపూరవటికావటకాదయః,
విశదా రోచనా బల్యా గురవః స్యుస్స్వయోనివత్.
యావకః పిచ్ఛిలస్స్నిగ్ధః ప్లీహోదావర్తహా గురుః,
భృష్టస్విన్నతయా వాద్యో లఘుస్స్వేవ్యోతికాసినామ్.
జ్వరోదావర్తమేహానాం పథ్యో వాతానులోమనః,
ఓలకం హరితావస్థం శింబిజాత్వాత్తరం గురు.
మందజఠర్యో యవాదిత్వాదభ్యోషో బృంహణస్సరః."

నెయ్యి, నూనె, బెల్లము, పాలు, యవలు, గోధుమపిండి వీనిచే జేయబడిన భక్ష్యములు మలమును బంధించును. శీతమైనవీర్యము గలవి. పుష్టి నిచ్చును. వాతమును ప్రకోపింప జేయును. కఠినముగ నుండును. ఉద్దిపప్పుతో జేయబడినభక్ష్యములు శరీరమునందు వ్యాపించును. శుక్రవృద్ధిని, బలమును గలుగజేయును. మృదువుగ, జిగటగనుండును. వాతమును హరింపజేయును. స్థూలముగ కఠినముగ నుండుభక్ష్యములు వానిలో జేరియుండు ద్రవ్యముల కనుగుణముగా వాని గురుత్వబలకరత్వములను తెలిసికొనవలయును. తైలముచే పక్వముజేయబడిన భక్ష్యములు దృష్టిని చెరుచును. మిక్కుటముగా గురుత్వముజేయును. విదాహిగనుండును. వరిపేలాలతో జేయబడినభక్ష్యములు మిగుల లఘువుగ నుండును. ఘృతపూర మను భక్ష్యము వాతపిత్తములను హరింపజేయును. శుక్రమును వృద్ధిచేయును. కఫము నధికముగ వృద్ధినొందించును. శరీరమునకు తోడనే బలము నిచ్చును. రుచిని గలుగజేయును మాంసరక్తములను వృద్ధిజేయును. గురువుగ నుండును. మండకమువలన జేయబడినభక్ష్యములు మిగుల లఘువుగనుండును. ఫలములచే పూరింపబడినభక్ష్యములు మిగుల గురువుగనుండును. ఉత్కారికా (అనగా ఉండ్రాళ్లు, పిల్ల కుడుములు మొదలైనవి) మధురముగనుండును. శుక్రమును వృద్ధిచేయును. కాసార మను భక్ష్యము జిగటగ, గురువుగ నుండును. బెల్లము, మత్స్యండిక యను శర్కర, ఖండ శర్కర, పాలు, చెరుకురసము, తేనె వీనితోజేయబడినవియును, నానాద్రవ్యములతో గూడి పక్వాపక్వ అర్ధపక్వ భర్జితమైనవియును నగుభక్ష్యములును, శుక్రము, బలము, శ్లేష్మము, రుచి వీనిని గలుగజేయును. తత్క్షణముననే తృప్తినిచ్చును. నిమర్దక మను భక్ష్యము గురువుగ, స్నిగ్ధముగ నుండును. శుక్రమును వృద్ధిజేయును. విశేషబలము గల వారికి హితకరమైనది. ఖారికా, ఇందురికా, పూరపటికా, వడియములు మొదలగు భక్ష్యములు స్వకారణద్రవ్యమువలెనే విశదముగ, రుచికరముగ, బలకారిగ, గురువుగ నుండును. యవలచే జేయబడినభక్ష్యములు జిగటగ గురువుగ నుండును. ప్లీహము, ఉదావర్తము అనురోగములను గల్గించును. వేయించినయవలచే జేయబడినభక్ష్యములు మిక్కుటముగ కాసము, జ్వరము, ఉదావర్తము. మేహరోగము ఈ వ్యాధులుకలవారికి హితకరములు. వాతమునకు అనులోమగతిని గలుగజేయును. లఘువుగ నుండును. ఓలక మనుభక్ష్యము శింబిధాన్యమువలన జేయబడినవి యగుటచే కఠినముగ, గురువుగనుండును. ఆలస్యముమీద జీర్ణమగును. వానిలో యవాదులు జేరియుండుటవలన తాపము నిచ్చును. శరీరపుష్టినిగలుగజేయును. శరీరమునందు త్వరగావ్యాపించును అని తంత్రాంతరమునందు భక్ష్యవిశేషములు, వానిగుణములు జెప్పబడియున్నవి.

"అత్యుష్ణా మండకాః పథ్యాశ్శీతలా గురవో మతా."

మండక మనుభక్ష్యము అత్యుష్ణముగ, పథ్యకారిగ, శీతమైన వీర్యము గలదిగ, గురువుగ నుండు నని సిద్ధసార మనుగ్రంథమునందు జెప్పబడియున్నది.

### కుకూలాదిపక్వభక్ష్యగుణము

కుకూలకర్పరభ్రాష్ట్ర కంద్వంగారవిపాచితాన్ ౪౦
ఏకయోనీన్ లఘూన్విద్యాద్యథాపూపానుత్తరోత్తరం,

కుకూలము (అనగా పిడకలనిప్పు) కర్పరము (అనగా చిల్లపెంకు) భ్రాష్ట్రము (అనగా మంగలము) కందు (అనగా పెనము) కట్టెనిప్పులు వీనిలో పక్వము జేయబడినట్టిదియు, ఒకటేద్రవ్యముచే జేయబడినవియునగు భక్ష్యములు ఒకదానికంటె నొకటి మిగుల లఘువుగ నుండును. (అనగా కుకూలపక్వభక్ష్యమునకంటె కర్పరపక్వభక్ష్యములును, వానికంటె భ్రాష్ట్రపక్వభక్ష్యములును, వానికంటె కందుపక్వభక్ష్యములును, వానికంటె అంగారపక్వభక్ష్యములును లఘువుగ నుండునని భావము.)

## కృతాన్నవర్గము ముగిసెను.

---

అవ. కృతాన్నవర్గానంతరము దానికి వ్యంజనమైన మాంస, శాకవర్గములు జెప్పదగియుండినను వానిలో నన్నముతోకూడ మాంసము తఱచుగా నుపయోగపడుట వలనను, "శాకావరాన్నభూయిష్ఠమత్యుష్ణలవణం త్యజేత్" అనువచనముచేత శాకమును విశేషముగా నుపయోగించకూడదని నిషేధించియుండుటవలనను తొలుత మాంసవర్గము చెప్పబడుచున్నది.

### మృగవివరణము

హరిణైణకురంగర్క్ష గోకర్ణమృగమాతృకాః, ౪౧
శశశంబరచారుష్కశరభాద్యా మృగాః స్మృతాః,

ఇఱ్ఱి, నల్లనియిఱ్ఱి, లేడి, ఎలుగుమంటి, కణుజు, జింక, చెవులపిల్ల, ఎఱ్ఱజింకపోతు, రుష్కము, శరభము అను నీ పశువులు మృగము లనబడును. ఆవిశబ్దమువలన కాలకన్నును, తెల్లనిమచ్చలుగలయిఱ్ఱి వీనినికూడ గ్రహింపవలయును.

### విష్కిరవివరణము

లావవర్తికవార్తీరరక్తవర్త్మకకుక్కుభాః ౪౨
కపింజలోపచక్రాఖ్యచకోరకురుబాహవః,
వర్తకో వర్తికా చైవ తిత్తిరిః కృకరశ్శిఖీ. ౪౩
తామ్రచూడాఖ్యబకరగోనర్దగిరివర్తికాః,
తథాశారపదేంద్రాభవారటాశ్చేతి విష్కిరాః. ౪౪

లావుకపిట్ట, వర్తికపిట్ట, వార్తీరపక్షి, రక్తవర్త్మకము, గంపపులుగు, కపింజలము (అనగా ఱెక్కలయందు చిత్రవర్ణముగల బట్టువన్నెపక్షి), ఉపచక్రము, చకోరపక్షి,

---

* కర్కరాః ఇతిపా.

కురుబాహువు, వెలిచెపిట్ట, మీనవల్లంకిపిట్ట, తీతువుపిట్ట, కృకరము, నెమలి, హోడి, బకరము (అనగా వాలుకొంగ), బెగ్గురుపిట్ట, గిరివర్తికపక్షి, శారపదము, ఇంద్రాభము, ఆడుహంస అను నీయిరువదిరెండుపిట్టలును విష్కిరము లనబడును. విష్కిరము లనగా, చిందిన ధాన్యాదులను భక్షించుపక్షులని యర్థము.

"లావాదయో వరాటాంతా విష్కిరాః పక్షిజాతయః"

లావుకపిట్టమొదలుకొని ఆడుహంసవర కుండుపక్షిజాతులు విష్కిరము లనబడును.

ప్రతుదవివరణము

జీవంజీవకదాత్యూహభృంగాహ్వాశుకసారికాః,
లటూకకోకిలహారీతకపోతచటకాదయః. ౨౫
ప్రతుదాః

వెన్నెలపులుగు, కూకురుగుడ్డంగిపిట్ట, భృంగాహ్వకము (అనగా కూకటిమూగపిట్ట) చిలుక, గోరువంకపిట్ట, ఊరపిచ్చుక, కోయిల, పసరికపిట్ట, గువ్వపిట్ట, పోతుఊరపిచ్చుక ఇవి మొదలగుపక్షులు ప్రతుదము లనబడును. ఇవి ముక్కుచే ధాన్యములయొక్కపొట్టును వేరుపరచి పిపీలికాదిజంతువులను ముక్కుచే జంపి భక్షించుటవలన ప్రతుదము లనబడెను. ఆదిశబ్దమువలన అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియుండు కాటుకపిట్ట, పావురపిట్ట ఇవి మొదలగు వానినికూడ గ్రహింపవలయును.

బిలేశయవివరణము

భేకగోధాహిశ్వావిదాద్యా బిలేశయాః,

కప్ప, ఉడుము, పాము, ఏదుపంది మొదలగునవి తఱుచుగా బొక్కలయందు వసింపుచుండుటచే బిలేశయము లనబడును. ఆదిశబ్దమువలన తెల్లయేదుపంది, నల్లయేదు పంది మొదలగువానిని గ్రహించుకొనవలయును.

ప్రసహవివరణము

గోఖరాశ్వతరోష్ట్రాశ్వద్వీపిసింహర్క్షవానరాః. ౨౬
మార్జారమూషికవ్యాఘ్రవృకబభ్రుతరక్షవః,
లోపాకజంబుకశ్యేనచాషవాంతాదవాయసాః. ౨౭
శశఘ్నీభాసకురరగృధ్రోలూకకులింగకాః,
ధూమికా మధుహా చేతి ప్రసహా మృగపక్షిణః. ౨౮

ఆవు, గాడిదె, కంకరగాడిదె, ఒంటె, గుఱ్ఱము, చిరుతపులి, సింహము, ఎలుగు మంటి, కోతి, పిల్లి, ఎలుక, పెద్దపులి, తోడేలు, ముంగిస, సివంగి అను నీమృగములును, వరడునక్క, నక్క, డేగ, పాలపిట్ట, వాంతాదము (అనగా కుక్క) కాకి, శశఘ్ని, భాస

పక్షి, కురర (అనగా కలహంస) గద్ద, గుడ్లగూబ, నల్లఊరపిచ్చుక, ధూమిక, మధుహ అను నీజంతువులును ప్రసహము లనబడును. ప్రసహము లనగా, బలాత్కారముగా నాహారపదార్థములను లాగికొనిపోయి తినునవి యని యర్థము. ఈజంతువులలో మృగములును పక్షులును కలిసియున్నవి.

మహామృగవివరము

వరాహమహిషన్యంకురురురోహితవారణాః,
సృమరశ్చమరః ఖడ్గో గవయశ్చ మహామృగాః. ౪౯

పంది, దున్నపోతు, జింకపోతు, రురుమృగము (అనగా నల్లచారలు తెల్లమచ్చలు గలదుప్పి), రోహితము (అనగా ఖేచరీమృగము), ఏనుగు, పెద్దచమరీ మృగము, చమరీ మృగము, కాండామృగము (ఖడ్గమృగము) అడవియావు ఈపదియును మహామృగము లనబడును.

అప్చరవివరము

హంససారసకాదంబబకకారంటవప్లవాః,
బలాకోత్క్రోశచక్రాహ్వమద్గుక్రౌంచాదయోఽప్చరాః ౫౦

హంస, బెగ్గురుపిట్ట, కలహంస, వాలుకొంగ, నీటికోడి, కప్పు, తెల్లకొక్కెర, పెన్నెడపులుగు, చక్రాహ్వ (అనగా చక్రవాకపుపక్షి), నీటికాకి, క్రౌంచపక్షి ఇవిమొదలగునవి అప్చరము లనబడును. అప్చరమనగా, నీటియందు సంచరించునవి యని యర్థము.

మత్స్యవివరము

మత్స్యా రోహితపాఠీనకూర్మకుంభీరకర్కటాః,
శుక్తిశంఖోద్రశంబూకశఫరీవర్మిచంద్రికాః. ౫౧
చులూకీనక్రమకరశిశుమారతిమింగిలాః,
రాజీచిలిచిమాద్యాశ్చ

రోహిత మనుమత్స్యము, అనేకదంతములుగలచేప, తాబేలు, కాఱుమొసలి, ఎండ్రకాయ, ముత్తెపుచిప్ప, శంఖము (అనగా నత్తగుల్ల), కప్పుచిప్ప, శఫరి (అనగా ఎగిరిపడెడు స్వభావముగలచేప), వర్మియనుమత్స్యము, చంద్రికయను మత్స్యము, చులూకియనుమత్స్యము, కారుమొసలి, మొసలి, పిడకమొసలి, తిమింగిలమనుచేప, రాజి, చిలిచిమమనుచేప, ఇవి మొదలగునవి మత్స్యము లనబడును. ఆది శబ్దమువలన కదళము, కపర్దకము ఇని మొదలగువానిని గ్రహింపవలయును.

మాంసమిత్యాహురష్టధా. ౫౨

మృగములు మొదలుచేసి మత్స్యములవరకును పైజెప్పబడినజంతువు లెనిమిది జాతులమాంసములును భుజింపదగి యుండు నని భావము.

యోనిష్వజావీవ్యామిశ్రగోచరత్వాదనిశ్చితే,

పైజెప్పిన యెనిమిది విధములైన మాంసములలో మేక, గొఱ్ఱె అనుని రెండును జాంగలానూపదేశములయం దుండుటచే నివి జాంగలములు, ఇయ్యవి అనూపములు నని విభజించి చెప్ప వలనుపడదు.

జాంగలాదిజంతువివరము

ఆద్యాంత్యౌ జాంగలానూపౌ మధ్యౌ సాధారణౌ స్మృతౌ.

పైజెప్పిన యెనిమిది భేదములలో మొదట నుండు మృగములు, విష్కిరములు, ప్రతుదములు, నని మూడువిధములైన జంతువులు జాంగల మెట్టదేశమునందు సంచరించుచుండుటచే జాంగలము లనబడును. కడపట జెప్పబడిన మహామృగములు, అప్చరములు, మత్స్యములు, అను నీ మూడు విధములగు జంతువులును అనూపదేశమునందు సంచరించుచుండుటచే అనూపము లనబడును. నడుమ నుండు బిలేశయములు, ప్రసహములు అను నీ రెండు విధములగు జంతువులును జాంగలమునను అనూపదేశమునను సంచరించుచుండుటచే సాధారణము లనబడును. "మధ్యౌ" అనుద్వివచన ప్రయోగమువలన ఆద్యంతవర్గములు ప్రత్యేకముగా త్రివిధముగ నుండు నని యూహ్యంబగుచున్నది.

జాంగలమాంసగుణము

తత్ర బద్ధమలాశ్శీతా లఘవో జాంగలా హితాః,
పిత్తోత్తరే వాతమధ్యే సన్నిపాతే కఫానుగే.

పైజెప్పినజాంగల, అనూప, సాధారణ జంతువుల మాంసములలో
ము మలమును బంధించును. శీతమైనవీర్యముగలది. లఘువుగనుండును. పిత్తప్రకోపించి వాతము మధ్యముగనుండి కఫము స్వల్పముగ నుండు సన్నిపాతరోగమునందు హితముగనుండును.

చెవులపిల్లిమాంసగుణము

దీపనః కటుకః పాకే గ్రాహీ రూక్షో హిమశ్శశః,

చెవులపిల్లిమాంసము అగ్నిని దీపింపజేయును. పాకమున కటువుగనుండును. మలమునుబంధించును. రూక్షగుణముకల్గియుండును. మిక్కుటముగా శీతమైనవీర్యముగలది.

"తత్ర బద్ధమలారుచ్యా మాంసానాముత్తమా హిమాః,
కషాయస్వాదు విశదాః లఘవో జాంగలా హితాః.
తామ్రోథ హారిణః కృష్ణ స్త్వైణో హృద్యస్త్రిదోషజిత్,

లఘీయాన్ షడ్రసశ్చాసౌ గ్రాహీ రూక్షో హిమశ్శశః.
కటుపాకోఽగ్నికృత్పథ్యస్సన్నిపాతేఽనిలావరే."

జాంగలమాంసము మలమును బంధించును. రుచికరముగనుండును. మాంసములలో మిగుల నుత్తమమైనది. వగరుగ, మధురముగ, విశదముగ, లఘువుగ నుండును. శరీరమునకు హితకరమైనది. శీతవీర్యముగలది. ఇఱ్ఱి, కృష్ణసారము (అనగా యజ్ఞమునకు దగినటువంటి చిత్రవర్ణపులేడి) వీనిమాంసము హృదయమునకు హితకరమైనవి. త్రిదోషములను హరింపజేయును. చెవులపిల్లిమాంసము మిగులలఘువుగ, మధురాదిషడ్రస యుక్తముగ నుండును. మలబంధముచేయును. రూక్షముగనుండును. శీతలమైనవీర్యముగలది. పాకము వలన కటువుగనుండును. అగ్నిదీపనమును గలుగజేయును. వాతము స్వల్పముగనుండు సన్నిపాతరోగమునందు హితకరమైనది. అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడి యున్నది. చెవులపిల్లిమాంసము జాంగలమాంసములో జేరినది యని చెప్పుటచేతనే దాని యందు కషాయమధురరసములు గలిగియుండునని తెలిసికొనుట సులభంబగుటచే నిచట నీశంత్రకారుడు చెప్పక విరమించెను.

వర్తకాదిమాంసగుణము

ఈషదుష్ణా గురుస్నిగ్ధా బృంహణా వర్తకాదయః. ౫౫
తిత్తిరిస్తేష్వపి వరో మేధాగ్నిబలశుక్రకృత్,
గ్రాహీ వర్ణ్యోఽనిలోద్రిక్తసన్నిపాతహరః పరమ్. ౫౬

వర్తకము మొదలగు జాంగలమాంసములన్నియు స్వల్పముగా నుష్ణము జేయును. [illegible]జిగటగనుండును. శరీరపుష్టినిచ్చును. వానిలో —

[illegible]ధన్వానూపవిదారిత్వాత్ స్నిగ్ధోష్ణగురుబృంహణః."

గ్రహావచనప్రకారము తిత్తిరిపక్షి జాంగలానూపదేశములయందు సంచరింపు [illegible]టచే వానిమాంసము శ్రేష్ఠంబు. ఇది బుద్ధి, అగ్నిదీపనము, బలము, శుక్రవృద్ధి, మలబంధము, శరీరకాంతి వీనిని గలుగజేయును. వాతాధిక్యముగల సన్నిపాతరోగమును విశేషముగా హరింపజేయును.

నెమలిమాంసగుణము

నాతిపథ్యశ్శిఖీ పథ్యశ్శ్రోత్రస్వరవయోదృశాం,

నెమలిమాంసము స్వల్పముగ పథ్యకరమైనది. చెవులు, స్వరము, వయస్సు, నేత్రములు వీనికి హితకరమైనది. వయస్సునకు హితకరమనగా, వయస్సును స్తంభింపజేయునని భావము.

కోడిమాంసగుణము

తద్వచ్చ కుక్కుటో వృష్యః గ్రామ్యస్తు శ్లేష్మలో గురుః. ౫౭

అడవికోడిమాంసము నెమలిమాంసముతో తుల్యమైనగుణముగలది. శుక్రమును వృద్ధిజేయును. గ్రామములయందు సంచరించెడి కోడిమాంసము శ్లేష్మమును, గురుత్వమును జేయును.

పిన్నకక్కెరమాంసగుణము

మేధానలకరా హృద్యాః క్రకరాస్సోపచక్రకాః,

పిన్నకక్కెరపిట్ట, ఉపచక్రము అనువానిమాంసము బుద్ధిని, అగ్నిదీప్తమును గలుగ జేయును. హృదయమునకు హితకరమైనది.

కాణకపోతములమాంసగుణము

గురుస్సలవణః కాణకపోతస్సర్వదోషకృత్. ౫౮

కాణకపోతమాంసము కొంచెము ఉప్పుగ నుండును. గురుత్వము జేయును. సర్వదోషములను ప్రకోపింపజేయును.

ఊరపిచ్చుకమాంసగుణము

చటకాః శ్లేష్మలాః స్నిగ్ధా వాతఘ్నాశ్శుక్రలాః పరం,

ఊరపిచ్చుకమాంసము శ్లేష్మమును జేయును. స్నిగ్ధముగ నుండును. వాతమును హరింపజేయును. విశేషముగా శుక్రమును వృద్ధిచేయును.

బిలేశయాదిమాంసగుణము

గురూష్ణస్నిగ్ధమధురా వర్గాశ్చాతో యథోత్తరమ్. ౫౯
మూత్రశుక్రకృతో బల్యా వాతఘ్నాః కఫపిత్తలాః,

ఇకమీద జెప్పబడు బిలేశయాదివర్గములు ఒకదానికంటె నొకటి [illegible] గురువుగ, స్నిగ్ధముగ, మధురముగ నుండును. మూత్రము, శుక్రము, [illegible] వృద్ధిజేయును. బలకరమైనవి. వాతమునుహరింపజేయును. కఫపిత్తముల వృద్ధిని [illegible]ను.

అవ. ఇటుల పంచవర్గములకు సామాన్యగుణములనుజెప్పి పిదప విశేషగుణములను జెప్పుచున్నాడు —

మహామృగాదిమాంసగుణము

శీతా మహామృగాస్తేషు క్రవ్యాదాః ప్రసహాః పునః ౬౦
లవణానురసాః పాకే కటుకా మాంసవర్ధనాః,
జీర్ణర్శోగ్రహణీదోషశోషార్తానాం పరం హితాః. ౬౧

ఈవర్గములో మహామృగములు శీతలమైన వీర్యముగలవి. మాంసమును భుజించునట్టి ప్రసహములు (అనగా పిల్లి, గద్ద, గుడ్లగూబ మొదలగునవి) కొంచెము ఉప్పుగ నుండును. పాకముచే కటువుగనుండును. మాంసమును విశేషముగా వృద్ధిజేయును. జీర్ణ

మైన అర్శస్సు, గ్రహణీదోషము, శోష వీనిచే పీడితులుగ నుండువారికి విశేషముగా హితకరమైనవి.

### మేకమాంసగుణము

నాతిశీతం గురుస్నిగ్ధం మాంసమాజమదోషలం,
శరీరధాతుసామాన్యాదనభిష్యంది బృంహణమ్. ౬౨

మేకమాంసము స్వల్పశీతలముగ నుండును. గురుత్వము జేయును. స్నిగ్ధముగ నుండును. స్వల్పదోషకారి, పురుషశరీరములోని మాంసధాతువునకు తుల్యమైన గుణము గలది యగుటవలన కొంచెముగ వాతమును వృద్ధిజేయును శరీరపుష్టినిచ్చును. ఇచట మాంసగ్రహణము ఇతరమైన రక్తాదిధాతువులకు ఉపలక్షణము. మేకశరీరములోని ధాతువులుకూడ మనుష్యశరీరధాతువులతో తుల్యములు నుండుటవలన స్వల్పముగా శ్లేష్మమును, శరీరపుష్టిని గలుగజేయును.

### గొఱ్ఱెలమాంసగుణము

విపరీతమతో జ్ఞేయ మావికం బృంహణం తు తత్,

గొఱ్ఱెమాంసము మేకమాంసమునకంటె విపరీతముగ (అనగా అత్యుష్ణముగ, స్నిగ్ధముగ, దోషయుక్తముగ, శ్లేష్మకారిగ) శరీరపుష్టికారిగ నుండును.

### గోమాంసగుణము

శుష్కకాసశ్రమాత్యగ్నివిషమజ్వరపీనసాన్. ౬౩
కార్శ్యం కేవలవాతాంశ్చ గోమాంసం సన్నియచ్ఛతి,

ంసము శుష్కకాసము, శ్రమము, అధికదీపనము, విషమజ్వరము, పీనసము, వాతము వీనిని హరింప జేయును.

### దున్నపోతుమాంసగుణము

ఉష్ణో గరీయాన్ మహిషః స్వప్నదార్ఢ్యబృహత్త్వకృత్. ౬౪

దున్నపోతుమాంసము ఉష్ణముగ, మిగుల గురువుగ నుండును. నిద్ర, శరీరదార్ఢ్యము, పుష్టి వీనిని గలుగజేయును.

### పందిమాంసగుణము

తద్వద్వరాహః శ్రమహా రుచిశుక్లబలప్రదః,

పందిమాంసము దున్నపోతుమాంసముతో సమానమైన గుణముగలది. శ్రమను పోగొట్టును. రుచి, శుక్రము, బలము వీనిని వృద్ధిజేయును.

### మత్స్యమాంసగుణవిశేషము

మత్స్యాః పరం కఫకరాః చిలిచీమస్త్రిదోషకృత్.

మత్స్యములు విశేషముగా కఫమును జేయును. మత్స్యమాంసము గురువుగ ఉష్ణముగ, స్నిగ్ధముగ, మధురముగ నుండును. మూత్రశుక్రముల నధికముగా వృద్ధిజేయును. వాతాధిక్యమును పోగొట్టును. అధికముగా కఫపిత్తములను జేయును. మఱియు,—

"గురూష్ణస్నిగ్ధమధురా వర్గాశ్చాతో యథోత్తరమ్."

ఇది మున్నగు శ్లోకములచే మత్స్యసామాన్యగుణము ఇదివరకే చెప్పబడియున్నది. కాబట్టి మత్స్యములు విశేషముగా కఫమును జేయు నని తెలియపరచుటకై యిచటను మరల జెప్ప

"కఫపిత్తకరా మత్స్యాః పరం పవనానాశనాః."

మత్స్యములు విశేషముగా కఫపిత్తములను జేయు ననియును, విశేషముగా వాతమును పోగొట్టు ననియును, అష్టాంగసంగ్రహమునందుకూడ స్పష్టముగ జెప్పబడియున్నది. చిలిచిమ యను మత్స్యము త్రిదోషముల నధికముగ జేయును.

లావాదిమాంసగుణము

## లావరోహితగోధైణాస్స్వే స్వే వర్గే వరాః పరం,

లావుకపిట్ట, రోహిత మను మత్స్యము, ఉడుము, నల్లనిఱ్ఱి, ఇవి వానివాని వర్గములలో మిగుల శ్రేష్ఠంబైనవి. అనగా లావుకపిట్ట విష్కిరవర్గములో మిగుల శ్రేష్ఠం బనియు,—

"ప్రతిస్రోతో విచారిత్వా దాకాశప్లవనేన చ,
రోహితః ప్రవరస్తేషాం."

అను అష్టాంగసంగ్రహవచనప్రకారము రోహిత మనుమత్స్యము ప్రవాహమున కెదురుగ సంచరించుటవలనను, ఆకాశమున కెగరుటవలనను మత్స్యవర్గములో
బనియు, ఉడుము బిలేశయవర్గములో మిగుల శ్రేష్ఠం బనియు, నల్ల
ములో మిగుల శ్రేష్ఠం బనియు భావము.

భుజింపతగిన మాంసము, వర్జనీయమాంసము, వీనివివరము

## మాంసం సద్యోహతం శుద్ధం వయఃస్థం చ భజేత్త్యజేత్. ౭౬
## మృతం కృశంభృశం మేద్యం వ్యాధివారివిషైర్హతం,

అపుడే చంపబడినవియును, స్నాయువులు అస్థులు మొదలగునవి తీసివేయబడినవియును, మంచియౌవనమునందుండు నవియును నగు జంతువులయొక్క మాంసమును భుజింపవలయును. కారణము తెలియకయే చచ్చినవియును, దుర్బలమైనవియును, మిగుల బలసినశరీరముగలవియును, వ్యాధి, జలము, విషము వీనిచే మృతిజెందినవియును నగు జంతువులమాంసమును వర్జింపవలయును.

"హంసస్స్వరకరః పిత్తరక్తజిన్మధురో హిమః,
కుళీరః పరమం వృష్యో బృంహణః ప్రీణనో గురుః."

గోధా నియచ్ఛతి విషం మూషికశ్శుక్రవర్ధనః,
గురూణ్యాండాని బాలానాం కషాయమధురం పలమ్,
వృద్ధానాం స్నాయుభూయిష్ఠమబల్యం గురు దోషలమ్."

హంసమాంసము కంఠస్వరమునకు హితముజేయును. పిత్తరక్తమును పోగొట్టును. మధురముగ, శీతవీర్యముగలదిగ నుండును. ఎండ్రపీతమాంసము విశేషముగా శుక్రము, శరీరపుష్టి, సృప్తి వీనిని గలుగజేయును. గురుత్వముగలది. ఉడుముమాంసము విశేషముగా విషమును పోగొట్టును. ఎలుకమాంసము శుక్రమును వృద్ధిజేయును. గ్రుడ్లు గురుత్వముజేయును. లేతవయస్సుగల జంతువులయొక్క మాంసము కషాయముగ, మధురముగ నుండును. ముసలితనముగల జంతువులయొక్క మాంసము మిక్కుటముగ స్నాయువులతోగూడియుండును. బలకరమైనది కాదు. దోషకరమైనది. అని అష్టాంగ సంగ్రహమునందు మాంసభేద, తద్గుణములు జెప్పబడియున్నవి.

మాంసగురులాఘవవివరము

పుంస్త్రియోః పూర్వపశ్చార్ధే గురుణీ గర్భిణీ గురుః. ౬౭
లఘుర్యోషిచ్చతుష్పాత్సు విహంగేషు పునః పుమాన్,
శిరస్స్కంధోరుపృష్ఠస్య కట్యాస్సక్థ్నోశ్చ గౌరవమ్. ౬౮
తథామపక్వాశయయోః యథాపూర్వం వినిర్దిశేత్,
శోణితప్రభృతీనాం చ ధాతూనాముత్తరోత్తరమ్. ౬౯
మాంసాద్గరీయో వృషణమేఢ్రవృక్కయకృద్గుదం,

స్త్రీజాతిజంతువులయొక్క పూర్వపశ్చార్ధభాగములయందలి మాంసము గురువుగనుండును. (అనగా పురుషజాతియొక్క పూర్వార్ధమును, శ్చార్ధమును గురువుగనుండుననిభావము.) గర్భిణిగనుండు జంతువుక్క మాంసము గురువుగనుండును. నాల్గు కాళ్లుగల ఆవుమొదలగు జంతువులలో స్త్రీజాతియొక్క మాంసము లఘువుగనుండును. పక్షిజాతులలో పురుషపక్షిమాంసము లఘువుగనుండును. శిరము, భుజశిరస్సులు, వీపు, పిఱుదులు, తొడలు వీనిలో పూర్వపూర్వమాంసము గురువుగ నుండును (అనగా తొడలయందలి మాంసమునకంటె పిఱుదలయందుండుమాంసమును, దానికంటె వీపునందుండుమాంసమును, దానికంటె భుజశిరస్సులయందుండు మాంసమును, దానికంటె శిరమునందుండుమాంసమును గురువుగ నుండునని భావము.) ఆమాశయపక్వాశయములయందుండు మాంసముయథాపూర్వముగ గురుత్వముగలది (అనగా పక్వాశయమునందుండు దానికంటె ఆమాశయమునందుండునది గురువుగనుండుననిభావము.) రక్తాదిధాతువులలో దానికంటె నొకటి గురు

వుగనుండును. అనగార క్తమునకంటె మాంసము, మాంసమునకంటె మేదస్సు ఈప్రకారము ధాతుగురుత్వములను తెలిసికొనవలయును. తక్కిన అవయవములయందలి మాంసమున కంటె వృషణములయందలిమాంసము, దానికంటె మేఢ్రమునందలి మాంసము, దాని కంటె వృక్కములయందలి మాంసము, దానికంటె యకృత్తునందలిమాంసము, దాని కంటె గుదమునందలి మాంసము నొకదానికంటె నొకటి మిగుల గురువుగ నుండును.

మాంసవర్గము ముగిసెను.



అవ. మాంసవర్గానంతరము శాకవర్గము చెప్పబడుచున్నది —

పారాదిశాకసామాన్యగుణము

శాకం పారా *శతీ పూషా సునిషణ్ణసతీజనమ్, ౭౦
త్రిదోషఘ్నం లఘు గ్రాహి సరాజక్షవవాస్తుకం,

పారా (చిరుబొద్ది), సరీ (కచోరపుకూర,) పూషా (అనగాజిల్లేడు), సునిషణ్ణము (అనగా చెంచలికూర), సతీనజము, రాజక్షవము (అనగా చిలుకకూర), వాస్తుకము (అనగా చక్రవర్తికూర), ఈ శాకములు త్రిదోషములను హరింపజేయును లఘువుగ నుండును. మలబంధమును జేయును.

అవ. ఇటుల పారాదిశాకములకు సామాన్యగుణములను జెప్పి ఇక విశేషగుణము లను జెప్పుచున్నాడు —

చెంచలికూరగుణము

సునిషణ్ణోఽగ్నికృద్వృష్య_స్తేషు,

పైజెప్పిన పారాదిశాకములలో చెంచలికూర విశేషముగ అగ్నిదీ జేయును. శుక్రమును వృద్ధిజేయును. ఇది జలమధ్యములో మొలచును పులిచింతయాకులతో తుల్యముగనుండును.

చిలుకకూరగుణము

రాజక్షవః పరమ్ ౭౧
గ్రహణ్యర్శోవికారఘ్నః

చిలుకకూర విశేషముగా గ్రహణి, అర్శస్సు వీనిని పోగొట్టును.

చక్రవర్తికూరగుణము

వర్చోభేదితు వాస్తుకం,

చక్రవర్తికూర మలమును భేదించును.

* శటీశూషా ఇతి పా.

— కాచిహూరగుణము —

హంతి దోషత్రయం కుష్ఠం వృష్యా సోష్ణా రసాయనీ. ౭౨
కాకమాచీ సరా స్వర్యా

కాచిహూర త్రిదోషములను కుష్ఠమును పోగొట్టును, శుక్రమును వృద్ధిజేయును, కించిదుష్ణముగ నుండును. శరీరమునందు వేగముగ వ్యాపించును. శరీరములో గడ్డకట్టియుండు వస్తువులను భేదించును. కంఠస్వరమునకు హితకరమైనది. శరీరమునందు స్వస్థతను గలుగజేయుటచే రసాయనతుల్యముగ నుండును.

— పులిచింతగుణము —

చాంగేర్యమ్లాగ్నిదీపనీ,
గ్రహణ్యర్శోఽనిలశ్లేష్మహితోష్ణా గ్రాహిణీ లఘుః. ౭౩

పులిచింత పుల్లగనుండును. అగ్నిదీపనము జేయును. గ్రహణి, అర్శస్సు, వాతము, శ్లేష్మము వీనియందు పథ్యకరమైనది. ఉష్ణవీర్యముగలది. మలమును గట్టిపరచును. లఘువుగనుండును.

— పటోలాదిసామాన్యగుణము —

పటోలసప్తలారిష్టశార్ఙ్గేష్టావల్గుజామృతాః,
వేత్రాగ్రం బృహతీ వాసా కుంతలీ తిలపర్ణికా. ౭౪
మండూకపర్ణీ కర్కోటకారవేల్లకపర్పటాః,
నాడీకలాయం గోజిహ్వా వార్తాకం వనతిక్తకమ్. ౭౫
కరీరం కులకం నందీ కుచేలా శకులాదినీ,
కేంబుకం శీతం సకోశాతకకర్కశమ్. ౭౬
తిక్తం పాకే కటు గ్రాహి వాతలం కఫపిత్తజిత్,

పొట్ల, సంబరేణు, వేము, శార్ఙ్గేష్టా (అనగా గురుజ) బావంచి, తిప్పతీగె, వెదురుగొమ్ము, ములక, అడ్డసరము, కుంతలీ (అనగా సూక్ష్మతిలజాతిః), తిలపర్ణి (అనగా బదరము) మండూక బ్రహ్మి, సరస్వతియాకు, డావరడంగి, కాకర, పర్పాటకము, నాడీకలాయము (అనగా శకులాక్షము, ఇదేసువర్చలాభేదము) బరివెంక, వార్తాకము (అనగా కత్తిరివంగ), కొండిసెపాల, కరీరము (అనగా వెదురుమొలక, లేక చౌట కొమ్ము) చిట్టితుమికి, నందివృక్షము, కుచేలం (అనగా పారా), కటుకరోహిణి, ఎట్టి గలిజేరు, కేంబుకము, కోశాతకము (అనగా బీర) కర్కశము (అనగా కంపిల్లకము) అను నీ యిరువదియారుశాకములు శీతలమైన వీర్యము గలవి తిక్తముగ పాకమువలన

కటువుగ నుండును. కొంచెము మలబంధనమును జేయును. వాతకఫ, కఫపిత్తములను పోగొట్టును. ఇటుల పైశాకములకు సామాన్యగుణములను జెప్పి వానిలో గొన్నిటికి గుణకర్మవిశేషములను జెప్పుచున్నాడు.

### పొట్లగుణము

**హృద్యం పటోలం కృమినుత్స్వాదుపాకం రుచిప్రదమ్. ౭౭**

పొట్ల కృములను పోగొట్టును. పాకమువలన మధురముగ నుండును. రుచిని బుట్టించును.

"పటోలపత్రం పిత్తఘ్నం వల్లీ చాస్య కఫాపహా,
ఫలం త్రిదోషశమనం మూలం చాస్య విరేచనమ్."

పొట్లాకు పిత్తమును పోగొట్టును, దానితీగె కఫమును హరింపజేయును. పొట్లకాయ త్రిదోషములను శమింపజేయును. పొట్లవేరు విరేచనము చేయించును. అని చరకము నందు చెప్పబడియున్నది.

### ములకగుణము

**పిత్తలం దీపనం భేది వాతఘ్నం బృహతీద్వయమ్,**

ములక, వాకుడు అను నీరెండును పిత్తముజేయును. అగ్నిదీపనకారి. మలాదులను భేదించును. వాతమును హరింపజేయును.

### అడ్డసరగుణము

**వృషం తు వమికాసఘ్నం రక్తపిత్తహరం పరమ్. ౭౮**

అడ్డసరము వమనము, కాసము వీనిని హరింపజేయును. విశేషముగా రక్తపిత్తమును పోగొట్టును.

### కాకరగుణము

**కారవేల్లం సకటుకం దీపనం కఫజిత్పరం,**

కాకరరసమునందు కొంచెము కటువుగ నుండును. అగ్నిదీపనకారి. కఫపిత్తములను హరింపజేయును.

### వంగగుణము

**వార్తాకం కటు తిక్తోష్ణం మధురం కఫవాతజిత్. ౭౯**
**సక్షారమగ్నిజననం హృద్యం రుచ్యమపిత్తలం,**

వంకాయ కటువైనరసముగలది కొంచెము తిక్తముగనుండును. ఉష్ణమైన వీర్యము గలది. మధురముగనుండును. కఫవాతములను పోగొట్టును. కొంచెము ఉప్పగ నుండును. హృదయమునకు హితకరమైనది. రుచిని బుట్టించును కొంచెము పిత్తమునుజేయును.

చోటకోమ్ముగుణము

కరీరమాధ్మానకరం కషాయస్వాదుతిక్తకమ్. ౮౦

వెదురుమోవు కడుపునుబ్బరించును. రసమునందు కషాయముగ, మధురముగ, తిక్తముగనుండును.

బీర, బావంచి, పీసిగుణము

కోశాతకావల్గుజకౌ భేదనావగ్నిదీపనౌ,

బీర, బావంచి అను నీరెండును వాతాదులను భేదించును. అగ్నిదీపనమును గలుగజేయును. రూక్షముగనుండు తిప్పతీగె మొదలగు ద్రవ్యములు వాతపిత్తకఫములను హరింపజేయుటయందు తఱుచుగా ప్రసిద్ధంబులుగనున్నయవి. బీర, బావంచి అను నిరెండును రూక్షములుగనుండుటవలన వానికిని వాతపిత్తకఫహరత్వ గుణముగలిగియుండునని తెలియవలయును. "కఫవాతనుదవల్గుజః" అనగా బావంచి కఫవాతములను హరింపజేయునని చరకాచార్యుడు చెప్పియున్నాడు.

"సతరాఢం కందకం చ చక్షుర్గ్రాహి హిమం గురు,
కుమారీ జీవలోణికా నలినీ గుచువర్ణికా.
స్వాదురూక్షం స లవణం వాతశ్లేష్మకరం గురు,
శ్యామా శాల్మలికాశ్మర్యఫంజీకర్ణికయూధికా.
వృషాదనీ క్షీరవృక్షా బింబీతనిక వృశ్చికా,
రోధ్రశ్శాణః కర్బుదారః స్నశేలుర్వృషమూషికా.
భల్లాతకః కోవిదారః కమలోత్పలకింశుకమ్,
లాదిగుణం స్వాదు కషాయం పిత్తజిత్పరమ్.
పిత్తహారా రూఢీ పర్విణీ దీర్ఘపుష్పికా,
రుష్ణతరా తిక్తా సారుబూకా చ లాంగలీ.
కటుతిక్తామ్లభేదినా తిలవేతసౌ,
విశ్వం రాస్నా బలాశాకం వాఽఘ్నమతిసారనుత్,
వాతం వత్సాదనీ హన్యాత్కఫం కండీరచిత్రకా."

అనగాసతరాఢము, కంపకము (అనగా మారేడు) ఇవి నేత్రములకు హితముచేయును. మలమును బంధించును. శీతలముగ, గురువుగనుండును. కలుబంద, జీవలోణిక, తామర, గుచుపర్ణికా ఇవి మధురముగ, రూక్షముగ, కొంచెము ఉప్పగనుండును. గురుత్వము చేయును. వాతశ్లేష్మములను గలుగజేయును. నల్లతెగడ, బూరుగ, గుమ్ముడు, భారంగి, చేమంతి, యూధికా (అనగా అడవిమొల్ల), వదనిక, క్షీరవృక్షము (అనగా చిన్నవిప్ప) దొండ, తనికము, వృశ్చిక, లొద్దుగు, శాణము, కాంచనము, విరిగి, అడ్డసరము, ఎలుకచెవి, జీడి, ఎఱ్ఱకాంచనము, కమలము, కలువ, మోదుగ, ఇవి పైజెప్పిన పొట్ల మొదలగు

వాసితో తుల్యమైన గుణములుకలవి. మధురముగ, కషాయముగనుండును. విశేషముగా పిత్తమును పోగొట్టును. రూఢి, పర్విణి, దీర్ఘపుష్పిక, ఇవి వాతపిత్తములను హరింప జేయును. అరుబూక, పొత్తిగడ్డ అను నీరెండును లఘువుగ, మిగుల నుష్ణముగ తిక్తముగ నుండును. వాతమును జేయును. నువ్వులు, ప్రబ్బలి అను నీరెండును కటువుగ, తిక్తముగ, పుల్లగనుండును. వాతాదులను భేదించును. శుంఠి, దుంపరాష్ణము, బలా శాకము ఇవి వాతమును, అతిసారమును హరింపజేయును. తిప్పతీగె, వాతమును పోగొట్టును. కండీరము (అనగా గజపిప్పళ్ళు) చిత్రమూలము అను నీరెండును కఫమును పోగొట్టును అని అష్టాంగసంగ్రహమునందు కొన్ని శాకభేదగుణములు జెప్పబడి యున్నవి.

"న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్షపద్మాదిపల్లవాః,
కషాయాః స్తంభనాశ్శీతాః హితాః పిత్తాతిసారిణామ్."

మఱ్ఱి, మేడి, రావి జువ్వి, తామరపువ్వు మొదలగువాని చిగుళ్లు కషాయముగనుండును. శుక్రస్తంభనమును జేయును, శీతలమైన వీర్యముగలవి. పిత్తాతిసారులకు మిగుల హితకర మైనవి అని చరకమునందు జెప్పబడియున్నది.

"కరీరకుసుమం జ్ఞేయం కఫపిత్తహరం లఘు
అగస్త్యం నాతిశీతోష్ణం నక్తాంధానాం ప్రశస్యతే.
చాతుర్థికజ్వరహరం నస్యయోగేన శీలితం,
రాజవృక్షస్య నింబస్య శిగ్రోస్సింహాముఖస్య చ
కఫపిత్తహరం పుష్పం కుష్ఠఘ్నం కుటజస్య చ,
శ్రేయసీబిల్వపర్ణీచ బిల్వపత్రం చ వాతనుత్."

కరీరపుష్పము (అనగా వెణుతురుపువ్వు) కఫపిత్తములనుపోగొట్టును. లఘువుగనుండును. అగసిపువ్వు స్వల్పశీతోష్ణముగనుండును. రేజీకటియందు ప్రశస్తమైనది. నస్యయోగము వలన చాతుర్థికజ్వరమును హరింపజేయును. రేల, వేప, మునగ, అడ్డసరము, కొడిసె వీనిపూలు కఫము, పిత్తము, కుష్ఠము, వీనిని హరింపజేయును. ఏనుగు పిప్పలి, బిల్వపర్ణి, బిల్వపత్రము, ఇవి వాతమును హరింపజేయును. అని సుశ్రుతమునందు జెప్పబడి యున్నది.

## చిఱ్ఱికూరగుణము

తండులీయో హిమో రూక్షస్స్వాదుపాకరసో లఘుః. ౮౧
మదపిత్తవిషాస్రఘ్నః

చిఱ్ఱికూర శీతలమైన వీర్యముగలది. రూక్షముగనుండును. మధురమైన పాకరస ములుగలది. లఘువుగనుండును. మదము, పిత్తము, విషము, రక్తము వీనిని హరింప జేయును.

మంజాతగుణము

*ముంజాతం వాతపిత్తజిత్,
స్నిగ్ధం శీతం గురు స్వాదు బృంహణం శుక్రకృత్పరమ్. ౮౨

ముంజాతము వాతపిత్తములను హరింపజేయును. స్నిగ్ధముగ, శీతలముగ, గురువుగ, మధురముగనుండును, శరీరమునకు పుష్టినిచ్చును. విశేషముగ శుక్రమును వృద్ధిజేయును.

పాలక్యా (అనగా మట్టుబచ్చలి) గుణము

గుర్వీ సరా తు పాలక్యా

బచ్చలికూర గురువుగనుండును. మలాదులను భేదించును. జిగటగ, శ్లేష్మకారిగ, శీతలముగ నుండు నని తెలియజేయునిమిత్తము సముచ్చయార్థమైన (తు) అను శబ్దము ప్రయోగింపబడినది.

"పాలక్యా పిచ్ఛిలా గుర్వీ శ్లేష్మలా భేదినీ హిమా"
మట్టుబచ్చలిజిగటగ, గురువుగనుండును. శ్లేష్మకారి, మలాదులను భేదించును. శీతలముగ నుండును. అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

దుంపబచ్చలిగుణము

మదఘ్నీ చాప్యుపోదకా,

దుంపబచ్చలి మదమును హరింపజేయును. మట్టుబచ్చలితో తుల్యమైన గుణము గలది.

పొలముబచ్చలిగుణము

పాలక్యావత్ స్మృతః చంచుస్సతు సంగ్రహణాత్మకః ౮౩

పొలముబచ్చలి మట్టుబచ్చలితో తుల్యమైన గుణము గలది. మలాదులను బంధించును.

నేలగుమ్మడుగుణము

విదారీ వాతపిత్తఘ్నీ మూత్రలా స్వాదుశీతలా,
జీవనీ బృంహణీ కంఠ్యా గుర్వీ వృష్యా రసాయనీ. ౮౪

నేలగుమ్మడు వాతపిత్తమును హరింపజేయును. మూత్రము నధికముగ జేయును. మధురముగ, శీతలముగ నుండును. బలమును, శరీరపుష్టిని గలుగజేయును. కంఠస్వరమునకు హితకరమైనది. గురుత్వము జేయును. శుక్రమును వృద్ధిజేయును. రసాయనముతో తుల్యమైనది. ఈగుణములు నేలగుమ్మడుగడ్డకే గలిగియుండును

* గృంజనం ఇతిపా.

"జీవనో బృంహణో వృష్యో బల్యశ్చస్తో రసాయనమ్."
విదారికందః కంఠ్యశ్చ మూత్రలస్స్వాదుశీతలః."

అనువచనముచే చరకాచార్యుడుకూడ నేలగుమ్ముడుగడ్డకు పైగుణములనే జెప్పియున్నాడు.

### పాలకూరగుణము

చక్షుష్యా సర్వదోషఘ్నీ జీవంతీ మధురా హిమా,

పాలకూర నేత్రములకు హితముచేయును. త్రిదోషములను హరింపజేయును. మధురముగనుండును. శీతవీర్యముగలది. మఱియొకవిధమైన పాలకూర మొదటచెప్పిన పాలకూరకంటె కొంచెమతక్కువగుణము గలదై యుండును. ఈయర్థమే —

"చక్షుష్యా సర్వదోషఘ్నీ జీవంతి మధురా హిమా,
శాకానాం ప్రవరాన్యానా ద్వితీయా కించిదేవ తు."

అనువచనముచే అష్టాంగసంగ్రహమునందును జెప్పబడియున్నది.

"భండీ శతావరీ శాకం బలాజీవంతిజం చ యత్,
పర్వాణ్యా పర్వపుష్పా చ వాతస్తహరం మతమ్."

దిరిసెనము, పిల్లిపెచర, ముత్తపుపులగము, పాలకూర, పర్వాణ్యా, పర్వపుష్ప, వీనిశాకములు వాతపిత్తములను హరింపజేయు నని చరకాచార్యుడు చెప్పియున్నాడు.

### కూష్మాండాదిశాకసామాన్యగుణము

కూష్మాండతుంబకాళింగకర్కార్వేర్వారుతిండిశమ్. ౧౫
తథాత్రపుసచీనాకచిర్భటం కఫవాతకృత్
భేది విష్టంభ్యభిష్యంది స్వాదుపాకరసం గురు. ౧౬

గుమ్ముడు, సొర, పుచ్చ, ములుదోస, ఏర్వారు (దోస), తిండిశము, త్రపుసము (దోసలోభేదము), చీనాకము, బుడమ, అనువానిశాకములు కఫవాతములను జేయును. వాలాదులను భేదించును. మలమును గట్టిపరచును. శ్లేష్మమును జేయును. మధురమైన పాకరసములు గలవి. గురుత్వముచేయును.

అవి, ఇటుల గుమ్ముడుమొదలగు శాకములకు సామాన్యగుణములను జెప్పి వానిలో గొన్నిటికి విశేషగుణములను జెప్పుచున్నాడు.

### గుమ్ముడుగుణము

వల్లీఫలానాం ప్రవరం కూష్మాండం వాతపిత్తజిత్,
వస్తిశుద్ధికరం వృష్యం

తీగెలయందుకాచెడి ఫలములలో గుమ్ముడు శ్రేష్ఠమైనది. వాతపిత్తములను హరింపజేయును. పొత్తికడుపును శుద్ధిచేయును శుక్రవృద్ధికారి.

దోసగుణము

త్రపుసం త్వతిమూత్రలమ్ ౮౭

దోసవిశేషముగా మూత్రమును వెడలింపజేయును

సొరకాయ మొదలగువానిగుణము

తుంబం రూక్షతరం గ్రాహి కాళింగైర్వారుచిర్భటం,
బాలం పిత్తహరం శీతం విద్యాత్పక్వమతోన్యథా. ౮౮

సొరకాయ మిగులరూక్షముగనుండును. మలమునుబంధించును. పుచ్చ, ఏర్వారు (అనగా దోసభేదము), బుడమ, ఇవి మాళవదేశమునందు ప్రసిద్ధంబులు. మఱియును జాలంధరాది దేశములందు మిగుల ప్రసిద్ధంబులు. ఇవి లేతగనుండునపుడు పిత్తమును హరింపజేయును. శీతవీర్యముగలవిగనుండును. ఈ గుణములకంటె ముదిరినవి విరుద్ధముగ నుండును. (అనగా పిత్తమును జేయుననియును, ఉష్ణవీర్యముగలవిగ నుండుననియును భావము.)

"నీలం యత్త్రపుసం బాలం వృష్యం పిత్తహరం మతం,
పక్వం పాండుకఫకృజ్జీర్ణమమ్లం పిత్తకరం స్మృతమ్"

నీలవర్ణముగనుండునట్టి ములుదోస లేతగనుండునపుడు శుక్రమును వృద్ధిజేయును. పిత్తమును హరింపజేయును. ముదిరినములుదోస పాండువు, కఫము, రక్తపిత్తము వీనినిగలుగ జేయును. అని సుశ్రుతమునందు జెప్పబడియున్నది.

"తుంబం రూక్షతరం కాళింగైర్వారుచిర్భటం గ్రాహి."

సొర, పుచ్చ, ఏర్వారు, బుడమ, ఇవి మిగులరూక్షములుగనుండును. మలమును బంధిం చును అని చరకమతానుసారులు వచించెదరు.

నక్కదోసగుణము

శీర్వారుకం తు సక్షారం పిత్తలం కఫవాతనుత్,
రోచనం దీపనం హృద్య మష్ఠీలానాహనుల్లఘు. ౮౯

నక్కదోస ఒకింత ఉప్పగనుండును. పిత్తమును జేయును. కఫవాతములను హరింప జేయును. రుచినిబుట్టించును. అగ్నిదీపనకారి. హృదయమునకు హితముచేయును. అష్ఠీలమును, ఆనాహమును పోగొట్టును. లఘువుగనుండును.

"ఘనాష్ఠీలోపమో గ్రంథిరష్ఠీలోర్ధ్వంసమున్నతః."

అనగా ఘనమైన అష్ఠీలముతో తుల్యమైనదియును, ఊర్ధ్వభాగములో నున్నతముగ నుండునదియునైన నొకగ్రంథి అష్ఠీలమనబడును.

"సాటోపమత్యుగ్రరుజ మాధ్మానముదరే భృశం,
ఊర్ధ్వాధో వాతరోధేన తమానాహం ప్రచక్షతే."

ఊర్ధ్వాధోవాతరోధమువలన ఆడంబరముతోఁగూడి అత్యుగ్రమైన పీడనుగలుగఁజేయుచు నుండునట్టి కడుపుబ్బరము ఆనాహమనబడును.

### తామరతూడు మొదలగువానిగుణము

మృణాళబిసశాలూక కుముదోత్పలకందకం,
నందీమాషకకేలూటశృంగాటకకశేరుకమ్. ౯౦
క్రౌంచాదనం కలోడ్యం చ రూక్షం గ్రాహి హిమం గురు,

తామరతూడు, తామరదంటు, తామరదుంప, తెల్లకలువదుంప, ఎఱ్ఱకలువ దుంప, నందివర్ధనము, మాషకము (పొస్తులమను నామాన్తరముకల శాకవిశేషము), కేలూటము (అత్తిఁగో నొకవిధమైనది) పరికెగెడ్డ, నమ్మదుంప, క్రౌంచాదనము, కలోడ్యము (అనగా తామరపూస) రూక్షములుగనుండుచు మలమును బంధించును. శీతమైనవీర్యముగలవి. గురుత్వముజేయును.

### కడిమి మొదలగువానిగుణము

కలంబనాలికా*మార్షకుటింజరకుతుంబకమ్; ౯౧
చిల్లీలట్వాకలోణీకా కురూటకగవేధుకం,
జీవంతఝుంఝ్వేడగజయవశాకసువర్చలమ్. ౯౨
ఆలుకానిచ సర్వాణి తథా సూప్యాని లక్ష్మణం,
స్వాదు రూక్షం సలవణం వాతశ్లేష్మకరం గురు. ౯౩
శీతలం సృష్టవిణ్మూత్రం ప్రాయో విష్టభ్య జీర్యతి,
స్విన్నం నిష్పీడితరసం స్నేహాఢ్యం నాతిదోషలమ్. ౯౪

కడిమి, తూడి, మార్షము (గాంధారికయను నామాంతరముకల శాకవిశేషము కుటింజరము (ఎఱ్ఱనిముల్లంగి, ఏనుగుతుమ్మి, చిల్లి (అనగా పెద్దాకులుగల యవశాకము లేక చిలుకకూర), లట్వాకము (గుగ్గులుకమనుశాకము), లోణీకము (లోణారమను శాకము), కురూటకము (స్థితివారక మనుశాకము), గవేధుకము (అడవిగోధుమశాకము), జీవంతము (బృహద్ధాన్యారమనుశాకము), ఝుంఝురకము అను శాకవిశేషము, తగిరిశ, యవశాకము, ప్రొద్దుతిరుగుడాకుకూర, ఆలుకములు (బంగాళాదుంపలు, చిరుగడదుంపలు, కఱ్ఱపెండలము, పెండలము, ఎఱ్ఱగనుసుమున్నగునవి), సూప్యశాకములు (పెసర అనుమ మున్నగువాని యాకుకూరలు), లక్ష్మణ (అతిమధురపు ఆకుకూర), ఇవి యన్నియు మధురంబులును రూక్షంబులును, కొంచెము ఉప్పగనుండును. వాతమును కఫమును గురుత్వమును వృద్ధిచేయును. శీతమైన వీర్యముగలవి. మలమూత్రముల నధికముగ వెడలించును.

---

* మూష. ఇతిపా.

తఱుచుగా ఉదరమునందు ఉంటకట్టి పిదప జీర్ణంబగును. వీని నన్నిటిని పాకముచేసి యందలిరసమును దీసివేసి మిగులనూనెను జేర్చి సంస్కారముచేసినచో (అనగా తిరగ మాతబెట్టినచో కొంచెము పథ్యకరములుగ నుండును.

"సంస్కృతం వేసవారేణ సస్నేహం శాకమిష్యతే,
రాజికాసక్తుభక్తాది సంస్కారం చానువర్తతే."

వేసవారముచేత (అనగా ఇంగువ, జీలకఱ్ఱమొదలగు సంభారములచేత) తిరగమాతబెట్టబడి మిగులనూనెతో గూడియుండునది శాక మనబడును. అది ఆవాలు, సక్తువు (అనగా వేపుడు బియ్యపుపిండి) మొదలగువానిచే చేయబడిన సంస్కారములనుకూడ ననువర్తించును అని సుశ్రుతమునందు చెప్పబడియున్నది.

## చిల్లీశాకగుణము

లఘుపత్త్రా తు యా చిల్లీ సా వాస్తుకసమా మతా,

లఘుపత్త్రములుగల పైజెప్పినచిల్లియను యనశాకవిశేషము చక్రవర్తికూరతో తుల్యమైన గుణములు గలదిగ నుండును.

## తక్కాలి, ఉలిమిడి, వీనిగుణము

తర్కారీ వరణం స్వాదు సతిక్తం కఫవాతజిత్. ౯౪

తక్కాలి, ఉలిమిరి ఈ రెండువాతములును, కొంచెము తిక్తముగనుండును. కఫవాతములను హరింపజేయును.

## గలిజేరు, కరివేప, వీనిగుణము

వర్షాభ్వో కాలశాకం చ సక్షారం కటుతిక్తకం,
దీపనం భేదనం హంతి గరశోఫకఫానిలాన్. ౯౬

రెండువిధములైన గలిజేరు (అనగా తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు) కరివేప ఇవి కొంచెము ఉప్పగ, కారముగ, తిక్తముగ నుండును. అగ్నిదీపనమును గలుగజేయును. మలాదులనుభేదించును. విషము, శోఫ, కఫము, వాతము వీనిని హరింపజేయును.

## కానుగుచిగుళ్లగుణము

దీపనాః కఫవాతఘ్నాః చిరిబిల్వాంకురాస్సరాః,

కానుగుచిగుళ్లు అగ్నిదీపనమును గలుగజేయును కఫవాతములను పోగొట్టును. మలాదులను భేదించును.

## పిల్లిపీచరమొలకలగుణము

శతావర్యంకురాస్తిక్తాః వృష్యా దోషత్రయాపహాః. ౯౭

పిల్లిపీచరమొలకలు తిక్తమైన రసము గలవిగ నుండును. శుక్లమును వృద్ధిజేయును. త్రిదోషములను హరింపజేయును.

### వెదురుమొలకలగుణము

రూక్షో వంశకరీరస్తు విదాహీ వాతపిత్తలః,

వెదురు మొలకలు రూక్షములును, విదాహకరంబులును నగును, వాతపిత్తములను వృద్ధినొందించును.

### పొన్నగంటిగుణము

షత్త్వారో దీపనస్తిక్తః ప్లీహార్శఃకఫవాతజిత్. ౯౮

పొన్నగంటి అగ్నిదీపనమునుజేయును. తిక్తమైనరసముగలది. ప్లీహము, అర్శస్సు కఫవాతములు వీనిని హరింపజేయును.

### కసివెందగుణము

కృమికాసకఫోత్క్లేదాన్ కాసమర్దో జయేత్సరః,

కసివెంద శరీరమునందువ్యాపించును. క్రిములు, కాసము, కఫము, ఉత్క్లేదము (అనగా స్రోతస్సులు మాలిన్యముచే తడిసియుండుట) వీనిని హరింపజేయును.

### కుసుమకూరగుణము

రూక్షోష్ణమమ్లం కౌసుంభం గురు పిత్తకరం పరమ్. ౯౯

కౌసుంభశాకము, (అనగా కుసుమకూర) రూక్షముగ ఉష్ణమైనవీర్యము గలదిగ, పుల్లగ, గురువుగ నుండును. పిత్తమును జేయును మలాదులను భేదించును.

### ఆవకూరగుణము

గురూష్ణం సార్షపం బద్ధ విణ్మూత్రం సర్వదోషకృత్,

ఆవకూర గురువుగ, ఉష్ణమైనవీర్యము గలదిగ నుండును. మలమూత్రములను బంధించును. త్రిదోషములను వృద్ధినొందించును.

"సక్షారమధురం స్నిగ్ధముష్ణం చ గురుసార్షపమ్"

ఆవకూర కొంచెము ఉప్పుగ, మధురముగ, స్నిగ్ధముగ, ఉష్ణముగ, గురువుగ నుండునని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

"కఫఘ్నం సార్షపం శాక మాసురం శాకమేవ చ"

ఆవకూర, ఆసురశాకము (అనగా నల్లావకూర) ఈ రెండును కఫమును హరింపజేయు నని సుశ్రుతమునందు జెప్పబడియున్నది.

### ముల్లంగిగుణము

యద్బాలమవ్యక్తరసం కించిత్క్షారం సతిక్తకమ్. ౧౦౦
తన్మూలకం దోషహరం లఘుసోష్ణం నియచ్ఛతి,
గుల్మకాసక్షయశ్వాసవ్రణనేత్రగళామయాన్. ౧౦౧

సర్వాగ్నిసాదోదావర్తపీనసాంశ్చ మహాత్మనః,
రసే పాకే చ కటుక ముష్ణవీర్యం త్రిదోషకృత్. ౧౦౨
గుర్వభిష్యంది చ స్నిగ్ధస్విన్నం తదపి వాతజిత్,
వాతశ్లేష్మహరం శుష్కం సర్వమామం తు దోషలమ్. ౧౦౩

రసము తెలియక కొంచెము ఉప్పగ, చేదుగనుండు లేతముల్లంగి దోషములను హరింపజేయును లఘువుగ, కించిదుష్ణముగనుండును. గుల్మము, కాసము, క్షయము, శ్వాసము, వ్రణము, నేత్రరోగము. గళరోగము, స్వరహీనత, అగ్నిమాంద్యము, ఉదావర్తము, పీనసము, మున్నగు రోగములను హరించును.

"సర్వదోషహరా లఘ్వీ కంఠ్యా మూలకపోతికా"

లేతముల్లంగి దోషములనన్నింటెని హరించును. లఘువుగనుండును. కంఠమునకు హితముగనుండును. అని సుశ్రుతమునందు జెప్పబడియున్నది. లేతముల్లంగినిగురించి సుశ్రుతముగో జెప్పియుండులక్షణము పైజెప్పినలక్షణములలో నంతర్గతమైయుండుటచే నీ తంత్రకారుడు ప్రత్యేకముగా జెప్పక విరమించెను. ముదిరినముల్లంగి కటువైనరసపాకములుగలదిగ, ఉష్ణమైన వీర్యముగలదిగనుండును. త్రిదోషములను వృద్ధినొందించును. గురుత్వమును కలిగించును. కఫమును వృద్ధిజేయును పక్వమైనముల్లంగికి అనేకావస్థలు గలిగియుండును. వాటిలో మిక్కుటముగ ముదరనిముల్లంగి స్వల్పముగా త్రిదోషమును జేయును మిగులముదిరినది మిక్కుటముగా త్రిదోషములను వృద్ధినొందించునని తెలియవలయును.

"మహాత్మనః,
రూక్షోష్ణం కటుకం స్వాదు విపాకే సర్వదోషకృత్."

ముదిరినముల్లంగి రూక్షముగ, ఉష్ణముగ, కారముగ మధురమైన పాకముగలదిగ నుండును. త్రిదోషములను వృద్ధినొందించును. అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది. ఈలక్షణము ఆమముగనుండు ముల్లంగి విషయమని తెలియవలయును. ముదిరినముల్లంగి కొంచెముగ పాకముచేయబడి స్నేహయుక్తముగనుండినచో వాతమును పోగొట్టును. లేతగ లేక ముదిరినదిగనుండు ముల్లంగి యెండియుండినచో వాతశ్లేష్మములను పోగొట్టును. పచ్చిగనుండునట్టి ముల్లంగి దోషమును జేయును. ఇటులజెప్పుటచే నిర్దోషమైన లేతముల్లంగికూడ పచ్చిదిగనుండినచో దోషకారియనిభావము.



## పెండలముగుణము

కటూష్ణో వాతకఫహా పిండాలుః పిత్తవర్ధనః,

పెండలము కటువైనరసము వీర్యముకలదిగ, ఉష్ణముగనుండును. వాతకఫములను హరింపజేయును. పిత్తమును వృద్ధినొందించును.

## గగ్గెర మొదలగువాని ఊఱుగాయలగుణము

కుఠేరశిగ్రుసురససుముఖాసురిభూస్తృణమ్. ౧౦౪
ఫణిజ్ఝార్జకజంబీరప్రభృతి గ్రాహి శాలనం,
విదాహి కటు రూక్షోష్ణం హృద్యం దీపనరోచనమ్. ౧౦౫
దృక్శుక్రకృమిహృత్తీక్ష్ణం దోషోత్క్లేశకరం లఘు,

నల్లగగ్గెర, మునగ, నల్లతులసి, సుముఖము (అడవిగగ్గెర), నల్లావాలకూర, కానుంచిపూరి, ఫణిజ్జకము (తెల్లగగ్గెర), ఆర్జకము (మరువము), జంబీరము (జంబీపత్రక మను పత్రవిశేషము), ఇవిమొదలగువాని ఊఱుగాయలు విదాహిగ, కారముగ విగుల నుష్ణముగనుండును. హృదయమునకుహితముజేయును అగ్నిదీపనకారి, రుచిగనుండును. నేత్రము, శుక్రము, కృమిరోగము వీనినిహరించును. తీక్ష్ణముగనుండును. వాతాదిదోష ములను స్వస్థానములోనుండి కదలించును. లఘువుగనుండును "ప్రభృతి" అనుశబ్దము వలన

'ధాన్యతుంబరుశాలేయ యవానీశృంగిబేరకాః.
పర్ణాశో గృంజనోజాజీకండీరం జలపిప్పలీ,
ఫణిజ్ఝార్జకజంబీరం ఖరాశ్వాకాలమాలికాః,
దీప్యకః క్షవకృత్స్వపిబస్తగంధానుబద్ధకట్."

ధనియాలు, తుంబురులు, ఎన్నసరెం, అజామోదము, అల్లము, గగ్గెర, నల్లుల్లి, జీల కఱ్ఱ, కండీరము, నీరుపిప్పలి, ఫణిజ్జము, మరువము, నల్లతులసి, ఖరాశ్వ (పెద్దమ్మదు) నల్లగగ్గెర, ఓమము, క్షవకృత్ (అనగా పోకపండు), చిత్రమూలము. కుక్కవాయింట, ఇవి మొదలగువానిని గ్రహింపనలయును.

"కటుతిక్తరసా శీతా కఫపిత్తవినాశనీ,
విపాకే మధురా లఘ్వీ తర్కారాంగులికా స్మృతా."

తర్కారాంగులి యను శాకవిశేషము కటుతిక్తరసములు గలదిగ, శీతవీర్యముగలదిగనుండు ను కఫము, పిత్తము వీనినిపోగొట్టును మధురమైనపాకముగలది. లఘువుగనుండును అని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

## నల్లతులసిగుణము

హిధ్మకాసశ్రమశ్వాసపార్శ్వరుక్పూతిగంధహా. ౧౦౬
సురసః

నల్లతులసి హిధ్మ (ఎక్కిళ్లు), కాసము, శ్రమ, శ్వాసము, పార్శ్వశూల, దౌర్గం ధ్యము వీనిని హరింపజేయును.

## అడవిగగ్గెరగుణము

సుముఖో నాతివిదాహీ గరశోఫహః,

అడవిగగ్గెర స్వల్పముగా విదాహముని చ్చును. విషము, శోఫము వీనిని హరించును.

## పచ్చదనియాలగుణము

ఆర్ద్రికా తిక్తమధురా మూత్రలా న చ పిత్తకృత్. ౧౦౭

పచ్చిదనియాలు చేదుగ, మధురముగ నుండును. మూత్రము నధికముగ వెడలించును. పిత్తమును వృద్ధిచేయును.

## వెల్లుల్లిగుణము

లశునో భృశతీక్ష్ణోష్ణః కటుపాకరసస్సరః,
హృద్యః కేశ్యో గురుర్వృష్యస్స్నిగ్ధో రోచనదీపనః. ౧౦౮
కిలాసకుష్ఠగుల్మార్శో మేహక్రిమికఫానిలాన్,
సహిధ్మపీనసశ్వాసకాసాన్ హంత్యస్రపిత్తకృత్. ౧౦౯

వెల్లుల్లి అతితీక్ష్ణముగనుండును. ఉష్ణమైనవీర్యము కటువైన రసపాకములుగలది. వాతాదులను భేదించును. హృదయమునకు హితముచేయును కేశములను వృద్ధినొందించును. గురువుగనుండును. శుక్రము నధికముగవృద్ధిచేయును, స్నిగ్ధముగనుండును. రుచిని బుట్టించును, అగ్నిదీపనకారి. కిలాసము (అనగా శ్విత్రకుష్ఠము), గుల్మము, అర్శస్సు, మేహము, కృమిరోగము, కఫము, వాతము, హిధ్మను (ఎక్కిళ్లు), పీనసము, శ్వాసము, కాసము వీనినిహరించును. రక్తపిత్తమును గల్గించును.

పత్రే సక్షారమధురో మధ్యే మధురపిచ్ఛిలః,
తీక్ష్ణోష్ణో లశునస్య కందే."

వెల్లుల్లియాకు కొంచెము క్షారముగ మధురముగనుండును దానిమధ్యభాగము కొంచెము మధురముగ, పిచ్ఛిలముగ నుండును. దానిగడ్డ మిగులతీక్ష్ణముగ, ఉష్ణవీర్యముగలదిగ నుండును. అని అష్టాంగసంగ్రహములో పత్రాదులకు ప్రత్యేకముగ గుణము చెప్పియుండుటచే పైజెప్పిన మూలశ్లోకములోని అతితీక్ష్ణత్వాదిగుణములు వెల్లుల్లి గడ్డకే చెప్పబడిన దని తెలియవలయును.

## నీరుల్లిగుణము

పలాండుస్తద్గుణన్యూనః శ్లేష్మలో నాతిపిత్తలః,
కఫవాతార్శసాం పథ్యస్స్వేదేభ్యవహృతౌ తథా. ౧౧౦

నీరుల్లి వెల్లుల్లికంటె కొంచెము హీనగుణముగలదిగనుండును. శ్లేష్మమునుజేయును. స్వల్పముగా పిత్తముచేయును. కఫమును, వాతము, అర్శస్సు అను నీరోగములు గలవారికి స్వేదకర్మ, భోజనము వీనియందు పథ్యముగ నుండును.

"స్నిగ్ధోరుచిష్యస్స్థిరధాతుకారీ బల్యోథమేధాకఫపుష్టిదశ్చ,
స్వాదుర్గురుశ్శోణితపిత్తశస్తస్సపిచ్ఛిలః క్షీరపలాండురుక్తః."

క్షీరపలాండు (అనగా [illegible] స్నిగ్ధముగ, రుచికరముగ నుండును. ధాతువులకు

స్థైర్యమునిచ్చును. బలము, బుద్ధి, కఫము, శరీరపుష్టి, వీనిని కలుగజేయును. మధురముగ గురువుగ నుండును. రక్తపిత్తమునందు పథ్యకర మయినది. కొంచెము జిగటగ నుండును. అని మఱియొకవిధమయిన క్షీరపలాండులక్షణములు ఇతరతంత్రములందు చెప్పబడి యున్నది.

వెల్లుల్లిగుణము

తీక్ష్ణో గృంజనకో గ్రాహీ పిత్తినాం హితకృన్న సః,

వెల్లుల్లి మలమును బంధించును. తీక్ష్ణముగ నుండును. పిత్తరోగము గలవారికి చెరుపుజేయును.

కందగుణము

దీపనస్సూరణో రుచ్యః కఫఘ్నో విశదో లఘుః. ౧౧౧
విశేషాదర్శసాం పథ్యః

కంద అగ్నిదీపనమును జేయును. రుచికరమైనది. శ్లేష్మమును పోగొట్టును. శరీరమును శుద్ధిచేయును. లఘువుగనుండును. అర్శోరోగముగలవారికి మిగుల పథ్యకరమైనది.

పుట్టకొక్కుగుణము

భూకంద స్త్వతిదోషలః,

పుట్టకొక్కు వర్షాకాలమునందు జనించును. మిగుల దోషకరమైనది.

పత్త్రాదిశాకగురుత్వము

పత్త్రే పుష్పే ఫలే నాళే కందే చ గురుతా క్రమాత్. ౧౧౨

పత్త్రశాకము (అనగా ఆకుకూరలు), పుష్పశాకము (అనగా పూలలోనుండి జనించినకూరలు), ఫలశాకము (కాయకూరలు,) నాళశాకము (అనగా కాడకూరలు), కందశాకము (అనగా గడ్డలుగలకూరలు) ఇవి క్రమముగా నొకదానికంటెనొకటి మిగుల గురువుగనుండును. (అనగా పత్త్రశాకముకంటె పుష్పశాకము, దానికంటె ఫలశాకము, దానికంటె నాళశాకము, దానికంటె కందశాకము మిగుల గురువుగ నుండు ననిభావము.) అయితే "మూలకేతు విపర్యయః" అనగా మూలకకందము (ముల్లంగిదుంప) లఘువుగ నుండు నని చరకాచార్యుడు చెప్పియుండుటచే పైజెప్పిన పత్త్రాది శాకములలో గొన్నిటికి గురుత్వము లేకపోయినను ప్రాయికముగ నవి యన్నియు గురుత్వముగలవిగ నుండు ననియే భావంబగుచున్నది. పైశాకములవలెనే హరితశాకములను (అనగా మునగకూరమున్నగువానికి) కూడ గురుత్వమును తెలిసికొనవలయును.

ఉత్కృష్టనికృష్టశాకములు

వరా శాకేషు జీవంతీ సార్షపా స్త్వవరాః పరం,

శాకములలోని జీవంతిశాకము (అనగా పాలకూర) మిగుల శ్రేష్ఠము. ఆవకూర మిగులనిందితము.

శాకవర్గము, ముగిసెను.



అవ. ఆహారకాలమునందు శాకములకంటె ఫలములు స్వల్పముగా నుపయోగ పడుటచేతను "భుక్త్వావసానే ఫలం భుజ్యతే" అనెడి ఖరనాదవచనప్రకారము భోజనాంతమున విశేషముగా నుపయోగింపదగినవియగుటచేతను శాకవర్గానంతరము ఫలవర్గము చెప్పబడుచున్నది.

ద్రాక్షపండుగుణము

ద్రాక్షా ఫలోత్తమా వృష్యా చక్షుష్యా సృష్టమూత్రవిట్.
స్వాదుపాకరసా స్నిగ్ధా సకషాయా హిమా గురుః,
నిహంత్యనిలపిత్తాస్రతిక్తాస్యత్వమదాత్యయాన్. ౧౧౪
తృష్ణాకాసశ్రమశ్వాస స్వరభేదక్షతక్షయాన్,

ద్రాక్షపండు అన్నిఫలములలోను శ్రేష్ఠంబయినది. శుక్రమును వృద్ధిచేయును; నేత్రములకు హితకరమైనది, మలమూత్రములను వెడలించును. మధురమైన పాకరసములుగలది. స్నిగ్ధముగను, కొంచెము వగరుగనుండును. శీతమై సవీర్యముకలది గురుత్వము జేయును. వాతము, పిత్తరక్తము, నోటిచేదు, మదాత్యయము, దప్పి, శ్వాసము, కాసము, శ్రమ, స్వరభేదము, క్షతక్షయము వీనిని హరింపజేయును. ద్రాక్షపండు ఉదావర్త రోగమును హరింపజేయునని చరకాచార్యుడు చెప్పియున్నాడు. అయినను ద్రాక్షపండు స్నిగ్ధముగను, శుక్రమును వృద్ధిచేయునదిగను, మలమూత్రముల వెడలించునదిగ నుండునని చెప్పినందుచేతనే దానికి ఉదావర్తరోగ హరణత్వగుణము సిద్ధంబగుచున్నదని తలంచి యీతంత్రకారుడు చెప్పక విరమించెను.

దానిమ్మపండుగుణము

ఉద్రిక్తపిత్తాన్ జయతి త్రీన్ దోషాన్ స్వాదుదాడిమమ్.౧౧౫
పిత్తావిరోధి నాత్యుష్ణ మమ్లం వాతకఫాపహమ్,
సర్వం హృద్యం లఘు స్నిగ్ధం గ్రాహి రోచనదీపనమ్. ౧౧౬

తియ్యనిదానిమ్మపండు పిత్తప్రకోపముతో గూడియుండు త్రిదోషములను శమింపజేయును. పుల్లనిదానిమ్మపండు స్వల్పముగ నుష్ణముజేయును. పిత్తమునకు విరోధము చేయకుండును. (అనగా పిత్తమును గలుగజేయక హరింపజేయక యుండుననిభావము.) వాతకఫ మును పోగొట్టును. మధుర ముగ,పుల్లగనుండు సమస్తమయిన దానిమ్మపం

లఘువుగ, స్నిగ్ధముగనుండును. మలమును బంధించును. రుచి, అగ్నిదీపనమును గలుగ జేయును.

"రూక్షామ్ల దాడిమం యత్తు తత్పిత్తానిలకోపనమ్."

మిగుల పుల్లగనుండు దానిమ్మపండు పిత్తవాతముల బ్రకోపింపజేయునని చరకాచార్యుడు చెప్పియున్నాడు. సర్వవిధమయిన దానిమ్మలలో తియ్యనిదానిమ్మ ప్రధానమని సూచించుటకై తొలుత జెప్పబడినది.

అరటిపండు మొదలగుపండ్లగుణము

మోచఖర్జూరపనసనారికేళపరూషకం,
ఆమ్రాతతాలకాశ్మర్యరాజాదనమధూకజమ్ ౧౧౭
సౌవీరబదరాంకోల్లఫల్గుశ్లేష్మాతకోద్భవం,
వాతామాభిషుకాక్షోటముకూలకనికోచకమ్. ౧౧౮
ఉరుమాణం ప్రియాలం చ బృంహణం గురు శీతలం,
దాహక్షతక్షయహరం రక్తపిత్తప్రసాదనమ్. ౧౧౯
స్వాదుపాకరసం స్నిగ్ధం విష్టంభి కఫశుక్రకృత్,

అరటి, ఖర్జూరము, పనస, నారికేళము, ఈత, నల్లమామిడి, తాటి, గుమ్ముడు, పాలచెట్టు, ఇప్ప, సౌవీరబదరము (అనగా కర్ణికాబదరము లేక రేగుపండు) అంకోల్లము (బిల్వఫలము), నక్కుమేడి, విరిగి, బాదము, అభిషుకము (అనగా స్యారాటము) అక్షోటము, (అనగా కొండగోలుగు) ముకూలకము, నికోచకము (అనగా ఉడుగు,) ఉరుమాణము (అనగా స్నిగ్ధఫలము) మొరళి వీనిఫలములు శరీరమునకు పుష్టి గురువుగ, శీతలముగనుండును. దాహము, క్షతక్షయము వీనిని హరింప[illegible] పిత్తమును శుద్ధిపరచును. మధురమైనపాకము రసముగలవి. మలమును స్నిగ్ధముగనుండును. కఫమును, శుక్రమును వృద్ధిజేయును.

అవ. అరటి మొదలగువానిఫలములకు సామాన్యగుణములను జెప్పి పిదప వానిలో గొన్నిటికి విశేషగుణభేదములను జెప్పుచున్నాడు.—

తాటిపండు మొదలగువానిగుణము

ఫలం తు పిత్తలం తాలం సరం కాశ్మర్యజం హిమమ్. ౧౨౦
శుక్రమూత్రవిబంధఘ్నం కేశ్యం మేధ్యం రసాయనం,
వాతామాద్యుష్ణవీర్యం తు కఫపిత్తకరం సరమ్. ౧౨౧
పరం వాతహరం స్నిగ్ధ మనుష్ణం తు ప్రియాళజం,

ప్రియాళమజ్జామధురో వృష్యః పిత్తానిలాపహః. ౧౨౨
కోలమజ్జా గుణైస్తద్వత్తృట్ఛర్దికాసజిచ్చ సః,

తాటిపండు పిత్తమును జేయును. గుమ్ముడుపండు వాతాదులను భేదించును. శీతమైనవీర్యముగలది. మలమూత్రబంధమును బోగొట్టును. కేశములు, బుద్ధి వీనికి హితకరమయినది. రసాయన తుల్యముగనుండును. వాతామాదిఫలములు ఉష్ణమయిన వీర్యము గలవి. కఫపిత్తములను గలుగజేయును. వాతాదులను మిక్కుటముగ హరింపజేయును. స్నిగ్ధముగ నుండును. ప్రియాళఫలము (అనగా మొరలిపండు) శీతమయిన వీర్యముగలది. మొరలిమజ్జ (చారపప్పు) మధురముగ నుండును. శుక్రమును వృద్ధిజేయును. పిత్తవాతములను హరింపజేయును. రేగుమజ్జ (రేగువిత్తనము లోని పప్పు) చారపప్పుతో సమానమైన గుణముకల్గియుండును, దప్పి, వాంతి, కాసము. వీనిని హరింపజేయును.

"మధూకజమహృద్యం తు బదరం సరణాత్మకమ్"

మధూకఫలము అనగా ఇప్పపండు హృదయమునకు అహితకరమయినది. రేగుపండ్లు మలాదులను భేదించును అని అష్టాంగసంగ్రహమునందు ఇప్ప, రేగు అనువానికి విశేష గుణములు జెప్పబడియున్నది.

కోలానాం పిత్తనాశనః"

తానికాయమజ్జ (తానికాయలోని పప్పు) తిక్కను కల్గించును. రేగుమజ్జ పిత్తమును హరింపజేయును అని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

"తాళఖర్జూరాదీనాం మస్తకమజ్జానః స్వాదుపాకా వృష్యాః శీతవీర్యాశ్చ"
తాటిపండు, ఖర్జూరపుపండు మున్నగువానిపై నుండుగింజలును లోపలిపప్పునుమధురమైన పాకముకలవి యనియు శుక్రమును వృద్ధిచేయు ననియు, శీతవీర్యము లనియు సుశ్రుతము నందు జెప్పబడియున్నది.

## బిల్వఫలగుణము

పక్వం సుదుర్జరం బిల్వం దోషలం పూతిమారుతమ్. ౧౨౩
దీపనం కఫవాతఘ్నం బాలం గ్రాహ్యుభయం హి తత్,

పక్వమయిన మారేడుపండు జీర్ణముకాకుండును. దుర్గంధమయిన అపానవాతమునుగలుగజేయును. దోషకరమయినది. లేతగనుండు మారేడుకాయ అగ్నిదీపనమును గలుగజేయును. కఫవాతములను హరింపజేయును. పైజెప్పిన మారేడుకాయయు, పండును మలమూత్రాదులను బంధించును.

## వెలగపండుగుణము

కపిత్థమామం కంఠఘ్నం దోషలం దోషఘాతి తు. ౧౨౪
పక్వం హిధ్మావమథుజిత్సర్వం గ్రాహి విషాపహమ్,

పక్వముకాని వెలగకాయ కంఠమునకు చెరుపుచేయును. త్రిదోషకారి. పక్వమయిన వెలగపండు త్రిదోషములను శమింపజేయును. హిక్క, ఛర్ది వీనిని పోగొట్టును. పక్వముగను, అపక్వముగనుండు వెలగకాయ మలమూత్రాదులను బంధించును; విషమును పోగొట్టును. అపక్వముగనుండు వెలగకాయ కంఠమునకు చెరుపుజేయునని చెప్పుటచేత నే కషాయరసముగలదిగ నుండుననియును, ఆమ్లవర్గమధ్యములో పఠించియుండుటచే ఆమ్లరసముగలదిగ నుండుననియును తెలియవలయును. పక్వమైన వెలగపండు మధురముగనుండుట ప్రసిద్ధంబగుటచే మధురగుణం బిచట జెప్పబడదయ్యె. కషాయముగ, ఆమముగ నుండు స్వభావముగల నానావిధమైన వెలగపండ్లు ఎల్లపుడు ఆమముగనుండునట్టి వెలగకాయతోడ తుల్యమైన గుణముగలవిగనుండును. మధురముగ నుండువెలగపండ్లు ఎల్లపుడు పక్వమైనవెలగపండుతో తుల్యమైన గుణముగలవిగ నుండును.

## నేరేడుపండుగుణము

జాంబవం గురు విష్టంభి శీతలం భృశవాతలమ్. ౧౨౫
సంగ్రాహి మూత్రశకృతోరకంఠ్యం కఫపిత్తనుత్,

నేరేడుపండు గురువుగ నుండును. స్తంభనకారి. శీతమైనవీర్యము గలది. మిక్కుటముగా వాతమును జేయును. మలమూత్రములను బంధించును. కంఠమునకు ప్రతికూలమైనది. కఫపిత్తములను పోగొట్టును.

## మామిడిపండుగుణము

వాతపిత్తాస్రకృద్బాలం బద్ధాస్థి కఫపిత్తకృత్. ౧౨౬
గుర్వామ్రం వాతజిత్పక్వం స్వాద్వమ్లం కఫశుక్రకృత్,

పిత్తుపట్టకుండు లేతమామిడికాయ వాతమును పిత్తరక్తమును వృద్ధినొం
పిత్తుపట్టిన మామిడికాయ కఫపిత్తములను వృద్ధినొందించును. పండినమామిడిప
త్వము కల్గి వాతమును హరించును .కొంచెము మధురంబును కొంచెము పులుపు
మామిడిపండు కఫమును శుక్రమును వృద్ధినొందించును.

"సహకారరసో హృద్యస్సురభిస్స్నిగ్ధరోచనః"

తియ్యమామిడిపండు హృదయమునకు హితముజేయును. సువాసన గలది. స్నిగ్ధముగ రుచికరముగ నుండును అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

## చింతపండుగుణము

వృక్షామ్లం గ్రాహి రూక్షోష్ణం వాతశ్లేష్మహరం లఘు. ౧౨౭

వృక్షామ్లము (అనగా చింతపండు,) మలమూత్రాదులను బంధించును. రూక్షముగ నుండును. ఉష్ణముజేయును. వాతశ్లేష్మములను పోగొట్టును. లఘువుగ నుండును.

"వృక్షామ్లం గ్రాహి రూక్షోష్ణం లఘు రోచనదీపనమ్,
వాతశ్లేష్మహరం కించి దూనం కోశామ్రజం తతః."

చింతపండు పైజెప్పిన రూక్షాదిగుణములు గలదిగ నుండుటయేగాక రుచికరముగ, దీపనకారిగకూడనుండును. కొండమామిడి వృక్షామ్లమునకంటె కొంచెము హీనమైనగుణము గలదిగనుండును. అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

## జమ్మిపండుగుణము

శమ్యా గురూష్ణం కేశఘ్నం రూక్షం

జమ్మిపండు గురువుగ, ఉష్ణవీర్యముగలదిగనుండును. కేశములను నశింపజేయును. రూక్షముగనుండును.

## వరగోగుపండుగుణము

పీలు తు పిత్తలమ్,
కఫవాతహరం భేది ప్లీహార్శః కృమిగుల్మనుత్. ౧౨౮
సతిక్తం స్వాదు యత్పీలు నాత్యుష్ణం తత్త్రిదోషజిత్,

పీలుఫలము అనగా వరగోగుపండ్లు, పిత్తమునుజేయును. కఫవాతము, ప్లీహము, అర్శస్సు, కృమిరోగము, గుల్మము వీనిని హరింపజేయును. శరీరమునందు ఉండలు కట్టిన మలములనుభేదించును. కొంచెముచేదుగ మధురముగనుండు వరగోగుపండ్లు స్వల్పముగా ఉష్ణముజేయును. త్రిదోషములను హరింపజేయును.

## మాదీఫలగుణము

త్వక్తిక్తకటుకా స్నిగ్ధా మాతులుంగస్య వాతజిత్. ౧౨౯
బృంహణం మధురం మాంసం వాతపిత్తహరం గురు,
లఘు తత్కేసరం కాసశ్వాసహిధ్మామదాత్యయాన్. ౧౩౦
ఆస్యశోషానిలశ్లేష్మవిబంధఛర్ద్యరోచకాన్,
గుల్మోదరార్శశ్శూలాని మందాగ్నిత్వం చ నాశయేత్. ౧౩౧

మాదీఫలముయొక్క చర్మము చేదుగ, కారముగ, స్నిగ్ధముగ నుండును. వాతమును హరింపజేయును. మాదీఫలముయొక్కమాంసము శరీరమునకు పుష్టిగలుగజేయును. మధురముగనుండును. వాతపిత్తములను హరింపజేయును. గురువుగనుండును. మాదీఫలముయొక్క కేసరములు లఘువుగనుండును. కాసము, శ్వాసము, హిక్క, మదాత్యయము, ముఖశోష, వాతశ్లేష్మము, మలమూత్రాదిబంధము, ఛర్ది, అరోచకము, గుల్మము, ఉదరరోగము, అర్శస్సు, శూల, అగ్నిమాంద్యము వీనిని నశింపజేయును.

"త్వఙ్మాతులుంగాత్కటుకా గుర్వీవాత ప్రకోపినీ"

మాదీఫలముయొక్క చర్మము కారముగ, గురువుగనుండును. వాతము నధికపరచును. అని ఖరనాదుడు చెప్పెను.

"గుర్వీ త్వగస్య కటుకా మారుతస్య చ నాశనీ"

మాదీఫలముయొక్కచర్మము గురువుగ, కటువుగనుండును. వాతమును హరింపజేయును. అని చరకమునందు జెప్పబడియున్నది.

"మధురం కించిదమ్లం చ హృద్యం భక్తప్రరోచనమ్,
గురువాతప్రశమనం విద్యాన్నారంగజం ఫలమ్."

నారదబ్బకాయ మధురముగ, కొంచెముపుల్లగ, హృదయమునకు హితకారిగనుండును. అన్నమునందు రుచినిగలుగజేయును. గురుత్వముగలది. వాతమును హరింపజేయును అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడి యున్నది.

ఇచ్చట మాదీఫలత్వక్కు గుణాదులజెప్పుతరి ఖరనాదచరకమతములయందు పరస్పరవిరోధము గనుపట్టుచున్నది. ప్రకృత గ్రంథకారుడుమాత్రము చరకమతము నవలంబించి సిద్ధాన్తము చేసెను.

జీడిపండుగుణము

భల్లాతకస్య త్వఙ్మాంసం బృంహణం స్వాదు శీతలమ్,
తదస్థ్యగ్నిసమం మేధ్యం కఫవాతహరం పరమ్. ౧౩౨

జీడిపండుయొక్కచర్మము, మాంసము, (గిజరు) ఇవి శరీరమునకు పుష్టిని గలుగజేయును. మధురరసంబును శీతవీర్యంబునగును. జీడివిత్తులు నిప్పువలె బహుతీక్ష్ణముగ, స్ఫోటకమును గలుగజేయదగినవిగ నుండుటవలన అగ్నితోతుల్యమైనవి. బుద్ధికి హితము జేయును. కఫవాతములను పోగొట్టును. శ్లోకమునందలి "అగ్నిసమం" అనుపదమునకు జీడివిత్తులు చిత్రమూలముతో తుల్యమయినగుణము గలవియని కొందరు చేసెదరు.

ఈడపండుగుణము

స్వాద్వమ్లం శీతముష్ణం చ ద్విధా పాలేవతం గురు,
రుచ్యమత్యగ్నిశమనం

ఈడపండు మధురము, అమ్లము అని రెండువిధంబులు. అవిరెండును క్రమముగా, శీతలము, ఉష్ణము, గురుత్వము, రుచిగలవిగనుండును. అధికమయిన అగ్నిదీపనమును శమింపజేయును.

గజనిమ్మగుణము

రుచ్యం మధురమారుకమ్. ౧౩౩

పక్వమాశుజరాం యాతి నాత్యుష్ణం గురు దోషలమ్,

గజనిమ్మపండు, మధురముగ, రుచిగ నుండును. పక్వమయిన గజనిమ్మ, శీఘ్రముగ జీర్ణమగును. స్వల్పముగా ఉష్ణమైన వీర్యముగలది. కొంచెము గురువుగ నుండును కొంచెము అపథ్యకరమైనది.

"ఆరుకం వీరసేనం చ వీరావీరారుకం తథా,

విద్యాజ్జాతివిశేషేణ తచ్చతుర్విధమారుకమ్."

గజనిమ్మ, ఆరుకము, వీరసేనము, వీరా, వీరారుకము అని జాతిభేదమువలన నాల్గు విధములుగ నుండు నని నిఘంటువులో జెప్పబడియున్నది.

పచ్చిద్రాక్ష మొదలగువానిగుణము

ద్రాక్షా పరూషకం చార్ద్రమమ్లం పిత్తకఫప్రదమ్, ౧౩౪
గుర్వూష్ణవీర్యం వాతఘ్నం సరం చ కరమర్దకమ్,

పచ్చిద్రాక్షపండు, చిట్టీతపండు, కలివిపండ్లు, ఇవి అమ్లరసము కల్గి యుండును. పిత్తకఫముల వృద్ధినొందించును. గురుత్వంబును ఉష్ణవీర్యంబును కలిగియుండును. వాతమును హరించును. శరీరమున శీఘ్రముగ వ్యాపించును.

రేగు మొదలగువానిగుణము

తథామ్లం కోలకర్కంధూలకుచామ్రాతమారుకమ్. ౧౩౫
ఐరావతం దంతశఠం సతూదం మృగలిండికమ్,
నాతిపిత్తకరం పక్వం శుష్కం చ కరమర్దకమ్. ౧౩౬

రేగు, గంగరేగు, కమ్మరేగు, మామిడి, గజనిమ్మ, నారదము, నిమ్మ, గంగరావి, ౘడికము, పక్వమై శుష్కించియుండు కలివిపండ్లు, ఇవి పుల్లగనుండును, స్వల్పపిత్తమునుజేయును. పైజెప్పిన ద్రాక్షాదులతో తుల్యమైన గుణము గలవిగ

ఎండియుండుచింతపండు రేగుపండువీనిగుణము

దీపనం భేదనం శుష్కమమ్లికాకోలయోః ఫలమ్,
తృష్ణాశ్రమక్లమచ్ఛేది లఘ్విష్టం కఫవాతయోః. ౧౩౭

చింతపండు, రేగుపండు ఈరెండును ఎండియుండినచో అగ్నిదీపనమును గలుగజేయును. మలాదులనుభేదించును. లఘువుగనుండును. దప్పి, శ్రమము, క్లమము వీనిని పోగొట్టును. కఫవాతములయందు పథ్యకరమైనవి.

కమ్మరేగుపండుగుణము

ఫలానామవరం తత్ర లకుచం సర్వదోషకృత్,

సమస్తమైనఫలములలో కమ్మరేగుపండు అప్రధానముగ, త్రిదోషకారిగ నుండును.

"హిక్కార్శసాం హితః,
వాతలం కఫపిత్తఘ్నం విద్యాత్కర్పటకీఫలమ్,
మధురాణ్యతిపాకాని వాతపిత్తహరాణి చ,
అశ్వత్థోదుంబరప్లక్షన్యగ్రోధానాం ఫలాని తు.
ప్రాచీనామలకే చైవ దోషఘ్నం సరుహాని చ.
ఇంగుదం తిక్తమధురం స్నిగ్ధోష్ణం కఫవాతజిత్."

కర్పటకీఫలము, హిక్క, అర్శస్సు ఇవిగలవారికి హితకరమైనది. వాతమును జేయును; కఫపిత్తములను హరింపజేయును. రావి, మేడి, జువ్వి, మఱ్ఱి వీనిఫలములు అతిపక్వమై యుండినచో మధురముగనుండును. వాతపిత్తములను హరింపజేయును. ప్రాచీనామలకము సర్వదోషములను హరింపజేయును. గారపండు చేదుగ, మధురముగ, స్నిగ్ధముగ నుండును. ఉష్ణమైనవీర్యముగలది, కఫవాతములను హరింపజేయును. అని చరకమునందు

"సుగంధి మధురం స్నిగ్ధం లవలీఫలముచ్యతే,
వృక్షామ్లాల్పాంతరగుణం కోశామ్రఫలముచ్యతే."

లవలీఫలము సువాసనగలదిగ, మధురముగ, స్నిగ్ధముగ నుండును. కొండమామిడిపండు చింతపండుకంటె స్వల్పమైనగుణముగలది అని సుశ్రుతమునందు జెప్పబడియున్నది.


## వర్జనీయధాన్యాదులు

హిమానలోష్ణదుర్వాతవ్యాలలాలాదిదూషితమ్.
జంతుజుష్టం జలే మగ్న మభూమిజమనార్తవమ్,
అన్యధాన్యయుతం హీనవీర్యం జీర్ణతయాపి చ.
ధాన్యం త్యజేత్తథా శాకం రూక్షసిద్ధమకోమలమ్,
అసంజాతరసం తద్వచ్ఛుష్కం చాన్యత్ర మూలకాత్. ౧౪౦
ప్రాయేణ ఫలమప్యేవం తథామం బిల్వవర్జితమ్,

మంచుచేతను, నిప్పు, ఎండ మొదలగువాని యుష్ణముచేతను, తూర్పుగాలి మొదలగుదుష్టమైన గాలిచేతను, సర్పము మొదలగు దుష్టజంతువులయొక్క నోటిజొల్లు మొదలగువానిచేతను దూషింపబడినవియును, కృములు మొదలగు జంతువులతోగూడినవియును, జలములో మునిగినవియును, విరుద్ధమైన భూమిలో (అనగా ఆయాధాన్యములు ఫలించుటకు యుక్తమైన భూమికంటె విరుద్ధమైనభూమిలో) జనించినవియును, విరుద్ధమైన

ఋతువునందు (అనగా ఆయాధాన్యోత్పత్తినిగురించి లోకమునందు ప్రసిద్ధముగనుండు ఋతువుకంటె నితరఋతువునందు) జనించినవియును, విజాతీయ ధాన్యములతో గూడిన వియును (అనగా యవకముతోగూడిన రక్తశాలి ధాన్యము, మినుములతోగూడియుండు పెసలు, విరుద్ధమైన శూకధాన్యముతో గూడి యుండుశూకధాన్యము, అటులనే విరుద్ధమైనశింబీధాన్యముతోగూడియుండు శింబీధాన్యము మొదలగు వానితోడను) నిర్వీర్యమైనవియును (అనగా ఊడుపుమడిలోనే జీర్ణమై నీరసముగనుండునవియును) నగుధాన్యములను, ఆటులనే స్నేహరహితముగాగాని లేక కాంజికాదులచేగాని సిద్ధముచేయబడి నవియును, పరిపూర్ణమైన రసములేనివియును, ఎండినవియునగు శాకములను వర్జింపవలయును. శుష్కించిన ముల్లంగిని మాత్రము భుజింపందగును. పైజెప్పిన శాక గుణములతో గూడియుండు ఫలములను తఱుచుగా వర్జింపవలయును. "అన్యధాన్యయుతం" అనుశబ్దమునకు క్రొత్తధాన్యముతో జేరియుండు ప్రాతధాన్యమని కొందరు వ్యాఖ్యానము జేసిరి. ఎండినద్రాక్షపండ్లు చిట్టీతపండు మొదలగు ఫలములు పథ్యకరంబులగుటచే వానిని వర్జింపదగదని తెలియపరచుటకై "ప్రాయశః" (అనగా తఱుచుగ) అను పదము ప్రయోగింపబడినది. బిల్వఫలముతప్ప నితరమైన ఫలములు అపక్వములుగ నుండినచో వానిని వర్జింపవలయును. అపక్వముగనుండు బిల్వముకూడ పథ్యకరంబగుటచే దానిని త్యజింపం జనదు. "లాలాది" అను ఆదిశబ్దముచేత శవ, క్రోథ, మూత్ర, పురీషాదులను గ్రహించుకొనవలయును.

"వినా ధాన్య ఘృతక్షౌద్ర విడంగగుడపిప్పలీః,
వతిక్రాంతవర్షం తు ద్రవ్యమన్యత్ప్రశస్యతే."

॥ ఘృతము, తేనె, వాయువిడంగములు, బెల్లము, పిప్పలి ఇవితప్ప నితరయు నొక సంవత్సరమునకు పైబడనివిగ నుండినయెడల శ్రేష్ఠంబులు, అని అష్టాంగసంహితయందు చెప్పబడియున్నవి.

ఫలవర్గము ముగిసెను.

అవ. ఫలవర్గానంతరము తఱుచుగా నాహారములయం దుపయోగించునట్టి నానావిధమైన ఔషధవర్గము జెప్పబడుచున్నది. వానిలో లవణము మిగుల నుపయోగకారిగ నుండుటచే తొలుత లవణవర్గము జెప్పబడుచున్నది.—

## లవణసామాన్యగుణము

విష్యన్ది లవణం సర్వం సూక్ష్మం సృష్టమలం విదుః. ౧౪౧
వాతఘ్నం పాకి తీక్ష్ణోష్ణం రోచనం కఫపిత్తకృత్,

సమస్తమైన లవణములు విష్యందిగనుండును. (అనగా కఫాదులయొక్క సంఘాతమును ద్రవింపజేయుననిభావము.) స్రోతోమార్గములయందు సంచరించును. మలమూత్రాదులను బైటవెడలించును. వాతమును హరింపజేయును. అన్నమును, వ్రణమును జీర్ణింపజేయును. తీక్ష్ణముగనుండును. (అనగా మిరియములవలె మంటను గలుగజేయునని భావము) ఉష్ణమైనవీర్యముగలవి. రుచిని బుట్టించును; కఫపిత్తములను జేయును.

అవ. లవణములకు సామాన్యగుణములను జెప్పి పిదప గొన్నిటికి విశేషగుణములను జెప్పుచున్నాడు —

సైంధవలవణగుణము

సైంధవం తత్ర సస్వాదు వృష్యం హృద్యం త్రిదోషనుత్,
లఘ్వనుష్ణం దృశోః పథ్యమవిదాహ్యగ్నిదీపనమ్,

లవణములలో సైంధవలవణము (అనగా ఇందుప్పు) కొంచెము మధురముగనుండును. శుక్రమును వృద్ధిజేయును. హృదయమునకు హితకరమైనది. త్రిదోషములను పోగొట్టును. స్వల్పముగా ఉష్ణముజేయును. నేత్రములకు పథ్యకరమైనది. విదాహకరమైనదికాదు. అగ్నిదీపనము గలుగజేయును. పైజెప్పినసామాన్యగుణములతో గూడియుండును.

సౌవర్చలవణగుణము

లఘు సౌవర్చలం హృద్యం సుగన్ధ్యుద్గారశోధనమ్, ౧౪౩
కటుపాకం విబన్ధఘ్నం దీపనీయం రుచిప్రదమ్,

సౌవర్చలవణము లఘువుగనుండును. హృదయమునకు హితకరమైనది
నతో గూడియుండును. తేనుపులను శోధించును. కటువైన పాకముగలది.
గలవారికి హితకరమైనది. అగ్నిదీపనము, రుచి వీనిని గలుగజేయును.

బిడాలవణగుణము

ఊర్ధ్వాధఃకఫవాతానులోమనం దీపనం బిడమ్, ౧౪౪
విబన్ధానాహవిష్టమ్భశూలగౌరవనాశనమ్,

బిడాలవణము ఊర్ధ్వాధః ప్రదేశములయందుండు కఫవాతాదులను తమతమ స్థానములయందుజేర్చును. అగ్నిదీపనమును కలుగజేయును. మల మూత్ర ప్రతిబంధము, ఆనాహము, విష్టంభము, శూల, గురుత్వము వీనిని నశింపజేయును.

సముద్రలవణగుణము

విపాకే స్వాదు సాముద్రం గురు శ్లేష్మ వివర్ధనమ్, ౧౪౫

సముద్రలవణము (అనగా కల్లుప్పు) పాకమువలన మధురముగనుండును. గురుత్వముజేయును. కఫవృద్ధికారి.

### ఔద్భిదలవణగుణము

సతిక్తకటుకక్షారం తీక్ష్ణముత్క్లేది చౌద్భిదమ్,

ఔద్భిదలవణము (అనగా భూమినిబ్రద్దలుచేసికొని స్వయముగా బైలువెడలెడి చౌటఉప్పు) కొంచెముచేదుగ, కటువుగ, తీక్ష్ణముగనుండును. వాతాదిదోషములను ప్రకోపింపంజేయును.

### కృష్ణలవణగుణము

కృష్ణే సౌవర్చలగుణా లవణే గంధవర్జితాః. ౧౪౬

నల్లగనుండులవణము సౌవర్చలలవణముతో తుల్యమైనగుణముగలది. గంధరహితముగనుండును.

### రోమకలవణగుణము

రోమకం లఘు పాంసూత్థం సక్షారం శ్లేష్మలం గురు,

రోమకలవణము (అనగా క్షారలవణము) లఘువుగనుండును. సిరాలవణము (అనగా కాచలవణము) ఒకింత ఉప్పురసముతో గూడియుండును. కఫకారి గురుత్వముజేయును.

### లవణప్రయోగవిధి

లవణానాం ప్రయోగే తు సైంధవాదీన్ ప్రయోజయేత్.

యోగమునందు సైంధవలవణము మొదలుకొని వరుసక్రమముగా (అన ప్రయోగములు జెప్పబడియుండుచో సైంధవ, సౌవర్చలలవణములను, ప్రయోగములు జెప్పబడియుండుచో సైంధవ, సౌవర్చల, బిడాలవణములను) ప్రయోగింపవలయును.

“సైంధవం సారకం పాక్యం సౌవర్చలమథౌద్భిదమ్,
పూర్వపూర్వం గుణోత్కృష్ట మూష్ణ్యం చైషాం యథోత్తరమ్”

సైంధవము, సారకము పాక్యము, (అనగా అంటుప్పు), సౌవర్చలము, ఔద్భిదము, వీనిలో పూర్వపూర్వమందుండునవి ఒకదానికంటెనొకటి శ్రేష్ఠముగనుండును. ఉత్తరోత్తరముండునవి మిగుల ఉష్ణముగ నుండును అని ఖరనాదమునందు జెప్పబడియున్నది.

## యవక్షారగుణము

గుల్మహృద్గ్రహణీపాండుప్లీహానాహగళామయాన్,
శ్వాసార్శఃకఫకాసాంశ్చ శమయేద్యవశూకజః. ౧౪౮.

యవశూకములలో నుండి జనించిన యవక్షారము గుల్మము, హృద్రోగము, గ్రహణి, పాండువు, ప్లీహము, ఆనాహము, కంఠరోగము, శ్వాసము, అర్శస్సు, కఫము, కాసము, వీనిని శమింపజేయును.

## క్షారసముదాయగుణము

క్షారస్సర్వశ్చ పరమం తీక్ష్ణోష్ణః క్రిమిజిల్లఘుః,
పిత్తాసృగ్దూషణః పాకీ ఛేద్యహృద్యో విదారణః. ౧౪౯
అపథ్యః కటులావణ్యాచ్ఛుక్రౌజఃకేశచక్షుషాం,

సమస్తమైనక్షారములు మిగులతీక్ష్ణముగ, ఉష్ణముగనుండును. క్రిములను పోగొట్టును. లఘువుగనుండును. పిత్తరక్తములను దూషించును. భుజింపబడిన యాహారమును జీర్ణింపజేయును. మేదశ్శ్లేష్మాదిగ్రంధులను పోగొట్టును. హృదయమునకు అహితకరమైనవి. పక్వమైనగండాది వ్రణముల పగులఁడీయును. కారముగ, ఉప్పగనుండుటచే శుక్రము, బలము, కేశములు, నేత్రములు వీనికి అపథ్యకరముగనుండును.

## ఇంగువగుణము

హింగువాతకఫానాహశూలఘ్నం పిత్తకోపనమ్. ౧౫౦
కటుపాకరసం రుచ్యం దీపనం పాచనం లఘు,

ఇంగువ వాతము, కఫము, ఆనాహము, శూల, వీనిని హరింపజేయును ప్రకోపింపజేయును. కటువైన పాకరసములుగలది. రుచినిచ్చును. ... మును, జీర్ణమునుగలుగ జేయును. లఘువుగనుండును.

## కరక్కాయగుణము

కషాయా మధురా పాకే రూక్షా విలవణా లఘుః. ౧౫౧
దీపనీ పాచనీ మేధ్యా వయసః స్థాపనీ పరా,
ఉష్ణవీర్యా సరాయుష్యా బుద్ధీంద్రియబలప్రదా. ౧౫౨
కుష్ఠవైవర్ణ్యవైస్వర్య పురాణవిషమజ్వరాన్,
శిరోఽక్షిపాండుహృద్రోగకమలాగ్రహణీగదాన్. ౧౫౩
సశోషశోథాతిసారమేదమోహవమిక్రిమీన్,
శ్వాసకాసప్రసేకార్శః ప్లీహానాహగరోదరమ్. ౧౫౪

విబంధం స్రోతసాం గుల్మమూరుస్తంభమరోచకం,
హారీతకీ జయేద్వ్యాధీంస్తాంస్తాంశ్చ కఫవాతజాన్. ౧౫౫

కరక్కాయ వగరుగ నుండును. పాకమువలన మధురముగ రూక్షగ నుండును. ఉప్పగనుండదు. (అనగా లవణరస మొక్కటి దక్క తక్కిన మధుర, అమ్ల, తిక్త కషాయ, కటురసములతో గూడియుండునని భావము.) జారరాగ్నిని దీపింపజేయును. భుజించిన యాహారమును జీర్ణింపజేయును మేధకు హితకరమైనది. వయస్సును స్థాపించును. మిగుల ఉష్ణమైనవీర్యముగలది. మలాదులను భేదించును. ఆయువునకు హితకరమైనది. బుద్ధి చక్షురాదీంద్రియములు వీనికి బలమునిచ్చును. కుష్ఠము, వివర్ణము, స్వరదోషము, పురాణజ్వరము, విషమజ్వరము, శిరోరోగము, నేత్రరోగము, పాండువు, హృద్రోగము, కామిల, గ్రహణీరోగము, శోష, శోఫ, అతిసారము, మేదోరోగము, మోహము, వాంతి, కృమిరోగము, శ్వాసకాసములు, ప్రసేకము, అర్శస్సు, ప్లీహము, ఆనాహము, విషము, ఉదరరోగము, స్రోతోబంధము, గుల్మము, ఊరుస్తంభము, అరుచి, కఫవాతములచే గలిగినపలువెరంగులైన రోగములు వీనిని హరింపజేయును. శ్లోకమునందలి "విలవణా" అనుశబ్దముచేతనే ఉప్పురసముతప్ప మధురము మొదలగు అయిదు రసములు కరక్కాయయందు గలిగియుండునని తెలియుచున్నను విశేషముగా కషాయరసముగలిగియుండునని తెలియపరచుటకై "కషాయా" అనుపదము ప్రత్యేకముగా ప్రయోగింపబడినది.

"హారీతకీం పంచరసాముష్ణాం విలవణాం శివామ్"
అని చరకమునందును పైజెప్పినయర్థమే చెప్పబడియున్నది.

ద్వమ్లభావాత్ప్రవనం కటుతిక్తతయా కఫమ్,
'యమధురత్వాచ్చ హంతి పిత్తంహారీతకీ."

..య మధురముగ, పుల్లగనుండుటచే వాతమును; ..రముగ చేదుగనుండుటచే కఫమును; కషాయముగ, మధురముగనుండుటచే పిత్తమును; హరింపజేయునని ఖరనాదము గ్రంథమునందు జెప్పబడియున్నది.

ఉసిరికకాయగుణము

తద్వదామలకం శీత మమ్లం పిత్తకఫాపహం,

ఉసిరికకాయ కరక్కాయతో సమానమైనగుణముగలది. శీతమైనవీర్యము పుల్లనిరసముగలది. పిత్తకఫములను హరింపజేయును.

"అమ్లభావాజ్జయేద్వాతం పిత్తం మాధుర్యశైత్యతః,
కఫం రూక్షకషాయత్వాదేవమేష త్రిదోషనుత్."

ఉసిరికకాయ పుల్లగనుండుటచే వాతమును, మధురముగ శీతముగనుండుటచే పిత్తమును, రూక్షముగ కషాయముగనుండుటచే కఫమును, హరింపజేయునని ఉసిరికకాయకు త్రిదోషహరత్వగుణమును కృష్ణాత్రేయుడు జెప్పియున్నాడు.

"చక్షుష్యం సర్వదోషఘ్నం వృష్యమామలకీఫలమ్,
హంతి వాతం తదమ్లత్వాత్పిత్తం మాధుర్యశైత్యతః,
కఫం రూక్షకషాయత్వాత్ఫలేభ్యోభ్యధికం తు తత్."

ఉసిరికపండు నేత్రములకు హితకరమైనది. సర్వదోషములను పోగొట్టును. శుక్రమును వృద్ధినొందించును. పుల్లగనుండుటచే వాతమును, మాధుర్యశైత్యగుణములచే పిత్తమును, రూక్షకషాయగుణములచే కఫమును హరింపజేయును. సమస్తమైనఫలములలో శ్రేష్ఠంబైనది అని సుశ్రుతమునందును జెప్పబడియున్నది.

## తానికాయగుణము

కటు పాకే హిమం కేశ్యమక్షమీషచ్చ తద్గుణమ్. ౧౫౬

తానికాయపాకమువలన కటువుగనుండును. శీతమైనవీర్యముగలది. కేశములను వృద్ధిజేయును. కరక్కాయ, ఉసిరికకాయ వీనితో సమానమైనగుణముగలది. ప్రమాణమునందు కరక్కాయ, ఉసిరికకాయ వీనికంటె చిన్నదిగనుండును. కరక్కాయ, ఉసిరికకాయ, తానికాయ ఇవి పరస్పరము స్థూలసూక్ష్మాదిభేదములచే స్వరూపభేదము గలవైయుండుటవలన వానియుపయోగక్రమము నెఱుంగుట కశక్యమని కొందరు వచించెదరు. అయితే "విభీతకః కర్షఫలః" అను ధన్వంతరినిఘంటువుచేతనే తానికాయ కర్షప్రమాణముగలదియని తెలియుచున్నది.

"నచాస్నిగ్ధా ఘనా గుర్వీ వృత్తా క్షిప్తా తథాంభసి,
నిమజ్జేద్యా ప్రశస్తత్వాద్గుణకృత్సా ప్రకీర్తితా.
నవాదిగుణయుక్తత్వం తథైకత్వం ద్వికర్షతా,
హరీతక్యాః ఫలే యేన తేనైతచ్ఛ్రేష్ఠముచ్యతే."

స్నిగ్ధహీనముగ, గట్టిగ, గుండ్రముగ, బరువుగ, జలములో మునుగునదిగ నుండునట్టి కరక్కాయ ప్రశస్తమైనదనియు, నవాదిగుణయుక్తముగ కర్షద్వయప్రమాణముగలదిగ ఏకముగనుండుటవలన అన్నికరక్కాయలకంటె ప్రశస్తమైనదనియు, తంత్రాంతరమునందు జెప్పబడియున్నది. అట్లగుటచే కరక్కాయ రెండుకర్షముల ప్రమాణముగలదియని స్పష్టమగుచున్నది.

"అభయైకా ప్రదాతవ్యా ద్వావేవ తు విభీతకౌ,
ధాత్రీఫలాని చత్వారి త్రిఫలేయం ప్రకీర్తితా."

కరక్కాయ ఒకటి, తానికాయలు రెండు, ఉసిరికపండ్లు నాల్గు చేరినచో త్రిఫల మను పేరం బరగు నని తంత్రాంతరమునందు జెప్పియుండుటచే ఉసిరికకాయి అర్ధకర్ష ప్రమాణముగలదియని యూహ్యంబగుచున్నది. ఇటుల త్రిఫలములకు ప్రమాణనిర్ణయము తంత్రాంతరమువలన స్పష్టంబగుటచే కరక్కాయ మొదలగు వానియుపయోగ క్రమమును సులభముగనే యెఱుంగందగును.

త్రిఫలాగుణము

ఇయం రసాయనవరా త్రిఫలాఽక్ష్యామయాపహా,
రోపణీ త్వగ్గదక్లేదమేదోమేహకఫాస్రజిత్. ౧౪౭

పైజెప్పిన కరక, తాని, ఉసిరికకాయలు, మూడును చేరిన త్రిఫలములన బడును. ఈత్రిఫలములు రసాయనములో శ్రేష్ఠంబైనవి. నేత్రరోగమును హరింపజేయును. వ్రణముల సార్పును. కుష్ఠము మొదలగు చర్మరోగములు, వ్రణమునందు స్రావము, మేదస్సు, ప్రమేహము, కఫము, రక్తరోగము వీనిని శమింపజేయును.

త్రిజాత చతుర్జాతకగుణము

సకేసరం చతుర్జాతం త్వక్పత్రైలం త్రిజాతకం,
పిత్తప్రకోపి తీక్ష్ణోష్ణం రూక్షం దీపనరోచనమ్. ౧౪౮

దాల్చినిచెక్క, ఆకుపత్రి, ఏలకులు ఈమూడిటియొక్క కూటమి త్రిజాతక మనియు, త్రిసుగంధమనియు జెప్పబడును. వీనితోడ నాగకేసరములుజేరిన చతుర్జాతక ఇవి పిత్తమును ప్రకోపింపజేయును. తీక్ష్ణముగ, ఉష్ణముగనుండును. కల్గియుండును. అగ్నిదీపనమును, రుచిని గలుగజేయును.

మిరియములగుణము

రసే పాకే చ కటుకం కఫఘ్నం మరిచం లఘు,

మిరియములు కటువైనరసము పాకముగలవి. కఫమును హరింపజేయును. లఘువుగనుండును. పైశ్లోకములో జెప్పియుండు పిత్తప్రకోపాది గుణములును గలవిగనుండును.

పిప్పలిగుణము

శ్లేష్మలా స్వాదుశీతార్ద్రా గుర్వీ స్నిగ్ధా చ పిప్పలీ ౧౪౯
సా శుష్కా విపరీతాతస్స్నిగ్ధా వృష్యా రసే కటుః,
స్వాదుపాకానిలశ్లేష్మశ్వాసకాసాపహా సరా. ౧౫౦

న తామత్యుపయుంజీత రసాయనవిధిం వినా,

పచ్చిపిప్పలి శ్లేష్మమును జేయును. మధురముగ నుండును. శీతమయినవీర్యముగలది. గురువుగ, స్నిగ్ధముగ నుండును. ఎండినపిప్పలి పచ్చిపిప్పలికంటె విరుద్ధముగ నుండును. (అనగా ఉష్ణమైన వీర్యము గలదిగ, లఘువుగనుండునని భావము.) స్నిగ్ధముగ నుండును. శుక్రమును వృద్ధిజేయును. కటువైనరసముగలది. మధురమైన పాకము గలది. వాతము, శ్లేష్మము, శ్వాసము, కాసము వీనిని హరింపజేయును. శరీరమునందు శీఘ్రముగ వ్యాపించును. పిప్పలికి ఇట్టిగుణములు గలిగియుండినను దానిని వర్ధమానాది రసాయనవిధి యందుతప్ప తక్కిన విధులయందు విశేషముగా నుపయోగింపజనదు.

శుంఠిగుణము

నాగరం దీపనం వృష్యం గ్రాహి హృద్యం విబంధనుత్. ౧౬౧
రుచ్యం లఘు స్వాదుపాకం స్నిగ్ధోష్ణం కఫవాతజిత్,

శుంఠి అగ్నిదీపనమును జేయును. శుక్రమును వృద్ధినొందించును. మలమునుబంధించును. హృదయమునకు హితకరమైనది. స్రోతోబంధమును పోగొట్టును. (అనగా స్రోతస్సులను శుద్ధిపరచును.) రుచిగ, లఘువుగ, మధురపాకముగలదిగ, స్నిగ్ధముగ, ఉష్ణముగ నుండును. కఫవాతములను హరింపజేయును.

అల్లపుగుణము

తద్వదార్ద్రకం

అల్లము శుంఠితో సమానమయిన గుణము గలది.

త్రికటుకగుణము

ఏతచ్చ త్రయం త్రికటుకం జయేత్.
స్థౌల్యాగ్నిసదనశ్వాసకాసశ్లీపదపీనసాన్,

మిరియములు, పిప్పళ్లు, శుంఠి అను నీ మూటియొక్క కూటమి మనబడును. ఇది శరీరస్థౌల్యము, అగ్నిమాంద్యము, శ్వాసము, కాసము, శ్లీపదము, పీనసము, వీనిని హరింపజేయును.

చవ్యము, మోడి, వీనిగుణము

చవికా పిప్పలీమూలం మరిచాల్పాంతరం గుణైః. ౧౬౩

చవ్యము, మోడి అను నీ మూడును మిరియములకంటె స్వల్పమయిన గుణము గలవి. (అనగా కటువైనరసము పాకము గలవిగ, లఘువుగ, ఉష్ణమయిన వీర్యముగలవిగ, కఫహారముగ నుండు నని తాత్పర్యము.)

### చిత్రమూలగుణము

చిత్రకోఽగ్నిసమః పాకే శోఫార్శః కృమికుష్ఠహా,

చిత్రమూలము అగ్నితో సమానమయినది. (అనగా పాకమువలన నత్యుష్ణముగ నుండునని తాత్పర్యము.) శోఫ, అర్శస్సు, క్రిములు, కుష్ఠము వీనిని హరింపజేయును.

### పంచకోలము, దానిగుణము

పంచకోలకమేతచ్చ మరిచేన వినా స్మృతమ్. ౧౬౪
గుల్మప్లీహోదరానాహ శూలఘ్నం దీపనం పరం,

పైజెప్పినవానిలో మిరియములుతప్ప తక్కినవియగు పిప్పలి, మోడి, చవ్యము, చిత్రమూలము, శుంఠి అను నీ యైదిటియొక్క కూటమి పంచకోల మనబడు నని వైద్యక తంత్రములయందు జెప్పబడియున్నది. ఇది గుల్మము, ప్లీహము, ఉదరరోగము, ఆనాహము, శూల వీనిని పోగొట్టును. మిక్కుటముగ అగ్నిదీపమును గలుగజేయును.

### మహాపంచమూలము, దానిగుణము

బిల్వకాశ్మర్యతర్కారీ పాటలాటుండుకైర్మహత్. ౧౬౫
జయేత్కషాయ *తిక్తోష్ణం పంచమూలం కఫానిలౌ,

మారేడు, గుమ్ముడు, తక్కెడ లేక కూరనెల్లి, కలిగొట్టు, దుండిలము అను నీ యైదిటియొక్క కూటమి మహాపంచమూలము లని వైద్యకతంత్రములయందు ప్రసిద్ధముగా జెప్పబడియున్నది. ఇది వగరుగ, తిక్తముగ, ఉష్ణముగ నుండును. కఫవాతములను పోగొట్టును.

### హ్రస్వపంచమూలము, దానిగుణము

హ్రస్వం బృహత్యంశుమతీద్వయగోక్షురకైః స్మృతమ్. ౧౬౬
స్వాదు పాకరసం నాతిశీతోష్ణం సర్వదోషజిత్,

హ్రాకుడు, పెద్దములక, మయ్యాకుపొన్న, కోలపొన్న, పల్లేరు అను నీ యైదిటి యొక్క కూటమి హ్రస్వపంచమూలమని వైద్యకతంత్రములయందు జెప్పబడియున్నది. ఇది మధురమైన పాకరసములు గలదిగ నుండును. స్వల్పముగా శీతలమును, ఉష్ణమును జేయును. సర్వదోషములను పోగొట్టును.

### మధ్యమపంచమూలము, దానిగుణము

బలా పునర్నవైరండశూర్పపర్ణీద్వయేన తు. ౧౬౭

* తీక్ష్ణోష్ణం ఇతి పా.

మధ్యమం కఫవాతఘ్నం నాతిపిత్తకరం సరం,

ముత్తవపులగము గలిజేరు, (చిట్టాముట్టి), ఆముదపువేరు, పిల్లపెసర పెద్దపెసర వేళ్లు, అను నీయైదిటియొక్క కూటమి మధ్యమపంచమూల మనబడును. ఇది కఫవాతములను హరింపజేయును. స్వల్పముగా పిత్తము జేయును. మలాదులను భేదించును.

జీవనాఖ్యపంచమూలము, దానిగుణము

అభీరువీ రాజీవంతీజీవకర్షభకైః స్మృతమ్. ౧౬౭
జీవనాఖ్యం చ చక్షుష్యం వృష్యం పిత్తానిలాపహం,

అభీరు (అనగా పిల్లిపీచర), వీర (అనగా పెగ్గుమ్ముడు) జీవంతి (అనగా పాలకూర) జీవకము, ఋషభకము, అను నీ యైదిటియొక్క కూటమి జీవనాఖ్యపంచమూల మనబడును. ఇది నేత్రహితకారి, శుక్రమును వృద్ధిజేయును. పిత్తవాతములను పోగొట్టును.

తృణపంచమూలము, దానిగుణము

తృణాఖ్యం పిత్తజిద్దర్భకాశేక్షుశరశాలిభిః. ౧౬౮

దర్భ, కాశ (అనగా కుందురెల్లు) ఇక్షు (అనగా తిప్పరెల్లు) శర (అనగా తెల్లు) శాలి(అనగా కిక్కసగడ్డి) అను నీ యైదిటియొక్క కూటమి తృణ పంచమూల మనబడును, ఇది పిత్తమును హరింపజేయును.

"అజాశృంగీహరిద్రా చ విదారీ సారిబామృతా,
వల్ల్యాఖ్యం కంటకాఖ్యంతు శ్వదంష్ట్రాభీరుసైర్యకైః,
అహింస్రాకరమర్దశ్చ సర్వదోషహరాస్తు తే."

ఒడ్డి, పసపు, నేలగుమ్మడు, సుగంధిపాల, తిప్పతీగె, ఇవి వల్లీపంచమూ
పల్లేరు, పిల్లిపీచర, ములుగోరింట, ఆరుదొండ, కలివి, ఇవి కంటకాఖ్య
మనబడును. ఈ రెండును సమస్తరోగములను హరింపజేయును.

అవ. మరియు సువర్ణాదిగుణములు అష్టాంగసంగ్రహమునం దిట్లు చెప్పంబడియెను

"సువర్ణం బృంహణం స్నిగ్ధం మధురం రసపాకయోః,
విషదోషహారం శీతం సకషాయం రసాయనమ్.
రూప్యం స్నిగ్ధం కషాయామ్లం విపాకే మధురం సరమ్,
వయసః స్థాపనం శీతం లేఖనం వాతపిత్తజిత్.
తామ్రం సతిక్తమధురం కషాయం లేఖనం లఘు,
కటుపాకరసం శీతం రోపణం కఫపిత్తజిత్.

కాంస్యం కషాయానురసం విశదం లేఖనం సరమ్,
దృష్టిప్రసాదనం రూక్షం తిక్తం పిత్తకఫాపహమ్.
సతిక్తలవణం భేది పాండుత్వక్క్రిమివాతనుత్,
లేఖనం పిత్తలం కించి త్త్రపుసీసం చ తద్గుణమ్.
చక్షుష్యం కృష్ణలోహం తు కషాయం స్వాదుతిక్తకమ్,
లేఖనం వాతలం శీతం క్రిమిపిత్తకఫప్రణుత్.
ముక్తావిద్రుమవజ్రాణి వైడూర్యస్ఫటికాదికమ్,
మణిరత్నం సరం శీతం కషాయం స్వాదు లేఖనమ్.
చక్షుష్యం ధారయేత్పాణౌ పాప్మాఽలక్ష్మీవిషాపహమ్,
సక్షారఉష్ణవీర్యశ్చ కాచో దృష్టికృదంజనాత్.
శంఖో దధిమలా శీతౌ కషాయావతిలేఖనా.
తుత్థకం కటుకం క్షారం కషాయం విశదం లఘు.
లేఖనం భేది చక్షుష్యం కండూక్రిమివిషాపహమ్,
విశదో గైరికః స్నిగ్ధః కషాయమధురో హిమః.
కఫఘ్నీ తిక్తకటుకా మనోహ్వా లేఖనీ సరా,
స్నిగ్ధం కషాయం కటుకం హరితాలం విషప్రణుత్.
కషాయమధురం శీతం లేఖనం స్నిగ్ధమంజనమ్,
రక్తపిత్తవిషచ్ఛర్ది హిధ్మాఘ్నం దృక్ప్రసాదనమ్.
స్రోతోంజనం వరం తత్ర తతస్సౌవీరకాంజనమ్,
ఘ్నం తిక్తకటుకం ఛేది సోష్ణం రసాంజనమ్.
దోషప్రశమనం కాసమోహాత్క్షయాపహమ్,
కఫఘ్నముష్ణకటుకం శిలాజతురసాయనమ్.
తిక్తం చ ఛేదనం యోగవాహిత్వాత్సర్వరోగజిత్,
కషాయమధురా రూక్షా కఫఘ్నీ వంశరోచనా.
తుగాక్షీరీ క్షయశ్వాసకాసఘ్నీ మధురా హిమా,
కారవ్యః కుంచికాఽజాజీ కబరీ ధాన్యతుంబరు.
అన్నగంధహరం రుచ్యం దీపనం కఫవాతజిత్,
బాష్పికా కటుతీక్ష్ణోష్ణా క్రిమిశ్లేష్మహరా పరమ్.
తద్వచ్చ రాజికా విఘ్నసాధనీ దీపనీ పరమ్,
శూలాటోపహరా రుచ్యా దీప్యకః కోష్ఠశూలజిత్.

అహృద్యాస్పర్శపాః స్నిగ్ధా బాహ్లికాచత్వ్రికీత్రితాః,
శతాహ్వా కుష్ఠతగరసురదారుహరేణవః.
ఏలాతైలవాలుసరల త్వగ్వ్యాఘ్రనఖచోరకాః,
లఘూష్ణాః కటుకాః పాకే కఫవాతనిబర్హణాః.
సైర్యకస్తిక్తమధురః స్నిగ్ధోష్ణః కఫవాతజిత్,
వస్తిమూత్రవిబంధఘ్నో వృష్యో గోక్షురకో హిమః.
పాచనం కఫపిత్తఘ్నం తిక్తం శీతం విషాహ్వయమ్,
కఫఘ్నం తిక్తకటుకం ముస్తం సంగ్రాహి పాచనమ్
తిక్తాఽమృతా త్రిదోషఘ్నీ గ్రాహిణ్యుష్ణా రసాయనీ,
దీపనీ జ్వరహృద్దాహకామలావాతరక్తనుత్.
తిక్తశీతౌ జ్వరహరౌ లఘూభూనింబపర్పటౌ,
నింబస్తిక్తో హిమః కుష్ఠకృమిపిత్తకఫాపహః
మహానింబః పరం గ్రాహీ కషాయో రూక్షశీతలః,
గుగ్గులుః పిచ్ఛిలః స్పర్శే విశదోఽభ్యవహారతః.
సస్వాదుస్సకటుస్తిక్తస్సకషాయో రసాయనమ్,
వ్రణ్యః స్వర్యః కటుః పాకే యాక్షస్సూక్ష్మోఽగ్నిదీపనః.
క్లేదమేదోఽనిలశ్లేష్మగండమేహాపచీకృమీన్,
పిటకాగ్రంథిశోఫాంశ్చ హంత్యుష్ణస్స్రంసనో లఘుః.
శంఖపుష్పీ సరా తిక్తా మేధ్యా కృమివిషాపహా,
కటుతిక్తోష్ణమధురా స్నిగ్ధా స్వాదుకఫాపహా.
పిత్తాస్రవిషతృడ్దాహకృమిఘ్నం గురు రూక్షణమ్,
సర్వం సతిక్తం మధురం చందనం శిశిరం పరమ్.
లఘు రక్తం తథోశీరం వాతలం పాచనం చ తత్,
జ్వరాతిసారవమథురక్తపిత్తకఫాపహమ్.
మధుకం రక్తపిత్తఘ్నం వ్రణశోధనరోపణమ్,
గురు స్వాదు హిమం వృష్యం చక్షుష్యం స్వరవర్ణకృత్.
కటుతిక్తే నిశే కుష్ఠమేహపిత్తకఫాపహే,
ప్రలేపాజ్జయతః కండూం శోఫం దుష్టవ్రణం విషమ్
ప్రపౌండరీకం చక్షుష్యం శిశిరం వ్రణరోపణమ్,
కషాయమధురం తిక్తం రక్తపిత్తప్రసాదనమ్.

బలాత్రయం స్వాదు వృష్యం స్నిగ్ధం శీతం బలప్రదమ్,
తత్ర నాగబల్యా (?) క్షతక్షీణహితా గురుః.
తాంబూలం కటుసక్షారం రుచ్యముష్ణం కఫప్రణుత్,
భేది సంమోహకృత్పూగం కషాయం స్వాదు రోచనమ్.
జాతిపత్రీ కటుఫలం కంకోలకలవంగకమ్,
లఘు తృష్ణాపహం హృద్యం వక్త్రదౌర్గంధ్యనాశనమ్.
సస్వాదుతిక్తస్తృష్ణాఘ్నః కర్పూరశ్ఛేదనో హిమః,
లతాకస్తూరికా దత్వ్యస్మఖశోషహరా పరమ్.
కషాయం మధురం శీతం పద్మం పిత్తకఫాస్రజిత్,
తద్వద్వకులపున్నాగకుముదోత్పలపాటలమ్.
సచంపకం తతో న్యూనం గుణైః కోరంటకింశుకమ్,
మాలతీమల్లికాపుష్పం తిక్తం జయతి మారుతమ్,
విషపిత్తకఫాన్నాగం సిందువారం చ తద్గుణమ్,
కఫఘ్నం కైతకం తిక్తం శైరీషం విషహారి చ.
వాతలం పుష్పమాగస్త్యం కషాయం కఫపిత్తజిత్,
బంధూకం శ్లేష్మలం గ్రాహి తద్వదేవ చ యూదికా.
కఫఘ్నముష్ణవీర్యం చ కుంకుమం వ్రణశోధనమ్,
అవల్గుజైడగజజం బీజం వాతకఫప్రణుత్.
ఆస్యా వర్ణశ్లేష్మమేదస్సౌకుమార్యకృదన్యథా,
'ధ్యాగ్నిబలాయూంషి కుర్యాచ్చంక్రమణం సుఖమ్.
స్యానులోమ్యం చ ఖుడస్తంభశ్రమాపహమ్,
ంజ్ఞం పాదత్రం బలకృచ్ఛక్రలం తథా.
నేత్రహితం ఛత్రం వాతవర్షాతపాపహమ్,
ప్రవాతో రౌక్ష్యవైవర్ణ్యస్తంభకృద్దాహతృడ్భ్రమాన్.
శ్రమాగ్నిమూర్ఛాశ్చ జయేదప్రవాతమతోఽన్యథా,
ప్రాగ్వాయురుష్ణోభిష్యందీ త్వగ్దోషార్శోవిషకృమీన్.
సన్నిపాతజ్వరశ్వాసమామవాయుం చ కోపయేత్,
యామ్యో సృగాతకఫకృచ్ఛీతస్వాదుః కషాయకః.
కషాయ పశ్చిమో రూక్షో లఘుర్నాతి విదహ్యతే,
వాతకృత్కఫపిత్తఘ్నో మూర్ఛాదాహభ్రమాపహః.

స్నిగ్ధశ్శీతోలఘుస్సాత్మ్య ఉత్తరప్రభవోఽనిలః,
ఐశానః కటురూక్షోష్ణ ఆగ్నేయశ్చైవ మారుతః.
అమ్లో విదాహీ నైఋత్యో వాయవ్యస్తిక్త ఉచ్యతే,
ఆతపో భ్రమతృట్ స్వేదదాహమూర్ఛావివర్ణతాః.
కుర్యాత్పిత్తాస్రవహ్నీంశ్చ ఛాయా శ్వేతాన్వ్యపోహతి."

సువర్ణము (బంగరు) శరీరమునకు పుష్టిని గలుగజేయును. స్నిగ్ధముగనుండును. మధురమైనరసము పాకముగలది. విషమును హరింపజేయును. శీతమైన వీర్యముగలది. కొంచెము వగరుగనుండును. రసాయనము (ముసలితనమును రోగములను హరించునది.)

రజతము (వెండి) స్నిగ్ధముగ, వగరుగ, పుల్లగ నుండును. మధురమైనపాకము గలది. శరీరమునందు త్వరగా వ్యాపించును. వయస్సును నిలుపును. శీతమైనవీర్యము గలది, రసరక్తాదిధాతువులను శుద్ధిచేయును. వాతపిత్తమును పోగొట్టును.

తామ్రము కొంచెముచేదుగ, మధురముగ, వగరుగ నుండును. రక్తాదిధాతువులను శోధించును. లఘువుగ నుండును. కటువైన పాకము, రసము గలది, శీతమైనవీర్యము గలది. వ్రణముల నార్చును. కఫపిత్తములను పోగొట్టును.

కంచు కొంచెము వగరుగ నుండును. శరీరమును రక్తాదిధాతువులను శుద్ధిచేయును. శరీరమునందు వేగముగ వ్యాపించును. నేత్రములకు నైర్మల్యమును గలుగజేయును. రూక్షకారి. కొంచెము చేదుగ నుండును. పిత్తకఫమును పోగొట్టును.

తగరము కొంచెము చేదుగ, ఉప్పగ నుండును. గడ్డకట్టియుండు మలాదులను భేదించును. పాండువు, చర్మదోషము, కృములు, వాతము, వీనిని పోగొట్టును. రక్తాది ధాతువులను శుద్ధిచేయును. కొంచెముగా పిత్తమును జేయును. సీసమునకు ః
గలిగియుండును

ఉక్కు నేత్రములకు హితముచేయును. వగరుగ, మధురముగ, చేదు
వాతకరమైనది. శీతమైనవీర్యముగలది. కృములు, పిత్తకఫము వీనిని హరింప

ముత్తియములు, పగడములు, వజ్రము, వైడూర్యము, స్ఫటికము మొదలగు రత్నములు శరీరమునందు శీఘ్రముగా వ్యాపించును. శీతమయినవీర్యముగలవి. కషాయముగ, మధురముగ నుండును. రక్తాదిధాతువులను శుద్ధిచేయును. నేత్రములకు హితకరమయినవి. హస్తమునందు ధరించుటచే పాపము, అలక్ష్మి, విషము, వీనిని పోగొట్టును.

కాచము (అనగా గవ్వలు) కొంచెము ఉప్పగ నుండును. ఉష్ణమైనవీర్యము గలవి. అంజనమువలన దృష్టికి మేలుచేయును.

శంఖము, సముద్రపునురుగు అను నీ రెండును శీతమైన వీర్యము గలవి. కషాయముగ నుండును. రక్తాదిధాతువులను మిక్కుటముగా శుద్ధిచేయును.

తుత్థము కాఱముగ, ఉప్పగ, కషాయముగ నుండును. శరీరమును శుద్ధిచేయును. లఘువుగ నుండును. రక్తాదులను శుద్ధిచేయును. శరీరమునందు గడ్డకట్టియుండు మలాదులను భేదించును. నేత్రములకు హితకర మయినది దురద, క్రిములు, విషము వీనిని పోగొట్టును.

గైరికము (అనగా జేగురుఱాయి) శరీరమును శుద్ధిచేయును. స్నిగ్ధముగ, కషాయముగ, మధురముగ నుండును. శీతమైనవీర్యము గలది. మణిశిల కఫమును హరింపజేయును. చేదుగ, కటువుగ నుండును. రక్తాదులను శుద్ధిపఱచును. శరీరమునందు త్వరగా వ్యాపించును. హరిదళము స్నిగ్ధముగ, కషాయముగ, కటువుగ నుండును. విషమును హరింపజేయును. అంజనపుఱాయి (సుర్మారాయి) కషాయముగ, మధురముగ, శీతముగ నుండును. రక్తాదులను శుద్ధిచేయును. స్నిగ్ధముగ నుండును. రక్తపిత్తము, విషము, ఛర్ది, హిధ్మ (ఎక్కిళ్లు), వీనిని హరింపజేయును. నేత్రములకు నైర్మల్యము నిచ్చును.

స్రోతోంజనము అంజనమునకంటె శ్రేష్ఠమయినది. దానికంటె సౌవీరాంజనము శ్రేష్ఠంబు. రసాంజనము కఫమును పోగొట్టును. తిక్తముగ, కటువుగ నుండును. మేదశ్లేష్మాది గ్రంథులను పోగొట్టును. కొంచె ముష్ణముగ నుండును. శిలాజిత్తు యోగవాహి (ఏవస్తువుతో గూడియుండునో ఆవస్తువునకు సమానముగ పనిచేయునది.) కావున ఆయావ్యాధుల ననుసరించి యుపయోగించునెడ రోగముల నన్నిటిని హరించును. [illegible]శేషముగ కాసము, మోహము, క్షయము, కఫము వీనిని పోగొట్టును. ఉష్ణ
డును. రసాయనము. వంశరోచనము తిక్తముగ నుండును. మేదశ్లేష్మాది
గొట్టును. కషాయముగ, మధురముగనుండును. రూక్షముగ నుండును. కఫ
యును. తవక్షీరి క్షయము, శ్వాసము, కాసము వీనిని పోగొట్టును. మధురముగనుండును. శీతమయినవీర్యము గలది; కారవ్యము (అనగా సదాపలు) జీలకఱ్ఱ, తెల్లజీలకఱ్ఱ, కఫరి (అనగా కారింగువ) దనియాలు, తుంబరులు, ఇవి అన్నగంధమును హరింపజేయును; రుచి నిచ్చును. అగ్నిదీపనము గలుగజేయును. కఫవాతములను పోగొట్టును. హింగుపత్రి కటువుగ, తీక్ష్ణముగ, ఉష్ణముగ నుండును. క్రిములు, శ్లేష్మము వీనిని విశేషముగా, బోగొట్టును. నల్లఆవాలు హింగుపత్రితో సమానమయిన గుణము గలవి. విఘ్నములను పోగొట్టును. అగ్నిదీపనము జేయును. విశేషముగా శూలలను కడుపుబ్బరమును పోగొట్టును. రుచికరమైనది. ఓమము, కోష్ఠ, శూలను

పోగొట్టును. సర్షపము (అనగా ఆవాలు) హృదయమునకు హితకరమైనది కాదు. స్నిగ్ధముగ నుండును. హింగుపత్త్రితో సమానమయినగుణము గలది.

సదాప, చెంగల్వకోష్ఠు, గ్రంథితగరము, దేవదారు, రేణుకలు, ఏలకులు, ఏలావాలుకము (అనగా నాగుదోస), సరళదేవదారు, లవంగపుచెక్క, వ్యాఘ్రనఖము, కచోరములు, ఇవి లఘువుగ, ఉష్ణముగనుండును. పాకమువలన కటువుగ నుండును. కఫము, వాతము వీనిని పోగొట్టును. సైర్యకము కొంచెము తిక్తముగ, మధురముగ, స్నిగ్ధముగ, ఉష్ణముగ నుండును. కఫవాతములను పోగొట్టును.

పల్లేరు, వస్తిరోగము, మలమూత్రబంధము వీనిని పోగొట్టును. శుక్రమును వృద్ధిచేయును. శీతమైన వీర్యముగలది. విషాహ్వయము పాచనకారి. కఫపిత్తములను హరింపజేయును. తిక్తముగ, శీతలముగనుండును. తుంగముస్తెలు కఫమును పోగొట్టును. తిక్తముగ, కటువుగ నుండును. మలమును గట్టిపఱుచును. జీర్ణముచేయును.

తిప్పతీగె చేదుగ నుండును. త్రిదోషములను హరింపజేయును. మలమూత్రములను బంధించును. ఉష్ణమయినవీర్యము గలది. రసాయనము అగ్నిదీపనకారి. జ్వరము, నేత్రతాపము, కామిల, వాతరక్తము వీనిని పోగొట్టును. నేలవేము, పర్పాటకము, అను నీ రెండును తిక్తముగ, శీతలముగ నుండును. జ్వరమును పోగొట్టును వేము చేదుగ నుండును. శీతమయిన వీర్యము గలది. కుష్ఠము, క్రిములు, పిత్తకఫము వీనిని పోగొట్టును. పెద్దవేము మిక్కుటముగా మలాదులను బంధించును. కషాయముగ, రూక్షముగ, శీతలముగ నుండును.

గుగ్గిలము స్పర్శమువలన స్నిగ్ధముగ నుండును. తీక్ష్ణమువలన శరీరమును శుద్ధిపఱచును. కొంచెము మధురముగ, కొంచెము కారముగ, చేదుగ, కొంచెము వగరుగనుండును. రసాయన మయినది. వ్రణము నార్చును. స్వరమునకు హితముచేయును. పాకము వలన కటువుగ నుండును. రూక్షగుణము కల్గినది. స్రోతోమార్గములయందు సంచరించును, అగ్నిదీపనకారి, క్లేదము (అనగా ఆమాశయమునందుండు శ్లేష్మము) మేదోరోగము, వాతము, శ్లేష్మము, గండము, ప్రమేహము, అపచి, క్రిములు, పిటికలు, గ్రంథులు, శోఫ, వీనిని పోగొట్టును. ఉష్ణమైనవీర్యము గలది. మలాదులను వెలిపుచ్చును. లఘువుగ నుండును. శంఖపుష్పి శరీరమునందు త్వరగా వ్యాపించును. చేదుగ నుండును బుద్ధిని వృద్ధి చేయును. క్రిములు, విషము వీనిని పోగొట్టును. కారముగ, చేదుగ, ఉష్ణముగ, మధురముగ, స్నిగ్ధముగ నుండును. హృదయమునకు హితకరమైనది. కఫమును హరింపజేయును.

సమస్తమైన చందనములు పిత్తరక్తము, విషము, దప్పి, తాపము, క్రిములు వీనిని హరింపజేయును. గురుత్వము రూక్షగుణము కలది. కొంచెము చేదుగ, మధురముగ నుండును. మిక్కుటముగా శీతమైనవీర్యముకలది. వట్టివేళ్లు లఘువుగనుండును. వాతమును జేయును. పాచనకారి జ్వరము, అతిసారము, వాంతి, రక్తపిత్తము, కఫము వీనిని పోగొట్టును అతిమధురము రక్తపిత్తమును హరింపజేయును. వ్రణములను శుద్ధిజేసి అర్చును. గురువుగ, మధురముగ నుండును. శీతమైనవీర్యము గలవి. శుక్రమును వృద్ధి చేయుచు. నేత్రములకు హితకరమైనది. మంచిస్వరము, కాంతి వీనిని గలుగజేయును.

పసపు, మ్రానిపసపు ఈరెండును కారముగ, చేదుగ నుండును. కుష్ఠము, మేహము, పిత్తము, కఫము వీనిని పోగొట్టును ప్రలేపనమువలన దురద, శోఫ, దుష్టవ్రణము, విషము వీనిని హరింపజేయును. ప్రపౌండరీకము (కర్పూరపుబెండ), నేత్రములకు హితకరమైనది. శీతమైన వీర్యము గలది. వ్రణముల నార్చును. వగరుగ, మధురముగ, చేదుగ నుండును. రక్తపిత్తమును శమింపజేయును. ముత్తవపులగము, బల(చిట్టాముట్టి), అతిబల (పేరాముట్టి), నాగబల (జిబిలిక), అను నీబలాత్రయము మధురరసము కల్గియుండును. శుక్రమును వృద్ధిచేయును. స్నిగ్ధముగ నుండును. శీతమైనవీర్యము గలవి. బలకారి. వానిలో నాగబల మిగుల బలకారి. క్షత, క్షీణులకు పథ్యకరమైనవి. గురువుగ నుండును. తమలపాకులు కారముగ, కొంచెము ఉప్పగనుండును. రుచిని గలుగజేయును. ఉష్ణకరమైనది. కఫమును హరింపజేయును. పోకలు శరీరమునందు గడ్డకట్టియుండు మలాదులను భేదించును. మోహమును (మూర్ఛను) గల్గించును. కొంచెము కషాయముగ, మధురముగ నుండును రుచికరమైనది. జాపత్రి, కటుఫలము, కంకోలకము (అనగా తక్కోలములు) లవంగములు ఇవి లఘువుగ నుండును. హృదయమునకు హితకరమైనవి. దప్పి, ముఖదుర్గంధము వీనిని పోగొట్టును. పచ్చకర్పూరము కొంచెము మధురముగ, చేదుగ నుండును. దప్పిని హరింపజేయును. మేదః శ్లేష్మాది గ్రంథులను పోగొట్టును. శీతమైన వీర్యముగలది. లతాకస్తూరి కర్పూరముతో తుల్యమైన గుణముగలది. ముఖశోషమును పోగొట్టును. పద్మము కషాయముగ, మధురముగ నుండును. శీతమైనవీర్యము గలది. పిత్తము, కఫరక్తము వీనిని పోగొట్టును.

పొగడ, పొన్న, తామర, కలువ, కలిగొట్టు. సంపంగి, వీనిపుష్పములు పద్మముతో తుల్యమైన గుణము గలవి. కోరంటము (అనగా ములుగోరింట) మోదుగు అను నీరెండు పుష్పములు పద్మముకంటె కొంచెముతక్కువైన గుణము గలవి. మాలతీ(అనగా జాజిపూలు) మల్లికాపుష్పములు (అనగా మల్లెపూలు) ఇవి చేదుగ నుండును. వాతమును హరింపజేయును. నాగపుష్పము (అనగా మొల్ల) విషము, పిత్తము, కఫము వీనిని

హరింపజేయును. వావిలిపూలు నాగపుష్పముతో తుల్యమైన గుణము గలవి. కేతకీపుష్పము (అనగా మొగలిపూలు) చేదుగ నుండును. కఫమును శమింపజేయును. దిరిసెనపుపూలు విషమును హరింపజేయును. అగసిపూలు వాతమును జేయును. కషాయముగ నుండును. కఫపిత్తములను హరింపజేయును. బంధూకపుష్పము (అనగా మంకెన) శ్లేష్మమును జేయును. మలమూత్రములను బంధించును. యూధికాపుష్పము బంధూకపుష్పముతో తుల్యమైన గుణము గలది.

కుంకుమపువ్వు కఫమును హరింపజేయును. ఉష్ణమైనవీర్యము గలది. వ్రణమును శుద్ధిచేయును. ఆవల్గుజము (అనగా బావంచివిత్తులు) తగరిసెవిత్తులు వాతకఫములను పోగొట్టును.

కదలక సుఖముగ గూర్చొనియున్నయెడ శరీరమునకు వర్ణమును, మేదస్సును, శ్లేష్మమును, శరీరసౌకుమార్యమును వృద్ధిజేయును. త్రోవనడుచుటవల్ల పైజెప్పినగుణములకు విరుద్ధముగ శరీరవర్ణమును మేదస్సును సౌకుమార్యము నశింపజేయును. జాఠరాగ్నిని శరీరబలమును ఆయువును వృద్ధినొందించును.

విడువక సంచరించుచున్నయెడ వాతమును అనులోమముగ సంచరింపజేయును. ఖుడవాతమును స్తంభవాతమును హరించును. శ్రమమును పోగొట్టను.

చెప్పులను కాళ్లకు దొడుగుకొని నడిచినచో పాదములను కాపాడును. బలమును గల్గించును. శుక్రమును వృద్ధినొందించును. శరీరవర్గమునకు నేత్రములకును హితకరము. గొడుగును పట్టుకొనినచో గాలిని వర్షమును ఎండను ఆపును.

పెనుగాలి రౌక్ష్యము, విరుద్ధమైనవర్ణము, శరీరస్తంభము, వీనిని గలుగజేయును. తాపము, దప్పి, భ్రమ, శ్రమ, అగ్నిమాంద్యము, మూర్ఛ వీనిని పోగొట్టును. సాధారణమైనగాలి దీనికంటె విరుద్ధముగ నుండును. ప్రాగ్వాతము (అనగా తూర్పుగాలి) ఉష్ణకరమైనది. శ్లేష్మమును జేయును, చర్మదోషము, అర్శస్సు, విషము, క్రిములు, సన్నిపాతజ్వరము, శ్వాసము, ఆమవాతము వీని నధికపఱచును. దక్షిణపుగాలి రక్తవాతము, కఫము వీనిని గలుగజేయును. శీతమైనవీర్యము గలది. మధురముగ, కషాయముగ నుండును. పడమటిగాలి కషాయముగ నుండును; రూక్షకర మయినది. లఘువుగ నుండును. స్వల్పముగా విదాహము నిచ్చును, ఉత్తరగాలి వాతమును జేయును. కఫపిత్తములు, మూర్ఛ, సర్వాంగతాపము, భ్రమ వీనిని పోగొట్టును. స్నిగ్ధముగ నుండును. శీతమయినవీర్యము గలది. లఘువుగ నుండును. సాత్మ్యకర మయినది. మధురాదిషడ్రసయుక్తముగ నుండును. ఈశాన్యమూలగాలి కటువుగ, రూక్షముగ, ఉష్ణముగ నుండును. ఆగ్నేయమూలగాలి కొంచెము వుల్లగ, విదాహకారిగ నుండును. నిర్ఋతిమూలగాలియు వాయవ్యమూల

గాలియు చేదుగ నుండును. ఎండ, భ్రమ, దప్పి, చెమట, సర్వాంగతాపము, మూర్ఛ, వైవర్ణ్యము, పిత్తరక్తము, అగ్నివృద్ధి వీనిని గలుగజేయును. నీడ పైజెప్పిన శ్రమ మొదలగువానిని పోగొట్టును. అని సువర్ణాది వస్తువులయొక్క గుణములు విశేషముగా అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

శూకశింబీజపక్వాన్నమాంసశాకఫలౌషధైః,
వర్గైస్తైరన్నలేశోఽయముక్తో నిత్యోపయోగికః. ౧౭౦

నెమలివరి మున్నగు శూక(ముండ్లుకల) ధాన్యము, పెసలు మున్నగు శింబీధాన్యము, పక్వాన్నము, మాంసములు, శాకములు, ఫలములు, ఔషధము, వీనిచే నెల్లపుడు నుపయోగకారిగ నుండు పదార్థములయొక్క స్వల్పభాగము జెప్పబడినది.

"తిలసో నిషేవ్యమాణం విషమపి సంజాయతేఽమృతసమానమ్,
భల్లాతకస్సహతిలైస్తత్కార్యపి కుష్ఠముపహంతి.
సంస్కారేణ లఘుభ్యస్సక్తుభ్యస్సిద్ధమపి పిణ్డికాగురవః,
మరువాసిష్వతిసాత్మ్యం దధిపీలుశమీకరీరాణామ్.
ఘృతదుగ్ధం హేమంతే మందాగ్నికథోత్తరం భవేత్ప్రాయః,
దధిదుగ్ధం వాతఘ్నం తదజారం వాతకృద్భవతి,
రేచనమపి చ క్షీరం గవ్యం సంగ్రాహి కస్యచిద్భవతి."

కొంతకాలమువరకు విషమునుకూడ తిల్రప్రమాణముచొప్పున సేవించుచుండినచో నది అమృతముతో సమానముగ శరీరబలాదుల గల్గించును. జీడిగింజలను తిలలతో జేర్చి భుజించుచుండిన కుష్ఠమును హరింపజేయును. సంస్కారముచే లఘువుగ నుండునట్టి పేపుడుబియ్యపుపిండివలన జేయబడిన ఉంటలు మిగుల గురువుగ నుండును. పెరుగు, పీలు (అనగా గోగు) జమ్మి, కరీరము (వెదురుమోవు) ఇవి జాంగలదేశమునందు వసించువారలకు మిగుల సాత్మ్యకరమైనవి. హేమంతకాలమునందు ఘృతము, క్షీరము అను నీ రెండును తఱుచుగ నగ్నిమాంద్యమును గలుగజేయును. పెరుగు, పాలు అను నీరెంటును వాతమును జేయును. ఆవుపాలు విరేచనకారియైనను ఒకానొక పురుషునకు మలమును బంధించును. ఇటుల మాత్ర, యోగము, క్రియ, దేశము, కాలము మొదలగు విశేషములవలన పైజెప్పిన ద్రవ్యములయొక్క గుణములుకూడ విపరీతములుగ నగును. కాబట్టి బుద్ధిమంతు డగువైద్యుడు స్వబుద్ధిచే మాత్రాయోగాదుల ననుసరించి వస్తుగుణముల నూహించుకొనవలయును. ఈ తంత్రకారుడు గ్రంథవిస్తరభీతిచే మాత్రాయోగాదులను స్పష్టముగా జెప్పక విరమించెను. అయిన నాయాసందర్భములయందు యుక్తిచే జెప్పియున్నాడు.

వివిధౌషధవర్గము ముగిసెను.

# సప్తమాధ్యాయము



అవ. పూర్వాధ్యాయమునందు శరీరధారణార్థమై అన్నపానస్వరూపము చెప్పబడినది. పథ్యకరములైన అన్నపానములుకూడ విషాదులచే దుష్టంబైనచో రోగోత్పత్తికిగాని, లేక మరణమునకుగాని కారణం బగును. కాబట్టి అన్నరక్షాధ్యాయము చెప్పబడుచున్నది.

## అన్నరక్షాధ్యాయప్రారంభము

సూ అథాతోఽన్నరక్షాధ్యాయం వ్యాఖ్యాస్యామః
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః

అన్నపానస్వరూపాధ్యాయానంతరము అన్నరక్షణం బావశ్యకం బగుటచే అన్నరక్షణమును బోధించునట్టి అన్నరక్షాధ్యాయమును వివరించెదము.

## రాజసమీపమున వైద్యుడు వసింపవలయు ననుట

రాజా రాజగృహాసన్నే ప్రాణాచార్యం నివేశయేత్,
సర్వదా స భవత్యేవం సర్వత్ర ప్రతిజాగ్రువిః ౧

సర్వకాలములందు రాజగృహసమీపమునందుండువైద్యుడు రాజుయొక్క అన్నపానశయనాసనాదులయందు మిగుల జాగరూకుడై యుండును. కాబట్టి రాజు తన గృహసమీపమునందు వైద్యుని వసింపజేయవలయును.

## వైద్యునికి రాజరక్షణావశ్యకత్వము

అన్నపానం విషాద్రక్షేద్విశేషేణ మహీపతేః,
యోగక్షేమౌ తదాయత్తౌ ధర్మాద్యా యన్నిబంధనాః. ౨

లోకమునందు ధర్మార్థకామమోక్షాదులు యోగక్షేమాధీనంబులై యుండును. అట్టి యోగక్షేమములు రాజాధీనంబై యుండును. కాబట్టి రాజుయొక్క అన్నము, పానము, శయనము, వస్త్రము, మాలికలు మొదలగువానియందు విషసంబంధము గలుగకుండ వైద్యుడు రక్షింపుచుండవలయును. యోగము అనగా అన్నవస్త్రాది ప్రాప్తి. క్షేమము అనగా అన్నాదులకు చోరాద్యుపద్రవము గలుగకుండ రక్షించుట.

## విషసంబంధముగల అన్నలక్షణము

ఓదనో విషవాన్ సాంద్రో యాత్యవిస్రావ్యతామివ,
చిరేణ పచ్యతే పక్వో భవేత్పర్యుషితోపమః. ౩

మయూరకంఠతుల్యోష్మా మోహమూర్ఛాప్రసేకకృత్,
హీయతే వర్ణగంధాద్యైః క్లిద్యతే చంద్రకాచితః. ౪

విషసంబంధముగలయన్నము గట్టిగ, ఒక్కొక్కకణముగ విభజించుటకు వలనుపడక యుండును. చిరకాలముమీద జీర్ణ మగును. పాకమయినతోడనే పర్యుషితాన్నమువలె నుండును. నెమలికంఠమువలె నానావర్ణములు గలదై యుండును. వేడిలేనిదిగ నుండును. అట్టియన్నము నుపయోగించుటచే మోహము (అనగా చిత్తము లేకుండుట), మూర్ఛ (అనగా సంజ్ఞాహాని), ప్రసేకము (నోట నీరుగారుట), అను నీలక్షణములు గలుగును. విషసంబంధముగల యన్నమునకు మంచివర్ణము, గంధము మొదలగునవి కొఱవడియుండును. జలమధ్యములో వేయబడిన తైలబిందువువలెనే విచిత్రమైన బిందువులతోగూడి తడిగ నుండును. ఈప్రకారము విషసంబంధము గల యన్నాదులను చక్షురాదీంద్రియములచే బరీక్షింపవలయును.

విషసంబంధముగల వ్యంజనలక్షణము

వ్యంజనానాశు శుష్యంతి *ధ్యామక్వాథాని తత్ర చ,
హీనాతిరిక్తా వికృతా ఛాయా దృశ్యేత నైవ వా. ౫
ఫేనోర్ధ్వరాజీసీమంతతంతుబుద్బుదసంభవః.
విచ్ఛిన్నవిరసా రాగాః ఖాడవాశ్శాకమామిషమ్. ౬

విషసంబంధమువలన పెరుగు, చల్ల, దానిమ్మపండు మొదలగువానిచే సంస్కారము చేయబడినసూపము మొదలగు వ్యంజనములు శీఘ్రముగా శుష్కములుగ నగును. క్వాథముతో గూడియుండు వ్యంజనములు నల్లగ నగును. క్వాథములో తనయొక్క ప్రతిబింబము శిరము మొదలగు అంగములు లేనిదిగగాని, లేక గొప్ప యంగములతో గూడినదిగగాని, లేక వికారరూపముగలదిగగాని గనుపించును. లేక ప్రతిబింబమే గనపట్టకుండును. అధికమైన లవణాదులతో గూడియుండునట్టి ద్రవమైన వ్యంజనములలో నురుగు, ఊర్ధ్వరేఖ, సీమంతము (అనగా పాపటవలె నుండురేఖ) తంతువు (అనగా నూలు) బుగ్గలు మొదలగునవి గలుగును. రాగము, ఖాడవము, శాకము, మాంసము ఇవి ఒక్కొక్కప్రదేశమునందు వివర్ణముగను, రసహీనముగను, ఒకటితోనొకటి చేరకయు నుండును.

విషసంబంధముగల మాంసాదిలక్షణము

నీలా రాజీ రసే తామ్రా క్షీరే దధని దృశ్యతే,
శ్యావా పీతా సితా తక్రే ఘృతే పానీయసన్నిభా. ౭

* శ్యావ ఇతిపా.

కాళీ మద్యాంభసోః క్షౌద్రే హరిత్తైలేఽరుణోపమా,
పాకః ఫలానామామానాం పక్వానాం పరిశోషణమ్. ౮
ద్రవ్యాణామార్ద్రశుష్కాణాం స్యాతాం గ్లానివివర్ణతే,
మృదూనాం కఠినానాం చ భవేత్స్పర్శవిపర్యయః. ౯
మాల్యస్య స్ఫుటితాగ్రత్వం మ్లానిర్గంధాంతరోద్భవః,
శ్యామమండలతా వస్త్రే శదనం తంతుపక్ష్మణామ్. ౧౦
ధాతుమౌక్తికకాష్ఠాశ్మరత్నాదిషు మలాక్తతా,
స్నేహస్పర్శప్రభాహానిస్సప్రభత్వం తు మృణ్మయే. ౧౧

విషసంబంధమువలన మాంసరసములో నీలరేఖ, క్షీరములో ఎఱ్ఱని రేఖ, పెరుగులో కపిశ (కొతిరంగు) వర్ణముగలరేఖ, తక్రములో పసుపువర్ణముగ నల్లగనుండురేఖ, ఘృతములో జలతుల్యమయినరేఖ, మద్యము ఉదకము వీనిలో కృష్ణవర్ణముగల రేఖ, తేనెలో పచ్చనివర్ణముగలరేఖ, తైలములో కొంచెము ఎఱ్ఱవర్ణముగలరేఖ నేత్రములకు గనుపట్టును.

“మస్తున్యపి కపోతాభా రాజీ కృష్ణా తుషోదకే”

విషసంబంధమువలన పెరుగుమీఁదిమీఁగడలో పావురపెట్టతో తుల్యమయిన వర్ణముగల రేఖ, పులికడుగులో కృష్ణవర్ణముగలరేఖ, ద్రవౌషధములో కపిలవర్ణముగలరేఖ గనుపించు నని గ్రంథాంతరమునందు జెప్పబడియున్నది. అటులనే అపక్వముగ నుండు ఫలములకు పరిపాకము, పక్వముగ నుండు ఫలములకు పరిశోధనము (అనగా ముదిగిపోవుట) తడిగానుండువస్తువులకు గ్లాని, ఎండియుండువస్తువులకు వైవర్ణ్యము, మృదువుగనుండు వస్తువులకు కాఠిన్యము, కఠినముగ నుండువస్తువులకు మృదుత్వము, పుష్పములకు అగ్రభాగమునందు చీలుట వాడుట స్వగంధనాశము ఇతరగంధోత్పత్తి, దుప్పటి మొదలగు వస్త్రములలో నల్లనిబొట్లు, వస్త్రముయొక్క నూలు స్వయముగ చీకుట, కంబళి మొదలగువాని యందలి రోమము లూడుట, లోహాదిధాతువులు, ముత్తియములు, ప్రానులు, రాళ్లు, వజ్రమరకతాదిరత్నములు, వీనియందు బురదపూయబడినటు లుండుట, స్నేహము స్పర్శము కాంతి లేకుండుట, మట్టిపాత్రయందు విశేషమైనకాంతి ఇవి విషసంబంధమువలన గలుగును.

## విషదాతలక్షణము

విషదః శ్యావశుష్కాస్యో విలక్షో వీక్షతే దిశః,
స్వేదవేపథుమాం *స్త్రస్తో భీతః స్ఖలతి జృంభతే. ౧౨

* స్తబ్ధో ఇతిపా.

విషము నొసంగునట్టిమనుజుడు వైవర్ణ్యము గలిగి ఎండియుండు ముఖమును భయము గలవాడై లజ్జతోఁగూడి నలుదిక్కులయందు పలుమారు జూచుచు నుండుటయేగాక చెమట, వణకు, అస్థైర్యము, అనువానితో గూడి తనను మరుగుపరచుకొనుటకు యత్నించుచు నడచునపుడు నిష్కారణముగ కాలు తడబడుచు పలుమారు ఆవలింతలు విడుచుచు నుండును.

"అస్థానహాసీ పృష్టో ఽసంబద్ధముత్తరం దదాతి నైవ వా వదతి వివక్షుర్ముహ్యత్యంగులీః స్ఫోటయతి, శిరః కండూయతే, ఓష్ఠౌ లేఢి, భువం విలిఖతి, క్రియాసు త్వరతే, విపరీతమాచరతి, స్వభూమౌ చ నావతిష్ఠతే."
అకారణముగ నవ్వుచు, ప్రశ్నకు అసంగతమయిన ప్రత్యుత్తరముల జెప్పుచు నుండును. ఒకసంగతిని జెప్పబూని మోహమునుజెందును. వ్రేళ్లయందు మెటికలను విరుచును. తలను గోకికొనును. పెదవుల నాకును కాలితో భూమియందు గీచుచుండును ఒకానొకకార్యమునందు త్వరపడును. విరుద్ధమైన నడతలు గలవాడై యుండును. ఒకచోటను స్థిరముగ నిలువ కుండును. అని గ్రంథాంతరమునందు చెప్పబడియున్నది. కావున నీలక్షణములవలన విషము నొసంగినవానిని తెలిసికొనవలయును.

## అగ్నిచే విషయుక్తాన్నపరీక్ష

ప్రాప్యాన్నం సవిషం త్వగ్నిరేకావర్తః స్ఫుటత్యతి,
శిఖికంఠాభధూమార్చిరనర్చిర్వోగ్రగంధవాన్. ౧౩

విషముతో గూడియుండునట్టి అన్నమును అగ్నియందు వైచినచో ఒకటే జ్వాలగ లేచి చటచట యనుశబ్దము గలుగును. అగ్నియొక్కజ్వాలయు, పొగయు నెమలి కంఠమువలె చిత్రవర్ణము గలవిగ నుండును. అటుకాదేని అగ్నికి జ్వాలయే లేకుండును. శవగంధము గలదై యుండును. (విషసంబంధముగల అగ్నియొక్కధూమము ప్రసేకము, గగుర్పాటు, శిరమునందువేదన, పీనసము, నేత్రబాధ వీనిని గలుగజేయును.)

## పక్ష్యాదులచే విషయుక్తాన్నపరీక్ష

మ్రియంతే మక్షికాః ప్రాశ్య కాకః క్షామస్వరో భవేత్,
ఉత్క్రోశంతి చ దృష్ట్వైతచ్ఛుకదాత్యూహసారికాః. ౧౪
హంసః ప్రస్ఖలతి గ్లానిర్జీవంజీవస్య జాయతే,
చకోరస్యాక్షివైరాగ్యం క్రౌంచస్య స్యాన్మదోదయః. ౧౫
కపోతపరభృద్దక్షచక్రవాకా జహత్యసూన్,
ఉద్వేగం యాతి మార్జారశ్శకృన్ముంచతి వానరః. ౧౬

హృష్యేన్మయూర స్తద్దృష్ట్వా మందతేజో భవేద్విషమ్,
ఇత్యన్నం విషవత్ జ్ఞాత్వా త్యజేదేవం ప్రయత్నతః. ౧౬
యథా తేన విపద్యేరన్నపి న క్షుద్రజంతవః,

విషముతో గూడియుండు అన్నమునందు ఈగలు చేరవు. చేరినచో తత్క్షణము నశించి మృతిచెందును. విషదుష్టమైన యాహారభక్షణమువలన కాకి వికారముగ నరచును. విషదుష్టమయిన యన్నము జూడగానే చిలుక, కూపురుగుడ్డుగిజిట్ట, లేక వానకోయిల గోరింక అను నీపక్షులు గట్టిగ నరచును. హంస కాళ్లు తడబడి భూమిపై ద్రెళ్లును. వెన్నెలపులుగు గ్లానిని జెందును. చకోరపక్షియొక్క నేత్రములు తెల్ల నగును. క్రౌంచపక్షికి (అనగా జక్కవపక్షికి) మదము గలుగును. పావురపిట్ట, కోయిల, దక్షము (అనగా కోడి) చక్రవాకపక్షి ఇవి ప్రాణములను విడుచును. పిల్లి భయపడి వణకును. కోతి మలోత్సర్జనముజేసి ముఖమును త్రిప్పుకొని రోదనముచేయును. నెమలికి రోమహర్షణము గలుగును. నెమలిదర్శనమువలన విషమునకు తేజస్సు కొరవడును ఇట్టి పరీక్షవలన అన్నాదులకు విషసంబంధము గల దని యెఱిగి వానిచే నీగలు మొదలగు జంతువులు మృతిజెందకుండునటుల ప్రయత్నపూర్వకముగా దూరమునందు వర్జింపవలయును.

విషాన్నస్పర్శజరోగతచ్చికిత్స

స్పృష్టే తు కండూదాహోషాజ్వరార్తిస్ఫోటసుప్తయః. ౧౮
నఖరోమచ్యుతిశ్శోఫస్సేకాద్యా విషనాశనాః,
శస్తాస్తత్ర ప్రలేపాశ్చ సేవ్యచందనపద్మకైః. ౧౯
ససోమవల్కతాలీసపత్రకుష్ఠామృతానతైః,

విషముతో గూడియుండునట్టి అన్నాదులను ముఖము, హస్తము మొదలగు నంగములచే స్పృశించినచో దురద, శరీరమునందంతటను ఒక్కొక్కప్రదేశమునందును తాపము, జ్వరము, శూల, బొబ్బలు, కాళ్లుచేతులు చచ్చుబారుట, గోళ్లు, వెంట్రుకలుపూడుట, శోఫ అను నీ యుపద్రవములు గలుగును. వీనియందు సోమవల్కము (అనగా గుమ్మడిరేగు) తాళిసపత్రి, చెంగల్వకోష్ఠు, తిప్పతీగె, గ్రంధితగరము వీనితో గూడియుండునట్టి తెల్లవట్టివేరు, చందనము, పద్మకము, వీనిచే ప్రలేపనమును విషనాశకరములైన సేకాదులనుచేయుట హితకరంబు.

వక్త్రగతవిషోపద్రవములు, వానిచికిత్స

లాలాజిహ్వోష్ఠయోర్జాడ్యమూషాచిమిచిమాయనమ్. ౨౦
దంతహర్షోరసాజ్ఞత్వం హనుస్తంభశ్చ వక్త్రగే,
సేవ్యాద్యైస్తత్ర గండూషాస్సర్వం చ విషజిద్ధితమ్. ౨౧

విషము నోటియందు తగిలినచో జొల్లుకారుట, నాలుక, పెదవులు వీనియందు జడత్వము, తాపము, చిమచిమలాడుట, దంతహర్షము, నాలుకయందు రసజ్ఞానము లేకుండుట, అంకిళ్లు కిట్టుకొనుట అను నీయుపద్రవములు గలుగును. వీనియందు పైజెప్పిన తెల్లవట్టివేరు మొదలగు నౌషధములచే గండూషమును, విషహరంబులగు సమస్తమయిన క్రియలను చేయుట హితకరంబు.

ఆమపక్వాశయగతవిషోపద్రవములు, వానిచికిత్స

ఆమాశయగతే స్వేదమూర్ఛాధ్మానమదభ్రమాః,
రోమహర్షో వమిర్దాహశ్చక్షుర్హృదయరోధనమ్. ౨౨
బిందుభిశ్చాచయోఽంగానాం పక్వాశయగతే పునః,
అనేకవర్ణం వమతి మూత్రయత్యతిసార్యతే. ౨౩
తంద్రా కృశత్వం పాండుత్వముదరం బలసంక్షయః,
తయోర్వాంతవిరిక్తస్య హారిద్రే కటభీం గుడమ్. ౨౪
సిందువారితనిష్పావబాష్పికాశతపర్వికాః,
తండులీయకమూలాని కుక్కుటాండమవల్గుజమ్. ౨౫
నావనాంజనపానేషు యోజయేద్విషశాంతయే,

విషముచే దుష్టమైన యన్నము ఆమాశయమును జెందినచో స్వేదము, మూర్ఛ, ఆధ్మానము, మదము, భ్రమము, రోమహర్షణము, వాంతి, తాపము, నేత్రములు తెలియకుండుట, ఱొమ్మడచుట అను నీయుపద్రవములు కలుగును. విషదుష్టమైన యన్నము పక్వాశయమును జెందినయెడల శరీరము నానావిధబిందువులచే వ్యాప్తమై యుండును. నానావిధవర్ణములుగ వాంతి యగును. మూత్ర మధికముగ వెడలును. అతిసారము, తంద్ర, కృశత్వము, పాండువు, ఉదరరోగము, బలక్షయము అను నీవ్యాధులు కలుగును. పైజెప్పిన ప్రకారము ఆమాశయపక్వాశయములయందు విషసంబంధముగల పురుషులలో ఆమాశయమునందు విషసంబంధముగల పురుషునికి యథాయోగముగ మృంగకాయ, అలాబు (సొరతీగె) కుంభి (అనగా గుమ్మడిరేగు) బీరకాయ తేనె అనుములు వీనితో గూడి యుండునట్టియుదకముచే వమనకర్మను జేయించి పిదప స్నేహకర్మను విరేచనమును జేయింపవలయును. పక్వాశయమునందు విషసంబంధము గల పురుషునికి యథాయోగముగ పూర్వోక్తౌషధములచే వమనముజేయించి నీలినీఫలము (అనగా నీలికాయల) తోగూడియుండునట్టి ఘృతముచే విరేచనము చేయింపవలయును. ఇట్లు యథాయోగముగ వమన విరేచనకర్మలనుచేయించి పసుపు, మ్రానిపసుపు, కటభి (అనగా గినియ)

గారపుము, వావిలి, అనుములు బొబ్బిక (అనగా హింగుపత్రి) శతపర్వికా (అనగా నల్లవస) తండులీయకమూలము (అనగా చిర్రివేరు) కుక్కుటాండము (అనగా కోడి గ్రుడ్డు) బావంచి అను నీ యౌషధములను నస్యము, అంజనము, పానము వీనిని విష నివృత్త్యర్థమై యుపయోగింపవలయును.

## విషనివర్తక ఔషధోపయోగము

విష *భుక్తాయ దద్యాచ్చ శుద్ధాయోర్ధ్వమధస్తథా, ౨౮
సూక్ష్మం తామ్రరజః కాలే పక్షౌద్రం హృద్విశోధనమ్,
శుద్ధే హృది తతశ్శాణం హేమచూర్ణస్య దాపయేత్. ౨౯

విషమును భుజించియుండువానికి వమనవిరేచనములు జేయించి సూక్ష్మంబును, హృదయశుద్ధికారియునైన తామ్రరజస్సును (రాగిరాపాడిని) తేనెతో జేర్చి కాలమును దేశమును సాత్మ్యమును ప్రకృతిని చక్కగ గమనించి తదనుసారముగ నొసంగవలయును. హృదయము శుద్ధియైన పిదప శాణప్రమాణము (అనగా కర్షములో నాల్గవ భాగము)గల హేమచూర్ణమును కాలదేశాదుల ననుసరించి యొసంగవలయును.

## హేమపానముచే విషనివారణము

న సజ్జతే హేమపాంగే పద్మపత్రేఽంబువద్విషమ్,
జాయతే విపులం చాయుః గరేఽప్యేష విధిః స్మృతః. ౩౦

హేమమును భుజించువానియొక్క శరీరమునందు తామరాకులోని జలము వలెనే విషము సంబంధించకుండును. హేమభక్షణముచేయువానికి దీర్ఘమైన ఆయుష్షు గలుగును. గరసంబంధమునందును యీవిధినే జేయవలయును.

## విరుద్ధాహారజనితోపద్రవములు

విరుద్ధమపి చాహారం విద్యాద్విషగరోపమమ్,

పరస్పరవిరుద్ధములగు పదార్థముల నొకటిగగూర్చి భుజించినచో నయ్యది విరుద్ధాహారమని చెప్పబడును. అట్టి యాహారముచేత విషమువలనను గరమువలనను కల్గిన వ్యాధులైనను మరణంబైనను కల్గును.

"విస్ఫోటగుల్మమదవిద్రధిమేహయక్ష్మతేజోబలస్మృతిమతీంద్రియచిత్తనాశమ్,
కుర్యాద్విరుద్ధమశనంజ్వరమప్యపి త్తమష్టౌగదాంశ్చమహతోవిషవచ్చమృత్యుమ్."

విరుద్ధమయిన యాహారము విషమువలెనే విస్ఫోటకము, గుల్మము, మదము, విద్రధి, మేహము, రాజయక్ష్మము అను నీ రోగములను, తేజస్సు, బలము, స్మృతి, బుద్ధి, ఇం

* పీతాయ ఇతి పా.

ద్రియములు, చిత్తము పీనినాశనమును, జ్వరమును రక్తపిత్తమును ఎనిమిదివిధములైన మహారోగములను కల్గించును అని సంగ్రహమున నున్నది.

“వాతవ్యాధ్యశ్మరీకుష్ఠమేహోదరభగందరాః,
అర్శాంసి గ్రహణీత్యష్టౌ మహారోగాః ప్రకీర్తితాః.”

అనువచనప్రకారము వాతరోగము, అశ్మరి, కుష్ఠము, మేహము, ఉదరము, భగందరము, అర్శస్సు, గ్రహణి అను నీయెనిమిది రోగంబులును మహారోగములని యెఱుంగునది.

### సంయోగవిరుద్ధములు, అందు అనూపమాంసవిరోధివస్తువులు

అనూపమామిషం మాషక్షౌద్రక్షీరవిరూఢకైః. ౨౯
విరుధ్యతే సహ బిసైః మూలకేన గుడేన వా,
విశేషాత్పయసా మత్స్యా మత్స్యేష్వపి చిలీచిమః. ౩౦

అనూపదేశమునందు జనించిన మహామృగము, వారిచరము, వారిశయము అను జంతువులయొక్క మాంసము మినుములు, తేనె, పాలు, విరూఢకము, తామరతూడు, ముల్లంగి, బెల్లము అను నీయేడిటితో జేరినచో విరోధించును. అనూపదేశమునందు జనించినమాంసములలో మత్స్యము పాలతో జేరినచో మిగుల విరోధించును. ఆమత్స్యములలోను చిలీచిమను మత్స్యము పాలతో జేరినచో అత్యంతముగ విరోధించును. చిలీచిమనుమత్స్యము ఎఱ్ఱని నేత్రములు రక్తవర్ణమయిన గీతలుగలదిగ నుండును. తరుచుగా భూమిలో సంచరించుచుండును. మిక్కుటముగా శ్లేష్మమును జేయును. కాబట్టి చిలీచిమనుమత్స్యమునకును, పాలకును మిక్కిలి విరోధము. ఇటుల పరస్పరము విరుద్ధములగునాహారములను భుజించినచో పైజెప్పిన విస్ఫోటక గుల్మాదిరోగములు జనించును. వానికి చికిత్స చేయబడినయెడల కాలాంతరమునందు ప్రాణములనుకూడ హరింపజేయును.

విరుద్ధమమ్లం పయసా సహ సర్వం ఫలం తథా,
తద్వత్కులత్థవరకకంగువల్లమకుష్ఠకాః ౩౧

పలుదెరంగులైన యమ్లద్రవ్యములు (అనగా ద్రవ్యరూపమయిన కాంజికాది ద్రవ్యములును, ద్రవరహితమయిన పులిచింత మొదలగు ద్రవ్యములును, పాలతో జేరినచో విరోధించును. ఏకకాలమునందు పాలను పుల్లగనుండు వస్తువుతోడ భుజించిన విరోధించునని తెలియజేయునిమిత్తము. ''సహ'' అనుపదము ప్రయోగింపబడినది. అయితే క్షీరశాకమును వ్యంజనమును పుల్లనిమజ్జిగతోడను పాలతోడను జేర్చి పాకము

జేసినచు ఆవ్యంజనము వేరు ద్రవ్యముగ నగుటవలన పరస్పరవిరోధములేదు. ఇత్తైఱంగున నసే ఘృతము, దధి క్షీరాదులవలన పక్వముజేయబడుచున్నది. అచటను ఆఘృతము వేరుద్రవ్యముగ నగుటవలన విరోధం బెద్దియులేదు.

"సర్వం చామ్లం పయసా సహైకధ్యం తదుత్తరం వా విరుద్ధమ్"

అనుఅష్టాంగసంగ్రహవచనప్రమాణమునుపట్టి క్షీరమును పానముచేయునట్టి కాలమునందుగాని, తదుత్తరకాలమునందుగాని ఆమ్లమైనవస్తువును భుజింపజనదని తెలియజేయు నిమిత్తము "సహ" అనుపదము ప్రయోగించబడినది. అక్షోడాది (అనగా గిరుకతాడి) మొదలగుఫలములు పాలతోకూడజేరెనచో విరోధించును.

"ఆమ్రామ్రాతకలకుచ కరమర్ద మోచ దంతశఠ బదర కోశామ్ర భవ్య జాంబవ కపిత్థ తిత్తిడీక పాలేవతాక్షోడ పనస నాళికేర దాడిమామల కాన్యేసంగ్రికారాణి చాన్యాని" మామిడి, అంబాళము, కమ్మరేగు, కలివి, బూరుగు, పులిచించలము, రేగు, కొంచమామిడి, భవ్య, నేరేడుపండు, వెలగ, చింత, ఈడి, గిరుకతాడి, పనస, నారికేళము, దానిమ్మ, ఉసిరికెకాయ అను కొన్ని ఫలములు మాత్రము పాలతో విరోధించునని చరకమునందు జెప్పబడియుండుటచే అక్షోడాదిఫలములు మాత్రమే పాలతో విరోధించునేకాని సమస్తఫలములు పాలతో విరోధించునని చెప్పంజనదు. పై జెప్పిన ఫలములవలెనే ఉలవలు, వరకము (అనగా వరిగెలు) కొఱ్ఱలు, అనుములు, మకుష్ఠకము (అనగా అడవిపెసలు) అను నీరెండు విధములైన శింబీధాన్యవిశేషములు పాలతోజేరినచో విరోధించును. మినుములు, అనుములు అను నీరెండును పాలతో జేరినచో విరోధించును అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

### హారితకాదులకు క్షీరవిరోధము

భక్షయిత్వా హారితకం మూలకాదిపయస్త్యజేత్,

హారితకశాకము, ముల్లంగి, కురేరము మొదలగువానిని భుజించునపుడు పాలను త్యజింపవలయును.

"సాధయేచ్ఛుద్ధశుష్కస్య లశునస్య చతుష్పలమ్"

అనగా వెల్లుల్లితోడ క్షీరప్రయోగము జెప్పబడియుండుచో అగ్న్యాదిసంబంధముచేనది వేరేద్రవ్యముగ నగుటవలన క్షీరమునకును వెల్లుల్లికిని విరోధములేదు.

### వరాహమాంసాది విరోధవస్తువులు

వారాహం శ్వావిధా నాద్యా ద్దధ్నా పృషతకుక్కుటౌ. 3౨
ఆమమాంసాని పిత్తేన మాషసూపేన మూలకమ్,
అవిం కుసుంభశాకేన బిసైస్సహ విరూఢకమ్. 33

మాషసూపగుడ *క్షీరదధ్యాజ్యైర్లాకుచం ఫలమ్,
ఫలం కదళ్యాస్తక్రేణ దధ్నా తాళఫలేన వా. ౩౪
కణోషణాభ్యాం మధునా కాకమాచీం గుడేన వా,
సిద్ధాం వా మత్స్యపచనే పచనే నాగరస్య వా. ౩౫
సిద్ధామన్యత్ర వా పాత్రే †కామాత్రాముషితాం నిశామ్,

ముండ్లపందిమాంసముతోడ పందిమాంసమును, పెరుగుతోడ పృషతము (అనగా దుప్పి) కోడి అనువానిమాంసములను. జంతువులయొక్క పిత్తముతోడ పక్వముగాని మాంసములను, మాషసూపముతోడ ముల్లంగిని, కుసుంభశాకముతోడ మేష (పొట్టేలి) మాంసమును, తామరతూడుతోడ విరూఢకములను, మాషసూపము, బెల్లము, పాలు, పెరుగు, నెయ్యి వీనిలో దేనితోనైనను నిమ్మపండును, తక్రముతోగాని పెరుగుతో గాని తాటిపండుతోగాని అరటిపండును, పిప్పలి మిరియాలు తేనె బెల్లము వీనిలో దేనితోనైనను కాచికూరను గూర్చి భుజింపంజనదు. మత్స్యములనుగాని, లేక శొంఠినిగాని పాకముజేసిన పాత్రములో సిద్ధముజేయబడిన కాకమాచిని, లేక ఇతర పాత్రలో పక్వముజేయబడి యొకరాత్రి పర్యుషితమయిన కాకమాచిని భుజింపంజనదు.

వర్జనియ పిప్పల్యాదులు

మత్స్యనిస్తలనస్నేహసాధితాః పిప్పలీస్త్యజేత్. ౩౬
కాంస్యే దశాహముషితం సర్పిరుష్ణంత్వరుష్కరే,

మత్స్యములను వేయించిన తైలాదిస్నేహద్రవ్యములచేర్చి పక్వముజేయబడిన పిప్పళ్లను భుజింపందగదు. కంచుపాత్రలో పదిదినములుంచబడిన నెయ్యిని త్యజింపవలయును. (అనగా లేపనాగులుకూడ చేయకూడదని భావము.) భల్లాతకవిషయములో ఉష్ణమైనఅన్నపానాదులను త్యజింపవలయును.

"పేయం నోష్ణోపచారేణ" "ఉష్ణముష్ణార్తముష్ణేచ యుక్తం చోష్ణే" "నైవా ద్యాన్నిశి నైవోష్ణం"

అను వచనములచేత మద్యము, తేనె, పెరుగు వీనికి ఉష్ణము విరుద్ధమని యీ తంత్రకారుడు యుక్తిచే నాయాస్థలములయందు నుదహరించియున్నాడు.

"మద్యమధుదధిభల్లాతకేషు చోష్ణమ్"

అనగా మద్యము, తేనె, పెరుగు, భల్లాతకము (జీడిగింజలు) వీనికి ఉష్ణమయిన అన్నపానాదులు విరుద్ధమని అష్టాంగసంగ్రహమునందు స్పష్టముగా జెప్పబడియున్నది.

* క్షౌద్ర ఇతిపా. † తపోతా ఇతిపా.

—◎ శూల్యభాస మాంసాదినిషేధము ◎—

భాసో విరుధ్యతే శూల్యః కంపిల్లస్తక్రసాధితః.		3౭

శూలములో గ్రుచ్చి పక్వముజేయబడిన భాసపక్షిమాంసము విరుద్ధముగునది. అనగా విరోధముజేయును. (అనగా వస్తిని చెరుచునని భావము.) అట్టులనే తక్రముచే పక్వముచేయబడిన కంపిల్లము విరోధముజేయును.

"సౌవీరేణ తిలశష్కులీ, క్షీరేణ లవణం, నవనీతేన శాకం, నవపురాణామామ పక్వం చైకధ్యం, తథా సలిలావగాహస్నానసోష్ణాభిరప్తస్య త్వగ్దృష్ట్యుపఘాతాయ తృష్ణాభివృద్ధయే చ, పయఃపానం రక్తపిత్తాయ, శరీరేణాయస్తస్య సహసాభ్యవహార శ్ఛర్దిషే, గుల్మాయవా, వాచా త్వాయస్తస్య స్వరసాదాయ"

*సౌవీరముతోడ చక్కిలాలను, పాలతోడ లవణమును, నవనీతముతోడ శాకమును, క్రొత్తగ ప్రాతగనుండు పదార్థములు పక్వముగ అపక్వముగనుండుపదార్థము నొకటిగ గూర్చియు నేకకాలమునందు భుజించుట విరుద్ధంబు. ఉష్ణమైన ఎండ మొదలగువానిచే తపింపబడినవాడు తోడనే ఉదకములో అవగాహస్నానమును చేసిన త్వక్కు, నేత్రములు వీనికిచెరుపుకలుగును. దప్పియధికమగును. రక్తపిత్తముగలవాడు క్షీరపానముచేసిన త్వక్కు, నేత్రములు వీనికిచెరుపు; తృష్ణాభివృద్ధి గలుగును. శరీరాయాసముగలవాడు తీవ్రముగ భుజించుటచే వాంతి, గుల్మము గలుగును. సంభాషించుటచే ఆయాసమును జెందినవాడు తీవ్రముగభుజించుటచే స్వరహాని గలుగును. అని యష్టాంగసంగ్రహము నందు జెప్పబడియున్నది.

—◎ పాయసాదులగూర్చిన భోజననిషేధము ◎—

ఐకథ్యం పాయససురాకృసరాణ్ పరివర్జయేత్,

పాయసము, సురయను మద్యము, కృసరము వీని నేకకాలమునందు భుజింపజనదు

—◎ మధుఘృతాదుల సమాంశవిరోధము ◎—

మధుసర్పిర్వసాతైలపానీయాని ద్విశస్త్రిశః.		3౮
ఏకత్ర వా సమాంశాని విరుధ్యంతే పరస్పరమ్,

తేనె, నెయ్యి, వస, తైలము, ఉదకము వీనిలో 2 - టిని గాని (అనగా తేనె, ఘృతము, తేనె వస, తేనెతైలము, తేనెఉదకము అనువానినిగాని) లేక 3 - టిని గాని

* సౌవీరమనగా —యవలపై పొట్టుతీసియుడికించి యందుదకము బోసి పైన మూసి చీలమన్నిచ్చి యొకటి రెండుదినము లుంచఁబడు కలి.

(అనగా తేనె ఘృతము వస, తేనె తైలము వస, తేనె ఉదకము వస, అనువానినిగాని) లేక అన్నిటినిగాని (అనగా తేనె ఘృతము వస తైలము ఉదకము అనువానినిగాని) సమభాగములుగ నొకచో జేర్చినయెడల పరస్పరము విరోధించును. ఇటుల మధుఘృతాదులు సమభాగములుగ జేరుట విరుద్ధమని జెప్పియుండుటచే—

"కుడవం చ పృథగ్ఘృతాత్, తైలాత్సపిప్పలీచూర్ణాత్సిద్ధశీతే చ మాక్షికాత్."
అని అగస్త్యలేహములో తైలఘృతమధువులను సమభాగములుగ జేర్పవలయునని చెప్పియుండుట విరుద్ధమనే శంకగలుగును. అయితే కేవలమధ్వాదులకు సమాంశమయిన ఉపయోగము విరుద్ధమేకాని ద్రవ్యాంతరములతోడ మధ్వాదులను సమాంశములుగ జేర్చియుపయోగించుట విరుద్ధముకాదు. కాబట్టి అగస్త్యలేహములో నితరద్రవ్యములతోడ మధ్వాదులు సమభాగములుగ జేసినను సంస్కారాదులవలన వేరువిధమైన విశేషగుణము గలదిగనగుటచే విరోధంబెద్దియులేదని తెలియవలయును.

భిన్నాంశమధ్వాద్యనుపానవిరోధము

భిన్నాంశే అపి మధ్వాజ్యే దివ్యవార్యనుపానతః. ౩౯
మధుపుష్కరబీజం చ మధుమైరేయశార్కరమ్,
మంథానుపానః క్షైరేయో హారిద్రః కటుతైలవాన్. ౪౦

తేనెను నెయ్యిని సమభాగములుగాక విషమభాగములుగ గూర్చినను దివ్యోదకానుపానముచే నుపయోగించిన విరుద్ధమగును. అనగా వాని నేకకాలమునందు భుజించిన విరోధముజేయునని భావము. తేనె, తామరవిత్తులు అను నీరెంటిని ఏకకాలమునందు భుజించినచో విరోధించును. మధు (అనగా యిచట ద్రాక్షాసవమని యర్థము.) మైరేయము (అనగా ఖర్జూరాసవము.) శార్కరము (అనగా శర్కరతో పక్వముజేయబడిన మద్యము) వీని నేకకాలమునం దుపయోగించినచో విరోధించును. క్షైరేయము (అనగా పాయసము) మంథముతో విరోధించును. ఆవనూనెలో వేయించబడిన హారిద్రశాకము విరోధముజేయును. హారిద్రమను శాకము సర్పచ్ఛత్రముతో తుల్యముగ, పీతవర్ణముగలదిగ నుండును.

బచ్చలికూరకు విరోధము

ఉపోదకాతిసారాయ తిలకల్కేన సాధితా,

నువ్వుల గానుగపిండినిగూర్చి పక్వముజేయబడిన బచ్చలికూర అతిసారమును గల్గించును.

బలాకామాంసవిరోధివస్తువులు

బలాకా వారుణీయుక్తా కుల్మాషైశ్చ విరుధ్యతే. ౮౧
భృష్టా వరాహవసయా సైవ సద్యో నిహంత్యసూన్,

తెల్లకొక్కెరమాంసము వారుణియనుమద్యముతోడను, ముద్దాదికుల్మాషముతోడను విరోధించును. మఱియు తెల్లకొక్కెరమాంసమే పందియొక్కవసచే వేయించబడినచో తోడనే ప్రాణములను హరింపజేయును.

ఏరండతైలసిద్ధతిత్తిర్యాదిమాంసనిషేధము

తద్వత్తిత్తిరిపత్రాఢ్యగోధాలావకపింజలాః. ౮౨
ఐరండేనాగ్నినా సిద్ధాస్తత్తైలేన విమూర్ఛితాః,

తిత్తిరి (అనగా తీతువుపిట్ట) నెమలి, ఉడుము, లావుకపిట్ట, కపింజలము (అనగా డెక్కలయందు చిత్రవర్ణముగల బట్టవన్నెపక్షి) వీనియొక్కమాంసము ఆముదముకట్టెల నిప్పున సిద్ధముజేయబడినను, ఆముదమునుగూర్చి వేయించబడినను, తత్క్షణముననే ప్రాణములను హరింపజేయును.

శూల్య హారీతమాంసనిషేధము

హారీతమాంసం హారిద్రశూలకప్రోతపాచితమ్. ౮౩
హారిద్రవహ్నినా సద్యో వ్యాపాదయతి జీవితమ్,
భస్మపాంసుపరిధ్వస్తం తదేవ చ సమాక్షికమ్. ౮౪

హారీతమనుపక్షి (అనగా పసిరికపిట్ట) మాంసము పసుపునకు సంబంధమైన శూలములో గ్రుచ్చి పసుపునకు సంబంధించిన నిప్పున పాకముచేయబడినచో తత్క్షణముననే ప్రాణములను హరింపజేయును. హారీతమను పక్షియొక్క మాంసము, బూడిదె ధూళి వీనిచే దుష్టమయినను, తేనెతో జేరినను విరోధించును.

"న జాతు కటుతైలేన భృష్టామద్యాదుపోదకామ్,
ప్రియంగుకల్కస్నిగ్ధాంగః పాయసాన్నసమాచరేత్."

కటుతైలముచే (ఆవనూనెచే) వేయించబడిన దుంపబచ్చలిని ఎప్పుడును భుజింపజనదు. ప్రియంగు (అనగా ప్రేంకణ) కల్కముచే అభ్యంజనము జేసికొనినవాడు పాయసమును భుజింపజనదు. అని సిద్ధసారమను గ్రంథమునందు జెప్పబడియున్నది.

విరుద్ధవస్తులక్షణము

యత్కించిద్దోషముత్క్లేశ్య న హరేత్తత్సమాసతః,
విరుద్ధం శుద్ధిరత్రేష్టా శమో వా తద్విరోధిభిః ౮౫

ఏయే అన్నపానౌషధాదులు వాతాదిదోషములను స్వస్థానములోనుండి ప్రకోపింపజేసి వెలిపరచకుండునో అట్టి అన్నపానౌషధాదులన్నియు విరుద్ధములని సంక్షేపముగ దెలిసికొనవలయును. అట్టి విరుద్ధాహారములచే జనించినరోగములయందు వమనవిరేచనాదిరూపమైన శుద్ధిని జేసికొనుట ప్రశస్తంబు. అనగా ప్రకోపించిన దోషములు వమనాదులవలన వెలిపడుటచే నారోగ్యముగలుగునని భావము. పైజెప్పినప్రకారము శుద్ధిజేసికొనిన పిదపకూడ ప్రకోపించినదోషములకును, వానివలన గలిగిన విస్ఫోటాదిరోగములకును విరుద్ధమయిన ఔషధములవలన శమనము జేయించికొనుట ప్రశస్తంబు.

### విరుద్ధాహారమునందు సంస్కారము

ద్రవ్యైస్తైరేవ వా పూర్వం శరీరస్యాభిసంస్కృతిః,

విరుద్ధముగను, ప్రకోపించిన వాతాదిదోషములకు ప్రతిపక్షముగనుండు ద్రవ్యములచే తొలుత శరీరమునకు యే సంస్కారము జెప్పబడినదో ఆ సంస్కారమే విరుద్ధాహారముచే జనించిన వికారమునందును ప్రశస్తంబు అది యెట్లనగా — పిత్తశ్లేష్మమును హరింపజేయునట్టి యౌషధమగు తేనె, కరక్కాయ మొదలగువానిని సర్వదా అభ్యసించుటవలన సంస్కారముగలదేహమునందు పిత్తశ్లేష్మ వికారమును గలుగజేయతగిన విరుద్ధద్రవ్యము ఉపయోగింపబడినను వికారమును గలుగజేయుటయం దసమర్థముగనుండును. ఇటుల జెప్పుటచే విరుద్ధముగనుండు ద్రవ్యముకూడ వికారముచేయుటయం దసమర్థముగనుండునటుల విరుద్ధముగను ప్రకోపించిన వాతాదిదోషములకు ప్రతిపక్షగుణముగలదిగనుండు ద్రవ్యముచే దేహమునకు దారుఢ్యమును గలుగజేయవలయునని భావంబగుచున్నది.

### రోగోత్పత్తికి కారణముకాని విరుద్ధాహారము

వ్యాయామస్నిగ్ధదీప్తాగ్నివయఃస్థబలశాలినామ్. ౪౯
విరోధ్యపి న పీడాయై సాత్మ్యమల్పం చ భోజనమ్,

వ్యాయామము జేయువారు తరుణమైన వయస్సునందుండువారు, మిగుల బలిష్ఠులు, అగ్నిదీపనము, శుక్రవృద్ధిగలవారు వీరలకు విరుద్ధమయిన యాహారముకూడ రోగోత్పత్తికి కారణము కానోపదు. మఱియు నభ్యాసమువలన దేహమునకు సాత్మ్యముగా (అనగా అనుకూలముగా) నుండునట్టివిరుద్ధమైన యాహారగును, స్వల్పమాత్రగా భుజింపబడిన విరుద్ధమయిన యాహారమును, రోగోత్పత్తికి కారణములుగ కానేరవు.

## అపథ్యత్యాగక్రమము

పాదేనాపథ్యమభ్యస్తం పాదపాదేన వా త్యజేత్. ౪౭

అపథ్యకరమైనయన్నపానాదులను, అపథ్యకరమైన లంఘన ప్లవన జాగరణ స్వప్నాదివిహారములను అభ్యసించియుండు పక్షములో వానిని చతుర్థాంశముగ త్యజించవలయును. ఏలననగా — అపథ్యకరమైనయన్నాదులు అభ్యాసమువలన తత్కాలమునందు శరీరమున కనుకూలముగనుండినను ఉత్తరకాలమునందు దోషములకే కారణంబగును. అభ్యాసముచే ననుకూలముగనుండునట్టి యపథ్యకరమయిన అన్నాదులను చతుర్థాంశముగా త్యజించుకాలమునందు అగ్నిమాంద్యాదులవలన శరీరమునందు బాధగలుగుపక్షములో చతుర్థాంశములోను చతుర్థాంశముగా (అనగా పదునారవ భాగముగా) త్యజించవలయును.

## పథ్యసేవనక్రమము

నిషేవేత హితం తద్వ దేకద్విత్ర్యంతరీకృతమ్,

హితకరమైన యన్నాదులను చతుర్థాంశముగగాని, లేక షోడశాంశముగగాని, ఒకటిలేక రెండులేక మూఁడు అన్నకాలమునువదలి సేవించవలయును. ఇక చతుర్థాంశక్రమంబెట్లనగా —

అభ్యసించబడిన యపథ్యకరమైన పాటలధాన్యములో (అనగా ఎఱ్ఱనివడ్లలో) నాల్గవభాగమును త్యజించి, అభ్యసించబడనవియును, పథ్యకరంబైనవియునైన ఎఱ్ఱరాజనాలు మొదలగువానిలో నాల్గవ భాగమును జేర్చికొని ఒక అన్నమునందు భోజనము చేయవలయును. ఇటులజేసినచో అభ్యసించబడిన అపథ్యకరమైన యాహారములో నాల్గవ భాగమును వదలి అభ్యసించబడని పథ్యకరమైన యాహారములో నాల్గవ భాగమును సేవించినట్టు లగుచున్నది. రెండవ అన్నకాలమునందు పూర్తిగా నపథ్యకరమైన యాహారాదులనే జేర్చికొనవలయును. ఇటులజేసినచో నొక అన్నకాలముచే పథ్యకరమయిన యన్నములో నాల్గవభాగమునకు వ్యవధానము గలుగచేయుబడినటుల యగుచున్నది. మూడవ అన్నకాలమునందు అభ్యసించబడిన అపథ్యకరమయిన యన్నాదులలో అర్ధభాగమునువదలి అభ్యసించబడని పథ్యకరమయిన యాహారములో నర్ధభాగమునుజేర్చికొని భుజింపవలయును. నాల్గు ఐదు అన్నకాలములయందు పూర్తిగానపథ్యకరమయిన యాహారములనే భుజించవలయును. ఇటులజేసినచో రెండు అన్నకాలములచే పథ్యముయొక్క అర్ధ భాగముతో గూడియుండు అపథ్యముయొక్క అర్ధ భాగమునకు వ్యవధానము గలుగజేసినటుల యగుచున్నది. ఆరవ అన్నకాలమునందు అభ్య

సించబడిన అపథ్యమయిన యన్నాదులలో అర్థ భాగమును, అభ్యసించబడని పథ్యకరమయిన యన్నాదులలో $\frac{3}{4}$ భాగముచేర్చికొని భుజించి 7, 8, 9, అనుసీ అన్నకాలములయందు పూర్తిగా పథ్యకరమయిన యాహారములనే భుజింపవలయును. ఇటుల జేసినచో 3 అన్నకాలములచే అపథ్యమయిన యన్నాదులకు వ్యవధానము గలుగజేయబడినటుల యగుచున్నది. 10 వ అన్నకాలమునందు పూర్తిగా పథ్యకరములైన యాహారములనే భుజించవలయును. ఇట్లైతెంగున పాదాంశముగా అపథ్యత్యాగ పథ్యసేవన క్రమము నెఱుంగవలయును.

ఈ ప్రకారమే 16 లో నొక భాగముగా అపథ్యకరమయిన యాహారములను త్యజించి 16 లో నొకభాగముగా పథ్యకరమయిన యాహారములను సేవించవలయును.

ఇక షోడశాంశక్రమం బెట్లనగా —అభ్యసింపబడిన అపథ్యకరమయిన యవకాదులలో (అనగా కారుమినుములు, ఆలచందలు మొదలగువానిలో) 16 లో నొక భాగమునువదలి అభ్యసించబడని పథ్యకరమయిన శాల్యాదులలో (అనగా ఎఱ్ఱరాజనాలు మొదలగువానిలో) 16 లో నొకభాగమును గ్రహించి సంపూర్ణముగా భుజించవలయును. అటుల జేసినచో అభ్యసింపబడిన అపథ్యకరమయిన యాహారాదులు 16 లో నొకభాగముగా త్యజింపబడినట్టును, అభ్యసింపబడని పథ్యకరమయిన యాహారాదులు 16 లో నొకభాగముగా సేవింపబడినట్టును అగుచున్నది.

2 వ అన్నకాలమునందు పూర్తిగా సపథ్యకరమయిన యాహారములనే సేవింపవలయును. ఇటుల జేసినచో ఒక అన్నకాలములచే అపథ్యములో 16 వ భాగమునకు వ్యవధానము గలుగజేసినటుల నగుచున్నది. 3 వ అన్నకాలమునందు అభ్యసింపబడిన అపథ్యకరమయిన యాహారములో 16 లో 2 భాగములను త్యజించి అభ్యసింపబడని పథ్యకరమయిన యాహారములో 16 లో 2 భాగములను గ్రహించి పూర్తిగా భుజించవలయును. 4, 5 అన్నకాలములయందు పూర్తిగా నపథ్యకరమయిన యాహారములనే భుజింపవలయును. ఇటుల జేసినచో 2 అన్నకాలములచే అపథ్యకరమయిన యాహారము యొక్క $\frac{1}{2}$ భాగమునకు వ్యవధానము గలుగజేసినటుల నగుచున్నది.

6 వ అన్నకాలమునందు అభ్యసించబడని పథ్యకరమయిన యాహారములో 16 లో 3 భాగములను, అభ్యసింపబడిన అపథ్యకరమయిన యాహారములో 13 భాగములను జేర్చి భుజింపవలయును. 7, 8, 9 అనుసీ అన్నకాలములయందు పూర్తిగా నపథ్యకరమయిన యాహారమునే భుజించవలయును. ఇటుల జేసినచో 3 అన్నకాలములచే అపథ్యమునకు వ్యవధానము గలుగజేసినటుల యగుచున్నది. 10 వ అన్నకాలములో అభ్యసింపబడని పథ్యకరమయిన యాహారములో 4 భాగములను, అభ్యసింపబడిన

అపథ్యకరమయిన యాహారములో 4 భాగములను, అభ్యసింపబడిన అపథ్యకరమయిన యాహారములో 12 భాగములు జేర్చి భుజింపవలయును. 11 వ అన్నకాలము పూర్తిగా నపథ్యకరమైన యాహారములను భుజింపవలయును. ఈ ప్రకారము షోడశాంశక్రమము ముగియువరకు పైజెప్పిన చతుర్థాంశ ప్రకారము 1, 2, 3, అనుని యన్నకాలములను ఎదలి భుజించవలయును. ఇట్లగుచు పాదాంశక్రమము సంగ్రహముగా జెప్పబడినది. పైజెప్పిన క్రమప్రకారము త్యజించబడినట్టియు, అభ్యసింపబడినట్టియు పథ్యాపథ్యకరమైన యాహారములు ఉపద్రవకారకాలేరవు; స్వల్పస్వల్పముగా నభ్యసింపబడిన పథ్యాహారగుణములు స్థిరములుగ నిలుచును.

## పథ్యాపథ్యస్వీకారత్యాగ దోషము

అపథ్యమపిహిత్యక్తం శీలితం పథ్యమేవ వా. ౪౮
సాత్మ్యాసాత్మ్యవికారాయ జాయతే సహసాన్యథా,

పైజెప్పినక్రమము నాలోచింపక పూర్వోక్తవిధి నతిక్రమించి క్షణమున నభ్యసింపబడిన అపథ్యమును వదలినను, లేక అభ్యసింపబడని పథ్యము నాచరించినను సాత్మ్యాసాత్మ్యములవలన శరీరమునందు రోగములు గలుగును.

క్రమేణాపచితా దోషాః క్రమేణోపచితా గుణాః. ౪౯
* నాప్నువంతి పునర్భావమప్రకంప్యా భవంతి చ,

అపథ్యాభ్యాసముచే జనించినదోషములు పైజెప్పియుండునట్టి క్రమము నాచరించుటచే క్షీణదశనుజెంది మరల జనింపకుండును అటులనే పథ్యోపయోగముచే జనించినగుణములు పూర్వోక్త శ్లోకమునందు జెప్పియుండునట్టి క్రమము నాచరించుటచే వృద్ధిజెంది పురుషులయందు స్థిరములుగ నిలుచును.

## అహితాహార నిషేధము

అత్యంతసన్నిధానానాం దోషాణాం దూషణాత్మనామ్ ౫౦
అహితైర్దూషణం భూయో న విద్వాన్ కర్తుమర్హతి,

మిగుల సమీపమునందుండునవియును, దూషణస్వభావము గలవియునైన వాతాదిదోషములను అహితకరమయిన యాహారాదులచే బుద్ధిమంతుడగువాడు మరలదోషమును గలుగజేయంజనదు. (అనగా బుద్ధిమంతుడగువాడు వాతాదిదోషములను దూషించునట్టి అహితకరమయిన యాహారసేవనమును త్యజింపజేయవలయునని భావము.)

## ఆహారాదులచే శరీరధారణము

ఆహారశయనబ్రహ్మచర్యైర్యుక్త్యా ప్రయోజితైః. ౫౧

* సతాంయాంత్యపునర్భావ ఇతి పా.

శరీరం ధార్యతే నిత్యమగారమివ ధారణైః.

శాస్త్రమునందు జెప్పిన యుక్తిప్రకారము ప్రయోగించబడిన ఆహారము శయనము (అనగా నిద్ర,) బ్రహ్మచర్యము (అనగా జితేంద్రియత్వము), అనునవి "స్తంభములు గృహము నెల్లపుడు ధరించుచుండుభంగి" శరీరమును ధరించుచుండును.

ఆహారో వర్ణిత స్తత్ర తత్ర తత్ర చ వక్ష్యతే ౫౨

పైజెప్పిన ఆహారశయనబ్రహ్మచర్యములలో ఆహారక్రమము ఋతుచర్యాధ్యాయమునందును. ద్రవద్రవ్యాధ్యాయమునందును, అన్నస్వరూప విజ్ఞానీయాధ్యాయమునందును జెప్పబడియున్నది. మఱియు నీతంత్రకారుడు జ్వరచికిత్స మొదలగు స్థలములయందును జెప్పబోవుచున్నాడు.

### నిద్రాప్రభావము

నిద్రాయత్తం సుఖం దుఃఖం పుష్టిః కార్శ్యం బలాబలం,
వృషతా క్లీబతా జ్ఞానమజ్ఞానం జీవితం న చ ౫౩

ఆరోగ్యము, రోగము, శరీరపుష్టి, కృశత్వము, బలము, బలము లేకుండుట, పుంస్త్వము, నపుంసకత్వము, జ్ఞానము అజ్ఞానము, మరణము, ఇవియన్నియు, నిద్రాధీనంబుగనుండును.

### దుష్టనిద్రాగుణము

అకాలేఽతిప్రసంగాచ్చ న చ నిద్రా నిషేవితా,
సుఖాయుషీ పరాకుర్యాత్కాలరాత్రిరివాపరా ౫౪

అకాలములో సేవింపబడినదియును, అధికముగను, అతిస్వల్పముగను, సేవింపబడినదియునైన నిద్ర మనుజులయొక్క ఆరోగ్యమును, ఆయువును, కాలరాత్రివలెనే నశింపజేయును.

### జాగరణగుణము

రాత్రౌ జాగరణం రూక్షం స్నిగ్ధం ప్రస్వపనం దివా,
అరూక్షమనభిష్యంది త్వాసీనప్రచలాయితమ్. ౫౫

రాత్రులయందును నిదురమేల్కాంచియున్నచో శరీరమును రూక్షముగ జేయును. పగటియందును నిదురించినయెడ శరీరము మిగుల స్నిగ్ధమగును. కూర్చుండి కూరుకుపాట్లు పడుట రూక్షకరమయినది కాదు. అధిక కఫమును పోగొట్టును.

"రాత్రౌజాగారణం రూక్షం" అను పైశ్లోకములో అపిశబ్దము లేకుండినను "రాత్రావపిజాగరణంరూక్షం" అని అపిశబ్దము అర్థబలముచేతనే సిద్ధించును. అపిశబ్దములేకనే అర్థముజేసినచో జాగరణము రాత్రియందుమాత్రమే రూక్షకరమనియును, మధ్యా

హ్నమునందు స్నిగ్ధకరమనియును, నిద్ర మధ్యాహ్నమునందుమాత్రము స్నిగ్ధకరమని యును, రాత్రియందు రూక్షకరమనియు నర్థంబగును. అటుల నర్థము జేయుపక్షములో—

"బహుమేదఃకఫాఃస్వప్యుః, గ్రీష్మే వాయుచయాదాన"

అని యీక్రిందజెప్పబడు శ్లోకార్థములకు విరోధించును. కాబట్టి అపిశబ్దములేకపోయినను అపిశబ్దమును జేర్చుకొనియే అర్థము చేయవలయును.

దివాస్వప్నగుణదోషములు

గ్రీష్మే వాయుచయాదానరౌక్ష్యరాత్ర్యల్పభావతః,
దివాస్వప్నో హితోఽన్యస్మిన్ కఫపిత్తకరో హి సః. ౫౬
ముక్త్వా తు భాష్యయానాధ్వ మద్యస్త్రీభారకర్మభిః,
క్రోధశోకభయైః క్లాంతాన్ శ్వాసహిధ్మాతిసారిణః. ౫౭
వృద్ధబాలాబలక్షీణక్షతతృట్శూలపీడితాన్,
అజీర్ణాభిహతోన్మత్తాన్ దివాస్వప్నోచితానపి. ౫౮
ధాతుసామ్యం తథాహ్యేషాం శ్లేష్మా చాంగాని పుష్యతి,

గ్రీష్మకాలములో వాతవృద్ధియును, ఆదానకాల స్వభావమయిన అధికరౌక్ష్యమును, నిద్రకు చాలకుండెడి స్వల్పమయినరాత్రియును గలిగియుండుటవలన పగటినిద్ర హితకరమగునది. సంభాషణము, అశ్వాదివాహనారోహణము, మార్గసంచారము మద్యపానము, స్త్రీసంభోగము, భారమునుమోయుట, ఆయాసకరమైనపనులు, కోపము, శోకము, భయము వీనిచే శ్రమనుజెందినవారు, శ్వాసము, హిధ్మ, అతిసారము రోగములుగలవారు, వృద్ధులు, బాలురు, దుర్బలులు, ధాతుక్షయము, కత్తి మొదలగువాని దెబ్బ, దప్పి, శూల, వీనిచే పీడింపబడినవారు, అజీర్ణముగలవారు, కఱ్ఱచే నభిఘాతము జెందినవారు, ఉన్మాదముగలవారు, మధ్యాహ్నమునందు నిద్రాభ్యాసముగలవారు, వీరలు తప్ప నితరులు గ్రీష్మకాలమునకంటె నితరకాలములయందు పగటినిద్ర నాచరించినచో అట్టివారికి కఫపిత్తములు వృద్ధిజెందును. పగటినిద్ర పైజెప్పిన సంభాషణాదులచే బడలికను జెందినవారికి ధాతుసామ్యమును గలుగజేయును. పగటినిద్రచే కఫము వృద్ధిజెందినను పైజెప్పిన సంభాషణాదులచే బడలికనుజెందినవారికి పగటినిద్ర శరీరమునకు పుష్టినిగలుగజేయును. మఱియు సంభాషణాదులచే బడలికనుజెందినవారికి వాతము వృద్ధిజెందకుండుటకును, శ్వాసాదిరోగపీడితులకు వానియొక్క వేగము తెలియకుండుటకును, వృద్ధాదులకు వారి తృప్త్యర్థంబును, అజీర్ణము పగటినిద్రాభ్యాసము ఇవి గలవారలకు —

"ఉచితో హి దివాస్వప్నో యేషాన్నిత్యం శరీరిణామ్,
వాతాదయః ప్రకుప్యంతి తేషామస్వపతాం దివా."

అని జెప్పియుండు ప్రకారము ధాతువైషమ్య పరిహారార్థంబును, పగటినిద్ర తంత్రకారులచే నంగీకరింపబడియున్నది. పగటినిద్ర అజీర్ణులకు హితకరమని యీశ్లోకములో జెప్పబడియున్నది. అయితే పగటినిద్రవలన కఫవృద్ధియు, దానివలన అగ్నిమాంద్యమునుగలుగును. అగ్నిమాంద్యమువలన భుజించినయన్నము పక్వముకాక అజీర్ణమును జెందును, కాబట్టి అజీర్ణులకు పగటినిద్ర అహితకరమయినదిగనుండగా హితకరమైనదని చెప్పియుండుట అసంగతమనే శంక గలుగును. అయితే అజీర్ణులకు పగటినిద్రచే ధాతుసామ్యమును, దానివలన తమతమస్థానములయందుండు వాతాదిదోషములచే జాఠరాగ్నికి జీర్ణమయినయన్నాదులను పాకముచేయునట్టి సామర్థ్యంబును గలుగును. కఫము వృద్ధిజెందినను అగ్నిమాంద్యమును గలుగజేయక విశేషముగా శరీరపుష్టినే గలుగజేయుచుండును. కావున,—

"ధాతుసామ్యం తథా హ్యేషాం శ్లేష్మా చాంగాని పుష్యతి"

అను శ్లోకమునుబట్టి కఫము ధాతుసామ్యమును, శరీరపుష్టిని గలుగజేయునని యీతంత్రకారుడు జెప్పియుండుటచే నట్టి శంక యుక్తియుక్తము కాదని తెలియవలయును.

"సర్వ ఏతే దివాస్వప్నం సేవేరన్ సార్వకాలికమ్"

పైజెప్పిన అజీర్ణాదులుగలవారందరు సర్వకాలములయందు పగటినిద్రను సేవింపదగునని, అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

### దివాస్వాపాద్యనర్హులు.

బహుమేదఃకఫాః స్వప్యుః స్నేహనిత్యాశ్చనాహని. ౭౯
విషార్తఃకంఠరోగీచ నైవజాతునిశాస్వపి,

అధికమయిన మేదస్సు, కఫము గలవారును, స్నిగ్ధమైన యాహారమును సేవించువారును, గ్రీష్మకాలమునందు మధ్యాహ్నమునందు నిద్రింపజనదు. విషపీడితుడు కంఠరోగి వీరలు రాత్రులయందెపుడును నిద్రింపజనదు.

### అకాలనిద్రాజనితరోగములు

అకాలశయనాన్మోహజ్వర స్తైమిత్యపీనసాః. ౮౦
శిరోరుక్శోఫహృల్లాసస్రోతోరోధాగ్నిమందతాః,

అకాలనిద్రవలన మోహము, జ్వరము, ఆలస్యము, పీనస, శిరోరోగము, వాపు, హృల్లాసము, స్రోతఃప్రతిబంధము అగ్నిమాంద్యము గలుగును.

### అకాలనిద్రాజనితరోగచికిత్స

తత్రోపవాసవమనస్వేదనావన మౌషధమ్ ౮౧
యోజయేదతినిద్రాయాం తీక్ష్ణం ప్రచ్ఛర్దనాంజనం,

నావనం లంఘనం చింతాం వ్యవాయం శోకభీక్రుధః. ౬౨
ఏభిరేవ చ నిద్రాయా నాశః శ్లేష్మాతిసంక్షయాత్,

పైజెప్పిన అకాలనిద్రచే జనించిన రోగములయందు ఉపవాసము జేయింపవలయును. మఱియు వమనస్వేదన, నస్యౌషధములను ప్రయోగింపవలయును.

“లోకాదిసర్గప్రభవా తమోమూలా తమోమయీ,
బాహుళ్యాత్తమసో రాత్రౌ నిద్రా ప్రాయేణ జాయతే.”

అను వచనముచేత నిద్రకు తఱుచుగ రాత్రియేయుక్తమైన కాలము. అతినిద్ర, యందు తీక్ష్ణమైనవమన, అంజన, నస్యౌషధములను, లంఘనము, చింత, మైథునము శోకము, భయము, కోపము మొదలగువానిని ప్రయోగింపవలయును అటులజేసినచో శ్లేష్మధాతువు మిగులక్షయించి నిద్రానాశముగలుగును.

### నిద్రాభంగ జనిత రోగములు

నిద్రానాశాదంగమర్దశిరోగౌరవజృంభికాః. ౬౩
జాడ్యం గ్లానిభ్రమాపక్తితంద్రారోగాశ్చ వాతజా,

నిద్రాభంగమువలన ఒడలునొప్పి, తలబరువు, ఆవలింత, కార్యములయందశక్తి, బడలిక, భ్రమ, అజీర్ణము, సోమరితనము, వాతరోగములు గలుగును.

“కఫోల్పో వాయునోద్భూతో ధమనీః సన్నిరుధ్య చ.
కుర్యాత్సంజ్ఞాపహాం తంద్రాం దారుణీం మోహకారిణీమ్.”

అల్పముగనుండుకఫము వాతముచే స్వస్థానములోనుండి చలింపజేయబడి స్రోతోమార్గముల నడ్డగించి ప్రజ్ఞను పోగొట్టతగినదియును, మోహమును గలుగజేయతగినదియును, దారుణమైనదియు నగు తంద్రను గలుగజేయునని కొన్ని గ్రంథములయం దధిక పాఠము గన్పట్టుచున్నది.

### నిద్రాసేవన క్రమము

యథాకాలమతోనిద్రాం రాత్రౌ సేవేత సాత్మ్యతః.
అసాత్మ్యాజ్జాగరాదర్ధం ప్రాతస్స్వప్యాదభుక్తవాన్,

కాబట్టి కాలమునతిక్రమింపక సాత్మ్యముగా రెండుమూడు యామములు రాత్రులయందు నిద్రింపవలయును అ.సాత్మ్యమువలన రాత్రులయందు జాగరణముగలుగు పక్షములో తాను నిదురమేల్కొంచియున్న కాలమునం దర్ధకాలము ప్రాతఃకాలమునందు భుజింపకయే నిద్రింపవలయును.అనగా రాత్రులయం దభ్యాసముగా నిద్రించుకాలములో నెవడు ఎంతకాలమువరకు జాగరణము చేయుచుండెనో అట్టిజాగరణకాలములో అర్ధకాలము ప్రాతఃకాలమునందు భుజింపకయే నిద్రింపవలయుననిభావము.

### మంద నిద్రోపచారము

శీలయేన్మందనిద్రస్తు క్షీరమద్యరసాన్ దధి ౬౫
అభ్యంగోద్వర్తనస్నాన మూర్ధకర్ణాక్షితర్పణం,
కాంతాబహులతాశ్లేషో నిర్వృతిః కృతకృత్యతా. ౬౬
మనోనుకూలా విషయాః కామం నిద్రాసుఖప్రదాః,
బ్రహ్మచర్యరతేర్గ్రామ్య సుఖనిస్పృహచేతసః ౬౭
నిద్రాసంతోషతృప్తస్య స్వం కాలం నాతివర్తతే,

స్వల్పముగ నిద్రించువారు బాగుగా నిద్రగలుగు నిమిత్తము క్షీరము, మద్యము, మాంసరసము, పెరుగు, వీనిని పానముచేయవలయును. మఱియునభ్యంగము, ఉద్వర్తనము, స్నానము మొదలగువానిని, శిరము, కర్ణములు, నేత్రములు వీనికి తృప్తిగలుగునట్టి తర్పణక్రియలను చేయవలయును. ప్రియురాలగు స్త్రీలచే నాలింగనము, మనస్సంతోషము, యత్నకార్యములు నెరవేర్చుట, మనస్సుకనుకూలమైన విషయములు, ఇవి నిద్రాసుఖమును గలుగజేయును. జితేంద్రియత్వము, మైథునమునందాశలేమి, మనస్సంతోషమువలన తృప్తిజెందియుండుట, ఇవి గలవానికి నిద్రయుక్తమైనకాలము నతిక్రమించకయే కలుగును. నిద్రాసుఖమునకు ఆలింగనముమాత్రము కారణమే కాని మైథునము కారణముకానేరదని తెలియపరచునిమిత్తము "కాంతాబాహులతాశ్లేషః" అని జెప్పబడినది. అట్లగుటచేతనే ఉత్తరశ్లోకములో జితేంద్రియుడుగ, మైథునేచ్ఛారహితుడుగ నుండువానికి యుక్తకాలమునందు నిద్రవచ్చునని జెప్పబడియున్నది.

### మైథున వర్జనీయములు

గ్రామ్యధర్మే త్యజేన్నారీ మనుత్తానాం రజస్వలామ్. ౬౮
అప్రియామప్రియాచారాం దుష్టసంకీర్ణమేహనాం,
అతిస్థూలకృశాం సూతాం గర్భిణీమన్యయోషితమ్. ౬౯
వర్ణినీమన్యయోనిం చ గురుదేవనృపాలయం,
చైత్యశ్మశానాయతనచత్వరాంబుచతుష్పథమ్. ౭౦
పర్వాణ్యనంగం దివసం శిరోహృదయతాడనం,
అత్యాశితోఽధృతిః క్షుద్వాన్ దుఃస్థితాంగః పిపాసితః ౭౧
బాలో వృద్ధోన్యవేగార్తస్త్యజేద్రోగీచ మైథునం,

అనుత్తానముగనుండు స్త్రీని (అనగా వెల్లవెలికిలపరుండకుండు స్త్రీని, రజస్వలగ, అప్రియురాలుగ, దుష్టమైన నడతలు గలదిగ, దుష్టమైనవ్యాధి, మలాదులచే సంకోచమును జెందియుండునట్టి యోని గలదిగ, అతిస్థూలముగ, అతికృశముగ, ప్రసవించినదిగ

గర్భిణిగ, ఇతరునిభార్యగ, బ్రహ్మచారిగనుండుస్త్రీని, ఆడుమేక, దున్నపోతు మొదలగు వానియొక్క యోనిని మైథునకృత్యమునందు వర్జింపవలయును. గురువు, దేవతలు, రాజులు వీరిగృహమునందును, చైత్యము (అనగా దేవాలయము) శ్మశానము, శిక్షా స్థానము, నలుత్రోవలుకలసినత్రోవ, ఉదకము, మండపము, అను నీస్థానములయందును, సూర్యసంక్రాంతి మొదలైనదినములయందును మధ్యాహ్నమునందును స్త్రీసంగమము జేయం జనదు. అటులనే జఘనము (అనగా స్త్రీలపిఱుదులు) ముఖాద్యంగములు వీనియందును మైథునము చేయంజనదు. సురతకాలమునందు శిరము, హృదయము నీనియందుఘాతము జేయంజనదు. అధికముగా భుజించినవాడు, సంతోషరహితుడు, విశేషముగ నాకలిగల వాడు, విషమముగ నంగములను నుంచుకొనియుండు వాడు, దప్పిగలవాడు, బాలుడు, వృద్ధుడు, మలమూత్రముల నడ్డగించియుండువాడు, రోగి వీరు మైథునమును వర్జింప వలయును.

## స్త్రీసంయోగ నియమము

సేవేత కామతః కామం తృప్తో వాజీకృతాం హి మే. ౭౨
త్ర్యహాద్వసంతశరదోః పక్షాద్వర్షానిదాఘయోః,

పురుషుడు వాజీకరణమువలన విశేషముగా తృప్తిజెందినవాడై యథేచ్ఛగా హేమంత శిశిర ఋతువులయందు కామమును సేవింపవచ్చును. వసంత శరదృతువులయందు మూడుదినముల కొకమారును, వర్షాగ్రీష్మ ఋతువులయందు పదునైదుదినముల కొక మారును మైథునమునందు ప్రవర్తింపవలయును.

## విధివిరుద్ధ స్త్రీసంయోగజనిత రోగములు

* భ్రమక్లమోరుదౌర్బల్య బలధాత్వింద్రియక్షయః ౭౩
అపర్వమరణం చ స్యా దన్యథా గచ్ఛతః స్త్రియం,

పైజెప్పిన విధి నతిక్రమించి వేరువిధముగా స్త్రీసంభోగముచేయువారికి భ్రమము, బడలిక, తొడలయందు దౌర్బల్యము, బలక్షయము, ధాతుక్షయము, ఇంద్రియదౌర్బ ల్యము, అకాలమరణముగలుగును.

## విధ్యనుసార సేవిత స్త్రీసంగము ఫలము

స్మృతిమేధాయురారోగ్య పుష్టింద్రియయశోబలైః,
అధికా మందజరసో భవంతి స్త్రీషుసంయతాః. ౭౪

స్త్రీసంయోగమునందు నియమమననుసరించి జాగ్రతగా ప్రవర్తించువారు అధిక ముగ స్మృతి, బుద్ధి, ఆయుస్సు, ఆరోగ్యము, శరీరపుష్టి, ఇంద్రియపటుత్వము, యశస్సు బలము గలవారుగను, స్వల్పముగా ముసలితనముగలవారుగను నగుదురు.

---

* శ్రమ ఇతిపా.

"న హ్యూనే షోడశాద్వర్షా త్సప్తతేః పరతో న చ,
ఆయుష్కామో నరః స్త్రీభిస్సంయోగం కర్తుమర్హతి."

దీర్ఘాయువునిచ్ఛయించు పురుషుడు పదునారు సంవత్సరములకు మునుపును, డెబ్బది సంవత్సరములకు పిదపను స్త్రీసంయోగముచేయఁజనదని అష్టాంగసంగ్రహము నందు వయోభేదము ననుసరించి సంభోగనిషేధము చెప్పబడియున్నది.

### సురతాంతోపచారము

స్నానానులేపనహిమానిలఖండఖాద్య
శీతాంబుదుగ్ధరసయూషసురాప్రసన్నాః,
సేవేత చానుశయనం విరతౌ రతస్య
తస్యైవమాశువపుషః పునరేతి ధామ. ౭౫

సురతాంతమునందు స్నానము, చందనానులేపనము, శీతవాతము, ఖండశర్కరచే చేయబడినభక్ష్యములు, మిక్కిలి శీతలముగనుండు యుదకము, పాలు, మాంసరసము, పెసలు మొదలగువానికట్టు, సురయను మద్యము, ప్రసన్నమను మద్యము, ఉత్తరకాలమునందే నిద్ర వీనిని యుక్తప్రకారము సేవింపవలయును. అటుల సేవించువానికి శీఘ్రముగానే శరీరమునందు తేజస్సు మరల గలుగును. ఈ యర్థమే —

"స్నానాంగరాగవ్యజనేందుపాదయూషాసవక్షీరరసాన్ రసాలమ్,
భక్ష్యాన్ సితాఢ్యాన్ సలిలం సుశీతం సేవేత నిద్రాం చ రతాన్తతాన్తః."

అను వచనముచే గ్రంథాంతరమునందుగూడ చెప్పబడియున్నది.

### రాజు శరీరరక్షణమును వైద్యునియందుంచవలయు ననుట

శ్రుతచరితసమృద్ధే కర్మదక్షే దయాళౌ
భిషజి నిరనుబంధం దేహరక్షాం నివేశ్య,
భవతి విపులతేజస్స్వాస్థ్యకీర్తిప్రభావ
స్స్వకుశలఫలభోగీ భూమిపాలశ్చిరాయుః.

శాస్త్రజ్ఞానము, ఆచారము వీనిచే సంపూర్ణుడుగ, క్రియలయందు మిగులసమర్థుడుగ, దయావంతుడుగనుండు వైద్యునియందు రాజు తనశరీరసంరక్షణభారమును సందేహములేకుండ నునిచినచో వానికి అధికమైన తేజస్సు, ఆరోగ్యము, కీర్తి, ప్రభావము, దీర్ఘాయువు, విశేషభోగానుభవము గలుగును.

సప్తమాధ్యాయము ముగిసెను.

# అష్టమాధ్యాయము

అవ. అన్నపానాదులు విషాదులచే రక్షింపబడినను మాత్రాహీనముగ(యుక్తమైన పరిమాణము ననుసరింపక) భుజింపబడినచో మరణమునకు కారణంబగును. మాత్రానుగుణముగ భుజింపబడినచో ప్రాణులకు ప్రాణాధారముగ నుండును. కాబట్టి అన్నరక్షాధ్యాయానంతరము మాత్రాశితీధ్యాయము చెప్పబడుచున్నది.

మాత్రాశితీయాధ్యాయప్రారంభము

సూ. అథాతో మాత్రాశితీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః

అన్నరక్షాధ్యాయానంతరము మాత్రాహారము (పరిమితిననుసరించి భుజించుట) ప్రాణాధారమగుటచే మాత్రాహారమును బోధింపనట్టి మాత్రాశితీయాధ్యాయమును వివరించెదము.

మాత్రాహారనియమము

మాత్రాశీ సర్వకాలం స్యాన్మాత్రాహ్యగ్నేః ప్రవర్తికా,
మాత్రాం ద్రవ్యాణ్యపేక్షంతే గురూణ్యపి లఘూన్యపి. ౧

"అగ్నిమూలం బలం పుంసాం బలమూలం హి జీవితమ్"

అనగా బలమునకు జాఠరాగ్నియు, జీవితమునకు బలమును మూలముగానుండునసెడి వచనప్రకారము శరీరధారణమునకు హేతువుగనుండు జాఠరాగ్ని ప్రవృత్తికి మాత్ర మూలముగనుండుటవలనను, పిష్టము, క్షీరము, ద్రాక్ష, ఆక్షోటము, చెఱకు, మినుములు, అనూపమాంసము మొదలగు గురుకరద్రవ్యములును, దివ్యోదకము, రక్తశాలి, షష్టికము, పెసలు, లావుకపిట్ట, కపింజలము (అనగా ఱెక్కలయందు చిత్రవర్ణముగల బట్టవన్నెపక్షి) నల్లనియిఱ్ఱి, చెవులపిల్లి, ఎఱ్ఱజంకపోతు మొదలగు లఘుకరద్రవ్యములునుమాత్ర నపేక్షించుచుండుటవలనను, ఎల్లప్పుడు స్వస్థుడుగగాని, లేక రోగిగగాని యుండువాడు (శాస్త్రోక్తప్రమాణము) మితముగా నాహారమును సేవింపవలయును.

మాత్రాలక్షణము

గురూణామర్ధసౌహిత్యం లఘూనాం నాతితృప్తతా,
మాత్రా ప్రమాణాం నిర్దిష్టం సుఖం యావద్ధి జీర్యతి. ౨

గురువుగ నుండుద్రవ్యములకు అర్థతృప్తిగలుగుట, లఘువుగనుండుద్రవ్యములకు కొంచెముతక్కువగ తృప్తిగలుగుట, ఇవి హీన, మధ్య అధికస్వరూపముగల మాత్రల యొక్క ప్రమాణము, ఎంతపరిమాణముగ అన్నాదులను భుజించిన వికారమును గలుగ జేయకయే సుఖముగ జీర్ణంబగునో అదియె మాత్రాప్రమాణము. దీనికి విరుద్ధముగ (అనగా హీనమాత్రగా) నుండుభోజనము అనేకదోషములకు కారణముగనుండుటచే వర్జింపవలయును.

హీనమాత్రాభోజనగుణము

భోజనం హీనమాత్రం తు న బలోపచయౌజసే,
సర్వేషాం వాతరోగాణాం హేతుతాం చ ప్రపద్యతే. 3

హీనమాత్రగా భుజింపబడిన భోజనము బలము, శరీరపుష్టి, తేజస్సు వీనికి కారణము కానేరదుకాని సమస్తమయిన వాతరోగములకుమాత్రము కారణంబుగ నగును.

అతిమాత్రాభోజనగుణము

అతిమాత్రం పునస్సర్వానాశు దోషాన్ప్రకోపయేత్,

మాత్రాధిక్యముగా భుజింపబడినయన్నము వాతాదిదోషత్రయముల నతిశీఘ్రముగా ప్రకోపింపజేయును.

అతిమాత్రాహారజనితరోగములు

పీడ్యమానా హి వాతాద్యా యుగపత్తేన కోపితాః 4
ఆమేనాన్నేన దుష్టేన తదేవావిశ్య కుర్వతే,
విష్టంభయంతోఽలసకం చ్యావయంతో విసూచికామ్. 5
అధరోత్తరమార్గాభ్యాం సహసైవాజితాత్మనః,

ఆపక్వముగ, దుష్టముగనుండు అతిమాత్రాహారముచేత వాతాదిదోషములు మూడును బంధింపబడి యేకకాలమునందే ప్రకోపించి దుష్టాన్నముతో జేరి దానిని స్రోతస్సులలో నడ్డగించి అలసకమను రోగమును కలుగజేయును. మఱియు నీదుష్టాన్నమును గుదము, ముఖము అను నీరెండుమార్గములవలన అకాలమునందును, అయుక్తమైన దేశమునందును శీఘ్రముగ బైలుపరచి చపలుడైన పురుషునికి విసూచికారోగమును కలుగజేయును.

అలసకనిరూపణము

ప్రయాతి నోర్ధ్వం నాధస్తాదాహారో న చ పచ్యతే. 6
ఆమాశయేఽలసీభూతస్తేన సోఽలసకః స్మృతః,

అట్టిదుష్టాన్నము ముఖమువలనను, గుదమార్గమువలనను బైలుపడక పాకమును జెందక యుండును. మఱియు నాదుష్టాన్నము

'నాభిస్తనాంతరం జంతోరామాశయ ఇతి స్మృతః"

అనువచనప్రకారము నాభి, స్తనములు, వీనిమధ్యప్రదేశమైన ఆమాశయములో అలసునివలె మందముగనుండును. అట్లగుటచే నీరోగమునకు అలసకమని పేరుగలిగినది.

## విసూచికానిరూపణము

వివిధై ర్వేదనోద్భేదై ర్వాయ్వాదిభృశకోపతః. ౭
సూచీభిరివ గాత్రాణి విధ్యతీతి విసూచికా,

వాతాదులు అత్యంతముగా ప్రకోపించుటవలన పలువిధములైన వేదనలు గలిగి సూదులతో బొడుచునటుల శరీరమునందు బాధను కలుగజేయుటవలన నీ రోగమునకు విసూచిక యని పేరుగలిగినది. ఇంతియ్యగాక యిదిపలువిధములైన వికారములను సూచకంబుగ నుండుటచేతను విసూచిక యని చెప్పబడినది.

## విసూచికోపద్రవములు

తత్ర శూలభ్రమానాహకంపస్తంభాదయోఽనిలాత్. ౮
పిత్తాజ్జ్వరాతిసారాంతర్దాహతృట్ప్రలయాదయః,
కఫాచ్ఛర్ద్యంగగురుతావాక్సంగష్ఠీవనాదయః. ౯

విసూచికారోగమునందు వాతాధిక్యమువలన శూల, భ్రమ, ఆనాహము, శరీరకంపము, శరీరస్తంభము, ముఖశోష మొదలగు నుపద్రవములు గలుగును. పిత్తాధిక్యమువలన జ్వరము, అతిసారము, అంతర్దాహము, దప్పి, మూర్ఛ, మదము మొదలగు నుపద్రవములు గలుగును. కఫాధిక్యమువలన ఛర్ది, శరీరగురుత్వము, వాగ్బంధము, నోట నీరువెడలుట, దగ్గు మొదలగు నుపద్రవములు గలుగును

## అలసకరోగలక్షణము

విశేషాద్దుర్బలస్యాల్పవహ్నే ర్వేగవిధారిణః,
పీడితం మారుతేనాన్నం శ్లేష్మణా రుద్ధమంతరా. ౧౦
అలసం క్షోభితం దోషైశ్శల్యత్వేనైవ సంస్థితం,
శూలాదీన్కురుతే తీవ్రాంశ్ఛర్ద్యతీసారవర్జితాన్. ౧౧
సోఽలసః

నార్బల్యము, స్వల్పముగ నగ్నిదీపనము, మలాదుల నడ్డగించునట్టి స్వభావమును గలపురుషునికి వాతముచే అన్నము విశేషముగ దష్టంబై ఆమాశయమధ్యమునందు

శ్లేష్మముచే నడ్డగింపబడి మందముగనై వాతాదిదోషములచే క్షోభనుజెంది లోనశల్య ముండునటుల సహింపతగని శూలను గలుగజేయుచు వాంతి, అతిసారము అను నీరెండు తప్ప తీవ్రమైనయనేకోపద్రవములనుగలుగజేయుచుండునది అలసకమని చెప్పబడును.

దండకాలసకరోగలక్షణము

అత్యర్థ దుష్టాస్తు దోషా దుష్టామబద్ధఖాః,
యాంత స్తిర్యక్తనుం సర్వాం దండవత్త్సంభయంతి చేత్. ౧౨
దండకాలసకం నామ తం త్యజేదాశుకారిణం,

అధికముగ దుష్టమైన వాతాదిదోషములు దుష్టముగ, ఆమముగనుండు అన్నముచే పూరితంబులగు స్రోతోమార్గములుగలవై సర్వశరీరమునందు నడ్డముగ వ్యాపించి సర్వశరీరమును దండమువలెనే స్తంభింపజేయును. అనగా ప్రసారణాకుంచన రహితముగ జేయును. ఈ రోగము దండకాలసకమను పేరబరగును. శీఘ్రములోనే మనుజుని జంపునట్టి యీరోగమును చికిత్సయందు త్యజింపవలయును. (అసాధ్య మనిభావము.)

ఆమవిషనిరూపణము

విరుద్ధాధ్యశనాజీర్ణ శీలినో విషలక్షణమ్. ౧౩
ఆమదోషం మహాఘోరం వర్జయేద్విషసంజ్ఞకం,
విషరూపాశుకారిత్వాద్విరుద్ధోపక్రమత్వతః. ౧౪

పూర్వోక్తాధ్యాయమునందు "విరుద్ధమన్నం" అను శ్లోకముచే జెప్పబడిన విరుద్ధాహారము; "విద్యాదధ్యశనం" అనుశ్లోకముచే జెప్పబడిన అత్యాహారము, ఉత్తరత్ర జెప్పబడుమూడు విధములైన అజీర్ణాహారము వీనిని విడువక చేయుచుండు పురుషునికి అతి కష్టంబును, విషలక్షణము గలదియును, విషమను పేరబఱగునదియు నైన ఒక ఆమ దోషము జనించును. అది విషముతోసమానమై శీఘ్రముగ మనుజుని జంపుటంజేసియు, విరుద్ధమైన చికిత్సగలది యగుటంజేసియు, నసాధ్యమగును కావున దానికి చికిత్సజేయక వర్జింపవలయును.

అలసకచికిత్స

అథామమలసీభూతం సాధ్యం త్వరితముల్లిఖేత్,
పీత్వాసోగ్రాపటుఫలం వార్యుష్ణం యోజయేత్తతః. ౧౫
స్వేదనం ఫలవర్తిం చ మలవాతానులోమనీం,
నామ్యమానాని చాంగాని భృశం స్విన్నాని వేష్టయేత్. ౧౬

పైజెప్పిన అలసకము మొదలగు ఆమదోషముయొక్క సాధ్యాసాధ్యముల నెఱింగి వానిలో సాధ్యముగను, దుష్టముగాకయునుండు అలసకరోగలక్షణములతో గూడి యుండునట్టి ఆమదోషముగలరోగికి శీఘ్రముగా వస, లవణము, మ్రంగకాయ అను వానితోగూడియుండు ఉష్ణోదకమును పానముచేయించి వమనము జేయించి పిదప స్వేదకర్మను జేయింప వలయును.

"విపాచ్య మూత్రామ్లమధూని వంతీ పిండీకకృష్ణాబిడధూమకుష్ఠైః,

వర్తిం కరాంగుష్ఠనిభాం ఘృతాక్తాం గుదే రుజానాహహరీం విదధ్యాత్."

అని క్రింద జెప్పబడు శ్లోకప్రకారము మలవాతమునకు అనులోమగతిని కలుగజేసెడి ఫలవర్తిని ప్రయోగింపవలయును. ఆమరోగమునందు దోషబలమువలన సంకోచమును చెందునట్టియు, విశేషముగా చెమటతో గూడి యుండునట్టియు, అంగములను వస్త్రములచే జుట్టవలయును.

## విసూచిచికిత్స

విసూచ్యామతివృద్ధాయాం పార్ష్ణ్యోర్దాహః ప్రశస్యతే,

తదహశ్చోపవాస్యైనం విరిక్తవదుపాచరేత్. ౧౭

పైజెప్పిన లక్షణములుగల విసూచిరోగము మిక్కుటముగ వృద్ధిజెందుచుండగా మడమలయందు ఇనుపశలాకాదులచే వాతబెట్టుట హితకరము. వాతబెట్టినదినమునందు రోగికి లంఘనమువేసి విరేచనమునకు తీసికొనినవానివలెనే పేయాదిక్రమముచే నుపచరింపవలయును.

"సుచ్ఛర్దితవిరిక్తస్య గాత్రాయామేఽతిదారుణే,

భల్లాతకమధూచ్ఛిష్టసీసపిణ్యాకనాగరైః.

ఘృతతైలం పచేత్సాన్తస్తచ్చ ఖల్లీఘ్నముత్తమమ్.

త్వక్పత్రరాస్నాగురుశిగ్రుకుష్ఠైరమ్లప్రపిష్టైస్సవచాశతాహ్వైః,

ఉద్వర్తనం ఖల్లివిసూచికాఘ్నం తైలం విపక్వం చ తదర్థకారి.

శిరీషసప్తాహ్వఫణిజ్జబీజత్రాయంత్యపామార్గఫలాని వర్తిః,

బస్తస్య మూత్రేణ విసూచికాఘ్నీ ప్రలేపనస్యాంజనధూమయోగ్యైః"

అతికష్టమైన శరీరాయామమునందు రోగికి వాంతి విరేచనములను బాగుగజేయించి నల్లజీడిగింజలు, మైనము, సీసము, తెలికపిండి, గానుగపిండి, శుంఠి, ఆమ్లము (అనగా పులిచింత) వీనితోడ ఘృతమునుగాని, తైలమునుగాని పక్వముజేయవలయును. ఇది ఖల్లీరోగ

మునుపోగొట్టును. లవంగపుచెక్క, ఆకుపత్రి, దంపరాష్ట్రము, అగరు, మునగ, చెంగల్వకోష్ఠు, వస, సదాప వీనిని పులిగంజితోచేర్చి బాగుగ పిసికి నలుగుబెట్టుకొనినచో ఖల్లీ విసూచిక అను రోగములను హరించును. పైజెప్పిన లవంగపుచెక్క మొదలగువస్తువులను జేర్చి పక్వముజేయబడినతైలము ఖల్లి, విసూచిక అను నీ రోగములను పోగొట్టును. దిరిసెనము, క్రానుగు, ఫణిజ్జబీజము, త్రాయంతి (అనగా కలుక్రానుగు) ఉత్తరేణు విత్తులు వీనిని గోజ్జెమూత్రములోజేర్చి వత్తిచేసినచో విసూచికను పోగొట్టును. పైజెప్పినదిరిసెనము మొదలగువస్తువులయొక్క ప్రలేపనమును, అంజనధూమప్రయోగములును విసూచికను పోగొట్టునని సుశ్రుతమునందు జెప్పబడియున్నది.

### అజీర్ణమునందు శూలహరౌషధనిషేధము

తీవ్రార్తిరపి నాజీర్ణీ పిబేచ్ఛూలఘ్నమౌషధం,
ఆమసన్నోఽనలో నాలం పక్తుం దోషౌషధాశనమ్. ౧౭
నిహన్యాదపి చైతేషాం విభ్రమస్సహసాతురం,

అజీర్ణరోగముగలవానికి తీవ్రమైన శూలగలిగియుండినను తచ్ఛమనరూపమైనట్టియు ఛర్ది, అతిసారము వీనిని శమింపజేయునట్టియునగు నౌషధముల ప్రథమమునందు భుజింపజేయంజనదు. ఏలనగా — ఆమముచే మందముగనుండు జాఠరాగ్ని దోషము, ఔషధము, ఆహారము, అను నీ మూటిని పాకముచేయుటకు - అసమర్థముగనుండును. ఇంతియకాక ఔషధము, దోషము, ఆహారము, అను నీ మూడును జేరుటచే జనించునట్టి విలక్షణమయిన ఒక వికారము అజీర్ణరోగిని కాలము నిరీక్షింపకయే చంపివేయును.

### అజీర్ణమున ఔషధప్రయోగక్రమము

జీర్ణాశనే తు భైషజ్యం యుంజ్యాత్ స్తబ్ధగురూదరే. ౧౮
దోషశేషస్య పాకార్థ మగ్నేస్సంధుక్షణాయ చ,

జీర్ణమయిన యాహారముగలవాడుగను, నిర్మలముగ గురువుగ నుండునట్టి కోష్ఠము గలవాడుగనుండు అజీర్ణరోగికి దోషశేషము పాకము జెందుటకును, జాఠరాగ్నికి దీపనము గలుగుటకును, ఔషధము నియ్యవలయును.

### ఆమరోగమున అపతర్పణవిధి

శాంతిరామవికారాణాం భవతి త్వపతర్పణాత్. ౨౦
త్రివిధం త్రివిధే దోషే తత్సమీక్ష్య ప్రయోజయేత్,

ఆమముచేగలిగిన ఆలస్యము, జాడ్యము, అగ్నిమాంద్యము మొదలగు వికారములు అపతర్పణక్రియవలన శాంతిజెందను. కాబట్టి దేశము, కాలము, అగ్నిదీపనము

మొదలగువాని నాలోచించి "మేహామదోషాతి" అను శ్లోకముచే ఉత్తరత్ర జెప్పబడు మూడు విధములైన అపతర్పణక్రియలను మూడు విధములైన ఆమరోగములందు వైద్యుడు ప్రయోగింపవలయును.

## ఆమరోగచికిత్సాక్రమము

తత్రాల్పే లంఘనం పథ్యం. మధ్యే లంఘనపాచనమ్.
ప్రభూతే శోధనం తద్ధి మూలాదున్మూలయేన్మలాన్,

మూడువిధములగు ఆమదోషములలో అల్పముగనుండుఆమరోగమునందు లంఘనము పథ్యకరమయినది. దానిచే జాఠరాగ్ని వృద్ధియైన స్వల్పముగనుండు ఆమదోషము శోషించి జీర్ణంబగును. ఆమదోషము మధ్యస్థముగనుండునపుడు లంఘనంబును, పాచనరూపమైన యౌషధంబులును పథ్యకరంబులు. పాచనమనగా —పాకము నొందక ఆమముతోగూడియుండు ధాతువులను పాకముచేయుటయందు సమర్థంబులగు అన్నపానౌషధాదు లని యర్థము. ఆమదోషం బధికముగ నుండునపుడు శోధనౌషధము హితకరము. శోధనౌషధ మనగా —

"యదీరయేద్బహిర్దోషాన్ పంచధా శోధనం తు తత్"

పైనిజెప్పబడు వచనానుసారము శరీరములోనుండు దోషములను బయలుపరచునట్టి అన్నపానౌషధాదు లని యర్థము. శోధనౌషధము శరీరములో జేరియుండు దుష్ట మలములను నిశ్శేషముగా వెలిపరచును. కాబట్టి అధికముయిన ఆమదోషమునందు శోధనౌషధమునే వైద్యుడు ప్రయోగింపవలయును. అట్టి శోధనౌషధము మలములను బలాత్కారముగ నిర్మూలముజేయును.

"బహుదోషాణాం పునరుపసేవనమేవ కార్యం సహ్యాస్రావితే పల్వలోదకే ఘు శాల్యాదిపుష్టిర్భవతి"

పల్వలోదకము చల్లకుండినయెడల శాల్యాదులకు పుష్టిగలుగకుండునటులనే బహుదోషములుగలవానికి శోధనౌషధమును ప్రయోగింపకుండుటచే శరీరపుష్టి గలుగనేరదు. అని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది.

## హేతువ్యాధివిపర్యయచికిత్సాక్రమము

ఏవమన్యానపి వ్యాధీన్ స్వనిదానవిపర్యయాత్.		౨౨
చికిత్సేదనుబంధే తు సతి హేతువిపర్యయం,
త్యక్త్వా యథాయథం వైద్యో యుంజ్యాద్వ్యాధివిపర్యయమ్.
తదర్థకారి వా పక్వే దోషేత్విద్ధే చ పావకే,
హితమభ్యంజనస్నేహపానవస్త్యాది యుక్తితః.		౨౪

సంతర్పణక్రియలచే జనించిన ఆమదోషమును నిదాన విపర్యయములైన యౌషధాన్నవిహారాదులచే చికిత్స జేయుచందంబుననే యితరములగు జ్వరాదిరోగములను కూడ స్వనిదానవిపర్యయములైన యౌషధాదులచే వైద్యుడు చికిత్స జేయవలెను. అనగా సంతర్పణక్రియచే జనించినరోగమును అపతర్పణక్రియలవలనను, శీతముచే జనించినరోగము ఉష్ణకరమయినక్రియలవలనను చికిత్స జేయవలెననిభావము. అట్టిచికిత్సచే నారోగము శమింపకుండినయెడ నిదాన విపర్యయమునువదలి యథాక్రమముగా వ్యాధివిపర్యయము ననుసరించి చికిత్స జేయవలయును. అనగా "ముస్తాపర్పటకం జ్వరే, రజనీ ప్రమేహే" అని ఉత్తరత్ర జెప్పబడుప్రకారము జ్వరాదిరోగములకై జెప్పబడియుండు ఔషధములను రోగానుగుణముగా ప్రయోగింపవలయునని భావము. ఆమదోషము జీర్ణమై జాఠరాగ్ని దీపనముతోగూడియుండునపుడు 'మదాత్యయరోగమునందు మద్యపానమును, అతిసారరోగమునందు విరేచనమును జేయించుచునటులనే' పై జెప్పిన నిదానము, వ్యాధి వీని విపర్యయములచే నసాధ్యముగనుండు రోగమును శమింపజేయునట్టియు, హితకరములైనట్టియు అభ్యంజనము, స్నేహపానము, వస్త్యాదిక్రియలు వీనిని యుక్తిగా (అనగా అగ్నిమాంద్యాదులు గలుగకుండునటుల) జేయింపవలయును.

### కఫాజీర్ణలక్షణము

అజీర్ణం చ కఫాదామం తత్ర శోథోఽక్షిగండయోః,
సద్యోభుక్త ఇవోద్గారః ప్రసేకోత్క్లేశగౌరవమ్. ౨౫

కఫముచే జనించిన అజీర్ణము ఆమ మనుపేరబరగును. దానియందు అక్షికూపము, చెక్కిళ్లు వీనియందువాపు, అపుడేభుజించినటుల విదాహావస్థను జెందని తేనుపులు, నోటివెంటనీరు, వాతాదిదోషములకు స్వస్థానచలనము శరీరగురుత్వము గలుగును. జాఠరాగ్నికి విరోధియయిన కఫము అజీర్ణమునుచేయుటయందు ప్రధానముగనుండుట వలన తొలుత కఫాజీర్ణము చెప్పబడినది.

### వాతాజీర్ణలక్షణము

విష్టబ్ధమనిలాచ్ఛూలవిబంధాధ్మానసాదకృత్,

వాతముచేజనించిన అజీర్ణము విష్టబ్ధాజీర్ణ మని పఱగును. దానియందు శూల, మలమూత్రబంధము ఆధ్మానము, శరీరకృశత్వము, లేక అగ్నిమాంద్యము గలుగును.

### పిత్తాజీర్ణలక్షణము

పిత్తాద్విదగ్ధం తృణ్మోహభ్రమామ్లోద్గారదాహవత్. ౨౬

పిత్తముచే జనించిన అజీర్ణము, విదగ్ధాజీర్ణ మని పఱగును. దానియందు దప్పి, మోహము, భ్రమ, పులితేనుపులు, శరీరతాపము గలుగును.

### అజీర్ణమున లంఘనాదిక్రమము

లంఘనం కార్యమామే తు విష్టబ్ధే స్వేదనం భృశమ్,
విదగ్ధే వమనం యద్వా యథావస్థం హితం భవేత్. ౨౪

ఆమాజీర్ణమునందు లంఘనము చేయవలయునే కాని వమనవిరేచనాదులు చేయింపంజనదు. విష్టబ్ధాజీర్ణమునందు అధికముగా స్వేదకర్మ జేయింపవలయును విదగ్ధాజీర్ణమునందు వమనము జేయింపవలయును లేక పైజెప్పిన మూడు విధములగు అజీర్ణములయందు దోషప్రకోపానుగుణముగా లంఘన, స్వేదన, వమనములను, యుక్తప్రకారము జేయింపవలయును. అనగా ఆమాజీర్ణమునందుకూడ స్వేదనవమనములను, విదగ్ధాజీర్ణమునందుకూడ లంఘనస్వేదములను జేయింపవలయు నని భావము.

### విలంబికారోగచికిత్స

గరీయసో భవేల్లీనాదామాదేవ విలంబికా,
కఫవాతానుబద్ధామలింగా తత్సమసాధనా. ౨౫

మిక్కిలి అధికంబును, స్రోతస్సులలో లీనమగునదియు నైన ఆమముచేతనే విలంబికయను నొకరోగము జనించును. అది శ్లేష్మము, వాతము వీనితోగూడి అక్షేపాకము, చెక్కిళ్లు వీనియందు శోథ, అపుడే భుజించినట్లు త్రేనుపులు, నోటనీరు నెడలుట. వాతాది దోషములు స్వస్థానము వదలి చలించుట, శరీరగౌరవము అను ఆమాజీర్ణలక్షణయుక్తమై యుండును. కాబట్టి దీనియందు ఆమాజీర్ణమునకై జెప్పియుండు లంఘనరూపమయిన చికిత్సలనే చేయవలయును

### రసశేషాజీర్ణము దానిచికిత్స

అశ్రద్ధా హృద్వ్యథా శుద్ధేఽప్యుద్గారే రసశేషతః,
శయీత కించిదేవాత్ర సర్వశ్చానాశితో దివా. ౨౬
స్వప్యాదజీర్ణీ సంజాతబుభుక్షోఽద్యాన్మితం లఘు,

అన్నసంబంధముగల త్రేనుపు శుద్ధముగ నుండునప్పటికి అన్నరసము జీర్ణముకాకయుండినచో అన్నమునందిచ్ఛ లేకుండుట, హృదయశూల, గురుత్వముగలుగును. ఇది రసశేషాజీర్ణమన బడుగును. దీనియందు స్వల్పకాలమువరకు నిద్రింపవలయును. తదితరమైన అజీర్ణములయందు శరీరలాఘవము గలుగువరకు భుజింపకయే మధ్యాహ్నమునందు బాగుగ నిద్రింపవలయును. మఱియు నాకలి గలుగునప్పుడు లఘువైనయాహారమును స్వల్పముగా భుజింపవలయును. అజీర్ణరోగులు మధ్యాహ్నమునందు నిద్రింపవలయు నని పూర్వాధ్యాయమునందు "అజీర్ణ్యభిహతో న్మత్తాః" అనువచనముచే జెప్పబడి

యున్నది. అయితే అజీర్ణరోగి భుజింపకయే మధ్యాహ్నమునందు నిద్రింపవలయునని తెలియపరచుటకై మరల నిచట "సర్వశ్చానాశితో దివా, స్వప్యాదజీర్ణీ" అని జెప్పబడినది.

◆ అజీర్ణసామాన్యలక్షణము ◆

విబంధో౽తిప్రవృత్తిర్వా గ్లానిర్మారుతమూఢతా. 30
అజీర్ణలింగం సామాన్యం విష్టంభో గౌరవం భ్రమః,

మూత్రపురీషలు వెడలకుండుట, లేక అధికముగ వెడలుట, గ్లాని, (అనగా శరీరము క్షీణించుట) వాతమునకు ప్రతిలోమగతి, కడుపుబ్బరము, శరీరగురుత్వము, మోహము అనునవి అజీర్ణమునకు సామాన్యలక్షణంబులు. ఈ యర్థమే,—

"సీదత్యంగం భ్రమో మోహః కోష్ఠే ముహ్యతి మారుతః,
సర్వేషామప్యజీర్ణానామవిసంవాది లక్షణమ్."

అను వచనముచే తంత్రాంతరమునందును జెప్పబడియున్నది.

◆ అజీర్ణకరాన్నములు ◆

న చాతిమాత్రమేవాన్నమామదోషాయ కేవలమ్. 31
ద్విష్టవిష్టంభిదగ్ధామగురురూక్షహిమాశుచి,
విదాహి శుష్కమత్యంబుప్లుతం చాన్నం న జీర్యతి. 32

అధికముగ భుజింపబడిన యన్నమును, అప్రియముగ, కడుపు నుబ్బించునదిగ, అతిశీతలముగ, అపక్వముగ, గురువుగ, రూక్షముగ, కేశములు మొదలగువానిచే దుష్టముగ, దగ్ధముగ, శుష్కముగ, అధికమైన యుదకములో తేలుచుండునదిగనుండు అన్నములును జీర్ణముకాకుండును.

ఉపతప్తేన భుక్తం చ శోకక్రోధక్షుధాదిభిః,

శోకము, కోపము, అధికముగ ఆకలి, భయము మొదలగువానివలన విశేషముగ పీడింపబడినవానిచే భుజింపబడిన యన్నము జీర్ణముకాకుండును.

◆ సమశనాదివివరణము ◆

మిశ్రం పథ్యమపథ్యం చ భుక్తం సమశనం మతమ్. 33
విద్యాదధ్యశనం భూయో భుక్తస్యోపరి భోజనమ్,
అకాలే బహుచాల్పం వా భుక్తం తు విషమాశనమ్. 34
త్రీణ్యప్యేతాని మృత్యుం వా ఘోరాన్ వ్యాధీన్ సృజంతి వా,

పథ్యకరమైన శాలిధాన్యము మొదలగువానిని, అపథ్యకరమైన యవకము మొదలగువానిని మిశ్రముజేసి భుజించుట సమశనమనియు, తృప్తిగ భుజించితోడనే దానిపై మరల భుజించుట అధ్యశనమనియు, "ప్రసృష్టేవిణ్మూత్రే" అని క్రిందజెప్ప బడు నాహారకాలమునకంటె విరుద్ధమైన కాలమునందు అధికముగగాని, లేక స్వల్ప ముగ గాని భుజించుట విషమాశనమనియు వైద్యకతంత్రమునందు జెప్పబడియున్నది. సమశనము, అధ్యశనము, విషమాశనము అను నీమూడును మరణమునుగాని, లేక ఘోర మైన గుల్మాది రోగములనుగాని కలుగచేయును. మనుజులు రెండు పర్యాయములు ఆహా రముచేయవలయునని వైద్యకతంత్రములయందు జెప్పబడియున్నది. ఇటులనే,

"సాయం ప్రాతర్మనుష్యాణాం భోజనం విధినిర్మితమ్"

ప్రాతస్సాయంకాలములయందు మనుజులు భుజింపవలయునని వ్యాసుడుకూడ జెప్పియు న్నాడు. ఇట్లుండగా భుజించినదానిపై మరలభుజించుట అధ్యశనమనియు, అట్టి అధ్య శనము మరణమునకుగాని, రోగములకుగాని కారణమగుననియు,

"విద్యాదధ్యశనంభూయో భుక్తస్యోపరిభోజనం,
త్రీణ్యప్యేతాని మృత్యుం వా."

అనువచనముచే మూలమునందు చెప్పబడియున్నది. కావున రాత్రిభోజనముగూడ అధ్యశనంబై వర్జనీయంబగును. అట్లయినచో రెండు పర్యాయములు భుజింపవలయునని జెప్పియుండు వైద్యకతంత్రవచనంబును, వ్యాసవచనంబును, నిరర్థకంబులగును. కాబట్టి భుక్తస్యోపరిభోజనం, అధ్యశనం అని జెప్పియుండుట అసంగతమనే శంకగలుగును. అయితే —

"ప్రాగ్భుక్తేత్వవిభక్తేగ్నౌ ద్విరన్నం న సమాచరేత్"

తొలుత భుజింపబడినయన్నము ఉదరమున బ్రవేశించి జఠరాగ్నిచే విభక్తంబగుటకు మునుపు దానిపై మరల రెండవమారు భుజించుట అధ్యశనంబగునేకాని సాయంకాల మున భుజించునది అధ్యశనముకానేరదని సుశ్రుతమునందు జెప్పబడియున్నది. సాయం కాలాహారము గుణకారియగుటచే దానిని వర్జింపక యావశ్యకముగా సేవింపవలయును.

"ప్రాతరాశే త్వజీర్ణేపి సాయమాశో న దుష్యతి,
దివా ప్రబోధ్యతే ర్కేణ హృదయం పుండరీకవత్.
తస్మిన్విబుద్ధే స్రోతాంసి స్ఫుటత్వం యాంతి సర్వశః,
వ్యాయామాచ్చ విచారాచ్చ విక్షిప్తత్వాచ్చ తస్యసః.
న క్లేదముపగచ్ఛంతి దివా తేనాస్య ధాతవః,
అక్లిన్నేష్వన్నమాసిక్త మన్యత్తేషు న దుష్యతి

అవిదగ్ధేష్వివ పయస్సు వ్యన్యత్సంమిశ్రితం పయః.
రాత్రౌతు హృదయే మ్లానే సంవృతేష్వయనేషు చ.
పరిక్లేదం యాంతి కోష్ఠే సంవృతే దేహధాతవః,
క్లిన్నేష్వన్యదపక్వేషు తేషాసిక్తం ప్రదుష్యతి.
విదగ్ధేషు పయస్స్వన్యత్ పయస్తప్తేష్వివార్పితమ్,
నైశే తస్మాదజీర్ణేన్నే నాన్యద్భుంజీతభోజనమ్."

హృదయము సూర్యునిచే మధ్యాహ్నమునందు తామరపుష్పవలెనే వికాసమును జెందుచున్నది. హృదయము వికాసమును జెందునపుడు స్రోతస్సులన్నియు వికాసమును జెందును. దానంజేసి మధ్యాహ్నమునందు శ్రమకరమైన వ్యాపారములు సంచారము, మనోవ్యాపారము వీనిచే మనుజునియొక్క ధాతువులన్నియు క్లేశమును జెందకుండును. క్లేదమును జెందకుండునట్టి ధాతువులలో జేరునట్టి యితరమైన అన్నాదులు కాగనిపాలలో జేర్పబడిన యితరమయిన పాలవలెనే దోషమును జెందకుండును. కాబట్టిప్రాతఃకాలాశనము జీర్ణముకాకుండినప్పటికి సాయంకాలాశనము నిషేధింపబడదు. రాత్రియందైననో హృదయమువాడి స్రోతోమార్గములు, కోష్ఠము మూయబడియుండగా మనుజునియొక్క ధాతువులు క్లేదమును జెందును. ధాతువులు క్లేదమును జెంది అపక్వముగ నుండునపుడు వానిలో జేరనట్టిఅన్నము మొదలగునవి బాగుగ కాగియుండు పాలలో జేర్పబడు నితరపాలవలెనే దోషమును జెందును కాబట్టి రాత్రి భుజింపబడిన అన్నాదులు జీర్ణము కాకుండునపుడు మరల భోజనము జేయంజనదని అష్టాంగసంగ్రహమునందు స్పష్టముగా జెప్పబడియున్నది.

## భోజననియమము

కాలే సాత్మ్యం శుచి హితం స్నిగ్ధోష్ణం లఘు తన్మనాః. 35
షడ్రసం మధురప్రాయం నాతిద్రుతవిలంబితమ్,
స్నాతః క్షుద్వాన్ వివిక్తస్థో ధౌతపాదకరాననః 36
తర్పయిత్వా పితౄన్ దేవానతిథీన్ బాలకాన్ గురూన్,
ప్రత్యవేక్ష్య తిరశ్చోపి ప్రతిపన్నపరిగ్రహాన్. 37
సమీక్ష్య సమ్యగాత్మాన మనిందన్నబ్రువన్ ద్రవమ్,
ఇష్టమిష్టైస్సహాశ్నీయాచ్ఛుచి భక్తజనాహృతమ్. 38

స్నానము జేసినట్టియు, విశేషముగ నాకలితో గూడి భోజనమునందే యిచ్ఛగలిగినట్టియు మనుజుడు కాళ్లుచేతులు గడిగికొని యేకాంతమైన స్థలములో కూర్చుండి ఆహారమును నిందింపక మాటలాడక పితృదేవతలు, దేవతలు, అతిథులు, శిశువులు, ఆచా

ర్యులు వీరిని అన్నాదులచే తృప్తిపరచి తాను పెంచుచుండునట్టి పక్షి, గజ్జము, పశువు మొదలగు తిర్యగ్జంతువులు వానిగభుజించిన సంగతిని విచారించి తెలిసికొని సమసస్స్నిగ్ధమగను, ద్రవప్రాయమగను, శుద్ధులు ప్రీతివంతులగు పరిచారకాదులచే తేబడినది యును, తనకు హితకరమయినదియును, శుద్ధమైనదియును, కేశాదులచే దుష్టముకానిది యును, సుఖోష్ణముగ, లఘువుగ, షడ్రసములతో గూడినదిగ, అధికమైన మధురరసము గలదిగ నుండునదియునైన అన్నాదులను తన శరీరానుకూల్యము నాలోచించి యిష్టజను లతో కూడి కూర్చుండి శాస్త్రోక్తమైన ఆహారకాలమునందు అతివేగము, కాలవిలంబము లేకుండా భుజింపవలయును.

"అతిద్రవాశీ త్వాహార గుణదోషాన్ న విందతి,
ఉత్సన్నహత్యల్పమశ్నాతి ఛర్దయేద్వా నవర్ధితః.
విళంబితం తు భుంజానో న తృప్తిమధి గచ్ఛతి,
స్వాదు బహ్వపి శీతత్వాద్యాతి భక్తమహృద్యతామ్.
జల్పతో హసతశ్చాపి భుంజానస్యాన్యచేతసః,
త ఏవ దోషా మంతవ్యాః యే విళంబితభోజనే."

అతివేగముగ భుజించువారికి ఆహారగుణదోషములు తెలియకపోవుటయేగాక వాని భోజనముకూడ అతిస్వల్పముగ నగును. ఒకానొకప్పుడు భుజించినతోడనే వమనంబైన నగును. ఆలస్యముగ భుజించువానికి తృప్తిగలుగకుండును. మరియు నన్నాదులుమధుర ముగనుండునప్పటికి కాలవిలంబముచే చల్లారి రుచివిహీనము నగును. మాటలాడుచు నవ్వుచు వేరొకచో మనస్సునునిచి భుజించువానికి తృప్తిగలుగనేరదు అని ఖరనాదుడు జెప్పియున్నాడు.

"దోషోపనద్ధం యది లీనమన్నం పిత్తోద్ధతస్యా వృణుయాన్నవహ్నిం,
జాయేత దుష్టాం తు తతో బుభుక్షాం యామందబుద్ధిర్విషవన్నిహంతి."

భుజించబడినయన్నము దోషయుక్తంబై స్రోతస్సులలో నధికముగ సంబంధించినచో పిత్తప్రకోపముగలవానియొక్క జాఠరాగ్ని నడ్డగించబడకుండును. దానిచే నాకాలము నందు దుష్టమగు నొక యాకలిగలుగును. అట్టి సమయమున బుద్ధిహీనలవలన భుజించి నచో విషమువలెనే మనుజునిజంపును. అని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది. కాబట్టి దుష్టమైన యాకలిగలిగియుండునపుడు భుజింపజనదని తెలియజేయుటకై "క్షుద్వా" అనుపదము యీశ్లోకమునందు ప్రయోగింపబడినది.

## వర్జనీయాహారము

భోజనం తృణకేశాదిజుష్టముష్ణీకృతం పునః,
శాకావరాన్నభూయిష్ఠమత్యుష్ణలవణం త్యజేత్. ౩౯

తృణము, కేశములు, ఈగ మొదలగుజంతువులు వీనితోఁగూడియుండునది యును, ఒకమారు పాకంబై చల్లారి మరల ఉష్ణముగ జేయబడినదియును, శాకములు, మినుములు మొదలగునవి యధికముగ జేరినదియును, అధికోష్ణముగలదియును, అధిక లవణములతోఁగూడినదియునైన భోజనమును త్యజింపవలయును.

కిలాటాదిసేవననిషేధము

కిలాటదధికూర్చికాక్షారశుక్తామమూలకమ్,
కృశశుష్కవరాహావిగోమత్స్యమహిషామిషమ్. ౪౦
మాషనిష్పావశాలూక బిసపిష్టవిరూఢకమ్.
శుష్కశాకాని యవకాన్ ఫాణితం చ న శీలయేత్ ౪౧

కిలాటము, దధి, కూర్చిక, క్షారము, శుక్తము, ఆమమూలకము (అనగా పచ్చిముల్లంగి) అనువానిని, కృశముగ, శుష్కముగ నుండుజంతువులను, పంది, గొఱ్ఱె ఆవు, మత్స్యము, దున్నపోతు అనువాని మాంసములను, మినుములు, అనుములు, శాలూకము (అనగా తామరదుంప) తామరతూండ్లు, పిష్టము, విరూఢకము, ఎండిన శాకములు, యవకము, ఫాణితము అను నీపదార్థముల నభ్యసింపఁజనదు. అయినను వానిని ప్రత్యహము సేవింపకూడదనియు, ఒకానొకసమయమున భుజించుట నిషిద్ధము కాదనియు, తెలియపరచుటకై "నశీలయేత్" అనుపదము ప్రయోగింపబడినది. "నాభ్యసేద్గౌరవాత్" అనగా కిలాటాదులు గురుత్వకారులగుటచే వాని నభ్యసింప జన దని చరకాచార్యుడు జెప్పియున్నాడు. అభ్యసింపకూడదనుటకు గురుత్వము తప్ప నింక ననేకకారణములుగలవు. అవి ప్రకృతమునం దనుపయుక్తంబగుటచే నీ తంత్రకారుడు జెప్పక విరమించెను. అభ్యసింపకుండుటకు గురుత్వముమాత్రమే కారణముగ నుండుచో గురువైన యవాదిద్రవ్యముల నుపయోగపరచికొనునటుల జెప్పియుండు నదియు విరుద్ధంబగును. కిలాటము కూర్చిక అనునవి దోషకరంబైనవి. దధి జ్వరాదులను గలుగ జేయును. స్రోతస్సులలో లిప్తంబగును. దానంజేసి దధి యనేకరోగముల కాకరంబగును. క్షారము పుంస్త్వమునకు హానిని గలుగ జేయును. శుక్తము నేత్రలమునకు అహితకరమయినది; కావుననే కిలాటాదివస్తువులు భోజనమునందు నిషేధింపబడి యున్నవి.

ప్రతిదినంబును సేవింపదగినవస్తువులు

శీలయేచ్ఛాలిగోధూమయవషష్టికజాంగలమ్,
పథ్యామలకమృద్వీకాపటోలీముద్గశర్కరాః, ౪౨

ఘృతదివ్యోదకక్షీరక్షౌద్రదాడిమసైంధవమ్,
త్రిఫలాం మధుసర్పిర్భ్యాం నిశి నేత్రబలాయ చ. ౪౩

శాలిధాన్యము, గోధుమలు, యవలు, షష్టికము (అరువదినాళ్లపంటవడ్లు), జాంగలమాంసము, కరక్కాయ, ఉసిరికకాయ, ద్రాక్ష, చేదుపొట్ల, పెసలు, పంచదార ఘృతము, క్షీరము, క్షౌద్రము (అనగా చిట్టీగెలు కూర్చిన కపిలవర్ణముగల తేనె) దానిమ్మపండు, సైంధవలవణము, వీనిని ప్రతిదినంబున నుపయోగింపదగును. రాత్రుల యందు నేత్రబలార్థమై తేనె, ఘృతము వీనితోడ త్రిఫలముల నభ్యసించుచుండవలయును.

స్వాస్థ్యానువృత్తికృద్యచ్చ రోగోచ్ఛేదకరం చయత్,

ఋతుచర్యాధ్యాయమున జెప్పియుండునట్టి స్వాస్థ్యకరమయిన అన్నపానాదులను రోగహరమైన చేదువేము మొదలగు ద్రవ్యములను అభ్యసించుచుండవలయును.

## భోజనవ్యవస్థ

బిసేక్షుమోచచోచామ్ర మోదకోత్కారికాదికమ్. ౪౪
అద్యాద్ద్రవ్యం గురు స్నిగ్ధం స్వాదు మందం స్థిరం పురః,
విపరీతమతశ్చాంతే మధ్యేఽమ్లలవణోత్కటమ్. ౪౫

గురువుగ, స్నిగ్ధముగ, మధురముగ, స్థిరముగ మందముగనుండు తామరతూండ్లు, చెఱకు, అరటి, చోచము (అనగా టెంకాయ) మామిడి, మోదకము (అనగాలడ్డుకము) లేక పూరణపెట్టిన బిళ్ళకుడుములు, ఉత్కారికా (అనగా ఉండ్రాళ్ళు) మొదలగు ద్రవ్యములను భోజనాదియందు భుజింపవలయును. వీనికంటె విపరీతమయిన (అనగా లఘువుగ, రూక్షగ, తీక్ష్ణముగ, కటువుగ, సరముగనుండు) ద్రవ్యములను భోజనాంతమునందు భుజింపవలయును. పులుసు, లవణము ఇవి యధికముగనుండు ద్రవ్యములను భోజన మధ్యమునందు భుజింపవలయును.

"కటుం లవణమమ్లం వా పూర్వమాహారమాహరేత్,
ఆహారోమధురోహ్యగ్రే గురు విష్టభ్య జీర్యతి."

కారముగగాని, ఉప్పగగాని, లేక పుల్లగగాని యుండు నాహారమును తొలుత భుజింపవలయును. అటులగాక మధురముగ, గురువుగనుండు నాహారములను తొలుత భుజించినచో నవి స్రోతస్సులను బంధించు విదాహావస్థను జెంది పిదప జీర్ణమగును అనెడి ఖరనాదవచనము దేశశరీరభేదవిషయమని తెలియవలయును.

భోజనపరిమాణము

అన్నేన కుక్షేర్ద్వావంశౌ పానేనైకం ప్రపూరయేత్,
ఆశ్రయం పవనాదీనాం చతుర్థమవశేషయేత్. ౪౬

ఉదరమును రెండుభాగములను అన్నముచేతను, ఒక భాగము నుదకపానముచేతను నిండింపవలయును. నాల్గవ భాగమును వాతాదులయొక్క సంతార్థమైవదలిపెట్టవలెను.

"ప్రక్షాళయేదద్భిరాస్యం భుంజానశ్చ ముహుర్ముహుః,
విశుద్ధే రసనే తస్మై రోచతేన్నమపూర్వవత్."

భుజించునపుడు ఉదకముచే నోరును పలుమారుగడిగికొనవలయును. అటులజేసినచో నోరుశుద్ధంబై అపూర్వవస్తువువలెనే అన్నముబాగుగ రుచించునని సుశ్రుతమునందు జెప్పబడియున్నది.

యవాదిభక్షణమునందనుపానము

అనుపానం హిమం వారి యవగోధూమయోర్హితమ్,
దధ్నిమద్యే విషే క్షౌద్రే కోష్ణం పిష్టమయేషు తు. ౪౭
శాకముద్గాదివికృతౌ మస్తు తక్రామ్లకాంజికమ్,
సురాకృశానాం పుష్ట్యర్థం స్థూలానాం తు మధూదకమ్, ౪౮
శోషే మాంసరసో మద్యం మాంసే స్వల్పేచ పావకే,
వ్యాధ్యౌషధాధ్వ *భాష్యస్త్రీ లంఘనాతపకర్మభిః ౪౯
క్షీణే వృద్ధే చ బాలే చ పయః పథ్యం యథామృతమ్,

యవలు, గోధుమలు, పెరుగు మద్యము, విషము, తేనె, వీనిని భుజించి తోడనే శీతోదకానుపానము, పిష్టసంబంధముగల వస్తువులను భుజించి తోడనే కించిదుష్ణమైన ఉదకానుపానమును, శాకము పెసలు మొదలగువస్తువులచే జేయబడిన పదార్థములను భుజించి తోడనే మస్తువు (అనగా పెరుగుమీదిమీగడ) తక్రామ్లము, కాంజికము అను వాని యనుపానమును, శరీరము కృశించినవారలు శరీరపుష్ట్యర్థమై సురయనుమద్యపానమును, స్థూలించినవారలు శరీరము కృశించుటకై మధూదకపానమును, క్షయరోగులు మాంసరసపానమును, మాంసమును భుజించి తోడనే మద్యానుపానమును, అగ్నిమాంద్యమునందు మద్యానుపానమునుచేయుటయు హితకరంబు. వ్యాధి, ఔషధము, మార్గసంచారము, సంభాషణము, స్త్రీ సంభోగము, లంఘనము, ఎండ, విశేషమైన వ్యాపారము వీనిచే కృశించియుండువారు, వృద్ధులు, బాలురు వీరలకు క్షీరము అమృతమువలెనే హితకరంబైనది. (అనగా క్షీరము అమృతమువలెనే బలము, వర్ణము, ఓజస్సు, కాంతి, ఆయుువు, ఆరోగ్యము మొదలగువానిని గలుగజేయునని తాత్పర్యము.)

* భార ఇతి పా.

### వటకాద్యనుపానము

విపరీతం యదన్నస్య గుణైస్స్యాదవిరోధి చ. ౫౦
అనుపానం సమాసేన సర్వదా తత్ప్రశస్యతే,

అన్నము పడియములు మొదలగువానికి గుణములచే విపరీతముగను విరోధిగ నుండువస్తువులను (అనగా స్నిగ్ధముగనుండువానికి రూక్షమైనవస్తువును, రూక్షముగనుండు వానికి స్నిగ్ధమయినవస్తువును, శీతలముగనుండువానికి ఉష్ణమైనవస్తువును, ఉష్ణముగనుండు వానికి శీతమయినవస్తువును, మధురమయినవానికి అమ్లమైనవస్తువును, అమ్లముగనుండు వానికి మధురమయినవస్తువును) అనుపానముచేయుట యెల్లపుడు ప్రశస్తము. ఈప్రకారము ఆహారాదులకు అనుపానము సంగ్రహముగ జెప్పబడినది.

### అనుపాన గుణము

అనుపానం కరోత్యూర్జాం తృప్తిం వ్యాప్తిం దృఢాంగతామ్.
అన్నసంఘాతశైథిల్య విక్లిత్తిజరణాని చ,

అనుపానము మనస్సంతోషము, తృప్తి, శరీరమునందు వ్యాప్తి, శరీరదార్ఢ్యము, అన్నసముదాయమునకు శైథిల్యము, క్లేదము, జీర్ణము వీనిని గలుగజేయును.

### ఊర్ధ్వజత్రురోగాదులయం దనుపాననిషేధము

నోర్ధ్వజత్రుగదశ్వాసకాసోరఃక్షతపీనసే. ౫౨
గీతభాష్యప్రసంగే చ స్వరభేదే చ తద్ధితమ్,

జత్రువులకు (అనగా మెడకొంకులకు) పైభాగమున జనించినరోగములు, శ్వాసము, కాసము, ఉరోరోగము, గాయము, పీనసము, అధికసంగీతము, అధికసంభాషణము, స్వరహాని వీనియం దనుపానము హితకరమయినదికాదు, ఏలనగా —ఆ యనుపానము ఆమాశయమును జేరవి ఱొమ్ము, కంఠము వీనియందుండు ఆహారరసముతో గలసి స్రోతోబంధము, అగ్నిమాంద్యము, వాంతి మొదలగు రోగములను గలుగజేయును.

### ఉదకపాననిషిద్ధులు

ప్రక్లిన్నదేహమేహాక్షి గళరోగవ్రణాతురాః. ౫౩
పానం త్యజేయుః

ఆమరోగము, విసర్పాదిరోగములు, ప్రమేహము, నేత్రరోగము, కంఠరోగము, వ్రణము ఇవిగలవారు ద్రవరూపమయిన పానమును త్యజించవలయును.

"మేహీ శ్లేష్మీ వ్రణీ కుష్ఠీ పాండుర్జఠరపీనసీ,
శోషాతిసారీ మందాగ్నిః పానీయం మందమాచరేత్,

నోర్ధ్వాంగపవనావిష్టే వాగ్వ్యాయామహతే న చ,
క్షతోరసి శ్వాసకాస హిక్కాచ్ఛర్ద్యర్దితే న చ,
నిరన్నేచోర్ధ్వరోగే చ నపేయంవారిశీతలమ్."

మేహము, ప్లీహము, వ్రణము, కుష్ఠము, పాండువు, ఉదరరోగము, పీనసము, శోష, అతిసారము, అగ్నిమాంద్యము, ఇవిగలవారు అతిస్వల్పముగ నుదకమును పానముచేయ తలయును. ఊర్ధ్వాంగవాతము, అతిసంభాషణముచేసినవాడు, ఉరఃక్షతము, శ్వాసము కాసము, హిక్క, వాంతి, ఇవిగలవారు ఉదకపానమే చేయంజనదు. అన్నమును భుజించనివాడును, ఊర్ధ్వరోగముగలవాడును శీతోదకమును పానము చేయంజనదు అని ఖరనాద మనుగ్రంథమున జెప్పబడియున్నది.

## భోజనానంతర-నిషిద్ధకృత్యములు

సర్వశ్చ భాష్యాధ్వ శయనం త్యజేత్,
పీత్వా భుక్త్వాఽతపం వహ్నిం యానం ప్లవనవాహనమ్. ౫౪

పానభోజనములను జేసినతోడనే అధికసంభాషణము, మార్గగమనము, నిద్ర, ఎండ, అగ్ని, రథాదివాహనముల నెక్కుట, దాటుట, గుఱ్ఱముమొదలగు వానిపై నెక్కుట, ఈ మొదలగుకార్యములను పైజెప్పిన వారందరును వర్జింపవలయును.

## భోజనకాలము

ప్రసృష్టే విణ్మూత్రే హృది సువిమలే దోషే స్వపథగే,
విశుద్ధే చోద్గారే క్షుదుపగమనే వాతేఽనుసరతి,
తథాగ్నావుద్రిక్తే విశదకరణే దేహే చ సులఘౌ
ప్రయుంజీతాహారం విధినియమితం కాలస్స హి మతః. ౫౫

మలమూత్రాదులు బాగుగ బయలువెడలి హృదయము రసశేషాజీర్ణ జనిత గురుత్వాదిదోషరహితంబై, పూర్వము భుజించిన యన్నాదులు బాగుగ జీర్ణమగుటచే వాతాదిధాతువులు తమతమమార్గములయందు సంచరించుచు, త్రేనుపులు ఆహారరసశేష సంబంధములేక శుద్ధములుగ వెడలుచు, స్రోతోమార్గములు రసశేషముచే నడ్డులేక నిర్మలములై, ఆకలి తీవ్రముగ గల్గి, వాతము అనులోమముగ సంచరించుచు, జాఠరాగ్ని అన్నాదులను పాకముశేయుటకు సమర్థంబై, ఇంద్రియములు నిర్మలమై, దేహము మిగుల లఘువుగ నుండునపుడు "కాలే సాత్మ్యంశుచిహితమ్" అనువచనములచే చెప్పియుండు నాహారములను భుజింపవలయును. ఇదియ యాహారమునకు ముఖ్యమైన

కాలము. ఈకాలము నతిక్రమించి చేయబడిన యాహారము అకాలదోషమునం జేసి చక్కగా జీర్ణముగాక రోగముల గల్గించును.

"అతీత కాలం భుంజానో వాయునోపహతేఽనలే,
కృచ్ఛ్రాద్విపచ్యతేఽభుక్తం ద్వితీయం న చ కాంక్షతి,
తథాఽఽధ్మానమాటోప సాదాంశ్చ కురుతేఽధికమ్,"

కాలము నతిక్రమించి అన్నాదులను భుజించినచో నవి వాతముచే దూషింపబడి అతి కష్టముమీద జీర్ణంబగుచు రెండవ మారు భోజనమునం దిచ్ఛ గలుగకుండుచు, ఉదర ములో ఆధ్మానము, కూతలు, అగ్నిమాంద్యము వీని నధికముగ గలుగజేయును. కాబట్టి పూర్వోక్త ఆహారకాలమునందే భుజింపవలయు నని తంత్రాంతరమునందు జెప్పబడి యున్నది.

కాలాతిక్రమణముచే పైజెప్పినదోషములు సంభవించును కావున నియతకాల మున విధ్యుక్తముగ భుజింపవలె నని భావము. పైజెప్పబడిన మూలశ్లోకము ధీరలలితా వృత్తము. "యదహా న్సాతః సస్స్యాత్ రస (౬) రవి (౧౨) విరామా ధీరలలితా" అని వృత్తలక్షణము.

అష్టమాధ్యాయము, ముగిసెను.



# నవమాధ్యాయము

అవ. విశేషముగా నుపయోగకారులగు అన్నపానాది ద్రవ్యైకదేశమును, వాని యాహారవిధిమాత్రలును పూర్వాధ్యాయములయందు జెప్పబడినవి. అట్టి అన్నపానాదులయొక్క ద్రవ్యరసవీర్య విపాకాదులను చక్కగ బరీక్షించి ప్రయోగించవలసినది యావశ్యకము. అట్లగుటచే మాత్రాశితీయాధ్యాయానంతరము ద్రవ్యాది విజ్ఞానీయాధ్యాయము చెప్పబడుచున్నది —

ద్రవ్యాది విజ్ఞానీయాధ్యాయ ప్రారంభము

సూ. అథాతో ద్రవ్యాదివిజ్ఞానీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహు రాత్రేయాదయో మహర్షయః.

మాత్రాశితీయాధ్యాయానంతరము అన్నపానాదులయొక్క ద్రవ్యరస వీర్య విపాకాదిజ్ఞాన మావశ్యకం బగుటచే వాని నెఱుంగుటకు దగిన ద్రవ్యాది విజ్ఞానీయాధ్యాయమును వివరించెదము.

ద్రవ్యప్రాధాన్యము

ద్రవ్యమేవ రసాదీనాం శ్రేష్ఠం తే హి తదాశ్రయాః,

రసాదులు ద్రవ్యము నాశ్రయించియుండుటచే రసవీర్య విపాకాదులలో ద్రవ్యమే ప్రధానంబు.

ద్రవ్యములకు పంచభూతస్వరూపము

పంచభూతాత్మకం తత్తు

రసవీర్యవిపాకాదుల కాశ్రయముగను, పృథివ్యాది పంచమహాభూతముల కార్యముగ నుండు స్థావరజంగమరూప మయిన ద్రవ్యములు పంచభూతాత్మకంబులు. అందు స్థావరములన ఒకచోటనుండి వేరొకచోటికి బోవ స్వతంత్రశక్తిలేనివి. అయ్యవి కరక తాని ఉసిరిక మున్నగునవి. జంగమములన ప్రాణేంద్రియములతోగూడి యొకచోట నుండి వేరొండ చోటికిబోవ స్వతంత్రశక్తికల్గినవి, అయ్యవి ఛాగములు మున్నగు సకల ప్రాణులు.

పంచభూతాత్మకములన —పంచభూతస్వరూపముగలవియని యర్థము. కారణ ద్రవ్యములయిన ఆకాశాదులనుకూడ పంచభూతాత్మకంబు లని జెప్పుపక్షములో సర్వంబును పంచభూతస్వరూపము గల్లదిగ నగును. అట్లయినచో ఫలానిది ఆకాశ మనుమహా

భూత మనియు, ఫలానిది పృథివి యను మహాభూత మనియు ప్రత్యేకముగా వ్యవహరించుటకు సాధ్యమే కాకపోవును. మఱియును కారణముగనుండు వస్తువు కార్యముగ నెప్పుడును కానేరదు. కాబట్టి కార్యమైన ద్రవ్యమునకే పంచభూతస్వరూపత్వము గలిగియుండునేకాని కారణద్రవ్యమైన ఆకాశాదులకు పంచభూతస్వరూపము గలిగియుండ నేరదు.

"ఖాదీన్యాత్మా మనః కాలో దిశశ్చ ద్రవ్యసంగ్రహః"

అను వచనముచేత ఆకాశాది పంచమహాభూతములు, ఆత్మ, మనస్సు, కాలము, దిక్కు—౨౯, ఇవియన్నియు ద్రవ్యము లని చెప్పి.—

"యత్రాశ్రితాః కర్మగుణాః కారణం సమవాయి యత్,
తద్ద్రవ్యమ్.

అను వచనముచేత దేనియందు చలనరూపమైన కర్మ, సంయోగాదిగుణములు గలిగియుండునో, ఎద్ది సమవాయి కారణముగ నుండునో, దేనియందు శబ్దాదిగుణములును, గురుత్వాదిగుణములును, సమవాయిసంబంధము చేనుండునో యట్టిదానినే ద్రవ్య మని నిర్దేశించి వాని లక్షణములనుకూడ చరకాచార్యుడు చెప్పియున్నాడు. సమవాయి కారణ మనగా —కార్యమైన వస్త్రమునకంటె వేరుగాక తంతువులు వస్త్రమునకన్వయముగా కారణంబైయుండునదియని యర్థము. కర్మగుణాశ్రయత్వము సమవాయికారణత్వము అనునవి సర్వద్రవ్యములయందుండుట దుర్లభము. అయితే కర్మ, గుణము అనువానికి మనస్సు ఆశ్రయముగనుండుటచే మనస్సు ద్రవ్య మనియు, కర్మ, గుణము అనువానికి వాయ్వాదులు ఆశ్రయములుగను, సమవాయికారణములుగ నుండుటచే వాయ్వాదులు ద్రవ్య మనియు నిటుల నేది యేద్రవ్యమున కనుకూలించునో దానినిబట్టి ద్రవ్యమును తెలిసికొనవలయును. ఆకాశ మను ద్రవ్యమే లేదు. అట్లుండగా ఆకాశాదులు కారణ ద్రవ్యము లని చెప్పుట యసంగత మని కొంద రాక్షేపించెదరు. ఆకాశము సముద్రమువలె నీలరూపము గలదై ప్రత్యక్షముగ నగుపడుచుండుటవలనను,—

"వహతి శశభృన్నీలస్నిగ్ధే నభస్యవదాతతామ్"

అని కర్ణాటుడను కవియును,—

"ధౌతాశని నభసి"

అనిబాణకవియు నాకాశము నీలవర్ణము గలది యని వర్ణించియుండుటవలనను, ఆకాశ మను ద్రవ్యము గల దని సిద్ధంబగుచున్నది. అయితే నానావిధవర్ణములు గల పర్వతము దూరములోనుండి జూచునపుడు నీలరూపముగ గనబట్టునటులనే దూరములోనుండి జూచుటవలన నాకాశముకూడ భ్రాంతిచే నీలరూపముగ గనబట్టుచున్నది. ఆకాశము

నీలవర్ణము గలది యని కవులు వర్ణించినందుకు ప్రమాణంబెద్దియు కనుపడదు. కొందరు కవులు ఆకాశము తెలుపువర్ణము గలది యని కూడ వర్ణించియున్నారు. ఆకాశము నిరాకారంబైనది. అట్లగుటచే దానికి నీలశుక్లరూపము లుండుట యసంభావితము. కాబట్టి ఆకాశ మను ద్రవ్యముగల దనెడి పైసిద్ధాంతము యుక్తి యుక్తము కాదని కొందరు వచింపుచున్నారు. మఱియును బాణాదులయొక్క ఋజుత్వము నొక కన్నును మూసి కొని మఱియొకదానిం దెరచి జూచుటచే కనుపించునటుల నాకాశముయొక్క రూపము సమీపమునందు గన్పట్టక దూరమునందు గన్పట్టును. కాబట్టి దర్శనభేదముచే ఆకాశమునకు రూపముగల దని జెప్పుటయుక్తంబని కొందరువచింపుచున్నారు. ఇదియును యుక్తియుక్తము కాదు. ఏలనగా - రూపము గలిగియుండునట్టి ద్రవ్యమునకు స్పర్శము కూడ గలిగియేయుండును. ఆకాశమునకు రూపము నొప్పుకొనుపక్షములో స్పర్శమును కూడ నొప్పుకొనవలయును. స్పర్శము నొప్పుకొననిపక్షములో ఆకాశమే సిద్ధించుట దుర్లభము. కాబట్టి ఆకాశమునకు రూపమే లే దని మఱికొందరు వచింపుచున్నారు.

వాయువు రూపరహితమయి స్పర్శముతో గూడియుండునటులనే ఆకాశము కూడ రూపముతో గూడి స్పర్శములేనిదై యుండవచ్చు నని కొందరు వచించెదరు. అయితే రూపముగలిగియుండు ద్రవ్యమునందు స్పర్శముకూడ గలిగియుండవలసినది యావశ్యకమే కాని స్పర్శముగలిగియుండు ద్రవ్యమునందు రూపము గలిగియుండవలసినది యావశ్యకములేదు. కాబట్టి ఆకాశము రూపముమాత్రము గలదై స్పర్శము లేనిదిగ నుండు నని చెప్పుట యుక్తము. ఆకాశము సత్పదార్థము కాదు. అయితే ఆకాశము సిద్ధించునట్టి మార్గం బెట్లనగా —

"అక్షరాత్ఖం తతో వాయు స్తస్మాత్తేజ స్తతో జలమ్,
ఉదకాత్పృథివీ జాతా భూతానామేష సంభవః."

అను వచనము ననుసరించి పరమాత్మవద్దనుండి ఆకాశము, దానిలోనుండి వాయువు, దానిలోనుండి తేజస్సు, దానిలోనుండి ఉదకము, దానిలోనుండి పృథివి జనించె నని పరమార్థజ్ఞానవంతులచే జెప్పబడియుండుటవలనను, ఆకాశమునందే సంచారమును, వృద్ధిని ప్రత్యక్షముగా జూచుచుండుటవలనను, శబ్దం అను పేరంబరంగు గుణమునకు ఆధారముగ నుండుటవలనను, ఆకాశ మను నొకద్రవ్యము సిద్ధంబగుచున్నది. ఆకాశ మను ద్రవ్యము నొప్పుకొననిపక్షములో ప్రపంచంబంతయు గట్టిదై ఒకటే యుంటగ నుండవలసివచ్చును.

ఇంతియగాక ప్రత్యక్షముగ నుండు శబ్ద మను గుణమునకు నాధారమే లేక పోవును. కాబట్టి ఆవశ్యకముగ నాకాశ మనుద్రవ్యము నొప్పుకొనందగియే యున్నది.

ఇటుల నాకాశము సిద్ధించినను వాయువు అను ద్రవ్యమునందు ప్రమాణము లేనందున వాయువు అనే ద్రవ్యమే లే దని కొంద రాక్షేపించెదరు. అయితే వాయువులో స్పర్శ గుణము ప్రత్యక్షముగా కనుపించుటవలన నట్టి స్పర్శమునకు ఆధారమైన వాయువు అను ద్రవ్యము గల దని సిద్ధంబగుచున్నది. అయినప్పటికి కారణగుణము కార్యములో నుండవలసినది యావశ్యకము; కాబట్టి ఆకాశమునందు స్పర్శములేకుండుటవలన "ఆష రాత్ఖంతతో వాయుః" అను వచనప్రకారము ఆకాశములోనుండి జనించిన వాయువు నకును స్పర్శములేకయే యుండవలయును. కాబట్టి వాయువునకు స్పర్శము గల దని చెప్పుట యసంగత మనే శంక గలుగును. అయితే కారణగుణము కార్యములో కొన్నిస్థల ములయం దుండుటయును, కొన్నిస్థలములయందు లేకుండుటయును సహజంబైయున్నది. అది యెట్లన గా,—కారణముగ నుండు తంతువుయొక్క శ్వేతరూపము కార్యమైన వస్త్ర ములో నున్నది. పసపు, క్షారము, వీని సంయోగముచే రక్తరూపము గలుగుటవలన నిచట కారణగుణము కార్యమునందు లేకయున్నది. కాబట్టి ఆకాశము స్పర్శములేనిదైనను అందులోనుండి జనించిన వాయువునకు స్పర్శగుణము గలిగియుండుట విరుద్ధముకాదు.

ఉదకము, అగ్ని, పృథివి అను నీ మూటిలోను స్పర్శగుణ ముండుటవలన వాని సముదాయమే వాయు వని చెప్పబడుచున్నదే కాని ప్రత్యేకముగ వాయు వను ద్రవ్యమే లేదని కొంద రాక్షేపించెదరు. అయితే అగ్ని, జలము, పృథివి అనువానికి స్పర్శగుణ ముండినను అట్టివాని స్పర్శమునకంటె పత్రచలన శాఖాభంజనాదిక్రియలతో గూడి యుండు వాయువుయొక్క స్పర్శము విలక్షణముగా నున్నది. కాబట్టి అగ్ని, జల, పృథివీ సముదాయమే వాయు వనుట యుక్తము కాదు. వైద్యకతంత్రములో కఫాదు లకు క్రియానుగుణములు చెప్పియుండునటుల వాతమునకును ప్రత్యేకముగా క్రియా గుణములు జెప్పియుండుటచే వాయు వను నొకద్రవ్యముగల దని యూహ్యంబగుచున్నది. అగ్ని కట్టెలవలన గలుగుచున్న దనియు, కట్టెలు లేనిచో గలుగుటలే దనియు ప్రత్యక్ష ముగనే తెలియుచున్నది. కాబట్టి కట్టెలుమొదలగువానికంటె వ్యతిరిక్తమయిన అగ్ని వేరొకటియు లే దని కొంద రాక్షేపించెదరు. అయినను పైజెప్పిన "అక్షరాత్ఖం తతో వాయు" అను వచనమువలనను,—

"ఆగ్నేయం దాహభావర్ణ ప్రకాశపచనాత్మకమ్"

అను ఆయుర్వేదవచనమువలనను ద్రవ్యములయొక్క ఉత్పత్తికి కారణముగ నుండునట్టి యొకయగ్ని కల దని తత్వజ్ఞానులు చెప్పియుండుటవలనను, అగ్ని యను ద్రవ్యము గల దని సిద్ధంబగుచున్నది. ఇటుల పంచభూతములు సిద్ధించినను పృథివి మున్నగు నాల్గుభూతము లకు అవయవములు, రూపము, ప్రమాణము మొదలగునవి కలిగియుండుటచే నా పృథి

వ్యాది భూతములు నాల్గును జేరి ద్రవ్యోత్పత్తికి కారణంబగు నని చెప్పుట యుక్తముగ నుండును.

ఆకాశము అవయవరహితంబైనదిగ, సూక్ష్మ మయినదిగ, ఏకముగనుండుటచే నది ద్రవ్యమున కెటులకారణంబగును. ఆకాశము ద్రవ్యములో జేరుటయే దుర్లభము. కాబట్టి ద్రవ్యమును పంచభూతాత్మక మని జెప్పినది యసంగతమనే శంకగలుగును. అయితే అవయవములతో గూడియుండు ద్రవ్యములయొక్క యేభాగమునందు పంచ భూతములు కఠినంబులుగనుండునో యాభాగమునం దాకాశభాగము స్వల్పముగ నుండును. మరియు నేభాగమునందు పంచభూతములు కఠినంబులుగాకుండునో యా భాగమునం దాకాశభాగము అధికముగ నుండును. ఇటులనే ద్రవ్యములయందు నాకా శముయొక్క న్యూనాధికభావమును తెలిసికొనవలయును. ఈహేతువులనుబట్టి ద్రవ్యము పంచభూతాత్మక మని చెప్పినది యుక్తమే యగును.

ద్రవ్యోత్పత్తిప్రకారము

క్ష్మామధిష్ఠాయ జాయతే. ౧

ద్రవ్యము పృథివి యను మహాభూతము నాధారముగ నాశ్రయించి జనించును. పృథివి యను మహాభూతము ఆధారముగనుండి యుపచరించునట్టి పృధివిచే నారం భింపబడినది ద్రవ్య మని ద్రవ్యసామాన్యలక్షణము నెరుంగునది.

అంబుయోన్యగ్నిపవననభసాం సమవాయతః,
తన్నిర్వృత్తిర్విశేషశ్చ వ్యపదేశస్తు భూయసా. ౨

ద్రవ్యము జలమును ముఖ్యకారణముగ నునుచుకొని,—
"రసనార్థో రసస్తస్య ద్రవ్యమాపః క్షితిస్తథా,
నిర్వృత్తౌ చ విశేషే చ ప్రత్యయాః ఖాదయస్త్రయః."

అను చరకవచనప్రకారము అగ్ని, వాయువు, ఆకాశము అనువాని సంయోగముచే జనించును. ద్రవ్యములకు నానావిధమైన స్వభావములు (అనగా ఇది వేరుద్రవ్యము దానికంటె నిది వేరుద్రవ్యము అనెడి భేదములు) వాయువు, అగ్ని, ఆకాశము, అను వాని సంయోగముచేతనే యేర్పడుచున్నవి. సకలద్రవ్యములు పంచమహాభూతముల యొక్క కార్యముగ నుండును. ద్రవ్యము పంచభూతాత్మకం బైనను ఏద్రవ్యమునం దే భూతం బధికముగ జేరియుండునో యాద్రవ్యమున కాభూతముయొక్క పేరే గలిగి యుండును. అది యెట్లనగా:—పృధివ్యాధిక్యముచే జనించినద్రవ్యము పార్థివమని యును, ఉదకాధిక్యముచే జనించినద్రవ్యము ఆప్య మనియును, తేజోధిక్యముచే జనిం చినద్రవ్యము తైజస మనియును బలుంగును. కాబట్టి యితర భూతాధిక్యముచే జనించిన

ద్రవముయొక్క పేరు నిలులనే తెలిసికొనవలయును. మఱియును ద్రవ్యము లన్నియు పంచమహాభూతములచే జనించినవి యగుటవలన పంచభూతాత్మకంబు లని యేర్పడు చున్నది.

ద్రవ్యములకు రస కారణత్వము

తస్మాన్నైకరసం ద్రవ్యం భూతసంఘాతసంభవాత్,

ద్రవ్యము పృథివ్యాది పంచమహాభూతసముదాయమువలన గలిగినది యగుటచే ననేకరసములు కల్గియుండును. ద్రవ్యమువలెనే రసముకూడ పంచమహాభూతసంఘాతమువలన జనించినది. కావుననే ద్రాక్ష, ఆక్షోడము (అనగా గిరుకతాడి) క్షీరము, చెఱకు, క్షౌద్రము, ఆవుపాలు, మేకపాలు, శుక్తము మొదలగు ద్రవ్యములలో మధుర రసంబుండినను వానిలో నొక్కొక్క ద్రవ్యమునందును వేరువేరుగ రుచి గన్పట్టుచుం డును. ఇటులనే మాదీఫలము, ధాన్యామ్లము మొదలగు ద్రవ్యములు ఆమ్లరసము గలవి యైనను వానిలో ప్రతిదానియందును వేరువేరుగ రుచి గనుపించుచుండును. ఇటులనే లవణాదులయందును రుచిభేదము గన్పట్టును. మఱియును, సకలద్రవ్యములు పంచభూతాత్మకంబులుగ నుండినను వానియం దేభూతం బధికముగ జేరియుండునో ఆభూతము యొక్క పేరుచేతనే ఆద్రవ్యము వ్యవహరింపబడుచందంబున ద్రాక్షాదిద్రవ్యములలో మధురాద్యనేకరసములు ప్రత్యక్షముగ గనుపించుచుండినను వానిలో నే రసమధికముగ నుండునో ఆరసముచేతనే "ఇదం మధురం, ఇదం ఆమ్లం" అని వ్యవహరింపబడును. ఇటుల ద్రవ్యనిర్ణయమును చేసినపిదప "పంచభూతాత్మకం ద్రవ్యం" అనుప్రతిజ్ఞాను సారముగా,

"తస్మాన్నైకభూతజం ద్రవ్యం భూతసంఘాతసంభవాత్"

అని నిగమనమునందు జెప్పవలసినది న్యాయముగనున్నది. అయినప్పటికిని మధురాది షడ్రసములకు ఉదకమే ముఖ్యకారణము కాబట్టి ఉదక మనుభూతమునకే షడ్రసకార ణత్వము గలిగియుండునేకాని రసహీనముగనుండు ఇతరభూతములు షడ్రసములకు కార ణములు కానేరవు. అనుశంకను నిరాకరించుటకును, షడ్రసములనుగూర్చి పంచమహాభూ తములు కారణములని తెలియపరచుటకును,

"తస్మాన్నైకరసం ద్రవ్యం భూతసంఘాతసంభవాత్"

అని తంత్రకారుడు నిగమనమునందు జెప్పియున్నాడు.

మఱియును —

"రసనార్థోరసస్తస్య ద్రవ్యమాపః క్షితిస్తథా,
నిర్వృత్తౌ చ విశేషే చ ప్రత్యయాః ఖాదయస్త్రయః."

అనువచనముచేత మధురాదిరసములకుకూడ భూతసముదాయమే కారణ మని చరకాచార్యుడును జెప్పియున్నాడు. కాబట్టి ద్రవ్యము నాశ్రయించియుండు రసములకు భూతసముదాయమే కారణ మని రసభేదీయాధ్యాయమునందు సవిస్తరముగా జెప్పబడును.

### రసానురసవివరణము

నైకదోషాస్తతోరోగాస్తత్ర వ్యక్తోరసః స్మృతః. ౩
అవ్యక్తోఽనురసః కించిదంతే వ్యక్తోపి చేష్యతే,

ద్రవ్యము అనేకరసములు గలదై యుండుటవలన జ్వరాది రోగములుకూడ అనేక దోషాశ్రితములుగ నుండును (అనగా త్రిదోషాత్మకముగ నుండు నని యర్థము.) జ్వరము త్రిదోషాత్మకముగ నుండినను వాతాధిక్యముచే వాతజ్వర మనియు, పిత్తాధిక్యముచే పిత్తజ్వర మనియు, శ్లేష్మాధిక్యముచే శ్లేష్మజ్వర మనియు వ్యవహరింపబడును. మఱియును వాతాదులయొక్క సమవిషమరూపములను, అధికబలాబలముల ననుసరించి సన్నిపాతజ్వరమును నిశ్చయింపవలయు నని యీ తంత్రమునందు సవిస్తరముగ జెప్పబడును. ద్రవ్యములలో స్పష్టముగా గన్పట్టునది రస మనియు, స్పష్టముగా గన్పట్టకుండునది అనురస మనియు, తంత్రకారులచే జెప్పబడియున్నది. మఱియును హరీతక్యాది ద్రవ్యభక్షణానంతరము వానియంతమున స్పష్టముగా గన్పట్టెడి రసముకూడ అనురస మని తంత్రకారులచే వ్యవహరింపబడును.

### ద్రవ్యములకు గుర్వాదిగుణములు

గుర్వాదయో గుణా ద్రవ్యే పృథివ్యాదౌ రసాశ్రయే. ౪
రసేషు వ్యపదిశ్యంతే సాహచర్యోపచారతః,

పృథివ్యాది పంచమహాభూతకార్యంబును, మధురాదిరసముల కాశ్రయంబును నైన ద్రవ్యములలో గురుత్వాదిగుణము లుండును. అట్టి గురుత్వాదిగుణములు, మధురాది రసములు, గుడాదిద్రవ్యములలో జేరియుండుటచే "మధురో గురుః, లఘురమ్లః" అని మధురాదిరసములలో గురుత్వాదిగుణములు వ్యవహరించబడుచున్నవే కాని వాస్తవ్యములో గురుత్వాదిగుణములు మధురాదిరసములయందు లేకుండును.

### పార్థివద్రవ్యగుణము

తత్ర ద్రవ్యం గురు స్థూలస్థిరగంధగుణోల్బణమ్. ౫
పార్థివం గౌరవస్థైర్యసంఘాతోపచయావహమ్,

పార్థివాది పంచద్రవ్యములలో పార్థివద్రవ్యము గురుత్వము, స్థూలత్వము, స్థైర్యము, గంధము అనువాని నధికముగగలదై యుండును. మఱియు నాపార్థివద్రవ్యము గురుత్వము, స్థైర్యము, సంఘాతము, పుష్టి వీనిని గలుగ జేయును. ద్రవ్యములన్నియు పంచ-భూతాత్మకం బగుటచే వానియం దితరగుణంబులుకూడ గలిగియుండును. అయినప్పటికిని పై జెప్పిన గురుత్వాదిగుణములు పార్థివద్రవ్యమునందు విశేషముగా నుండు నని తెలియ పరచుటకై "ఉల్బణం" అనుశబ్దము ప్రయోగింపబడినది.

## ఆప్యద్రవ్యగుణము

ద్రవశీతగురుస్నిగ్ధమందసాంద్రరసోల్బణమ్. ౬
ఆప్యం స్నేహనవిష్యందక్లేదప్రహ్లాదబంధకృత్,

ఆప్యద్రవ్యము (అనగా ఉదకసంబంధమైన ద్రవ్యము) ద్రవత్వము, గురుత్వము, శైత్యము, స్నిగ్ధము, మాంద్యము, సాంద్రము (అనగా దట్టము), రసము అనునీగుణములు నధికముగా గలిగియుండును. మఱియు నా ఆప్యద్రవ్యము స్నేహనము, విష్యందము, క్లేదము, ప్రహ్లాదము (అనగా సంతోషము), బంధనము, వీనిని గలుగ జేయును. ఈ ద్రవ్యమునం దితరములగుగుణము లుండినను ద్రవత్వాదిగుణములుమాత్రము విశేషముగానుండు నని తెలియపరచుటకై "ఉల్బణం"అనుశబ్దం బిచటకూడ ప్రయోగింపబడెనది. కాబట్టి "ఉల్బణం" అనుశబ్దము ప్రయోగింపబడియుండు స్థలములయందు నిప్రకారమే అర్థము నూహించుకొనవలయును.

## ఆగ్నేయద్రవ్యగుణము

రూక్షతీక్ష్ణోష్ణవిశద సూక్ష్మరూపగుణోల్బణమ్. ౭
ఆగ్నేయందాహభావర్ణ ప్రకాశపచనాత్మకమ్,

ఆగ్నేయ (అగ్ని యను మహాభూతమునకు సంబంధించిన) ద్రవ్యము రూక్షముగ తీక్ష్ణముగ, ఉష్ణముగ, విశదముగ, సూక్ష్మముగ, నీలపీతాది రూపముగలదిగ నుండును. మఱియు నీద్రవ్యము తాపము, కాంతి, వర్ణము, ప్రకాశము, పచనము వీనిని గలుగ జేయును.

## వాయవ్యద్రవ్యగుణము

వాయవ్యం రూక్షవిశదం లఘు స్పర్శగుణోల్బణమ్. ౮
రౌక్ష్యలాఘవవైశద్యవిచారగ్లానికారకమ్,

వాయవ్య (వాయుసంబంధమైన) ద్రవ్యము రూక్షముగ, విశదముగ, విశేషలఘు

త్వము, స్పర్శ అను నీ గుణములు గలదిగ నుండును. మఱియు నది రూక్షత, లాఘవము, చలనము, గ్లాని వీనిని గలుగజేయును.

◆ ఆకాశద్రవ్యగుణము ◆

నాభసం సూక్ష్మవిశదలఘుశబ్దగుణోల్బణమ్.
సౌషిర్యలాఘవకరం

నాభసద్రవ్యము (అనగా ఆకాశాత్మకద్రవ్యము)సూక్ష్మముగ, ప్రకాశముగ, విశేషలాఘవము, శబ్దము అను నీ గుణములు గలదిగ నుండును. మఱియు నది రంధ్రమును, లాఘవమును గలుగజేయును.

◆ సర్వద్రవ్యములకు ఔషధస్వరూపము ◆

జగత్యేవమనౌషధమ్,
న కించిద్విద్యతే ద్రవ్యం వశాన్నానార్థయోగయోః. ౧౦

ఇటుల పంచమహాభూతములచే జనించి గురుత్వాదిగుణములతో గూడియుండు ద్రవ్యములలో నౌషధము కాకుండు ద్రవ్యము ప్రపంచమునందేదియును లేదు. ఇసుక, ధూళి మొదలగు సమస్తద్రవ్యములును నానావిధమయిన ప్రయోజనము, యుక్తి వీనిచే రోగములను హరింపజేయును. కాబట్టి సర్వద్రవ్యములు ఔషధస్వరూపంబులు. ప్రయోజనయుక్తులు అనగా ఫలానివస్తువును ఫలానివిధముగా జేర్చిన ఫలానిరోగమును పోగొట్టునని యర్థము.

◆ ద్రవ్యప్రభావము ◆

ద్రవ్యమూర్ధ్వగమం తత్ర ప్రాయోగ్నిపవనోత్కటమ్,
అధోగామి చ భూయిష్ఠం భూమితోయగుణాధికమ్. ౧౧

ఊర్ధ్వభాగమునందు సంచరించు(అనగా నూర్ధ్వగతము లగు దోషములను హరింపజేయునట్టి) మ్రంగకాయ మొదలగు ద్రవ్యములు తరుచుగ అగ్ని, వాయువు వీనియాధిక్యము గలవై యుండును. అధోభాగమునందు సంచరించు తెల్లతెగడ మొదలగు ద్రవ్యములు భూమి, ఉదకము, వీనియాధిక్యముగలవై యుండును. ఇటుల జెప్పినందుచే నేకకాలమునందు ఊర్ధ్వాధోభాగములయందు వ్యాపించి వానియందలిదోషములను హరింపజేసెడి ద్రవ్యములు మిశ్రస్వరూపము (అగ్ని, వాయు, భూమి, ఉదకము, అను భూతముల) మిశ్రరూపము గలవి యని స్వయముగనే యర్థంబగుచున్నది. సర్పము విషస్వరూపముగలదియైనను దానిపడగెయందుండుమణి విషమును హరింపజేయునటులనే 'అగ్ని, వాయువు' వీనియాధిక్యముగల హరీతక్యాదిద్రవ్యములు ఊర్ధ్వముగ సంచరింపక

అగ్నిభాగమునందు సంచరించి దోషములను హరింప జేయుచుండుటను ప్రత్యక్షముగా జూచుచున్నాము. కాబట్టి కొన్ని ద్రవ్యములయొక్క ప్రభావం ఓట్టిదని యెఱుంగుటశక్య మని సూచించుటకై "ప్రాయః" అనుపదము ప్రయోగింపబడినది.

ఇతి ద్రవ్యం రసాఙ్ భేదైరుత్తరత్రోపదేక్ష్యతే,

ఇటుల ద్రవ్యములనుగురించిన విషయములు చెప్పి ముగిసినవి. రసములయొక్క అరువదిమూడు భేదముల నీతంత్రకారుడు రసభేదీయాధ్యాయమునందు సవిస్తరముగ చెప్పబోవుచున్నాడు.

## వీర్యవిచారము

వీర్యం పునర్వదంత్యేకే గురుస్నిగ్ధహిమం మృదు. ౧౨
లఘురూక్షోష్ణతీక్ష్ణం చ తదేవం మతమష్టధా,

వీర్యము గురువు, స్నిగ్ధము, శీతలము, మృదువు, లఘువు, రూక్షము, ఉష్ణము, తీక్ష్ణము, అని యెనిమిది విధములుగ నుండు నని కొందరు వచించెదరు.

## చరకమతానుసారముగ వీర్యవిచారము

చరకస్త్వాహ వీర్యం తద్యేన యా క్రియతే క్రియా. ౧౩
నావీర్యం కురుతే కించిత్సర్వా వీర్యకృతా హి సా,

ఏవస్తువుచే నేక్రియ గలుగ జేయబడునో అదియ వీర్య మనబడును. సర్వక్రియలు వీర్యముచేతనే గలుగుచున్నవి. కాబట్టి వీర్యములేనివస్తువు ఏ క్రియనున్ను చేయనేరదు అని చరకాచార్యుడు చెప్పుచున్నాడు.

## గుర్వాదులకు వీర్యసంజ్ఞ

గుర్వాదిష్వేవ వీర్యాఖ్యా తేనాన్వర్థేతి వర్ణ్యతే. ౧౪
సమగ్రగుణసారేషు శక్త్యుత్కర్షవివర్తిషు,
వ్యవహారాయ ముఖ్యత్వాద్బహ్వగ్రగ్రహణాదపి. ౧౫

క్రియలనుజేయునట్టిశక్తి వీర్యమునకే గలిగియుండుటవలనను,—

"గుర్వాదయో గుణా ద్రవ్యే పృథివ్యాదౌ రసాశ్రయాః"

అను వచనముచేత సర్వద్రవ్యములలో గుర్వాదిగుణములనే ప్రధానంబులుగ జెప్పియుండుటవలనను, గుర్వాదిగుణములు అనేకమయిన ద్రవ్యరసాదుల నాక్రమించియుండుటవలనను, ఆయుర్వేదశాస్త్రములయందు రసాదులకంటె తొలుత గుర్వాదిగుణములను జెప్పియుండుటవల్లనను, సమస్తగుణములలో సారము గలవిగ (అనగా

జాఠరాగ్నిసంయోగముచే రసాదులవలె నశించినవిగ) మందసాంద్రాదిగుణములు, రసాదులు వీనికంటె విశేషశక్తితో గూడినవిగ నుండు గుర్వాదిగుణములకే వీర్య మను పేరు యుక్త మని తంత్రకారులు చెప్పుచున్నారు. కాబట్టి వీర్య మనుసంజ్ఞ గుర్వాది గుణములకే గలుగు నని, రసవీర్యవిపాకాదులకు గలుగనేర దనియు, తెలియపరచుటకై "గుర్వాదిష్వేవ" అను ఏవకారము ప్రయోగింపబడినది.

రసాదులకు వీర్యసంజ్ఞాభావము

అతశ్చ విపరీతత్వాత్సంభవంత్యపి నైవ సా,
విపక్ష్యతే రసాద్యేషు వీర్యం గుర్వాదయో హ్యతః. ౧౬

రసాదులకు వీర్య మనుసంజ్ఞ గలిగియుండినప్పటికి నవి పైచెప్పిన హేతువుల కంటె విరుద్ధముగనుండుటవలన (అనగా జాఠరాగ్నిసంయోగముచే రసమునకు నాశము గలుగుటవలన, గురుత్వాదిగుణములతో గూడియుండు రసములకే స్వకార్యమునందు శక్తిగలిగియుండుటవలన, వైద్యశాస్త్రములయందు రసాదులను ప్రధానముగ జెప్పకుండుటవలన, గురుత్వాదిగుణములకంటె తొలుత రసాదులను జెప్పక తదనంతరము చెప్పియుండుటవలన) వీర్య మనుసంజ్ఞ రసాదులకు తంత్రకారులచే నంగీకరింపబడలేదు. కాబట్టి గురుత్వాదిగుణములకే వీర్య మనుసంజ్ఞ గలుగునేకాని రసాదులకు వీర్య మనుసంజ్ఞ గలుగనేరదు. ఇటులనే విపాకము, క్రియ వీనికిని వీర్య మనుసంజ్ఞ గలుగనేర దని తెలిసికొనవలయును.

ద్వివిధవీర్యము

ఉష్ణం శీతం ద్విధైవాన్యే వీర్యమాచక్షతేఽపి చ,

ఇతరు లగు కొందరాచార్యులు వీర్యము ఉష్ణ, శీతభేదములచే ద్వివిధంబుగ నుండు నని వచించెదరు. వీర్యము రెండేవిధము లనియు, ఎనిమిది విధములు కా వనియు, సూచించుటకై "ద్విధైవ" అను ఏవకారము ప్రయోగింపబడినది.

వీర్యద్వైవిధ్యయుక్తి

నానాత్మకమపి ద్రవ్యమగ్నీషోమౌ మహాబలౌ. ౧౭
వ్యక్తావ్యక్తం జగదివ నాతిక్రామతి జాతుచిత్,

నానావిధస్వభావముగల జగత్తు వ్యక్తావ్యక్తముల నేకాలమునందు నతిక్రమించ కుండు చందంబున స్థావరజంగమ స్వరూపముగ, చేతనాచేతనస్వరూపముగ, నానాస్వభావముగలదిగ నుండు ద్రవ్యముకూడ అధికశక్తిగల అగ్ని, సోముల నేకాలమునందు నతిక్రమించకుండును. అనగా కొన్నిద్రవ్యములు ఆగ్నేయములుగను కొన్ని

సౌమ్యములుగ నుండవలసినవి యావశ్యకము. వానంజేసి కొన్ని ద్రవ్యములు ఉష్ణ వీర్యము గలవిగ, కొన్ని శీతవీర్యము గలవిగ నుండును. ఈయుక్తిచేతనే ద్రవ్యములకు పై జెప్పిన ద్వివిధ వీర్యములే గలిగియుండు నని చెప్పుచున్నారు.

"న మత్స్యాః పయసా సహాభ్యవహర్తవ్యాః ఉభయం
హ్యేతన్మధురం మధురవిపాకం శీతోష్ణత్వాద్విరుద్ధవీర్యం
విరుద్ధవీర్యత్వాచ్ఛోణిత ప్రదూషణాయ."

మత్స్యములు పాలు అను నీరెండును మధురములుగ, మధురవిపాకము గలవిగ నుండును. మత్స్యములు శీతవీర్యము గలవిగ క్షీరము ఉష్ణవీర్యముగలదిగ నుండును. కాబట్టి మత్స్యము క్షీరము అను నీరెండును పరస్పరము విరుద్ధమైన వీర్యము గలవి. అట్లగుటచేతనే యవి రక్తమును జెఱుచును. కాబట్టి మత్స్యములను పాలతోడ జేర్చి భుజింపంజన దని చరకాచార్యుడు చెప్పియున్నాడు. కావున నతని యభిప్రాయమునందును వీర్యము ఉష్ణశీతభేదములచే ద్వివిధం బని స్పష్టమగుచున్నది. వ్యక్త మనగా —దృశ్యము. సాంఖ్య మతమునందు వ్యక్త మనగా మహదాదులు. అవ్యక్త మనగా — ప్రధానము, పురుషుడు అని యర్థము.

### ఉష్ణశీతవీర్యగుణములు

తత్రోష్ణం భ్రమతృట్గ్లానిస్వేదదాహాశుపాకితాః. ౧౮
శమం చ వాతకఫయోః కరోతి శిశిరం పునః,
హ్లాదనం జీవనం స్తంభం ప్రసాదం రక్తపిత్తయోః ౧౯

పైజెప్పిన ఉష్ణశీతవీర్యములలో ఉష్ణవీర్యము భ్రమ, దప్పి, బడలిక, చెమట, తాపము, శీఘ్రముగ జీర్ణము, వాతకఫములకు శమనము వీనిని గలుగజేయును. శీతవీర్యము తృప్తి, శక్తి, స్తంభము, రక్తపిత్తములకు ప్రసన్నత్వము వీనిని గలుగజేయును.

### విపాకలక్షణము

జాఠరేణాగ్నినా యోగాద్యదుదేతి రసాంతరం,
రసానాం పరిణామాంతే సవిపాక ఇతి స్మృతః. ౨౦

జాఠరాగ్ని సంయోగముచే రసములకు జీర్ణాంతమునందుగలుగు రసవిశేషమే విపాక మని ఋషులచే జెప్పబడినది.

### మధురాదివిపాకవివరము

స్వాదుః పటుశ్చ మధురమమ్లోఽమ్లం పచ్యతే రసః,
తిక్తోషణకషాయాణాం విపాకః ప్రాయశః కటుః. ౨౧

మధురరసము (అనగా బెల్లము మొదలగునవి) లవణరసము (అనగా సైంధవలవణము మొదలగునవి) ఈరసములురెండును మధురముగా పాకముచెందును. (అనగా మధుర విపాకము గలవి యని భావము) ఆమ్లరసము (అనగా దధి కాంజికము మొదలగునవి) తరుచుగ ఆమ్లమైనవిపాకము గలవిగనుండును. తిక్తము, కటు, కషాయము అను నీ మూడు రసములు తరుచుగ కటువైన విపాకముగలవిగ నుండును.

'స్వాదురమ్లో విపాకోన్యే వ్రీహిః" అను వచనప్రకారము వ్రీహిలోని మధుర రసము ఆమ్లమయినవిపాకముగలది యని పూర్వము చెప్పియుండుటచేతను, కరక్కాయలో నధికముగ నుండు కషాయరసము మధురమయిన విపాకముగలదిగ నుండుటచేతను, శుంఠి అల్లము, పిప్పలి వీనియందుండు కటురసము మధురమైన విపాకముగలవిగనుండుటచేతను, తరుచుగ అను అర్థమునుబోధించెడి "ప్రాయః" అను పదము ప్రయోగింపబడినది. తిక్త, కషాయరసములు రెండును కటువిపాకము గలవియగుటచే పిత్తకరము లని కొందరు వచించెదరు. ఇవి అసంగతము. ఏ లనగా—"రసం విపాకస్తౌ వీర్యం" అని ఉత్తరత్ర చెప్పబడువచనప్రకారము రసవిపాకములకంటె వీర్యము ఉత్కృష్టమయినదిగనుండుటచేతను పైజెప్పిన తిక్తకషాయరసములు రెండును శీతమయిన వీర్యముగలవియగుటచేతను పిత్తమును హరింపజేయును.

### రసాదులకుప్రత్యేకకార్యకర్తృత్వము

రసైరసౌ తుల్యఫలస్తత్ర ద్రవ్యం శుభాశుభమ్,
కించిద్రసేన కురుతే కర్మ పాకేన చాపరమ్. ౨౨
గుణాంతరేణ వీర్యేణ ప్రభావేణైవ కించన,

విపాకకాలమున గలుగు మధురామ్ల కటురసములు రసనేంద్రియమునకు విషయమైన మధురామ్లకటురసములతో తుల్యమైన ఫలముగలవిగ నుండును. (అనగా భుజింపబడిన మధురరసమునకు జారరాగ్నిసంయోగముచే గలుగు నట్టి యితరమయినరసము స్వభావమైన మధురరసముతో తుల్యముగనుండునని భావము.) ఇటులనే ఆమ్లాదిరసములకును తెలియవలయును. స్వభావమైన మధురాదిరసములకుగలిగియుండు శుక్రవృద్ధికరత్వాదికార్యములు జారరాగ్ని సంయోగముచే జనించు నితరరసములకు కూడ గలిగియుండు నని సూచించుటకై "తుల్యఫలః" అని ఫలశబ్దము ప్రయోగింపబడినది. రసవీర్య విపాకాదులలో ద్రవ్యము రసముచేత ఒకానొక మేలును, చెరుపును జేయును. అది యెట్లనగా—మధువు కషాయరసము గలదిగనుండుటచే పిత్తమును శమింపజేయును. మఱియు నామధువే కటువిపాకము గలదియగుటచే కఫమును హరింపజేయును. కొన్నిద్రవ్యములు గుణాంతరముచే కొన్ని కృత్యములనుజేయును. అది

యెట్లనగా—అమ్లముగ నుండు కాంజికము రౌక్ష్యమువలన కఫమును హరింపజేయును. గుణాంతరము అనగా అన్యోన్యగుణవిరోధమువలనను, రసవిపాకమువలనను గలుగు శక్తి గుర్వాదిగుణము లని యర్థము. కొన్ని ద్రవ్యములు వీర్యమువలన కొన్నికృత్యములను జేయును. అదియెట్లనగా—కషాయముగ, తిక్తముగ నుండుమహాపంచమూలము ఉష్ణ వీర్యమువలన వాతమునుమాత్రము పోగొట్టుచున్నదే కాని పిత్తమును పోగొట్టుట లేదు. కొన్ని ద్రవ్యములు ప్రభావముచేతనే మంచికృత్యములను చెడుకృత్యములను జేయును. అదియెట్లనగా—అమ్లముగ, ఉష్ణముగనుండు సుర యనుమద్యము ప్రభావముచే క్షీరమును వృద్ధిజేయును అని తాత్పర్యము.

### బలిష్ఠమైనరసాదులకు కార్యకర్తృత్వము

యద్యద్ద్రవ్యే రసాదీనాం బలవత్త్వేన వర్తతే. ౨౩
అభిభూయేతరాం స్తత్తత్కారణత్వం ప్రపద్యతే,

ద్రవ్యాశ్రితముగనుండు రసవీర్యవిపాకప్రముగ నుండు రసాదిష్ఠవముభాలో బలివస్తువులు (అనగా రసముగాని, వీర్యముగాని, విపాకముగాని, ప్రభావముగాని) దుర్బలముగనుండు నితరవస్తువులను తిరస్కరించి (అనగా వ్యర్థముజేసి) కృత్యములను చేయుట యందు స్వయముగ కారణంబగుచున్నవి అని తాత్పర్యము.

### విరుద్ధగుణసంయోగములో అధికవస్తువులకు ప్రాబల్యము

విరుద్ధగుణసంయోగే భూయసాల్పం హి జీయతే ౨౪

విరుద్ధమయినగుణములు గల ద్రవ్యములకు సంయోగముగలుగునపుడు అల్పముగ నుండువస్తువు అధికమయినవస్తువుచే తిరస్కరింపబడును. అదియెట్లనగా—క్షీరము శీతమయిన వీర్యము గలదియైనను మధురరసముచేగలిగిన స్నేహగౌరవాదులవలన వాతశమనరూపమయిన కృత్యమును చేయుచున్నదే కాని స్వకార్యమయిన వాతప్రకోపమును చేయుటలేదు. “విరుద్ధగుణసంయోగః” అను పదమునకు విరుద్ధమైన గుణములు గల ద్రవ్యసంయోగమని అర్థము చేసికొనవలయునే కాని విరుద్ధమయిన గుణములయొక్క సంయోగ మని అర్థముచేసికొనంజనదు. ఏలనగా—గుణములకు సంయోగము చెప్పుట యుక్తముకాదు. ఇటులనే,—

“సంయోగస్తు ద్వయోర్బహూనాం వాసంహతీభావః”

అని చరకాచార్యుడును ద్రవ్యములకే సంయోగమును చెప్పియున్నాడు.

స్వరూపమువలన విరోధము, కార్యమువలన విరోధము అని విరోధము ద్వివి

ధము. వానిలో గురులఘువులకును, శీతోష్ణములకును గలిగియుండువిరోధము స్వరూప విరోధ మనబడును. వాయువును జయించుటకై రూక్షముగ, ఉష్ణముగనుండు ద్రవ్య సంయోగోపయోగము కార్యవిరోధ మనబడును.

## రసాదిస్వభావము

రసం విపాకస్తౌ వీర్యం ప్రభావస్తాన్వ్యపోహతి,
బలసామ్యే రసాదీనామితి నైసర్గికం బలమ్. ౨౫

విపాకము మధురాదిషడ్విధరసములను తిరస్కరించును. (అనగా రసకార్యము నడ్డగించునని భావము.) అదియెట్లనగా.—మధువులోనుండు మధురరసమును కటువిపాకము తిరస్కరించును కావున నామధువు మధురరసకార్యమైన వాతశమనమును చేయక కటువిపాకకార్యమయిన వాతప్రకోపమును చేయుచుండును. రసము, విపాకము అను నీ రెంటిని వీర్యము తిరస్కరించును. ఎట్లనగా —మహిషమాంసములో నుండు మధుర రసవిపాకములను ఉష్ణవీర్యము తిరస్కరించును. కావున మహిషమాంసము పిత్తాదులను దూషించుచున్నది అటుకాదేని మధురరసవిపాకములుగల యామాంసము పిత్తశమన మునే జేయవలయును. రసము, విపాకము, వీర్యము అను నీ మూటిని ప్రభావము తిరస్కరించును. ఎట్లనగా —అమ్లరసవిపాకములతోను ఉష్ణవీర్యముతోను గూడియుండు సుర యనుమద్యము క్షీరమును వృద్ధిజేయును. ఇటుల రసాదులకు స్వాభావికమైన శక్తి గలిగియుండును. రసము, విపాకము సమమయిన బలముగలవియైనను రసమును విపాకము స్వభావముచేతనే తిరస్కరించును. రసము విపాకము వీర్యము ఇవి సమానమైన బలము గలవియైనను రసవిపాకములను వీర్యము స్వభావముచేతనే తిరస్కరించును. రస విపాకవీర్య ప్రభావములు సమానమైనబలముగలవియైనను రసవీర్యవిపాకములను ప్రభావము తిరస్కరించును అని తాత్పర్యము.

## ద్రవ్యప్రభావము

రసాదిసామ్యే యత్కర్మ విశిష్టం తత్ప్రభావజం,

రెండుద్రవ్యములకు రసవీర్యవిపాకములు సమముగ నుండగా ఒకద్రవ్యము వేరు కృత్యమును, మఱియొకద్రవ్యము మఱియొకకృత్యమును చేయుట ద్రవ్యప్రభావ మని తెలియవలయును. మఱియును:

“రసవీర్యవిపాకాది గుణాతిశయవానలమ్,
ద్రవ్యస్వభావో నిర్దిష్టో యః ప్రభావస్స కీర్త్యతే.”

అను వచనము ప్రకారము రసవీర్యవిపాకాదిగుణములనతిక్రమించియుండు ద్రవ్యము యొక్కస్వభావమే ప్రభావమనబడును.

### ద్రవ్యప్రభావదృష్టాంతము

దంతీ రసాద్యైస్తుల్యాపి చిత్రకస్య విరేచనీ. ౨౬
మధుకస్య చ మృద్వీకా ఘృతం క్షీరస్య దీపనమ్,

నేలదంతి జేపాళపుగింజలు రసవీర్యవిపాకములచే చిత్రమూలమునకు తుల్యమైనదిగనుండినను రసవీర్యవిపాకములకంటె నతిశయించిన ద్రవ్యస్వభావము (అనగా ప్రభావము) వలన విరేచనముజేయించును. చిత్రమూలమైననో విరేచనము జేయించుటలేదు. ఇటులనే ద్రాక్షపండ్లు రసవీర్యవిపాకములచే మధుకమునకు (అనగా అతిమధురమునకు) తుల్యమయినదిగ నుండినను రసవీర్యవిపాకములకంటె నతిశయించిన ద్రవ్యస్వభావమువలన విరేచనము జేయించును. మధుకమైననో విరేచనకారి యగుటలేదు. ఇటులనే ఘృతము (నెయ్యి) రసవీర్యవిపాకములచే క్షీరమునకు తుల్యమయినదిగ నుండినను దీపనకారిగ నగుచున్నది. క్షీరంబైననో దీపనకారిగ నగుటలేదు.

“వస్తూనాం యస్స్వసంజ్ఞాయాః ప్రవృత్తౌ కారణే స్మృతః,
త్వతలాదిభిర్బోధ్యశ్చ ప్రభావ ఇతి కీర్తితః”

అను తంత్రాంతరవచనప్రకారము వస్తువులయొక్క సంజ్ఞావృత్తికి కారణముగను, త్వ, తల్ మొదలైన భావార్థసూచక ప్రత్యయములచే నెఱుంగదగినదిగనుండు ధర్మమే ప్రభావ మనబడును. ప్రభావము అనగా నేలదంతికి దంతీత్వమను ధర్మముండుటవలన దానికి విరేచనముజేయించుట ప్రభావమనియును, చిత్రమూలమునకు చిత్రకత్వమను ధర్మముండుటవలన దానికి విరేచనము జేయింపకుండుట ప్రభావ మనియును, ద్రాక్షపండును ద్రాక్షత్వము అనుధర్మ ముండుటవలన దానికి విరేచనముజేయించుట ప్రభావ మనియును తెలియవలయును. ఇటులనే సకలవస్తువులకును ప్రభావమును తెలిసికొనవలయునని కొందరు వచించుచున్నారు.

### ద్రవ్యభేదముచే కర్మభేదము

ఇతి సామాన్యతః కర్మ ద్రవ్యాదీనాం పునశ్చ తత్. ౨౭
విచిత్రప్రత్యయారబ్ధద్రవ్యభేదేన భిద్యతే,

ఈ ప్రకారముగా ద్రవ్యరస వీర్యవిపాక ప్రభావములయొక్క కర్మ సామాన్య

ముగా జెప్పబడినది. మరల నాద్రవ్య రస వీర్యాదులయొక్క కర్మ విచిత్రప్రత్యయారబ్ధ ద్రవ్యభేదముచే భిన్నంబుగ నగును మఱియును దేనిభేదముచే ద్రవ్యములలోని రస వీర్యాదులకు సామాన్యముగా జెప్పబడినకర్మ భిన్నంబగునో, ఏద్రవ్యమునందు రసాదులకు కారణములైనమహాభూతములు వేరుగను, ఆరసాదుల కాశ్రయమైన ద్రవ్యములకు కారణమైన మహాభూతములు వేరుగనుండునో అట్టి ద్రవ్యము విచిత్రప్రత్యయారబ్ధ మనబడును. ఏద్రవ్యమునందు రసాదులకుకారణమైన మహాభూతములును ఆరసాదులకు ఆశ్రయమైన ద్రవ్యములకు కారణమైన మహాభూతములును ఒకటేవిధముగ నుండునో అట్టిద్రవ్యము సమానప్రత్యయారబ్ధ మనబడును. కాబట్టి ద్రవ్యములు విచిత్రప్రత్యయారబ్ధమనియు, సమానప్రత్యయారబ్ధ మనియు రెండు విధంబులు. వానిలో సమానప్రత్యయారబ్ధ ద్రవ్యములు (అనగా క్షీరము, చెఱకు, శర్కర మొదలగునవి) తమతమరసాదులకు అనుగుణమైన కర్మలను చేయుచుండును. విచిత్రప్రత్యయారబ్ధ ద్రవ్యములు (అనగా మకుష్ఠము, యవలు, మత్స్యములు, సింహము మొదలగునవి) రసాదులకు అనుగుణమైన కర్మలను చేయకుండును. ఏలనగా —రసాదులకు కారణము వేరుగను, రసాదులకాశ్రయముగనుండు ద్రవ్యములకు కారణము వేరుగనుండుటచేతనే యని తెలియవలయును. ఇటుల రసాదిసమానప్రత్యయారబ్ధద్రవ్యము లనేకములుగ నుండినను వానియొక్క రసముల నుపదేశించుటచేతనే వానికర్మలుకూడ సులభముగ గ్రాహ్యంబగును. విచిత్రప్రత్యయారబ్ధద్రవ్యములలో ప్రతిదానికిని కర్మోపదేశము చేయనిచో వానికర్మల నెఱుంగుట కశక్యముగ నుండును.

విచిత్రప్రత్యయారబ్ధద్రవ్యోదాహరణము

స్వాదుర్గురుశ్చ గోధూమో వాతజిద్వాతకృద్యవః. ౨౮
ఉష్ణా మత్స్యాః పయశ్శీతం కటుస్సింహో న సూకరః,
తస్మాద్రసోపదేశేన న సర్వం ద్రవ్యమాదిశేత్. ౨౯

మధురరసము, గురుగుణము వీనితోగూడియుండు గోధుమలు సమాన ప్రత్యయారబ్ధద్రవ్య మగుటచే మధురరసమునకు జెప్పియుండు వాతహరణరూపమైన కర్మనే జేయుచుండును. యవలు మధురరసము, గురుగుణము వీనితో గూడినవిగ నుండినను విచిత్రప్రత్యయారబ్ధద్రవ్య మగుటచే మధురరసమునకు జెప్పియుండు వాతహరణరూపమైన కర్మనుచేయక వాతమునే వృద్ధిజేయుచుండును. మత్స్యములు మధురరసము గురుగుణము వీనితోగూడినవిగనుండినను నవి విచిత్రప్రత్యయారబ్ధద్రవ్య మగుటచే మధురరసమునకు జెప్పియుండునట్టి శీతవీర్యము లేనివై వానికి విరుద్ధమయిన ఉష్ణవీర్యము

గలదై యుండును. క్షీరము మధురరసము, గురుగుణము వీనితోఁ గూడినదిగ నుండినను నది సమానప్రత్యయారబ్ధద్రవ్య మగుటచే మధురరసమునకు జెప్పియుండునట్టి శీతవీర్యము గలదై యుండును. మధురరసము, గురుగుణము వీనితోఁ గూడియుండు సింహమాంసము విచిత్రప్రత్యయారబ్ధద్రవ్య మగుటచే రసానుగుణముగా మధురవిపాకరహితంబై తద్విపరీతమైన కటువిపాకము గలదిగ నుండును. మధురరసము, గురుగుణము వీనితోఁ గూడియుండు పందిమాంసము సమానప్రత్యయారబ్ధద్రవ్య మగుటచే రసానుగుణముగ మధురవిపాకముగలదిగనే యుండును. కాబట్టి సమానప్రత్యయారబ్ధద్రవ్యములయొక్క రసోపదేశముచేతనే వానిగుణములును స్పష్టంబగును.

"శీతం వీర్యేణ యద్ద్రవ్యం మధురం రసపాకయోః,
తయోరమ్లం యదుష్ణం చ యచ్చోష్ణం కటుకం తయోః.
తేషాం రసోపదేశేన నిర్దిష్టో గుణసంగ్రహః,
వీర్యతో విపరీతానాం పాకతశ్చోపదేక్ష్యతే.
యథా పయో యథా సర్పిః యథా వా చవ్యచిత్రకౌ,
ఏవమాదీని చాన్యాని నిర్దిశేద్రసతో భిషక్."

శీతవీర్యము మధురమయిన రసవిపాకములుగల ద్రవ్యములయొక్కయు, అమ్లమైనరస విపాకములు ఉష్ణమైన వీర్యముగల ద్రవ్యములయొక్కయు, కటువైన రసవిపాకములు ఉష్ణవీర్యముగల ద్రవ్యములయొక్కయు, గుణకర్మలను వానిరసోపదేశముచేతనే తెలిసికొనవలయును. విరుద్ధవీర్యముగల ద్రవ్యగుణములను పాకమువలన తెలిసికొనవల యునని ఉత్తరత్ర జెప్పబడును. క్షీరము, ఘృతము, చవ్యము, చిత్రమూలము వీనివలెనే అన్యద్రవ్యములనుకూడ రసముచే వైద్యుడు తెలిసికొనవలయును. అని చరకాచార్యు లుపదేశించిరి.

"గుర్వాదయో గుణా ద్రవ్యే"

అని పూర్వము జెప్పియుండు వచనప్రకారము ద్రవ్యములన్నియు తరుచుగ రసాది సమానప్రత్యయారబ్ధములుగనే యుండునని తలచి రసములచేతనే ద్రవ్యగుణములను తెలిసికొనవలయునని యాతంత్రకారుడు జెప్పియున్నాడు. కాబట్టి అనేకమైన సమాన ప్రత్యయారబ్ధ ద్రవ్యగుణములను రసోపదేశముచేతనే నిశ్చయించుటకు సాధ్యంబై యుండును. విచిత్రప్రత్యయారబ్ధ ద్రవ్యములైననో స్వల్పముగనుండును. వానిగుణ ములను రసోపదేశముచేత నిశ్చయించుట కసాధ్యంబు. కావున నట్టి విచిత్రప్రత్యయారబ్ధ ద్రవ్యములయొక్కగుణము ప్రత్యేకముగా వివరింపబడుచున్నది.

"మధురం కించిదుష్ణం స్యాత్కషాయం తిక్తమేవ వా,
యథా మహత్పంచమూలం యథా చానూపమామిషమ్.
లవణం సైంధవం నోష్ణమమ్లమామలకం యథా,
అర్కాగురుగుడూచీనాం తిక్తానాం చోష్ణ్యముచ్యతే.
కించిదమ్లరసం గ్రాహి కించిదమ్లం భినత్తి చ,
యథా కపిత్థం సంగ్రాహి భేది చామలకం యథా.
పిప్పలీ నాగరం వృష్యం కటు వా
కషాయం స్తంభనం శీతం సోభయా యామతోఽన్యథా.
తస్మాద్రసోపదేశేన న సర్వం ద్రవ్యమాదిశేత్."

మధురముగాని,కషాయముగాని, తిక్తముగాని ఉండు కొన్నిద్రవ్యములు ఉష్ణముగ నుండును. అవియెట్లనగా—మహాపంచమూలము, అనూపమాంసము, సైంధవలవణము, అనునవి ఉష్ణముగనుండును. పుల్లగ నుండు ఉసిరికకాయ ఉష్ణముగ నుండును. జిల్లేడు, అగురు, తిప్పతీగ ఇవి తిక్తరసముగలవియైనను ఉష్ణగుణముగలవియని జెప్పబడియున్నవి పుల్లని రసముగల కొన్నిద్రవ్యములు (అనగా పుల్లగనుండు వెలగ మొదలగునవి) మలాదులను గట్టిపరచును. పుల్లగనుండుకొన్ని ద్రవ్యములు (అనగా ఉసిరికకాయ మొదలగునవి) ఉంటకట్టియుండుమలాదులను భేదించును. పిప్పలి, శుంఠి అను నీరెండును కటురసముగలవియైనను శుక్రవృద్ధికారియని జెప్పబడినవి కషాయముగనుండు ద్రవ్యము స్తంభనకారియని, శీతవీర్యముగలదియని జెప్పబడియున్నది. అయినను కరక్కాయ కషాయరసము గలదియైనను ఉష్ణవీర్యముతోగూడి స్తంభనమునుమాత్రము చేయకుండును. కాబట్టి విచిత్రప్రత్యయారబ్ధ ద్రవ్యగుణాదులను రసోపదేశముచే నిశ్చయింపదగదని పైయర్థమునే చరకాచార్యుడుకూడ జెప్పియున్నాడు. ఇకజెప్పబడు రససంయోగములను రసాదిసమాన ప్రత్యయారబ్ధములైన మధుర, అమ్ల, లవణ, తిక్త, కటు కషాయరూపములగు రసములచేతనే చేయవలయును. విచిత్రప్రత్యయారబ్ధమైన మధురాదిరసములచే నారససంయోగమును జేయంజనదు. ఏలనగా—ఆరసములు విచిత్రప్రత్యయారబ్ధములుగ నుండుటవలన ఇట్టిరససంయోగభేదము ఇటువంటిగుణము గలదియనియును, ఇట్టి విషయమునం దీరససంయోగమును జేయవలయుననియును, రససంయోగముయొక్క స్వరూపం బిట్టిదనియును, నిశ్చయించుట కసాధ్యముగ నుండుటవలనను, ఆరససంయోగమునందు శాస్త్రములో జెప్పియుండుప్రకారము రసవీర్యవిపాకాదులు లేకుండుటవలనను అని తెలియవలయును. సమానప్రత్యయారబ్ధములైన రస

ములచే జేయబడిన రససంయోగమునందు సంయోగించియుండు రసములయొక్క శీతోష్ణస్వరూపమైన, వీర్యవిరోధము దోషావహమైనది కానేరదు. దోషావహ మనిచెప్ప పక్షమునం దనేకద్రవ్యములచే జేయబడిన రసాలా, పానకము, మొదలగువానిని భుజింపవలదనుటల తటస్థించును. మఱియును విచిత్రప్రత్యయారబ్ధరసములచే జేయబడిన రససంయోగములం జేరియుండు రసములయొక్క శీతోష్ణస్వరూపమైన వీర్యవిరోధము అధిక దోషావహం బైయుండును. ఉత్తరత్ర జెప్పబడు "త్రయస్త్రింశత్" అనగా ముప్పదిమూడువర్గములలోను,

"యదయౌగికం తజ్జహ్యాద్యౌగికం త్వనుక్తమపి యుంజ్యాత్"

అని చెప్పుటచే సమానప్రత్యయారబ్ధమైన రసాదులనే ఉపయోగించవలయునే కాని రసవీర్యవిపాకముల నిశ్చయించుట కసాధ్యంబైన విచిత్రప్రత్యయారబ్ధరసముల నుపయోగింపంజనదు.

నవమాధ్యాయము ముగిసెను



# దశమాధ్యాయము

అవ. పూర్వాధ్యాయమునందు "రసాః భేదైరుత్తరత్రోపదేక్ష్యతే" అనువాక్యముచే రసభేదములను ఉత్తరత్ర జెప్పెదమని ప్రతిజ్ఞ జేసి యుండుటచే నారసభేదముల దెలియపరచుటకై రసభేదీయాధ్యాయము జెప్పబడుచున్నది.

## రసభేదీయాధ్యాయప్రారంభము

**సూ. అథాతో రసభేదీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః, ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.**

రసభేదములను దెలిసికొనుటకు హితకరమయిన రసభేదీయమను అధ్యాయమును వివరించెదము. రసము "రసనార్థోరసః" అను చరకవచనప్రకారము రసనేంద్రియమునకు విషయ మైయుండును. "ఆపో హి రసవత్యః" అనెడి చరకవచనముచొప్పున విశేష రసముగలజలమునే రసము ముఖ్యకారణముగ గలదైయుండును, ఉదకము అస్పష్టమైన రసముగలది. అట్లగుటచే ప్రతిద్రవ్యమునందును మహాభూతవిశేషములవలన గలిగిన విలక్షణమైనరుచి రసముగా గనుపించుచుండును. అది యెట్లనగా — మధురరసముతో గూడియుండు క్షీరము, ద్రాక్ష, చెఱకు, శర్కర మొదలగు వస్తువులలో ప్రతిదానియందును విలక్షణమైన మధురరసముతో గూడియుండు రుచి గనుపట్టుచుండునే కాని ఒకటేవిధమైన రుచి గనుపట్టుచుండుటలేదు. ఇటులనే అమ్లరసముగల కలి, రేగు, చింత మొదలగు వానిలో ప్రతిదానియందును అనేకవిధములైన రుచిభేదములు గనుపట్టుచున్నవే కాని ఒకటేవిధమైన రుచి గనుపట్టుటలేదు.

## షడ్రసోత్పత్తిక్రమము

**క్ష్మాంభోఽగ్నిక్ష్మాంబుతేజః ఖవాయ్వగ్న్యనిలగోఽనిలైః,**
**ద్వయోల్బణైః క్రమాద్భూతైర్మధురాదిరసోద్భవః. ౧**

రెండు - రెండు భూతము లధికముగ జేరియుండు పృథివ్యాది పంచమహాభూతములచే మధురాదిషడ్రసములు యథాక్రమముగ పుట్టును. (అనగా అధికముగనుండు భూమి, ఉదకము అను నీరెండు భూతములచే మధురరసమును, అధికముగ నుండు భూమి

అగ్ని అను నీరెండుభూతములచే ఆమ్లరసమును, అధికముగ నుండు ఉదకము, అగ్ని అను నీరెండు భూతములచే లవణరసమును, అధికముగ నుండు ఆకాశము, వాయువు అను నీరెండు భూతములచే తిక్తరసమును అధికముగ నుండు అగ్ని, వాయువు అను నీరెండు భూతములచే కటురసమును, అధికముగనుండు భూమి, వాయువు అను నీరెండు భూతములచే కషాయరసమును జనించునని భావము) ద్రవ్యమువలెనే రసముకూడ పాంచభౌతిక మని తెలియపరచుటకై "ద్వయోల్బణైః" అను విశేషణము సూత్రకారునిచే ప్రయోగింపబడినది. కొన్ని భూతాధిక్యములతో గూడియుండు పృథివ్యాదిభూతములే వేర్వేరురసముల నుత్పత్తిజేయుటకు సమర్థంబు లగును. సర్వభూతాధిక్యముతో జేరియుండు పృథివ్యాది భూతములు వేర్వేరురసముల నుత్పత్తిజేయుటకు సమర్థంబులు కానేరవు ఇట్లుండుట భూమ్యాకాశాదిభూతములయొక్క స్వభావము. కాబట్టి భూమి, ఉదకము వీనియాధిక్యముచే మధురరసమును, ఉదకాధిక్యముచే వేరురసమును భూమి, ఆకాశము మొదలగువానియాధిక్యముచే వేరురసమును, ఇటుల ననేకరసములు ఉత్పత్తి యగు నని శంకింపంజనదు.

మధురలక్షణము

తేషాం విద్యాద్రసం స్వాదుం యో వక్త్రమనులింపతి,
ఆస్వాద్యమానో దేహస్య హ్లాదనోఽక్షప్రసాదనః. 2
ప్రియః పిపీలికాదీనాం

మధురాదిరసములలో నేనిని భుజించినతోడనే ముఖమునం దనులేపమును, దేహమునందు సుఖమును, ఇంద్రియములకు ప్రసన్నత్వమును, గలుగజేయునో పిపీలికాదిజంతువులకు ప్రియముగ నుండునో అట్టిదానినే మధురరస మని తెలియవలయును.

మధుమేహమునందు మూత్రమాధుర్యమువలన చీమలుజేరు నని తెలియపరచుటకై "ప్రియః పిపీలికాదీనాం" అను విశేషణము ప్రయోగింపబడినది. మూలశ్లోకమునం దుండు "ఆస్వాద్యమానః" అనుపదమును ఉత్తరత్ర జెప్పబడు శ్లోకములతోకూడ జేర్చి అన్వయము జేసికొనవలయును.

అమ్లలక్షణము

అమ్లః క్షాలయతే ముఖం,
హర్షణో రోమదంతానా మక్షిభ్రువనికోచనః. 3
అమ్లరసమును భుజింపగనే నోటియందు నీరుకారును, రోమములు, దంతములు

గగుర్పాటుచును. నేత్రములు, కనుబొమలు సంకోచమును జెందును. అమ్లరస మనగా పుల్లనిరసము.

### లవణరస లక్షణము

లవణస్స్యందయత్యాస్యం కపోలగలదాహకృత్,

లవణరసము నోటియందు నీరూరునటుల జేయును. చెక్కిళ్లు కంఠము వీనియందు తాపమును గలుగజేయును. అన్నమునందు రుచిని గలుగజేయుట ప్రసిద్ధంబగుటచే నిచట జెప్పక విరమింపబడినది.

"కంఠకపోలం విదహత్యన్నం ప్రరోచయతి"

అనగా కంఠము, చెక్కిళ్లువీనియందు తాపమును, అన్నమునందు రుచిని గలుగజేయు నవి అష్టాంగసంగ్రహమునందు స్పష్టముగా జెప్పబడియున్నది.

### తిక్తరసలక్షణము

తిక్తో విశదయత్యాస్యం రసనం ప్రతిహంతి చ. ౪

తిక్తరసము భుజింపబడగానే నోటిని పిచ్ఛిలముగ జేయును. రసనేంద్రియమును జెరచును (అనగా ఇతర రసగ్రహణశక్తిని నశింపజేయునని భావము.) తిక్తరస మనగా చేదురసము.

### కటురసలక్షణము

ఉద్వేజయతి జిహ్వాగ్రం కుర్వంశ్చిమిచిమాం కటుః,
స్రావయత్యక్షినాసాస్యం కపోలౌ దహతీవ చ. ౫

కటురసము భుజింపబడగానే నాలుకయొక్క అగ్రభాగమునందు ఉద్వేగమును (బాధను) గలుగజేయును. చిమచిమ యనును. నిప్పుజ్వాలను తాకినటులనే నేత్రములు, ముక్కు, నోరు వీనియందు నీరు కారును. చెక్కిళ్లలో దహించునటుల నుండును. కటురస మనగా కారముగనుండురసము.

### కషాయరసలక్షణము

కషాయో జడయేజ్జిహ్వాం కంఠస్రోతోవిబంధకృత్,

కషాయరసము భుజింపబడగానే నాలుకను జడముగ జేయును. (అనగా ఇతర రసముల దెలిసికొనునట్టిశక్తిని మందముగ జేయు నని భావము). కంఠమునందలి స్రోతస్సులను బంధించును. (అనగా శ్వాసాదులనడ్డగించునని భావము.) కషాయరస మనగా ఒగరురసము.

రసానామితి రూపాణి కర్మాణి

ఇటుల మధురాదిషడ్రసములయొక్క లక్షణములు చెప్పబడెను. ఇక వానికృత్యములు క్రమముగా జెప్పబడును.

## మధురరసకృత్యము

మధురో రసః. ౬

ఆజన్మసాత్మ్యాత్కురుతే ధాతూనాం ప్రబలం బలం,
బాలవృద్ధక్షతక్షీణవర్ణకేశేంద్రియౌజసామ్. ౭
ప్రశస్తో బృంహణః కంఠ్యస్స్తన్యసంధానకృద్గురుః,
ఆయుష్యో జీవనస్స్నిగ్ధః పిత్తానిలవిషాపహః. ౮
కురుతేఽత్యుపయోగేన స మేదః కఫజాన్ గదాన్,
స్థౌల్యాగ్నిసాదసంన్యాసమేహగండార్బుదాదికాన్. ౯

రసములలో మధురరసము జన్మముమొదలుకొని శరీరమునకు సాత్మ్యముగ నుండుటచే నుపయోగించినయెడల ధాతువులయొక్క స్వాభావిక మగు బలము నధికపఱచును. బాలవృద్ధ క్షతక్షీణులకును, శరీరకాంతి, తలవెండ్రుకలు, ఇంద్రియములు, ఓజస్సు వీనికిని హితకరముగ నుండును. శరీరపుష్టిని గలుగజేయును. కంఠమునకు హితకరముగజేయును. చనుబాలను వృద్ధిజేయును. విరిగినయంగముల నొకటిగ జేర్చును. గురువుగ నుండును. ఆయువును వృద్ధిజేయును. జీవనకారి (అనగా నియతమగు నాయుః కాలము వరకు జీవింపజేయు నని యర్థము.) జిగటగ నుండును. పిత్తము, వాతము, విషము వీనిని హరింపజేయును. మధురరసము నధికముగ సేవించినచో మేదస్సు, శ్లేష్మము వీనిచేగలుగు స్థూలత్వ, అగ్నిమాంద్య, సంన్యాస, ప్రమేహము, గండము, అర్బుదము మున్నగురోగములను గల్గించును. క్షీరము ధాతువృద్ధికారిగ, శుక్రవృద్ధికారిగ నుండునటులనే మధురరసముకూడా క్రమముగా రక్తాదిధాతువులను, శుక్రమును వృద్ధిజేయు నని తెలియపరచుటకై "జీవనం, ఓజస్యం" అను నీరెండుపదములు ప్రయోగింపబడినవి.

## అమ్లరసకృత్యము

అమ్లోఽగ్నిదీప్తికృత్స్నిగ్ధో హృద్యః పాచనరోచనః,
ఉష్ణవీర్యో హిమస్పర్శః ప్రీణనః క్లేదనో లఘుః. ౧౦
కరోతి కఫపిత్తాస్రం మూఢవాతానులోమనం,
సోఽత్యభ్యస్తస్తనోః కుర్యాచ్ఛైథిల్యం తిమిరం భ్రమమ్. ౧౧

కండుపాండుత్వవీసర్పశోఫవిస్ఫోటతృట్ జ్వరాన్,

ఆమ్లరసము అగ్నిదీపనమును గలుగజేయును. స్నిగ్ధముగ నుండును. హృదయమునకు హితకరమైనది. పాకమును, రుచిని గలుగజేయును. ఉష్ణమయిన వీర్యము గలది. శీతలమయిన స్పర్శముగలది. తృప్తినిచ్చును. క్లేదమును గలుగజేయును. లఘువుగ నుండును. కఫమును, పిత్తరక్తమును గలుగజేయును. అనులోమముగా సంచరింపకుండు వాతమునకు అనులోమగతిని గలుగజేయును. ఆమ్లరసము నధికముగ నుపయోగించినచో శరీరశైథిల్యము, తిమిరవాతము, భ్రమ, దురద, పాండురోగము, విసర్పము, శోఫ, విస్ఫోటము, దప్పి, జ్వరము అనునీరోగములను గలుగజేయును.

లవణరసకృత్యము

లవణః స్తంభసంఘాతబంధవిధ్మాపనోఽగ్నికృత్. ౧౨
స్నేహనః స్వేదనస్తీక్ష్ణో రోచనశ్ఛేదభేదకృత్,
సోఽతియుక్తోఽస్రపవనం ఖలతిం పలితం వలిమ్. ౧౩
తృట్ కుష్ఠవిషవీసర్పాన్ జనయేత్క్షపయేద్బలం,

లవణరసము స్తంభనము, సంఘాతము, బంధనము వీనిని పోగొట్టును. అగ్నిదీపనమును గలుగజేయును. స్నేహకారి. స్వేదమును గలుగజేయును. తీక్ష్ణముగ నుండును. రుచినిచ్చును. గాయమును మాన్పును. దాని నధికముగ నుపయోగపరచినచో వాతరక్తము ఖలతి (అనగా ఇంద్రలుప్తరోగము) వెండ్రుకలు నెరయుట, వళులు, దప్పి, కుష్ఠము, విషము, విసర్పము వీనిని గలుగజేయును. బలమును పోగొట్టును.

తిక్తరసకృత్యము।

తిక్తః స్వయమరోచిష్ణురరుచిం కృమితృడ్విషమ్. ౧౪
కుష్ఠమూర్ఛాజ్వరోత్క్లేశదాహపిత్తకఫాన్ జయేత్,
క్లేదమేదోవసామజ్జశకృన్మూత్రోపశోషణః. ౧౫
లఘుర్మేధ్యో హిమో రూక్షః స్తన్యకంఠవిశోధనః,
ధాతుక్షయానిలవ్యాధీ నతియోగాత్కరోతి సః. ౧౬

తిక్తరసము స్వభావముగా నోటికి అరుచిగ నుండును. అరుచి (అనగా ఆహారమునం దిచ్ఛలేకుండుట యని యర్థము.) కృములు, దప్పి, విషము, కుష్ఠము, మూర్ఛ, జ్వరము, ఓకరింతలు, తాపము, పిత్తము, కఫము, వీనిని పోగొట్టును. క్లేదము, మేదస్సు, వస, మజ్జ, మలము, మూత్రము వీనిని శోషింపజేయును. లఘువుగ నుండును.

బుద్ధికి హితకరమయినది. శీతమయినవీర్యము గలది రూక్షజేయును. చనుబాలు, కంఠస్వరము వీనిని శోధించును. దాని నధికముగ సేవించినచో ధాతుక్షయము, వాతవ్యాధి వీనిని గలుగ జేయును.

## కటురసకృత్యము

కటుర్గళామయోదర్దకుష్ఠాలసకశోఫజిత్,
వ్రణావసాదనః స్నేహమేదఃక్లేదోపశోషణః. ౧౭
దీపనః పాచనో రుచ్యశ్శోధనోన్నస్య శోషణః,
ఛినత్తి బంధాన్ స్రోతాంసి వివృణోతి కఫాపహః. ౧౮
కురుతే సోఽతియోగేన తృష్ణాం శుక్రబలక్షయం,
మూర్ఛామాకుంచనం కంపం కటిపృష్ఠాదిషు వ్యథామ్. ౧౯

కటురసము కంఠరోగము, దద్రుకుష్ఠము, అలసకము శోఫ వీనిని పోగొట్టును. వ్రణము నార్చును. స్నేహము, మేదస్సు, క్లేదము వీనిని శోషింపజేయును. అగ్నిదీపనము, జీర్ణము, రుచి వీనిని గలుగజేయును. శోధనకరమైనది. అన్నమునకు విదాహావస్థను గలుగ జేయును. మలబంధములను పోగొట్టును. స్రోతోమార్గములను అడ్డులేక జేయును. కఫమును హరింపజేయును. దాని నధికముగ సేవించినచో దప్పి, శుక్రనాశము బలనాశము, మూర్ఛ, ఆకుంచనము, కంపము, కటి (అనగా నడుముక్రింది తొడల మీది భాగము) వీపు వీనియందుశూల మొదలగు నుపద్రవములను గలుగజేయును.

## కషాయరసకృత్యము

కషాయః పిత్తకఫహా గురురస్రవిశోధనః,
పీడనో రోపణశ్శీతః క్లేదమేదోవిశోషణః. ౨౦
ఆమసంస్తంభనో గ్రాహీ రూక్షో ఽతిత్వక్ప్రసాదనః,
కరోతి శీలతస్సో ఽతివిష్టంభాధ్మానహృద్రుజః. ౨౧
తృట్కార్శ్యపౌరుషభ్రంశస్రోతోరోధమలగ్రహాన్,

కషాయరసము పిత్తకఫములను పోగొట్టును. గురువుగనుండును. రక్తమును శుద్ధిజేయును. పీడాకరమైనది. వ్రణము నార్చును. శీతమయినవీర్యముగలది. క్లేదమును, మేదస్సును బాగుగ శోషింపజేయును. ఆమాశయమునందు స్తంభనము జేయును. మలమును గట్టిపరచును. రూక్షముగ నుండును. చర్మమునకు మిక్కుటముగా కాంతినిచ్చును. దాని నధికముగ సేవించినచో విష్టంభనము, ఆధ్మానము, హృద్రోగము, దప్పి, కార్శ్యము, శుక్రహాని, స్రోతోమార్గప్రతిబంధము, మలబంధము వీనిని గలుగజేయును.

మధురస్కంధము

ఘృతహేమగుడాక్షోట * మోచచోచపరూషకమ్. ౨౨
అభీరువీరాపనసరాజాదనబలాత్రయం,
మేదే చతస్రః పర్ణిన్యో జీవంతీ జీవకర్షభౌ. ౨౩
మధూకం మధుకం బింబీ విదారీ శ్రావణీయుగం,
క్షీరశుక్లా తుగాక్షీరీ క్షీరిణ్యౌ కాశ్మరీసహే. ౨౪
క్షీరేక్షుగోక్షురక్షౌద్ర ద్రాక్షాది ర్మధురో గణః,

నెయ్యి, సువర్ణము, బెల్లము, ఆక్షోడము (అనగా చిటిమిటి లేక కొండగోనుగు) అరటి నారికేళము, చిట్టీము, అభీరు (అనగా పీచర) వీరా (అనగా కారుకొల్లీ) పనస, చారపప్పు, బలాత్రయము (చిట్టాముట్టి, పేరాముట్టి, జిబిలిక) మేద, మహామేద, నాల్గువిధములైన పర్ణులు (అనగా ముణ్యాకుపొన్న, కోలపొన్న, పిల్లపెసర, కారుమినుములు) మరుబాల, జీవకము, ఋషభకము, ఇప్ప అతిమధురము, దొండ, నేలగుమ్ముడు రెండు విధములైన శ్రావణి (అనగా బోడతరము, పెద్దబోడతరము) పాలగుమ్ముడు, తవాక్షీరి, రెండు విధములయిన క్షీరిణి (అనగా పిన్నపాల, చిఱుపాల) గుమ్ముడు, మహాసహా, ముద్గసహా, పాలు, చెఱుకు, పల్లేరు, తేనె, ద్రాక్ష ఇవి మొదలగునవి. (అనగా తృణపంచమూలము మేదస్సు, మజ్జ, తైలము, మధురదాడిమము, తామరవిత్తులు, శృంగాటకము (అనగా దుంపగడ్డ) పెన్నేరుగడ్డ, తామరతూడు కసేరుకము [అనగా నిమ్మటాయి లేక నమ్మనుంప) సించలిక, ఖర్జూరము, తాలమస్తకము, ఈ మొదలగునవి] మధురగణ మనబడును. ఇదే మధురస్కంధ మనియు జెప్పబడును.

అమ్లస్కంధము

అమ్లో ధాత్రీఫలామ్లీకా మాతులుంగామ్లవేతసమ్. ౨౫
దాడిమం రజతం తక్రం చుక్రం పాలేవతం దధి,
ఆమ్రమామ్రాతకం భవ్యం కపిత్థం కరమర్దకమ్. ౨౬

ఉసిరికకాయ, అమ్లీక (అనగా చింతపండు) మాగిఫలము, పుల్లప్రబ్బలి, దానిమ్మ, వెండి, చల్ల, పుల్లనీళ్లు, పాలేవతము, పెరుగు, మామిడి, అంబాళము, కమ్మరేగు, వెలగ, కలివి, ఇవి అమ్లవర్గ మనబడును. ఇదే అమ్లస్కంధమనియు జెప్పబడును.

మఱియు కొండమామిడి, నిమ్మ, కువలము. రేగు, బదరము, ఈడ, ప్రాచీనామ

* మోచతాళ ఇతిపా.

లకము, పెరుగుమీగడ తేట, కవుగు అనగా వియుయు, అమ్లస్కంధ మని అష్టాంగసంగ్రహ మునందు జెప్పబడియున్నది.

"వృక్షామ్లం కోలలకుచకోశామ్రాతకధన్వసమ్,
మస్తు ధాన్యామ్లమద్యాదిజంబీరతిలకల్కకమ్."

చింత, రేగు, కమ్మరేగు, కోశామ్రము, పెరుగుమీగడతేట, ధాన్యామ్లము, మద్యము, నిమ్మ, నువ్వులకల్కము ఇవి అమ్లగణ మనబడు నని అష్టాంగసంగ్రహమునం జెప్పబడి యున్నది.

## లవణస్కంధము

వరంసౌవర్చలం కృష్ణం బిడం సాముద్రమౌద్భిదం,
రోమకం పాంసుజంసీసం క్షారశ్చ లవణో గణః ౨౭

సైంధవలవణము (అనగా ఇందుప్పు) సౌవర్చలవణము, కృష్ణలవణము (అనగా నల్లఅట్టుప్పు) బిడాలవణము, సముద్రలవణము ఔద్భిదలవణము, (అనగా అట్టుప్పు) రోమకలవణము, చౌటియుప్పు, సీసము, స్వర్జికాదిక్షారములు అనగా సజ్జకారము, నవా సారము, వెలిగారము) ఇవి లవణవర్గ మనబడును. ఇదే లవణస్కంధ మనియు జెప్ప బడును.

## తిక్తస్కంధము

తిక్తః పటోలీ త్రాయంతీ వాలకోశీరచందనం,
భూనింబనింబకటుకాతగరాగురువత్సకమ్. ౨౮
నక్తమాలద్విరజనీముస్తమూర్వాటరూషకం,
పాఠాపామార్గకాంస్యాయోగుడూచీధన్వయాసకమ్. ౨౯
పంచమూలం మహద్వ్యాఘ్రౌ విశాలాఽతివిషా వచా,

చేదుపొట్ల, కలుక్రాసుగు, కూతురుబుడమ, వట్టివేరు, చందనము, నేలవేము, పెద్దవేము, కటుకరోహిణి, గ్రంథితగరము, అగరు. కొడిసె, క్రానుగు, పసుపు, మ్రానిపసుపు, తుంగముస్తెలు, చాగ, అడ్డసరము, పాఠ అనగా చిరుబొద్ది, ఉత్తరేణి కంచు, ఇనుము, తిప్పతీగె, చిన్నరేగటిదూలగొండి, మహాపంచమూలము, ప్రాకుడు, ములక, చేదుపుచ్చ, అతివస, వస ఇవి తిక్తవర్గ మనబడును. ఇదే తిక్తస్కంధ మనియు జెప్పబడును. చేదుప్రధానముగ గలవస్తుజాలము,

## కటుస్కంధము

కటుకో హింగుమరిచక్రిమిజిత్పంచకోలకమ్, 30
కురేరాద్యా హరితకాః పిత్తం మూత్రమరుష్కరం,

ఇంగువ, మిరియాలు, వాయువిడంగములు, పంచకోలములు, గగ్గెర, నల్లగగ్గెర, మొదలగు హరితకములు, మేకపోతు మొదలగువాని పిత్తము మూత్రము, నల్లజీడి, ఇవి కటువర్గ మనబడును. ఇదే కటుస్కంధ మనియు జెప్పబడును. మణిశిల, ఆవాలు చెంగల్వకోష్టు మొదలగునవియు కటువర్గ మని అష్టాంగ సంగ్రహమునందు జెప్పబడి యున్నది.

## కషాయస్కంధము

వర్గః కషాయః పథ్యాక్షం శిరీషః ఖదిరో మధు. 31
కదంబోదుంబరం ముక్తా ప్రవాళాంజనగైరికం,
బాలం కపిత్థం ఖర్జూరం బిసపద్మోత్పలాది చ. 32

కరక్కాయ, తానికాయ, దిరిసెనము, చంద్ర, ఇప్ప, కదంబం అనగా మొగులుకడిమి, మేడి, ముత్తియములు, పగడములు, గైరికము, బాలకపిత్థము అనగా లేతవెలగ, ఖర్జూరము, తామరతూడు, తామర, కలువ, ప్రేంకణము, లొద్దుగు, పెను మ్రాను, ఇవి మొదలగునవి కషాయవర్గ మనబడును. ఇదే కషాయస్కంధ మనియు జెప్పబడును.

## మధురస్కంధగుణము

మధురం శ్లేష్మలం ప్రాయో జీర్ణాచ్ఛాలియవాదృతే,
ముద్గాద్గోధూమతః క్షౌద్రాత్సితాయా జాంగలామిషాత్. 33

ప్రాతబడిన శాలిధాన్యము, యవలు, పెసలు, గోధుమలు, తేనె, పంచదార జాంగలమాంసము ఇవి తప్ప తక్కిన మధురద్రవ్యములన్నియు తరుచుగ కఫమును వృద్ధి జేయకుండుటచేతనే "ప్రాయః" అనుపదము ప్రయోగింపబడినది.

## అమ్లస్కంధగుణము

ప్రాయోఽమ్లం పిత్తజననం దాడిమామలకాదృతే,

దాడిమము, ఉసిరిక, ఇవి తప్ప తక్కిన అమ్లద్రవ్యము లన్నియు తరుచుగ పిత్తమును జేయును.

లవణస్కంధగుణము

అపథ్యం లవణం ప్రాయశ్చక్షుషో ఽన్యత్ర సైంధవాత్. 3౪

లవణద్రవ్యములలో సైంధవలవణముదప్ప తక్కినవి తరచుగ నేత్రములకు అపథ్యకరములైనవి.

తిక్తస్కంధకటుస్కంధగుణము

తిక్తం కటు చ భూయిష్ఠ మవృష్యం వాతకోపనమ్,
ఋతే ఽమృతాపటోలీభ్యాం శుంఠీకృష్ణారసోనతః. 3౫

తిప్పతీగ, చేదుపొట్ల, ఇవితప్ప తక్కిన తిక్తద్రవ్యములును, శొంఠి, పిప్పళ్లు, వెల్లుల్లి, ఇవితప్ప తక్కిన కటుద్రవ్యములును తరచుగా వాతప్రకోపమును జేయును. శుక్రమును జెఱచును.

కషాయస్కంధగుణము

కషాయం ప్రాయశశ్శీతం స్తంభనం చాభయామృతే,

కరక్కాయతప్ప తక్కినకషాయద్రవ్యములన్నియు తఱచుగా శీతమైన వీర్యము గలవిగ నుండును. స్తంభనము జేయును.

షడ్రసవీర్యతారతమ్యము

రసాః కట్వమ్లలవణా వీర్యేణోష్ణా యథోత్తరమ్. 3౬
తిక్తః కషాయో మధుర స్తద్వదేవ చ శీతలః,

కటురసము, అమ్లరసము, లవణరసము, ఇవి ఉత్తరోత్తర ఉష్ణవీర్యము గలవిగ నుండును. ఎట్లనగా —కటురసము ఉష్ణవీర్యముగలది. కటురసముకంటె అమ్లరసము ఉష్ణవీర్యతరమైనది. (అనగా కటురసములకంటె మిగుల ఉష్ణవీర్యముగలదియని భావము.) లవణరసము ఉష్ణవీర్యతమమైనది. (అనగా అమ్లరసముకంటె లవణరసము మిగుల ఉష్ణవీర్యముగలది యని భావము) తిక్తరసము, కషాయరసము, మధురరసము, ఇవి ఉత్తరోత్తరము శీతవీర్యము గలవిగ నుండును. (అనగా తిక్తరసము శీతవీర్యము గలది.) కషాయరసము శీతవీర్యతర మైనది. (అనగా తిక్తరసముకంటె మిగుల శీతవీర్యముగలది యని భావము.) మధురరసము శీతవీర్యతమమైనది. (అనగా కషాయరసముకంటె మధురరసము మిక్కుటముగ శీతవీర్యము గలదిగనుండు నని తాత్పర్యము.)

తిక్తాదిరసములకు రూక్షాదితారతమ్యము

తిక్తః కటుః కషాయశ్చ రూక్షా బద్ధమలా స్తథా. 3౭

తిక్తరసము, కటురసము, కషాయరసము ఇవి ఉత్తరోత్తరము రూక్షగ

నుండును. మలబంధముజేయును. (అనగా తిక్తరసముకంటె కటురసమును, దానికంటె కషాయరసమును మిగుల రూక్షముగ మలబంధకారిగ నుండు నని తాత్పర్యము.)

### లవణాదిరసములకు స్నిగ్ధత్వాదితారతమ్యము

పట్వమ్లమధురాస్స్నిగ్ధాః సృష్టవిణ్మూత్రమారుతాః,

లవణరసము, ఆమ్లరసము, మధురరసము, ఇవి ఉత్తరోత్తరము స్నిగ్ధముగ నుండును. మలము, మూత్రము, వాతము, వీనిని బయలుపఱచును. (అనగా లవణరసముకంటె ఆమ్లరసమును, దానికంటె మధురరసమును విశేషస్నిగ్ధముగలదై, మల, మూత్ర, వాతములను బైలుపఱచు నని తాత్పర్యము.)

### లవణాదిరసములకు గురుత్వతారతమ్యము

పటోః కషాయ స్తస్మాచ్చ మధురః పరమం గురుః. ౩౮

లవణరసముకంటె కషాయరసము మిగుల గురువుగ నుండును. కషాయరసముకంటె మధురరసము మిగుల గురువుగ నుండును.

### అమ్లాదిరసములకు లఘుత్వతారతమ్యము

లఘురమ్లః కటు స్తస్మా త్తస్మాదపి చ తిక్తకః,

అమ్లరసము లఘువుగ నుండును అమ్లరసముకంటె కటురసము మిగుల లఘువుగ నుండును. కటురసముకంటె తిక్తరసము మిగుల లఘువుగ నుండును.

### రససంయోగకల్పనావిభాగము

సంయోగాస్స ప్తపంచాశత్కల్పనా తు త్రిషష్టిధా ౩౯
రసానాం యౌగికత్వేన యథాస్థూలం విభజ్యతే,

ఇక జెప్పబడు ప్రకారము రససంయోగము ఏబదియేడు విధములుగ విభజింపబడును. రసకల్పనయైనచో వ్యక్తరసాస్వాదానుగుణముగ శరీరమున కుపయోగించునటుల అఱువదిమూడువిధములుగ విభజింపబడును.

రససంయోగవివరము

ఏకైకహీనాంస్తాన్ పంచ పంచ యాంతి రసా ద్వికే. ౪౦
త్రికే స్వాదుర్దశామ్లః షట్ త్రీన్ పటు స్తిక్త ఏకకమ్,
చతుష్కేషు దశ స్వాదుశ్చతురోఽమ్లః పటుస్సకృత్. ౪౧
పంచకేష్వేకమేవామ్లో మధురః పంచ సేవతే,
ద్రవ్యమేకం షడాస్వాదమసంయుక్తాశ్చ షడ్రసాః. ౪౨

రెండురసములసంయోగములో మధురము, ఆమ్లము, లవణము, తిక్తము, కటువు అను నైదురసములు వరుసక్రమముగా నొక్కొకటి హీనమై ఆమ్లలవణ తిక్తకటు కషాయములను నైదురసములతో సంయోగమును జెందును. ఈద్విరసద్రవ్యసంయోగము (15) భేదములు గలది. ఇట్లుచెప్పుటచే మధురరసము ఆమ్లాదిరసములను, ఆమ్లరసము లవణాదిరసములను, లవణరసము తిక్తాదిరసములను, తిక్తరసము కటుకషాయరసములను, కటురసము కషాయరసమును జెందు ననిభావము. అది యెట్లనగా —(1) మధురరసము ఆమ్లరసమును జెందుట 1, (2) మధురరసము లవణరసమును జెందుట 2, (3) మధుర రసము తిక్తరసమును జెందుట 3, (4) మధురరసము కటురసమును జెందుట 4, (5) మధురరసము కషాయరసమును జెందుట 5, (6) ఆమ్లరసము లవణరసమును జెందుట 1, (7) ఆమ్లరసము తిక్తరసమును జెందుట 2, (8) ఆమ్లరసము కటురసమును జెందుట 3, (9) ఆమ్లరసము కషాయరసమును జెందుట 4, (10) లవణరసము తిక్తరసమును జెందుట 1, (11) లవణరసము కటురసమును జెందుట 2, (12) లవణరసము కషాయరసమును జెందుట 3, (13) తిక్తరసము కటురసమును జెందుట 1, (14) తిక్తరసము కషాయరసమును జెందుట 2, (15) కటురసము కషాయరసమును జెందుట 1. ఇట్లు ద్విరసద్రవ్యము 15 విధములగు సంయోగమును జెందును. ఈ ద్విరసద్రవ్యసంయోగములో మధురరసము తోడ సర్వరసములుజేరుటచే నామధురరసము శ్రేష్ఠంబైనది. కషాయరసము కడపటిది యగుటచే నిందితమైనది.

త్రిరసద్రవ్యసంయోగములో మధురరసము (10) విధములైన సంయోగమును జెందును. అది యెట్లనగా—(16) మధురరసము ఆమ్లలవణ రసములను జెందుట 1, (17) మధురరసము ఆమ్లతిక్తరసములను జెందుట 2, (18) మధురరసము ఆమ్లకటురసములను జెందుట 3, (19) మధురరసము ఆమ్ల కషాయ రసములను జెందుట 4, (20) మధురరసము లవణతిక్తరసములను జెందుట 1, (21) మధురరసము లవణకటురసములను జెందుట 2, (22) మధురరసము లవణకషాయరసములను జెందుట 3, (23) మధురరసము తిక్తకటురసములను జెందుట 1, (24) మధురరసము తిక్తకషాయరసములను జెందుట 2, (25) మధుర రసము కటుకషాయరసములను జెందుట 1. ఇట్లు త్రిరసద్రవ్యసంయోగములో మధుర రసము 10 విధములగు సంయోగమును జెందును.

మఱియు నా త్రిరసద్రవ్యసంయోగములోనే ఆమ్లరసము (6) విధములైన సంయోగమును జెందును. అది యెట్లనగా—(26) ఆమ్లరసము లవణతిక్తరసములను జెందుట 1, (27) ఆమ్లరసము లవణకటురసములను జెందుట 2, (28) ఆమ్లరసము లవణ కషాయరసములను జెందుట 3, (22) ఆమ్లరసము తిక్తకటురసములను జెందుట 1, (30) ఆమ్లరసము తిక్తకషాయరసములను జెందుట 2, (31) ఆమ్లరసము కటుకషాయరసములను జెందుట 1. ఇట్లు త్రిరసద్రవ్యసంయోగములో ఆమ్లరసము 6 విధములగు సంయోగమును జెందును.

మఱియు నా త్రిరసద్రవ్యసంయోగములోనే లవణరసము (3) విధములైన సంయోగమును జెందును. అదియెట్లనగా—(32) లవణరసము తిక్తకటురసములను జెందుట 1, (33) లవణరసము తిక్తకషాయరసములను జెందుట 2, (34) లవణరసము కటుకషాయరసములను జెందుట 1. ఇటుల త్రిరసద్రవ్య సంయోగములో లవణరసము 3 విధములగు సంయోగమును జెందును.

మఱియు నా త్రిరసద్రవ్యసంయోగములోనే తిక్తరసము నొకవిధమైన సంయోగమును జెందును. అది యెట్లనగా—(35) తిక్తరసము కటుకషాయరసములను జెందుట 1. పైజెప్పిన ప్రకారము త్రిరసద్రవ్యసంయోగము మధుర, అమ్ల, లవణ, తిక్తరససంయోగ భేదములచే 20 విధంబులుగ నుండును.

చతూరస (నాల్గురసములుగల ద్రవ్యముల) ద్రవ్యసంయోగములో మధురరసము (10)విధములైన సంయోగములను జెందును. అదియెట్లనగా—(36) మధురరసము అమ్ల లవణతిక్తరసములను జెందుట 1, (37) మధురరసములను జెందుట 2, (38) మధురరసము అమ్లలవణ కషాయరసములను జెందుట 3, (39) మధురరసము అమ్లతిక్తకటురసములను జెందుట 4, (40) మధురరసము అమ్లతిక్తకషాయరసములను జెందుట 5, (41) మధురరసము అమ్లకటు కషాయరసములను జెందుట 6, (42) మధురరసము లవణతిక్తకటురసములను జెందుట,(43) మధురరసము లవణతిక్తకషాయరసములను జెందుట 2, (44)మధురరసము లవణకటుకషాయరసములను జెందుట 3,(45)మధురరసము తిక్త కటు కషాయరసములను జెందుట 1.ఇటుల చతూరసద్రవ్యసంయోగములో మధురరసము 10 విధములగు సంయోగమును జెందును.

మఱియు నాచతూరసద్రవ్యసంయోగములోనే అమ్లరసము (4) విధములైన సంయోగమును జెందును. అది యెట్లనగా—(46) అమ్లరసము లవణతిక్తకటురసములను జెందుట 1, (47) అమ్లరసము లవణతిక్తకషాయరసములను జెందుట 2. (48)అమ్లరసము లవణకటుకషాయరసములను జెందుట 3, (49) అమ్లరసము తిక్తకటుకషాయరసములను జెందుట 1. ఇటుల చతూరసద్రవ్యసంయోగములో అమ్లరసము 4 విధములగు సంయోగమును జెందును.

మఱియు నా చతూరసద్రవ్యసంయోగములోనే లవణరసము ఒకవిధమైనసంయోగమును జెందును.అదియెట్లనగా—(50) లవణరసము తిక్తకటుకషాయరసములను జెందుట 1. పైజెప్పినప్రకారము చతూరసద్రవ్యసంయోగము మధుర, అమ్ల, లవణరససంయోగ భేదములచే 15 విధములుగనుండును.

పంచరసద్రవ్యసంయోగములో అమ్లరసము ఒకవిధమయిన సంయోగమును

జెందును. అవియెట్లనగా—(51) అమ్లరసము లవణతిక్తకటుకషాయ రసములను జెందుట 1. అని తెలియవలయును.

మఱియు నా పంచరసద్రవ్య సంయోగములోనే మధురరసము 5 విధములైన సంయోగమును జెందును. అవి యెట్లనగా—(52) మధురరసము లవణ తిక్త కటు కషాయ రసములను జెందుట 1, (53) మధురరసము అమ్ల తిక్త కటుకషాయరసములను జెందుట 2. (54) మధురరసము అమ్లలవణ కటుకషాయరసములను జెందుట 3, (55) మధుర రసము అమ్లలవణ తిక్తకషాయరసములను జెందుట 4, (56) మధురరసము అమ్లలవణ తిక్తకటురసములను జెందుట 5 ఇటుల పంచరసద్రవ్యసంయోగములో మధురరసము 5 విధములగు సంయోగమును జెందును.

(57). ఒకటే ద్రవ్యము మధుర, అమ్ల, లవణ, తిక్త, కటు కషాయము లను 6 రసములు గలదిగనుండును. మఱియును మధురాదిరసములు ఒకదానితోనొకటి చేరక ప్రత్యేక ప్రత్యేకముగా అనగా (58) మధురరసము, (59) అమ్లరసము, (60) లవణ రసము, (61) తిక్తరసము, (62) కటురసము, (63) కషాయరసము అని 6 విధములుగ నుండును.

పైజెప్పిన ప్రకారము ద్విరసద్రవ్యసంయోగము 15 విధములును, త్రిరసద్రవ్య సంయోగము 20 విధములును, చతూరసద్రవ్యసంయోగము 15 విధములును, పంచరస ద్రవ్యసంయోగము (6) విధములును, షడ్రసములతో గూడియుండు ద్రవ్యం బొకటి యును, మధురాదిరసములు ప్రత్యేక ప్రత్యేకముగా (6)-నుచేరి రసభేదము (63) విధ ములుగ నగును.

ఈ యర్థమే యీ క్రింద జెప్పబడు 25 శ్లోకములయందు సంగ్రహముగా జెప్ప బడియున్నది —

"పద్యేన చ సుఖస్మృత్యై రసభేదాన్ శృణుష్వ మే,
మధురోఽమ్లేన పటునా తిక్తేన కటుకేన చ.
కషాయేణ పృథక్సార్థమమ్లస్సులవణేన చ,
తిక్తేన కటునా సార్ధం కషాయేణ పృథక్సహ.
పటుస్తిక్తేన కటునా కషాయేణ పృథక్సహ,
తిక్తస్తు కటునాసార్ధం కషాయేణపృథక్తథా.
కటుకస్తు కషాయేణ ద్విసంయోగ ఇతి స్మృతాః,
దశపంచ చ భేదాస్తు సంఖ్యాతా వింశతిస్త్రికే.

మధురామ్లౌ తు పటునా తిక్తేన కటునా తథా,
కషాయేణ తథా సార్ధం తథా స్వాదు పృథక్పృథక్ ౫
తిక్తేన కటుకేనాపి కషాయేణ తథా సహ,
స్వాదుతిక్తౌ తు కటునా కషాయేణ పృథక్సహ. ౬
స్వాదూషణౌ కషాయేణ స్వాదోరేవం దశ త్రికే,
భేదాః స్యురమ్లలవణౌ తిక్తేన కటునా పృథక్. ౭
కషాయేణ తథా సార్ధమమ్లతిక్తౌ పృథక్సహ,
కటుకేన కషాయేణ తథామ్లకటుకౌ సహ. ౮
కషాయేణేతి షట్ప్రోక్తా భేదా అమ్లస్య తు త్రికే,
పటుతిక్తౌ తు కటునా కషాయేణ పృథక్సహ. ౯
పటూషణౌ కషాయేణ భేదా ఇతి పటోస్త్రయః,
తిక్తోషణౌ కషాయేణ తిక్తస్యైవం సకృత్ స్మృతః. ౧౦
త్రికే భేదా ఇతి ప్రోక్తాశ్చతుష్కే దశ పంచ చ,
స్వాద్వమ్లలవణాస్సార్ధం తిక్తేన కటుకేన చ. ౧౧
పృథక్కషాయేణ తథా మధురామ్లౌ సతిక్తకౌ,
కటుకేన తు సంయుక్తౌ కషాయేణ పృథక్తథా. ౧౨
స్వాద్వమ్లకటుకాస్సార్ధం కషాయేణేతి షట్స్మృతాః,
సప్తమశ్చాత్ర మధురో లవణోషణతిక్తకైః. ౧౩
భేదోఽష్టమో మతస్స్వాదుకటుతిక్తకషాయకైః,
నవమస్తత్ర మధురః కటూషణకషాయకైః. ౧౪
దశమోఽత్ర భవేత్ స్వాదుతిక్తోషణకషాయకైః,
దశభేదా భవంత్యేవం మధురేణ చతుష్కకే. ౧౫
కటుతిక్తామ్లలవణైర్భేద ఏకశ్చతుష్కకే.
ద్వితీయస్త్వమ్లలవణకషాయకటుకైః స్మృతః. ౧౬
తృతీయోఽత్ర భవేదమ్ల పటుతిక్తకషాయకైః,
చతుర్థోఽత్ర భవేదమ్లతిక్తోషణకషాయకైః. ౧౭
ఏవమమ్లేన భేదాః స్యుశ్చత్వారోఽత్ర చతుష్కకే,
పటునైకోఽత్ర లవణతిక్తోషణకషాయకైః. ౧౮
ఏవం పంచదశ ఖ్యాతాశ్చతుష్కరససంఖ్యయా,
షడ్భేదాన్ పంచకే ప్రాహుస్తాన్వక్ష్యామి విభాగశః. ౧౯

ఏకో భేదో౽మ్లలవణతిక్తోషణకషాయకైః,
ద్వితీయః స్వాదులవణతిక్తోషణకషాయకైః. ౨౦
తృతీయస్త్వమ్లమధురతిక్తోషణకషాయకైః,
చతుర్థస్త్వమ్లమధురపటూషణకషాయకైః. ౨౧
పంచమస్త్వమ్లమధురపటుతిక్తకషాయకైః,
షష్ఠో భేదో౽మ్లమధురలవణోషణతిక్తకైః. ౨౨
షడ్భేదా ఇతి నిర్దిష్టాః పంచకే ప్రవిభాగశః,
భేదః స్వాద్వమ్లలవణతిక్తోషణకషాయకైః. ౨౩
ఏక ఏవ షడ్రసేన పృథక్త్వేన తు షట్ స్మృతాః,
స్వాదురమ్లో౽థ లవణస్తిక్తకశ్చ కటుస్తథా. ౨౪
కషాయ ఇతి భేదాః స్యుస్సర్వతో౽త్ర త్రిషష్టిధా,
క్షీరం సురా బిడం నింబశ్చవ్య పద్మా రసాశ్రయమ్. ౨౫
ద్రవ్యం స్వాదురసాదీనాం షణ్ణాం విద్ధి యథాక్రమమ్,
ద్రవ్యం ద్రవ్యాంతరేణైవ యోజయేద్ద్విరసాదిషు. ౨౬
ధాత్రీఫలం శర్కరయా లవణేనార్ద్రకం తథా,
ఏవమాదీని ద్రవ్యాణి యోజయేద్భిషగుత్తమః. ౨౭
కానిచిద్ద్విరసాదీని ద్రవ్యాణి స్యుస్స్వభావతః,
యుక్తైణష్షడ్రసః కృష్ణో యథా పంచరసాభయా. ౨౮
మద్యం పంచరసం యద్వత్తిలో యద్వచ్చతూరసః,
ఏరండతైలం త్రిరసం మాక్షీకం ద్విరసం యథా. ౨౯
ఘృతమేకం స్వాదురసం మధురాదివిభాగతః,
దిఙ్మాత్రాదుదితాదేవం శేషమూహ్యం మనీషిణా.” ౩౦

పై జెప్పబడిన ముప్పదిశ్లోకములలో నిరువదియైదవ శ్లోకమువరకుం గల యర్థమే ద్విరస త్రిరసాది సంయోగ వివరణరూపముగ పైచెప్పబడినది. ఇరువదియాఱవశ్లోకము మొదలు ముప్పదియవ శ్లోకమువరకు నీక్రిందిరీతిగ నర్థము నెఱుంగునది — క్షీరము, సుర యనుమద్యము, బిడాలవణము, వేము, చవ్యము, పద్మము, వీనియందు మధురాది షడ్రసములు యథాక్రమముగ నుండును. ద్విరసాది సంయోగమునందు నొక ద్రవ్యమును ద్రవ్యాంతరముతోడ (అనగా ఉసిరికకాయను శర్కరతోడను, అల్లమును లవణముతోడను) వైద్యశ్రేష్ఠుడు జేర్పవలయును. స్వభావముగనే కొన్ని ద్రవ్యములు ద్విరసము గలవిగ, మఱికొన్ని త్రిరసములు గలవిగ, కొన్ని చతూరసములు గలవిగ, కొన్ని పంచరసములు గలవిగ, కొన్ని షడ్రసములు గల విగనుండును. అవియెవ్వియనగా—కృష్ణసారమృగమాంసము (అనగా చిత్రవర్ణపులేడి) మధురాదిషడ్రసములతోడను, కరక్కాయ

పంచరసములతోడను, మద్యము పంచరసములతోడను, నువ్వులు చతూరసములతోడను, ఏరండతైలము త్రిరసములతోడను, మాక్షికము ద్విరసములతోడను, ఘృతము ఏకమైన మధుర రసముతోడను, గూడియుండు నని తెలియవలయును. ఇటుల మధురాది రసవిభాగాదులు సంగ్రహముగా జెప్పబడినవి. శేషించి యుండు విశేషభేదములను బుద్ధిమంతుడగువాడు స్వయముగా నూహించుకొనవలయును.

## షడ్రసవిభాగసంఖ్యాసంగ్రహము

షట్పంచకాషట్పృథగ్రసాస్స్యుశ్చతుర్ద్వికౌ పంచదశప్రకారా,
భేదాస్త్రికా వింశతిరేకమేకం ద్రవ్యం షడాస్వాదమితి త్రిషష్టిః.

పంచక రససంయోగభేదములు ఆరు. దేనితోడను జేరక ప్రత్యేకముగ నుండు రసములు ఆరు. చతూరససంయోగభేదములు పదునైదు. ద్విరససంయోగభేదములు పదునైదు. త్రిరససంయోగభేదములు ఇరువది. షడ్రసములతోఁగూడియుండు ద్రవ్యము ఒకటి. ఇటుల రసభేదములు (63) విధములుగనుండును.

## షడ్రసములను అసంఖ్యము

తే రసానురసతో రసభేదాస్తారతమ్యపరికల్పనయా చ,
సంభవంతి గణనాం సమతీతా దోషభేదజవశాదుపయోజ్యాః.

పైజెప్పిన యరువదిమూడు రసభేదములను రసము, అనురసము అనువాని చేతను, వానితారతమ్యరసభేద పరికల్పనము చేతను, (అనగా ఫలానిది మధురరసము, ఫలానిది మధురతరము, ఫలానిది మధురతమరసము, అనుభేదవిచారణము జేసినచో) సంఖ్యాతీతములుగ నగును. ఈ రసభేదములను వాతాదిదోషములు, హరీతక్యాద్యౌషధములు వీని ననుసరించి ఉపయోగపరచవలయునేకాని తద్విపరీతముగా నుపయోగపరుపంజనదు.

"క్వచిదేకరసః కల్ప్యస్సంయుక్తాశ్చ రసాః క్వచిత్,
దోషౌషధాదీన్ సంచింత్య భిషజా సిద్ధిమిచ్ఛతా."

వాతాదిదోషములు, హరీతక్యాద్యౌషధములు వీనిని బాగుగా పర్యాలోచనచేసి సిద్ధిని గోరునట్టి వైద్యుడు ఒకచో ఏకరసమును మఱియొకచో రెండు లేక మూడు రసముల నుపయోగింపవలయు నని చరకాచార్యుడుకూడ పైజెప్పినరీతిగనే చెప్పియున్నాడు. మఱియును దేశకాలభేదములకూడ నాలోచించి రసభేదముల నుపయోగపరుపవలయును. (అనగా వాయువును శమింపజేయుటకై లవణరసముతోడ మధురామ్లరసములను కూడ జేర్చి యుపయోగింపవలయునని భావము) "దోషభేషజవశాత్" అని చెప్పియుండుట దేశాదులకుకూడ ఉపలక్షణ మని తెలియవలయును.

ఏకరస, ద్విరస, త్రిరస, చతూరసాదిద్రవ్య రససంయోగముచే (63) విధములుగ కల్పించు రససంయోగ వివరములను సులభముగ తెలియజేయునట్టి పటము.

ద్విరస సంయోగము.

| సంఖ్య | మధురము. | అమ్లము. | లవణము. | తిక్తము. | కటు. | కషాయము |
|---|---|---|---|---|---|---|
| 1 | మ | అ | ౦ | ౦ | ౦ | ౦ |
| 2 | మ | ౦ | ల | ౦ | ౦ | ౦ |
| 3 | మ | ౦ | ౦ | తి | ౦ | ౦ |
| 4 | మ | ౦ | ౦ | ౦ | క | ౦ |
| 5 | మ | ౦ | ౦ | ౦ | ౦ | కషా |
| 6 | ౦ | అ | ల | ౦ | ౦ | ౦ |
| 7 | ౦ | అ | ౦ | తి | ౦ | ౦ |
| 8 | ౦ | అ | ౦ | ౦ | క | ౦ |
| 9 | ౦ | అ | ౦ | ౦ | ౦ | కషా |
| 10 | ౦ | ౦ | ల | తి | ౦ | ౦ |
| 11 | ౦ | ౦ | ల | ౦ | క | ౦ |
| 12 | ౦ | ౦ | ల | ౦ | ౦ | కషా |
| 13 | ౦ | ౦ | ౦ | తి | క | ౦ |
| 14 | ౦ | ౦ | ౦ | తి | ౦ | కషా |
| 15 | ౦ | ౦ | ౦ | ౦ | క | కషా |

ద్విరససంయోగము 1 మొదలు 15 వరకు—15

త్రిరస సంయోగము.

| సంఖ్య | మధురము | అమ్లము. | లవణము. | తిక్తము. | కటు. | కషాయము. |
|---|---|---|---|---|---|---|
| 16 | మ | అ | ల | ౦ | ౦ | ౦ |
| 17 | మ | అ | ౦ | తి | ౦ | ౦ |
| 18 | మ | అ | ౦ | ౦ | క | ౦ |
| 19 | మ | అ | ౦ | ౦ | ౦ | కషా |
| 20 | మ | ౦ | ల | తి | ౦ | ౦ |
| 21 | మ | ౦ | ల | ౦ | క | ౦ |
| 22 | మ | ౦ | ల | ౦ | ౦ | కషా |
| 23 | మ | ౦ | ౦ | తి | క | ౦ |
| 24 | మ | ౦ | ౦ | తి | ౦ | కషా |
| 25 | మ | ౦ | ౦ | ౦ | క | కషా |
| 26 | ౦ | అ | ల | తి | ౦ | ౦ |
| 27 | ౦ | అ | ల | ౦ | క | ౦ |
| 28 | ౦ | అ | ల | ౦ | ౦ | కషా |
| 29 | ౦ | అ | ౦ | తి | క | ౦ |
| 30 | ౦ | అ | ౦ | తి | ౦ | కషా |

త్రిరససంయోగము 16 మొదలు 35 వరకు—20

చతూరససంయోగము 36 మొదలు 50 వరకు—15. పంచరస సం॥ 51—56వరకు-6
షడ్రస సం॥ 57 వది—1. ఏకరస సం॥ 58—63 వరకు-6
కలసి రససంయోగ భేదములు 63.

| సంఖ్య. | మధురము. | అమ్లము. | లవణము. | తిక్తము. | కటు. | కషాయము |
|---|---|---|---|---|---|---|
| 31 | ౦ | అ | ౦ | ౦ | క | కషా |
| 32 | ౦ | ౦ | ల | తి | క | ౦ |
| 33 | ౦ | ౦ | ల | తి | ౦ | కషా |
| 34 | ౦ | ౦ | ల | ౦ | క | కషా |
| 35 | ౦ | ౦ | ౦ | తి | క | కషా |
| చతూరసద్రవ్యసంయోగము. | | | | | | |
| 36 | మ | అ | ల | తి | ౦ | ౦ |
| 37 | మ | అ | ల | ౦ | క | ౦ |
| 38 | మ | అ | ల | ౦ | ౦ | కషా |
| 39 | మ | అ | ౦ | తి | క | ౦ |
| 40 | మ | అ | ౦ | తి | ౦ | కషా |
| 41 | మ | అ | ౦ | ౦ | క | కషా |
| 42 | మ | ౦ | ల | తి | క | ౦ |
| 43 | మ | ౦ | ల | తి | ౦ | కషా |
| 44 | మ | ౦ | ల | ౦ | క | కషా |
| 45 | మ | ౦ | ౦ | తి | క | కషా |
| 46 | ౦ | అ | ల | తి | క | ౦ |
| 47 | ౦ | అ | ల | తి | ౦ | కషా |
| 48 | ౦ | అ | ల | ౦ | క | కషా |

| సంఖ్య. | మధురము. | అమ్లము. | లవణము. | తిక్తము. | కటు. | కషాయము. |
|---|---|---|---|---|---|---|
| 49 | ౦ | అ | ౦ | తి | క | కషా |
| 50 | ౦ | ౦ | ల | తి | క | కషా |
| పఞ్చరస సం॥ | | | | | | |
| 51 | ౦ | అ | ల | తి | క | కషా |
| 52 | మ | ౦ | ల | తి | క | కషా |
| 53 | మ | అ | ౦ | తి | క | కషా |
| 54 | మ | అ | ల | ౦ | క | కషా |
| 55 | మ | అ | ల | తి | ౦ | కషా |
| 56 | మ | అ | ల | తి | క | ౦ |
| షడ్రస సం॥ | | | | | | |
| 57 | మ | అ | ల | తి | క | కషా |
| ఏకరస సంయోగము. | | | | | | |
| 58 | మ | ౦ | ౦ | ౦ | ౦ | ౦ |
| 59 | ౦ | అ | ౦ | ౦ | ౦ | ౦ |
| 60 | ౦ | ౦ | ల | ౦ | ౦ | ౦ |
| 61 | ౦ | ౦ | ౦ | తి | ౦ | ౦ |
| 62 | ౦ | ౦ | ౦ | ౦ | క | ౦ |
| 63 | ౦ | ౦ | ౦ | ౦ | ౦ | కషా |

# ఏకాదశాధ్యాయము

అథ — రసభేదీయాధ్యాయముయొక్క అంతమునందు వాతాదిదోషములు హరీతక్యాద్యౌషధములు వీని ననుసరించి రసభేదముల నుపయోగింపవలయునని "దోష, భేషజవశాదుపయోజ్యాః" అను వచనముచే జెప్పబడియున్నది. కాబట్టి ఆదోషము లెట్టిస్వరూపము గలవి యని తెలియపరచుటకై రసభేదీయాధ్యాయానంతరము దోషాది విజ్ఞానీయాధ్యాయము జెప్పబడుచున్నది.

దోషాదివిజ్ఞానీయాధ్యాయప్రారంభము

సూ. అథాతో దోషాదివిజ్ఞానీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయోమహర్షయః.

రసభేదీయాధ్యాయానంతరము దోషాదులయొక్క జ్ఞానం బావశ్యకంబగుటచే వాతాది దోషములు, రసాదిధాతువులు, మలములు వీనియొక్క ప్రాకృతవైకృత స్వరూప జ్ఞానమున కనుకూలమైన దోషాది విజ్ఞానీయాధ్యాయమును వివరించెదము.

దోషధాతుమలములచే శరీరమునకు గల్గుచుపకారము

దోషధాతుమలా మూలం సదా దేహస్య తం చలః,
ఉత్సాహోచ్ఛ్వాసనిశ్వాసచేష్టావేగప్రవర్తనైః ౧
సమ్యగ్గత్యా చ ధాతూనామక్షాణాం పాటవేన చ,
అనుగృహ్ణాత్యవికృతః పిత్తం పక్త్యూష్మదర్శనైః ౨
క్షుత్తృడ్రుచిప్రభామేధాధీశౌర్యతనుమార్దవైః,
శ్లేష్మాస్థిరత్వస్నిగ్ధత్వసంధిబంధక్షమాదిభిః. ౩

వాతాదిదోషములు రసాదిధాతువులు, మూత్రాదిమలములు ఇవి దేహమునకు నెల్లప్పుడు మూలముగ నుండును. అనగా — స్కంధశాఖాదులతో గూడియుండు వృక్షమునకు వేరు ప్రధానముగ నుండునట్లుల శరీరమునకు దోషధాతు మలములు వేరు వలె ప్రధానముగ నుండును. వికారమును జెందకుండునట్టివాతము ఉత్సాహము (అనగా సర్వక్రియలయందు ప్రయత్నము) ఉచ్ఛ్వాసము (అనగా ఎగయూపిరి) నిశ్వాసము (అనగా శ్వాసము లోనికీడ్చుట.) చేష్ట అనగా వాక్కు, శరీరము, మనస్సు, అను వాని యొక్క వ్యాపారములు) వేగప్రవర్తనము (అనగా వాతము, మలము, మూత్రము

మొదలగువానిని వెలిపెడలించుట.) ధాతువులకు మంచిగమనము, ఇంద్రియములకు పటుత్వము అనునీవ్యాపారములచేతను, వికారమును జెందకుండునట్టి పిత్తము పాకము, ఔష్ణ్యము, దర్శనము, ఆకలి, దప్పి, రుచి, కాంతి, బుద్ధివిశేషము, ప్రజ్ఞ, పౌరుషము, శరీరమృదుత్వము అనువానిచేతను, వికారమును జెందకుండునట్టి శ్లేష్మము స్థైర్యము, స్నిగ్ధత్వము, సంధిబంధము, ఓర్పు మొదలగువానిచేతను శరీరమును అనుగ్రహించు చుండును.

రసాదిధాతుకృత్యములు

ప్రీణనం జీవనం లేపః స్నేహో ధారణపూరణే,
గర్భోత్పాదశ్చ ధాతూనాం శ్రేష్ఠం కర్మ క్రమాత్ స్మృతం. ౪

రసాదిధాతువులకు మనఃప్రీతి, ఓజోవృద్ధి, లేపము, స్నేహము, ధారణము, పూరణము, గర్భోత్పత్తి అను నీయేడుకృత్యములును రసాదిధాతువులకేడింటికిని వరుసగ ప్రధానములగు పనులు, (అనగా భుజింపబడినరసములు స్రోతస్సులయందు బ్రవేశించి యింద్రియములకు ప్రసన్నత్వము గలుగజేసి తదనంతరము మనస్సుకు ప్రీతి నిచ్చుట వలన మనః ప్రీతిని గలుగజేయుట రసధాతువునకు, ఓజోవృద్ధిని జేయుట రక్తమున కును, లేపముతోగూడియుండు అస్థులే వ్యాపారములను సహించుటవలన లేపము చేయుట మాంసమునకును, నేత్రాదులయందు స్నిగ్ధత్వమును గలుగజేయుట మేదస్సుకును, శరీరమును ఊర్ధ్వముగా ధరింపజేయుట అస్థులకును, అస్థులను స్నేహముచే పూరణము చేయుట మజ్జకును, గర్భోత్పత్తినిజేయుట శుక్రమునకును శ్రేష్ఠమైన వ్యాపారము లని మునులచే జెప్పబడిన దనిభావము.)

"శ్రేష్ఠంకర్మ" అని చెప్పినందుచే ధాతువులకు మధ్యమైన యితర వ్యాపారములు (అనగా క్రియలు) కూడ గలిగియుండు నని తెలిసికొనవలయును. మధ్యములగు వ్యాపారము లెవ్వి యనగా —దృష్టి రక్తపుష్టి మొదలగునవి రసముయొక్కయు, శరీరకాంతి, ప్రసన్నత, మాంసపోషణము మొదలగునవి రక్తముయొక్కయు, బలము మేదస్సుకుపుష్టి మొదలగునవి మాంసముయొక్కయు, స్వేదము, దార్ఢ్యము అస్థులపుష్టి మొదలగునవి మేదస్సుయొక్కయు, మజ్జనుపోషించుట అస్థియొక్కయు, బలము అస్థి పూరణము శుక్రపుష్టి మొదలగునవి మజ్జయొక్కయు, మనస్సంతోషము బలము మొదలగునవి శుక్రముయొక్కయు, మధ్యమములైన కృత్యము లని అష్టాంగసంగ్రహము నందు జెప్పబడియున్నది. ధాతువులయొక్క కృత్య మని చెప్పినందుచేతనే రసాదిధాతువులు పైజెప్పిన కృత్యములచే శరీరమును పోషించుచుండు నని తెలిసికొనవలయును.

### —ఀ మలములయొక్కకృత్యము ఀ—

అవష్టంభః పురీషస్య మూత్రస్య క్లేదవాహనమ్,
స్వేదస్య క్లేదవిధృతిః

పురీషమునకు దేహమును ధరించుటయు, మూత్రమునకు క్లేదమును వహించుటయు, స్వేదమునకు క్లేదమును ధరించుటయు శ్రేష్ఠమైనకృత్యములు. మఱియు కల కేశములను, రోమములను ధరించుటకూడ స్వేదముయొక్క కృత్యము. క్లేదము లేకుండినచో దేహమునకు మధ్యమత్వక్కులేక పోవును, కావున క్లేదధారణము స్వేద కృత్య మని చెప్పబడినది.

### —ఀ ప్రవృద్ధవాతకృత్యము ఀ—

వృద్ధస్తు కురుతేఽనిలః ౫
కార్శ్య కార్ష్ణ్యోష్ణకామిత్వకంపానాహశకృద్గ్రహాన్,
బలనిద్రేంద్రియభ్రంశప్రలాపభ్రమదీనతాః. ౬

వాతము వృద్ధిజెందినచో శరీరకృశత్వము, శరీరమునందు నీలవర్ణము, ఉష్ణము కామము, కంపము, ఆనాహము, మలబంధము, బలహాని, నిద్రాభంగము, ఇంద్రియ నాశము, ప్రలాపము, భ్రమ, దైన్యము అనునీయుపద్రవములను గలుగజేయును.

### —ఀ ప్రవృద్ధపిత్తకృత్యము ఀ—

పీతవిణ్మూత్ర నేత్రత్వక్ క్షుత్తృట్ దాహాల్పనిద్రతాః,
పిత్తం

పిత్తము వృద్ధిజెందినచో మలము, మూత్రము, నేత్రములు, త్వక్కు వీనియందు పీతవర్ణము, ఆకలి, దప్పి, తాపము, స్వల్పనిద్ర అనునీయుపద్రవములను గలుగజేయును.

### —ఀ ప్రవృద్ధశ్లేష్మకృత్యము ఀ—

శ్లేష్మాగ్నిసదన ప్రసేకాలస్యగౌరవమ్, ౭
శ్వైత్యశైత్యశ్లథాంగత్వం శ్వాసకాసాతినిద్రతాః,

శ్లేష్మము వృద్ధిజెందినచో అగ్నిమాంద్యము, నోటనీరూరుట, ఆలస్యము, గురుత్వము, శరీరమునందు శుక్లవర్ణము, అంగములయందు శీతలమైనస్పర్శము. అంగశైథిల్యము, శ్వాసము, కాసము, అధికనిద్ర అనునీవికారములను గలుగజేయును.

### —ఀ ప్రవృద్ధరసరక్తకృత్యములు ఀ—

రసోఽపి శ్లేష్మవద్రక్తం విసర్పప్లీహవిద్రధీన్. ౮
కుష్ఠవాతాస్రపిత్తాస్రగుల్మోపకుశకామలాః,
వ్యంగాగ్నినాశసంమోహరక్తత్వఙ్నేత్రమూత్రతాః. ౯

రసమువృద్ధిజెందినచో శ్లేష్మవృద్ధియందు జెప్పబడిన అగ్నిమాంద్యాదులను గలుగ జేయును. రక్తము వృద్ధిజెందినచో విసర్పము, ప్లీహము, విద్రధి, కుష్ఠము, వాతరక్తము, పిత్తరక్తము, గుల్మము, ఉత్తరతంత్రములో జెప్పబడు ఉపకుశ మను దంతరోగము, కామల, వ్యంగము, అగ్నినాశము, మోహము, చర్మము నేత్రములు మూత్రము వీనియందు రక్తవర్ణము అను నీ వికారములను గలుగజేయును.

## ప్రవృద్ధమాంసకృత్యము

మాంసం గండార్బుదగ్రంధి గండోరూదరవృద్ధితాః,
కంఠాదిష్వధిమాంసం చ

మాంసము వృద్ధిజెందినచో గండము (అనగా గండమాల, గళగండము) అర్బుదము, గ్రంధి అను నీ రోగములను, చెక్కిలి తొడలు ఉదరము వీనియందు వృద్ధిని కంఠము నోటిలోపలిదౌడ నాలుక వీనియందధికమాంసమును గలుగజేయును.

## ప్రవృద్ధమేదఃకృత్యము

తద్వన్మేదస్తథా శ్రమమ్ ౧౦
అల్పేఽపి చేష్టితే శ్వాసం స్ఫిక్ స్తనోదరలంబనమ్.

మేదస్సు వృద్ధిజెందినచో పై జెప్పిన గండాదిరోగములను గలుగజేయును. మఱియును స్వల్పమైన వ్యాపారముచేసినను విశేషముగా శ్రమను, శ్వాసమును గలుగజేయును. పిరుదులు, స్తనములు, ఉదరము వీనిని వ్రేలాడునటుల జేయును.

## ప్రవృద్ధాస్థికృత్యము

అస్థ్యధ్యస్థ్యధిదంతాంశ్చ
అస్థి వృద్ధిజెందినచో అధికముగా దంతములను, అస్థిపై నస్థిని గలుగజేయును.

## ప్రవృద్ధమజ్జకృత్యము

మజ్జా నేత్రాంగగౌరవమ్. ౧౧
పర్వసు స్థూలమూలాని కుర్యాత్కృచ్ఛ్రాణ్యరూంషి చ,

మజ్జ వృద్ధిజెందినచో నేత్రములు, అవయవములు, వీనియందు గురుత్వమును, వ్రేళ్లగణుపులయందు కృచ్ఛ్రసాధ్యముగ, స్థూలమైన మూలము గలవిగనుండు పిటికా విశేషములను గలుగజేయును.

## ప్రవృద్ధశుక్రకృత్యము

అతిస్త్రీకామతాం వృద్ధం శుక్రం శుక్రాశ్మరీమపి. ౧౨
శుక్రము వృద్ధిజెందినచో స్త్రీలయందతికామము, శుక్రాశ్మరి. బలము వీనిని గలుగజేయును.

—ప్రవృద్ధశకృత్కృత్యము—

కుక్ష్యాధ్మానమాటోపం గౌరవం వేదనాం శకృత్,

మలము వృద్ధిజెందినచో కడుపుబ్బరము, గ్రుడగుడలాడుట, గురుత్వము, కడుపున పీడను గలుగజేయును

—ప్రవృద్ధమూత్రకృత్యము—

మూత్రం తు వస్తినిస్తోదం కృతేఽప్యకృతసంజ్ఞతామ్. ౧౩

మూత్రము వృద్ధిజెందినచో వస్తికస్థానమున సూదివలెపొడుచుట గలుగజేయును. మూత్రమును విసర్జించినను మరల మూత్రమువచ్చునట్లుండును, మూత్రమును విసర్జించనట్టులను బాధను గలుగజేయును.

—ప్రవృద్ధస్వేదకృత్యము—

స్వేదోఽతిస్వేదదౌర్గంధ్యకండూః

స్వేదము వృద్ధిజెందినచో అధికముగా స్వేదము, శరీరమునందు దుర్గంధము దురద వీనిని గలుగజేయును.

—ప్రవృద్ధనేత్రమలాదికృత్యము—

ఏవం చ లక్షయేత్,

దూషికాదీనపి మలాన్ బాహుల్యగురుతాదిభిః. ౧౪

ఇటులనే నేత్రములు, చెవులు, ముక్కు, వీనియందలిమలవృద్ధిని ఆయాస్థానములయందలి మలాధిక్యము, గురుత్వము, దురద, భేదము మొదలగువానిచే నూహించుకొనవలయును.

—క్షీణవాతకృత్యము—

లింగం క్షీణేఽనిలేఽంగస్య సాదోఽల్పం భాషితే హితమ్,

సంజ్ఞామోహస్తథా శ్లేష్మవృద్ధ్యుక్తామయసంభవః. ౧౫

వాతము క్షయించినచో (అనగా స్వప్రమాణమునకంటె తగ్గినచో) హస్తపాదాద్యంగములకు కృత్యములయం దశక్తి, స్వల్పసంభాషణము, స్వల్పకృత్యము సంజ్ఞామోహము, శ్లేష్మవృద్ధిలో జెప్పబడిన అగ్నిమాంద్యాద్యుపద్రవములు గలుగును. "క్షీణే" అనుపదమునకు పూర్తిగా క్షయించుట యని అర్థముజేసినచో శరీరమే నశించిపోవును; కాబట్టి క్షీణే అనుపదమునకు ఇచట స్వప్రమాణమునకంటె తగ్గుటయని అర్థము చేయవలయును.

—క్షీణపిత్తకృత్యము—

పిత్తే మందోఽనలశ్శీతం ప్రభాహానిః

పిత్తము క్షయించినచో అగ్నిమాంద్యము, శీతలము, కాంతిహాని, ఇవి గలుగును.

క్షీణశ్లేష్మకృత్యము

కఫే భ్రమః,

శ్లేష్మాశయానాం శూన్యత్వం హృద్ద్రవశ్శ్లథసంధితాః. ౧౬

కఫము క్షయించినచో భ్రమగలుగును. శ్లేష్మాశయమగురొమ్ము, శిరము, సంధులు, మొదలగువానియందు శూన్యత్వము, హృద్రోగము, సంధులకు శైథిల్యముగలుగును.

క్షీణరసకృత్యము

రసే రౌక్ష్యం శ్రమశ్శోషో గ్లానిశ్శబ్దాసహిష్ణుతా,

రసము క్షయించినచో రూక్ష, శ్రమ, శోష, గ్లాని, శబ్దమును సహింపలేమి ఇవి గలుగును.

క్షీణరక్తకృత్యము

రక్తేఽమ్లశిశిరప్రీతి సిరాశైథిల్యరూక్షతాః. ౧౭

రక్తము క్షయించినచో అమ్లరసము, శీతలమైనవస్తువు వీనియం దభిలాష సిరలకు శైథిల్యము రూక్షత గలుగును.

క్షీణమాంసకృత్యము

మాంసేఽక్షగ్లానిగండస్ఫిక్ శుష్కతాసంధివేదనాః,

మాంసము క్షయించినచో ఇంద్రియములకు గ్లాని, చెక్కిలి, పిఱుదులు, ఇవి శుష్కించుట, సంధులలో బొడుచునటుల వేదన గలుగును.

క్షీణమేదఃకృత్యము

మేదసి స్వపనం కట్యాః ప్లీహ్నో వృద్ధిః కృశాంగతా. ౧౮

మేదస్సు క్షయించినచో పిఱుదులు చచ్చుబారుట, ప్లీహవృద్ధి, శరీరకృశత్వము గలుగును.

క్షీణాస్థికృత్యము

అస్థ్న్యస్థితోదస్సదనం దంతకేశనఖాదిషు,

అస్థి క్షయించినచో అస్థులయందు వేదన, దంతములు, తలవెండ్రుకలు, గోళ్లు మొదలగునవి ఊడుట యీ యుపద్రవములు గలుగును.

క్షీణమజ్జకృత్యము

అస్థ్నాం మజ్జని సౌషిర్యం భ్రమస్తిమిరదర్శనమ్. ౧౯

మజ్జ క్షయించినచో అస్థులయందు రంధ్రములు, భ్రమ, తిమిరదర్శనము (అనగా కండ్లయందు చీకటిగ్రమ్ముట) కలుగును.

### క్షీణశుక్రకృత్యము

శుక్రే చిరాత్ప్రసిచ్యేత శుక్రం శోణితమేవ వా,
తోదోఽత్యర్థం వృషణయోర్మేఢ్రం ధూమాయతీవ చ. ౨౦

శుక్రము క్షయించినచో చిరకాలమునకు శుక్రము బయలువెడలును. లేక రక్తము వెలువెడలును. మఱియును వృషణములయందు అధికముగా బాధ గలుగును. మేఢ్రరంధ్రమునుండి పొగ వెడలునట్లు బాధ కల్గును.

### క్షీణపురీషకృత్యము

పురీషే వాయురంత్రాణి సశబ్దో వేష్టయన్నివ,
కుక్షౌ భ్రమతి యాత్యూర్ధ్వం హృత్పార్శ్వే పీడయన్ భృశమ్.

మలము క్షయించినచో వాతము ఉదరమునందే చుట్టుచుండును మఱియు నా వాతము ప్రేగులను చుట్టునటులనే గొప్పధ్వనితో కూడి రొమ్ము, ప్రక్కలు వీనియందు విశేషమైనబాధను గలుగజేయుచు పైకెగయును.

### క్షీణమూత్రకృత్యము

మూత్రేఽల్పం మూత్రయేత్కృచ్ఛ్రాద్వివర్ణం సాస్రమేవ వా,

మూత్రము క్షయించినచో స్వల్పమూత్రముగాని బహుకష్టముతోడ దుష్టవర్ణము గలమూత్రముగాని, లేక రక్తముతో గూడియుండు మూత్రము గాని వెలువెడలును.

### క్షీణస్వేదకృత్యము

స్వేదే రోమచ్యుతిః స్తబ్ధరోమతా స్ఫుటనం త్వచః. ౨౨

స్వేదము, క్షయించినచో రోమములు రాలిపోవును. రోమాంచనము, చర్మమునందు పగుళ్లు గలుగును.

### సూక్ష్మమలక్షయలక్షణము

మలానామతిసూక్ష్మాణాం దుర్లక్ష్యం లక్షయేత్ క్షయమ్,
స్వమలాయనసంశోషతోదశూన్యత్వలాఘవైః. ౨౩

బహుకష్టముచే దెలియదగిన యతిసూక్ష్మమైన మలములయొక్క క్షయమును ఆయా మలస్థానముయొక్క శోష, బాధ, శూన్యత్వము, లాఘవము మొదలగువానిచే దెలిసికొనవలయును.

### దోషాది వృద్ధిక్షయసంగ్రహము

దోషాదీనాం యథాస్వం చ విద్యాద్వృద్ధిక్షయౌ భిషక్,
క్షయేణ విపరీతానాం గుణానాం వర్ధనేన చ. ౨౪
వృద్ధిం మలానాం సంగాచ్చ క్షయం చాతివిసర్గతః,

అయా దోషగుణములకంటె విపరీతముగ నుండు గుణములు క్షయించుటచేతను, వృద్ధిజెందుటచేతను, దోషధాతుమలములయొక్క క్షయవృద్ధులను వైద్యుడు తెలిసికొనవలయును. అవి యెట్లన—వాయువునకు రూక్షత, లఘుత్వము, శీతము మొదలగునవి స్వభావమైనగుణములు. ఈ గుణములకు విరుద్ధమైన స్నిగ్ధత్వము, గురుత్వము, ఉష్ణము మొదలగు గుణములు దేహమునందు వృద్ధిజెందునటుల గానంబడునపుడు వాతమునకు క్షయము గలుగును. మఱియు నాస్నిగ్ధాదిగుణములు దేహమునందు క్షయించినటుల గానంబడునపుడు వాతమునకు వృద్ధి గలుగును. ఇటులనే స్వబుద్ధిచే ధాతువులు, మలములు వీనియొక్క క్షయవృద్ధులను తెలిసికొనవలయును. మఱియు నిటులనే స్వబుద్ధిచే యోచించి మలములు వెలిపడుటచే వానియొక్కవృద్ధిని, ఆమలము లధికముగ వెలిపడుట చే వానియొక్కక్షయమును తెలిసికొనవలయును.

మలక్షయమునందు పీడాధిక్యము

మలోచితత్వాద్దేహస్య క్షయో వృద్ధేస్తు పీడనః. ౨౫

మలములయొక్క క్షయవృద్ధులు రెండును దేహమునకు పీడాకరంబులు. వానిలో మలక్షయము ప్రాణులకు తఱుచుగా నభ్యాసము లేకుండుటవలన మలవృద్ధికంటె నధిక పీడాకరమైనది. మలవృద్ధి అభ్యసింపబడియుండుటవలన మలక్షయమువలె పీడాకరమయినది కానేరదు.

దోషాదివృద్ధిక్షయకరౌషధక్రమము

తత్రాస్థని స్థితో వాయుః పిత్తం తు స్వేదరక్తయోః,
శ్లేష్మా శేషేషు తేనైషామాశ్రయాశ్రయిణాం మిథః. ౨౬
యదేకస్య తదన్యస్య వర్ధనక్షపణౌషధమ్,
అస్థిమారుతయోర్నైవం ప్రాయో వృద్ధిర్హి తర్పణాత్. ౨౭
శ్లేష్మణానుగతా తస్మా త్సంక్షయస్తద్విపర్యయాత్,
వాయునానుగతః

పైజెప్పిన వాతాదులలో వాతము అస్థుల నాశ్రయించియుండును. పిత్తము స్వేదము, రక్తము, వీని నాశ్రయించియుండును. శ్లేష్మము శేషించియుండురసము, మాంసము, మేదస్సు, మజ్జ, శుక్రము, మూత్రము, పురీషము మొదలగువాని నాశ్రయించియుండును. కాబట్టి యీప్రకారము పరస్పరము ఆశ్రయముగ, ఆశ్రయిగ నుండు దోషధాతువులలో ఆశ్రయమునకు వృద్ధికరౌషధముగ నుండునదియే ఆశ్రయికిని వృద్ధికరౌషధముగ నుండును. అటులనే ఆశ్రయమునకు క్షయకరౌషధముగ నుండునదియే ఆశ్రయికిని క్షయకరౌషధముగ నుండును. అయితే దోషధాతుమలములయొక్క వృద్ధి

సంతర్పణ మను బృంహణక్రియచేతను, క్షయము లంఘనకారణమైన అపతర్పణక్రియ వలనను తరుచుగా గలుగును. మఱియు నా దోషధాతువులయొక్క వృద్ధి శ్లేష్మముతో డను, క్షయము వాతముతోడను జేరియుండును కాబట్టి [illegible] అను నంటికి పైజెప్పిన ప్రకారము వృద్ధిక్షయకారణక్రమము సంభవించ నేరదు.

దోషాదిక్షయవృద్ధివికారచికిత్స

అస్మాచ్చ వృద్ధిక్షయసముద్భవాన్.        ౨౮
వికారాన్ సాధయేచ్ఛీఘ్రం క్రమాల్లంఘనబృంహణైః,

పైజెప్పిన ప్రకారము వృద్ధి సంతర్పణకారణముగ, క్షయము అపతర్పణ కారణ ముగ నుండుటవలన వృద్ధిక్షయములచే గలిగిన దోషధాతుసంబంధమగు వికారములను లంఘనబృంహణక్రియలచే యథాక్రమముగ (అనగా వృద్ధివలన గలిగిన దోషధాతు వికారములను లంఘనక్రియచేతను, క్షయమువలన గలిగిన దోషధాతు వికారములను బృంహణక్రియచేతను) శీఘ్రముగా చికిత్సజేయవలెను. విలంబముజేసినచో అసాధ్య ములుగ నగును.

వాతవృద్ధ్యాదిజనితరోగచికిత్సాక్రమము

వాయోరన్యత్ర తజ్జాంస్తు తైరేవోత్క్రమయోజితైః.        ౨౯

వాతవృద్ధి, వాతక్షయము వీనిచే జనించిన వికారములయందుతప్ప నితర దోష వృద్ధిక్షయములచే గలిగినవికారములయందు పై జెప్పిన లంఘనబృంహణ క్రియాక్రమ ములను చేయవలయును. అయితే వాతవృద్ధి వాతక్షయము వీనిచే గలిగిన వికారముల యందు పైజెప్పిన లంఘనబృంహణక్రియలచేతనే విపరీతముగా (అనగా వాతవృద్ధిచే గలిగిన వికారములయందు బృంహణక్రియలచేతను, వాతక్షయముచేగలిగిన వికారముల యందు లంఘనక్రియలచేతను) చికిత్సజేయవగును దోషములయొక్క చికిత్స ఉత్తరత్ర జెప్పబడు దోషోపక్రమణీయాధ్యాయములో విశేషముగా జెప్పబడుటచే నిచట సంక్షే పింపబడెను. "రసోఽపి శ్లేష్మవత్" అనిచెప్పినందుచేతనే రసధాతుచికిత్సయు దోషోపక్ర మణీయాధ్యాయములో విశేషముగా జెప్పబడునని తెలిసికొనవలయును. ఇక రక్తవికా రాదులకు చికిత్స జెప్పబడును.

రక్తాదివృద్ధిక్షయజనితరోగచికిత్సాక్రమము

విశేషాద్రక్తవృద్ధ్యుత్థాన్ రక్తస్రుతివిరేచనైః,
మాంసవృద్ధిభవాన్ రోగాన్ శస్త్రక్షారాగ్నికర్మభిః.        ౩౦
స్థౌల్యకార్శ్యోపచారేణ మేదోజానస్థిసంక్షయాత్,
జాతాన్ క్షీరఘృతైస్తిక్తసంయుక్తైర్వస్తిభిస్తథా.        ౩౧
మజ్జశుక్ర [illegible] గాన్ భూ జి స్త్రీపాద [illegible] క్తైః.
[illegible] స్తూపా మాత్రైః [illegible] మూత్రప్రమేహి [illegible]
[illegible] సక్షన మూత్ర [illegible]

విడ్వృద్ధిజానతీసారక్రియయా విట్క్షయోద్భవాన్,
మేషాజమధ్యకుల్మాష యవమాషద్వయాదిభిః 32
మూత్రవృద్ధిక్షయోత్థాంశ్చ మేహకృచ్ఛ్రచికిత్సయా.
వ్యాయామాభ్యంజనస్వేద మద్యైః స్వేదక్షయోద్భవాన్. 33

దోషధాతువృద్ధిక్షయముల కీటుల చికిత్స జెప్పబడియుండినను విశేషముగా రక్తవృద్ధిచే గలిగిన వికారములను రక్తమోక్షణ విరేచనములచే చికిత్స జేయవలెను. మాంస వృద్ధిచే గలిగిన వికారములయందు శస్త్రక్షారాగ్నికర్మలచేతను, మేదోవృద్ధిచే గలిగిన వికారములయందు ద్వివిధోపక్రమణీయాధ్యాయమున జెప్పబడు స్థౌల్యోపచారము చేతను, మేదఃక్షయముచే గలిగిన వికారములయందు ద్వివిధోపక్రమణీయాధ్యాయమున జెప్పబడు కార్శ్యోపచారముచేతను, అస్థిక్షయముచే గలిగిన వికారములయందు తిక్త ద్రవ్యములతో గూడియుండు క్షీరఘృతములు, తిక్తద్రవ్యముతో గూడియుండు వస్తి క్రియలు వీనిచేతను చికిత్స జేయవలెను. పురీషవృద్ధిచేగలిగిన వికారములయందు అతి సారమునకు జెప్పియుండుచికిత్సలం జేయవలయును. పురీషక్షయముచేగలిగిన వికార ములయందు గొఱ్ఱె, మేకపోతు వీనియొక్క మధ్యము (అనగా కంఠమునకు పైభాగము. నాలుగుకాళ్లు, తోక, వృషణములు ఇవితప్ప తక్కిన శరీరమధ్యప్రదేశమునం దుండు మాంసము) చేతను, మినుములు, అలసందలు, కారామణులు, దూలగొండివిత్తులు, వీనిని సగము పక్వమగున ట్లుడికించి అందు ఇంగువ నెయ్యి మొదలగువానింగూర్చి తిరుగ బోతపెట్టి పక్వముచేయబడిన గుగ్గిళ్లచేతను ఉపచరింపనగును. మూత్రవృద్ధిచే గలిగిన వికారములయందు మేహరోగచికిత్సలచేతను, మూత్రక్షయముచే గలిగిన రోగముల యందు మూత్రకృచ్ఛ్రచికిత్సలచేతను, స్వేదక్షయముచే గలిగిన వికారములయందు వ్యాయామాదులచేతను చికిత్స జేయనగును.

"మజ్జశుక్లామయానాం తు భోజనం స్వాదుశీతలమ్,
శుద్ధివ్యవాయవ్యాయామా యచ్చాన్యచ్ఛుక్రశోధనమ్."

మజ్జవృద్ధిచే జనించిన రోగమునందు మధురముగ, శీతలముగ నుండుభోజనము హితకర మయినది. శుక్రవృద్ధిచే జనించినరోగమునందు మైథునము, వ్యాయామము, శుక్ర మును వృద్ధిజేయునట్టి ఆహారాదులు హితకరములైనవి అని అష్టాంగసంహితయందు జెప్పబడియున్నది.

## రసాదిధాతువృద్ధిక్షయకారణము

స్వస్థానస్థస్య కాయాగ్నేరంశా ధాతుషు సంశ్రితాః,
తేషాం సాదాతిదీప్తిభ్యాం ధాతువృద్ధిక్షయోద్భవః 34
పూర్వో ధాతుః పరం కుర్యాద్వృద్ధః క్షీణశ్చ తద్విధమ్,

స్వస్థానమునం దుండు శరీరాగ్నియొక్క భాగములు రసాదిధాతువులను నాశ్రయించియుండును. మరియు నా శరీరాగ్నిభాగములయొక్క మాంద్యమువలన వృద్ధియు, అతితీక్ష్ణతవలన క్షయమును రసాదిధాతువులకు గలుగును.

"పిత్తం పంచాత్మకం తత్ర పక్వామాశయమధ్యగమ్."

అను వచనప్రమాణము ననుసరించి, ఆమాశయము యొక్క మధ్యస్థానమున శరీరాగ్నికి స్వస్థానమగుచుండును. మొదటిదియగు రసధాతువు వృద్ధినొందినచో రెండవది యగు రక్తధాతువుకూడ వృద్ధినొందును. అటులనే మొదటిదియగు రసధాతువు క్షయించినచో రెండవదియగు రక్తధాతువుకూడ క్షీణించును.

### వాతాదిప్రకోపమువలన రసాదిదుష్టత్వము

దోషా దుష్టా రసైర్ధాతూన్ దూషయంత్యుభయే మలాన్,
అధో ద్వే సప్త శిరసి ఖాని స్వేదవహాని చ,
మలా మలాయనాని స్యుర్యథాస్వం తేష్వతో గదాః. 3౬

మిథ్యాయోగముగ, అయోగముగ, అతియోగముగ సేవింపబడిన మధురాది షడ్రసములచే వాతాదిదోషములు కుపితంబులై రసాదిధాతువులను దోషయుక్తముగ జేయును. అటుల కుపితంబులైన వాతాదిదోషములును, రసాదిధాతువులును జేరి పురీష మూత్రాదిమలములను దోషయుక్తములుగ జేయును. అటుల దుష్టములగు మలములు మలస్థానములను (అనగా శరీరముయొక్క అధోభాగమునందుండు గుదము, శిశ్నము అను నీ రెంటిని శిరమునందు నేత్రములు రెండు కర్ణములు రెండు నాసారంధ్రములు రెండు నోరు ఒకటి అను నీ యేడు యింద్రియములను, సర్వశరీరములో, స్వేదమును వహించుచుండు రోమకూపద్వారములను) దోషయుక్తములుగ చేయును. ఏయే మల స్థానములు దోషయుక్తములుగ నగునో ఆయామలస్థానములయందు రోగము గలుగును.

"మలాయనాని బాధ్యంతే దుష్టైర్మాత్రాధికైర్మలైః"

దోషయుక్తములుగను, స్వప్రమాణాధిక్యములుగనుండు మలములచే గుదాదిమలస్థానములు పీడింపబడును. అని చరకాచార్యుడుకూడ జెప్పియున్నాడు.

### ఓజోనిరూపణము

ఓజస్తు తేజో ధాతూనాం శుక్రాంతానాం పరం స్మృతం,
హృదయస్థమపి వ్యాపి దేహస్థితినిబంధనమ్. 3౭
స్నిగ్ధం సోమాత్మకం శుద్ధమీషల్లోహితపీతకమ్,
యన్నాశే నియతం నాశో యస్మిం స్తిష్ఠతి తిష్ఠతి. 3౮
నిష్పద్యంతే యతో భావా వివిధా దేహసంశ్రయాః,

రసధాతువు మొదలు శుక్రధాతువువరకుండు ధాతువులయొక్క ఉత్కృష్టమయిన తేజస్సే ఓజస్సని మునులచే జెప్పబడును. మఱియు పది బిందువులస్వరూపము గల యా ఓజస్సుకు హృదయము విశేషముగా స్థానముగ నుండును. మఱియు నాఓజస్సు హృదయమునం దుండినను సకలశరీరమునందు వ్యాపించుచుండును. అది దేహముయొక్క స్థితికి (అనగా జీవితమునకు) ముఖ్యమయిన కారణముగ నుండును. ఏది నాశమును జెందిన ప్రాణియు నవశ్యముగా నాశముజెందునో, ఏది బాగుగ నుండిన ప్రాణియు జీవించి యుండునో, దేనిలోనుండి దేహసంబంధమైన నానావిధభావములు గలుగునో అదియే ఓజస్సని తెలియవలయును. అట్టి ఓజస్సు స్నిగ్ధముగ, నిర్మలముగ, ఒకింత రక్తవర్ణము పీత వర్ణము గలదిగ, సోమస్వరూపము గలదిగనుండును. ఈ యర్థమే,

"మృదు సోమాత్మకం శుద్ధం రక్తమీషత్సపీతకమ్"

అను వచనముచే అష్టాంగసంగ్రహమునందును జెప్పబడియున్నది.

"హృది తిష్ఠతి యచ్ఛుద్ధం స్నిగ్ధమీషత్సపీతకమ్,
ఓజశ్శరీరే సంఖ్యాతం తన్నాశేన వినశ్యతి."

అనగా హృదయమునందు శుద్ధముగ, నిర్మలముగ, స్నిగ్ధముగ, ఒకింత పీతవర్ణము గలదిగ నుండునట్టివస్తువే శరీరములోని ఓజస్సని జెప్పంబడును. అది నాశముజెందినచో దేహియు నవశ్యముగా నాశముజెందును. అని ఓజోలక్షణమును చరకాచార్యుడుకూడ పైజెప్పిన రీతిగనే చెప్పెను.

## ఓజఃక్షయస్వరూపము దానికౌషధము

ఓజః క్షీయేత కోపక్షుద్ధ్యానశోకశ్రమాదిభిః. ౩౯
బిభేతి దుర్బలోఽభీక్ష్ణం ధ్యాయతి వ్యథితేంద్రియః,
విచ్ఛాయో దుర్మనా రూక్షో భవేత్ క్షామశ్చ తత్క్షయే. ౪౦
జీవనీయౌషధక్షీరరసాద్యాస్తత్ర భేషజమ్,

ఆ ఓజస్సు కోపము, ఆకలి, ధ్యానము, దుఃఖము, శ్రమ మొదలగువానిచే క్షయించును. (అనగా కొరవడును.) అది క్షయించినచో మనుజుడు విశేషముగా భయమును జెందును. శరీరమునకు విశేషముగా దౌర్బల్యము కలుగును. ఇంద్రియము లన్నియు మిగుల వ్యథనుజెందుటచే నెల్లపుడు చింతాక్రాంతుడుగ నగును. శరీరకాంతి నశించును. ఎల్లపుడు దుఃఖాక్రాంతుడుగ, రూక్షమై కృశమైన శరీరముగలవాడుగ నగును. కాబట్టి ఓజఃక్షయమునందు జీవనసంజ్ఞగల జీవంతి మొదలగు పది విధములైన ఔషధము లను, మధురమైన యితరద్రవ్యములను, క్షీరము, మాంసరసము, కాకాండోల, దూల గొండి, ఘృతము మొదలగు ద్రవ్యముల నుపయోగపఱుపవలయును. ఇదియ ఓజఃక్షయమునం దౌషధము.

**ఓజోవృద్ధిలక్షణము**

ఓజోవివృద్ధౌ దేహస్య తుష్టిపుష్టిబలోదయః. ౪౧

ఓజస్సు వృద్ధిజెందినచో శరీరమునకు సంతోషము, పుష్టి, బలము, ఇవి విశేషముగా వృద్ధి జెందును.

**దోషవృద్ధిక్షయశమనోపాయము**

యదన్నం ద్వేష్టి యదపి ప్రార్థయేతావిరోధి తు,
తత్తత్త్యజన్ సమశ్నంశ్చ తౌ తౌ వృద్ధిక్షయౌ జయేత్. ౪౨

మనుజుడు దేనియన్నమునందు ద్వేషించునో, ఏయన్నము విశేషముగా కోరుచుండునో అట్టిదానిలో ద్వేషము గలదిగ విరుద్ధమైనదిగ నుండు అన్నమును పరిహరించి ఇష్టము గలదిగ, విరోధము గాకుండునదిగ నుండు అన్నమును భుజింపవలయును. అటుల జేసినచో దోషసంబంధముచే జనించిన వృద్ధిక్షయవికారములు శాంతి జెందును.

**వాతాదివృద్ధిక్షయకృత్యము**

కుర్వతే హి రుచిం దోషా విపరీతసమానయోః,
వృద్ధాః క్షీణాశ్చ భూయిష్ఠం లక్షయన్త్యబుధాస్తు న. ౪౩

వాతాదిదోషములు వృద్ధిని జెందియుండునపుడు స్వస్వగుణములకంటె తరుచుగ విపరీతముగ నుండు వస్తువులయందును, క్షయమును జెందియుండునపుడు స్వస్వగుణములతో తరుచుగ సమానముగ నుండు వస్తువులయందును యథాక్రమముగ (అనగా వాతవృద్ధియందు విపరీతగుణములు గల స్నిగ్ధ, అమ్ల, మధురరసములతోడను, పిత్తవృద్ధియందు విపరీతగుణములు గల శీత, మధుర, రూక్ష, తిక్త, కషాయరసములతోడను, శ్లేష్మవృద్ధియందు విపరీతగుణములు గల రూక్ష, అమ్ల, కటు, తిక్తరసములతోడను, వాతక్షయమునందు సమానగుణములు గల రూక్ష, కషాయరసములతోడను, పిత్తక్షయమునందు సమానగుణములు గల అమ్ల, లవణరసములతోడను, శ్లేష్మక్షయమునందు సమానగుణములు గల స్నిగ్ధ, మధుర, అమ్ల, లవణరసములతోడను గూడియుండు అన్నాదులయందు) విశేషముగా ప్రీతిని గలుగజేయును.

మఱియును వాతాదిదోషములు తమ విచిత్రగమనమువలన పైజెప్పిన క్రమమునకు విపరీతముగకూడ వస్తువులయందు ప్రీతిని గలుగజేయును. అది యెట్లనగా — ఒకానొకమనుజునికి వాతము క్షయించియుండునపుడుకూడా స్నిగ్ధమధురరసములతో గూడియుండు అన్నాద్యులయందు ప్రీతిని గలుగజేయుచున్నది. అటులనే పిత్తము వృద్ధిజెంది యుండునపుడు కూడ అమ్లలవణరసములతో గూడియుండు అన్నాదులయందును, శ్లేష్మము వృద్ధిజెందియుండునపుడు కూడ మధుర అమ్లరసములతో గూడియుండు

అన్నాదులయందు ప్రీతిని గలుగజేయును. కాబట్టి పైజెప్పిన విపరీత సమానవస్తున్యాయము అన్నిస్థలములయందు తరుచుగా రానేరదనితెలియపరచుటకై "భూయిష్ఠం" అనుపదము ప్రయోగింపబడినది. ఇటుల వాతాదులయొక్కగలి విచిత్రముగ నుండుట వలన పండితులుకానివారు దోషములు వృద్ధిజెందినవా, లేక క్షయించినవా అను విషయమును దెలిసికొనలేక యున్నారు. వృద్ధిజెందుట యనగా; స్వప్రమాణమునకంటె నధికపడుట యని యర్థము.

## వాతాదివృద్ధిక్షయలక్షణము

**యథాబలం యథాస్వం చ దోషా వృద్ధా వితన్వతే,**
**రూపాణి జహతి క్షీణాస్సమాః స్వం కర్మ కుర్వతే. ౪౪**

వాతాదిదోషములు వృద్ధిజెందినచో తమతమబలము నతిక్రమింపకుండ తమతమగుణకర్మలను వృద్ధిజేయును. వాతాదిదోషములు క్షయించినచో తమతమబలము నతిక్రమింపకుండ తమతమగుణకర్మలను త్యజించును. అది యెట్లనగా వాతము వృద్ధిజెందినచో రూక్ష, శైత్యము, పారుష్యము, స్రంసము, వ్యాసము మొదలగు గుణకర్మలను వృద్ధిజేయును. వాతము క్షయించినచో పైజెప్పిన రూక్షాదిగుణకృత్యములను విడుచును. ఇటులనే పిత్తశ్లేష్మములకును గుణకృత్యములను తెలియవలయును. మఱియు నా వాతాదిదోషములు వృద్ధిని జెందక క్షయింపక సమములై తమతమ ప్రమాణమునందుండినచో ఉత్సాహము, ఎగయూపిరి మొదలగుస్వస్వకృత్యములను గలుగజేయును. కావున నాలక్షణములచే వాతాదులయొక్క వృద్ధిక్షయసమత్వములను తెలిసికొనవలయును.

## వాతాదులకు వృద్ధిక్షయములు గలుగకుండ రక్షించుట

**య ఏవ దేహస్య సమా వివృద్ధ్యై త ఏవ దోషా విషమా వధాయ,**
**యస్మాదత స్తే హితచర్యయైవ క్షయాద్వివృద్ధేరివ రక్షణీయాః**

వృద్ధిక్షయములనుజెందక స్వప్రమాణమునందుండు వాతాదిదోషములు దేహవృద్ధికే కారణముగ నగును. మఱియు నావాతాదిదోషములే స్వప్రమాణమునకంటె వృద్ధిజెందినను, లేక క్షయించినను దేహనాశమునకు కారణముగ నగును. కాబట్టి ఆ వాతాదిదోషములు క్షయవృద్ధులను జెందకుండునటుల హితకరమైన చర్యలవలన వానిని రక్షించుచుండవలయును. వాతాదులు వృద్ధిజెందకుండునటుల రక్షించునటులనే క్షయింపకుండునటులకూడ ఉపేక్షింపక నవశ్యముగా రక్షింపవలయును.

ఏకాదశాధ్యాయము, ముగిసెను.

# ద్వాదశాధ్యాయము



ఆప. వైద్యాధ్యాయములందు దోషములయొక్క స్థానాదులు చెప్పబడలేదు. అట్టి దోషవిజ్ఞానము దోషములయొక్క స్థానములు, కర్మములు, నానావిధములు మున్నగునవి తెలియక కర్తవ్యము గాదు. అట్టి విధముల తెలుపు దోషభేదీయాధ్యాయము క్రింద జెప్పంబడును —

## దోషభేదీయాధ్యాయప్రారంభము

సూ. అథాతో దోషభేదీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

దోషాదివిజ్ఞానీయాధ్యాయానంతరము దోషములయొక్క స్థాన నానావిభాగాదులచే గలిగియుండు భేదముల దెలుపు దోషభేదీయాధ్యాయము నిరూపించెదము.

## వాతస్థానము

పక్వాశయకటీసక్థిశ్రోత్రాస్థిస్పర్శనేంద్రియం,
స్థానం వాతస్య తత్రాపి పక్వాధానం విశేషతః ౧

పక్వాశయము, పిఱుదులు, తొడలు, చెవులు, ఎముకలు, స్పర్శనేంద్రియము, అను నీయారును వాతమునకు స్థానంబులు, వానిలో పక్వాశయము వాతమునకు ముఖ్యస్థానము. మఱియును పక్వాశయము వాతమునకు ముఖ్యస్థానమని మొదటి యధ్యాయముననందు "తే వ్యాపినో౽పి హృన్నాభ్యోః" అను శ్లోకముచే జెప్పబడియున్నది. కావుననే వాతవ్యాధియందు వస్తిచికిత్స ప్రధానముగ జెప్పబడియున్నది. వాతాదులు విచిత్రమైన గతిగలవి యగుటచే ప్రాణాదిభేదములవలన వానికివేర్వేరుగా స్థానకర్మములుకూడ జెప్పబడును.

## పిత్తస్థానము

నాభిరామాశయః స్వేదో లసీకా రుధిరం రసః,
దృక్ స్పర్శనం చ పిత్తస్య నాభిరత్ర విశేషతః. ౨

నాభి, ఆమాశయము, స్వేదము, లసీకా (అనగా త్వక్కు, మాంసము వీని మధ్యమున జలసదృశముగనుండు రసము), రక్తము, రసము, నేత్రములు, స్పర్శనేంద్రియము (అనగా త్వక్కు) ఇవి పిత్తమునకు స్థానములు. వానిలో నాభి పిత్తమునకు

ముఖ్యస్థానము. స్పర్శనేంద్రియము వాతమునకు స్థానమని పైన జెప్పబడియున్నది. అట్లగుటచే నా స్పర్శనేంద్రియమే పిత్తమునకు నెట్లు స్థానంబగు ననెడిశంక గలుగును. అయితే "అగ్నిః పిత్తంచ వహ్నిః" అనువచనముచేత అగ్నిస్వరూపమైన పిత్తమునకు వాయువు సహాయముగనుండుటవలన వాతపిత్తములకు స్థానంబొకటిగ నుండుట యుక్తంబని యెఱుంగునది.

## శ్లేష్మస్థానము

ఉరః కంఠ శిరః క్లోమ పర్వాణ్యామాశయో రసః,
మేదో ఘ్రాణం చ జిహ్వా చ కఫస్య సుతరామురః. 3

ఱొమ్ము, కంఠము, శిరము, క్లోమము (అనగా కడుపులో కుడిప్రక్కనుండు మాంసఖండము), గణుపులు, ఆమాశయము, రసము, మేదస్సు, నాసికము, నాలుక ఇవి కఫమునకు స్థానంబులు. వానిలో ఱొమ్ము కఫమునకు ముఖ్యస్థానము.

## వాతమునకు పంచవిధస్వరూపము

ప్రాణాదిభేదాత్పంచాత్మా వాయుః

వాతము చలనస్వభావము గలది. అది యొకటేవిధముగ నున్నను ప్రాణ ఉదాన వ్యాన సమాన అపానములను భేదములవలన నైదువిధములుగ నగును. అదియెట్లన్న,— దేవదత్తుడనువాడొకడే తాజేయుక్రియల కనుగుణమైన లావకపాచకాది సంజ్ఞల జెందునటులనే వాతాదులును తమతమక్రియల కనుగుణమైన ప్రాణాపానాది సంజ్ఞలను జెందును.

## ప్రాణవాతస్థానకృత్యములు

ప్రాణోఽత్ర మూర్ధగః,
ఉరఃకంఠచరో బుద్ధిహృదయేంద్రియచిత్తధృక్. 4
నిష్ఠీవక్షవథూద్గారనిఃశ్వాసాన్నప్రవేశకృత్,

పైజెప్పిన ప్రాణాదులలో ప్రాణమనువాయువు ముఖ్యముగ శిరమునందుండును. అది వక్షస్థలము, కంఠము వీనియందు సంచరించుచు బుద్ధి, హృదయము, ఇంద్రియములు, చిత్తము వీని కాధారముగ నుండును. నిష్ఠీవనము (అనగా నోటనుండు జలమును కారియుమియుట), తుమ్ము, ఉద్గారము (అనగా తేనుపు), నిశ్వాసము, అన్నప్రవేశము మొదలగుక్రియలను చేయుచుండును.

## ఉదానవాతస్థానకృత్యములు

ఉరః స్థానముదానస్య నాసానాభిగళాంశ్చరేత్. 5

వాక్ప్రవృత్తిప్రయత్నోర్జాబలవర్ణస్మృతిక్రియః,

ఉదానమను వాయువు ముఖ్యముగా రొమ్మునందుండి నాసికము, నాభి, కంఠము వీనియందు సంచరించుచు సంభాషణము, వాక్యములను పలుకుట, ప్రయత్నము, ఉత్సాహము, బలము, వర్ణము, పూర్వానుభూతస్మరణము మొదలగు ప్రవర్తనలను చేయుచుండును.

వ్యానవాతస్థానకృత్యములు

వ్యానో హృది స్థితః కృత్స్నదేహచారీ మహాజవః. ౬
గత్యపక్షేపణోత్క్షేపనిమేషోన్మేషణాదికాః,
ప్రాయస్సర్వాః క్రియాస్తస్మిన్ ప్రతిబద్ధాశ్శరీరిణామ్. ౭

వ్యానమను వాయువు హృదయమునందుండి సర్వశరీరమునందు సంచరించుచుండును. ఆ ప్రాణాదివాయువులకంటె నతిశీఘ్రమైన గమనము గలదై సంచారము, అపక్షేపణము (అనగా అంగములను అధోభాగమునందు జాచుట.) ఉత్క్షేపము (అనగా అంగములను పొడవుగనెత్తుట) నిమేషము (అనగా కనురెప్ప వాల్చుట) ఉన్మేషము (అనగా కనురెప్పలు విచ్చుట) మొదలగువానిని (అనగా ఆవలింపలు అన్నమను భుజించుట) అనునీపనులను తఱచుగా చేయుచుండును.

సమానవాతస్థానకృత్యములు

సమానోఽగ్నిసమీపస్థః కోష్ఠే చరతి సర్వతః,
అన్నం గృహ్ణాతి పచతి వివేచయతి ముంచతి ౮

సమానమనువాయువు పాచకమను కాయాగ్నిసమీపమునందుండినదై కోష్ఠమునందంతట సంచరించుచుండును. అది పక్వమైనయన్నమును ఆమాశయమునందు జేర్చి వంటవానివలెనే జాఠరాగ్నిని జ్వలింపజేసి అన్నమును పాకముజేయును. ఉంటగనుండు అన్నమను పాకార్థమై విభజనజేయును. మలమూత్రముల నధోభాగమునకు జేర్చును.

అపానవాతస్థానకృత్యములు

అపానోఽపానగః శ్రోణివస్తిమేఢ్రోరుగోచరః,
శుక్రార్తవశకృన్మూత్రగర్భనిష్క్రమణక్రియః. ౯

అపానమనువాయువు ముఖ్యముగా అపానస్థానము నాశ్రయించి పిఱుదులు, వస్తి, శిశ్నము, తొడలు వీనియందుసంచరించుచు రేతస్సు, ఆర్తవము, మలము, మూత్రము, గర్భము వీనిని వెలిపరచుచుండును. ఇదియె దానియొక్క కృత్యము. ఇటుల వాతభేదము లైదును జెప్పబడినవి.

### పాచకమను పిత్తకృత్యము

పిత్తం పంచాత్మకం తత్ర పక్వామాశయమధ్యగం,
పంచభూతాత్మకత్వేఽపి యత్తైజసగుణోదయాత్. ౧౦
త్యక్తద్రవత్వం పాకాదికర్మణానలశబ్దితం,
పచత్యన్నం విభజతే సారకిట్టౌ పృథక్తథా. ౧౧
తత్రస్థమేవ పిత్తానాం శేషాణామప్యనుగ్రహం,
కరోతి బలదానేన పాచకం నామ తత్ స్మృతమ్. ౧౨

పిత్తము ఐదువిధములుగ నుండును. వానిలో పక్వాశయ, ఆమాశయముల మధ్యమునం దుండునదియును, పంచభూతాత్మక మైయుండగా తేజోగుణాధిక్యమువలన ద్రవ్యస్వరూపము వదలి కాఠిన్యమును జెందియుండునదియును, వాతాదులతో జేరి పాకదాహాదిక్రియలుచేయుటచే అగ్ని యనుపేరం బఱగునదియు నగు పిత్తము పాచక మనబడును. అది అన్నమునుపాకముజేసి సారమును, మలమును వెవ్వేరుగ విభజించును. మఱియు నది పక్వాశయ, ఆమాశయమధ్యమునం దుండినదై ధాతువుల నాశ్రయించి యుండు రంజకాది యితర పిత్తములకు బలము నిచ్చి సహాయము చేయుచుండును.

### రంజకపిత్తము

ఆమాశయాశ్రయం పిత్తం రంజకం రసరంజనాత్,

ఆమాశయమునందుండు పిత్తము రసధాతువునకు రాగమును గలుగజేయుటవలన రంజక మనబడును.

### సాధకమనుపిత్తము

బుద్ధిమేధాభిమానాద్యైరభిప్రేతార్థసాధనాత్. ౧3
సాధకం హృద్గతం పిత్తం

హృదయమునందుండు పిత్తము, బుద్ధి, మేధ, అభిమానము మొదలగువానిచే తా గోరుకార్యములను సాధించుటవలన సాధక మనబడును.

### ఆలోచకపిత్తము

రూపాలోచనతః స్మృతం,
దృక్స్థమాలోచకం

నేత్రమునందలి నల్లగుడ్డులోపల నుండు పిత్తము రూపాదులను గ్రహించునట్టి శక్తిగలది యగుటవలన ఆలోచక మనబడును.

### భ్రాజకపిత్తము

త్వక్స్థం భ్రాజకం భ్రాజనాత్త్వచః. ౧౪

[illegible] ప్రక మనబడును. ఇది అన్యంగము. లేదు. [illegible]

## శ్లేష్మమునకు పంచవిధస్వరూపము

శ్లేష్మా తు పంచధా

శ్లేష్మము అయిదువిధములుగ నుండును.

## అవలంబక శ్లేష్మస్వరూపము

ఉరస్థస్సత్రికస్య స్వవీర్యతః,
హృదయస్యాన్నవీర్యాచ్చ తత్స్థ ఏవాంబుకర్మణా. ౧౫
కఫధామ్నాం చ శేషాణాం యత్కరోత్యవలంబనం,
అతోఽవలంబకః శ్లేష్మా

ఆ శ్లేష్మము హృదయమునం దుండునదై తన ప్రభావముచే త్రికమునకు (వెన్నెముకకు క్రిందిభాగమునకు) అవలంబనమును (ఆధారస్వకృత్యమునందు సామర్థ్యమును) గలుగజేయుటచేతను, రసరూపముగ పరిణామమునుజెందిన అన్నముయొక్క వీర్యమువలన హృదయమునకు తన ప్రభావముచే మిక్కుటముగ అవలంబనము జేయుటచేతను, స్నేహ సంశ్లేష్మాదిరూపమైన జలవ్యాపారములచే నితరమైన కఫస్థానములకు అవలంబనమును గలుగజేయుటచేతను, అవలంబక మనబడును. అవలంబక మను పేరుబడసిన శ్లేష్మము స్వభావముగనే హృదయమునకు అవలంబనము జేయుచుండినను,

"హృదయం మనసః స్థానమోజసశ్చింతితస్య చ,
మాంసపేశీ చ యోరక్తపద్మాకారమధోముఖమ్,
యోగినో యత్ర పశ్యంతి సమ్యగ్జ్యోతిస్సమాహితాః,
రసో యః స్వచ్ఛతాం యాతః తత్త్రైవావతిష్ఠతే.
తతో వ్యానేన విక్షిప్తః కృత్స్నం దేహం ప్రపద్యతే."

అనెడి ఆగమవచనముచొప్పున మనస్సు, ఓజస్సు, తేజస్సు, వీనికి ఆధారముగను, ఎఱ్ఱ తామరపుష్పాకారముగను, అధోముఖముగను, మాంసపేశీస్వరూపము గలదిగ నుండు హృదయకమలమును తొలుత అన్నరసము జెంది పిదప వ్యానమనువాతముచే చలింపజేయ బడినదై శరీరమంతటను వ్యాపించుటవలన హృదయమునకు విశేషముగా అవలంబనమును జేయును. అని తెలియజేయుటకై మూలశ్లోకమునందు "అన్నవీర్యాచ్చ" అని చకారము ప్రయోగింపబడినది.

## క్లేదక శ్లేష్మము

యస్త్వామాశయసంస్థితః. ౧౬

క్లేదకః సోఽన్నసంఘాతక్లేదనాత్

ఆమాశయమునం దుండు శ్లేష్మము అన్నసముదాయమునకు క్లేదము గలుగ జేయుటవలన క్లేదక మనబడును.

బోధకశ్లేష్మము

రసబోధనాత్,

బోధకో రసనాస్థాయీ

నాలుకయం దుండు కఫము మధురాదిరసముల దెలియజేయుటవలన బోధకమన బడును.

తర్పకశ్లేష్మము

శిరఃసంస్థోఽక్షతర్పణాత్. ౧౭

తర్పకః

శిరమునందుండు శ్లేష్మము ఇంద్రియములకు తృప్తిని గలుగజేయుటవలన తర్పక మనబడును.

శ్లేషంశ్లేష్మము

సంధిసంశ్లేషాత్ శ్లేషకస్సంధిషు స్థితః,

సంధులయం దుండు శ్లేష్మము పరస్పరము సంధులను జేర్చుటవలన శ్లేషక మన బడును.

ఇతి ప్రాయేణ దోషాణాం స్థానాన్యవికృతాత్మనామ్. ౧౮
వ్యాపినామపి జానీయాత్కర్మాణి చ పృథక్పృథక్,

వికారమును జెందక స్వభావమునందుండు వాతాదిదోషములు సర్వశరీరమునందు సంచరించుచుండును. ఐన నట్టి వాతాదిదోషములయొక్క స్థానకృత్యములను తఱుచుగా పైజెప్పినప్రకారము వేరువేర తెలిసికొనవలయును.

[వాతాదిదోషములకు వృద్ధి, క్షయము, అనునవి రెండును వికృతి యనబడును. ఆ వృద్ధి చయము, ప్రకోపము నని ద్వివిధంబుగ నుండును. దోషాదివిజ్ఞానీయాధ్యాయములో సామాన్యముగ వృద్ధిక్షయలక్షణములు జెప్పబడినవి. ఇపుడు చయ, ప్రకోప రూపమైన వృద్ధినిదానము సంక్షేపముగా జెప్పబడుచున్నది.]

వాతచయప్రకోపనిదానము

ఉష్ణేన యుక్తారూక్షాద్యా వాయోః కుర్వంతి సంచయమ్
శీతేన కోపముష్ణేన శమం స్నిగ్ధాదయో గుణాః,

ప్రకృతాధ్యాయమునందు చెప్పఁబడిన వాయువునకు సంబంధించిన రూక్షము మొదలగు ఆరు గుణములు విరుద్ధముగనుండు ఉష్ణగుణముతోఁ జేరినచో వాతమునకు చయమును గలుగఁ జేయును. ఉష్ణముగ విరుద్ధగుణముచే వాతమునకు ప్రకోపమును గలుగఁజేయఁజాలదు. మఱియు నా రూక్షాదిగుణములే శీతగుణముతోఁ జేరినచో వాతమునకు ప్రకోపమును గలుగఁ జేయును. ఉష్ణముతోఁ గూడియుండు స్నిగ్ధాదిగుణములు వాతమునకు శమనమును గలుగఁ జేయును.

## పిత్తచయప్రకోపనిదానము

శీతేన యుక్తాస్తీక్ష్ణాద్యాశ్చయం పిత్తస్య కుర్వతే ౨౦
ఉష్ణేన కోపం మన్దాద్యాః శమం శీతోపసంహితాః,

తీక్ష్ణము మొదలగు పిత్తగుణములు శీతగుణముతోఁ జేరినచో పిత్తమునకు చయమును గలుగ జేయును. మఱియు నా తీక్ష్ణాదిగుణములే ఉష్ణముతోఁ గూడినచో పిత్తమునకు ప్రకోపమును గలుగ జేయును. మందాదిగుణములు శీతగుణముతోఁ జేరినచో పిత్తమునకు శమనమును గలుగ జేయును.

## శ్లేష్మచయప్రకోపనిదానము

శీతేన యుక్తాః స్నిగ్ధాద్యాః కుర్వతే శ్లేష్మణశ్చయమ్. ౨౧
ఉష్ణేన కోపం తేనైవ గుణా రూక్షాదయశ్శమం,

స్నిగ్ధాదిగుణములు శీతగుణముతోఁ జేరినచో కఫమునకు చయమును గలుగ జేయును. మఱియు నా స్నిగ్ధాదిగుణములే ఉష్ణగుణముతోఁ గూడినచో కఫమునకు ప్రకోపమును గలుగ జేయును. ఉష్ణగుణముతోఁ గూడియుండు రూక్షాదిగుణములే కఫమునకు శమనమును గలుగ జేయును. స్నిగ్ధాదిగుణములతోఁ గూడియుండుశీతగుణముచే కఫమునకు చయము గలుగును. శీతగుణమునకు విరుద్ధమైన ఉష్ణముచే కఫము ఐరుగుచును, కాబట్టి ఉష్ణమువలన కఫమునకు ప్రకోపము గలుగును. రూక్షాదులతోఁ గూడియుండు ఉష్ణము కఫమునకు విరుద్ధంబగుటచే కఫశమనమును గలుగ జేయును.

## చయలక్షణము

చయో వృద్ధిః స్వధామ్న్యేవ ప్రద్వేషో వృద్ధిహేతుషు. ౨౨
విపరీతగుణేచ్ఛా చ

వాతాదిదోషములకు తమస్థానమునందే గలుగునట్టివృద్ధి చయ మనబడును. వాతము చయమును బొందియుండునపుడు వాతవృద్ధికి హేతువుగనుండు రూక్షాదిగుణముల యందు ద్వేషము, రూక్షాదులకు విరుద్ధముగ వాతక్షయహేతువుగ నుండు స్నిగ్ధాదిగుణ

ములయందభిలాష గలుగును. ఇటులనే పిత్తకఫములయొక్క చయముచే తెలిసికొనవల యును. వాతము చయమును జెందక స్వప్రమాణమునం దుండినను లేక క్షయమును జెంది నను "గర్భిణికి దోహదవశముచే విరుద్ధమైన యన్నమునం దిచ్ఛగలుగునటులనే" పురుష నికి నొకానొకప్పుడు అభ్యాసవశముచే వాతవృద్ధికి హేతువుగ నుండురూక్షాదులయందు ద్వేషము గలుగక యిచ్ఛయే గలుగును. కాబట్టి వాతవృద్ధికి హేతువుగ నుండు పదార్థ ములయందు గలుగునట్టి ద్వేషముచేతనే వాతచయము నెఱుంగుట అసాధ్యము. కావు ననే వాతవృద్ధికి హేతువుగ నుండువస్తువులయందు ద్వేషమును, రూక్షాదులకు విరుద్ధ మైన గుణములుగల వస్తువులయందభిలాషయుగలుగుట వాతచయముయొక్క లక్షణమని యీతంత్రకారుడు చెప్పియున్నాడు. ఏకకాలమునందు వాతవృద్ధికి హేతువుగ నుండు వస్తువులయందు ద్వేషమును, వాతక్షయ హేతువులుగను నుండువస్తువులయందు నభి లాషయు గలుగునపుడు వాతము బాగుగ చయమును జెందియున్నదని నిశ్చయించుకొన వలయును.

## ప్రకోపలక్షణము

కోపస్తూన్మార్గగామితా,
లింగానాం దర్శనం స్వేషా మస్వాస్థ్యం రోగసంభవః. ౨౩

వాతాదిదోషములు తమస్థానములను వదలి మార్గాంతరమునందు సంచరించుట ప్రకోప మనబడును. దానియందు దోషాదివిజ్ఞానీయాధ్యాయములో జెప్పబడినవియు, వాతవ్యాధినిదానమునం దిక జెప్పబడునవియు నగు వాతాదిప్రకోపలక్షణంబులన్నియు గలుగుటయే గాక వాతాదులస్వరూపమును మారియుండును. అట్టి వాతాదిప్రకోపముచే ననేకవిధములైన రోగములు గలుగును.

"స్వస్థానస్య సమతా వికారాసమ్భవశ్శమః."

స్వస్థానమునం దుండు వాతాదిదోషములకు సమత్వము, వికారము గలుగకుండుట శమ మనబడును.

## వాతాదినముప్రకోపశమన కాలము

చయప్రకోపప్రశమా వాయోర్గ్రీష్మాదిషు త్రిషు,
వర్షాదిషు తు పిత్తస్య శ్లేష్మణః శిశిరాదిషు. ౨౪

గ్రీష్మము, వర్షము, శరత్తు, అను నీయాడు ఋతువులయందు వాతమునకు చయ, ప్రకోప, శమనములు గలుగును. (గ్రీష్మమున చయంబును, వర్షర్తువున ప్రకో పంబును, శరదృతువున శమంబును వాతమునకు కల్గునని భావము.) వర్షము, శరత్తు,

హేమంతము, అను నీమూడు ఋతువులయందు పిత్తమునకు చయ, ప్రకోప, శమనములు గలుగును. (పిత్తమునకు వర్షర్తువున చయంబును, శరత్కాలమున ప్రకోపంబును హేమంతఋతువున శమంబును కల్గు ననిభావము.) శిశిరము, వసంతము, గ్రీష్మము, అను నీమూడు ఋతువులయందు కఫమునకు చయ, ప్రకోప, శమనములు గలుగును. (కఫమునకు శిశిరఋతువున చయంబును, వసన్తఋతువున ప్రకోపంబును, గ్రీష్మమున శమంబును వరుసగ గల్గు ననిభావము.)

### గ్రీష్మాదులయందు వాతాదిచయనిదానము

చీయతే లఘురూక్షాభిరోషధీభిస్సమీరణః,
తద్విధ స్తద్విధే దేహే కాలస్యౌష్ణ్యాన్న కుప్యతి. ౨౫
అద్భిరమ్లవిపాకాభిరోషధీభిశ్చ తాదృశం,
పిత్తం యాతి చయం కోపం న తు కాలస్య శైత్యతః. ౨౬
చీయతే స్నిగ్ధశీతాభిరుదకౌషధిభిః కఫః,
తుల్యేఽపి కాలే దేహే చ స్కన్నత్వాన్న ప్రకుప్యతి. ౨౭

లఘుగుణ రూక్షగుణములు గలవాతము గ్రీష్మకాలములో ఆదానకాలస్వభావము వలన లఘువుగ రూక్షముగ నుండుదేహమునందు లఘువుగ, రూక్షముగ నుండు నౌషధములచే చయమును జెందునేకాని ఆ గ్రీష్మకాలముయొక్క ఔష్ణ్యమువలన ప్రకోపమును జెందనేరదు. అమ్లమైన విపాకము గల పిత్తము వర్షాకాలమునందు అమ్లమయిన విపాకముగల ఓషధులచేతను, ఉదకముచేతను చయమును జెందునేకాని ఆవర్షాకాలము యొక్క శీతస్వభావమువలన ప్రకోపమును జెందనేరదు. స్నిగ్ధముగ శీతలముగ నుండు కఫము శిశిరకాలమునందు కాలస్వభావమువలన స్నిగ్ధముగ శీతలముగ నుండు దేహమునందు స్నిగ్ధముగ శీతలముగ నుండు ఉదకము, ఓషధులు వీనిచే చయమును జెందునేకాని స్కన్నముగ నుండుటవలన ప్రకోపమును జెందనేరదు.

ఇతికాలస్వభావోఽయం,

ఇటులు పైజెప్పిన వాతాదులయొక్క చయ, ప్రకోప, శమనములు కాలస్వభావమువలన గలుగును.

### దోషచయాదులకు ఆహారప్రాధాన్యము

ఆహారాదివశాత్పునః,
చయాదీన్ యాంతి సద్యోఽపి దోషాః కాలేఽపి వా న తు,

వాతాదిదోషములు అన్నపానాదిరూపమైన ఆహారాదులయొక్క సామర్థ్యము వలన తత్క్షణమునసే (అనగా కాలము నపేక్షింపకయే) చయప్రకోపశమనములను జెందును. అన్నము, పానము, రసాయనము, వాజీకరణము, వమనము, విరేచనము మొదలగువానియొక్క సామర్థ్యమువలన వాతాదిదోషములు పైని చెప్పియుండు చయాదికాలములయందు కూడ చయప్రకోపశమనములను జెందకయే యుండును. (అనగా వాతాదిచయాదికాలములకంటె చయప్రకోపశమనములకు ఆహారాదులే ముఖ్య మని భావము.)

## ప్రకుపితవాతాదివిచిత్రగమనము

వ్యాప్నోతి సహసా దేహమాపాదతలమస్తకం,
నివర్తతే తు కుపితో మలోఽల్పాల్పం జలౌఘవత్. ౨౯

"పర్వతనదులయొక్క జలప్రవాహము మిట్టపల్లములుగనుండు సమస్తప్రదేశములయందు శీఘ్రముగ వ్యాపించి మరల కొంచెకొంచెముగా తగ్గునటులనే" ప్రకోపమును జెందియుండు వాతాదిదోషములు అతిశీఘ్రముగా నరకాలు మొదలు శిరఃపర్యంతము వ్యాపించి మరల కొంచెకొంచెముగ తగ్గును.

## రోగహేత్వాదిసామాన్యకథనప్రతిజ్ఞ

నానారూపై రసంఖ్యే యైర్వికారైః కుపితా మలాః,
తాపయంతి తనుం తస్మాత్తద్ధేత్వాకృతిసాధనమ్. 30
శక్యం నైకైకశో వక్తుమతస్సామాన్యముచ్యతే,

ప్రకోపిరేచినవాతపిత్తశ్లేష్మములు అనేకవిధములుగను, సంఖ్యాతీతములుగ నుండు జ్వరాదిరోగములచే శరీరమునకు విశేషముగా తాపమును గలుగజేయును, కావున నా జ్వరాదిరోగములయొక్క హేతు, లక్షణ, చికిత్సలను ప్రత్యేకముగా జెప్పుట కసాధ్యంబు. (అనగా ఇట్టిది ఫలానిరోగమునకు హేతు వని, ఇట్టిది ఫలానిరోగమునకు లక్షణమని, ఇట్టిది ఫలానిరోగమునకు చికిత్స యని విభజించి ప్రత్యేకముగా జెప్పుట కసాధ్యమని యర్థము ) కాబట్టి రోగహేతువు, లక్షణము, చికిత్స, ఇవి సామాన్యముగా జెప్పబడును.

## వాతాదులకు సర్వరోగకారణత్వము

దోషా ఏవహి సర్వేషాం రోగాణా మేకకారణమ్. 31
యథా పక్షీ పరిపతన్ సర్వతస్సర్వమప్యహః,
ఛాయామత్యేతి నాత్మీయాం యథావా కృత్స్నమప్యదః. 32

వికారజాతం వివిధం త్రీన్ గుణాన్నాతివర్తతే,
తథా స్వధాతువైషమ్యనిమిత్తమపి సర్వదా. ౩౩
వికారజాతం త్రీన్ దోషాన్

డేగ మొదలగు పక్షులు అన్నిచోట్ల సంచరించుచు పగటియందంతట తమ ఛాయ నెటుల నతిక్రమించకుండునో (అనగా సమస్థానములవలన నెటులనొకక్షణమైన నుండకుండునో) సమస్తమైన స్థావర జంగమాదిభేదములతో గాని, లేక జరాయుజ అండజభేదములతో గాని కూడ నానాప్రకారములుగ నుండు నీ ప్రపంచవికారము రజస్సత్వతమములను గుణత్రయముల నెటుల నతిక్రమింపకుండునో (అనగా నొకక్షణమైన రజస్సత్వతమోరూపమైన గుణత్రయముల నెటుల వదలకుండునో) అటులనే తమతమ దోషధాతుమలములయొక్క వైషమ్యముచే కారణముగ గల రోగసమూహము వాతాది దోషత్రయముల నెపుడు నతిక్రమింపకుండును. అనగా త్రిదోషరహితముగ నుండు రోగసమూహం బేదియు లేదని భావము. కాబట్టి సమస్తమైనరోగములకు వాతాది దోషములే ప్రధానకారణములు. ధాతువైషమ్యము ప్రతిరోగమునందు వేరువిధముగ నుండుటచే నానావిధములుగ నుండును. ఆయాధాతు వైషమ్యమువలన గలుగునట్టి వికారం బాయాధాతుసంబంధము గలదిగ నుండును. దేవగ్రహాదులను కారణముగాగల రోగములు ఆగంతుకరోగములగుటచే వానియందుదోషసంబంధములేకుండును. ఆగంతుక రోగములయందు తొలుత రోగముగలిగి పిదనంతరము వాతాదిదోషములు ప్రకోపమును జెందును. నిజరోగములయందు తొలుత వాతాదిదోషములు ప్రకోపమునుజెంది తదనంతరము రోగములను గలుగ జేయును. కాబట్టి నిజాగంతుకరోగములయొక్క పరస్పర భేదము నిటుల దెలిసికొనవలయును.

**అనుచితార్థసంయోగాదులచే వాతాదిప్రకోపము**

తేషాం కోపే తు కారణం,
అర్థైరసాత్మ్యైస్సంయోగః కాలః కర్మ చ దుష్కృతమ్. ౩౪
హీనాతిమిథ్యాయోగేన భిద్యతే తత్పునస్త్రిధా,

అనుచితములైన శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము అనునీయర్థములతో శ్రోత్రము, త్వక్కు, నేత్రము, రసనము, ఘ్రాణము అనునీయింద్రియములకు గలుగునట్టి సంయోగము, శీతోష్ణవర్షరూపమైన కాలము, ప్రకృతజన్మార్జితంబును, జన్మాంతరార్జితంబు నైన అశుభకర్మ అనునవి మూడును వాతాదిదోషములయొక్క ప్రకోపమునకు హేతువుగ నుండునేకాని రూక్షాదిపదార్థసేవనముమాత్రము కారణముగ

కాసేరదు. పైజెప్పిన అనుచితేంద్రియార్థసంయోగము మొదలగునవికూడ వాతాదిప్రకోపమునకు ముఖ్యకారణముగనుండునని తెలియపరచుటకై సముచ్చయార్థమైన (తు) అను శబ్దము ఈతంత్రకారునిచే ప్రయోగింపబడినది. మఱియును అనుచితేంద్రియార్థసంయోగాది భేదముచే పైజెప్పినప్రకారము మూడు విధములుగ నుండు వాతాదిదోషప్రకోపకారణము మరలను హీన, మిథ్యా, అతియోగభేదములచే త్రివిధంబుగ నగును.

ఇంద్రియార్థములకు హీనమిథ్యాతియోగనిరూపణము

హీనోఽర్థేనేంద్రియస్యాల్పస్సంయోగః స్వేన నైవ వా ౩౫
అతియోగోఽతిసంసర్గస్సూక్ష్మభాసురభైరవం,
అత్యాసన్నాతిదూరస్థం విప్రియం వికృతాది చ ౩౬
యదక్ష్ణా వీక్ష్యతే రూపం మిథ్యాయోగస్స దారుణః,
ఏవమత్యుచ్చపూత్యాదీనింద్రియార్థాన్ యథాయథమ్. ౩౭
విద్యాత్

శబ్దాద్యర్థములతో శ్రోత్రాదీంద్రియములకు గలుగు అల్పమైన సంయోగముగాని లేక ఆయాయింద్రియములకు తమతమయర్థములతో సంయోగమే లేకుండుట గాని హీనయోగ మనంబడును. శ్రోత్రాదీంద్రియములకు శబ్దాదులైన తమతమయర్థములతో గలుగు అతిసేవారూపమైన అధికసంయోగము అతియోగ మనబడును. అతిసూక్ష్మమైన వస్తువు, మిగుల ప్రకాశముగల వస్తువు, అతిభయంకరమైన వస్తువు, అతిసమీపమునందు అతిదూరమునందు నుండు వస్తువు, అనిష్టమైన వస్తువు, అతి వికారముగల వస్తువు మొదలగువానిని నేత్రములచే జూచుట నేత్రేంద్రియమునకు మిథ్యాయోగ మనబడును. అది తిమిరాదిరోగములకు హేతు వగుటవలన నతిదారుణమైనది. నేత్రేంద్రియములకు జెప్పియుండునటులనే యితరములైన యింద్రియములకును మిథ్యాయోగము నూహించుకొనవలయును. అది యెట్లన్న — అతిబిగ్గరగ, క్రూరముగ, ఇష్టవినాశరూపముగ, భయంకరముగ నుండు అనిష్టశబ్దము మొదలగువానిని వినుట శ్రోత్రేంద్రియమునకు తనయర్థమైన శబ్దముతోడ మిథ్యాయోగమనియును, పూతివిష్ఠము మొదలగు అనిష్టమైన గంధము నాఘ్రాణించుట ఘ్రాణేంద్రియమునకు తనయర్థమైన గంధముతోడ మిథ్యాయోగమనియును, స్నానము, అనులేపనాదులు, శీతోష్ణమైనస్పర్శము వీనియొక్క అక్రమమైన స్పర్శము స్పర్శనేంద్రియమునకు తనయర్థమయిన స్పర్శముతోడ మిథ్యాయోగమనియును, విరుద్ధమైన రసమును అపథ్యద్రవ్యయుక్త రసమును రసనేంద్రియముచే గ్రహించుట రసనేంద్రియమునకు తనయర్థమైన రసముతోడ మిథ్యాయోగ మనియును తెలియవలయును.

### కాలమునకు హీనమిథ్యాతియోగనిరూపణము.

కాలస్తు శీతోష్ణవర్షభేదాత్త్రిధా మతః.
స హీనో హీనశీతాదిరతియోగోఽతిలక్షణః ౩౯
మిథ్యాయోగస్తు నిర్దిష్టో విపరీతస్వలక్షణః,

శీతము, ఉష్ణము, వర్షము అని కాలము ఋషులచే మూడువిధములుగ జెప్పబడియున్నది. వానిలో శీతకాలము హేమంత శిశిర రూపముగ నుండును. ఉష్ణకాలము వసంత గ్రీష్మ రూపముగ నుండును. వర్షాకాలము వృష్టితో గూడియుండును. హీనమైన శీతోష్ణాదులతో గూడియుండు కాలము హీనయోగస్వరూపము గలది. అధికమైన శీతాదులతో గూడియుండు కాలము అతియోగస్వరూపము గలది. విరుద్ధమైన శీతోష్ణాదులతో గూడియుండు కాలము మిథ్యాయోగస్వరూపముగలది. ఎట్లన్న—హేమంత కాలమందు శీతము స్వల్పముగ నుండుట ఆ హేమంతకాలమునకు హీనయోగ మనియును, అధికమైన శైత్యముగలిగి యుండుట అతియోగ మనియును, అధికమైన ఉష్ణము గలిగియుండుట మిథ్యాయోగ మనియును తెలియవలయును. ఇటులనే శరద్వసంతఋతువులకు హీనయోగ, అతియోగ, మిథ్యాయోగముల నూహించుకొనవలయును.

### కాయికాదికర్మలకు హీనమిథ్యాతియోగనిరూపణము

కాయవాక్ చిత్తభేదేన కర్మాపి విభజేత్త్రిధా.
కాయాదికర్మణాం హీనా ప్రవృత్తిర్హీనసంజ్ఞకా,
అతియోగోఽతివృత్తిస్తు వేగోదీరణధారణమ్. ౪౦
విషమాంగక్రియారంభః పతనస్ఖలనాదికం,
భాషణం సామిభుక్తస్య రాగద్వేషభయాది చ. ౪౧
కర్మ ప్రాణాతిపాతాది దశధా యచ్చ నిందితం,
మిథ్యాయోగస్సమస్తోసా విహ చాముత్ర వాకృతమ్. ౪౨

శరీరము, వాక్కు, మనస్సు అను భేదములచే క్రియలుకూడ మూడువిధములుగ నుండును. శరీరక్రియ, వాక్క్రియ, మానసికక్రియ అను వానికి హీనమైన ప్రవృత్తి హీనయోగ మనబడును. శరీరాదిక్రియలకు అతిప్రవృత్తి అతియోగ మనబడును. మలమూత్రాదులు రాకుండునపుడు వానిని విసర్జించుట, వచ్చునపుడు వాని నడ్డగించుట, విషమమైన అంగముచే నొక కృత్యమును చేయుట, ఇహ పర లోకములకు విరుద్ధమైన క్రియలను చేయుట, విషమముగా భూమిపై బడుట. విషమమైన స్ఖలనము (అనగా

తడబడుట, వక్రముగ నడచుట) ఇవి మొదలగు నవి శారీరాదిక్రియలకు మిథ్యాయోగ మనబడును. సగము భుజించి మాట్లాడుట మొదలగునవి వాచిక క్రియలకు మిథ్యాయోగ మనబడును. రాగము, ద్వేషము, భయము మొదలగువానియొక్క ప్రవృత్తి మానసిక క్రియలకు మిథ్యాయోగ మనబడును. మఱియును "హింసాస్తేయమిత్యాది" గ్రంథముచే దినచర్యాధ్యాయమునందు చెప్పబడిన జీవహింస మొదలగు దశవిధక్రియలును ఈలోకము నందును, లోకాంతరమునందును చేయబడిన సకలమైన అశుభకృత్యములును శారీరాదిక్రియలకు మిథ్యాయోగ మని తెలిసికొనవలయును.

## రోగకారణము

నిదానమేతద్దోషాణాం కుపితాస్తేన నైకధా.
కుర్వంతి వివిధాన్ వ్యాధీన్ శాఖాకోష్ఠాస్థిసంధిషు. ४३

పైజెప్పినవంతయు వాతాదిదోష ప్రకోపమునకు ముఖ్యకారణముగ నుండును. అట్టి ముఖ్యకారణముచే ప్రకోపమును జెందియుండు వాతాదిదోషములు శాఖ, కోష్ఠము అస్థి, సంధులు వీనియందు నానావిధ రోగములను గలుగజేయును.

## బాహ్యరోగస్థానము

శాఖారక్తాదయస్త్వక్చ బాహ్యరోగాయనం హి తత్,
తదాశ్రయా మషవ్యంగగండాలజ్యర్బుదాదయః. ४४
బహిర్భాగాశ్చ దుర్నామ గుల్మశోఫాదయో గదాః,

రక్తము మొదలగు ఆరు ధాతువులు, త్వక్కు ఇవి శాఖ లనబడును ఇవి బాహ్యరోగములకు స్థానముగ నుండును. కాబట్టి యీబాహ్యరోగస్థానము నాశ్రయించియుండు మష, వ్యంగము, గండము, అలజి, అర్బుదము మొదలగు రోగములును దుర్నామము, గుల్మము, శోఫ మొదలగురోగములును, బాహ్యరోగము లనబడును. వ్యంగాది యను "ఆది" శబ్దమువలన విసర్పము, విద్రధి, పిప్లు, కుష్ఠము మొదలగు రోగములను గ్రహించుకొనవలయును.

## అంతరరోగస్థానములు

అంతఃకోష్ఠో మహాస్రోత ఆమపక్వాశయాశ్రయః ४५
తత్ స్థానాశ్ఛర్ద్యతీసారకాస *శ్వాసోదరజ్వరాః
అంతర్భాగం చ శోఫార్శో గుల్మవీసర్పవిద్రధి. ४६

* శ్వాసారుచి ఇతి పా.

అంత్రప్రదేశము, మహాస్రోతస్సు, ఆమాశయము, పక్వాశయము అని చెప్ప బడును. దానియందు జనించు ఛర్ది, అతిసారము, వాంతము, శ్వాసము, కాసరోగము జ్వరము, శోష, అర్శస్సు, గుల్మము, విసర్పము, విద్రధి అనుచి రోగములు అంతర్మార్గజనిత రోగము లని (అనగా అంతరరోగము లని) చెప్పబడును.

## మధ్యమరోగస్థానము

శిరోహృదయవస్త్యాది మర్మాణ్యస్థ్నాం చ సంధయః,
తన్నిబద్ధాస్సిరాస్నాయుకండరాద్యాశ్చ మధ్యమాః. ౪౭
రోగమార్గాస్త్రితా స్తత్ర యక్ష్మపక్షవధార్దితాః,
మూర్ధాది రోగాస్సంధ్యస్థిత్రికశూలగ్రహాదయః. ౪౮

శిరస్సు, హృదయము, వస్తి మొదలగునవియును, మర్మములు, అస్థిసంధులు, అస్థులలో జేరియుండు సిరలు, స్నాయువులు, కండరము, ధమనీకూర్చములు, మొదలగునవియును మధ్యమరోగస్థానంబులు అవి రోగమార్గము లనియు జెప్పబడును. క్షయరోగము, పక్షాఘాతము, అర్దితవాతము, శిరస్సు, హృదయము, వస్తి వీనియందు జనించు రోగములను, సంధులు, అస్థులు, త్రికము (వెన్నెముకక్రిందిభాగము) వీనియందు గలుగు శూలలును, పట్లును, పట్టుగ్రహాదివాత వికారములును, పైజెప్పిన మధ్యమ రోగ స్థానము నాశ్రయించియుండును. క్షయరోగము మర్మను, సంధులు, అస్థి వీనినాశ్రయించి యుండుటచే తొలుత జెప్పబడినది.

## వాతకృత్యము

స్రంసవ్యాసవ్యధస్వాపసాదరుక్తోదభేదనం,
సంగాంగభంగసంకోచవర్తహర్షణతర్షణమ్. ౪౯
కంపపారుష్యసౌషిర్యశోషస్పందనవేష్టనం
స్తంభః కషాయ రసతా వర్ణః శ్యావోఽరుణోఽపి వా. ౫౦
కర్మాణి వాయోః

అంకిళులు మొదలగు వానిసంధులు జారుట, ఆక్షేపకాది వాతములయందు వలెనే సర్వాంగములయందు విక్షేపణము గలుగుట, శరీరమునందు కఱ్ఱలతో గొట్టునటు లుండుట, కృత్యములయందు అజ్ఞానము, అంగములకు కృత్యములయం దశక్తి, ఎల్లపుడు శరీరమునందు శూల గలుగుట, అంగములయందు సూదులచే బొడచునటులుండుట, శరీరమును బీల్చునటు లుండుట, మూత్రపురీషాదులు తమతమ స్థానముల యందుండి వెలికడ కుండుట, మోకాళ్లు, తొడలు మొదలగు నంగములకు భంగము గలుగుట, సిరాదులు

సంకోచమును జెందుట, పురీషాదులు ఉంటకట్టుట, రోమములు నిక్క బొడిచికొనుట, దప్పి, కంపము, శరీరము పరుషముగనుండుట, అస్థులయందు ద్వారముగలుగుట, శరీరము శోషించుట, శరీరము కొంచెకొంచెముగ కదలుట, చుట్టుకొనుట, చేతులు, తొడలు, పిక్కలు మొదలగునవి స్తంభించుట (అనగా ముడుచుటకు చాచుటకు శక్తిలేకుండుట), కషాయరసమునందు రుచిపుట్టుట, కపిశవర్ణము, లేక ఎఱుపువర్ణముగలుగుట, ఇవి వాతముయొక్క కృత్యములు.

## పిత్తకృత్యము

పిత్తస్య దాహరాగోష్మపాకితాః,
స్వేదః క్లేదః స్రుతిః క్రోథః సదనం మూర్ఛనం మదః. ౫౧
కటుకామ్లౌ రసౌ వర్ణః పాండు రారుణ వర్జితః,

శరీర మంతటను తాపము, రక్తవర్ణము, ఉష్ణము, జీర్ణశక్తి, స్వేదము, క్లేదము (అనగా రక్తాదులయందు వికారము), స్రావము, క్రోధము (అనగా ~~పైజెప్పిన క్లేదాధి క్యము~~) క్రియలయందశక్తి, భ్రమము, ఉత్తరత్ర జెప్పబడు మదమను రోగము, కారము, పులుసు ఈరసములయందు రుచి, తెలుపు, ఎఱుపువర్ణములుతప్ప తక్కిన నానావిధవర్ణములు గలుగుట, ఇవి పిత్తముయొక్క కృత్యములు.

## కఫకృత్యము

శ్లేష్మణః స్నేహకాఠిన్యకండూశీతత్వగౌరవమ్.  ౫౨
బంధోపలేపస్తైమిత్యశోఫాపక్త్యతినిద్రతాః,
వర్ణః శ్వేతో రసౌ స్వాదు లవణౌ చిరకారితా. ౫౩

స్నేహము, కాఠిన్యము, దురద, శైత్యము, గురుత్వము, స్రోతోబంధము, అస్థ్యాదులకు ఉపలేపము, స్తైమిత్యము (అనగా అవయవములకు పటుత్వము లేకుండుట) శోఫ, అజీర్ణము, అతినిద్ర, శరీరమునందు తెలుపువర్ణము, మధుర లవణ రసములయందు రుచి, కార్యమునందాలస్యము, ఇవి కఫముయొక్క కృత్యములు. ఇటుల వాతాదిదోషములయొక్క కృత్యములు జెప్పబడినవి. మరియు వాతపిత్త కఫములచే సంభవించు రోగములును వాని ప్రత్యేకసంఖ్యాభేదంబులును అష్టాంగసంగ్రహమునసిట్లు చెప్పబడినవి.—

" అశీతిర్వాతజా రోగాశ్చత్వారింశచ్చ పిత్తజాః,
వింశతిః శ్లేష్మజాశ్చైవ స్థూలా నానాత్వజా మతాః.
నఖభేదః పాదశూలం సుప్తిర్భ్రంశో విపాదికా,
ఖుడో గుల్ఫగ్రహో జాను విశ్లేషో జాను కుంచనమ్.

పిండికోద్వేష్టనం పాదభ్రంశసుప్తతే చ గృధ్రసీ,
పాంగుల్యం త్రికశూలం చ గుదే స్తంభస్తు మేహనే.
ముష్కోత్క్షేపః శ్రోణిభేదో వంక్షణానాహ ఏవ చ,
ఉదావర్తోఽథ విడ్భేదః పార్శ్వపృష్ఠత్రికగ్రహాః.
ఖంజవామనకుబ్జత్వం హృద్ద్రవోఽంసవిచేష్టతా,
హృన్మోహో వక్షనిస్తోదశ్శోషో ద్వాతా ఽంసశోషణమ్,
బాహుశోషో హనుగ్రీవామన్యాస్తంభోష్ఠభేదనమ్,
దంతభేదోఽథ శైథిల్యం కంఠధ్వంసో హనోర్వా గ్రహః,
కషాయాస్యత్వమూకత్వే ముఖశోషో రసాజ్ఞతా,
ఘ్రాణనాశోఽజ్ఞతాగంధే శబ్దోచ్చైశ్శ్రవణం తథా.
బాధిర్యం కర్ణశూలం చ వర్త్మస్తంభనసంకోచనమ్,
తిమిరం చాక్షిశూలం చ భ్రూవ్యుదాసశ్చ నేత్రయోః.
లలాటశంఖభేదౌ చ కేశభూస్ఫోటనం తథా,
శిరోరుజార్దితం జృంభా ప్రలాపో వేపథుర్భ్రమః,
ఏకాంగవ్యాధిరాయామః పక్షఘాతోఽపతంత్రకః.
దండకస్స్వప్ననాశశ్చ గ్లానిః పారుష్యరూక్షతా,
విషాదశ్చానవస్థానమరుణశ్యామవర్ణతా,
ఇత్యశీతిస్సమాఖ్యాతా రోగా వాతసముద్భవాః.
అంతర్దాహో విదాహశ్చ ప్లోషోఽథ దవథుర్దవః,
అత్యూష్మా చాంగదాహశ్చ స్వేదోఽత్యమ్లకధూమకౌ.
రక్తక్లేదోఽంగగంధశ్చ గాత్రావయవశాతనమ్,
త్వఙ్మాంసదరణో మాంసక్లేదశ్చర్మదళస్తథా.
రక్తవిస్ఫోటకః కోఠః పిత్తాసృగ్రక్తమండలే,
నీలికా కామలా కక్షా గాత్రే హారితపీతతా.
పూతితిక్తాస్యతా తృష్ణా లోహగంధాస్యతా తథా,
జీవాదానమతృప్తిశ్చ ప్రవేశస్తమసస్తథా.
గళాస్యగుదమేఢ్రాక్షిపాకో హారిద్రపీతతా,
నఖాక్షిమూత్రశకృతాం చత్వారింశత్తు పిత్తజాః.
స్తైమిత్యం గౌరవం తృప్తిరాలస్యమతినిద్రతా,
తంద్రాస్యస్రావమాధుర్యే ప్రలేపో హృదయస్య చ.

సాదః కంఠప్రలేపశ్చ శ్లేష్మోద్గిరణమేవ చ,
ల్యం వమనం ప్రతిసంచయమ్.
ఉదర్దో గళగండశ్చ శైత్యం శ్వేతావభాసతా,
విణ్మూత్రనఖనేత్రాణాం శుక్లతా చ కఫామయాః.
యథాస్థూలం వికారాణాం చత్వారింశమిదం స్మృతమ్,
హృదాదౌ శూలవద్దాహో యోఽంఽతర్దాహస్సకీర్తితః,
పాణి పాదాంసమూలేషు సంతాపో వివిధస్తు యః.
అగ్నేర్యశ్చైవ నిస్స్వేదో విదాహ స్స నిగద్యతే,
ఓషస్సర్వాంగిక స్తీవ్రో దాహస్స్వేదారతిప్రదః.
దవథుశ్చక్షురాదిభ్యఃతీవ్ర ఊష్మా ప్రవర్తతే,
ముఖౌష్ఠతాలుషు దవశ్చామ్లోద్గిరణమమ్లకః.
ధూమాయనం శిరోఘ్రాణ కంఠ తాలుషు ధూమకః,
ప్రమీలకస్తు స్తైమిత్యం గురుతాంగస్య గౌరవమ్.
ఆహారానభిలాషస్తు తృప్తిస్స్యాద్విషయాగ్రహః,
నిద్రార్తస్యేవ తంద్రా స్యాత్ శేషాః ప్రథితనామకాః."

వాతప్రకోపమువలన గలిగిన రోగములు ఎనుబది. పిత్తప్రకోపమువలన గలిగిన రోగములు నలువది. శ్లేష్మప్రకోపము వలన గలిగిన రోగములు ఇరువది అని స్థూలముగా రోగములు జెప్పబడియున్నవి. అందు నఖభేదము, పాదశూల, సుప్తిభ్రంశము, విపాదిక, ఖుడము, గుల్ఫగ్రహము, జానువిశ్లేషము, జానుకుంచనము, పిండికోద్వేష్టనము ఊరుసాదము, ఊరుస్తంభము, గృధ్రసి, పాంగుళ్యము, గుదభ్రంశము, గుదశూల, గుదస్తంభము, మేహనస్తంభము, ముష్కాక్షేపము, శ్రోణిభేదము, వంక్షణానాహము ఉదావర్తము, విడ్భేదము, పార్శ్వవము, పృష్ఠము, త్రికము వీనియందు పట్లు, ఖంజత్వము, వామనత్వము, కుబ్జత్వము, హృద్గ్రహము, ఉదరవేష్టకము, హృన్మోహము, వక్షనిస్తోదము, హృదయశోషము, హృదయోద్ఘాతము, బాహుశోష, హనుస్తంభము, గ్రీవాస్తంభము, మన్యాస్తంభము, ఓష్ఠభేదనము, దంతభేదనము, శైథిల్యము, కంఠధ్వంసము, కంఠగ్రహము, కషాయాస్యత్వము, మూకత్వము, ముఖశోష, రసాజ్ఞత్వము; ఘ్రాణనాశము, గంధాజ్ఞత్వము, శబ్దోచ్చైశ్శ్రవణము, బాధిర్యము, కర్ణశూల, వర్త్మస్తంభనము, వర్త్మకుంచనము, తిమిరము, అక్షిశూల, భ్రూవ్యుదాసము, నేత్రవ్యుదాసము, లలాటభేదము, శంఖభేదము, కేశస్ఫుటనము, భ్రూస్ఫుటనము, శిరోరుజము, అర్దితము, జృంభ, ప్రలాపము, వేపథు, భ్రమ, ఏకాంగవ్యాధి, ఆయామము, పక్షాఘాతము, అపతంత్రకము, దండ

కము, స్వప్ననాశము, గ్లాని, పారుష్యము, [illegible], [illegible], ఆశాస్థైర్యము, అరుణ శ్యావవర్ణత్వము, అను నెనుబదియు వాతమువలన గల్గు రోగములని మునులచే చెప్ప బడియున్నది.

అంతర్దాహము, విదాహము, ప్లోషము, దవథువు, ఉషము, అమ్లక, అంగ దాహము, స్వేదము, అస్వప్నకము, ధూమకము, రక్తష్ఠీవనము, అంగగంధము, గాత్రావయవదారణము, త్వఙ్మాంసదరణము, మాంసక్లేదము, చర్మదరము, రక్తవిస్ఫోటము, కోఠము, పిత్తరక్తము, రక్తమండలము, పిటిక, [illegible] కక్షములయందును [illegible] నందును హరిత పీతవర్ణము, [illegible], తిక్తాస్యత్వము, తృష్ణ, లోహగంధా స్యత్వము, జీవాదానము, అతృప్తి, తమఃప్రవేశము, గళము, ఆస్యము, గుదము, మేఢ్రము, నేత్రము, వీనియందు పాకము, నఖము, నేత్రము, మూత్రము, మలము, వీనియందు హారిద్రపీతవర్ణములు, అనునీ నలువదియు పిత్తమువలన జనించిన రోగములు.

స్తైమిత్యము, గౌరవము, తృప్తి, ఆలస్యము, అతినిద్ర, తంద్ర, ఆస్యస్రావము, ఆస్యమాధుర్యము, హృదయప్రలేపము, హృదయసాదము, కంఠప్రలేపము, శ్లేష్మోద్గిరణము, మలాధిక్యము, అతిస్థౌల్యము, వమనము, ప్రతిసంచయము, ఉదర్దము, గళగండము శైత్యము, శ్వేతావభాసము, మలము, మూత్రము, నఖము, నేత్రము వీనియందు శుక్లవర్ణము, అనునీ యిరువదియు కఫరోగములు. ఇటుల వాతాది దోషములయొక్క రోగములు స్థూలముగా జెప్పబడినవి.

హృదయము మొదలగువానియందు శూలవలె గలుగునట్టి తాపము అంతర్దాహ మనబడును. హస్తము, పాదము, అంసమూలము వీనియందు అగ్నిజ్వాలవలె నానావిధ మయిన తాపము గలుగుట విదాహమనబడును. సర్వాంగమునందు వ్యాపించి తీవ్రముగా స్వేదము, అరతి వీనిని గలుగజేయునట్టి తాపము దాహ మనబడును. నేత్రములు మొద లగు వానియందు అతితీవ్రమైన ఉష్ణము గలుగుట దవథు వనబడును. ముఖము, ఓష్ఠము, తాలు, వీనియందుగలుగు ఊష్మము దవ అనబడును. పుల్లని తేనుపులు అమ్లక మనబడును. శిరస్సు, నాసికము, కంఠము, నోటిలోపలి దౌడ వీనియందు ధూమమువలెనుండుట ధూమక మనబడును. స్తబ్ధముగనుండుట స్తైమిత్య మనబడును. అంగములయొక్క గురుత్వము గౌరవ మనబడును. ఆహారమునం దభిలాష గలుగకుండుట తృప్తి యనబడును. నిదురచే పీడింపబడినవానివలె విషయజ్ఞానము లేకుండుట తంద్ర యనబడును. శేషించియుండు రోగములను వానినామముచేతనే వానిస్వరూపమును తెలిసికొనవలయును. ఇత్తెరంగున వాతాది దోషవికారములయొక్క లక్షణభేదములు అష్టాంగసంగ్రహమునందు చెప్పబడి

దోషలక్షణప్రయోజనము

ఇత్యశేషామయవ్యాపి యదుక్తం దోషలక్షణం,
దర్శనాద్యైరవహిత స్తత్సమ్యగుపలక్షయేత్. ౫౪
వ్యాధ్యవస్థావిభాగజ్ఞః పశ్యన్నార్తాన్ ప్రతిక్షణం,

ఇటుల వ్యాధులయొక్క కాలకృతమైన అవస్థలను, విభాగములను (అనగా ఇట్టిది ఫలానివ్యాధియొక్క అవస్థ, యిట్టిది వేరువ్యాధియొక్క అవస్థ అని అవస్థాభేదములను, ఒకటే విధముగ నుండు జ్వరములో నూతనజ్వరముయొక్క అవస్థ యిట్టిది, పురాణజ్వరముయొక్క అవస్థ యిట్టిది, అని వ్యాధివిభాగమును) వ్యాధిచికిత్సలను బాగుగా నెఱింగినవాడు, బహుజాగరూకుడు నగు వైద్యుడు రోగులను ప్రతిక్షణము బాగుగ జూచి దర్శనము, స్పర్శనము, ప్రశ్న మొదలగు నుపాయములచే పైజెప్పిన లక్షణములతో గూడినదియును, సర్వరోగములయందు వ్యాపించి యుండునదియు నగు వాతాదిదోష స్వరూప, కర్మ, వికారములను బాగుగా తెలిసికొనవలయును.

అభ్యాసావశ్యకత్వము

అభ్యాసాత్ప్రాప్యతే దృష్టిః కర్మసిద్ధిప్రకాశినీ
రత్నాదిసదసత్ జ్ఞానం న శాస్త్రాదేవ జాయతే,

రత్నములు, బంగారు, అపరంజి మొదలగువానిలో ఫలానిది మంచిది, ఫలానిది చెడ్డది యను జ్ఞానము శాస్త్రాభ్యాసమువలననే కాక పలుమారుచేయునట్టి అభ్యాసవిశేషమువలన గలుగునటులనే కార్యసిద్ధిని సూచించునట్టి జ్ఞానము కేవలశాస్త్రపరిచయమువలననే కాక చికిత్సయందు పలుమారుచేయునట్టి అభ్యాసవిశేషమువలన గలుగును. (అనగా రత్నశాస్త్ర పరిచయముచేతను, రత్నములను పలుమారు చూచుటచేతను, రత్నపరీక్షాజ్ఞానము బాగుగ గలుగునటులనే సర్వదా వైద్యశాస్త్రపరిచయముచేతను పలుమారు రోగులను చూచుటచేతను చికిత్సయందు విశేషమైన జ్ఞానము గలుగు నని భావము.) కేవలశాస్త్రజ్ఞానముచేతను, కేవలచికిత్సాభ్యాసముచేతను చికిత్సయందు జ్ఞానము గలుగనేర దని సూచించుటకై "శాస్త్రాదేవ" అను ఏవకారము ప్రయోగింపబడినది.

త్రివిధరోగములు

దృష్టాపచారజః కశ్చిత్కశ్చిత్పూర్వాపరాధజః. ౫౬
తత్సంకరాద్భవత్యన్యో వ్యాధిరేవం త్రిధా స్మృతః,

కొన్నివ్యాధులు దృష్టాపచారణములు. (అనగా నీలోకములో ప్రత్యక్షముగా కనబడునట్టి మిథ్యాహారవిహారాదిరోగకారణమువలన గలిగినవి.) కొన్నివ్యాధులు

పూర్వాపరాధజములు. (అనగా పూర్వజన్మమునందు నతడే చేసియుండిన యశుభకర్మల వలన గలిగినవి.) మఱికొన్ని వ్యాధులు సంకరజములు. (అనగా పైజెప్పిన దృష్టాదృష్ట పూర్వాపరాధముల రెండిటివలన గలిగినవి.) ఇట్టివ్యాధులు మహామహిమలు గల ఋషు లచే జెప్పబడియున్నవి.

## త్రివిధరోగలక్షణము

యథా నిదానం దోషోత్థః కర్మజో హేతుభిర్వినా. ౫౭
మహారంభోఽల్పకే హేతావాతంకో దోషకర్మజః,

లఘురూక్షాది స్వనిదానమువలన ప్రకోపించిన వాతాదిదోషములచే జనించిన రోగము దోషజ మనబడును. ఇదియే దృష్టాపచారజనితరోగము. వాతాదిప్రకోపరూపమైన నిదానము లేక జనించిన రోగము కర్మజ మనబడును. ఇదియే పూర్వాపరాధ జనిత రోగము. నిదానము స్వల్పముగ నుండగా జనించినదియును, ప్రబలమగుచున్న పూర్వరూపములతో గూడినదియును, కడుప్రయాసచే చికిత్సచేయదగినదియు నైన రోగము దోష, కర్మజనిత మనబడును. ఇదియే సంకరజనితరోగము.

## త్రివిధరోగిశమనక్రమము

విపక్షశీలనాత్పూర్వః కర్మజః కర్మసంక్షయాత్. ౫౮
గచ్ఛత్యుభయజన్మా తు దోషకర్మక్షయాత్క్షయం,

పైజెప్పిన దోషజ మను వ్యాధి దోషమును శమింపజేయునట్టి యౌషధసేవవలన నివర్తించును. కర్మజ మనువ్యాధి కర్మము క్షయించగానే నివర్తించును. సంకర రోగము (అనగా వాతాది దోషములచేతను, పూర్వజన్మార్జిత అశుభకర్మముచేతను జనించినరోగము) దోషములు, అశుభకర్మలు, ఇవి క్షయించగనే నివర్తించును.

## మరల రోగద్వైవిధ్యము

ద్విధా స్వపరతంత్రత్వాద్వ్యాధయోఽంత్యాః పునర్ద్విధా. ౫౯

వ్యాధులు స్వతంత్రములు, పరతంత్రములునని ద్వివిధములుగ నుండును (అనగా కొన్ని రోగములు స్వతంత్రములుగ, కొన్ని పరతంత్రములుగ నుండు నని యర్థము.) మఱియును పరతంత్ర మను రోగము పూర్వరూపము, ఉపద్రవము అని ద్వివిధముగ నుండును.

## ద్వివిధరోగ నిరూపణము

పూర్వజాః పూర్వరూపాఖ్యా జాతాః పశ్చాదుపద్రవాః,

తొలుత జనించిన రోగము పూర్వరూప మను పేరం బరంగును. ఒకరోగము ప్రధానముగఁ గల్గినపిదప జనించిన రోగము ఉపద్రవ మను పేరం బరంగును.

స్వతంత్రరోగలక్షణము

యథాస్వజన్మోపశయాః స్వతంత్రాః స్పష్టలక్షణాః. ౬౦

శాస్త్రములో జెప్పియుండుప్రకారము ఉత్పత్తి, సుఖానుబంధము వీనితో గూడినవియును, స్పష్టమైన లక్షణములతో గూడినవియును నైనరోగములు స్వతంత్రరోగములనబడును. చికిత్సయొక్క గురుత్వలాఘవముల దెలిసికొనుటకై తంత్రకారు డిచట వ్యాధులకు స్వతంత్రపరతంత్రసంజ్ఞల నేర్పరచెను.

"పూర్వరూపరూపాదిక్రమేణ జ్వరాదావుత్పన్నే తత్పరివారా యేశ్వాసాదయ ఉత్పద్యంతే తదుపశయేచోపశేంతే న తే స్వతంత్రాః జ్వరాదయ ఏవతు మూలవ్యాధిరూపత్వాత్స్వతంత్రా ఇత్యుచ్యంతే"

నిదానపూర్వరూపాది క్రమముగా జ్వరాదిరోగములు జనించియుండునపుడు వాని ననుసరించి జనించిన యితరరోగములు స్వతంత్రరోగములు కానేరవు. తొలుత జనించిన జ్వరాది రోగములే ప్రధానంబులుగ నుండుటవలన స్వతంత్రరోగము లనబడును. అని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

పరతంత్రరోగలక్షణము

విపరీతాస్తతోఽన్యే తు

స్వతంత్రరోగములకంటె నితరమైన పరతంత్రరోగములు పైజెప్పిన స్వతంత్రవ్యాధికంటె విరుద్ధములగు లక్షణములు గలవిగ నుండును. (అనగా పరతంత్రరోగము స్వతంత్రరోగములవలె స్పష్టమైన లక్షణములును, శాస్త్రములో జెప్పియుండుప్రకారము ఉత్పత్త్యాదులును లేకుండునని భావము.)

వాతాదులకు స్వతంత్రపరతంత్రము

విద్యాదేవం మలానపి,

రోగములను స్వతంత్ర, పరతంత్రభేదములచే నెఱుంగు నటులనే వాతాది దోషములనుకూడ స్వతంత్రపరతంత్రభేదములచేతనే వైద్యుడు తెలిసికొనవలయును.

వాతాది స్వతంత్ర, పరతంత్ర జ్ఞానము

తాన్ లక్షయేదవహితో వికుర్వాణాన్ ప్రతిజ్వరమ్. ౬౧

ప్రతిరోగమునందు ప్రకోపమును జెందియుండునట్టియు, పైజెప్పినప్రకారము స్వతంత్ర పరతంత్రరూపము గలిగినట్టియు వాతపిత్తకఫములను మిగుల జాగరూకుడై వైద్యుడు తెలిసికొనవలయును.

—— స్వతంత్ర పరతంత్ర రోగ చికిత్సాక్రమము ——

తేషాం ప్రధానప్రశమే ప్రశమోఽశామ్యత స్తథా,
పశ్చాచ్చికిత్సేత్తూర్ణం వా బలవంతముపద్రవమ్. ౬౨

స్వతంత్రరోగములు శమనము జెందినచో పరతంత్రరోగములుగూడ శమనమును జెందును. ఇటుల జెప్పుటచే పరతంత్రరోగములకు ప్రత్యేకముగా చికిత్స జేయవలసినది లేదని భావంబగుచున్నది. అయినమాత్రమున పరతంత్రరోగములు శాంతిజెందనిచో తచ్ఛమనార్థమయి స్వతంత్రరోగచికిత్సనే చేయవలయును. పరతంత్రరోగములో ఉపద్రవమధికముగ నుండినయెడల నాపరతంత్రరోగమునకే తొలుత చికిత్సచేయవలయును. అటుల జేయక యుపేక్షించినచో అసాధ్యముగ నగును.

—— బలిష్ఠ పరతంత్రరోగ ప్రాక్చికిత్స

వ్యాధిక్లిష్టశరీరస్య పీడాకరతరో హి సః,

వ్యాధిచే పీడింపబడిన శరీరముగలపురుషునకు జనించిన ఉపద్రవమను పేరుగల పరతంత్రరోగము మిక్కుటముగా పీడను గలుగజేయును. కాబట్టి దానికి తొలుత చికిత్స చేయవలయును. (అనగా స్వతంత్రరోగము దుర్బలముగ నుండు పక్షమున అది ప్రధానచికిత్సచేతనే శాంతిజెందును. స్వతంత్రరోగమువలన పిదప జనించిన పరతంత్ర రోగము స్వతంత్రరోగచికిత్సచే శాంతిజెందకుండు పక్షములో దానికి పిదప చికిత్స చేయవలయును. పరతంత్రరోగము బలిష్ఠముగ నుండుపక్షములో అది అతిపీడాకరం బగుటచే స్వతంత్రరోగమునకు పూర్వమే దానికి చికిత్సచేయవలయును. (అనిభావము.)

—— సర్వరోగచికిత్సావశ్యకత్వము ——

వికారనామాకుశలో న జిహ్రీయాత్కదాచన ౬౩
న హి సర్వవికారాణాం నామతోఽస్తి ధ్రువా స్థితిః,

వైద్యకతంత్రములయందు రోగముల కన్నిటికి పేరులును వానిలక్షణములును చెప్పియున్నను కొన్నివ్యాధులకు పేరును స్థానమును నిర్ణయముగ దెలియకుండును. గాన పేరునుబట్టియే రోగపరిస్థితుల గమనింప కష్టముగ నుండును. అట్టియెడ వైద్యుడు వ్యాధియొక్క పేరు తనకు స్ఫుటముగ దెలియ లేదని లజ్జపడి చికిత్స మానియుండక అట్టి రోగముయొక్క స్వరూపాదులను బట్టి దోషసంబంధము నెఱింగి వానికి ప్రతికూల మగు చికిత్సను జేయవలెను.

—— సర్వరోగస్థానాజ్ఞానకారణము ——

స ఏవ కుపితో దోషస్సముత్థానవిశేషతః ౬౪
స్థానాంతరాణి చ ప్రాప్య వికారాన్ కురుతే బహూన్,

వాతాదిదోషములలో నేదైన నొకటి హేతువిశేషముచే స్వస్థానమును వదలి వేరు స్థానమును జెందిన అనేకమైన రోగములనుగలుగ చేయును. కాబట్టి సర్వరోగములయొక్క నామములను స్థానములను ఎఱుంగుట యశక్యము.

"యోంతఃశరీరసంధీనావిశతి తేన జృంభాజ్వరశ్చోపజాయతే, యస్త్వామాశయ ముభ్యుపైతి తేన రోగా భవంత్యురస్యరోచకశ్చ, యః కంఠమభిప్రపద్యతే కంఠస్తతో భ్రంశతే స్వరశ్చావసీదతి, యః ప్రాణవహాని స్రోతాంస్యన్వేతి శ్వాసః ప్రతిశ్యాయశ్చ తేనోపజాయతే." వాతాదిదోషములలో నేదైన నొకటి శరీరసంధులయందు ప్రవేశించి నచో, ఆవలింతలు, జ్వరము గలుగును. ఆమాశయమును జెందినచో హృదయరోగము, అరోచకము గలుగును. కంఠమును జెందినచో కంఠభ్రంశము, స్వరసాదము గలుగును. ఎయ్యది ప్రాణవహమయిన స్రోతస్సులను జెందునో అట్టిదానివలన శ్వాసము, ప్రతిశ్యాయము గలుగును అని తంత్రాంతరమునందు జెప్పబడియున్నది.

రోగనిదానాదిజ్ఞానావశ్యకత్వము

తస్మాద్వికారప్రకృతీరధిష్ఠానాంతరాణి చ.
బుద్ధ్వా హేతువిశేషాంశ్చ శీఘ్రం కుర్యాదుపక్రమం,

జ్వరాదిరోగోత్పత్తికి ముఖ్యకారణములుగ నుండు వాతాదిదోషములను, రోగ హేతుభేదములను, స్థానవిశేషములను, నిదానభేదములను (అనగా వాతం బిపుడు రూక్షమైన హేతువువలన, ప్రకోపమునుజెందియున్నదా లేక లఘువుగ, శీతలముగ నుండు హేతువువలన ప్రకోపమును జెందియున్నదా అను 'వాతాదిదోషములయొక్క నిదానమును, రోగహేతువుయొక్క స్థానభేదమును) బాగుగా నెఱింగి శీఘ్రముగా చికిత్స చేయవలయును.

దూష్యాదిజ్ఞానావశ్యకత్వము

దూష్యం దేశం బలం కాలమనలం ప్రకృతిం వయః ౬౮
సత్వం సాత్మ్యం తథాఽఽహారమవస్థాశ్చ పృథగ్విధాః,
సూక్ష్మసూక్ష్మాః సమీక్ష్యైషాం దోషౌషధనిరూపణే. ౬౭
యో వర్తతే చికిత్సాయాం న సస్ఖలతి జాతుచిత్,

వాతాదిదోషములను హరీతక్యాద్యౌషధములను బాగుగా పర్యాలోచనచేసి దూష్యము, దేశము, బలము, కాలము, జాఠరాగ్ని, ప్రకృతి, వయస్సు, సత్వము, సాత్మ్యము, ఆహారము, మొదలగువానిని పైజెప్పిన దూష్యాదులయొక్క యతి సూక్ష్మమయిన నానావిధ అవస్థాభేదములను బాగుగా చూచి తెలిసికొని చికిత్స చేయుటకు యత్నించు వైద్యుఁడెకప్పుడును పొరబడఁడు,

వ్యాధ్యాకారజ్ఞానప్రకారము

గుర్వల్పవ్యాధిసంస్థానం సత్త్వదేహబలాబలాత్. ౬౮
దృశ్యతేఽప్యన్యథాకారం తస్మిన్నవహితో భవేత్,

గొప్పగ అల్పముగ నుండు వ్యాధులయొక్క యాకారములు ధైర్యము, స్థూలకృశములుగ నుండు దేహములు, బలము దుర్బలము వీనియొక్క భేదముచే వేరువేరుగ గన్పట్టును. కాబట్టి గురుత్వము లేక అల్పముగనుండు రోగములయొక్క యాకార విషయమునందు వైద్యుడు బహుజాగరూకుడై యుండవలయును. (అనగా అధికదేహబలముగల పురుషునికి జనించినవ్యాధి గొప్పదైనప్పటికిని నా దేహమునందుండు సత్త్వబలాధిక్యములవలన స్వల్పమయిన యాకారముకలదిగనే గన్పట్టును. అటులనే హీనమయినబలము, దేహము, సత్త్వముగల పురుషునికి జనించిన రోగము స్వల్పముగ నుండినప్పటికి నాబలాదులయొక్క హీనతవలన గొప్ప యాకారముగలదిగనే గన్పట్టును. కాబట్టి వ్యాధియొక్క యాకారవిషయమునందు వైద్యుడు మిగుల జాగరూకుడుగ నుండవలయునని భావము.)

కుత్సితవైద్య చికిత్సాక్రమము

గురుం లఘుమితి వ్యాధిం కల్పయంస్తు భిషగ్భ్రమాత్. ౬౯
అల్పదోషాకలనయా పథ్యే విప్రతిపద్యతే.

రోగస్వరూపజ్ఞానములేని వైద్యుడు వ్యాధియొక్క యాకారము మాత్రము జూచి గొప్పదిగ నుండు వ్యాధిని స్వల్పమయినది యని నిశ్చయించుకొని దోషములు స్వల్పముగానున్నవి యను నిశ్చయజ్ఞానమువలన చికిత్సా విషయమునందు మోహమును జెందును. ఇటులనే స్వల్పమైన వ్యాధిని గొప్ప వ్యాధి యని నిశ్చయించుకొని చికిత్సా విషయమునందు మోహమును జెందును, (అనగా గొప్పవ్యాధియందు అల్పమయినవ్యాధికి యోగ్యమయిన ఔషధమును, అల్పమయిన వ్యాధియందు గొప్పవ్యాధికి యోగ్యమయిన ఔషధమును ప్రయోగించుటచే చికిత్సావిషయమునందు వ్యత్యస్తముగ పొరబాటు జెందు చున్నాడని భావము.)

కుత్సితవైద్యచికిత్సచే శరీరనాశము

తతోఽల్పమల్పవీర్యం వా గురువ్యాధౌ ప్రయోజితమ్. ౭౦
ఉదీరయేత్తరాం రోగాన్ సంశోధనమయోగతః,
శోధనం త్వతియోగేన విపరీతం విపర్యయే.
క్షిణుయాన్న మలానేవ కేవలం వపురస్యతి,

అల్పప్రమాణము గలిగినట్టియు, అధికశక్తిలేనట్టియు శోధనరూప మయిన యౌషధము రోగస్వరూపజ్ఞానములేని వైద్యునిచే గొప్ప వ్యాధియందు ప్రయోగింప బడినయెడల నాయౌషధము హీనయోగముగలది యగుటవలన రోగములను విశేషముగా వృద్ధిజేయును. అల్పముగనుండు వ్యాధియందు ప్రయోగింపబడిన అధికప్రమాణము అధిక వీర్యముగల శోధనరూపమైన యౌషధము మలాదులను విశేషముగా క్షయింపజేసి శరీరమునుకూడ హింసించును.

"అల్పముత్క్లేశయేద్దోషం బహు ప్రాణాన్నిహంతి చ,
తస్మాన్నిరూప్య భిషజా దేయం యుక్తం విరేచనమ్."

గొప్ప వ్యాధియందు ప్రయోగింపబడిన స్వల్పమైన యౌషధము దోషములను వృద్ధి జేయును. స్వల్పమైనవ్యాధియందు ప్రయోగింపబడిన మహత్తయిన యౌషధము ప్రాణములను కూడ హరింపజేయును. కాబట్టి వైద్యుడు వ్యాధియొక్క యాకారమును బాగుగా పర్యాలోచనజేసి యుక్తమైన శోధనౌషధముల నియ్యవలయు నని ఖరనాదుడు కూడ జెప్పియున్నాడు. జ్వరగుల్మాదిరోగములకు చికిత్సజేయునపుడు వానిలో గొప్పవిగ నుండు వ్యాధులయందు అల్పప్రమాణము, అల్పవీర్యముగల యౌషధము నుపయోగింప కూడ దని వైద్యదృష్టాంతముచేతనే తెలిసికొనవలయును.

## ఔషధప్రయోగక్రమము

అతోఽభియుక్తస్సతతం సర్వమాలోచ్య సర్వథా. 22
తథా యుంజీత భైషజ్యమారోగ్యాయ యథా ధ్రువం,

పైజెప్పినప్రకారము రోగములయొక్కగతి నెఱుంగుట మిగుల నసాధ్యంబగుట వలన నెల్లపుడు ఆయుర్వేదపరన, తదనుష్ఠానములయందు మిగులప్రయత్నముగల వైద్యుడు పైజెప్పిన సమస్తమయిన దూష్యము మొదలగు వస్తుసమూహమును పర్యాలోచనజేసి సర్వప్రకారములచే (అనగా నాయుర్వేదము ననుసరించియుండు స్వబుద్ధిచేతను ఆయుర్వేదమును తెలిసినవారియొక్క సంభాషణాది సహవాసముచేతను, చికిత్సయందు గల అభ్యాసాధిక్యముచేతను) బాగుగా పర్యాలోచనముజేసి యేవిధముగ నౌషధమును ప్రయోగించిన అవశ్యమారోగ్యము గలుగునో ఆవిధముగ నౌషధమును ప్రయోగింప వలయును.

## వృద్ధిక్షయభేదమువలన వాతాదిదోషభేద నిరూపణము

వక్ష్యంతేఽతః పరం దోషా వృద్ధిక్షయవిభేదతః. 23

ఇందుకుపైని వాతాదిదోషములు వృద్ధిక్షయభేదములచే వివరింపబడును.

పృథక్ త్రీన్ వృద్ధిసంసర్గాత్ త్రీన్ వత్ర షట్ త్రాన్స్వప,

వేరువేరుగ స్వప్రమాణముకంటె వృద్ధినొందియుండు వాతాదిత్రిదోషములు రోగమునకు హేతువుగ నుండును. అది యెట్లనగా —(1) వాతము వృద్ధినొంది పిత్తకఫములు సమముగ నుండుట 1. (2) వాతకఫములు సమముగ నుండి పిత్తము వృద్ధినొంది యుండుట 1. (3) వాతపిత్తములు సమముగ నుండి శ్లేష్మము వృద్ధినొందియుండుట 1. ఇటుల వేరువేరుగ వృద్ధిజెందిన వాతపిత్తకఫములు 3-ను జెప్పబడినవి. రెండేసి దోషములయొక్క సంసర్గము 3 ప్రకారములు. వానిలో స్వప్రమాణమునకంటె నధికముగ నుండు దోషభేదములు 9 విధములుగ నుండును. ఆ 9 విధంబులును రోగమునకు హేతువులుగ నుండు నని తెలియవలయును.

త్రీనేవ సమయా వృద్ధ్యా షడేకస్యాతిశాయనే. ౨౪

న్యూనాధిక్యము లేక సమముగ నుండు సంసర్గదోషభేదములు 3 విధంబులు. అవి యెవ్వి యనగా —(4) వాతపిత్తములు వృద్ధిజెంది కఫము సమముగ నుండుట 1. (5) వాతకఫములు వృద్ధిజెంది పిత్తము సమముగ నుండుట 2. (6) పిత్తశ్లేష్మములు వృద్ధిజెంది వాతము సమముగ నుండుట 3. ఇటుల న్యూనాధిక్యములేకుండ సమముగ నుండు సంసర్గదోషములు 3-ను జెప్పబడెనవి.

మఱియు నాసంసర్గదోషములలో నొక్కొకదోషముయొక్క అధికమైన వృద్ధి వలన 6 దోషభేదములు గలుగును. అవి యెట్లనగా —(7) వాతము వృద్ధమై పిత్తము వృద్ధతరమై కఫము సమముగ నుండుట 1. (8) పిత్తము వృద్ధమై వాతము వృద్ధతరమై కఫముసమముగనుండుట 2. (9) కఫము వృద్ధమై పిత్తము వృద్ధతరమై వాతము సమముగ నుండుట 3. (10) పిత్తము వృద్ధమై కఫము వృద్ధతరమై వాతము సమముగనుండుట 4. (11) కఫము వృద్ధమై వాతమువృద్ధతరమై పిత్తము సమముగనుండుట 5. (12) వాతము వృద్ధమై కఫము వృద్ధతరమై పిత్తము సమముగ నుండుట 6. ఇటుల నొక్కొకదోషాధిక్య వృద్ధిచే గలిగిన సంసర్గదోషభేదములు 9-యును జెప్పబడినవి. ఈ 6 దోషభేదములును, పైజెప్పిన ప్రకారము న్యూనాధిక్యము లేక సమముగ నుండు 3 దోషభేదములును జేరి వెరసి 9 సంసర్గభేదములుగ నగు నని తెలియవలయును.

త్రయోదశ సమస్తేషు

మూడుదోషములును వృద్ధిజెందియుండుటచేతనే సకల సన్నిపాతములయందు దోష భేదములు 13 విధములుగ నుండు నని తెలియవలయును.

షట్ ద్వ్యేకాతిశయేన తు,

పైజెప్పిన 13 దోషభేదములలో 2 దోషములయొక్క లేక ఏక దోషముయొక్కయు అధికవృద్ధివలన 6 సన్నిపాతభేదములు గలుగును. అవి యెవ్వియనగా — (13) కఫము వృద్ధమై వాతపిత్తములు వృద్ధతరమైయుండుట 1. (14) పిత్తము వృద్ధమై వాతకఫములు వృద్ధతరమైయుండుట 2. (15) వాతము వృద్ధమై పిత్తకఫములు వృద్ధతరమై యుండుట 3. ఇటుల 2 దోషములయొక్క అధికవృద్ధివలన గలిగిన సన్నిపాతభేదములు 3-ను జెప్పబడినవి. (16) పిత్తకఫములు వృద్ధమై వాతము వృద్ధతరమై యుండుట 1. (17) వాతకఫము వృద్ధమై పిత్తము వృద్ధతరమై యుండుట 2. (18) వాతపిత్తములు వృద్ధమై కఫము వృద్ధతరమై యుండుట 3 ఇటు లనేకదోషములయొక్క అధికవృద్ధివలన గలిగిన సన్నిపాతభేదములు 3-ను జెప్పబడినవి. పై జెప్పినప్రకారము 2 దోషములయొక్కయు, ఏకదోషముయొక్కయు అధికవృద్ధి జేరి సన్నిపాతదోషభేదములు 6 విధములుగ నగు నని తెలియవలయును.

ఏకం తుల్యాధికైః

(19) దోషములన్నియు సమముగా వృద్ధిజెందియుండునట్టి సన్నిపాతభేదము ఒకటి యని తెలియవలయును

షట్చ తారతమ్యవికల్పనాత్. ౭౫

సన్నిపాతమునందుండు దోషములయొక్క తారతమ్య భేదమువలన నాసన్నిపాతములకు 6 భేదములు గలుగు నని తెలియవలయును. అవి యె ట్లనగా —
(20) వాతమువృద్ధముగ, పిత్తమువృద్ధతరముగ, కఫము వృద్ధతమముగ నుండుట 1.
(21) వాతమువృద్ధముగ, కఫము వృద్ధతరముగ, పిత్తము వృద్ధతమముగ నుండుట 2.
(22) పిత్తమువృద్ధముగ, కఫము వృద్ధతరముగ, వాతము వృద్ధతమముగనుండుట 3.
(23) పిత్తమువృద్ధముగ, వాతము వృద్ధతరముగ, కఫము వృద్ధతమముగనుండుట 4.
(24) కఫమువృద్ధముగ, వాతము వృద్ధతరముగ, పిత్తము వృద్ధతమముగనుండుట 5.
(25) కఫమువృద్ధముగ, పిత్తము వృద్ధతరముగ, వాతము వృద్ధతమముగనుండుట 6.
ఇటుల సన్నిపాతమునందలి వాతాదిదోషములయొక్క తారతమ్యభేదమువలన నాసన్నిపాతదోషములు 6 విధములుగ నుండునని చెప్పబడినవి.

పైజెప్పబడిన సన్నిపాతములు పదిమూడిటికిని ప్రత్యేకలక్షణములను చరకముని యిట్లుపదేశించెను —

"సన్నిపాతజ్వరస్యోర్ధ్వం త్రయోదశవిధస్యహి,
ప్రాక్సూత్రితస్య వక్ష్యామి లక్షణం వై పృథక్పృథక్.
భ్రమః పిపాసా దాహశ్చ గౌరవం శిరసోఽతిరుక్,

నాడుల్తోల్బణే విద్యాల్లింగం మందకోపజ్వరే.
శైత్యం కాసోఽరుచిస్తంద్రా పిపాసా దాహరుగ్వ్యథా,
వాతశ్లేష్మోల్బణే వ్యాధౌ లింగం పిత్తావరే విదుః.
ఛర్దిః శైత్యం ముహుర్దాహస్తృష్ణా మోహోఽస్థివేదనా,
మందవాతేఽథ్య వస్యంతి లింగం పిత్తకఫోల్బణే,
సంధ్యస్థిశిరసశ్శూలం ప్రలాపో గౌరవం భ్రమః.
వాతోల్బణే స్యాద్ద్వ్యనుగే తృష్ణా కంఠాస్యశుష్కతా.
రక్తవిణ్మూత్రతా దాహః స్వేదస్తృట్బలసంక్షయః,
మూర్ఛాచేతి త్రిదోషే స్యాల్లింగం పిత్తే గరీయసి.
ఆలస్యారుచిహృల్లాస దాహవమ్యరతిభ్రమైః,
కఫోల్బణం సన్నిపాతం తంద్రాకాసేన చాదిశేత్.
సమం దోషైస్త్రిభిర్వృద్ధైః సన్నిపాతస్య లక్షణమ్,
ముహుర్దాహో ముహుశ్శీతం శిరఃస్వేదన పార్శ్వరుక్.
మోహశ్ఛర్దిర్దివా నిద్రా రాత్రౌ జాగరణం తథా,
ప్రతిశ్యాయశ్ఛర్దిరాలస్యం తంద్రారుచ్యగ్నిమార్దవమ్.
హీనవాతే పిత్తమధ్యే చిహ్నం శ్లేష్మాధికే మతమ్,
హారిద్రమూత్రనేత్రత్వగ్దాహస్తృష్ణాభ్రమోఽరుచిః.
హీనవాతే మధ్యకఫే లింగం పిత్తాధికే మతమ్,
శిరోరుగ్వేపథుశ్శ్వాసః ప్రలాపశ్ఛర్ద్యరోచకౌ.
హీనపిత్తే మధ్యకఫే లింగం వాతాధికే మతమ్,
శీతకం గౌరవం తంద్రా ప్రలాపోఽస్థిశిరోఽతిరుక్.
హీనపిత్తే మధ్యవాతే లింగం శ్లేష్మాధికే విదుః,
వర్చోభేదోఽగ్నిదౌర్బల్యం తృష్ణా దాహోఽరుచిర్భ్రమః.
కఫహీనే వాతమధ్యే లింగం పిత్తాధికే మతమ్,
శ్వాసః కాసః ప్రతిశ్యాయో ముఖశోషోఽతిపార్శ్వరుక్,
కఫహీనే పిత్తమధ్యే లింగం వాతాధికే స్మృతమ్."

పైజెప్పిన పదమూడు విధములైన సన్నిపాతజ్వరములకు వేర్వేరుగా లక్షణములను వచించెద. భ్రమ, దప్పి, సర్వాంగతాపము, గురుత్వము, శిరమునం దతిశూల యీ లక్షణములు వాతపిత్తాధిక్యము, స్వల్పకఫము గలదిగ నుండు సన్నిపాత జ్వరమునకు గలిగి యుండు నని తెలియవలయును. శైత్యము, కాసము, అరుచి, తంద్ర, దప్పి,

...గాపముగ నుండు చామలు, అశ్వ, మొదలగునవియును, గురుత్వము, ఉపగుణ్వ ద్రవ్యములును, మేదస్సును హరింపజేయునవియగు జాగరణము, మైథునము, వ్యాయామము, చింత మొదలగు నవియును, అతిస్థూలునికి హితకరములని తెలియవలయును.

**యవగోధూమముభయోస్తద్యోగ్యాహితకల్పనమ్.** ౩౬

స్థూలుడు, కృశుడు వీరలకు ఉచితమైన సంయోగ సంస్కారాదులతో గూడియుండు యవలు, గోధుమలు, అను నీరెండును హితకరముగ నుండును. (అనగా యవలు స్థూలునికి, గోధుమలు కృశునికి హితకర మని యర్థము.)

**దోషగత్యాతిరిచ్యంతే గ్రాహిభేద్యాదిభేదతః,**
**ఉపక్రమా న తే ద్విత్వాద్భిన్నా అపి గదా ఇవ.** ౩౭

వేరువేరు రూపము గలవిగ, సంసర్గసన్నిపాత తారతమ్యభేదములవలన సంఖ్యాతీతముగ నుండునట్టి వాతాది దోషములయొక్క స్థాన, వృద్ధి, క్షయ స్వరూపము గలిగినట్టియు, అడ్డముగ, ఊర్ధ్వముగ, అధోముఖముగ నుండునట్టియు శాఖలు, కోష్ఠము, అస్థి, సంధి అను లక్షణములతో గూడినట్టియు గతులవలనను; గ్రాహి, భేది మొదలగు ననేకౌషధభేదములవలనను చికిత్స పలువిధములుగ నగుచున్నవి. అయిన నయినప్పటికిని వాతాది దోషములవలన జనించు జ్వరాదిరోగములు నానావిధములుగ నుండినను అవి బృంహణ, లంఘన రూప చికిత్సలను, సామ, నిరామత్వముల నతిక్రమింపకుండునటులనే పైజెప్పిన చికిత్సలు కూడ సంతర్పణము, అపతర్పణము అను నీరెండు ప్రకారములకంటె నధికముగ నగుటలేదు. (అనగా ఆచికిత్సలకు సంతర్పణ, అపతర్పణ రూపములకంటె వేరురూపము లేదని యర్థము.)

చతుర్దశాధ్యాయము, ముగిసెను.



# పంచదశాధ్యాయము

దోషోపక్రమణీయాధ్యాయము నందును, ద్వివిధోపక్రమణీయాధ్యాయము నందును నానావిధమైన చికిత్సలు జెప్పబడియున్నవి. అటువంటిచికిత్సలు మ్రంగ కాయ అతిమధురము మొదలగు ఓషధుల నాశ్రయించి యుండును. కాబట్టి సర్వవిధ చికిత్సలకు యోగ్యంబును, శోధనాదులకు ఉపయోగకారియు నైన ఓషధులను సంగ్రహముగ జెప్పుటకై ద్వివిధోపక్రమణీయాధ్యాయానంతరము శోధనాదిగణ సంగ్రహాధ్యాయము చెప్పబడుచున్నది. మఱియు నాశోధనము వమనము, విరేచనము, ఆస్థాపనము, శిరోవిరేచనము అని నాలుగువిధంబులు. వానిలో వమన రూపముగల శోధన గణము తొలుత జెప్పబడుచున్నది.

## శోధనాదిగణసంగ్రహాధ్యాయప్రారంభము

సూ. అథాతశ్శోధనాదిగణసంగ్రహమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

ద్వివిధోపక్రమణీయాధ్యాయానంతరము ఉపక్రమములు (అనగా చికిత్సలు) మ్రంగకాయ, అతిమధురము, మొదలగు నోషధుల నాశ్రయించి యుండుటవలన శోధన ద్రవ్యగణము, వాతహరద్రవ్యగణము మొదలగు ద్రవ్యగణములను సంగ్రహముగ బోధించెడి శోధనాదిగణసంగ్రహాధ్యాయమును వివరించెదము. గణ మనగా — సమూహము. సంగ్రహ మనగా — అచటచట చెదరియుండు పదార్థముల నొకచో రాశిగ జేర్చుట యని యర్థము. శోధనగణము సర్వదోషములను జయింపగలిగినది యగుటచే ప్రధానంబు. దానంజేసి శోధనగణము తొలుత జెప్పబడుచున్నది.

## వమనకర ద్రవ్యగణము

మదనమధుకలంబానింబబింబీవిశాలా
త్రపుసకుటజమూర్వాదేవదాలీకృమిఘ్నం,
విదులదహనచిత్రాః కోశవత్యౌ కరంజః
కణలవణవచైలాసర్షపాశ్ఛర్దనాని. ౧

మ్రంగ, అతిమధురము, ఆచుగు, వేప, దొండ, పెద్దపాపర, చేదుదోస, కొడిసె, చాగ, దేవదాళి అనగా డావరిడంగి, వాయువిడంగములు, నీగుప్రబ్బలి, చిత్రమూలము, ఎలుకచెవియాకు, చేదుబీర, పెద్దబీర, క్రానుగు, పిప్పళ్ళు, సైంధవలవణము, వస,

పిలమలు, ఆవాలు ఇవి వమనగమముచేయునట్టి ద్రవ్యములు. (వారిలో ...
పాపర, చేదుదోస, కొడిసె, వాయువిడంగములు, పిప్పలు, ఆవాలు ఇవియాకె ఫలములు
వమనకారులు. అతిమధురము, నీరుప్రబ్బలి, శతావరీమూలము, నాగదంతి, ... ...
క్క వేళ్ళు వమనకారులు. లొద్దుగు, స్వర్ణక్షీరి, కంపిల్లము, ... వమనకారులు.
శ్లేష్మించియుండు ఓషధులయొక్క ఫలములు, పత్రములు, ప్రసూనములు, ఇవి వమనకా
రు లని కొందరు వ్యాఖ్యానము చేయుచున్నారు.)

## విరేచనద్రవ్యగణము

నికుంభకుంభత్రిఫలాగవాక్షీస్నుక్ శంఖినీనీలినితిల్వకాని,
శమ్యాకకంపిల్లకహేమదుగ్ధాదుగ్ధం చ మూత్రం చ విరేచనాని.

——నాగదంతి, తెగడ, త్రిఫలములు, పాపరబుడమ, చెముడు, జెముడు, శంఖిని
(అనగా పద్మపుతీగె) నల్లదింటెన, లొద్దుగు, జేల, కంపిల్లకము, హేమదుగ్ధ (అనగా
స్వర్ణక్షీరి) పాలు, మూత్రము, ఇవి విరేచనకరద్రవ్యములు.

## నిరూహణసాధనద్రవ్యములు

మదనకుటజకుష్ఠదేవదాలీమధుకవచావశమూలదారురాస్నాః,
యవమిసికృతవేధనంకులుద్ధోవనులకాణంత్రివృతానిరూహణాని

మంగకాయి, కొడిసె, చెంగల్వకోష్ఠు, దేవదాళి, యష్టిమధుకము, వస, దశ
మూలములు, దేవదారు, సన్నరాస్నము, యవలు, పెద్దసదాప, ఆవడ, ఉలవలు, తేనె,
సైంధవలవణము, తెగడ, ఇవి నిరూహక్రియాసాధనద్రవ్యములు.

## శిరశ్శోధనద్రవ్యగణము

వేల్లాపామార్గవ్యోషదార్వీసురాలా
బీజం శైరీషం బార్హతం శైగ్రవం చ,
సారో మాధూకః సైంధవం తార్క్ష్యశైలం
త్రుట్యౌ పృథ్వీకా శోధయంత్యుత్తమాంగమ్. ౪

వాయువిడంగములు, ఉత్తరేణు, త్రికటుకములు, మానిపసుపు, శ్రేష్ఠమైన సర్జ
రసము, దిరిసెనపువిత్తులు, ములకవిత్తులు, ఇప్పపూలసారము, సైంధవలవణము ఎండిన
రసాంజనము, బొంతయేలకలు, పిన్నయేలకలు, హింగుపత్రి, ఇవి శిరోవిరేచనకరద్రవ్య
ములు. (నస్యాది క్రియలచే శిరస్సునందలి మలముల శోధించునవి.)

## వాతహరద్రవ్యగణము

భద్రదారునతం కుష్ఠం దశమూలం బలాద్వయం,
వాయుం వీరతరాదిశ్చ విదార్యాదిశ్చ నాశయేత్. ౫

[illegible]దారు, గ్రంథితగరము, చెంగల్వకోష్టు, దశమూలములు, చిట్టాముట్టి, పేరాముట్టి, క్రిందజెప్పబడు వీరతరాది విదార్యాదిగణములు, ఇవి వాతమును హరింపజేయును.

### పిత్తహరద్రవ్యగణము

దూర్వానంతానింబవాసాత్మగుప్తా
గుంద్రాఽభీరుశ్శీతపాకీ ప్రియంగుః,
న్యగ్రోధాదిః పద్మకాదిః స్థిరే ద్వే
పద్మం వన్యం శారిబాదిశ్చ పిత్తమ్. ౬

గరికె, రేగటిదూలగొండి, వేము, అడ్డసరము, దూలగొండి, గుంద్ర అనగా కాకివెదురు, పిల్లిపీచర, గురువింద, నల్లతెగడ, ఇవి దూర్వాదిగణ మనబడును. ఈగణమును, క్రిందజెప్పబడు న్యగ్రోధాదిగణము, పద్మకాదిగణము, ముయ్యాకుపొన్న, నక్కతోకపొన్న, తామర, దుంగిలము, శారిబాదిగణము ఇవి గూడను పిత్తమును నశింపజేయును.

### శ్లేష్మహరద్రవ్యగణములు

ఆరగ్వధాదిరర్కాదిర్ముష్కకాద్యోఽసనాదికః,
సురసాదిస్సముస్తాదిర్వత్సకాదిర్బలాసజిత్. ౭

ఆరగ్వధాదిగణము, అర్కాదిగణము, ముష్కకాదిగణము, ఆసనాదిగణము సురసాదిగణము, ముస్తాదిగణము, వత్సకాదిగణము, అను నీ (7) గణములు శ్లేష్మమును హరింపజేయును.

### జీవనీయగణము

జీవంతీ కాకోల్యౌ మేదేద్వే ముద్గమాషపర్ణ్యౌ చ,
ఋషభకజీవకమధుకం చేతిగణో జీవనీయాఖ్యః. ౮

మాలుబాల, రెండువిధములైనకాకోళి (అనగా కవడీసంజ్ఞగల కాకోళి, పయస్వినీసంజ్ఞగలక్షీరకాకోళి), రెండువిధములైన మేదలు (అనగా మణిచ్ఛిద్రా యను సంజ్ఞగలమేద, పృథుసహా యనుసంజ్ఞగల మహామేద), అడవిపెసర, అడవిమినుప, ఋషభకము, జీవకము, యష్టిమధుకము, ఇవి జీవంత్యాదిగణ మనబడును. దీనికే జీవనీయగణమనియు నామాంతరము గలదు. (మఱియు మధురముగను, శీతలముగను, స్నిగ్ధముగనుండుపాలు, చెఱుకు, ద్రాక్ష, అక్షోడము, నేలగుమ్ముడు మొదలగు ద్రవ్యములను కూడ జీవనీయగణములో జేర్చుకొనందగును.)

### విదార్యాదిగణము-తద్గుణము

విదారిపంచాంగులవృశ్చికాలీ వృశ్చీవదేవాహ్వయ[illegible]ర్ణ్యః,
కండూకరీ జీవనహ్రస్వసంజ్ఞే ద్వే పంచకే గోపసుతా త్రిపాదీ. ౯
విదార్యాదిరయం హృద్యో బృంహణో వాతపిత్తహా,
*శోషగుల్మాంగమర్దోర్ధ్వశ్వాసకాసహరో గణః. ౧౦

తెల్ల నేలగుమ్మడు, చిట్టాముదము, తేలుమణి లేక వద్ది, గలిజేరు, దేవదారు, అడవిపెసర, అడవిమినుప, దూలగోఁకిల, జీవనమను, పేరుగల పంచమూలము (అనగా "ఆభీరువీరాజీవంతీజీవకర్షభకైః స్మృతం" అనువచనప్రకారము పెద్దపిల్లిపీచర, పిన్న పిల్లిపీచర, కాకోళి, మనుబాల, జీవకము, ఋషభకము, అనునవి) హ్రస్వపంచమూలము (అనగా ప్రాకుడు, ములక, ముయ్యాకుపొన్న, నక్కతోకపొన్న, పల్లేరు అనునవి), సుగంధిపాల, హంసపాది అనగా చెప్పుతట్ట, ఇవి విదార్యాదిగణ మనబడును. ఈ గణము హృదయమునకు హితము జేయును. శరీరమునకు పుష్టిని గలుగజేయును. వాతపిత్తములు, శోష, గుల్మము, అంగమర్దము, ఊర్ధ్వశ్వాసము, కాసము వీనిని హరింపజేయును. ఇచ్చట 'దేవాహ్వయ' అనుచోట 'దేవాద్వయ, అనుపాఠాన్తరము కలదు. అట్టియెడ సహదేవ, విశ్వదేవ యను ద్రవ్యముల గ్రహించునది.

### శారిబాదిగణము-తద్గుణము

శారిబోశీరకాశ్మర్యమధూకశిశిరద్వయం,
యష్టీ పరూషకం హంతి దాహపిత్తాస్రతృడ్జ్వరాన్. ౧౧

సుగంధిపాల, వట్టివేరు, పెద్దగుమ్మడు, ఇప్ప, తెల్లచందనము, రక్తచందనము, అతిమధురము, ఒట్టిత, ఇవి శారిబాదిగణమనబడును. ఈ గణము సర్వాంగతాపము, పిత్తరక్తము, దప్పి, జ్వరము వీనిని హరింపజేయును.

పద్మకపుండ్రౌ వృద్ధితుగర్ధ్యః శృంగ్యమృతా దశ జీవనసంజ్ఞాః,
స్తన్యకరా ఘ్నంతి రణపిత్తం ప్రీణనజీవనబృంహణవృష్యాః. ౧౨

### పద్మకాదిగణము-తద్గుణము

పద్మక మనగా హేమపద్మము, ప్రపౌండరీకము, (కర్పూరపుబెండ), ఋద్ధి వృద్ధి, తవక్షీరి, (వెదురుప్పు), కర్కాటకశృంగి, తిప్పతీగ, జీవంత్యాదిగణములోఁ జెప్ప బడిన పదిద్రవ్యములు, ఇవి పద్మకాదిగణ మనబడును. ఈగణము చనుబాలను వృద్ధి జేయును. వాతపిత్తములను హరింపజేయును. ప్రీతి, ఓజోవృద్ధి, శరీరపుష్టి, శుక్రవృద్ధి వీనిని గలుగజేయును.

---

*శోఫ ఇతిపా.

## పరూషకాదిగణము-తద్గుణము

[illegible]కం వరా ద్రాక్షా కట్ఫలం *కతకాఫలం,
రాజాహ్వం దాడిమం శాకం తృణ్మూత్రామయవాతజిత్. ౧౩

చిట్టీత, త్రిఫలములు, ద్రాక్ష, గుమ్మడిరేగు, చిల్లగింజ, కొండగోగు, దానిమ్మ, టేకు ఇవి పరూషకాదిగణ మనబడును. ఈగణము దప్పి మూత్రరోగము, వాతము వీటిని హరింపజేయును.

## అంజనాదిగణము-తద్గుణము

అంజనం ఫలినీమాంసీ పద్మోత్పలరసాంజనమ్,
సైలామధుకనాగాహ్వం విషాంతర్దాహపిత్తనుత్. ౧౪

అంజనము (అనగా స్రోతోంజనము, సౌవీరాంజనము) ప్రేంకణము, జటామాంసి, తామర, (సుర్మారాయి) నల్లకలువ, రసాంజనము, (అతిమధురము) ఏలకులు, యష్టిమధుకము, నాగకేసరములు ఇవి అంజనాదిగణమనబడును. ఈగణము, విషము, అంతస్తాపము, పిత్తము వీనిని హరింపజేయును.

## పటోలాదిగణము- గ్గుణము

పటోలకటురోహిణీ చందనం మధుస్రవగుడూచిపాఠాన్వితం,
నిహంతి కఫపిత్తకుష్ఠజ్వరాన్ విషం వమిమరోచకం కామలామ్.

చేదుపొట్ల, కటుకరోహిణి, చందనము, చాగ, తిప్పతీగె, చిరుబొద్ది, ఇవి పటోలాదిగణ మనబడును. ఈ గణము కఫము, పిత్తము, కుష్ఠము, జ్వరము, విషము, వాంతి, అరోచకము, కామల వీనిని హరింపచేయును.

## గుడూచ్యాదిగణము-తద్గుణము

గుడూచీపద్మకారిష్టధాన్యకా రక్తచందనమ్,
పిత్తశ్లేష్మజ్వరచ్ఛర్దిదాహతృష్ణాఘ్నమగ్నికృత్. ౧౬

తిప్పతీగె, పద్మకము, దనియాలు, రక్తచందనము, ఇవి గుడూచ్యాదిగణ మనబడును. ఈ గణము, పిత్తము, శ్లేష్మము, జ్వరము, వాంతి, సర్వాంగతాపము, దప్పి, వీనిని హరింపజేయును, అగ్నిదీపనముసు గలుగజేయును.

## ఆరగ్వధాదిగణము తద్గుణము

ఆరగ్వధేంద్రయవపాటలికాకతిక్తా
నింబామృతామధురసాస్రువవృక్షపాఠాః,

*కతకోత్పలం ఇతిపా.

భూనింబసైర్యకపటోలకరంజయుగ్మ
సప్తచ్ఛదాగ్నిసుషవీఫలబాణఘోంటాః. ౧౭
ఆరగ్వధాదిర్జయతి ఛర్దికుష్ఠవిషజ్వరాన్,
కఫం కండూం ప్రమేహం చ దుష్టవ్రణవిశోధనః. ౧౮

రేల, కొడిసెపాల, పాదిరి, గురిజ, వేము, తిప్పతీగ, చాగ, కానరేగు (పుల్ల వెలగ), చిరుబొద్ది, నేలవేము, ములుగోరింట, చేదుపొట్ల, క్రానుగు, కలుక్రానుగు, ఏడాకులపొన్న, చిత్రమూలము, మేషశృంగి, మ్రాగకాయ, నల్ల గోరింట, పోక, ఇవి ఆరగ్వధాదిగణ మనబడుచు. ఈగణము వాంతి, కుష్ఠము, విషము, జ్వరము, కఫము, దురద, ప్రమేహము వీనిని హరింపజేయును. దుష్టవ్రణముల నార్చును.

### అసనాదిగణతద్గుణము

అసనతినిశభూర్జశ్వేతవాహప్రకీర్యాః
ఖదిరకదరభండీశింశుపామేషశృంగ్యః,
త్రిహిమతలపలాశా జోంగకశ్శాకసాలా
క్రముకధవకులింగచ్ఛాగకర్ణాశ్వకర్ణాః. ౧౯
అసనాదిర్విజయతే శ్విత్రకుష్ఠ*కఫక్రిమీన్,
పాండురోగం ప్రమేహం చ మేదోదోష నిబర్హణః. ౨౦

వేగిస, నెమ్మి, భుజపత్రి, మద్ది, కలుక్రానుగ, చంద్ర, తెల్లచంద్ర, దిరిసెనము, ఇఱుగుడు, ఒద్ది, త్రిహిమము (అనగా శ్వేతచందనము, రక్తచందనము, పీతచందనము) తాటి, మోదుగు, అగరు, టేకు, మద్దిచెట్టు, పోక, ధనవృక్షము, కుళింగము (అనగా కర్కాటకశృంగి,) ఛాగకర్ణము (అనగా నల్లమద్ది) అశ్వకర్ణము (అనగా తెల్లమద్ది), ఇవి అసనాదిగణ మనబడును. ఈగణము శ్విత్రము, కుష్ఠము, కఫము, కృమిరోగము, పాండురోగము, ప్రమేహము, మేదోదోషము వీనిని హరింపచేయును.

వరణసైర్యకయుగ్మశతావరీదహనమోరటబిల్వవిషాణికాః,
ద్విబృహతీద్వికరంజజయాద్వయం బహలపల్లవదర్భరుజాకరాః ౨౧
వరణాదిః కఫం మేదో మందాగ్నిత్వం నియచ్ఛతి,
†అధోవాతం శిరశ్శూలం గుల్మం చాంతస్సవిద్రధిమ్. ౨౨

ఉలిమిరి, సైర్యకయుగ్మము (అనగా ఎఱ్ఱనిపుష్పములుగల గోరింట, పచ్చని పుష్పములుగల గోరింట), పిల్లిపీచర, చిత్రమూలము, చాగ, మారేడు, ఒద్ది రెండు

* వమి ఇతి పా. † ఆఢ్యవాతం ఇతి పా.

విధములైనబృహతులు (అనగా వాకుడు, ములక), రెండువిధములైనక్రానుగులు (అనగా క్రానుగు, కలుక్రానుగు) రెండువిధము లగుకరక్కాయలు (అనగా తర్కారీ, హరీతకీ), ముసుగ, కుశదర్భ, అదొండ, ఇవి వరణాదిగణ మనబడును. ఈగణము కఫము, మేదస్సు, అగ్నిమాంద్యము, అధోవాతము, శిరశ్శూల, గుల్మము, అంతర్విద్రధి వీనిని హరింప జేయును.

## ఊషకాదిగణము, తద్గుణము

ఊషకస్తుత్థకం హింగు కాసీసద్వయసైంధవం,
సశిలాజతు కృచ్ఛ్రాశ్మగుల్మ మేదఃకఫాపహమ్ ౨౩

ఊషకం (అనగా జముడు,) తుత్థము, ఇంగువ, రెండు విధములైన కాసీసములు, (మైలుతుత్తము, పాలతుత్తము,) సైంధవలవణము, శిలాజిత్తు ఇవి ఊషకాదిగణ మన బడును. ఈ గణము మూత్రకృచ్ఛ్రము, అశ్మరీరోగము, గుల్మము, మేదోరోగము, కఫము వీనిని హరింపజేయును.

## వీరతరాదిగణము-తద్గుణము

వేల్లంతరారణికబూకవృషాశ్మభేద
గోకంటకేత్కటసహాచరబాణకాశాః,
వృక్షాదనీవలకుశద్వయ * గుంఠగుంద్రా
భల్లూకమోరటకురంటకరంభపార్థాః ౨౪
వర్గో వీరతరాద్యోయం హంతి వాతకృతాన్ గదాన్,
అశ్మరీశర్కరా మూత్రకృచ్ఛ్రాఘాతరుజాహరః. ౨౫

వెణుతురు, కూరనెల్లి, (కొండపిండిచెట్టు) మోదెన, అడ్డసరము, పాషాణభేది, పల్లేరు, జిలుగు, పచ్చములుగోరింట, నల్లపుష్పములుగలగోరింట, రెల్లు, బదనిక, కికృసగడ్డి, కుశద్వయము (అనగా సూక్ష్మదర్భ, స్థూలదర్భ), గుంఠ (అనగా పులుగు), గుంద్రా (అనగా పదయేరకం), కోలపొన్న, చేకొణిగి, కోలగురుగు, దుష్టుపు, పార్థ (అనగా ఆదిత్యభక్తి, లేక లింగమెసుగుడు,) ఇవి వీరతరాదిగణ మనబడును. ఈగణము వాతమువలన జనించినరోగములు, అశ్మరి, శర్కర, మూత్రకృచ్ఛ్రము, మూత్రాఘాతము వీనిని హరింపజేయును.

## రోధ్రాదిగణము-తద్గుణము

రోధ్రశాబరకరోధ్రపలాశా †జింగిణీసరలకట్ఫలయుక్తాః,
కుత్సితాంబకదళీగతశోకాః సైలవాలుపరిపేలవమోచాః ౨౬

* గుచ్ఛ ఇతిపా. † జిఙ్ఘిణీ ఇతిపా.

ఏష రోధ్రాదికో నామ మేదః కఫహరో గణః,
యోనిదోషహర స్తంభీ*వర్ణ్యో విషవినాశనః. ౨౭

లొద్దుగు, తెల్లలొద్దుగు, ఆకుగంట్ల కచోరము, గిలిగిరిచ, సరళదేవదారు, గుమ్మడిరేగు, సన్నరాస్నము, దీనినే దింటెన యని కొందరు, కడిమి, అరటి, అశోకము, కూతురుబుడమ (నాగుదోస) తుంగముస్తెలు, అందుగు, ఇవి రోధ్రాదిగణ మనబడును. ఈగణము మేదోరోగము, కఫము, యోనిదోషము, వీనిని హరింపజేయును. వాతాది దోషములను, మూత్రాదిమలములను స్తంభింపజేయును. శరీరమునకు వర్ణమును గలుగ జేయును. విషదోషములను హరింపజేయును.

### అర్కాదిగణము-తద్గుణము

అర్కాలర్కౌ నాగదంతీవిశల్యా
భార్గీరాస్నా వృశ్చికాలీ ప్రకీర్యా,
ప్రత్యక్పుష్పీ పీతతైలోదకీర్యా
శ్వేతా యుగ్మం తాపసానాం చ వృక్షః. ౨౮
అయమర్కాదికో వర్గః కఫమేదోవిషాపహః,
కృమికుష్ఠప్రశమనో విశేషాద్వ్రణశోధనః ౨౯

జిల్లేడు, తెల్లజిల్లేడు (దీనిపుష్పములు తెల్లగ నుండును.), నాగదంతి, చెన్నచర్ల గడ్డ, గంటుబారంగి, చుంపరాస్నము, తేలుమణి, కానుగ, ఉత్తరేణి, పీతతైల (అనగా కాకిదొండ). కలుకానుగు రెండువిధములగు శ్వేతలు (అనగా గినియ, వసరు గినియ), గారచెట్టు, ఇవి అర్కాదిగణ మనబడును. ఈగణము కఫము, మేదోరోగము, విషము, కృములు, కుష్ఠము వీనిని శమింపజేయును. విశేషముగా వ్రణములను శోధించును.

### సురసాదిగణము-తద్గుణము

సురసయుగఫణిజ్జం కాలమాలావిడంగం
ఖరబుసవృషకర్ణీకట్ఫలం కాసమర్దః,
క్షవక †సరసిభార్గీ కాముకా కాకమాచీ
కులహాలవిషముష్టీ భూస్తృణో భూతకేశీ. ౩౦
సురసాదిగణః శ్లేష్మ మేదఃకృమినిషూదనః,
ప్రతిశ్యాయారుచిశ్వాసకాసఘ్నో వ్రణశోధనః. ౩౧

తులసి, నల్లతులసి, గగ్గెర, నల్లగగ్గెర, వాయువిడంగములు, మరువము ఎలుకచెవియాకు, గుమ్ముడురేగు, కసివెంద, సరసి (అనగా చాపశి), గంటుబారంగి,

* వ్రణ్యో ఇతి పా. † ఝురసి ఇతి పా.

పిప్పలికాయ, దీనినే బండిగురువింద యని కొందరు చెప్పెదరు. కాచి, సేలకనుము, విషముష్టి, కామంచిపూరి, జటామాంసి ఇవి సురసాదిగణ మనబడును. ఈగణము శ్లేష్మము, మేదోరోగము, కృములు, పీనసము, అరుచి, శ్వాసము, కాసము వీనిని హరింపజేయును వ్రణమును శుద్ధిజేయును.

ముష్కకాదిగణము-తద్గుణము

ముష్కకస్నుగ్వరాద్వీపి పలాశధవశింశుపాః,
గుల్మమేహాశ్మరీపాండుమేదోఽర్శఃకఫశుక్రజిత్. 32

మొక్కపుచెట్టు, బ్రహ్మజెముడు, త్రిఫలములు; చిత్రమూలము, మోదుగ, ధవవృక్షము, ఇఱుగుడు, ఇవి ముష్కకాదిగణ మనబడును. ఈగణము గుల్మము, మేహము, అశ్మరీరోగము, పాండువు, మేదోరోగము, అర్శస్సు, కఫము, శుక్రదోషము వీనిని హరింపజేయును.

వత్సకాదిగణము తద్గుణము

వత్సకమూర్వాభార్గీకటుకా మరిచం ఘుణప్రియా చ గండీరం,
ఏలా పాఠాజాజీ కట్వంగఫలాజమోదసిద్ధార్థవచాః. 33
జీరకహింగువిడంగం పశుగంధా పంచకోలకం హంతి,
చలకఫమేదఃపీనస గుల్మజ్వర శూలదుర్నామ్నః. 34

కొడిసెపాల, చాగ, గంటుబారంగి, కటుకరోహిణి, మిరియములు, తెల్లఅతివస, ఏలకలు, చిరుబొద్ది, బ్రహ్మజెముడు, తెల్లజీలకఱ్ఱ, పెద్దమ్రానుపండు, దీనినే కొందరు దుందిలపుఫల మని వచించెదరు. ఓమము, తెల్లఆవాలు, వస, జీలకఱ్ఱ, ఇంగువ, వాయువిడంగములు, వాయింట, పంచకోలకములు, ఇవి వత్సకాదిగణమనబడును. ఈగణము వాతము, కఫము, మేదోరోగము, పీనసము, గుల్మము, జ్వరము, శూల, దుర్నామరోగము వీనిని హరింపజేయును

వచాదిహరిద్రాదిగణము తద్గుణము

వచాజలదదేవాహ్వానాగరాతివిషాభయాః,
హరిద్రాద్వయయష్ట్యాహ్వ కలశీకుటజోద్భవాః. 35
వచాహరిద్రాదిగణౌ వామాతీసారనాశనౌ,
మేదఃకఫాఢ్యపవన స్తన్యదోషనిబర్హణౌ. 36

వస, తుంగగడ్డలు, దేవదారు, లేక భద్రముస్తెలు, శుంఠి, అతివస, కరక్కాయ ఇవి వచాదిగణ మనబడును. పసుపు, మ్రానిపసుపు, అతిమధురము, నక్కతోకపొన్న, కొడిసెపాల, ఇవి హరిద్రాదిగణ మనబడును. వచాదిగణము, హరిద్రాది

గణము అను నీరెండును ఆమాతీసారము, మేదోరోగము, కఫరోగము, [illegible] స్తన్యదోషము వీనిని హరింపజేయును.

### ప్రియంగ్వాది - అంబష్ఠాదిగణ తద్గుణము

ప్రియంగుపుష్పాంజనయుగ్మపద్మాపద్మాద్రజో యోజనవల్ల్యనంతా,
*మానద్రుమో మోచరసస్సమంగా పున్నాగశీతం మదనీయ హేతుః.
అంబష్ఠా మధుకం నమస్కారీనందీవృక్షపలాశకచ్ఛురాః,
రోధ్రం ధాతకిబిల్వపేశికే కట్వంగః కమలోద్భవం రజః. ౩౮
గణౌ ప్రియంగ్వంబష్ఠాదీ పక్వాతీసారనాశనౌ,
సంధానీయౌ హితౌ పిత్తే వ్రణానామపి రోపణౌ. ౩౯

ప్రేంకణము, పుష్పాంజనము, స్రోతోంజనము, సౌవీరాంజనము, ఒలితామర, తామరకేసరములు, మంజిష్ఠి, బూరుగుచెట్టు, బూరుగుబంక, మెట్టతామర, పొన్న, చందనము, ఆరెచెట్టు ఇవి ప్రియంగ్వాదిగణ మనబడును. అంబష్ఠా (అనఁగా అంబాళము లేక మయూరశిఖి), అతిమధురము, మెట్టతామర, నందివర్ధనము, మోదుగు, పిన్నరేగటి దూలగొండి, లొద్దుగు ఆరెచెట్టు బిల్వమజ్జ, కోలపొన్న, తామరపువ్వులోని కింజల్కములు, ఇవి అంబష్ఠాదిగణ మనబడును. ప్రియంగ్వాదిగణము, అంబష్ఠాదిగణము అను నీరెండు పక్వాతీసారమును నశింపజేయును. విరిగిన యంగాదుల నొకటిగ జేర్చును. పిత్తరోగమునందు పథ్యకర మయినవి. వ్రణము నార్చును.

### ముస్తాదిగణ - తద్గుణము

ముస్తావచాగ్నిద్విని శాద్వితిక్తాభల్లాతపాఠా త్రిఫలావిషాఖ్యాః,
కుష్ఠం త్రుటీహైమవతీచ యోని స్తన్యామయఘ్నా మలపాచనాశ్చ.

తుంగగడ్డలు, వస, చిత్రమూలము, పసుపు, మ్రానిపసుపు, రెండు విధములైన తిక్తలు (అనగా కటుకరోహిణి, కాకతిక్త అనగా గురిజ), జీడి, పాఠ, త్రిఫలములు, తెల్ల అతివస, చెంగల్వకోష్ఠు, ఏలకలు, తెల్లవస ఇవి ముస్తాదిగణ మనబడును. ఈగణము యోనిరోగమును చనుబాలను హరింపఁజేయును. మలమును పాకముఁ జేయును.

### న్యగ్రోధాదిగణ - తద్గుణము

న్యగ్రోధపిప్పలసదాఫలరోధ్రయుగ్మం
జంబూద్వయార్జునకపీతనసోమవల్కాః,
†ప్లక్షామ్రవంజులప్రియాలపలాశనందీ

* సాలద్రుమో ఇతి పా. † వృక్షామ్లం ఇతిపా.

[redacted]ంబవిరలామధుకం మధూకమ్.
న్యగ్రోధాదిర్గణో వ్రణ్యః సంగ్రాహీభగ్నసాధనః,
మేదఃపిత్తాస్రతృట్‌దాహ యోనిరోగ నిబర్హణః. ४१

మఱ్ఱి, రావి, మేడి, రెండువిధములైన రోధ్రములు (అనగా లొద్దుగు, తెల్ల లొద్దుగు), రెండువిధములైన జంబూవృక్షములు (అనగా అల్లోనేరేడు, కాకినేరేడు), మద్ది, కలురావి, తెలిచంద్ర, జువ్వి, మామిడి, ప్రబ్బలి, మొరలి, మోదుగు, నందివర్ధనము, రేగు, కడిమి, తుమికి, అతిమధురము, ఇప్పమ్రాను ఇవి న్యగ్రోధాదిగణ మనఁబడును. ఈగణము వ్రణముల నార్చును. మలమును గట్టి పరచును. విరిగిన యంగముల నొకటిగఁజేర్చును. మేదస్సు, పిత్తరక్తము, దప్పి, సర్వాంగతాపము, యోనిరోగము వీనిని హరింపఁజేయును.

### ఏలాదిగణ – తద్గుణము

ఏలాయుగ్మతురుష్కకుష్ఠఫలినీమాంసీ జలధ్యామకమ్
స్పృక్కాచోరకచోచపత్రతగరస్థౌణేయజాతీరసాః,
శుక్తిర్వ్యాఘ్రనఖోమరాహ్వమగురుః శ్రీవాసకం కుంకుమం
చండాగుగ్గులుదేవధూపఖపురాః పున్నాగనాగాహ్వయమ్. ४३
ఏలాదికో వాతకఫౌ విషం చ వినియచ్ఛతి,
వర్ణప్రసాదనః కండూ పిటికా కోఠనాశనః. ४४

రెండు విధములైన ఏలకలు (అనగా బొంత యేలకలు, పిన్నయేలకలు,) తురుష్కధూపము, చెంగల్వకోష్ఠు, ఫలినీ (అనగా ప్రేంకణము,) జటామాంసి, కురువేరు, ధ్యామకము, (అనగా దవదగ్ధకము), స్పృక్కా, కచోరము, లవంగపుచెక్క, లవంగపత్రి, గ్రంథితగరము, దవనము, బోళము, శుక్తి, (అనగా నఖము). వ్యాఘ్రనఖము, దేవదారు, అగరు, శ్రీవాసకము (మడ్డిపాలు), కుంకుమపువ్వు, చండా (అనగా కోపచా), మహిసాక్షి, సర్జరసము, ఖపురము (కుందురుష్కము) సురపొన్న, నాగకేసరములు ఇవి ఏలాదిగణ మనఁబడును. ఈగణము, వాతము, కఫము, విషము, దురద, పిటిక, కోఠరోగము వీనిని హరింపఁజేయును. శరీరమునకు కాంతి నిచ్చును.

### శ్యామాదిగణ తద్గుణము

శ్యామా దంతీ ద్రవంతీ క్రముక కుటరణీ శంఖినీ చర్మసాహ్వా
స్వర్ణక్షీరీ గవాక్షీ శిఖరిరజనకచ్ఛిన్నరోహాకరంజాః,

బస్తాంత్రీ వ్యాధిఘాతో బహలబహురస స్తీక్ష్ణవృక్షౌత్ఫలాని
శ్యామాదో హంతిగుల్మం విషమరుచికఫౌ హృద్రుజం మూత్ర
కృచ్ఛ్రమ్ ౪౫

నల్లతెగడ, నేలదంతి, ఎలుకచెవి, పట్టికాలోధ్రము, తెల్లతెగడ, శంఖినీ (అనగా పద్మపు తీగె), చర్మసాహ్వా (అనగా సంబరేణు) దీనినే బ్రాహ్మి యని కొందరు, స్వర్ణక్షీరి (పచ్చని యుమ్మెత) తెల్లజింటెన, దీనినే పాపరబుడమ యని కొందరు చెప్పెదరు. ఉత్త రేణు, రజనకము (అనగా కంపిల్లకము) తిప్పతీగె, కానుగు, జేల చెఱుకు, వరగోగు పండు, ఇవి శ్యామాదిగణ మనంబడును. ఈగణము గుల్మము, విషము, అరుచి, కఫము, హృద్రోగము, మూత్రకృచ్ఛ్రము వీనిని హరింపఁజేయును.

ద్రవ్యాలాభమునందు తుల్యద్రవ్య గ్రహణానుజ్ఞ

త్రయస్త్రింశదితి ప్రోక్తా వర్గా స్తేషు త్వలాభతః,
యుంజ్యా త్తద్విధమన్యచ్చ ద్రవ్యం జహ్యాదయౌగికమ్. ౪౬

ఇ ట్లీరంగున ముప్పదిమూడు వర్గములు చెప్పఁబడినవి. ఈవర్గములలో నేనైన నుండు నొక ద్రవ్యము దొరకని యెడల రసవీర్యవిపాకములవలన తత్సమానముగ వేరే ద్రవ్యము ఇందు జెప్పఁబడకుండినను దాని నుపయోగించుకొనవలయును. ఈవర్గములలో జేరియుండు వస్తువులలో నేదైనను ఔషధయోగములకు అయుక్తముగ నుండినచో దానిని త్యజించవలయును. (అనగా దోషము, రోగము, రోగి వీని నపేక్షించి ఏగణము ఒక పురుషునియొక్క ఎట్టివయస్సు ఎట్టికాలమునందు తత్సాధ్యమయిన సకలరోగ శమనార్థంబై యుక్తముగ నుండునో అటువంటి గణములో 1, లేక 2, లేక 3 వస్తువులు దొరకనిచో వానికి సమానమయిన గుణముగల వేరే 1 టి-లేక 2 లేక 3 వస్తువులను జేర్చి యుపయోగింపందగును. అటుగాక సర్వవస్తువులను వేరుగా జేర్చి ప్రయోగింపంజనదు అని తాత్పర్యము.) ఈయర్థమునే —

"సమీక్ష్య దోషభేదాంశ్చ గణాన్ భిన్నాన్ ప్రయోజయేత్,
పృథఙ్మిశ్రాన్ సమస్తాంశ్చ గణాన్ వా వ్యస్తసంహతాన్."

అనెడి సుశ్రుత వచనముకూడ బోధించుచున్నది. పైఁజెప్పిన వర్గమువలె నింక ననేకవర్గ ములు గలవు. అయినను వానిలో పై జెప్పిన ముప్పదిమూడు వర్గములే ప్రధానము లని తెలియపరచు నిమిత్తము ఈతంత్రకారుడు "త్రయస్త్రింశత్" అని సంఖ్యాపూర్వక ముగఁ జెప్పియున్నాఁడు.

### వర్గప్రయోగగుణము

ఏతే వర్గా దోషదూష్యాద్యపేక్షం
కల్కక్వాథస్నేహలేహ్యాదియుక్తాః,
పానే నస్యేఽన్వాసనేఽంతర్బహిర్వా
లేపాభ్యంగై ర్ఘ్నంతి రోగా౯ సుకృచ్ఛ్రా౯! ౪౬

పైఁజెప్పిన వర్గములు వైద్యునిచే దోషము, దూష్యము, వయస్సు, బలము, వీని ననుసరించి కల్కము, క్వాథము, స్నేహము, లేహము, కషాయము మొదలగువాని యందును పానము, నస్యము, అనువాసనవస్తి, అంతర్లేపము, బహిర్లేపము, అభ్యంగము మొదలగువానియందును ప్రయోగింపఁబడినయెడల కష్టసాధ్యముగ నుండు రోగములను గూడ హరింపజేయును.

పంచదశాధ్యాయము, ముగిసెను.

# షోడశాధ్యాయము

"స్నేహస్వేదావనభ్యస్య" అను వచనప్రకారము స్నేహ స్వేదముల నుపయోగింపక శోధనముఁజేయుట యుక్తము కాదు కావున శోధనాదిగణ సంగ్రహాయాధ్యాయానంతరము స్నేహస్వేదాధ్యాయముఁ జెప్పఁబడుచున్నది.

### స్నేహవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతః స్నేహవిధి మధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః

శోధనాది గణసంగ్రహాధ్యాయానంతరము స్నేహస్వేదముల చేయక శోధనము చేయ సంభవింపనేరదు. కాఁబట్టి ఘృతాదిస్నేహవిధులను తెలియచేయునట్టి స్నేహవిధ్యధ్యాయమును వివరించెదము.

### స్నేహన - విరూక్షణౌషధ స్వరూపము

గురుశీతసరస్నిగ్ధమందసూక్ష్మమృదుద్రవం,
ఔషధం స్నేహనం ప్రాయో విపరీతం విరూక్షణమ్. ౧

గురువు, శీతలము, సరము, స్నిగ్ధము, మందము, సూక్ష్మము, మృదు, ద్రవము, అను నీగుణములతో గూడియుండునట్టి ద్రవ్యము తఱుచుగ స్నేహనౌషధముగ నగును. ఈ గుణములకంటె విరుద్ధమైనగుణములతో (అనగా లఘు, ఉష్ణ, స్థిర, రూక్ష, తీక్ష్ణ, స్థూల, కఠిన, సాంద్ర గుణములతో) గూడియుండు ద్రవ్యము తఱుచుగ విరూక్షణౌషధముగ నగును. ఆవనూనె, మేక, క్షీరము అను ద్రవ్యములు విష్కిరము, ప్రతుదము, మృగము అనుపేరం బఱంగు వర్గములు. ఇవి లఘువుగ నుండినను స్నేహనౌషధముగ నగును. మత్స్యములు, మహిషమాంసము ఇవి ఉష్ణముగ నుండినను స్నేహనౌషధముగ నగును. యవలు, అలచందలు ఇవి గురుత్వము, శీతలము, సరత్వము మొదలగు గుణములతో గూడియుండినను విరూక్షణౌషధముగ నగును. కావుననే తఱుచుగ అను అర్థమును బోధించెడి 'ప్రాయః' అనుపదము మూలశ్లోకమునందు ప్రయోగింపఁబడినది.

### స్నేహములలో ఘృతమునకు శ్రేష్ఠత్వము

సర్పిర్మజ్జావసాతైలం స్నేహేషు ప్రవరం మతం,
తత్రాపి చోత్తమం సర్పిస్సంస్కారస్యానువర్తనాత్. ౨

క్షీరము, అనూపమాంసము మొదలగు స్నేహద్రవ్యములలో ఘృతము, మజ్జ, వస, తైలము, అనునీ నాల్గుస్నేహములు శీఘ్రకారిత్వగుణము గలవియగుటంజేసి మిగుల శ్రేష్ఠంబులు. మఱియు నానాలుగింటిలో ఘృతము సంస్కారగుణముల ననుసరించి యుండుటవలన మిగుల శ్రేష్ఠమైనది.

''సంస్కారస్యానువర్తనాత్''

అనువచనప్రకారము ఘృతము సంస్కారగుణముల ననుసరించు పక్షములో మిరియములు, చిత్రమూలము మొదలగు ద్రవ్యములతో కూడ సంస్కారము చేయఁబడిన ఘృతమునకు శైత్యాదిగుణములు లేకుండునటుల సంభవించునుగదా, అటుల నా ఘృతమునకు శైత్యాది గుణములు నశించి ఉష్ణము మొదలగు గుణములు గలుగుట ప్రత్యక్షవిరుద్ధము. కాఁబట్టి ఘృతము సంస్కారగుణముల ననుసరించుననుట అయుక్తమనే శంక గలుగును. అయితే ఘృతము స్వగుణమైన శైత్యాదిగుణములను వదలక సంస్కారగుణములనకూడ ననుసరించుచు నితర ద్రవ్యగుణములచే చెరుపబడకుండుటంజేసి యిది సర్వస్నేహములో శ్రేష్ఠంబైనది. కాఁబట్టి ఘృతమునకు ''సంస్కారస్యానువర్తనాత్'' అని చెప్పియుండుట యుక్తము. తైలము, వస, మజ్జ అనునవియైననో సంస్కారవశముచే తమగుణములను వదలి సంస్కారగుణము ననుసరించును. ఈవిషయములో చందనాది తైలము దృష్టాంతముగ నుండును మఱియును తైలాదిగుణములు ఇతర ద్రవ్యములచే చెరుపబడుటవలన ఘృతమునకంటె తైలాదులును నికృష్టంబులు. కాఁబట్టి ఘృతసాధ్యములగు వాత పిత్త జ్వరాదిరోగములయందు తైలము చెరుపుచేయును. కావున నది యౌషధముగ తంత్రకారలచే నంగీకరింపఁబడదయ్యె. తైలసాధ్యములగు రోగములయందు రోగశమనార్థమై తచ్ఛాంతికరమైన ద్రవ్యములచే సంస్కారము చేయబడిన ఘృతము చెరుపును హేతువుగ నుండకుండుటంజేసి యది యౌషధముగ తంత్రకారులచే నంగీకరింప బడియున్నది. కావుననే సర్వస్నేహములలో ఘృతమే మిగుల శ్రేష్ఠంబైనది.

''మాధుర్యాదవిదాహిత్వా జ్జన్మాద్యావచ్ఛీలతాత్''

ఘృతము మధురముగ నుండుటవలనను, విదాహకారి కాకుండుటవలనను, జన్మము మొదలుకొని అభ్యసింపబడి యుండుటవలనను అన్నిటిలోను శ్రేష్ఠంబైనది.

### ఘృతాదులకు పిత్తహరత్వగుణము

## పిత్తఘ్నాస్తే యథాపూర్వ మితరఘ్నా యథోత్తరం,

పైజెప్పినఘృతము, మజ్జ, వస, తైలము, అను నీనాల్గు స్నేహములలో యథాపూర్వమునం దుండునవి (అనగా ఒక్కొకదానికంటె ముం దుండునవి) యథాక్రమముగ పిత్తమును విశేషముగా హరింపజేయును. (అనగా వస పిత్తమును హరింపజేయు నని

యందు, మజ్జ దానికంటె విశేషముగా పిత్తమును హరింపజేయునదియు, ఘృతము అన్నిటికంటె విశేషముగా పిత్తమును హరింపజేయునదియును భావము) పూర్వోక్త చతుర్విధస్నేహములలో యథోత్తరముగ నుండునని (అనగా ఒక్కదానికంటె ఉత్తరము నందుండునవి) యథాక్రమముగ వాతకఫములను విశేషముగా హరింపజేయును. (అనగా మజ్జ వాతశ్లేష్మములను హరింపజేయు ననియును, దానికంటె విశేషముగా వస వాతకఫములను హరింపజేయుననియును, తైలము అన్నిటికంటె విశేషముగా వాతశ్లేష్మములను హరింపజేయు ననియును భావము.) "ఇతరఘ్నాః" అను సామాన్యశబ్దము ప్రయోగింపబడి యుండినను శ్లేష్మరోగములో స్నేహము నిషేధింపబడి యుండుటవలన ప్రకృతము నందు "ఇతరఘ్నాః" అనుపదమునకు వాతహర మనియే యర్థము చేయవలయు నని కొందరు వ్యాఖ్యానము చేయుచున్నారు.

### ఘృతాదులకు గురుత్వము

ఘృతాత్తైలం గురు వసా తైలాన్మజ్జా తతోఽపి చ. 3

ఘృతమునకంటె తైలము మిగుల గురువుగ నుండును. తైలమునకంటె వస మిగుల గురువుగ నుండును. వసకంటె మజ్జ విశేషముగా గురుతరముగ నుండును.

### యమకాదిస్నేహవివరము

ద్వాభ్యాం త్రిభి శ్చతుర్భి స్తై ర్యమక స్త్రివృతో మహాన్,

రెండు స్నేహములు చేరినయెడల యమక మనబడును. మూడు స్నేహములు చేరినయెడల త్రివృత మనబడును. నాల్గు చేరినయెడల మహాస్నేహ మనబడును. రెండు స్నేహములు జేరునట్టి క్రమం బెట్లనగా — ఘృతము వస, ఘృతము తైలము, ఘృతము మజ్జ అని తెలియవలయును. ఇటులనే 3, 4, స్నేహములు చేరునట్టి క్రమమునుకూడ బుద్ధిమంతులగువారు ఊహించుకొనవలయును.

### స్నేహకర్మయందర్హులు

స్వేద్యసంశోధ్యమద్యస్త్రీవ్యాయామాసక్తచింతకాః. ౪
వృద్ధబాలాబలకృశా రూక్షాః క్షీణాస్రరేతసః,
వాతార్తస్యందతిమిరదారుణప్రతిబోధినః. ౫
స్నేహ్యాః

స్వేద్యుడు (అనగా స్వేదమున కర్హుడు), సంశోధ్యుడు (అనగా శోధనార్హుడు), మద్యము, స్త్రీ, వ్యాయామము, వీనియందు విశేషముదా నాసక్తి గలవాడు, ఎల్లపుడు చింతతోగూడి యుండువాడు, వృద్ధులు, బాలురు, దుర్బలులు, కృశులు, రూక్షమైన

శరీరము కలవారు, రక్తము క్షయించినవారు, శుక్రక్షయముగలవారు, వాతపీడితులు, స్రోతోబంధముగలవారు, తిమిర మను నేత్రరోగముగలవారు, కడుకష్టముమీద నేత్రములు తెరచిచూచువారు వీరలు స్నేహకర్మకు అర్హులుగ నుండెదరు.

### స్నేహకర్మానర్హులు

నత్వతిమందాగ్నితీక్ష్ణాగ్నిస్థూలదుర్బలాః,
ఊరుస్తంభాతిసారామగళరోగగరోదరైః. ౬
మూర్ఛాఛర్ద్యరుచిశ్లేష్మతృష్ణామద్యైశ్చ పీడితాః,
అపప్రసూతా యుక్తే చ నస్యే వస్తౌ విరేచనే. ౭

మిక్కుటముగ మందాగ్నిగలవారు, అతితీక్ష్ణాగ్నిగలవారు, అతిస్థూలురు, అతిదుర్బలులు, ఊరుస్తంభము, అతిసారము, ఆమదోషము, కంఠరోగము, విషము, ఉదరరోగము, మూర్ఛ, వాంతి, అరుచి, శ్లేష్మము, దప్పి, మద్యము, వీనిచే పీడింపబడినవారు, గర్భస్రావమైన యాడుది, వీరలు స్నేహకర్మ కనర్హులుగ నుండెదరు. మఱియును నస్య, వస్తి, విరేచనకర్మలు చేయించుకొనినవా రందరు స్నేహకర్మ కనర్హులుగ నుండెదరు. స్నేహకర్మముచే అతితీక్ష్ణాగ్ని గలవానికి మిక్కుటముగ అగ్నివృద్ధిజెందును అతిస్థూలునికి అగ్ని, మేదస్సు అనునీ రెండును వృద్ధి చెందును. అతిదుర్బలునికి జీర్ణశక్తిలేకుండుటవలన స్నేహదోషము గలుగును.

### ఘృతప్రయోగార్హులు

తత్ర ధీస్మృతిమేదాగ్నికాంక్షిణాం శస్యతే ఘృతం,

బుద్ధి, స్మృతి, మేధ, అగ్నిబలము, వీని నపేక్షించువారికి పైజెప్పిన స్నేహములలో ఘృతము మిగుల ప్రశస్తంబైనది.

### తైలప్రయోగార్హులు

గ్రంథినాడీకృమిశ్లేష్మమేదోమారుతరోగిషు ౮
తైలం లాఘవదార్ఢ్యార్థిక్రూరకోష్ఠేషు దేహిషు,

గ్రంథిరోగము, నాడీరోగము, కృమిరోగము, శ్లేష్మరోగము, మేదోరోగము, వాతరోగము, ఇవి గలవారికిని; శరీరలాఘవము, దార్ఢ్యము, వీని నపేక్షించువారికిని, క్రూరమైనకోష్ఠముగల ప్రాణులకును; తైలము ప్రశస్తమైనది.

### మజ్జాదిప్రయోగార్హులు

వాతాతపాధ్వ * భారస్త్రీవ్యాయామక్షీణధాతుషు. ౯
రూక్షక్లేశక్షమాత్యగ్నివాతావృతపథేషుచ,

---

* భాష్యస్త్రీ ఇతిపా.

శేషా

వాతము, ఎండ, మార్గసంచారము, భారమును మోయుట, స్త్రీసంగమము, వ్యాయామము, వీనిచే ధాతువు క్షయించినవారికిని, రూక్షశరీరులకును, క్లేశముల నోర్చువారికిని, అత్యగ్నికలవారికిని, వాతముచే నడ్డగింపబడిన స్రోతస్సులు కలవారికిని, తక్కిన మజ్జ, వస అను నీరెండు స్నేహములు ప్రశస్తంబులు.

సంధిరోగాదులయందు వసాప్రయోగము

వసా తు సంధ్యస్థిమర్మకోష్ఠరుజాసు చ. ౧౦
తథా దగ్ధాహతభ్రష్టయోనికర్ణశిరోరుజి,

సంధి, అస్థి, మర్మము, కోష్ఠము వీనియందు జనించియుండు రోగములయందును, దగ్ధరోగము, ఆహతరోగము, భ్రష్టయోనిరోగము, కర్ణరోగము, శిరోరోగము మొదలగువానియందును వస నుపయోగించుట మిగుల ప్రశస్తంబు.

కాలభేదముచే స్నేహోపయోగక్రమము

తైలం ప్రావృషి వర్షాంతే సర్పిరన్యౌ తు మాధవే ౧౧

తైలము వర్షాకాలమునందే ప్రశస్తము ఘృతము వర్షాకాలముయొక్క అంతమునందే ప్రశస్తము. వస, మజ్జ అను నీరెండును వసంతకాలమునందే ప్రశస్తములు.

ఋతౌ సాధారణే స్నేహః శస్తోఽహ్ని విమలే రవౌ,

సాధారణమయిన ఋతువులో (అనగా శ్రావణాదిమాసములయందు) సూర్యుడు మేఘాదులచే గప్పబడక బాగుగ ప్రకాశించుచుండునపుడు తైలము మొదలగు స్నేహములు సంశోధనమునకు ముందుగ నుపయోగించుట ప్రశస్తము.

శీతకాలమునందు తైలానుజ్ఞ

తైలం త్వరాయాం శీతేఽపి

రోగచికిత్సకు యుక్తమైనకాలములో స్నేహక్రియ చేయవలసిన ఆవశ్యకము కలిగి యుండినయెడల శీతమయిన హేమంత శిశిరఋతువులయందును సంశోధనమునకు మున్ను స్నేహకర్మయందు తైలము ప్రశస్తముగ నుండును. కావున నాకాలమునందు ఇతరస్నేహములు అప్రశస్తంబులు.

గ్రీష్మకాలమునందు ఘృతానుజ్ఞ

ఘర్మేఽపి చ ఘృతం నిశి. ౧౨
నిశ్యేవ పిత్తే పవనే సంసర్గే పిత్తవత్యపి,

పిత్తముగాని, లేక పిత్తమువలనగలిగిన రోగముగాని, లేక వాతముగాని, లేక వాతమువలన గలిగినరోగముగాని ప్రకోపించి స్నేహకర్మచే సాధ్యముగ నుండునపుడు ఘృతమును గ్రీష్మఋతువునందును రాత్రులయం దుపయోగింపందగును. అయితే గ్రీష్మ

ఋతువునందు ఘృతమును మధ్యాహ్నమునం దుపయోగింపం జనదు. అటులనే పిత్తాధిక్యముగల వాతపిత్తసంసర్గముగాని, లేక శ్లేష్మపిత్తసంసర్గముగాని, లేక యీరెంటియొక్క సంసర్గమువలనగలిగిన రోగముగాని ప్రకోపించి స్నేహకర్మచే సాధ్యముగ నుండునపుడు గ్రీష్మకాలమునందుకూడ రాత్రులయందే ఘృతము నుపయోగింపవలయును. తైలము, వస, మజ్జ, వీనిని గ్రీష్మకాలములో నుపయోగింపం జనదు.

విరుద్ధకాలమునందు తైలాదుల నుపయోగించుటవలన జనించు రోగములు.

**నిశ్యన్యథా వాతకఫాద్రోగాః స్యుః పిత్తతో దివా. ౧౩**

పైజెప్పిన క్రమమునకంటె వేరువిధముగ జేసినచో (అనగా శీతకాలములో రాత్రియందు ఘృతమును ప్రయోగము జేసినయెడల) వాతకఫమువలన రోగములు గలుగును. అటులనే గ్రీష్మకాలములో మధ్యాహ్నమునందు తైలమును ప్రయోగము జేసినయెడల పిత్తమువలన రోగములు గలుగును. వస, మజ్జ, అనునీరెంటియొక్క స్వరూప మిట్టిదని నిశ్చయింపబడి యుండనందువలన వానియొక్క ఉపయోగక్రమము ఉష్ణకాలమునందును, శీతకాలమునందును చెప్పబడి యుండలేదు. అయిన నుపయోగపరచవలసిన యావశ్యకము కలుగునపుడుమాత్రము వాని యుపయోగక్రమము తంత్రకారులచే చెప్పబడియున్నది.

అయినను —

"యథాసత్వం తు శైత్యోష్ణే వసా మజ్జోస్తు నిర్దిశేత్"

అనువచనప్రకారము ఆయాజంతువుల ననుసరించి వస, మజ్జ వీనియొక్క శైత్యోష్ణములను తెలిసికొనవలయునని తంత్రాంతరములయందు చెప్పబడి యున్నది. ఏజంతువునకు ఏగుణము చెప్పబడి యుండునో ఆగుణము కల్గియుండును కావున జంతుగుణములబట్టి వసగుణముల నిర్ణయించునది యని భావము.

స్నేహప్రయోగక్రమము

**యుక్త్యావచారయేత్స్నేహం భక్ష్యాద్యన్నేన వస్తిభిః,**
**నస్యాభ్యంజనగండూషమూర్ధకర్ణాక్షితర్పణైః. ౧౪**

మాత్ర, కాలము, క్రియ, భూమి, దేహము, దోషము, ఈస్వభావముగల యోగముచే ఘృతము మొదలగు స్నేహములను భక్ష్య, భోజ్య, లేహ్య, పేయ రూపమైన యన్నము తోడను, వస్తికర్మ (అనగా నిరూహవస్తి, అనువాసనవస్తి, ఉత్తరవస్తి) తోడను, నస్యము, అభ్యంజనము, గండూషము, శిరోవస్తి యను పేరం బరంగు మూర్ధతర్పణక్రియ, కర్ణపూరణమను పేరం బరంగు కర్ణతర్పణక్రియ, తర్పణపుటపాకవిధియందు చెప్పబడిన అక్షితర్పణక్రియ, ఇవి మొదలగు వానితోడను ఉప

యోగింపవలయును. భక్ష్యము అనగా శశాంకకిరణము మొదలగునవి యని యర్థము. ఆది శబ్దమువలన,—

"ఓదనశ్చ విలేపీ చ రసో మాంసం పయో దధి,
యవాగూస్సూపశాకే చ యూషః కాంబళికః ఖలః.
సక్తవస్తిలపిష్టం చ మద్యం లాజాస్తథైవ చ,
భక్ష్యమభ్యంజనం వస్తి స్తథైవోత్తరవస్తయః."

అనెడి చరకవచనమునుబట్టి అన్నము, విలేపి, మాంసరసము, మాంసము, క్షీరము, పెరుగు, యవాగు, సూపము, శాకము, యూషము, కాంబళికము, ఖలము, సక్తువు, తిలపిష్టము, మద్యము, వరిపేలాలు, భక్ష్యము, అభ్యంజనము, వస్తికర్మ, ఉత్తరవస్తి కర్మలు ఇవి మొదలగువానిని గ్రహించికొనవలయు నని తాత్పర్యము.

స్నేహమునకు అరువదినాలుగు విచారములు

**రసభేదైకకత్వాభ్యాం చతుష్షష్టిర్విచారణాః,**
**స్నేహస్యాన్యాభిభూతత్వాదల్పత్వాచ్చ క్రమాత్ స్మృతా .**

"ఏకైకహీనాన్" ఇత్యాది శ్లోకములచే రసభేదీయాధ్యాయమున చెప్పబడిన అరువదిమూడుసంఖ్యగల రసభేదములతో చేర్చి ప్రయోగింపబడు స్నేహములు అరువదిమూడును, రసములతో చేర్పక కేవలస్నేహముగ నుపయోగింపబడునది యొకటియు జేరి స్నేహప్రయోగములు అరువదినాల్గుభేదములు కల్గియుండును భక్ష్యము మొదలగు అన్నముతోడను, రసభేదముతోడను, మూర్ధకర్ణ అక్షితర్పణముతోడను ప్రయోగింపబడు పైచెప్పిన 64 స్నేహములు యథాక్రమముగ అన్యాభిభూతమై యుండుటవలనను (అనగా బహువిధమైన భక్ష్యాదులచేతను, రసభేదములచేతను అభిభూతమైయుండుటవలనను) మూర్ధాక్షితర్పణాదిక్రియలయందు స్వల్పముగ నుపయోగించుటవలనను, పానమునం దధికముగ నుపయోగించునటుల మూర్ధాక్షితర్పణాదిక్రియలయం దుపయోగించుట కసాధ్యముగ నుండుటవలనను పైచెప్పిన 64 విధములైన స్నేహప్రయోగములకు విచారణ లను నామము కలిగినదని ఆయుర్వేదకర్తలచే చెప్పబడి యున్నది.

అచ్ఛపేయస్నేహమునకు విచారణాసంజ్ఞాభావము

**యథోక్తహేత్వభావాచ్చ నాచ్ఛపేయో విచారణా,**

స్నేహమునకు విచారణ యనుసంజ్ఞ కలుగుటకై పైన చెప్పియుండు హేతువులు అచ్ఛపేయ మనుస్నేహమునందు లేకుండుటవలన (అనగా అచ్ఛపేయ మను స్నేహము దేనితో జేర్చక విశేషముగ నుపయోగింపబడుటవలన) ఆ అచ్ఛపేయ మను

స్నేహమునకు విచారణ యను సంజ్ఞ కలుగనేరదు. అచ్ఛపేయ మనగా ఇతరవస్తువుల సంబంధములేని స్నేహమును పానముచేయుట యని యర్థము. అయితే శిరోవస్త్యాది తర్పణక్రియతో నుపయోగింపబడు కేవల స్నేహోపయోగమునకు విచారణయను పేరు కలుగును. కాబట్టి వస్త్యాదులయం దుపయోగింపబడు కేవలస్నేహమునకు విచారణ యనుసంజ్ఞ గలుగు ననియు, కేవల స్నేహపానమునకు విచారణ యనుసంజ్ఞ గలుగ నేరదనియు చెప్పియుండుట పరస్పరవిరుద్ధముకాదు.

## అచ్ఛపేయస్నేహమునకు శ్రేష్ఠత్వము

స్నేహస్య కల్పస్స శ్రేష్ఠః స్నేహకర్మాశు సాధనాత్. ౧౯

అచ్ఛపేయ మను స్నేహప్రయోగము స్నేహకృత్యమైన తర్పణ మార్దవాదులను శీఘ్రముగ కలుగజేయుటవలన మిగుల శ్రేష్ఠంబైనది.

## స్నేహ త్రివిధమాత్రా లక్షణము

ద్వాభ్యాం చతుర్భిరష్టాభిర్యామైర్జీర్యంతి యాః క్రమాత్,
హ్రస్వమధ్యోత్తమా మాత్రా స్తాస్తాభ్యశ్చ హ్రసీయసీమ్. ౧౭
కల్పయేద్వీక్ష్య దోషాదీన్ ప్రాగేవ తు హ్రసీయసీం,

ప్రయోగింపబడిన స్నేహముయొక్క యేమాత్ర జాఠరాగ్ని సంయోగముచే రెండుయామములకాలమునకు జీర్ణమును చెందునో అది ఆస్నేహమునకు హ్రస్వమాత్రయనబడును. స్నేహముయొక్క యేమాత్ర జాఠరాగ్నిసంయోగముచే నాల్గు జాముల కాలమునకు జీర్ణమును జెందునో అది ఆస్నేహమునకు మధ్యమమాత్ర యనబడును స్నేహముయొక్క యేమాత్ర యెనిమిదిజాముల కాలమునకు జీర్ణమగునో అది ఆస్నేహముయొక్క ఉత్తమమాత్ర యనబడును.

పైచెప్పిన హ్రస్వ, మధ్య, ఉత్తమ మాత్రలకంటె మిగుల తక్కువగ నుండు మాత్రను (రెండు యామములలో జీర్ణమగుమాత్ర కంటె తక్కువయైన కాలమున జీర్ణముగ మిక్కిలి హ్రస్వమైనమాత్రను) వైద్యుడు నిశ్చయించుకొనవలయును. దోషము, ఔషధము, దేశము, కాలము, బలము, శరీరము, ఆహారము, సత్వము, సాత్మ్యము, ప్రకృతి ఇవి మొదలగువానిని బాగుగ నాలోచించి తెలిసికొనబడని కోష్ఠముగల పురుషునియందు ఉత్తమమాత్రా విషయములో హ్రస్వముగ నుండునట్టి మాత్రను ప్రయోగింపవలయును. పిదప హ్రస్వమాత్రను, దానికి పిదప మధ్యమమాత్రను దానికిపిదప ఉత్తమమాత్రను ప్రయోగింపవలయును. ఇటులనే మధ్యమమాత్రావిషయమునందును, హ్రస్వమాత్రా విషయమునందును తొలుత మిగుల హ్రస్వమైన మాత్రనే ప్రయోగింపవలయును. అటు కాదేని బలవత్తరమైన యాపత్తు కలుగును.

"అజ్ఞాతకోష్ఠే హి బహుః కుర్యాజ్జీవితసంశయమ్."

తెలిసికొనబడని కోష్ఠము గలపురుషునియందు ప్రయోగింపబడిన ఉత్తమమైనమాత్ర ఆ మనుజునికి ప్రాణసంశయమును కలుగజేయును, అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడి యున్నది. రెండు పలములు హ్రస్వమాత్రయని, నాల్గు పలములు మధ్యమమాత్రయని, ఆరు పలములు ఉత్తమమాత్ర యని కొందరు వచించెదరు. జాఠరాగ్నియొక్క శక్తి ననుసరింపక ప్రయోగింపబడిన స్నేహమాత్ర ఆపత్తును కలుగచేయును. కావున నీగ్రంథకర్త పైచెప్పిన పలప్రమాణమును మాత్రగ నంగీకరించలేదు. ఇటులనే పలప్రమాణము మాత్ర యనుట చరకాచార్యునికి అనభిమతము. అనగా సమ్మతము కాదని భావము.

ఇందుకు ప్రమాణము చరకమునం దిట్లున్నది.

"అహోరాత్రమహఃకృత్స్న మర్ధాహం చ ప్రతీక్ష్యతే,
ప్రధానా మధ్యమా హ్రస్వా స్నేహమాత్రా జరాం ప్రతి."

ఉత్తమమైన స్నేహమాత్ర ఒక అహోరాత్రమును, మధ్యమమైన స్నేహమాత్ర పూర్ణమైన ఒక అహస్సును, హ్రస్వమైన స్నేహమాత్ర అరదినమును జీర్ణమును గురించి ప్రతీక్షించుచుండును.

## శోధనస్నేహప్రయోగక్రమము

హ్యస్తనే జీర్ణ ఏవాన్నే స్నేహోచ్ఛశ్శుద్ధయే బహుః. ౧౭

ముందుదినమున భుజింపబడిన యాహారము బాగుగ జీర్ణమైనతోడనే శోధనార్థము ఉత్తమమాత్రతో గూడియుండునట్టి కేవలస్నేహమును పానమున కుపయోగించుట ప్రశస్తమైనది. "జీర్ణ ఏవాన్నే" అనగా అన్నము జీర్ణమైనతోడనే యనిచెప్పియుండుటవలన అన్నమునం దిచ్ఛ గలుగు కాలములో శోధనార్థము స్నేహపానము చేయం జనదని స్పష్ట మగుచున్నది. అన్నమునం దిచ్ఛ కలుగుకాలములో (అనగా ఆకలి కలిగి యుండునపుడు) పానము చేయబడిన స్నేహము జాఠరాగ్ని దీప్తముగనుండుటవలన శోధనరూపమైన కార్యమును చేయకయే అతిశీఘ్రముగ జీర్ణమును జెందును. ఆకలితో గూడి యుండువానికి కఫము కొరవడి యుండును. కాబట్టి వమనముకూడ చేయింపం జనదని సూచించు నిమిత్తమే "జీర్ణ ఏవాన్నే" అని గ్రంథకారుడు ఏవకారమును చెప్పి యున్నాడు.

## శమనస్నేహప్రయోగక్రమము

శమనః క్షుద్వతోఽనన్నో మధ్యమాత్రశ్చ శస్యతే,

శమనరూపమైన స్నేహము (అనగా రోగశమనార్థ ముపయోగింపబడు స్నేహము) ఆకలి గలిగి యుండునపుడు భక్ష్యాద్యాహార రహితముగ మధ్యమమాత్రచే ప్రయోగించుట ప్రశస్తము. భుజించిన యన్నము జీర్ణమును జెందినతోడనే ఆకలి కలుగకుండునపుడు శోధనరూపమైన స్నేహమును ప్రయోగించునటుల శమనరూపమైనస్నేహమును ప్రయోగింపంజనదు. ప్రయోగించినచో అట్టిసమయమునందు స్రోతోమార్గములు కఫముచే వ్యాప్తంబై యుండుటవలన నా శమనస్నేహము సర్వశరీరమునందు వ్యాపించనేరదు. అందువలన నా స్నేహము అచ్చటచ్చటనుండు దోషములను శమనము జేయుటయందసమర్థంబుగ నగును.

మఱియు నా శమనరూపస్నేహము బాగుగ నాకలి గలిగియుండు కాలమునందే ప్రయోగించినయెడల నది సర్వశరీరమునందు వ్యాపించి యచ్చటచ్చట ప్రకోపమును జెందియుండు దోషములను శమనము జేయును. కాబట్టి విశేషముగా ఆకలి గలుగు కాలమునందు శమనరూపమైన స్నేహమును ప్రయోగించుట మిగుల ప్రశస్తమైనదని తెలియపరచుటకై "క్షుద్వతః" అనుపదము ప్రయోగింపబడినది.

శమనరూపమైన స్నేహవిషయములో ఉత్తమమైన మాత్ర ప్రయోగింపబడినయెడల స్నేహపానదినానంతరము పథ్యము చేయవలయును. మరుదినమునందు మరల స్నేహప్రయోగమును చేయవలయును. మరుదినమునందు పథ్యము నాచరించవలయును. మధ్యమమాత్రను ప్రయోగించినయెడల లఘుభోజనము చేయువానికి ఒక యామకాలములో అన్నమునం దిచ్చ కలుగనేరదు. రాత్ర్యారంభమునందు (అనగా రాత్రియొక్క పూర్వభాగమునందు) స్నేహపానము చేయుపక్షమున రాత్రియం దర్ధయామము గతించిన పిదప రసప్రాయముగ నుండుభోజనమును స్వల్పముగ భుజింపవలయును.—

"ఉపచారస్తు శమనే కార్యః స్నేహోవిరిక్తవత్"

అని యాతంత్రకారుడే శమనరూపస్నేహమునందు స్వల్పభోజనమే పథ్యకారియని చెప్పబోవుచున్నాడు—

"పరిషిచ్యాద్భిరుష్ణాభి ర్జీర్ణస్నేహం తతః పరమ్,

యవాగూం పాయయేదుష్ణామక్లిన్నామల్పతండులామ్.

పేయో యూషో రసో వా స్యాదకృతస్సౌరభాయుతః,

కృతో వాప్యల్పసర్పిష్కో విలేపీ వా విధీయతే"

శమనరూపమైన స్నేహము జీర్ణమైన పిదప స్వల్పముగ నుష్ణోదకము పానముచేసి పిదప నొకింతబియ్యముతో గూడినదియును, అక్లిన్నముగ నుష్ణముగ నుండునదియునైన

యవాగును పానము చేయించవలయును. మఱియు అకృతమైన యూషముగాని, లేక మాంసరసమునుగాని పానము చేయింపవలయును. స్వల్ప ఘృతముతోఁగూడియుండు కృతరసముగాని లేకవిలేపిగాని, ప్రశస్తమైనది అని సుశ్రుతమునందు చెప్పఁబడియున్నది.

## బృంహణస్నేహప్రయోగక్రమము

బృంహణో రసమద్యాద్యైస్సభక్తోఽల్పః

బృంహణరూపమైన స్నేహమును మాంసరసము, మద్యము మొదలగువాని తోఁడను, అన్నముతోఁడను మిగుల హ్రస్వమాత్రగ ప్రయోగించుటయే ప్రశస్తము. మూలశ్లోకమునందు "రసః" అని సామాన్యముగా జెప్పియుండినను,—

"రస ఇత్యవిశేషోక్తౌ జ్ఞేయో మాంసభవో రసః"

అనెడి తంత్రాంతరవచనమునుపట్టి "రసః" అనుశబ్దమునకు మాంసరస మని యర్థము. మద్యాది యను ఆదిశబ్దమువలన ద్రవస్వరూపమైన క్షీరము, ఖండము మొదలగునవి గ్రాహ్యంబులు.

## బృంహణస్నేహార్హులు

హితస్స చ ౧౯

బాలవృద్ధపిపాసార్తస్నేహద్విణ్మద్యశీలిషు,
స్త్రీస్నేహనిత్యమందాగ్నిసుఖితక్లేశభీరుషు, ౨౦
మృదుకోష్ఠాల్పదోషేషు కాలే చోష్ణే కృశేషు చ,

బాలురు, వృద్ధులు, దప్పిచేఁబీడితులు, స్వభావముగనే స్నేహమును ద్వేషించువారు, సర్వదా మద్యపానము చేయువారు, స్త్రీలయం దెల్లపుడు నాసక్తి గలవారు, స్నేహమునం దెల్లపుడు నాసక్తి గలవారు, అగ్నిమాంద్యము గలవారు, సుఖమును జెంది యుండువారు, క్లేశకరమైన వ్యాపారములచే భయమును జెందువారు, మృదువైన కోష్ఠము గలవారు, స్వల్పమైనదోషము గలవారు, కృశులు, వీరలకు పైచెప్పిన బృంహణ స్నేహము హితకరముగ నుండును. మఱియు నది ఉష్ణకరమైన గ్రీష్మాదికాలములయందును హితకరమైనది.

## బృంహణస్నేహప్రయోగ ఫలము

ప్రాఙ్మధ్యోత్తరభక్తోఽసావధో మధ్యోర్ధ్వదేహజాన్. ౨౧
వ్యాధీన్ జయేద్బలం కుర్యాదంగానాం చ యథాక్రమం,

ఆబృంహణస్నేహమును ఆహారమునకుఁ బూర్వకాలమునందును, మధ్యకాలము నందును, ఉత్తరకాలమునందును ప్రయోగించినయెడల యథాక్రమముగా అధోదేహము,

మధ్యదేహము, ఊర్ధ్వదేహము వీనియందు గలిగియుండు వ్యాధులను హరింప చేయును. (అనగా భోజనాత్పూర్వము ప్రయోగింపబడిన స్నేహము అధోదేహము నందు జనించి యుండువ్యాధులను, భోజనమధ్యమునందు ప్రయోగింపబడినస్నేహము మధ్యదేహమునందు జనించియుండు వ్యాధులను, భోజనోత్తరము ప్రయోగించబడిన స్నేహము ఊర్ధ్వదేహమునందు జనించి యుండువ్యాధులను హరింపజేయు ననిభావము.

మఱియు నాస్నేహము యథాక్రమముగ అధోభాగము, మధ్యభాగము, ఊర్ధ్వభాగము వీనియందలి అంగములకు విశేషముగా బలమును కలుగజేయును. (అనగా భోజనాత్పూర్వము ప్రయోగింపబడిన స్నేహము అధోభాగమునందలి శరీరావయవములకును, భోజనమధ్యమునందు ప్రయోగింపబడిన స్నేహము మధ్యభాగమునందలి శరీరావయవములకును, భోజనోత్తరము ప్రయోగింపబడిన స్నేహము ఊర్ధ్వభాగమునందలి శరీరావయవములకును బలమును కలుగజేయునని భావము).

"మారుతేభ్యధికే సర్పిస్సదా సలవణం హితమ్,
కేవలం చాధికే పిత్తే కఫే సత్ర్యూషణం తథా."

అనువాక్యముచేత ఆయాదోషము ననుసరించి నియమము చెప్పబడినది. వాతము అధికముగ నుండునపుడు లవణముతోగూడియుండు ఘృతము హితకరము. పిత్తము అధికముగనుండునపుడు కేవలఘృతము హితకరము. కఫము అధికముగ నుండునపుడు త్రికటుకములతోగూడియుండు ఘృతము హితకర మని తాత్పర్యము.

అచ్ఛపేయస్నేహానుపాన క్రమము

వార్యుష్ణమచ్ఛేఽనుపిబేత్ స్నేహే తత్సుఖపక్తయే. ౨౨
ఆస్యోపలేపశుద్ధ్యై చ తౌ వరారుష్కరే న తు,
జీర్ణాజీర్ణవిశంకాయాం పునరుష్ణోదకం పిబేత్. ౨౩
తేనోద్గారవిశుద్ధిః స్యాత్తతశ్చ లఘుతా రుచిః,

అచ్ఛపేయమను స్నేహమును ఉత్తమ, మధ్యమ, హ్రస్వమాత్రలచే నుపయోగించునపు డది సుఖముగ పాకము జెందుటకును, ఆ స్నేహలేపముతో గూడియుండు నోటియొక్క శుద్ధికొఱకును పిదప ఉష్ణోదకమును పానము చేయవలయును. తువరసంబంధమైన తైలమును, భల్లాతకతైలమును, అచ్ఛపేయముగ ప్రయోగించునపుడు అవి రెండును అత్యుష్ణవీర్యము గలవియగుటవలన పిదప నుష్ణోదకమును పానము చేయం జనదు. స్నేహమును పానముచేసి చిరకాలమయిన పిదప, జీర్ణాజీర్ణమును గురించి సంశయము కలుగుచున్నచో నుష్ణోదకమును పానము చేయవలయును. అటుల చేసినయెడల

ఉద్గారవిశుద్ధి లేపరహితముగ తేనుపులు కలుగును. దానిచే స్నేహపానము చేసినవానికి అధికమయిన శరీరలాఘవంబును రుచియు కలుగును.

"తతో గురుప్రావరణో నివాతే శయనే స్థితః,
చరణాంతం ప్రతీక్షేత తృష్యన్నుష్ణాల్పవారిణః.
శిరోరుగ్భ్రమనిష్ఠీవమూర్ఛాదాహారుచిక్లమైః,
జానీయాద్భేషజం జీర్ణాజీర్ణం తచ్ఛాంతిలాఘవాత్,
అనులోమానిలస్వాస్థ్యక్షుత్తృష్ణోద్గారశుద్ధిభిః"

స్నేహపానానంతరము దళమైనదుప్పటిని కప్పుకొని గాలిలేకుండునట్టి శయనమునందు పరుండి దప్పి కలుగునపుడు అనుష్ణమైన జలమును స్వల్పముగ పానము చేయుచు జీర్ణమగువరకు నిరీక్షించుచుండవలయును. తలనొప్పి, భ్రమ, నిష్ఠీవము, మూర్ఛ, తాపము అరుచి, క్లమము ఇవి గలిగినయెడల నాయౌషధము అజీర్ణముగ నున్నదని తెలిసికొనవలయును. అటుగాక తలనొప్పి మొదలగునవి శమించి శరీరలాఘవము, అనులోమవాతము, శరీరస్వాస్థ్యము, ఆకలి దప్పి గలిగి తేనుపులు శుద్ధముగ వెడలుచుండిన నౌషధము జీర్ణమైనదని తెలిసికొనవలయును అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

స్నేహపానానంతరము - ఆహారాదిక్రమము

భోజ్యోఽన్నం మాత్రయా పాస్యన్ శ్వః పిబన్ పీతవానపి. ౨౪
ద్రవోష్ణమనభిష్యంది నాతిస్నిగ్ధమసంకరం,
ఉష్ణోదకోపచారీ స్యాద్బ్రహ్మచారీ క్షపాశయః, ౨౫
న వేగరోధీ వ్యాయామక్రోధశోకహిమాతపాన్,
ప్రవాతయానయానాధ్వభాష్యా * భ్యాసనసంస్థితీః. ౨౬
నీచాత్యుచ్చోపధానాహఃస్వప్నధూమరజాంసి చ,
యాన్యహాని పిబేత్తాని తావంత్యన్యాన్యపి త్యజేత్. ౨౭
సర్వకర్మస్వయం ప్రాయో వ్యాధిక్షీణేషు చ క్రమః,

మరుదినము స్నేహపానము చేయవలయు నని నిశ్చయించువాడును, ఆదినమునందే స్నేహపానము చేసియుండువాడును, ఇంతకుముందు స్నేహపానము చేసినవాడు నైన పురుషులు ద్రవముగ, ఉష్ణముగ, ముద్గయూషాదులతో గూడినదిగ, ఉష్ణమయి కఫము చేయనదిగ, కొంచెము స్నిగ్ధముగ, అసహ్యవస్తుసంబంధము లేనిదిగ నుండు అన్నము మాత్రగా (అనగా నెంతపరిమాణముగల యన్నమును భుజించిన సరియైన కాల

* త్యశన ఇతి పా.

ములో జీర్ణముచు చెందునో అట్టి పరిమాణముగల అన్నముచు స్వల్పముగ) భుజించు నట్లు జేయవలయును. స్నేహపానముచేయువాడు ఉష్ణోదకోపచారిగను, స్త్రీసంగమ రహితుడుగను, రాత్రులయందు నిద్రించు స్వభావము కలవాడుగను, (అనగా దివాస్వప్న రాత్రి జాగరణ రహితుడుగను) మలమూత్రాది వేగముల నడ్డగించని వాడుగను నుండ వలయును. వ్యాయామము, క్రోధము, శోకము, మంచు, ఎండ, పెనుగాలియందు సంచారము, మద్యపానము, వాహనముపై నెక్కుట, మార్గసంచారము, అధిక సంభాష ణము, విద్యాదుల నభ్యసించుట, మిగుల పల్లముగనుండు తలగడనుగాని, మిగుల నున్నత ముగనుండు తలగడనుగాని వేసికొని పరుండుట, పగటినిద్ర, పొగ, ధూళి మొదలగు వానిని తైలపానము చేయునన్ని దినములును, తదనంతరం అన్ని దినములను వర్జించ వలయును. వమనవిరేచనాది సమస్త కర్మములయందును పైజెప్పిన "ఉష్ణోదకోపచారి స్యాదిత్యాది" విధినే యనుసరింపవలయును. మఱియును వ్యాధిచే క్షయించిన వారు కూడ పైజెప్పిన "ఉష్ణోదకోపచారీ స్యాదిత్యాది" విధినే తఱుచుగ ననుసరింపవల యును. అతిసారాదులయందు దివాస్వాపము అంగీకరింపబడి యున్నది. అట్లగుటచేతనే "ప్రాయశః" అను పదము మూలశ్లోకమునందు ప్రయోగించబడినది.

## శమనస్నేహోపచారక్రమము

ఉపచారస్తు శమనే కార్యస్స్నేహే విరిక్తవత్. ౨౫

శమనస్నేహము ప్రయోగించునపుడు విరేచనౌషధమును సేవించినవాని విష యమై చెప్పబడియుండు పేయాదిక్రమ విధానమునే యనుసరింప వలయుండు.

"స్నేహస్య పాచనాత్పూర్వం పాతవ్యం మృదు భేషజమ్,
యత్తైజసం బహుతాశస్య కోష్ఠలాఘవకారి చ."
అని యధికపాఠము కొన్ని ప్రతులయందు కానంబడియెను.

శమనస్నేహము పాకముచు చెందుటకు మునుపు జాఠరాగ్ని దీప్తికరంబును, కోష్ఠమునకు లఘుత్వకారియు నగు మృదువైన యౌషధమును భుజించవలయును అని యర్థము.

## స్నేహపానదినసంఖ్య

త్ర్యహమచ్ఛం మృదౌ కోష్ఠే క్రూరే సప్తదినం పిబేత్,
సమ్యక్స్నిగ్ధోఽథవా యావదతస్సాత్మీ భవేత్పరమ్, ౨౬

అచ్ఛస్నేహముచు మృదువైన కోష్ఠముగల మనుజుడు మూడు దినములును, క్రూర కోష్ఠముగలవాడు ఏడు దినములును, మధ్యకోష్ఠముగలవాడు ఆరుదినములును పానము చేయవలయును.

"చత్వార్యహాని పంచ వా స్నేహం పిబేత్ మధ్యమకోష్ఠస్తు షడ్రాత్రంపిబేత్" మృదుకోష్ఠముగలవానికి మూడుదినములలో స్నేహపానమువలన స్నిగ్ధలక్షణము బాగుగ కలుగకుండినయెడల వాడు మరల నాల్గవదినము లేక అయిదవదినము ఆస్నేహ పానమును చేయవలయును. మధ్యకోష్ఠముగలవానికి స్నిగ్ధలక్షణము కలుగకుండినయెడల ఆరుదినములు ఆస్నేహపానమును చేయవలయును. మృదు, మధ్య, క్రూరకోష్ఠములుగల వారలు ఆస్నేహపానము నేడుదినములు జేసియు స్నిగ్ధలక్షణము కలుగకుండు నెడ నేడుదినములకుపైనికూడ బాగుగ స్నిగ్ధలక్షణము గలుగువరకు నాస్నేహపానము చేయుచుండవలయును. అందుపై స్నిగ్ధలక్షణము పూర్తిగ గల్గినపిదప స్నేహపానము జేసినచో ఆస్నేహము శరీరమునకు సాత్మ్యముగ నగును.

"సాత్మీభూతే చ కురుతే న మలానాముదీరణమ్,
అతియోగేన వా వ్యాధీన్ యథాంభోఽత్యతియోజనాత్."

సాత్మ్యముగనుండు నాస్నేహము మలములను బైలుపరచ నేరదు. మరియు అతియోగము వలన వ్యాధులనుమాత్రము కలుగజేయును అని సాత్మ్యస్నేహదోషము అష్టాంగ సంగ్రహమునందు చెప్పబడియున్నది. ఆస్నేహలక్షణము ఏడుదినములవలన కూడ బాగుగ గలుగకుండినయెడల ఒకదినమువదలి మరల నాస్నేహమును ప్రయోగింప వలయునని వైద్యశ్రేష్ఠులు వచించెదరు.

### స్నేహ సమ్యగ్యోగాతియోగలక్షణములు

వాతానులోమ్యం దీప్తోఽగ్నిర్వర్చఃస్నిగ్ధమసంహతం,
స్నేహోద్వేగః క్లమస్సమ్యక్ స్నిగ్ధే రూక్షే విపర్యయః. ౩౦
అతిస్నిగ్ధే తు పాండుత్వం ఘ్రాణవక్త్రగుదస్రవాః,

బాగుగ స్నిగ్ధుడైన పురుషునికి వాతమునకు అనులోమగతి, అగ్నిదీప్తి, స్నేహ యుక్తముగ, శిథిలముగనుండు మలము, స్నేహపానమునందు భయము, క్లమము, ఇవి కలుగును. స్నేహలక్షణము కలుగకుండువానికి పైచెప్పిన వాతానులోమగతి మొద లగునవి కలుగకుండును. స్నేహముయొక్క అతియోగమువలన పాండురవర్ణము, నాసి కము, నోరు, గుదము వీనియందు స్రావము కలుగును.

### మాత్రారహితస్నేహాదిజనితరోగములు

అమాత్రయాఽహితోఽకాలే మిథ్యాహారవిహారతః. ౩౧
స్నేహః కరోతి శోఫార్శస్తంద్రాస్తంభవిసంజ్ఞతాః,
కండుకుష్ఠజ్వరోత్క్లేశశూలానాహభ్రమాదికాన్. ౩౨

మాత్రారహితముగ పానముచేయబడిన ఘృతము మొదలగుస్నేహములు, ఆయా మనుజునికి నిషేధింపబడిన స్నేహములు, పూర్వము నిషేధింపబడిన గ్రీష్మాది కాలములయందు పానముచేయబడిన స్నేహము, ఇవి శోఫ, అర్శస్సు, తంద్ర, స్తంభము, సంజ్ఞానాశము, దురద, కుష్ఠము, జ్వరము, ఉత్క్లేశము, శూల, ఆనాహము, భ్రమ, మొదలగురోగములను గలుగజేయును. భ్రమాది యను ఆదిశబ్దమువలన అష్టాంగసంగ్రహమునందు చెప్పియుండు బలక్షయము, జడత్వము, వాగ్బంధనము ఈ మొదలగు వానిని గ్రహించుకొనవలయును. స్నేహము మిథ్యాహారమువలన (అనగా పైజెప్పిన "ద్రవోష్ణమిత్యాది" ఆహారమునకంటె విరుద్ధమైన యాహారమువలన) మిథ్యావిహారమువలన (అనగా పైజెప్పిన "ఉష్ణోదకోపచారీస్యాదిత్యాది" విహారమునకంటె విరుద్ధమైన విహారములవలన) పైజెప్పిన శోఫమొదలగు రోగములు కలుగజేయును.

స్నేహవ్యత్యాసమునందు చికిత్స

క్షుత్తృష్ణోల్లేఖనస్వేదరూక్షపానాన్నభేషజం,
తక్రారిష్టం ఖలోద్దాలయవశ్యామాకకోద్రవాః. 33
పిప్పలీత్రిఫలాక్షౌద్రపథ్యాగోమూత్రగుగ్గులు,
యథాస్వం ప్రతిరోగం చ స్నేహవ్యాపది సాధనమ్ 34

స్నేహవిధి వ్యత్యాసమువలన గలుగురోగములయందు ఆకలిని దప్పిని నిగ్రహించుట, వమనము, స్వేదకర్మ, రూక్షకరమైన అన్నపానౌషధములు, తక్రము, అరిష్టము, ఖలము (అనగా వ్యంజనవిశేషము), ఉద్దాలము (అనగా శాలిధాన్యవిశేషము), యవలు, శ్యామాకము, కోద్రవము, పిప్పలి, త్రిఫలములు, తేనె, కరక్కాయ, గోమూత్రము, గుగ్గులు ఇవి వాతాదిదోషానుసారముగ నాయాయధ్యాయమునందాయా రోగమునకు జెప్పియుండు ఔషధానుగుణముగ నుపయోగింపందగును.

విరూక్షణ-సమ్యగ్యోగాతియోగలక్షణము

విరూక్షణే లంఘనవత్కృతాతికృతలక్షణం,

విరూక్షణము (అనగా రూక్షకర్మ) యొక్క సమ్యగ్యోగ, అతియోగ లక్షణములను లంఘనమునకు జెప్పియుండు ప్రకారమే తెలిసికొనవలయును. అది యెట్లనగా:— బాగు చేయబడిన లంఘనమునకు జెప్పియుండు విమలేంద్రియత్వాది లక్షణములే బాగుగ చేయబడిన విరూక్షణమునకు లక్షణము లనియు, అధికముగ లంఘనము చేయబడిన వానికి జెప్పియుండు కృశత్వాదిలక్షణములే అధికముగ జేయబడిన విరూక్షణమునకు లక్షణ మనియు తెలియవలయును.

స్నేహవిధి వ్యత్యాసముయొక్క చికిత్స విరూక్షణ స్వభావము గలదిగ నుండుట వలన ప్రసంగముచే నావిరూక్షణ కర్మయొక్క సమ్యగ్యోగ, అతియోగ లక్షణములు నిచట జెప్పబడినవి.

### విరేచన-వమనక్రమము

స్నిగ్ధద్రవోష్ణధన్వోత్థరసభుక్ స్వేదమాచరేత్. ౩౫
స్నిగ్ధస్త్ర్యహం స్థితః కుర్యాద్విరేకం వమనం పునః,
ఏకాహం దినమన్యచ్చ కఫముత్క్లేశ్య తత్కరైః ౩౬

తొలుత స్నేహకర్మ జేసికొనియుండు పురుషుడు పిదప మిగుల స్నిగ్ధముగ, ద్రవముగ, ఉష్ణవీర్యముగలదిగ. అగ్ని సంయోగముచే నుష్ణముగ నుండు జాంగలదేశమాంస రసమును భుజించి మూడుదినములు స్వేదకర్మము చేయించుకొని పిదప విరేకమును చేయించుకొనవలయును. వమనము చేయించుటకు మునుపు స్నేహకర్మను చేయించుకొని పిదప పై జెప్పినప్రకారము మిగులస్నిగ్ధముగ, ద్రవముగ, ఉష్ణవీర్యము గలదిగ. అగ్ని సంయోగముచే నుష్ణముగనుండు జాంగల దేశమాంసరసము నొకదినము భుజించిన స్వేదకర్మను చేయించుకొని రెండవ దినమునందు కఫకరములగు మినుములు, పాలు, మత్స్యములు, బెల్లము మొదలగువస్తువులచే కఫమును స్వస్థానములోనుండి బైలుపరచి వమనము చేయించవలయును.

### మాంసవృద్ధ్యాదులయందు శోధనక్రమము

మాంసలా మేదురా భూరిశ్లేష్మాణో విషమాగ్నయః,
స్నేహోచితాశ్చ యే స్నేహ్యాస్తాన్ పూర్వం రూక్షయేత్తతః.
సంస్నేహ్య శోధయేదేవం స్నేహవ్యాపన్న జాయతే,
అలం మలానీరయితుం స్నేహశ్చాసాత్మ్యతాం గతః. ౩౭

మాంసవృద్ధి, అధిక మేదస్సు, అధిక శ్లేష్మము, విషమాగ్ని ఇవి గలవారును, స్నేహాభ్యాసము గలవారును, స్నేహకర్మ కర్హులుగ నుండువారు అట్టివారికి తొలుత రూక్షకర్మను, పిదప స్నేహకర్మను చేసి పిదప శోధనకర్మను చేయించవలయును. ఇటులు చేసినయెడల స్నేహ వ్యాపత్తుచే దోషము గలుగనేరదు. ఇంతియకాక ఆ స్నేహము అసాత్మ్యమును జెంది వాతాదిమలములను పురీషాదిమలములను బాగుగా వెలిపరచును.

### బాలాదులకు సద్యస్స్నేహప్రయోగము

బాలవృద్ధాదిషు స్నేహపరిహారాసహిష్ణుషు,
యోగానిమాననుద్వేగాన్ సద్యస్స్నేహాన్ ప్రయోజయేత్.

బాలురు, వృద్ధులు మొదలగువారికిని, స్నేహవిషయమునందు పరిహరింపదగిన శీతోపచారాదుల విడువ సహింప నేరనివారికిని, కష్టమును కలుగచేయకుండు ఈ క్రింది శ్లోకములచే జెప్పబడు సద్యస్స్నేహమను పేరుగలయోగములను ప్రయోగింపవలయును.

సప్తవిధసద్యస్స్నేహములు

ప్రాజ్యమాంసరసా స్తేషు పేయా వా స్నేహభర్జితా,
తిలచూర్ణశ్చ సస్నేహఫాణితః కృశరా తథా. ౪౦
క్షీరపేయా ఘృతాఢ్యోష్ణా దధ్నో వా సగుడస్సరః,
పేయా చ పంచప్రసృతా స్నేహై స్తండులపంచమైః. ౪౧
సప్తైతే స్నేహనాస్సద్యస్స్నేహాశ్చ లవణోల్బణాః,
తద్ధ్యభిష్యంద్యరూక్షం చ సూక్ష్మముష్ణం వ్యవాయి చ ౪౨

అధికమయిన మాంసరసము 1 స్నేహములచే వేయించబడిన పేయా 2, ఘృతాదిస్నేహములు, ఫాణితము (అనగా క్షుద్రగుడము) వీనితోగూడియుండు తిలచూర్ణము 3, కృసరము 4, ఘృతాధిక్యముతోగూడి ఉష్ణముగనుండు క్షీరపేయా 5, బెల్లముతోగూడియుండు పెరుగుమీదితేట 6, ఘృతము, తైలము, వస, మజ్జ, బియ్యము వీనిలో ప్రతిదాని నొక్కొక ప్రసృతము చొప్పునజేర్చి సిద్ధము చేయబడిన పంచప్రసృత యను పేరంబరంగు పేయా 7, అను నీ 7 యోగములు సద్యస్స్నేహములనబడును. మఱియును లవణము, స్రోతస్సులనుండి ద్రవమును స్రవింపజేయునదిగ, రూక్షత లేనిదిగ సూక్ష్మమైన స్రోతస్సులయందు సంచరించునదిగ, ఉష్ణముగ, సర్వదేహమునందు వ్యాపించి పచనముచేయునదిగ నుండును. కావున నధిక లవణముతోగూడినదిగను, ఉష్ణముగనుండు ఘృతము, తైలము, వస, మజ్జ అను నీ నాల్గు స్నేహములును సద్యస్నేహముల నబడును. ప్రసృత మనగా — "ద్వేపలే ప్రసృతం విదుః" అను వచన ప్రకారము రెండుపలము లని యర్థము.

కుష్ఠాదులకు స్నేహకర్మయందు గుడాదినిషేధము

గుడానూపామిషక్షీరతిలమాషసురాదధి,
కుష్ఠశోఫప్రమేహేషు స్నేహార్థం న ప్రకల్పయేత్. ౪౩

కుష్ఠము, శోఫ, ప్రమేహము అను నీ రోగములయందు స్నేహక్రియ చేయు కాలములో బెల్లము, అనూపదేశమాంసము, క్షీరము, నువ్వులు, మినుములు, సుర, పెరుగు, వీనిని జేర్పంజనదు.

కుష్ఠాదులకు స్నేహక్రమము

త్రిఫలాపిప్పలీపథ్యాగుగ్గుల్వాదివిపాచితాన్,
స్నేహాన్ యథాస్వమేతేషాం యోజయేదవికారిణః. ౪౪

పైజెప్పిన కుష్ఠాదిరోగములకు ఆయాయధ్యాయములయందు హితకరము లని చెప్పబడిన త్రిఫలములు, పిప్పలి, కరక్కాయ, వస్తువులు మొదలగువానిచే సిద్ధము చేయ బడినవియును, వికారమును గలుగజేయకుండునవియునైన స్నేహములను ప్రయోగించ వలయును.

వ్యాధిచే క్షయించినవారికి స్నేహప్రయోగక్రమము

క్షీణానాం త్వామయైరగ్ని దేహసంధుక్షణక్షమాః ౨౫

వ్యాధులచే క్షయించియుండుపురుషులకు అగ్నిదీపకకరంబులును, శరీరమునకు పుష్టికరంబులునగు స్నేహములను ప్రయోగింపవలయును. ఏల యనగా — వ్యాధులచే క్షయించియుండుపురుషులకు జాఠరాగ్ని క్షీణించి యుండును. కావున నట్టివారివిషయ ములో కేవలము పుష్టికరమయిన స్నేహములను ప్రయోగించినచో నవి అగ్నిమాంద్య మును గలుగజేయును. కేవలము అగ్నిదీప్తికరములైన స్నేహముల నుపయోగించినచో నవి శరీరపుష్టిని గలుగజేయనేరవు.

స్నేహసేవనఫలము

దీప్తాంతరాగ్నిః పరిశుద్ధకోష్ఠః ప్రత్యగ్రధాతుర్బలవర్ణయుక్తః,
దృఢేన్ద్రియో మందజరః శతాయుః స్నేహోపసేవీ పురుషః ప్రదిష్టః.

పలుమారు స్నేహసేవన చేయుచుండుపురుషుడు జాఠరాగ్నిదీప్తి, పరిశుద్ధమైన కోష్ఠము, శ్రేష్ఠమైనధాతువులు, బలము, వర్ణము, దృఢమైనఇంద్రియములు, స్వల్పమైన ముసలితనము గలవాడుగను, నూరు సంవత్సరములు జీవించువాడుగను నగునని సద్వైద్యులచే జెప్పబడి యున్నది.

షోడశాధ్యాయము, ముగిసెను.

# సప్తదశాధ్యాయము



అవశోధనప్రసంగమువలన స్నేహోపయోగము పూర్వాధ్యాయమునందు చెప్పబడినది. స్నిగ్ధమైనదేహములో దోషములు మృదుత్వమును జెందుటకై స్వేదకర్మ మిగుల నావశ్యకము కాబట్టి స్వేదజ్ఞానార్థమై స్వేదకర్మవిధ్యధ్యాయము చెప్పబడుచున్నది.

స్వేదవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతః స్వేదవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

స్నేహవిధ్యధ్యాయానంతరము స్నిగ్ధమైనదేహములో దోష మృదుత్వసంపాదనార్థమై స్వేదోపయోగం బావశ్యకంబగుటవలన స్వేదవిధ్యధ్యాయమును వివరించెదము.

('స్వేదయతీతి స్వేదః' అనువ్యుత్పత్తిచేత చెమట బుట్టించు క్రియ స్వేద మనబడును. అట్టి చెమట బుట్టించు క్రియలయొక్క పద్ధతిని దెలుపునట్టి యధ్యాయము స్వేదవిధ్యధ్యాయము.)

చతుర్విధ స్వేదములు

స్వేదస్తాపోపనాహోష్మద్రవభేదాచ్చతుర్విధః,

తాపము, ఉపనాహము, ఊష్మము, ద్రవము అను నీభేదములవలన పైజెప్పబడిన స్వేదము నాల్గు విధములుగ నుండును.

తాపస్వేదలక్షణము

తాపోఽగ్నితప్తవసనఫాలహస్తతలాదిభిః. ౧

అగ్నిచే తప్తమగువస్త్రము, అయోమయమైన ఫాలము (అనగా ఇనుపకొఱు), హస్తతలము (అనగా అరచెయ్యి) మొదలగువానిచే జేయబడుస్వేదకర్మ తాప మను పేరం బఱంగును. 'హస్తతలాదిభిః'' అనుఆదిశబ్దమువలన ప్రాను, ఇసుక, మట్టిపిడత, కంచుపాత్ర మొదలగునవి గ్రాహ్యంబులు.

ఉపనాహ స్వేదలక్షణము

ఉపనాహో వచాకిణ్వశతాహ్వాదేవదారుభిః,
ధాన్యైః సమస్తైర్గంధైశ్చ రాస్నైరండజటామిషైః. ౨

ఉద్రిక్తలవణైస్స్నేహ *చుక్రతక్రపయఃప్లుతైః,
కేవలే పవనే శ్లేష్మసంసృష్టే సురసాదిభిః. 3
పిత్తేన పద్మకాద్యైస్తు సాల్వణాఖ్యైః పునఃపునః,

స్నేహము, పులికడుగు, తక్రము, క్షీరము, వీనిచే కలియపెట్టబడినదియును, అధికలవణముతో గూడినదియునైన వస, కిణ్వము (అనగా సురాప్రకృతి), సదాప, దేవదారు, అనువానిచేతను, నువ్వులు, అగసివిత్తులు, మినుములు, మొదలగు ఉష్ణ వీర్యముగల ధాన్యములచేతను, సమస్తమైనగంధద్రవ్యములు (అనగా చెంగల్వకోష్టు, అగురు, గ్రంధితగరము, తులసి) మొదలగువానిచేతను, దుంపరాస్నము, ఏరండము, జటామాంసి, మాంసము అనువానిచేతను, చేయబడిన స్వేదకర్మ ఉపనాహ మనబడును. కేవలవాతములో పైజెప్పిన వస మొదలగువానిచే ఉపనాహమను స్వేదకర్మను చేయ వలయును. శ్లేష్మముతోగూడి యుండువాతములో సురసయుగాదిగణముచే ఉపనాహ మను స్వేదకర్మను చేయవలయును. పిత్తముతోగూడియుండువాతములో పద్మకాది గణముచే ఉపనాహమను స్వేదకర్మను జేయవలయును. స్వల్పపిత్తముతో గూడియుండు వాతములోనే పద్మకాదిగణములవలన ఉపనాహమను స్వేదకర్మను చేయవలయునేకాని అధికపిత్తముతోగాని, లేక సమానపిత్తముతోగాని గూడియుండు వాతములో పద్మకాది గణమువలన ఉపనాహస్వేదకర్మను చేయుంజనదు. ఏలనగ —"గ్రైష్మః ప్రాయో మరుత్పిత్తే విధిః కార్యః" (అనగా వాతపిత్తములో గ్రీష్మఋతువునందు చెప్పబడినవిధినే తఱుచుగ చేయవలయు నని చెప్పి స్వేదకర్మను చెప్పక యుపేక్షించియుండుటవలన అని తెలియవలయును.) పైచెప్పిన మూడు విధములగు ఉపనాహస్వేదములను కేవలవాతము నందును, కఫయుక్తవాతమునందును, పిత్తయుక్తవాతమునందును, యథాక్రమముగా పలుమారు ప్రయోగించవలయును. పైజెప్పిన మూడువిధములగు ఉపనాహస్వేదములకు సాల్వణ మను నామాంతరము కలిగి యుండును.

"ఉపనహ్యతే బధ్యతే చర్మపట్టాదినా"

అనువ్యుత్పత్తినిబట్టి చర్మపట్టాదులచే కట్టబడుటవలని నిస్వేదకర్మ ఉపనాహమను పేరంబఱంగును. ఉపనాహమను పేరంబఱంగునదియును, సాల్వణమను నామాంతరము గలదియునైన యీస్వేదకర్మవలె నితరమయిన స్వేదకర్మలు ఉత్కృష్టములైనవికావు. ఉపనాహ మను స్వేదమునకు తంత్రాంతరములయందు సాల్వణమను ప్రసిద్ధనామము కలిగియున్నది.

---

* శుక్త ఇతిపా.

" కాకోల్యాదిస్స వాతఘ్నస్సర్వామ్లద్రవ్యసంయుతః,
సానూపోదకమాంసస్తు సర్వస్నేహసమన్వితః,
సుఖోష్ణస్స ప్రష్టలవణస్సాల్వణః పరికీర్తితః."

అనెడి ధన్వంతరి వచన ప్రకారము వాతహరద్రవ్యములు, సమస్తమైన ఆమ్లద్రవ్యములు, అనూపోదకమాంసములు వీనితోగూడినదిగ, సమస్త స్నేహయుక్తముగ, సుఖోష్ణముగ, అధికలవణముగలదిగ నుండు కాకోల్యాది గణద్రవ్యములచే చేయబడిన స్వేదము సాల్వణ మని చెప్పబడును.

### ఉపనాహస్వేదబంధనక్రమము

స్నిగ్ధోష్ణవీర్యైర్మృదుభిశ్చర్మపట్టైరపూతిభిః. ౪
అలాభే వాతజిత్పత్రకౌశేయావికశాటకైః,
రాత్రౌ బద్ధం దివా ముంచేన్ముంచేద్రాత్రౌ దివాకృతమ్, ౫

స్నిగ్ధముగ, ఉష్ణవీర్యముగలదిగ, దుర్గంధంహితముగ, మృదువుగ నుండునట్టి చర్మపట్టములచే ఉపనాహమను స్వేదమునందు బంధనము చేయవలయును. చర్మపట్టములు దొరకనిచో ఏరండపత్రము, (ఆముదపుఆకు) కౌశేయవస్త్రము, కంబళము, శాటకము, యీ మొదలగువానిచే బంధనము చేయవలయును. చర్మపట్టాదులచే రాత్రుల యందుకట్టిన కట్టును పగటియందును, పగలుకట్టిన కట్టును రాత్రులయందును విప్పివేయ వలయును.

### ఊష్మస్వేదలక్షణము

ఊష్మాతూత్కారికాలోష్టకపాలోపలపాంసుభిః,
పత్రభంగేన ధాన్యేన కరీషసికతాతుషైః. ౬
అనేకోపాయసంతప్తైః ప్రయోజ్యో దేశకాలతః,

అనేకవిధములయిన యుపాయములచే తప్తము చేయబడిన ఉత్కారికా (అనగా యవలు, మినుములు, ఆముదపు విత్తులు, అగసివిత్తులు, కుసుంబావిత్తులు వీనిని అర్ధపాకము చేసి ముద్దగజేసి లపసికాకారముగ జేయబడిన స్వేదనోపాయద్రవ్యము) మంటిగడ్డలు, చిల్లపెంకు, బాయి, ఘూళి, ఆకులసమూహము, ధాన్యము, కరీషము (అనగా ఏరు పిడకలచూర్ణము), ఇసుక ఉమక, వీనిచే జేయబడినస్వేదము ఊష్మస్వేద మన బరంగును. దేశము, కాలము, దోషము, దూష్యము, వీనిని బాగుగ నాలోచించి ఊష్మ యనుస్వేదమును ప్రయోగించవలయును. ఎట్లనగా:—మంచిగడ్డ, చిల్లపెంకు, బాయి మొదలగువాని నగ్నివలె నెఱ్ఱగ గాల్చి కమ్మరవానిపటకారుచే నెత్తుకొని స్వేదకర్మకర్తగు వానియొక్క దోషాదులను విచారించి ఆమ్లములో (అనగా పుల్లని

నీళ్ళలోగాని, ధాన్యామ్లములోగాని శుక్తాదులలోగాని) ముంచుటచే గలుగుధూమము వలన శయనములో పరుండియుండువానికి స్వేదకర్మ చేయించవలయును. లేక పేడను ఉంటగ జేసి అగ్నిలో వెచ్చజేసి దానిచే స్వేదకర్మ చేయించవలయును. ఇది పిండస్వేద మనబడును. లేక ఆముదపుఆకులు మున్నగు ద్రవ్యములతోగూడియుండు యవాది ధాన్యములను, అమ్లకాదులను ఒకకుండలోవేసి దానిముఖమును బాగుగ మూసి బాగుగ పక్వము చేసి గాలి లేకుండునట్టి గృహములో శయనముపై చల్లి దానిపై కంబళము, కౌశేయవస్త్రము, ఆముదపాకులు వీనిలో నేదియైనను పరచి దానిపై స్వేదకర్మ కర్హుడుగ నుండువానిని పరుండబెట్టి వానిపై దుప్పి యనుమృగముయొక్క చర్మమునుగాని, లేక దృఢమైన వస్త్రమునుగాని కప్పవలయును. లేక తొలుత జెప్పిన స్వేదోపయుక్త ద్రవ్యములను నోరువెడల్పుగా లేకుండునట్టి యొక కుండలోవేసి బాగుగ నుడికించి స్వేద కర్మకు అర్హుడగువాడు గట్టిగనుండు వస్త్రము కప్పుకొని కుంభసమీపమున కూర్చుండి దానిలోనుండి వెడలునట్టి పొగను గ్రహించుచుండవలయును ఇది సంస్తర స్వేద మన బడును. ఈప్రకారము అనేకోపాయములవలన తపింపజేయబడిన వస్తువులను దోష దూష్యాదులను విచారించి స్వేదకర్మమునందు ప్రయోగించవలయును.

## ద్రవస్వేదలక్షణము

శిగ్రు * వీరణ్కైరండకారంజసురసార్జకాత్. ౭
శిరీషవాసావంశార్క మాలతీదీర్ఘవృంతతః,
పత్రభంగైర్వచాద్యైశ్చ మాంసైశ్చానూపవారిజైః. ౮
దశమూలేన చ పృథక్ సహితైర్వా యథామలమ్,
స్నేహవద్భిః సురాశుక్త వారిక్షీరాదిసాధితైః. ౯
కుంభీర్గలంతీర్నాడీర్వా పూరయిత్వా రుజార్దితమ్,
వాసపాచ్ఛాదితం గాత్రం స్నిగ్ధం సించేద్యథాసుఖమ్. ౧౦

మునగ, వీరణకము, చిట్టాముదము, క్రానుగు, తులసి, గగ్గెర, దిరిసనము, అడ్డసరము, వెదురు, జిల్లేడు, జాజి, పెద్దమ్రాను, వీనియాకులు వచాదిగణములో జెప్పబడిన ద్రవ్యములు, అనూపదేశజనితంబును, జలమునందు జనించినవియు నైన మాంసములు, దశమూలములు, వీనిని వేరువేరుగనైనను, లేక రెండుమూడుద్రవ్యములనుగాని, లేక సర్వమునుగాని, దోషహరమైన ఘృతము మొదలగు స్నేహములలో దేనియందేని వాతాదిదోషానుగుణ్యముగ జేర్చి సుర, శుక్తము, జలము, క్షీరము వీనిచే

* వారణ ఇతిపా.

వాతాది దోషానుగుణ్యముగ, సిద్ధము చేయబడిన కషాయముల నొకకుండలోగాని, గరిగె పిడతలోగాని, వెదురుగొట్టములోగాని పూరింపజేసి, పీడితుడుగ నుండువాని శరీరము వస్త్రముచే మూసి సుఖస్పర్శముగ (అనగా దోషపీడానుగుణ్యముగ ఒకానొకపుడు అత్యుష్ణముగ మఱియొకపుడు కించి దుష్ణముగ) ఆకషాయముచే తడుపుచుండవలయును. ఇది ద్రవస్వేద మని చెప్పబడును.

## అవగాహస్వేదలక్షణము

తైరేవవా ద్రవైః పూర్ణం కుండం సర్వాంగగేఽనిలే,
అవగాహ్యాతురస్తిష్ఠేదర్శఃకృచ్ఛ్రాదిరుత్సు చ. ౧౧

వాతము సర్వశరీరమునందు వ్యాపించి యుండునపుడును, అర్శస్సు, మూత్రకృచ్ఛ్రము మొదలగు కష్టమయిన రోగములయందును, పైజెప్పిన ద్రవ్యములచే పూరింపబడిన ఒక తొట్టిలో రోగి ప్రవేశించి కూర్చుండవలయును. "కృచ్ఛ్రాది" అను ఆదిశబ్దమువలన హస్త పాదపీడాదులనుకూడ గ్రహించుకొనవలయును.

ఇచ్చట 'కుండం' అను పద ముపలక్షణము కావున కూపకుటీస్వేదములు రెండును గ్రహింపబడును. కూపకుటీస్వేదములు రెండును అష్టాంగ సంగ్రహమున నిట్లు చెప్పబడెను.

"శయనస్యాధోవిస్తారద్విగుణఖాతే కృతే వాతహరదారుకరీషాద్యన్యతరపూర్ణదగ్ధే విగతధూమే స్వాస్తీర్ణశయనస్థం స్వేదయే దితి కూపస్వేదః, కుటీం నాత్యుచ్చవిస్తారవృత్తామచ్ఛిద్రాముపనాహద్రవ్యకల్కఘనప్రదిగ్ధకుడ్యాం సర్వతో విధూమప్రదీప్తఖదిరాంగారపూర్ణమాసంతికాసమూహపరివృతాం విధాయ తన్మధ్యస్థితశయ్యాస్థం స్వేదయే దితి కుటీస్వేదః. పద్మోత్పలాదిభిస్సక్తుపిండ్యా వాచ్ఛాద్య చక్షుషీ, శీతైర్ముక్తావలీపద్మముకుళోత్పలభాజనైః, ముహుఃకరైశ్చ సజలైః స్విద్యతో హృదయం స్పృశేత్."

అనగా మంచమునకు క్రింది ప్రదేశమునందు దాని పరిమితికంటె ద్విగుణముగ లోతు కల్గునటు పల్లమును త్రవ్వి, దానిలో వాతహరమైనకట్టెలు పిడకలు మొదలగువానిలో దేనినైన వేసి పూరించి అగ్గి తగిలించి ఆకట్టెలు బాగుగ కాలి పొగలేకుండునపుడు దానిపై మంచమును వేసి రోగిని పరుండబెట్టి స్వేదకర్మ చేయవలయును. ఇది కూపస్వేద మన బడును. మిగుల యెత్తు వెడల్పులేక గుండ్రముగను, ఛిద్రరహితముగ నుండుగుడిసెను నిర్మించి దానిలోప్రదేశముయొక్క గోడలయందు ఉపనాహ స్వేదోక్తద్రవ్యకల్కములను దృఢముగ పూసి నాల్గు ప్రక్కలయందును పొగ లేకుండునట్టి చంద్రనిప్పులచే సంపూర్ణముగ నుండు కుంపటులనునిచి ఆగుడిసె నడుమ శయనముసువేసి దానిపై రోగిని

పఁడబెట్టి స్వేదకర్మను చేయవలయును. ఇది కుటీస్వేద మనబడును స్వేదకర్మ జేయు నపుడు పద్మోత్పలాదులవలనగాని లేక వేపుడుబియ్యపుపిండియొక్క ఉంటవలనగాని, నేత్రములను మూసి శీతలముగనుండు ముక్తాహారము, తామరమొగ్గలు, నల్లకలువ పాత్రలు, జలముతోఁగూడియుండు అఱచెయ్యి, వీనిచే స్వేదకర్మ జేసికొనువాని హృదయమును పలుమారు స్పృశించుచుండవలయు నని అష్టాంగసంగ్రహమునందు కూపకుటీ స్వేదవిధులు చెప్పబడి యున్నవి.

స్వేదయోగ్యస్థలము

నివాతేఽంతర్బహిః స్నిగ్ధో జీర్ణాన్నః స్వేద మాచరేత్,
వ్యాధివ్యాధితదేశర్తు వశాన్మధ్యవరావరమ్ ౧౨

స్నేహపానముచే అంతఃస్నిగ్ధుడు, అభ్యంగాదులచే బహిఃస్నిగ్ధుడునైన పురుషుడు పూర్వదినమునందు భుజించిన యన్నము బాగుగ జీర్ణమైన పిదప గాలి లేకుండు ప్రదేశమున రోగము, దేశము, ఋతువు, ధాతువు వీని కనుగుణముగ మధ్యమముగాని లేక శ్రేష్ఠముగాని లేక హీనముగాని యుండు స్వేదకర్మను చేయించుకొనవలయును. ఇట్లు చెప్పుటచే స్వేదకర్మకు అర్హుడైన పురుషుడు స్వేదకర్మ నవశ్యముగ జేయించు కొనవలయు ననియును, ఆమాజీర్ణాదులవలన పీడించబడిన పురుషుడు అన్నము జీర్ణము కాకుండునపుడు స్వేదకర్మను చేసికొనగూడ దనియును భావం బగుచున్నది.

కఫరోగమునందు స్వేదక్రమము

కఫార్తో రూక్షణం రూక్షో రూక్షస్నిగ్ధం కఫానిలే,

కఫపీడితుడుగ నుండుపురుషుడు స్నేహపానముచే శరీరాన్తర్భాగమునను, అభ్యంగనముచే బహిర్భాగమున నున్నశరీరుడుగాక రూక్షశరీరుడై స్వేదకర్మను చేయించుకొనవలయును. శ్లేష్మవాతమువలన పీడింపబడినవానికి కొన్ని యంగములయందు స్నిగ్ధముగను, మఱికొన్ని యంగములయందు రూక్షముగను నుండునపుడు స్వేదకర్మను చేయవలయును.

ఆమాశయగతవాతమున స్వేదక్రమము

ఆమాశయగతే వాయౌ కఫే పక్వాశయాశ్రితే ౧౩
రూక్షపూర్వం తథా *స్నేహపూర్వం స్థానానురోధతః,

వాతము ఆమాశయమును జెందియుండునపుడు స్థానానుగుణముగా (అనగా శ్లేష్మస్థానమైన ఆమాశయములో వాతము ఆగంతుకమైనది కావున నా శ్లేష్మస్థానానుగుణ

* స్నిగ ఇతిపా.

ముగ) తొలుత రూక్షకరమైన స్వేదకర్మను చేసి పిదప స్నిగ్ధమైన స్వేదకర్మను చేయవలయును. కఫము పక్వాశయమును జెందియుండునపుడు స్థానానుగుణముగా (అనగా వాతస్థానమైన పక్వాశయములో కఫము ఆగంతుకమైనది కావున నా వాతస్థానానుగుణముగ) తొలుత స్నిగ్ధమైన స్వేదకర్మను చేసి పిదప రూక్షకర మయిన స్వేదకర్మను చేయవలయును.

"తత్రాన్యస్థానసంస్థేషు తదీయాం"

అనియును,—

"ఆగంతుం శమయేద్దోషం స్థానినం ప్రతికృత్య చ"

అనియును తొలుత స్థానసంబంధమైనదోషమునకు చికిత్సజేసి పిదప ఆగంతుకదోషములకు శమనము చేయవలయు నని యిదివరకే చెప్పబడి యున్నది.

### గజ్జలు మొదలగువానియందు స్వేదక్రమము

అల్పం వంక్షణయోః స్వల్పం దృఙ్ముష్కహృదయే న వా. ౧౪

గజ్జలయం దల్పముగను, నేత్రములు, వృషణములు, హృదయము వీనియం దత్యల్పముగను స్వేదకర్మ చేయవలయును లేక నేత్రములు, వృషణములు, హృదయము వీనియందు స్వేదకర్మమే చేయం జనదు.

### బాగుగా స్వేదకర్మ జేసికొనినవానియొక్క లక్షణము, ఉపచారము

శీతశూలక్షయే స్విన్నో జాతేఽంగానాం చ మార్దవే,
స్యాచ్ఛనైర్మృదితః స్నాత స్తతః స్నేహవిధిం భజేత్. ౧౫

శైత్యము, శూల, ఇవి క్షయించి హస్తములు, పాదములు మొదలగునంగములకు మృదుత్వము శరీరముపై వ్యాపించి యుండు శీతలము తగ్గి నొప్పి నిమ్మళించిన అరచేతులయందును అరకాళ్లయందును మెత్తవడియున్నచో మనుజుడు చక్కగ స్విన్నుడని యెఱుంగునది. అట్టిస్విన్నుడుగ నుండుపురుషుడు అంగములయందు మృదువుగ మర్దనము చేయించుకొని ఉష్ణోదకములో స్నానము చేసి స్నేహప్రకరణములో జెప్పియుండు ఉష్ణోదకోపచారీస్యాత్ అనిచెప్పిన విధుల ననుసరించవలయును.

### స్వేదాతియోగజనితరోగములు

పిత్తాస్రకోపతృణ్మూర్ఛాస్వరాంగసదనభ్రమాః,
సంధిపీడాజ్వరశ్యావరక్తమండలదర్శనమ్. ౧౬
స్వేదాతియోగాచ్ఛర్దిశ్చ తత్ర స్తంభనమౌషధమ్,
విషక్షారాగ్న్యతీసారచ్ఛర్దిమోహాతురేషు చ. ౧౭

స్వేదకర్మయొక్క- అతియోగమువలన రక్తపిత్తప్రకోపము, దప్పి, మోహము, స్వరభంగము, శరీరకార్శ్యము, భ్రమము, కీళ్లయందునొప్పి, జ్వరము, శ్యామరక్తవర్ణములుగల మండలములు, వాంతి, ఈరోగములు కలుగును. వీనియందు స్తంభనౌషధము ప్రయోగింపవలయును. అటులనే విషము, క్షారకర్మ, అగ్నికర్మ, అతిసారము, వాంతి, మోహము వీనిచే పీడింపబడినవారికిని స్తంభనౌషధము ప్రశస్త మయినది.

### స్వేదోపయుక్తద్రవ్యములు

స్వేదనం గురుతీక్ష్ణోష్ణం ప్రాయః స్తంభనమన్యథా,

గురువుగ, తీక్ష్ణముగ, ఉష్ణముగ నుండు ద్రవ్యము ప్రాయికముగ స్వేదకరముగ నుండును. పూర్వోక్తగుణములకంటె విపరీతగుణములుగల ద్రవ్యము తరుచుగ స్తంభనకారిగ నుండును

### స్వేదనస్తంభనద్రవ్యములు

ద్రవస్థిరసరస్నిగ్ధ రూక్షసూక్ష్మం చ భేషజమ్, ౧౮
స్వేదనం స్తంభనం శ్లక్ష్ణం రూక్షసూక్ష్మసరద్రవమ్,

ద్రవము, స్థిరము, సరము, స్నిగ్ధము, రూక్షము, సూక్ష్మము అను నీగుణములతో గూడియుండుద్రవ్యము స్వేదనము (చెమట బుట్టించునది) యగును. శ్లక్ష్ణత్వము, రూక్ష, సూక్ష్మము, సరము, ద్రవము అను నీగుణములతో గూడియుండు ద్రవ్యము స్తంభన మనబడును.

### రసములచే స్తంభనకరద్రవ్యములు

ప్రాయస్తిక్తం కషాయం చ మధురం చ సమాసతః. ౧౯

తిక్తము, కషాయము, మధురము అను నీరసములతో గూడియుండుద్రవ్యము తరుచుగ స్తంభనకారిగ నుండును.

### స్తంభితలక్షణము

స్తంభితః స్యాద్బలే లబ్ధే యథోక్తామయసంక్షయాత్,

స్తంభనక్రియాసాధ్యములని వైద్యతంత్రములలో జెప్పబడిన రోగములు క్షయించి శరీరమునందు బలము గలిగినయెడల మనుజుడు స్తంభితుడుగ నగును.

### అతిస్తంభితలక్షణము

స్తంభత్వక్స్నాయుసంకోచకంపహృద్వాగ్ఘనుగ్రహైః. ౨౦
పాదోష్ఠత్వక్కరైశ్శ్యావైరతిస్తంభితమాదిశేత్,

స్తబ్ధత్వము, చర్మము, స్నాయువులు వీనికి సంకోచము, శరీరము వణకుట; అోష్ఠము, నోరు, కటుమర్దు, వీనియందు పట్లు; పాదము, పెదవి, చర్మము, హస్తము, వీనియందు శ్యావవర్ణము, ఇవిగల మనుజుడు అతిస్తంభితుడని తెలియవలయును.

స్వేదకర్మనిషిద్ధులు

న స్వేదయేదతిస్థూలరూక్షదుర్బలమూర్ఛితాన్, 21
స్తంభనీయక్షతక్షీణ క్షామమద్యవికారిణః,
తిమిరోదరవీసర్ప కుష్ఠ*శోషాఢ్యరోగిణః. 22
పీతదుగ్ధదధిస్నేహ మధూన్ కృతవిరేచనాన్,
భ్రష్టదగ్ధగుదగ్లాని క్రోధశోకభయాన్వితాన్, 23
క్షుత్తృష్ణాకామలాపాండు మేహినః పిత్తపీడితాన్
గర్భిణీం పుష్పితాం సూతాం మృదు వాత్యయికే గదే. 24

అతిస్థూలుడు, రూక్షశరీరుడు, దుర్బలుడు, మూర్ఛితుడు, స్తంభనక్రియకు అర్హుడు, క్షతక్షీణుడు, కృశించినవాడు, మద్యపానముచే వికారమును జెందినవాడు, తిమిరరోగము, ఉదరరోగము, విసర్పి, కుష్ఠము, శోష, ఆఢ్యరోగము (అనగా వాతరక్తము) అనునీరోగములుగలవారు, పాలు, పెరుగు, స్నేహము, తేనె, వీనిలో దేనినైన పానము జేసినవాడు, విరేచనమునకు ఔషధము సేవించినవాడు, అతిసారము, క్షారాగ్నికర్మలు, మొదలగువానిచే భ్రష్టముగ దగ్ధముగ నుండుగుదము గలవాడు, బడలిక, క్రోధము, శోకము, భయము వీనితో గూడియుండువాడు, ఆకలి దప్పులు కలవాడు, కామల, పాండువు, మేహము అను నీ రోగములు గలవారు, పిత్తముచే పీడింపబడినవారు, గర్భిణిస్త్రీ, పుష్పవతియైన స్త్రీ, ప్రసవించినస్త్రీ, వీరలకు స్వేదకర్మ చేయదగదు. ఏలయనగా — స్వేదకర్మచే అతిస్థూలునికి మేదస్సు క్షయించి మిక్కుటముగ శరీరక్షోభ కలుగును. రూక్షుడు మొదలగువారికి అతికృశత్వము కలుగును. ఆకలికలవానికి మిక్కుటముగ శరీరమునందు బడలిక కలుగును. కామల పాండువు అను నీరోగములు గలవారికి పిత్తవృద్ధివలన రోగము వృద్ధి జెందును. పిత్తపీడగలవానికి రోగము వృద్ధి జెందును. గర్భిణికి గర్భమునకు ఆపత్తుగలుగును. రజస్వలకు అధికముగ రక్తస్రావము కలుగును. ప్రసవించినస్త్రీకి కార్శ్యము గలుగును. కావున పైజెప్పినవారికి స్వేదకర్మ చేయదగదు. మరియు పైజెప్పిన అతిస్థూలురు మొదలగువారికి విసూచిక మొదలగు ఆత్యంతికమైన

* శోఫా ఇతిపా.

మొదలగు ఆత్యంతికమైన (అనగా ప్రాణహరమైన) వ్యాధి గలిగి యుండునప్పుడు స్వేదకర్మ చేయింపవలయును.

—— శ్వాసాదులయందు స్వేదకర్మ ——

శ్వాసకాసప్రతిశ్యాయ హిధ్మాధ్మానవిబంధిషు,
స్వరభేదానిలవ్యాధి శ్లేష్మామ స్తంభగౌరవే ౨౪
అంగమర్దకటీపార్శ్వ పృష్ఠకుక్షిహనుగ్రహే,
మహత్వే ముష్కయోః ఖల్ల్యామాయామే వాతకంటకే. ౨౫
మూత్రకృచ్ఛ్రార్బుదగ్రంథిశుక్రాఘాతాఢ్యమారుతే,
స్వేదం యథాయథం కుర్యాత్తదౌషధవిభాగతః. ౨౬

శ్వాసము. కాసము, పీనసము, హిధ్మ (ఎక్కిళ్లు), ఆధ్మానము, మలబంధము, స్వరభేదము, వాతవ్యాధి, శ్లేష్మము, ఆమరోగము, శరీరస్తంభము, గురుత్వము, ఒడలు నొప్పి, కటిప్రదేశము, పార్శ్వములు, పృష్ఠము, కుక్షి, కటుమర్లు వీనియందు పట్లు, అండవృద్ధి, ఖల్లి, ఆమవాతము, ఆయామవాతము, వాతకంటకము, మూత్రకృచ్ఛ్రము, అర్బుదము, గ్రంథిరోగము, శుక్రాఘాతము, అఢ్యవాతము అను నీ రోగములు గలవారికి ఆ యారోగములకు చెప్పియుండు ఔషధోపయోగములవలన స్వేదకర్మను యథాక్రమముగ, (అనగా ఒకరోగమునందు తాప మను స్వేదకర్మను, ఒకరోగమునందు ఉపనాహ మను స్వేదకర్మను, ఒకరోగమునందు ఊష్మ మను స్వేదకర్మను, ఒకరోగమునందు ద్రవ మను స్వేదకర్మను) చేయవలయును.

"కర్ణనాసాశిరఃకోష్ఠ జంఘాపాదోరురుక్షు చ".

కర్ణరోగము, నాసారోగము, శిరోరోగము, కోష్ఠరోగము, జంఘారోగము, పాదరోగము, ఊరురోగము వీనియందును స్వేదకర్మను చేయింపవలయు నని అష్టాంగసంగ్రహములో జెప్పఁబడియున్నది.

—— వాతరోగవిశేషమునందు అనాగ్నేయస్వేదోపయోగము ——

స్వేదో హితస్త్వనాగ్నేయో వాతే మేదఃకఫావృతే,

మేదస్సు, కఫము, వీనిచే వ్యాప్తమై యుండు వాతరోగమునందు అనాగ్నేయ మను స్వేదకర్మ హితకరము.

—— అనాగ్నేయస్వేదవిధము ——

నివాతం గృహమాయాసో గురుప్రావరణం భయమ్. ౨౭
ఉపనాహాహవక్రోధభూరిపానం క్షుధా* తపః,

* క్షుదాతపః ఇతి పా.

గాలి లేకుండునట్టి గృహము, వ్యాయామము, దళముగ నుండుదుర్లక మను కంబళి మొదలగునవి భయంకర వస్తు దర్శనముచే గలిగినభయము. వీని సంబంధము వలన చెమట బుట్టించుట అనాగ్నేయస్వేదము, (అగ్ని సంబంధము లేక చేయబడిన స్వేదకర్మ అనాగ్నేయ మనబడును.) మరియు — "స్నిగ్ధోష్ణవీర్యైర్మృదుభి శ్చర్మపట్టైః" అను వచనముచే నిదివఱకు చెప్పబడిన ఉపనాహ మనుస్వేదము, యుద్ధము, క్రోధము, అధికమద్యపానము, ఆకలి, తపస్సు ఇవియు అనాగ్నేయ (అనగా అగ్నిసంబంధము) లేని స్వేదము లనబడును.

## స్వేదకర్మఫలము

స్వేదక్లిన్నాఃకోష్ఠగా ధాతుగా వా స్రోతోలీనా యే చ శాఖాస్థిసంస్థాః
దోషాః స్వేదై స్తే ద్రవీకృత్య కోష్ఠం నీతా స్సమ్యక్ఛుద్ధిభిర్నిర్హ్రియంతే.

కోష్ఠగతంబులుగ, రసాదిధాతుగతంబులుగ, స్రోతస్సులయందు లీనమైనవిగ, హస్తపాదములు అస్థులు వీనిని జెందినవిగ నుండుదోషములు స్వేదకర్మలచే ద్రవించి కోష్ఠగతంబులై వమనవిరేచనాది శుద్ధులచే బాగుగ హరింపజేయబడును.

సప్తదశాధ్యాయము, ముగిసెను.

# అష్టదశాధ్యాయము

అవ. స్వేదవిధ్యధ్యాయముయొక్క అంతమునందు "సమ్యక్ శుద్ధి భిర్నిర్హ్రియంతే" అని చెప్పబడినది, గనుక నాశుద్ధులయొక్క స్వరూపమును తెలియజేయునట్టి వమనవిరేచనవిధ్యధ్యాయము చెప్ప బడుచున్నది.

## వమనవిరేచనవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతో వమనవిరేచనవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

స్వేదవిధ్యధ్యాయానంతరము "శుద్ధిభిర్నిర్హ్రియంతే" అను వాక్యానుసరణి వమనవిరేచనాది శుద్ధి క్రమమును తెలియజేయునట్టి వమనవిరేచనవిధ్యధ్యాయమును వివరించెదము.

## కఫము, పిత్తము వీనియందు వమనవిధి

కఫే విదధ్యాద్వమనం సంయోగే వా కఫోల్బణే,
తద్వద్విరేచనం పిత్తే

శ్లేష్మమునందును, కఫాధిక్యముగల దోషసంయోగమునందును, వమనము చేయించవలయును. ఇటులనే పిత్తమునందును, పిత్తాధిక్యముగల దోష సంయోగమునందును విరేచనము చేయించవలయును.

## వమనకర్మార్హులు

విశేషేణ తు వామయేత్. ౧
నవజ్వరాతిసారాధఃపిత్తాసృగ్రాజయక్ష్మిణః,
కుష్ఠమేహాపచీగ్రంథి శ్లీపదోన్మాదకాసినః. ౨
శ్వాసహృల్లాసవీసర్ప స్తన్యదోషోర్ధ్వరోగిణః,

నూతనజ్వరము, అతిసారము. అధోగతరక్తము, రాజయక్ష్మము, కుష్ఠము, మేహము, అపచి, గ్రంధి, శ్లీపదము, ఉన్మాదము, కాసము, శ్వాసము, హృల్లాసము, విసర్పము, స్తన్యదోషము, శరీరమునం దూర్ధ్వభాగమున గల్గు రోగములు అను నీ రోగములు గలవారికి విశేషముగా వమనము చేయించవలయును.

వమన కర్మానర్హులు

అవామ్యా గర్భిణీ రూక్షః క్షుధితో నిత్యదుఃఖితః. ౩
బాలవృద్ధకృశస్థూలహృద్రోగిక్షతదుర్బలాః,
ప్రసక్తవమథుప్లీహతిమిరక్రిమికోష్ఠినః. ౪
ఊర్ధ్వప్రవృత్తవాయ్వస్రదత్తవస్తిహతస్వరాః,
మూత్రాఘాత్యుదరీ గుల్మీ దుర్వమో త్యగ్నిరర్శసః. ౫
ఉదావర్తభ్రమాష్ఠీలా పార్శ్వరుగ్వాతరోగిణః,

గర్భిణి, రూక్షమైన శరీరముకలవాడు, ఆకలిగలవాడు, ఎల్లపుడుదుఃఖించువాడు, బాలురు, వృద్ధులు, కృశులు, స్థూలురు, హృద్రోగము ఉరఃక్షతము గలవారు, దుర్బలులు తమంతనే వమనము చేయుచుండువారు, ప్లీహము, తిమిరము, కోష్ఠమున క్రిములు వ్యాపించి యున్నవాడును, శరీరమునం దూర్ధ్వభాగమున వాతరోగములును రక్తమునకు సంబంధించిన రోగములు కలవారును, వస్తికర్మ చేయించుకొనినవారును, సర్వదోషము, మూత్రాఘాతము, ఉదరరోగము, గుల్మరోగము, అర్శస్సు, ఉదావర్తము, భ్రమ, అష్ఠీలా, పార్శ్వరోగము, వాతరోగము అను నీరోగములు గలవారు, మిక్కుటముగ అగ్నిదీపనము గలవారు, అతికష్టముమీఁద వమనము చేయువారు, వీరలు వమనకర్మ యందనర్హులు.

అట్లగుటచే వమనకర్మవలన గర్భిణికి గర్భభ్రంశము కలుగును. ఆకలి గలవానికి బలక్షయము కలుగును. బాలురు మొదలగు వారలు ఔషధబలమును సహింపనేరరు కావున వారికి బలహానికలుగును. హృద్రోగముగలవారికి హృదయమునకు చెరుపుగలుగును. వాంతి చేయుచుండు వానికి ఉదానవాయువు ఊర్ధ్వభాగమును జెంది ప్రాణములనుకూడ హింసించును. వమనకర్మ కనర్హులగు నితరరోగులకు వమనము చేయించినయెడల రోగములు కలుగు నని పై జెప్పిన ప్రకారమే ఊహించుకొనవలయును.

విషాది సంబంధమునందు వమనానుజ్ఞ

ఋతే విషగరాజీర్ణవిరుద్ధాభ్యవహారతః. ౬

విషసంబంధము, గరసంబంధము, అజీర్ణము, విరుద్ధాన్నభక్షణము ఇవి గలిగి యుండునపుడు తప్ప నితర కాలములయందు పై జెప్పిన బాలురు మొదలగు వారికి వమనకర్మ చేయింపఁజనదు. (అనగా పై జెప్పిన బాలాదులకు విషాది సంబంధము కలిగి యుండునపుడు మాత్రము అవశ్యముగ వమనము చేయింపవలయు నని భావము.)

ధూమపానాదికర్మ వర్జ్యులు

ప్రసక్తవమథోః పూర్వే ప్రాయేణామజ్వరేపి చ,
ధూమాంతైః కర్మభిర్వర్జ్యాస్సర్వైరేవ త్వజీర్ణినః. ౭

పైజెప్పిన గర్భిణిమొదలగు దుర్బలుల పర్యంతము చెప్పఁబడిన వమనోకందు రోగులకును జ్వరము పక్వము గాకుండువారికిని వమనము మాత్రమేగాక ధూమపానము వఱకుం గల కర్మలను ప్రాయికముగ జేయంజనదు. అజీర్ణరోగము కలవారికి వమనధూమపాక గండూషాదిక్రియ లన్నియుఁ నిషిద్ధములు.

ఇచ్చట ప్రాయేణ అనుటచేత ఎనిమిదిమాసముల గర్భము గలస్త్రీకి నిరూహవస్తియు అజీర్ణరోగ ప్రారంభదశయందు మాత్రము వమనము చేయింప దగునని యుఁ తంత్రకారునిచే ననుజ్ఞ యొసగబడినది.

వమనవిరేచనముల కర్హులు

విరేకసాధ్యా గుల్మార్శోవిస్ఫోటవ్యంగకామలాః,
జీర్ణజ్వరోదరగరచ్ఛర్దిప్లీహహాలీమకాః. ౮
విద్రధిస్తిమిరం కాచః స్యందః పక్వాశయవ్యథా,
యోనిశుక్రాశయా రోగాః కోష్ఠగాః క్రిమయో వ్రణాః. ౯
వాతాస్రమూర్ధ్వగం రక్తం మూత్రాఘాతశ్శకృద్గ్రహః,
వమ్యాశ్చ కుష్ఠమేహాద్యాః

గుల్మము, అర్శస్సు, విస్ఫోటము, వ్యంగము, కామల, జీర్ణజ్వరము, ఉదరరోగము, విషము, ఛర్ది, ప్లీహము, హాలీమకము, విద్రధి, తిమిరము, కాచము, నేత్రాభిష్యందము పక్వాశయమునందలి బాధ, యోనిరోగము, శుక్రరోగము, కోష్ఠరోగము, కృమిరోగము, వ్రణములు, వాతరక్తము, ఊర్ధ్వగతరక్తము, మూత్రాఘాతము, మలబంధము అను నీరోగములు గలవారును, వమనక్రియకు అర్హులనిచెప్పబడిన కుష్ఠమేహాది ఊర్ధ్వరోగపర్యంతము కలరోగములుగలవారును, విరేచనకర్మకు అర్హులుగ నుండెదరు. మరియు "వమ్యాశ్చ కుష్ఠమేహాద్యాః" అను సముచ్చయముచేత వమనవిధియందు చెప్పబడిన కుష్ఠము ప్రమేహము మొదలు ఊర్ధ్వరోగమువఱకుం గలరోగములయందు మాత్రము వమనవిరేచనములు రెండును విధింపబడినవి. ఇచ్చట గుల్మము మొదలు శకృద్గ్రహమువఱకు జెప్పబడిన రోగములయందు విరేచనము మాత్రము విధింపఁబడినది.

విరేచననిషిద్ధులు

న తు రేచ్యో నవజ్వరీ. ౧౦

అల్పాగ్న్యధోగపిత్తాస్రక్షతపాయ్వతిసారిణః,
సశల్యాస్థాపితక్రూరకోష్ఠాతిస్నిగ్ధశోషిణః ౧౧

నూతనజ్వరము, అల్పముగ నగ్నిదీపనము, అధోగత మయినపిత్తరక్తము. క్షతమైన (గాయము తగిలిన) గుదము. అతిసారము ఇవి గలవారు, శల్యముతోఁగూడియుండు వాడు, ఆస్థాపనము (అనగా నిరూహవస్తి) చేసికొనినవాడు, క్రూరమైన కోష్ఠము గలవాడు, అతిస్నిగ్ధుడు, క్షయరోగము గలవాడు, వీరల కెపుడును విరేచనకర్మ చేయింపఁ జనదు.

ఏల యనగా —నూతనజ్వరితునికి అపక్వమైన దోషములు వెలువడి వాతప్రకోపము గలుగును. అల్పముగ నగ్నిదీపనము గలవాడు దుర్బలుఁడుగ నుండుటచే నౌషధవేగమును సహింపనేరడు. అధోగత మైనరక్తపిత్తము గలవానికి అధికముగ విరేచనంబులై ప్రాణహానియు గలుగును. క్షతమైనగుదముగలవానికి ప్రాణహరమైన యుపద్రవములుకలుగును. శల్యముతో గూడియుండువానికి గాయమునందు వాతము ప్రవేశించి ప్రాణమును హరింపజేయును. నిరూహవస్తి చేయించుకొనినవాడు ఔషధవేగమును సహింప నేరడు. కాబట్టి వానికి బలహాని కలుగును. క్రూరమైన కోష్ఠముగలవానికి దోషములు బయలువెడలక హృదయశూల, గణుపులు బద్ధ లగుట, ఆనాహము, ఛర్ది, మూర్ఛ, బడలిక, మొదలగు నుపద్రవములు కలిగి ప్రాణహాని కలుగును. అతిస్నిగ్ధునికి అతియోగముగ నగును. (అనగా మిక్కుటముగా విరేచనము లగు నని భావము) క్షయరోగము గలవానికి ధాతువులు క్షయించియుండుటచే దేహనాశము కలుగును.

## వమనౌషధసేవనక్రమము

అథ సాధారణే కాలే స్నిగ్ధస్విన్నం యథావిధి,
శ్వో వమ్యముత్క్లిష్టకఫం మత్స్యమాషతిలాదిభిః. ౧౨
నిశాం సుప్తం సుజీర్ణాన్నం పూర్వాహ్ణే కృతమంగళమ్,
నిరన్నమీషత్ స్నిగ్ధం వా పేయయా పీతసర్పిషమ్. ౧౩
వృద్ధబాలాబలక్లీబభీరూన్ రోగానురోధతః,
ఆకంఠం పాయితాన్ మద్యం క్షీరమిక్షురసం రసమ్. ౧౪
యథావికారవిహితాం మధుసైంధవసంయుతామ్,
కోష్ఠం విభజ్య భైషజ్యమాత్రాం మంత్రాభిమంత్రితామ్. ౧౫
"బ్రహ్మదక్షాశ్విరుద్రేంద్రభూచంద్రార్కానిలానలాః,
ఋషయస్సౌషధిగ్రామాః భూతసంఘాశ్చ పాంతు వః. ౧౬

రసాయనమివ క్షీణానామమరాణామివామృతమ్,
సుధేవోత్తమనాగానాం భైషజ్యమిదమస్తు తే. ౧౭
ఓంనమో భగవతే భైషజ్యగురవే వైడూర్యప్రభరాజాయ
తథాగతాయార్హతే సమ్యక్సంబుద్ధాయ,తద్యథా. ఓం భైషజ్యే
భైషజ్యే మహాభైషజ్యే సముద్గతే స్వాహా."
ప్రాఙ్ముఖం పాయయేత్

పై జెప్పినప్రకారము వమనకర్మయొక్క యోగ్యాయోగ్యత్వముల తెలిసికొని సాధారణమైన శ్రావణాదికాలములో స్నేహస్వేదాధ్యాయములయందు చెప్పియుండు విధిప్రకారము స్నేహకర్మచే స్నిగ్ధుడుగ, స్వేదకర్మచే స్విన్నుడుగ, వమనకారి యగు మత్స్యములు, మినుములు, నువ్వులు మొదలగువానిచే స్వస్థానమునం దుండి వెలిపరచ బడిన కఫము గలవాడుగ, రాత్రియందు పూర్ణముగా నిద్రించినవాడుగ, బాగుగ జీర్ణ మయిన యాహారము గలవాడుగ, ప్రాతఃకాలమునందు దేవ, బ్రాహ్మణ, అగ్ని, గురు, వృద్ధ, పూజాస్వస్త్యయనాదుల జేసినవాడుగ, ఆహారరహితుడుగ నుండునట్టి వమనార్హ పురుషునికి రోగానుగుణముగా సిద్ధము చేయబడినదియును, మధుసైంధవ లవణములతో గూడినదియును, బ్రహ్మదక్షాశ్విరుద్రేత్యాదిమంత్రములచే నభిమంత్రించబడినదియు నగు వమనౌషధమాత్రను మృదు, మధ్య, క్రూరకోష్ఠభేదములను బాగుగ విచారించి ప్రాఙ్ముఖముగ (అనగా తూర్పుముఖముగ) రోగిని కూర్చుండబెట్టి పానము చేయించవల యును. మరియు వమనము చేయదగిన రోగి వృద్ధుడును, బాలుడును, కష్టమున కోర్వ జాలనివాడును, బలహీనుడును, భయపడు స్వభావము కలవాడును అయినచో వానికి మద్యమునైనను, పాల నైనను, చెరకురసము నైనను, మాంసరసము నైనను, తేనెతోడను సైంధవలవణముతోడను గూర్చి, పైజెప్పిన ద్రవములలో వానిరోగానుగుణముగ నొక దానిని ఆకంఠపూర్తిగ త్రాగించి పిదప పైజెప్పిన ప్రకారము వమనౌషధమును సేవింప నగును. అష్టాంగసంగ్రహమునగూడ నీవిషయ మిట్లు చెప్పబడినది.—

"భీరుకృశబాలసుకుమారత్వదోషానురోధేనాకంఠం పీత యూషేక్షుక్షీరమాంస రసమద్యతుషోదకయవాగూమండాన్యతమమ్."

శ్లేష్మాధిక్యమువలన మృదుకోష్ఠ మనియు, శ్లేష్మమధ్యమమువలన మధ్యకోష్ఠ మనియు, శ్లేష్మ హీనతవలన క్రూరకోష్ఠ మనియు నిటుల కోష్ఠస్వరూపభేదముల తెలిసికొనవలయును. మం త్రార్థము నిట్లెరుంగునది —

బ్రహ్మ, దక్షప్రజాపతి, అశ్వినీదేవతలు, రుద్రుడు, ఇంద్రుడు, భూదేవత, చం ద్రుడు, సూర్యుడు, వాయుదేవుడు, అగ్నిదేవుడు, దేవర్షి బ్రహ్మర్షులు, ఓషధిసమూహా

ములు, పాంచభౌతికసముదాయము, వీ రందరును నిన్ను కాపాడెదరుగాత! నే నొసంగు నీయౌషధము ఋషులకు రసాయనమును బోలియు, దేవతల కమృతమును బోలియు, ఉత్తములగు నాగులకు సుధ బోలియు, నీకు ఆరోగ్యబలముల గల్గించి యాయువును వృద్ధి నొందించుగాక !

ఈయర్థమును దెలుపు 'బ్రహ్మదక్షశ్వి మిన మస్తుతే' అను రెండుశ్లోకములను పఠించి "ఓం నమో తే స్వాహా"అను మంత్రముచే నభిమంత్రించి పైజెప్పిన విధ్యుక్త ప్రకారము రోగికి నౌషధము నొసంగవలె నని భావము.

వమనప్రతీక్షణము

పీతం ముహూర్త మనుపాలయేత్,

తన్మనాః

ఔషధమాత్రను పానము చేసియుండురోగి వమనమునుగురించి ముహూర్త కాలమువఱకు ప్రతీక్షింపవలయును.

వమనము చేయుక్రమము

జాతహృల్లాస ప్రసేకశ్ఛర్ద యేత్తతః. ౧౮

అంగులీభ్యామనాయస్తో నాలేనమృదునాథవా,

గలతాల్వరుజన్ వేగాన ప్రవృత్తాన్ ప్రవర్తయన్ ౧౯

ప్రవర్తయన్ ప్రవృత్తాంశ్చ జానుతుల్యాసనే స్థితః,

పిదప మోకాలంత పొడవుగల ఆసనమునందు కూరుచుండినవాడై హృల్లాసము (అనగా ఓకరించుట.) ఇవి గలిగినపుడు రెండువ్రేళ్లచేగాని, మృదువుగ నుండుసువర్చలా ఏరండాదినాళములచేగాని, కంఠము, నోటిలోపలి దౌడ, వీనియందు బాధ కలుగనీయ కుండునట్లు వమనవేగమును ప్రేరేపించి అపుడు గలుగునట్టి వమనవేగము నడ్డగింపక వమనము చేయవలయును.

వమనకాలోపచారము

ఉభే పార్శ్వే లలాటం చ వమతశ్చాస్య ధారయేత్. ౨౦

ప్రపీడయేత్తథా నాభిం పృష్ఠం చ ప్రతిలోమతః,

వమనము చేయుచుండునపుడు ఆ మనుజునియొక్క రెండు పార్శ్వములను, లలాటమును పరిచారకులు పట్టుకొని పృష్ఠమును, నాభిని ప్రతిలోమముగ మర్దించు చుండవలయును.

కఫాదులయందు వమనక్రమము

కఫే తీక్ష్ణోష్ణకటుకైః పిత్తే స్వాదుహిమై రతి. ౨౧

వమేత్ * స్నిగ్ధామ్లలవణైః సంసృష్టే మరుతా కఫే,
పిత్తస్య దర్శనం యావచ్ఛేదో వా శ్లేష్మణో భవేత్. ౨౨

కఫమునందు తీక్ష్ణముగ, ఉష్ణముగ, కటువుగ నుండు ద్రవ్యములచేతను, పిత్తమునందు మధురముగ, శీతలముగ నుండు ద్రవ్యములచేతను, వాతయుక్త కఫమునందు స్నిగ్ధముగ, అమ్లముగ, లవణముగ నుండు ద్రవ్యములచేతను, పిత్తము బయలు వెడలు వఱకుగాని లేక కఫము నశించునవఱకుగాని వమనము చేయించవలయును.

హీనవేగమునందు ఔషధప్రయోగము

హీనవేగః కణాధాత్రీసిద్ధార్థలవణోదకైః,
వమేత్పునఃపునః

హీనవేగముగల పురుషుడు పిప్పళ్లు, ఉసిరికె పప్పు, తెల్లావాలు, సైంధవలవణము వీనితోగూడియుండు ఉదకపానముచే పలుమారు వమనము చేయవలయును.

వమనాయోగలక్షణము

తత్ర వేగానామప్రవర్తనమ్ ౨౩
ప్రవృత్తిస్సవిబంధా వా కేవలస్యౌషధస్య వా,
అయోగస్తేన నిష్ఠీవకండూకోఠజ్వరాదయః. ౨౪

వమనము చేయునపుడు వమనవేగము కలుగకుండుట, ప్రతిబంధకముతో వమనంబగుట దోషరహితముగ నౌషధము మాత్రము వమనం బగుట, ఇవి వమనకర్మయొక్క అయోగమనంబడును. దీనిచే నిష్ఠీవము, దురద, కోఠరోగము, జ్వరము ఈ మొదలగునవి కలుగును.

వమన సమ్యగ్యోగలక్షణము

నిర్విబంధం ప్రవర్తంతే కఫపిత్తానిలాః క్రమాత్.
సమ్యగ్యోగే

కఫపిత్తవాతములు యథాక్రమముగ నడ్డము లేక బైలువెడలుట వమనకర్మయొక్క సమ్యగ్యోగ మనబడును.

వమనకర్మాతియోగలక్షణము

అతియోగే తు ఫేనచంద్రకరక్తవత్. ౨౫
వమితం క్షామతా దాహః కంఠశోషస్తమో భ్రమః,
ఘోరా వాయ్వామయా మృత్యుః జీవశోణితనిర్గమాత్. ౨౬

* స్నిగ్ధోష్ణ ఇతి పా.

నురుగు, చంద్రకము (అనగా నెమలిపురికన్నులవలె గుండ్రముగ మండలము లగుపడుట), రక్తము, వీనియుక్తముగ వమనం బగుట, శరీరదౌర్బల్యము, తాపము, కుత్తుకద్రవము లేకయుండుట, చీకటి గ్రమ్మినట్లుండుట, ఒడలు తిరుగుట, క్రూరమైన వాత రోగము, జీవరక్తము బయలు వెడలుటవలన మరణము, ఇవి కల్గినచో వమనకర్మయొక్క అతియోగ మనబడును.

### వమనానంతరకర్తవ్యము

సమ్యగ్యోగేన వమితం క్షణమాశ్వాస్య పాయయేత్,
ధూమత్రయస్యాన్యతమం స్నేహాచారమథాదిశేత్. ౨౭

సమ్యగ్యోగముగ వమనంబై యుండగా వమనము చేసినవానిని వైద్యుడొక ముహూర్తకాలము శీతవాతాదులచే నోదార్చి స్నిగ్ధ, మధ్య, తీక్ష్ణ మను పేర్లుగల ధూమత్రయములలో దేనినైన నొకదానిని పానము చేయించి పిదప స్నేహవిషయమై చెప్పియుండు "ఉష్ణోదకోపచారీ స్యాదిత్యాది" విధుల ననుష్ఠించునటుల నుపదేశింప వలయును.

### వమనానంతరము పేయాదిక్రమము

తతస్సాయం ప్రభాతే వా క్షుద్వాన్ స్నాతః సుఖాంబునా,
భుంజానో రక్తశాల్యన్నం భజేత్పేయాదికం క్రమమ్. ౨౮

పిదప వమనము చేసినవాడు అపరాహ్ణమునగాని పూర్వాహ్ణమునగాని ఆకలి గలిగినపుడు ఉష్ణోదకములో స్నానము చేసి ఎఱ్ఱ రాజనాలయొక్క అన్నమును భుజించి పేయాదిక్రమము ననుష్ఠింపవలయును.

"పురాణరక్తశాలీనా మస్నేహలవణోషణం"

స్నేహము, లవణము, ఉప్పుకారమును జేర్పక ప్రాత ఎఱ్ఱరాజనాలయొక్క అన్నమును భుజించవలయు నని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడి యున్నది.

### పేయాదిక్రమస్వరూపము

పేయాం విలేపీమకృతం కృతం చ
యూషం రసం త్రీనుభయం తథైకమ్,
క్రమేణ సేవేత నరోఽన్నకాలాన్
ప్రధానమధ్యావరశుద్ధిశుద్ధః. ౨౯

ఉత్కృష్టశుద్ధి, మధ్యమశుద్ధి, అధమశుద్ధి అనువానిచే శుద్ధుడైనమనుజుడు పేయాదులను 3 అన్నకాలములయందును, 2 అన్నకాలములయందును, ఒక అన్నకాల మునందును యథాక్రమముగా సేవింపవలయును. అనగా ఉత్కృష్టశుద్ధిచే శుద్ధుడైన

మనుజుడు ప్రథమదివసమున రెండుఅన్నకాలములయందు పేయను సేవింపవలయును. ద్వితీయదివసమున ఒక అన్నకాలమునందును. తృతీయదివసమున రెండుఅన్నకాలముల యందును విలేపిని సేవింపవలయును. చతుర్థదివసమున రెండు అన్నకాలములయందును, పంచమదివసమున మొదటి అన్నకాలమునందును ఇటుల మూడుఅన్నకాలములయందు అకృతమైన (అనగా శొంఠి లవణము మొదలగు వానిచే సంస్కరింపబడని) యూష మును సేవింపవలయును. ఇటులనే మూడు అన్నకాలములను విభజన జేసి కృతాకృతరసములను సేవింపవలయును 7 దినములు గతించిన పిదప క్రమముగ స్వాభావికమైన భోజనమును సేవింపవలయును. ఇటులనే మధ్యమశుద్ధిచే శుద్ధు డైనవానికిని, అధమశుద్ధిచే శుద్ధు డైనవానికిని యథాక్రమముగ పేయాదిక్రమము నూహించుకొనవలయు నని భావము

"విరేకే వమనే శ్రేష్ఠే పేయాదీనాం త్రికక్రమః,
త్రిశో ద్విశో మధ్యమే స్యాదేకశస్తు కనీయసీమ్ "

అని పైయర్థమునే ఖరనాదుడుకూడ చెప్పియున్నాడు

పేయాదిక్రమమును చరకాచార్యు లిట్లుపదేశించిరి —

"అథైనం సాయాహ్నే అపరే వాహ్ని సుఖోదకపరిషిక్తం పురాణానాం లోహితశాలితండులానాం స్వవక్లిన్నాం మండపూర్వాముష్ణాం యవాగూం పాయయే దగ్ని బలమభిసమీక్ష్య. ఏవం ద్వితీయే తృతీయే వాన్నకాలే. చతుర్థేతు తథావిధానా మేవ శాలీనాంసుస్విన్నాం విలేపీముష్ణోదకద్వితీయా మస్నేహలవణామల్పస్నేహలవణాం వా భోజయేత్. ఏవం పంచమే షష్ఠే చాన్నకాలే, సప్తమే త్వన్నకాలే తథావిధా నామేవ శాలీనాం ద్విప్రసృతం సుస్విన్నమోదనముష్ణోదకానుపానం తనునా తను స్నేహలవణోపపన్నేన ముద్గయూషేణ భోజయేత్. ఏవమష్టమే నవమేఽన్నకాలే, దశమే త్వన్నకాలే లావకపింజలాదీనామన్యతమస్య మాంసస్య రసేన దకలావణికేన నాతిసారవతా భోజయేదుష్ణోదకానుపానమ్ ఏవమేకాదశే ద్వాదశే వాన్నకాలే, అత ఊర్ధ్వమన్నగుణాన్ క్రమేణోపయుంజానస్సప్తాహాత్ ప్రభృతి భోజన మాగచ్ఛేత్."

పిదప శుద్ధికర్మ చేసికొనినవాడు సాయంకాలమునందుగాని, మరుదినము ప్రాతఃకాలము నందుగాని ఉష్ణోదకములో స్నానము చేసి పురాతనమైన ఎఱ్ఱరాజనాలబియ్యముచే బాగుగ పాకము చేయబడినదియు మండముతో గూడి యుండునదియు, ఉష్ణమయినదియు నగుయవాగువును జాఠరాగ్నిబలానుగుణముగా పానము చేయవలయును. ఇటులనే 2-వ అన్నకాలమునందును, 3-వ అన్నకాలమునందును పానము చేయవలయును. 4-వ

అన్నకాలములో ప్రాతవియైన ఎఱ్ఱరాజనాలబియ్యముతోడ బాగుగ పాకము చేయ బడినదియు, ఉష్ణోదకముతో గూడినదియు నగువిలేపిని స్నేహలవణరహితముగ గాని, లేక స్వల్పస్నేహ లవణయుక్తముగ గాని భుజింపవలయును. ఇటులనే 5, 6 అన్న కాలములయందు భుజింపవలయును. 7-వ అన్నకాలమునందు ప్రాత ఎఱ్ఱరాజనాల బియ్యమును బాగుగ పాకముచేసి 2 మార్లు గంజివార్చి బాగుగ పక్వమైన యీ అన్న మును తేటగ, స్వల్పస్నేహ లవణయుక్తముగనుండు ముద్గయూషముతోడ ఉష్ణోదకాను పానసహితముగ భుజింపవలయును. ఇటులనే 8, 9 అన్నకాలములయందు భుజింప వలయును. 10-వ అన్నకాలములో మిగుల సారములేని లావకము, కపింజలము మొదలగు పక్షులలో నేదైన నొకదానియొక్క మాంసరసముతోడ ఎఱ్ఱరాజనాల యొక్క అన్నమును ఉష్ణోదకానుపానసహితముగా భుజించవలయును. ఇటులనే 11-వు, 12-వు అన్నకాలములయందును భుజింపవలయును అందుకుమీాద 7-వ దినము మొదలుకొని క్రమముగ స్వాభావికమైన భోజనమును భుజింపవలయును. అని చరకాచార్యుడు చెప్పియున్నాడు.

## పేయాదిక్రమసేవనప్రయోజనము

యథాఽణురగ్నిస్తృణగోమయాద్యైః సంధుక్షమాణో భవతిక్రమేణ,
మహాన్ స్థిరస్సర్వపచస్తదైవ శుద్ధస్య పేయాదిభిరంతరాగ్నిః. 30

మిక్కిలి కొంచెముగ నుండునిప్పు తోలుత గడ్డిపోచలచేతను, పిమ్మట పిడకలు మొదలగువానిచే క్రమముగ రాజబెట్టబడి అప్పటప్పటికి రాజి దృఢమై గొప్పవస్తువుల తగులబెట్ట సమర్థమగు తెరంగున శుద్ధుడుగ నుండు పురుషునియొక్క జార రాగ్నియు పేయాదులచే క్రమముగ గొప్పదిగ, దృఢముగనై సర్వమును పాకము జేయును.

## వమనవిరేకవేగసంఖ్య

జఘన్యమధ్యప్రవరే తు వేగాశ్చత్వార ఇష్టా వమనే షడష్టౌ,
దశైవ తే ద్విత్రిగుణా విరేకే ప్రస్థస్తథాస్యాద్విచతుర్గుణశ్చ. 31

అధమ, మధ్యమ, ఉత్తమమైన వమనమునందు యథాక్రమముగ 4, 6, 8 వేగములు తంత్రకారులకు అభిమతంబులు. అటులనే అధమ, మధ్యమ, ఉత్తమ విరే కమునందు యథాక్రమముగ 10-20-30-ది వేగములు తంత్రకారులకు అభిమతం బులు. ఆ వేగములయొక్క పరిమితి యథాక్రమముగ ప్రస్థము, 2 ప్రస్థములు, 4 ప్రస్థములు.

—॥ వమన విరేచన ప్రమాణము ॥—

పిత్తావసానం వమనం విరేకాదర్ధం కఫాంతం చ విరేకమాహుః,

పిత్తము బైలువెడలువరకు వమనము చేయించ వలయును, ఆవమనము విరేకమునం దర్ధభాగము గలదిగ నుండవలయు ననియును, కఫము బైలు వెడలువరకు విరేకము చేయించవలయు ననియును తంత్రకారులు చెప్పుచున్నారు.

—॥ విరేచన - వమన - గణనాప్రకారము ॥—

ద్విత్రాన్ సవిట్కానపనీయ వేగాన్ మేయం విరేకే వమనే తు పీతమ్

మలముతో గూడియుండు 2 లేక 3 వేగములను (అనగా మలోత్సర్జనములను) వదలి విరేచన సంఖ్యను గణనము చేయవలయును. అట్లులనే పానము చేయబడిన యౌషధముతోడ బైలువెడలిన వమనమును వదలి వమనమును గణనము చేయవలయును.

—॥ వమితునికి పునర్విరేచనము ॥—

అథైనం వామితం భూయః స్నేహస్వేదోపపాదితమ్,
శ్లేష్మకాలే గతే జ్ఞాత్వా కోష్ఠం సమ్యగ్విరేచయేత్.          ౩౩

పిదప వమనము చేయించబడిన పురుషునికి మరల స్నేహ స్వేదకర్మలను చేయించి మృదు, మధ్య, క్రూర, కోష్ఠభేదములను బాగుగ నెఱింగి శ్లేష్మకాలమును ("వయోఽహోరాత్రిభుక్తానాం తేఽన్తమధ్యాదిగాః క్రమాత్" అను వచనానుసారము కఫకాలమైన పగటి మొదటిభాగమును) వదలి బాగుగ విరేచనము చేయింపవలయును.

—॥ మృదుకోష్ఠస్వరూపము ॥—

బహుపిత్తో మృదుః కోష్ఠః క్షీరేణాపి విరేచ్యతే,

అధిక పిత్తముతోగూడియుండు కోష్ఠము మృదువుగ నుండును. అది క్షీరముచేత కూడ విరేచనం బగును. అపి శబ్దమువలన జేల మొదలగువానిచేకూడ విరేచనంబగు నని భావము.

—॥ క్రూర కోష్ఠస్వరూపము ॥—

ప్రభూతమారుతః క్రూరః కృచ్ఛ్రాచ్ఛ్యామాదికైరపి          ౩౪

అధిక వాతముతోగూడియుండు కోష్ఠము క్రూరముగ నుండును. అది నల్లతెగడ మొదలగువానిచే నతి ప్రయాసవలన విరేచనంబు లగును. ఆదిశబ్దమువలన కంకుష్ఠము, జెముడు మొదలగు వానివలనను, అపిశబ్దమువలన జేలమొదలగు వానివలనను విరేచనంబు లగు నని తాత్పర్యము.

పిత్తాదులయందు విరేచనౌషధక్రమము

కషాయమధురైః పిత్తే విరేకః కటుకైః కఫే,
స్నిగ్ధోష్ణలవణై ర్వాయౌ

పిత్తము ప్రకోపించినపుడు కషాయముగ, మధురముగ నుండు త్రేల మొదలగు వానిచే విరేచనము చేయించవలయును. కఫమునందు కటువుగ నుండు వస్తువులచే విరేచనము చేయించవలయును. వాతమునందు స్నిగ్ధముగ, అమ్లముగ, లవణముగ నుండు ఏరండ తైలాదులచే విరేచనము చేయించవలయును.

విరేచనము కాకుండునపుడు చేయతగిన యుపచారము

అప్రవృత్తౌ తు పాయయేత్. 3౫
ఉష్ణాంబు స్వేదయేదస్య పాణితాపేన చోదరమ్,

విరేచనౌషధమును సేవించినపుడు విరేచనము కాకుండు పక్షములో ఉష్ణోదకమును పానము చేయించవలయును. మఱియును రోగియొక్క ఉదరమునందు పాణితాపమువలన (అనగా అరచేతులను నిప్పులో కాచి వానియుష్ణమువలన) స్వేదముకూడ చేయించ వలయును.

స్వల్పముగ విరేచనములై యుండునపుడు చేయవలసిన క్రమము

ఉత్థానేఽల్పే దినే తస్మిన్ భుక్త్వాఽన్యేద్యుః పునః పిబేత్. 3౬
విరేచనమునకు ఔషధమును సేవించిన దినమునందు స్వల్పముగ విరేచనములై యుండిన యెడల ఆ దినము పథ్యముగ భోజనము చేసి మరుదినమునందు మరల విరేచనౌషధమును సేవింపవలయును

అదృఢస్నేహ కోష్ఠునికి విరేచన క్రమము

అదృఢస్నేహకోష్ఠస్తు పిబేదూర్ధ్వం దశాహతః,
భూయోఽప్యుపస్కృతతనుః స్వేదస్నేహైర్విరేచనమ్. 3౭
యౌగికం సమ్యగాలోచ్య స్మరన్ పూర్వమనుక్రమమ్,

కోష్ఠము స్నేహ కర్మముచే చక్కగ స్నిగ్ధము కాక దానం జేసి విరేచనములు కాకున్నయెడ అట్టి రోగికి మరల స్నేహస్వేదకర్మలచే స్నిగ్ధత్వమును సంపాదించి పది దినములు గడచిన పిదప,

'ఔషధమాత్రాం మంత్రాభి మంత్రితామ్"
అని పై జెప్పియుండు విధిప్రకారము యౌగికమైన విరేచనౌషధమును పానము చేయించ

వలయును. అటుల చేయించియు విరేచనము కాకుండినచో ఉష్ణాంబుపానమును పాణితాపస్వేదకర్మలను చేయించవలయును.

విరేకాయోగలక్షణము

హృత్కుక్ష్యశుద్ధిరరుచిరుత్క్లేశశ్శ్లేష్మపిత్తయోః ౩౮
కండూర్విదాహః పిటికా పీనసో వాతవిడ్గ్రహః,
అయోగలక్షణం

హృదయకుక్షులయందశుద్ధి, అరుచి, శ్లేష్మపిత్తయుక్తముగా ఉత్క్లేశము, దురద, శరీరమునందు తాపము, పిటిక, పీనసము, అపానవాతంబును మలంబును వెడలక బద్ధగించుట, ఇవి విరేచనముయొక్క అయోగలక్షణము లని తెలియవలయును.

విరేచన సమ్యగ్యోగలక్షణము

యోగో వైపరీత్యే యథోదితాత్. ౩౯

పై జెప్పినప్రకారము హృదయకుక్షులయం దశుద్ధి మొదలగునవి లేకుండుటయే విరేచనముయొక్క సమ్యగ్యోగలక్షణ మని తెలియవలయును.

విరేచన అతియోగలక్షణము

విట్పిత్తకఫవాతేషు నిస్సృతేషు క్రమాత్స్రవేత్.
నిశ్శ్లేష్మపిత్తముదకం శ్వేతం కృష్ణం సలోహితమ్. ౪౦
మాంసధావనతుల్యం వా మేదఃఖండాభమేవ వా,
గుదనిస్సరణం తృష్ణా భ్రమో నేత్రప్రవేశనమ్. ౪౧
భవంత్యతివిరిక్తస్య తథాతివమనామయాః,

మలము, పిత్తము, కఫము, వాతము ఇవి క్రమముగ బయలువెడలిన పిదప శ్లేష్మపిత్తసంబంధము లేక తెల్లగ, నల్లగ, కొంచెము రక్తయుక్తముగ గాని, లేక మాంసమును కడిగిన ఉదకముతో తుల్యముగ గాని లేక మేదస్సుయొక్క ఖండముతో తుల్యముగ నుండు ఉదకము బయలువెడలుట, మిక్కుటముగ దప్పి, భ్రమ గలిగి నేత్రములు లోని కేగుట, ఈలక్షణములు కలుగును. మరియు వమనాతియోగమున గల్గు 'వమితం క్షామతా దాహః' అని చెప్పిన కృశత్వము తాపము, కుత్తుక యెండుట, చీకటి గ్రమ్మినట్లు గాన రాకుండుట. భ్రమ మున్నగునుపద్రవములును అధికముగ విరేచనములైనవానికి కల్గును.

విరేచనానంతరకర్తవ్యము

సమ్యగ్విరిక్తమేనం చ వమనోక్తేన యోజయేత్. ౪౨
ధూమవర్జ్యేన విధినా, తతో వమితివానివ,
క్రమేణాన్నాని భుంజానో భజేత్ప్రకృతిభోజనమ్. ౪౩

బాగుగ విరేచనం బైయుండు పురుషునికి వమనకర్మయందు చెప్పియుండు విధులలో ధూమపానము తప్ప తక్కిన విధుల నన్నిటిని చేయించవలయును. పిదప వమనకర్మ చేయించుకొనినవానివలెనే పూర్వోక్తక్రమప్రకారము రక్తశాల్యన్నముతో గూడియుండు పేయాదులను భుజింపజేసి పిదప స్వాభావికమైన భోజనమును భుజింపజేయవలయును.

విరేచనౌషధసేవనమునందు లంఘనము

మందవహ్నిమసంశుద్ధ మక్షామం దోషదుర్బలమ్,
అదృష్టజీర్ణలింగం చ లంఘయేత్పీతభేషజమ్. ౪౪

విరేచనౌషధ సేవనానంతరము మందాగ్ని, అసంశుద్ధుడు (అనగా విరేచనము కానివాడు) అక్షాముడు (అనగా శరీరము బడలికను జెందనివాడు) దోషముచే దుర్బలుడు, విరేచనౌషధము జీర్ణము జెందక యుండుటంజేసి జీర్ణలక్షణము లగపడనివాడు ఈయైదుగురికిని లంఘనము చేయించవలయును.

లంఘనగుణము

స్నేహస్వేదౌషధోత్క్లేశసంగైరితి న బాధ్యతే,

ఇటుల లంఘనము జేయించినయెడల స్నేహము, స్వేదము, ఔషధము, ఉత్క్లేశము, మలబంధము వీనిచే పైజెప్పిన మందాగ్ని మొదలగు రోగములు గలవారు, బాధను జెందకుందురు.

పేయాదిసేవనమందు యుక్తి

సంశోధనాస్రవిస్రావస్నేహయోజనలంఘనైః. ౪౫
యాత్యగ్నిర్మందతాం తస్మాత్ క్రమం పేయాదిమాచరేత్,

బాగుగ శరీరశుద్ధి, రక్తమోక్షణము, స్నేహయోగము, లంఘనము, వీనిచే పురుషునియొక్క జారరాగ్ని మాంద్యమును జెందును. కాబట్టి పైజెప్పిన పేయాదిక్రమము ననుష్ఠింపవలయును. శుద్ధ్యాగులవలన అగ్నిమాంద్యము కలుగు నని యిచట జెప్పబడినది. "శుద్ధిః ప్రసాదమిత్యాది" శ్లోకమువలన శుద్ధిచే నగ్ని దీపనము కలుగు నని క్రింద జెప్పబడును. కాబట్టి నీ రెండు వచనములు పరస్పరవిరుద్ధము లనే శంక గలుగును. అయితే కాలభేదమువలన కోష్ఠశుద్ధి జేయునపుడు అగ్నిమాంద్యము కలుగును. కోష్ఠ శుద్ధ్యనంతరము పేయాదిక్రమము ననుసరించినయెడ అగ్నిదీపనము కలుగును. కావున నీరెండు వచనములకు పరస్పరవిరోధము లేదు.

పేయానిషేధము

స్రుతాల్పపిత్తశ్లేష్మాణాం మద్యపం వాతపైత్తికమ్. ౪౬
పేయాం న పాయయేత్తేషాం తర్పణాదిక్రమో హితః,

స్వల్పముగ బైలువెడలిన పిత్తశ్లేష్మము గలవాడు, మద్యపానము చేసినవాడు వాతపిత్త రోగము గలవాడు ఈ మువ్వురికిని పేయను పానము చేయింపంజనదు. అయినను వారలకు మొదటి యన్నకాలమునందు లాజసక్తువులును, రెండవ అన్నకాలము నందు మాంసరసోదకమును భుజించుట మొదలగునవి హితకరంబులు.

### వమనమునందు పాకప్రతీక్షానిషేధము

అపక్వం వమనం దోషాన్ పచ్యమానం విరేచనమ్, ౪౭
నిర్హరేద్వమనస్యాతః పాకం న ప్రతిపాలయేత్,

వమనము అపక్వముగ నుండినవై దోషములను వెలిపరచును. విరేచనము పాకమును జెందుచు దోషములను వెలిపరచును. కాబట్టి వమనౌషధమును సేవించినపుడు వమనముయొక్క పాకమును నిరీక్షింపం బనిలేదు —

"ఊర్ధ్వాధోరేచనం యుక్తం వైపరీత్యేన జాయతే,
యదా తదా ఛర్దయతః సించేదుష్ణేన వారిణా,
పాదౌ శీతేన చోర్ధ్వాంగం విపరీతం విరేచనే."

ప్రయోగింపబడిన ఊర్ధ్వవిరేచనము విపరీతముగ నైనయెడల (అనఁగా వమనౌషధముచే విరేచనంబు లైనయెడల) శీతోదకముచే పాదములను, ఉష్ణోదకముచే ఊర్ధ్వాంగములను తడుపవలయును. అధోవిరేచనము విపరీతముగనైనయెడల (అనఁగా విరేచనౌషధముచే వమనంబు లైనయెడల) ఉష్ణోదకముచే పాదములను, శీతోదకముచే ఊర్ధ్వాంగములను తడుపవలయును అని అష్టాంగసంహితలోఁ జెప్పఁబడియున్నది.

### దుర్బలోపచారక్రమము

దుర్బలో బహుదోషశ్చ దోషపాకేన యస్స్వయమ్, ౪౮
విరిచ్యతే భేదనీయైర్భోజ్యైస్తముపపాదయేత్,

దుర్బలుడుగను, అధిక దోషయుక్తుడుగనుండు మనుజుడు దోషపాకమువలన నౌషధము లేకయే విరేచనములఁ జేసికొనినచో అట్టివానికి భేదనీయములుగ నుండు భోజ్యభక్ష్యములచే నుపచరించవలయును.

### దుర్బలాదులకు విరేచనక్రమము

దుర్బలశ్శోధితః పూర్వమల్పదోషః కృశో నరః ౪౯
అపరిజ్ఞాతకోష్ఠశ్చ పిబేన్మృద్వల్పమౌషధమ్,
వరం తదసకృత్పీతమన్యథా సంశయావహమ్ ౫౦
హరేద్బహూంశ్చలాన్ దోషానల్పానల్పాన్ పునఃపునః,

దుర్బలుడు, శుద్ధిజేసికొనినవాడు, అల్పమైన దోషముగలవాడు, కృశుడు, తెలియబడని కోష్ఠభేదము గలవాడు వీరలు మృదువుగ, అల్పముగనుండు విరేచనౌషధ మును పానము జేయవలయును. పైజెప్పిన దుర్బలుడు మొదలగు వారలకు మృదువుగ, స్వల్పముగనుండు విరేచనౌషధమును పలుమారు పానము జేయించుట యుక్తము. అటు గాక అధికముగ, తీక్ష్ణముగనుండు విరేచనౌషధమును పానము జేయించినయెడల అతి ప్రాణసందేహమును గలుగజేయును. మృదువుగ అల్పముగను పలుమారు ప్రయోగింప బడిన విరేచనౌషధము అధికమైన దోషములను స్వల్ప స్వల్పముగ బైలుపరచి బలహీ నతను గలుగజేయకయే దోషములను శమింపజేయును.

దుర్బలునకు శోధనక్రమము

దుర్బలస్య మృదుద్రవ్యైరల్పాన్ సంశమయేత్తు తాన్. ౫౧
క్లేశయంతి చిరం తే హి హన్యురేనమనిర్హృతాః,

దుర్బలుడుగనుండు మనుజునియొక్క దోషములు స్వల్పముగ నుండునపుడే మృదుద్రవ్యములచే శమనము జేయవలయును. అటుల జేయక యుపేక్షించినచో చిర కాలముగ జేరియుండు నాదోషములు రోగిని చంపును.

మందాగ్న్యాదులయందు శోధనక్రమము

మందాగ్నిం క్రూరకోష్ఠం చ సక్షారలవణైర్ఘృతైః. ౫౨
సంధుక్షితాగ్నిం విజితకఫవాతం చ శోధయేత్,

మందాగ్నిగలవాడు, క్రూరకోష్ఠుడు వీరలకు క్షారలవణములతో గూడియుండు ఘృతములచే యథాక్రమముగ అగ్నిదీపనమును గలుగజేసి కఫమును పోగొట్టి శుద్ధి జేయించవలయును.

రూక్షబహ్వనిలక్రూరకోష్ఠవ్యాయామశీలినామ్. ౫౩
దీప్తాగ్నీనాం చ భైషజ్యమవిరేచ్యైవ జీర్యతి,
తేభ్యో వస్తిం పురా దద్యాత్తతః స్నిగ్ధం విరేచనమ్. ౫౪
శకృన్నిర్హృత్య వా కించిత్తీక్ష్ణాభిః ఫలవర్తిభిః,
ప్రవృత్తం హి మలం స్నిగ్ధో విరేకో నిర్హరేత్సుఖమ్ ౫౫

రూక్షుడు, ప్రబలమైనవాతముకలవాడు, క్రూరకోష్ఠుడు, వ్యాయామముచేయు వాడు, అగ్నిదీపనము గలవాడు, వీరలకు ప్రయోగింపబడు విరేచనౌషధము విరేచనము చేయించకయే జీర్ణమగును. కావున నట్టివారికి తొలుత వస్తికర్మను చేయించి పిదప ఏరండతైలము, బిందుఘృతము మొదలగు విరేచనౌషధములను ప్రయోగింపవలయును,

లేక తీక్ష్ణములగు ఫలవర్తులచే మలమును కొంచెముగ బైలుపరచి పిదప స్నిగ్ధమైన విరేచనౌషధము నొసంగవలయును. ఏలయనగా:—స్నిగ్ధమైన విరేచనౌషధము స్వల్పముగా బైలువెడలుచుండు మలమును సుఖముగా బైలుపరచును.

### విషాదిపీడితులకు శోధనక్రమము

విషాభిఘాతపిటికా కుష్ఠ *శోకవిసర్పిణః,
కామలాపాండుమేహార్తాన్నాతిస్నిగ్ధాన్ విరేచయేత్. ౫౬

విషము, అభిఘాతము, ప్రమేహ పిటిక, కుష్ఠము, శోకము, విసర్పి, కామల, పాండువు, మేహము వీనిచే పీడింపబడినవారికి కొంచెముగ స్నేహకర్మ జేయించి పిదప విరేచనము జేయింపవలయును.

సర్వాన్ స్నేహవిరేకైశ్చ రూక్షైస్తు స్నేహభావితాన్,

కొంచెము స్నిగ్ధులుగనుండు విషాదిపీడితులకు స్నేహవిరేకములవలన శుద్ధిచేయింపవలయును. స్నిగ్ధులుగ నుండుపురుషులకు రూక్షమైన విరేకములవలన శుద్ధిచేయింపవలయును.

### శోధనమునందు స్నేహస్వేద ప్రయోగక్రమము

కర్మణాం వమనాదీనాం పునరప్యంతరేఽంతరే. ౫౭
స్నేహస్వేదౌ ప్రయుంజీత స్నేహమంతే బలాయ చ,

వమనాదికర్మల జేయునపుడు నడుమ అప్పుడప్పుడు పలుమారు స్నేహస్వేదములను ప్రయోగింపవలయును. వమనాదికర్మలయొక్క అంతమునందు శరీరమునకు బలము గలుగుటకై స్నేహమును ప్రయోగింపవలయును. అది యెట్లనగా:—తొలుత స్నేహస్వేదములను, పిదప వమనమును, మరల స్నేహస్వేదములను, పిదప విరేచనమును, మరల స్నేహస్వేదములను, పిదప అనువాసనమును, మరల స్నేహస్వేదములను, పిదప నిరూహవస్తిని అని తెలియవలయును.

† మలో హి దేహాదుత్క్లేశ్య హ్రియతే వాససో యథా ౫౮
స్నేహస్వేదైస్తథోత్క్లేశ్య హ్రియతే శోధనైర్మలః,

బట్టలకు పట్టియుండు మురికిని నీళ్లయందు నానబెట్టి సడలించి పిమ్మట నుతికినయెడ శుభ్రమగునట్లు, మనుజుల శరీరములోని మలములు తొలుత స్నేహ

---

* శోఫ ఇతిపా.

† ఊష్మాదిభిర్యథోత్క్లేశ్య హ్రియతే వాససో మలః
తథైవ వపుషః స్నేహస్వేదమాషతిలాదిభిః. ఇతిపా. (ఈ పాఠము యుక్తము.)

స్వేదవిధులచే తమతమనెలవులనుండి పట్టువదలినపిదప వమన విరేచనాది శోధనముల ప్రయోగించినచో నామలములు బైలువెడలి శరీరము శుభ్రమగు నని భావము.

స్నేహస్వేదాఽనభ్యాసమునందు దోషము

స్నేహస్వేదావనభ్యస్య కుర్యాత్సంశోధనం తు యః. ౫౯
దారుశుష్కమివానామే శరీరం తస్య దీర్యతే,

స్నేహస్వేదములను పరిశీలింపక శోధనమును మాత్రము చేసికొనునట్టి మనుజునియొక్క శరీరము వంచబడిన యెండిన కాష్ఠము విరిగిపోవునట్లు చెడును.

శోధనఫలము

బుద్ధిప్రసాదం బలమింద్రియాణాం
ధాతుస్థిరత్వం జ్వలనస్య దీప్తిమ్,
చరాచ్చ పాకం వయసః కరోతి
సంశోధనం సమ్యగుపాస్యమానమ్. ౬౦

బాగుగ సేవింపబడిన సంశోధనము బుద్ధికి తెలివిని, ఇంద్రియములకు బలమును, ధాతువులకు స్థైర్యమును, అగ్నిదీప్తిని, చిరకాలానంతరము ముసలితనమును గలుగ జేయును.

అష్టాదశాధ్యాయము ముగిసెను

# ఏకోనవింశాధ్యాయము



పైయధ్యాయమున మలము వెడలించు నుపాయములగు వమనవిరేచనముల విధి చెప్పఁబడినది. వస్తికర్మయును వమనవిరేచనములబోలె మలముల వెడలించునది కావున వమనవిరేచనవిధానమును జెప్పినపిదప వస్తివిధానమును తెలుపునధ్యాయము చెప్పబడును. వస్తియన —"వస్తిభిర్దీయతే యస్మాత్తస్మాద్వస్తిరితి స్మృతః" అను వచన ప్రకారము నీరుమొదలగు ద్రవద్రవ్యములను ప్రయోగింపసాధనములగు చిమ్మనగ్రోవి మున్నగుగొట్టములు. అట్టి వస్తిచే ద్రవమును ప్రయోగించి చేయబడుచికిత్సారూపము గూడ వస్తి యనియే చెప్పబడును.

వస్తివిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతో వస్తివిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతి హ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

వమనవిధ్యనంతరము మలనిర్గమనోపాయంబైన వస్తికర్మను తెలియపరచునట్టి యమును వివరించెదము.

వాతాధిక్యదోషమునందు వస్తికర్మ

వాతోల్బణేషు దోషేషు వాతే వా వస్తిరిష్యతే,

వాతాధిక్యముగల దోషము లేక కేవలవాతము లేక వాతపిత్తము లేక వాత శ్లేష్మము వీనియందు వస్తికర్మ ఆచార్యులచే చికిత్సగ జెప్పబడియున్నది.

వస్తికర్మ త్రైవిధ్యము

ఉపక్రమాణాం సర్వేషాం సోఽగ్రణీస్త్రివిధశ్చ సః ౧
నిరూహోఽన్వాసనో వస్తిరుత్తరః

పలుతెరంగులైన చికిత్సలలో వస్తికర్మ మిగుల ప్రధానంబు. అది నిరూహము, అనువాసనము, ఉత్తరవస్తి అని త్రివిధంబుగ నుండును.

"కషాయక్షీరతైలైర్యో నిరూహస్స నిగద్యతే"

అనెడి ప్రమాణముచొప్పున కషాయములు, పాలు, తైలములు వీనిని చిమ్మనగ్రోవితో చిమ్ముట నిరూహవస్తి యనబడును.—

"యస్స్నేహైర్దీయతే స స్యాదనువాసననామకః"

అనెడి వచనమునుబట్టి ఘృతము, తైలము మొదలగు స్నేహములను చిమ్మనగ్రోవితో

చిమ్ముట అనువాసనవస్తి యనబడును. ఉత్తరమార్గమైన మేఢ్రాదుల మూలముగా ప్రయోగింపబడునది ఉత్తరవస్తి యనబడును.

## నిరూహవస్తి చికిత్సార్హులు

తేన సాధయేత్,
గుల్మానాహఖుడప్లీహశుద్ధాతీసారశూలినః. 2
జీర్ణజ్వరప్రతిశ్యాయశుక్రానిలమలగ్రహాన్,
వర్ధ్మాశ్మరీరజోనాశాన్ దారుణాంశ్చానిలామయాన్. 3

గుల్మము, ఆనాహము, ఖుడస్తంభము, ప్లీహము, శుద్ధాతిసారము, శూల, జీర్ణజ్వరము, పీనసము, రేతోబంధము, వాతగ్రహము (అనగా శరీరమునందు వాతము సంచరింపకుండుట) మలబంధము, వర్ధ్మ, అశ్మరీరోగము, స్త్రీలయొక్క పుష్పనాశము, దారుణమైన వాతవ్యాధి వీనిచే పీడితులుగనుండు రోగులకు నిరూహవస్తిచే చికిత్స చేయవలెను.

## నిరూహవస్తికర్మానర్హులు

అనాస్థాప్యాస్త్వతిస్నిగ్ధః క్షతోరస్కో భృశం కృశః,
ఆమాతిసారీ వమిమాన్ సంశుద్ధో దత్తనావనః. 4
కాసశ్వాసప్రమేహార్శోహిధ్మాధ్మానాల్ప *వర్చసః,
శూనపాయుః కృతాహారో బద్ధఛిద్రో దకోదరీ. 5
కుష్ఠీ చ మధుమేహీ చ మాసాన్ సప్త చ గర్భిణీ,

అతిస్నిగ్ధుడు, ఱొమ్మునందు గాయముగలవాడు, అతికృశుడు, ఆమాతీసార పీడితుడు, వమనము చేయువాడు, శుద్ధిచేయించుకొనినవాడు, నస్యకర్మ చేయించుకొనిన వాడు, కాసము, శ్వాసము, ప్రమేహము, అర్శస్సు, హిధ్మ, ఆధ్మానము, అను నీ రోగములుగలవాడు, అల్పమలముగలవాడు, గుదముగలవాడు, ఆహారముచేసినవాడు, వాచిన బద్ధోదరము, ఛిద్రోదరము, ఉదకోదరము అను నీరోగములుకలవాడు, కుష్ఠురోగి, మధుమేహముగలవాడు, ఏడుమాసములకు లోబడిన గర్భముకలస్త్రీ, వీరలకు నిరూహవస్తి చేయఁజనదు.

ఏలయనఁగా —నిరూహవస్తి అతిస్నిగ్ధునికి దోషములను స్వస్థానములోనుండి వెలుపరచి వాపును, ఉదరరోగమును గలుగజేయును. ఱొమ్మునందు గాయముగల వాడు, కృశించినవాడు, వీరలకు శీఘ్రముగ శరీరనాశమును గలుగజేయును. ఆమాతీ

* వర్చ్మాయః ఇతి పా.

సారముగలవానికి దోషములను బాగుగ శమింపజేయక శరీరమునకు మిక్కుటముగ బాధ గల్గించును. వమనము జేయువానికి దోషములను స్వస్థానములోనుండి వెలుపరచి ఊర్ధ్వభాగమునకు తీసికొనిపోయి చేర్చును. వమనవిరేచనములు చేయించుకొనినవానికి అసారముగనుండు దేహమును "క్షారము గాయమును దహింపజేయునట్లులనె" దహింప జేయును. నస్యకర్మ జేయించుకొనినవానికి ఊర్ధ్వస్రోతోమార్గములు తెరువబడియుం డుటచే ఆపత్తును గలుగజేయును. కాశము, శ్వాసము మొదలగు రోగములు గలవారికి దోషములు స్వస్థానములోనుండి బైలుపడియుండుటచే నాదోషములను ఊర్ధ్వభాగము నకు తీసికొనిపోయి చేర్చును. అర్శస్సు మొదలగురోగములుగలవారికి మరణమును గలుగ జేయును. అల్పమలము గలవారికి స్తబ్ధత్వమును, జడత్వము మొదలగువానిని గలుగ జేయును. గర్భిణికి గర్భనాశమును గలుగజేయును కావున పైజెప్పినవారికి నిరూహవస్తి జేయండగదనుట.

## అనువాసనవస్తికర్మకు అర్హులు

ఆస్థాప్యా ఏవ చాన్వాస్యా విశేషాదతివహ్నయః ౬
రూక్షాః కేవలవాతార్తాః

నిరూహవస్తికి అర్హులుగనుండువారలు అనువాసన వస్తికికూడ అర్హులుగ నుండె దరు. అధికముగ అగ్నిదీపనము గలవారు, రూక్షులు, కేవలవాతమువలన పీడింపబడిన వారు వీరలుకూడ విశేషముగా అనువాసన వస్తికర్మకు అర్హులుగ నుండెదరు.

## అనువాసనవస్తికి అనర్హులు

నానువాస్యాస్త ఏవ చ,
యేఽనాస్థాప్యాస్తథా పాండుకామలామేహపీనసాః. ౭
నిరన్నప్లీహవిట్ భేది గురుకోష్ఠకఫోదరాః,
అభిష్యంది *కృశస్థూలకృమికోష్ఠాఢ్యమారుతాః. ౮
పీతే విషే గరేఽపచ్యాం శ్లీపదీ గలగండవాన్,

నిరూహవస్తికి అనర్హులుగ నుండువారందరు అనువాసనవస్తికిహూడ అనర్హులు. అటులనే పాండువు, కామల, మేహము, పీనసము, అను నీరోగములు గలవాడు, ఆహార ములేనివాడు, ప్లీహము, మలము ఉండలుకట్టి యుండువాడు, క్రూరకోష్ఠము కలవాడు, కఫరోగము, ఉదరరోగము గలవారు, కృశుడు, స్థూలుడు, కృమికోష్ఠము, అఢ్యవా తముకలవారు, విషము, గరము వీనిని పానముచేసినవాడు, అపచి, శ్లీపదము, గల గండము, అనునీరోగములుగలవారు, వీరలందరు అనువాసన వస్తికర్మకు అనర్హులు. ఏల

* భృశ ఇతి పా.

అనగా:—అనువాసనవస్తి పైజెప్పిన పాండువు మొదలగు రోగములుగలవారికి దోషములను స్వస్థానములోనుండి బైలుపరచి ఉదరరోగమును గలుగజేయును.

"అభుక్తదత్తశ్చ తథా స్నేహో వస్తిర్విపద్యతే"

అనెడి ఖరనాదవచనముచొప్పున స్నేహవస్తి (అనగా అనువాసనవస్తి) భోజనము జేయనివానికి చెరుపును జేయును. ప్లీహము మొదలగు రోగములుగలవారికి స్తబ్ధత్వము, జడత్వము మొదలగురోగములను గలుగజేయును. కృమికోష్ఠముగలవానికి క్రిములు చిరకాలముగ సంచితమై కోష్ఠము నిండియుండుటవలన క్రిములు నిశ్శేషముగ బైలుపడక హృదయమునందు బాధను గలుగజేసి వమనముజేయించును. ఆఢ్యవాతముగలవానికి దోషములను బాగుగా బైలుపరచక ఆమవృద్ధిని గలుగజేయును కావున పైజెప్పినవారికి అనువాసనవస్తికర్మ జేయంజనదని భావము.

"అభుక్తే రిక్తకోష్ఠస్య ప్రయుక్తమనువాసనమ్,
సరదూర్ధ్వగసూక్ష్మత్వైః క్షిప్రమూర్ధ్వం ప్రపద్యతే,
తేనాప్యాయోర్జయో న స్యాత్ వాతధామన్యతిష్ఠతా.
కాయాగ్నిరాశు నాశశ్చ విశేషాదనివర్తితా,
స్నేహస్సద్యోఽశితాహారరుద్ధేత్వామాశయేఽనిలమ్.
పక్వస్థం హంతి పక్వస్థః చ్యవతే చాన్నపాకతః,
నిరూహశ్చ సమీరశ్చ తీక్ష్ణవేగావుభావపి.
తావన్నమూర్ఛితౌ తీక్ష్ణౌ అధోఽన్నేన సహాగతౌ,
ఊర్ధ్వం నా శకృతా సార్థం సంస్థితౌ కోష్ఠ ఏవ వా.
సమలాహారవిష్టబ్ధౌ హరేతామాశు జీవితమ్,
భుక్తవాననువాస్యోఽస్మాన్న నిరూహ్యో హ్యభుక్తవాన్."

ఆహారమును భుజింపక పరగడుపుననుండు పురుషునకు అనువాసనవస్తిని ప్రయోగించినచో నయ్యది సరంబును (వ్యాపించు స్వభావముకలది) ఊర్ధ్వగంబును (శరీరమునందూర్ధ్వభాగమున వ్యాపించునది) సూక్ష్మంబును (మిక్కిలి సూక్ష్మమైనది) అగుటంజేసి వాతస్థానమున నిలువక శరీరమునందూర్ధ్వభాగమునందతిశీఘ్రముగ వ్యాపించును. అనువాసనవస్తిచే ప్రయోగింపబడిన స్నేహౌషధము వాతస్థానమున నిలువకుండుటంజేసి ఆవస్తికర్మచేత వాతము శమింపదు. దానంజేసి కాయాగ్ని శీఘ్రముగ చల్లారును. కావున ఆహారమును భుజింపక పరగడుపునయుండువానికి అనువాసన వస్తి జేయంజనదు. (మితాహారము జేసినవానికి జేయవలెనని యనుట).

మరియు భుజించినతోడనే నిరూహవస్తిని ప్రయోగించినచో, నట్టియాహారముచే నడ్డగింపబడి, ఆమాశయమున నున్నపుడు ఆమాశయముననుండు వాతము, పక్వాశయమునం దడ్డగింపబడినపుడు అందుండువాతము నశింపజేయును. పిదప నన్న పాకము వలన నిరూహవస్త్యౌషధంబును పక్వంబగును. పిదప నిరూహవస్తియు, వాతంబును మిక్కిలి తీక్ష్ణమైన వేగముకలది యగుటచే రెండును కలిసి పక్వముగాని యన్నముతో గూడి యధోమార్గముగనైనను, పురీషముతోగూడి యూర్ధ్వమార్గముగనైనను బైట వెడలును. లేక అట్టిమలముచేనైనను అపక్వమైన యాహారముచేనైనను అడ్డగింపబడి కోష్ఠమునందె నిలబడును పైజెప్పిన యూమువిధములైన యుపద్రవములచే మిక్కిలి బాధగల్గించి యానిరూహవాతములు రెండును అతిశీఘ్రముగ మరణము నొందించును. కాబట్టి భుజించినవానికి నిరూహవస్తిప్రయోగము జేయంజనదు ఈవిషయము పైశ్లోకములచే అష్టాంగసంగ్రహమున జెప్పబడినవి.

## వస్తియంత్రలక్షణము

తయోస్తు నేత్రం హేమాదిధాతుదార్వస్థివేణుజమ్. ౯
గోపుచ్ఛాకారమిచ్ఛిద్రం శ్లక్ష్ణర్జు గుళికాముఖమ్,

నిరూహవస్తి, అనువాసనవస్తి వీనియం దుపయోగించు నేత్రము (అనగా యంత్రము) సువర్ణము, రజతము, ఇత్తడి, ఇనుము, కంచు, తగరము, సీసము: ఈ మొదలగు ధాతువులు, ఇరుగుడు మొదలగుమ్రాను, ఏనుగు మొదలగుజంతువులయొక్క అస్థులు, వెదురు వీనిలో దేనిచేనైన చేయబడినదిగను, ఆవుతోకతో సమానమైన యాకారముగలదిగను, సందులేకుండునదిగను, నునుపుగలదిగను, వంకరలేనిదిగను, గుళికకు (అనగా ఉంటకు)సమానమై గుండ్రనైన ముఖముగలదిగ నుండవలయును.

"నీయతే ప్రాప్యతే స్నేహకల్కాది అనేనేతి నేత్రం" అనువ్యుత్పత్తిచేత స్నేహాదుల గుదమునుండి ప్రవేశపెట్టుటకు సాధనము నేత్రమని యెరుంగునది.

## వస్తియంత్రప్రమాణము

ఊనేఽబ్దే పంచ పూర్ణేఽస్మిన్నాసప్తభ్యోఽంగులాని షట్. ౧౦
సప్తమే సప్త తాన్యష్టౌ ద్వాదశే షోడశే నవ,
ద్వాదశైవ పరం వింశాత్

నేత్రము (అనగా చిమ్మనగ్రోవి) 1 సంవత్సరమునకు కొంచెముతక్కువ వయస్సు గలవానికి రోగియొక్క అంగుళముచేనైదు అంగుళముల ప్రమాణము నిడుపుగలదిగనుండవలయును. 1 సంవత్సరము పూర్ణమైనపిదప 7-వ సంవత్సరమువరకు రోగియొక్క 6 అంగుళముల ప్రమాణమునిడుపును, 7-వ సంవత్సరమున 7 అంగుళముల ప్రమా

ణము నిడుపును, 12-వ సంవత్సరమున 8 అంగుళముల ప్రమాణము నిడుపును, 16-వ సంవత్సరమున 9 అంగుళముల ప్రమాణము నిడుపును, 20-ది సంవత్సరములకు పైబడిన వారికి 12 అంగుళముల ప్రమాణము నిడుపుగలదై యుండవలయును. 12 అంగుళములకుపైన ప్రమాణము లేదని తెలియపరచునిమిత్తము "ద్వాదశైవ" అను ఏవకారము ప్రయోగింపబడినది.

## వయోబలానుగుణముగా వస్తియంత్రవృద్ధి

వీక్ష్య వర్షాంతరేషు చ, ౧౧
వయోబలశరీరాణి ప్రమాణమభివర్ధయేత్,

రోగియొక్క వయస్సును బలమును శరీరముయొక్క పరిస్థితిని పర్యాలోచనచే గమనించి, పైజెప్పినసంవత్సరముల మధ్యకాలమున వస్తియంత్రప్రమాణమును తదనుగుణముగ కల్పించి, పైజెప్పిన ప్రమాణమునకన్న వృద్ధిజేసికొనునది.

## వస్తియంత్రదైర్ఘ్యస్థౌల్యప్రమాణము

స్వాంగుష్ఠేన సమం మూలే స్థౌల్యేనాగ్రే కనిష్ఠయా. ౧౨

నేత్రము మూలభాగమునందు రోగియొక్క బొట్టనవ్రేలితో సమానమయిన స్థౌల్యము, అగ్రభాగమునందు చిటికెనవ్రేలితో సమానమయిన స్థౌల్యముగలదిగ నుండవలయును:—

"వస్తినేత్రమృజుశ్లక్ష్ణం సద్వృత్తం గుళికాముఖమ్,
భవేత్ గోపుచ్ఛసంస్థానం సుప్రవాహం త్రికర్ణికమ్.
యా త్రిభాగప్రణయనే మర్యాదా కర్ణికా భవేత్,
ద్వే కర్ణికే చోపరిష్టాత్ వస్త్యాధారేఽథవాంతరే.
స్వాంగుష్ఠకపరీణాహం మూలం నేత్రస్య శస్యతే,
మధ్యం త్వనామికాతుల్యమగ్రం తుల్యకనిష్ఠికమ్.
స్వేనాంగుళిప్రమాణేన దైర్ఘ్యం స్యాద్ద్వాదశాంగుళమ్,
కర్కంధుప్రవహచ్ఛిద్రం శ్రేష్ఠమన్యద్వ్యథావయః.
వింశద్ద్వాదశషడ్వర్షే ద్వాదశాష్టషడంగులమ్,
కర్కంధుక సతీనాగ్రముఖం ఛిద్రవహమ్."

వస్తిప్రయోగసాధనమయిన యంత్రము (అనగా చిమ్మనగొట్టము) ఋజువుగ, శుద్ధముగ, నునుపుగ, గుండ్రముగ, గుళికయొక్క ముఖముతో తుల్యమైన ముఖముగలదిగ ఆవుతోకతో సమానమయిన యాకారముగలదిగ, సుప్రవాహముగ (అనగా బాగుగా

నీరుపారతగిన ద్వారముగలదిగ), 3 కర్ణికలుగలదిగ నుండవలయును. వస్తిని 3 భాగములను చిమ్మన గ్రోవిలో ప్రయోగించు విషయములో కర్ణిక మూలభాగమునందు మర్యాదగా (అనగా కొనలో) నుండును. వస్తియొక్క అగ్రభాగమునందు 2 కర్ణికలును మూలమునందుగాని లేక మధ్యమునందుగాని 1 కర్ణికయు గలిగియుండవలయును. ఆ యంత్రముయొక్క మూలభాగము రోగియొక్క బొట్టనవ్రేలితో తుల్యమైన స్థౌల్యముగలదిగ, మధ్యభాగము దర్భవ్రేలితో తుల్యమైన స్థౌల్యముగలదిగ, అగ్రభాగము చిటికెనవ్రేలితో తుల్యమైన స్థౌల్యముగలదిగనుండుట ప్రశస్తము. మఱియు నా యంత్రముయొక్క నిడుపు రోగియొక్క అంగుళప్రమాణమువలన 12 అంగుళములుగలదిగ, రేగుగింజ లోన ప్రవేశింపతగిన ద్వారముగలదిగనుండుట శ్రేష్ఠంబు. ఈ యంత్రము వయస్సు కనుగుణముగను, 20-12-6 యీసంవత్సరములయందు యథాక్రమముగ 12-8-6 అంగుళముల ప్రమాణము నిడుపుగలదిగను, రేగుగింజ, సతీనము (బటానిగింజ) ఇవి ధారాళముగ జొరబడునంత విశాలమైనద్వారము గలదిగ నుండవలయునని ఖరనాదుఁడు చెప్పుచున్నాఁడు.

"షట్ద్వాదశాష్టాంగుళసమ్మితాని షడ్వింశతీద్వాదశవర్షజానామ్,
స్యుర్ముద్గకర్కంధుసతీనవాహీఛిద్రాణ్యపి హి తానిచైవ,
యథావయోంగుష్ఠకనిష్ఠికాభ్యాం మూలాగ్రయోః స్యాత్పరిణాహః."

వయోనుగుణముగా 6-20-12 వయస్సుగలవారలకు వస్తియొక్క యంత్రము 6-12-8 అంగుళము నిడుపుగలదిగ, రేగుగింజ, బటానిగింజ దూరునంతటి రంధ్రముగలదిగ, మూలభాగము, అగ్రభాగము వీనియందు క్రమముగా బొట్టనవ్రేలు చిటికెనవ్రేలు వీనితో సమానమైన స్థౌల్యముగలదిగ నుండవలయును అని చరకాచార్యుడు వస్తియంత్రప్రమాణమును చెప్పెను.

## వస్తియంత్రద్వారప్రమాణము

**పూర్ణేఽబ్దేఽంగులమాదాయ తదర్ధార్ధప్రవర్ధితమ్,**
**త్ర్యంగులం పరమం ఛిద్రం మూలేఽగ్రే వహతే తు యత్.**
**ముద్గం మాషం కలాయం చ క్లిన్నం కర్కంధుకం క్రమాత్,**

ఒక సంవత్సరము పూర్తియైనది మొదలుకొని 1 అంగుళప్రమాణముగలద్వారము, దానికిపై నాయా వయస్సుకు తగినటుల కాలుకాలు అంగుళమువంతున వృద్ధి చేయబడిన ప్రమాణముగల ద్వారము, కడకు మూడంగుళములకు మించని ప్రమాణముగలద్వారము వస్తియంత్రముయొక్క మూలభాగమునం దుండవలయును. అది యెట్లనగా.—మొదటి సంవత్సరము మొదలుకొని 6 సంవత్సరములు పూర్తియగువరకు

1 అంగుళప్రమాణము, 7-వ సంవత్సరము మొదలుకొని 11 సంవత్సరములు పూర్తి యగువరకు $1\frac{1}{4}$ అంగుళప్రమాణము, 12 సంవత్సరములు మొదలుకొని 16 సంవత్సరములవరకు $1\frac{1}{2}$ అంగుళప్రమాణము, 16-వ సంవత్సరములో $1\frac{3}{4}$ అంగుళప్రమాణము 17-వ సంవత్సరములో 2 అంగుళముల ప్రమాణము, 18-వ సంవత్సరములో $2\frac{1}{4}$ అంగుళ ప్రమాణము, 19-వ సంవత్సరములో $2\frac{1}{2}$ అంగుళప్రమాణము, 20-వ సంవత్సరములో $2\frac{3}{4}$ అంగుళప్రమాణము, 21-వ సంవత్సరములో 3 అంగుళముల ప్రమాణము యంత్రము యొక్క ద్వారమని క్రమముగ తెలియవలయును. ఇవి యంత్రద్వారములకు ఉత్కృష్టమైన ప్రమాణము.

1 సంవత్సరము పూర్తియైన 1 అంగుళప్రమాణము ద్వారమని చెప్పినందుచేతనే సంవత్సరమునకు లోబడియుండువారికి $\frac{1}{2}$ అంగుళప్రమాణము ద్వారమని స్వబుద్ధిచేత నూహించుకొనవలయును.

మఱియును యంత్రముయొక్క అగ్రమునందలి ద్వారము మొదటి సంవత్సరము మొదలుకొని క్రమముగా పెసలగింజ, ఉద్దిగింజ, బటానిగింజ, ఉడికినబటానిగింజ రేగుగింజ ఇవి దూరునంతటి విశాలముగలదిగ నుండవలయును. అనగా 1 సంవత్సరము మొదలుకొని 6 సంవత్సరములు పూర్తియగువరకు పెసలగింజ దూరునట్టి అగ్రద్వారము, 7 సంవత్సరములు మొదలుకొని 11 సంవత్సరములు పూర్తియగువరకు మినపగింజ దూరునట్టి అగ్రద్వారము, 12 సంవత్సరములు మొదలుకొని 15 సంవత్సరములకులోగా బటానిగింజదూరునట్టి అగ్రద్వారము, 16 సంవత్సరములు మొదలుకొని 20 సంవత్సరములవరకు ఉడికిన బటానిగింజ దూరునట్టి అగ్రద్వారము, 21-వ సంవత్సరము మొదలుకొని రేగుగింజ దూరునట్టి అగ్రద్వారము యంత్రమునకు కలిగియుండవలయునని భావము.

ఒక సంవత్సరమునకు లోబడినవానికి పెసలగింజదూరునట్టి ప్రమాణముగల ద్వారము కల్పింపబడునను —"త్ర్యంగుళం పరమంఛిద్రం" అని చెప్పినందుచేతనే నేత్రము యొక్క స్థౌల్యదైర్ఘ్యప్రమాణములను వైద్యుడు స్వబుద్ధిచే కల్పించుకొనవలయునని భావంబగుచున్నది. మూలాగ్రద్వారప్రమాణములను చెప్పినందుచే వాని కనుగుణముగా స్థౌల్యదైర్ఘ్యములను సులభముగా కల్పించుకొనదగునని యోచించి తంత్రకారుడు గ్రంథవిస్తరభయముచే నిచట జెప్పక విరమించెను.

## వస్తియంత్రకర్ణికా నిర్మాణక్రమము

**మూలఛిద్రప్రమాణేన ప్రాంతే ఘటితకర్ణికమ్.** ౧౮

వర్త్యాగ్రే పిహితం మూలే యథాస్వం ద్వ్యంగుళాంతరమ్,
కర్ణికాద్వితయం నేత్రే కుర్యాత్

మూలభాగమునందుండు రంధ్రమునకు తుల్యమయిన ప్రమాణము అగ్రభాగమునందు, గుదమునం దధికముగా లోనికి ప్రవేశింపక యడ్డముగ నుండుటకై ఛత్రాకారమైన కర్ణికగలదిగ, అగ్రభాగమునందు వర్తిచే మూయబడినదిగ, మూలభాగమునందు యథాక్రమముగా (అనగా 1 సంవత్సరము మొదలగువయస్సు కనుగుణముగా) వానివానియంగుళ ప్రమాణమువలన 2 అంగుళములుపవలి 2 కర్ణికలు గలదిగ నేత్రము నిర్మింపవలయును.

### వస్తియంత్రాగ్రమునందు అజాదివస్తి సంయోజనము

తత్ర చ యోజయేత్. ౧౪
అజావిమహిషాదీనాం వస్తిం సుమృదితం దృఢమ్,
కషాయరక్తం నిశ్ఛిద్రగ్రంథిగంధశిరం తనుమ్ ౧౫
గ్రంథితం సాధుసూత్రేణ సుఖసంస్థాప్య భేషజమ్,

బాగుగ మర్దనము చేయబడినదిగను, దృఢముగను, కరక్కాయ మొదలగు కషాయ (వగరుకల) ద్రవ్యములచే రక్తవర్ణముగలదిగను, ఛిద్రము, గ్రంథి, గంధము, సిరలు ఇవిలేనిదిగను, సూక్ష్మముగను సూత్రములచే బాగుగ కట్టబడినదిగను, ప్రయాస లేకయే ఔషధము నుంచతగినదిగనుండు మేకపోతు, ఆడుమేక, దున్నపోతు మొదలగు వాని వస్తిని (అనగా మూత్రపుతిత్తిని) యంత్రముయొక్క 2 కర్ణికలయందు జేర్పవలయును. "అజాదీనాం" అని చెప్పినందుచేతనే ఆడుమేక, దున్నపోతు ఇవి గ్రాహ్యం బగుచుండినను ఇతరజంతువులయొక్క వస్తికంటె మేకపోతు ఆడుమేక, దున్నపోతు వీనియొక్కవస్తి వస్తికర్మయందు మిగుల నుత్కృష్టమైనదని తెలియపరచు నిమిత్తము "అజావి మహిషాదీనాం" అని ప్రత్యేకముగ జెప్పబడినది. ఆది శబ్దమువలన ఆవు ఇఱ్ఱి, పంది, దున్నపోతు మొదలగువాని వస్తువులనుకూడ గ్రహించుకొనవలయును.

### అజాదివస్త్యభావమునందు ఛాగాద్యవయవసంయోగము

వస్త్యభావేఽంకపాదం వా న్యసేద్వాసోఽథవా ఘనమ్. ౧౬

పై జెప్పిన మేకపోతు మొదలగువానియొక్క వస్తి లభించనియెడల అంకపాదము (అనగా మేకపోతు నల్లయిఱ్ఱి మొదలగు జంతువులయొక్క అవయవవిశేషమును) యంత్ర కర్ణికలయందు జేర్చవలయును. లేక దట్టముగనుండు పట్టునైన చుట్టవలయును.

నిరూహవస్తి కషాయప్రమాణము ౹౹

నిరూహమాత్రా ప్రథమే ప్రకుంచో వత్సరాత్పరమ్,
ప్రకుంచవృద్ధిః ప్రత్యబ్దం యావత్ షట్ ప్రసృతాస్తతః. ౧౮
ప్రసృతం వర్ధయేదూర్ధ్వం ద్వాదశాష్టాదశస్య చ,
ఆసప్తతేరిదం మానం దశైవ ప్రసృతాః పరమ్. ౧౯

మొదటి సంవత్సరమునందు కషాయము, స్నేహము వీనితోగూడియుండు నిరూహవస్తియొక్క ప్రమాణము ప్రకుంచము. (అనగా ఒక పలము.) (ఇటుల జెప్పినందుచే నొక్క సంవత్సరమునకు తగ్గిన 6 మాసములు మొదలగు కాలములయందు పైజెప్పిన వచనము ననుసరించి $\frac{1}{2}$ పలము $\frac{3}{4}$ పలము ప్రమాణ మని స్వబుద్ధిచే నూహించుకొనవలయు నని భావంబగుచున్నది.) 1 సంవత్సరమునకు పైన 6 ప్రసృతములగువరకు (అనగా 12 పలము లగువరకు) ఒక్కొక ప్రకుంచముచొప్పున ప్రతి సంవత్సరమునందును వృద్ధిజేయుచుండవలయును. దానికిపైన ప్రతి సంవత్సరమునందును ఒక్కొక ప్రసృతముచొప్పున వృద్ధిజేయుచుండవలయును. 12 సంవత్సరములుగలవానికి 12 పలములు నిరూహవస్తియొక్క కషాయప్రమాణ మని తెలియవలయును. 13-వ సంవత్సరము మొదలుకొని 17 సంవత్సరములవరకు క్రమముగా ప్రతి సంవత్సరమునందును రెండు రెండు పలములచొప్పున నిరూహవస్తి కషాయప్రమాణమును వృద్ధిచేయుచుండవలయును. 18-వ సంవత్సరమునకు 12 ప్రసృతములు (అనగా 24 పలములు) నిరూహవస్తి కషాయప్రమాణము. ఈప్రమాణమును 70 సంవత్సరములవరకు నుపయోగించవలయును. 70 సంవత్సరములకుపైన నిరూహవస్తియొక్క ప్రమాణము 10 ప్రసృతములు. (అనగా 20 పలములు.) 70 సంవత్సరములకుపైన 20 పలములకుపైన నిరూహవస్తి కషాయప్రమాణమును వృద్ధి జేయంజనదు.

అనువాసనవస్తిప్రమాణము

యథాయథం నిరూహస్య పాదో మాత్రానువాసనే,

ఒక సంవత్సరముగలవానికిగాని లేక 21 సంవత్సరముల వయస్సుగలవాడు మొదలగువారికిగాని నిరూహవస్తిప్రమాణములు ఎంత చెప్పబడియున్నవో అందులో నాల్గవ భాగము యథాక్రమముగా అనువాసనవస్తిలో ప్రమాణ మని తెలియవలయును. అది యెట్లనగా.—ఒకపలము నిరూహవస్తి ప్రమాణముగలవానికి ఒక కర్ష ప్రమాణము (అనగా $\frac{1}{4}$ పలము) అనువాసనవస్తి ప్రమాణము. ఇటులనే వయస్సునకు తగినటుల అన్నిస్థలములయందును అనువాసనవస్తిప్రమాణము నూహించుకొనవలయును.

## అనువాసనవస్తి క్రమము

ఆస్థాప్యం స్నేహితం స్విన్నం శుద్ధం లబ్ధబలం పునః. ౨౦
అన్వాసనార్హం విజ్ఞాయ పూర్వమేవానువాసయేత్,
శీతే వసన్తే చ దివా రాత్రౌ కేచిత్తతోఽన్యదా ౨౧
అభ్యక్తస్నాతముచితాత్ పాదహీనం హితం లఘు,
అస్నిగ్ధరూక్షమశితం సానుపానం ద్రవాది చ ౨౨
కృతచంక్రమణం ముక్తవిణ్మూత్రం శయనే సుఖే,
నాత్యుచ్ఛ్రితే న చోచ్ఛీర్షే సంవిష్టం వామపార్శ్వతః ౨౩
సంకోచ్య దక్షిణం సక్థి ప్రసార్య చ తతో పరమ్,

నిరూహవస్తికి అర్హుడు, స్నిగ్ధుడు, స్విన్నుడు, ఊర్ధ్వాధోభాగములయందు వమనవిరేచనరూపమైన శుద్ధిని జేసికొని మరల బలమును జెందినవాడునగు పురుషుడే అనువాసనవస్తికర్మకు అర్హుడని తెలిసికొని వానికి పూర్వదినమునందు వైద్యుడు అభ్యంజనస్నానము చేయించి వాడు అభ్యాసముగ భుజించుదానికంటె కాలుభాగము తక్కువగ, పథ్యముగ, లఘువుగ, కొంచెము స్నిగ్ధముగ, రూక్షగ, అనుపానముతో గూడినదిగనుండు ద్రవాదిరూపమైన యాహారములను భుజింపజేసి కొంచెముగ సంచారము చేయించి మలమూత్రోత్సర్జనము చేయించి సుఖకరమైనదియును, మిగుల పొడవును పొట్టియునుగాక మితమైనయెత్తుకలిగి తలగడలేనిదిగనుండు శయనమునందు వామపార్శ్వముగా కుడితొడను ముడుచుకొని ఎడమతొడను ఊచుకొని ఒత్తగిలి పరుండియుండునటుల నాజ్ఞాపించి హేమంతము, శిశిరము, వసంతము, ఈఋతువులయందు మధ్యాహ్నకాలములో నిరూహవస్తికి ముందు అనువాసనవస్తిని చేయించవలయును హేమంత, శిశిర, వసంత, ఋతువులకంటె నితరమైన గ్రీష్మ, వర్ష. శరదృతువులలో రాత్రులయందు అనువాసనవస్తిని చేయించదగునని కొందరాచార్యులు వచించెదరు. ధన్వంతరి మతానుసారులు అన్ని ఋతువులయందును రాత్రులలో అనువాసనవస్తిజేయ నంగీకరించుటలేదు. కావుననే —

"న రాత్రౌ ప్రణయేత్ స్నేహం దోషోత్క్లేశోహి రాత్రిజః,
స్నేహో వీర్యయుతః కుర్యాదాధ్మానం గౌరవం జ్వరమ్."

అనగా దోషప్రకోపము రాత్రులయందు కలుగును. కాబట్టి రాత్రులయందు ప్రయోగింపబడిన స్నేహము వీర్యముతోగూడినదై ఆధ్మానము, గురుత్వము, జ్వరము వీనిని గలుగజేయునని ధన్వంతరిమతము ననుసరించి అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది. "ద్రవాదిచ" అను ఆదిశబ్దమువలన "ద్రవోష్ణమనభిష్యంది" అను వచనము చే పైజెప్పిన యాహారములను గ్రహించుకొనవలయును.

"అతిస్నిగ్ధాశినో పృథియమార్గాత్ స్నేహో మదమూర్ఛాఽగ్నిసాదహృల్లాసాదీన్ జనయతి, రూక్షాశినో విష్టంభబలవర్ణహానిం చ, 'అల్పమాత్రద్రవాశినో విసృష్టవిణ్మూత్రస్య వానావృతో న తదా పరణాద్వ్యాపదమితి."

అతిస్నిగ్ధమయిన యాహారము భుజించినవానికి ఉపయోగింపబడిన స్నేహవస్తి (అనగా అనువాసనవస్తి) మదము, మూర్ఛ, అగ్నిమాంద్యము, హృల్లాసము మొదలగునుపద్రవములను రూక్షగల యన్నము భుజించినవానికి మలబంధము, బలము, వర్ణము వీనికి హానిని గలుగజేయును స్వల్పప్రమాణముగలిగినట్టియు, ద్రవముగ నుండునట్టియు అన్నమును భుజించినవాడు, మలమూత్రములను విసర్జించినవాడు వీరలకు స్నేహవస్తి యేలాటి ఆపత్తును గలుగజేయనేరదు. అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది. "సంకోచ్య దక్షిణాం సక్థిం" అనుచో దక్షిణసక్థిని వామసక్థిపై నునుచుకొనవలయునని వృద్ధవైద్యులు అర్థము చేయుచున్నారు.

"శయనే నాభ్యుత్థితం స్వాస్తృతే ఈషదున్నతపాదదేశే వామపార్శ్వేన ప్రాక్ఛిరసం సంవేశయేత్."

మిగుల పొడవులేనిదియును, కొంచెము ఉన్నతమైన పాదప్రదేశముగలదియును, మంచిబట్టలచే పరపబడినదియునైన శయనమునందు వామపార్శ్వముగా తూర్పుతల నునుచుకొని యుండునటుల పరుండబెట్టవలయునని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

### అనువాసనవస్తి ప్రయోగక్రమము

అథాస్య నేత్రం ప్రణయేత్స్నిగ్ధే స్నిగ్ధముఖం గుదే ౨౪
ఉచ్ఛ్వాస్య వస్తే* ర్వదనే బద్ధే హస్తమకంపయన్,
పృష్ఠవంశం ప్రతి తతో నాతిద్రుతవిలంబితమ్. ౨౫
నాతివేగం న వా మందం సకృదేవ ప్రపీడయేత్,

వస్తి యొక్క ముఖములో ఉచ్ఛ్వాసవాతము పూరణము చేసి బైలుపడకుండునటుల బంధించి స్నిగ్ధమయిన ముఖముగల యంత్రమును పైజెప్పిన ప్రకారము పరుండియుండు రోగియొక్క స్నిగ్ధమయిన గుదప్రదేశములో నతిత్వరపడక నతివిళంబము చేయక యునిచి అతివేగము అతిమందము లేక పృష్ఠవంశమున (వెన్నెముక) కభిముఖముగా ఒకటే పర్యాయము హస్తమును కదలింపక ప్రయోగింపవలయును.

---

* ర్వదనం బద్ధ్వా ఇతి పా.

సావశేషం చ కుర్వీత వాయుః శేషే హి తిష్ఠతి. ౨౬

స్నేహము కొంచెము మిగిలి యున్నచో వాతమున నిలిచి యుండును. కాబట్టి స్నేహమును (అనగా అనువాసనవస్తిని) సావశేషముగా ప్రయోగింపవలయును.

అధికస్నేహవస్తిప్రయోగికర్తవ్యము

దత్తే తూత్తానదేహస్య పాణినా తాడయేత్స్ఫిజౌ,
తత్పార్ష్ణిభ్యాం తథా శయ్యాం పాదతశ్చ త్రిరుత్క్షిపేత్. ౨౭

స్నేహవస్తి నధికముగా ప్రయోగించి యుండునపుడు వెల్లకిల పరుండి యుండు రోగియొక్క స్ఫిక్కు ప్రదేశములను (తుంట్లను) హస్తములచే తాడనము చేయవలయును. అదే ప్రకారము వాని గుదికాల్లరెంటిచే తుంట్లను తాకించవలెను. పిదప కాలిప్రక్క శయ్యను మూడుపర్యాయములు పైకెత్తవలెను.

తతః ప్రసారితాంగస్య సోపధానస్య పార్ష్ణికే,
ఆహన్యాన్ముష్టినాంగం చ స్నేహేనాభ్యజ్య మర్దయేత్. ౨౮
వేదనార్తమితి స్నేహో న హి శీఘ్రం నివర్తతే.
యోజ్యశ్శీఘ్రం నివృత్తేఽన్యః స్నేహోఽతిష్ఠన్న కార్యకృత్. ౨౯

పిమ్మట చాచబడిన శరీరము కలవాడును, తలగడతో కూడియున్నవాడునగు రోగి యొక్క తుంట్లపై పిడికిలిచే గుద్దవలెను. మఱియు నారోగి వేదనవలన మిగుల పీడితుడుగ నుండుటవలనను, స్నేహము శీఘ్రముగ నివర్తించకుండుటవలనను, వానియంగమునందు తైలాదిస్నేహములచే నభ్యంజనము చేయించి మర్దించవలయును. స్నేహము శీఘ్రముగ నివర్తించినచో స్నేహకర్మయొక్క ఫలమును కలుగజేయనేరదు. కావున మరల స్నేహప్రయోగము చేయవలయును.

స్నేహవస్త్యనంతరము లఘుభోజనము

దీప్తాగ్నిం త్వగతస్నేహం సాయాహ్నే భోజయేల్లఘు,

అగ్నిదీపనము గలపురుషునికి స్నేహము బైలువెడలి యుండునపుడు సాయంకాలమునందు లఘువైన యాహారమును భుజింపజేయవలయును.

స్నేహాకర్షణకాలము

నివృత్తికాలః పరమస్త్రయో యామాస్తతః పరమ్. ౩౦
అహోరాత్రముపేక్షేత పరతః ఫలవర్తిభిః,
తీక్ష్ణైర్వా వస్తిభిః కుర్యాద్యత్నం స్నేహనివృత్తయే. ౩౧

స్నేహముయొక్క పరమమైన (అనగా ఉత్కృష్టమైన) నివృత్తికాలము మూడు యామములు. దానికిపైని ఒక అహోరాత్రము నుపేక్షించవలయును. (అనగా నాస్నేహము నాకర్షించుటకై ఒక అహోరాత్రమువరకు యత్నము చేయంజనదని భావము) ఒకఅహోరాత్రమునకుపైన అర్శచికిత్సితాధ్యాయములో జెప్పబడియుండు ఫలవర్తులచేగాని, వస్తికల్పములో జెప్పబడు తీక్ష్ణమైన వస్తులచేగాని, స్నేహాకర్షణమును గురించి యత్నించవలయును.

స్నేహము బైలువెడలకుండునపుడు శుంఠీధాన్యాంబుపానము

అతిరౌక్ష్యాదనాగచ్ఛన్న చేజ్జాడ్యాదిదోషకృత్,
ఉపేక్ష్యైవ హి తతోఽభ్యుషితశ్చ నిశాం పిబేత్. 32
ప్రాతర్నాగరధాన్యాంభః కోష్ణం కేవలమేవ వా,

మిక్కిలి రూక్షంబగుటచే బైలువెడలకుండునట్టి స్నేహము జడత్వము, అగ్నిమాంద్యము మొదలగు దోషములను చేయకుండినచో దాని నుపేక్షించవచ్చును. (అనగా బయలుపరుపకూడదని భావము.) పిదప నొకరాత్రియంతయు నిరాహారముగ నుండి మరుదినముయొక్క ప్రాతఃకాలమునందు శుంఠి, దనియాలు వీనిని జేర్చి కాచబడిన సుఖోష్ణమైన ఉదకమునుగాని, శుంఠి, దనియాలు వీనిజేర్చక కాచబడిన ఉష్ణోదకమును గాని పానము చేయవలయును.

తృతీయపంచమాదిదివసములయందు అనువాసనవస్తిక్రమము

అన్వాసయేత్తృతీయేఽహ్ని పంచమే వా పునశ్చ తమ్ 33
యథా వా స్నేహపక్తిః స్యాదతోఽత్యుల్బణమారుతాన్,
వ్యాయామనిత్యాన్ దీప్తాగ్నీన్ రూక్షాంశ్చ ప్రతివాసరమ్

ఆరోగికి మరల 3-వ దినమునగాని లేక 5-వ దినమునగాని అనువాసనవస్తి చేయించవలయును. లేక రోగియొక్క అగ్నిబలము ననుసరించి స్నేహపాకము కలుగునటుల 2-వ దినమునందు కూడ అనువాసనవస్తి చేయించవలయును. మఱియు వాతాధిక్యము వ్యాయామము చేయునట్టి స్వభావము, విశేషముగ నగ్నిదీపనము, రూక్షగుణము ఇవి గలవారలకు ప్రత్యహము అనువాసనవస్తినే చేయించవలయును.

ఇతి స్నేహైస్త్రిచతురైః స్నిగ్ధే స్రోతోవిశుద్ధయే,
నిరూహం శోధనం యుంజ్యాదస్నిగ్ధే స్నేహనం తనోః. 35

ఈప్రకారము మూడు లేక నాల్గు అనువాసనవస్తులవలన రోగి స్నిగ్ధుడై యుం

డగా స్రోతోవిశోధనార్థమై శోధనకరమైన నిరూహవస్తిని ప్రయోగించవలయును. రోగి స్నిగ్ధుడు కానియెడల మరల శరీరమునకు స్నేహకర్మను చేయవలయును.

## నిరూహవస్తిప్రయోగము

పంచమేఽథ తృతీయే వా దివసే సాధకే శుభే,
మధ్యాహ్నే కించిదావృత్తే ప్రయుక్తే బలిమంగలే. ౩౬.
అభ్యక్తస్వేదితోత్సృష్ట మలం నాతిబుభుక్షితమ్,
అవేక్ష్య పురుషం దోష భేషజాదీని చాదరాత్.
వస్తిం ప్రకల్పయేద్వైద్యస్తద్విద్యైర్బహుభిస్సహ,

పిదప అనువాసనవస్తినిచేసిన మూడవదినమునందుగాని లేక ఐదవ దినమునందు గాని మధ్యాహ్నము కొంచెము వాలినపిదప శుభకరమైన దినమునందు బలిపూజాది కర్మలను సలిపి అభ్యంజన స్వేదకర్మలం జేసికొనినవాడును, మలమూత్రాదులను విసర్జించినవాడును, మిక్కిలి ఆకలి లేనివాడును నగురోగియొక్క ప్రకృతి, దోషము, ఔషధము, సాత్మ్యము, బలము మొదలగువానిని బాగుగా నాలోచించి "నిరూహమాత్రాప్రథమే" అని పైజెప్పియుండుప్రకారము వయస్సు కనుగుణమైన నిరూహవస్తి ప్రమాణమును తెలిసికొని వైద్యశాస్త్రమునందు నిపుణులుగ నుండునట్టి యనేక వైద్యులతో నాలోచించి నిరూహవస్తిని కల్పించి మిక్కిలి ప్రయత్నముతో నిరూహవస్తిని ప్రయోగింపవలయును

## నిరూహవస్తికల్పనము

క్వాథయేద్వింశతిపలం ద్రవ్యస్యాష్టౌ ఫలాని చ. ౩౭

వస్తికల్పములో నిరూహవస్తికై చెప్పబడియుండు ఇరువదిపలముల ప్రమాణము గల ద్రవ్యములను, ఎనిమిది మ్రంగకాయలను పదునారు భాగము లధికముగ నుండు జలములోజేర్చి నాల్గవపాలు మిగులునట్లు క చవలయును.

## వాతాదులయందు నిరూహవస్తి స్నేహప్రమాణము

తతః క్వాథాచ్చతుర్థాంశం స్నేహం వాతే ప్రకల్పయేత్,
పిత్తే స్వస్థే చ షష్ఠాంశమ ష్టమాంశం కఫాధికే. ౩౮

వాతాధిక్యముగల పురుషుని విషయమై పైజెప్పబడినప్రకారము చేయబడిన కషాయమునకు 4-వ భాగము స్నేహమును చేర్చవలయును. (అనగా నిరూహవస్తి యొక్క కషాయ ప్రమాణము 12 ప్రసృతములు. అనగా 24 పలములు. దానిలో స్నేహము 6 పలములు చేర్చవలయు నని భావము. (పిత్తాధిక్యముగల పురుషునియందును)

దును, స్వస్థుడుగనుండు పురుషునియందును పైజెప్పిన క్వాథములో 6 వ భాగము (అనగా ½ పలములు) స్నేహమును చేర్చవలయును. కఫాధిక్యముగల పురుషునియందును పై జెప్పిన క్వాథములో అష్టమాంశము (అనగా 3 పలములు) స్నేహమును చేర్చవలయును. వాతపిత్తకఫములు మూడు సధికముగ నుండునపుడును, స్వస్థముగ నుండునపుడును అష్టమాంశము (అనగా 3 పలములు) స్నేహముచు చేర్చవలయును.

"యో హి సంచాలయేత్ సుప్తం వనే సింహం కరాదిభిః,
సదోషాంశ్చాలయేత్ స్వస్థాన్ ప్రచ్ఛర్దనవిరేచనైః."

ప్రకోపము లేక స్వస్థముగనుండు వాతాదిదోషములను వమనవిరేచనములచే చలింప చేయుట, వనమునందు నిద్రించుచుండు సింహమును హస్తాదులచే తాడనము చేసి మేల్కొలుపుట అపాయకరము. కావున వాతాదులు స్వస్థముగ నుండునపుడు వమన విరేచనాదులను చేయించకూడ దని యితరతంత్రకారులు నిషేధించి యున్నారు. అట్లుండగా స్వస్థునికి నిరూహవస్తిని మూలశ్లోకమునందు చెప్పియుండుట అసంగత మనేశంక గలుగును. అయితే "శీతోద్భవం దోషచయంవసంతే" అని ఋతుచర్యాధ్యాయమునందు స్వస్థునికికూడ వమనవిరేచనాదులను ఈతంత్రకారుడు చెప్పి యున్నాడు. అట్లగుటచే పైజెప్పిన "యోహిసంచాలయే" దిత్యాదివచనము శిష్టవ్యవహారవిరుద్ధం బగుటచే నీతంత్రకారునికి అనభిమత మని భావము.

సర్వత్ర చాష్టమం భాగం కల్కాద్భవతి వా యథా,
నాత్యచ్ఛసాంద్రతా వస్తేః

వాతపిత్తకఫములు మూటియందును కల్కద్రవములో నెనిమిదవపాలు (అనగా మూడుపలములు) స్నేహములు చేర్చవలయును. వస్తి మిగుల లేటగ, ఘనముగ నుండునటుల కల్కమును సిద్ధము చేయవలయును.

నిరూహవస్తి ద్రవ్యసమ్మేళనక్రమము

పలమాత్రం గుడస్య చ. ౪౦
మధుపట్వాదిశేషం చ యుక్త్యా

ఆకల్కమునందు ఒకపలప్రమాణము బెల్లమును, తేనె, పటు (అనగా లవణము) మొదలగుశేషద్రవ్యములను, యుక్తిచే జేర్చుకొనవలయును. అది యెట్లనగా — మాక్షికము నాల్గుపలములు, సైంధవలవణము ఒక కర్షప్రమాణము; అటులనే కొన్నిచోట్ల యవక్షారము ఒక కర్షప్రమాణము అనితెలియవలయును. "పట్వాది" అను ఆది శబ్దమువలన మాంసరసము, సుర, ఆసవము, మూత్రము, క్షీరము, కాంజికము అనువానిని గ్రహించుకొనవలయును.

## నిరూహవస్తిప్రయోగక్రమము

సర్వం తదేకతః,
ఉష్ణాంబుకుంభీబాష్పేణ తప్తం ఖజసమాహతమ్. ౪౧
ప్రక్షిప్య వస్తౌ ప్రణయేత్పాయౌ నాత్యుష్ణశీతలమ్,
నాతిస్నిగ్ధం న వా రూక్షం నాతితీక్ష్ణం న వా మృదు. ౪౨
నాత్యచ్ఛసాంద్రం నోనాతి మాత్రం నాపటు నాతిచ,
లవణం తద్వదమ్లం చ

పైజెప్పియుండు సమస్తద్రవ్యముల నొకపాత్రలో జేర్చి ఔషధపాకాధిక్యపరిహారార్థమై ఉష్ణోదకముతో గూడియుండు కుంభముయొక్క యావిరివలన పాత్రమందలి ద్రవ్యములను వెచ్చజేసి కవ్వముచే బాగుగ కలియబెట్టి పైయధ్యాయములో జెప్పబడిన బ్రహ్మదక్షేత్యాది మంత్రముచే నభిమంత్రించి మిక్కిలి యుష్ణంబును వేడిని కాక సమశీతోష్ణంబును, మిక్కిలి స్నిగ్ధంబును రూక్షంబును గాక కొంచెముస్నిగ్ధంబును, మిక్కిలి తీక్ష్ణంబును మృదువునుగాక సమస్థితినుం డునదియు మిక్కిలి పలుచనయు చిక్కనయు లేక కొంచెము ద్రవంబును హీనాధికప్రమాణము గాక మితమైన ప్రమాణము కల్గినదియు, లవణంబును పులుపును అధికము గాక మితముగ నుండునదియునైన పైజెప్పిన యౌషధమును వస్తిలో జేర్చి గుదములందు ప్రయోగింపవలయును.

## మతాంతరమున నిరూహవస్తిద్రవ్యసంయోగక్రమము

పఠన్త్యన్యే తు తద్విదః ౪౩
మాత్రాం త్రిపలికాం కుర్యాత్ స్నేహమాక్షికయోః పృథక్,
కర్షార్ధం మాణిమంథస్య స్వస్థే కల్కపలద్వయమ్. ౪౪
సర్వద్రవాణాం శేషాణాం పలాని దశ కల్పయేత్,
మాక్షికం లవణం స్నేహం కల్కం క్వాథమితి క్రమాత్. ౪౫
ఆవపేత నిరూహాణామేష సంయోజనే విధిః,

స్నేహద్రవమును, తేనెను ప్రత్యేకముగ 3 పలములు, మాణిమంథము (అనగా సైంధవలవణము) $\frac{1}{2}$ కర్షప్రమాణము, స్వస్థునికి కల్కము 2 పలములు, తక్కిన ద్రవద్రవ్యము లన్నియు పదిపలములును జేర్పవలెనని వస్తికర్మవిశారదులగు కొందరాచార్యులు చెప్పిరి. ఒకభాండములో మాక్షికమును తొలుత వేసి మర్దనముచేసి పిదప దానిలో లవణమును వేసి బాగుగ మర్దించి మిశ్రమము చేయవలయును. పిదప స్నేహమును, దానికి తర్వాత కల్కమును, దానికి తర్వాత క్వాథమును ఇటుల క్రమముగ మిశ్రమము చేయ

వలయును. ఇటుల మిశ్రమము చేయబడిన ద్రవ్యములు సమరసములుగలవిగ నగును. ద్రవ్యములకు సమరసములు గలిగినచో నిరూహవస్తికి సమ్యగ్యోగము కలుగును. నిరూహవస్తి ద్రవ్యములైన మాక్షికాదులయొక్క మిశ్రమమునందును నిదియే విధి యని తెలియవలయును

## నిరూహవస్తిప్రయోగానంతరకర్తవ్యము

ఉత్తానే దత్తమాత్రే తు నిరూహే తన్మనా భవేత్. ౪౬
కృతోపధానస్సంజాతే వేగశ్చోత్కటకః సృజేత్,

నిరూహవస్తి ప్రయోగించుబడినతోడనే వెలికిల పరుండి తలగడమీద నాను కొని నిరూహ వేగమునందు మిగుల గమనము గలవాడై యుండవలయును. నిరూహ వేగము కలుగునపుడు ఉన్నతస్థలమునుండి నిరాటంకముగా వదలవలయును.

## వేగాభావమునందు మరల నిరూహవస్తిక్రమము

ఆగతౌ పరమః కాలో ముహూర్తో మృత్యవే పరమ్.
తత్రానులోమికం స్నేహక్షారమూత్రామ్లకల్పితమ్,
త్వరితం స్నిగ్ధతీక్ష్ణోష్ణం వస్తిమన్యం ప్రపీడయేత్. ౪౭
విదధ్యాత్ఫలవర్తిం వా స్వేదనోత్రాసనాది చ,

నిరూహవస్తిద్రవము బైటవెడలుటకు కాలము ఒకముహూర్తము. దానికి పైబడి కాలహరణమైనచో మరణము నొందించును. నిరూహవస్తిఔషధము ఒకముహూర్తమునకుపైన బైలువెడలకుండుపక్షములో అనులోమకరమయినట్టియు, స్నేహము, యవక్షారము, గోమూత్రము, తక్రము, కాంజికము మొదలగు అమ్లద్రవ్యములచే సిద్ధము చేయబడినట్టియు, స్నిగ్ధముగ తీక్ష్ణముగ ఉష్ణముగ నుండునదియునైన వేరే నిరూహవస్తిని త్వరగా ప్రయోగించవలయును. లేక అర్శఃచికిత్సితాధ్యాయములో జెప్పియుండు మ్రాగకాయతో గూడినఫలవర్తినైన ప్రయోగింపవలయును. మఱియును స్వేదకర్మ, భయపరచుట వీనినికూడ చేయవలయును.

## ద్వితీయ తృతీయాది నిరూహవస్తిప్రయోగములు

స్వయమేవ నివృత్తే తు ద్వితీయో వస్తిరిష్యతే. ౪౮
తృతీయోఽపి చతుర్థోఽపి యావద్వా సునిరూఢతా,

ఫలవర్తిప్రయోగము మొదలగు శ్రమ లేకయే స్వయముగా నిరూహవస్తి బైలుపడినయెడల 2, 3, లేక 4 పర్యాయములుగాని, లేక శరీరమునందు బాగుగ నిరూఢత్వము గలుగువరకుగాని నిరూహవస్తిని ప్రయోగించవలయును. ఇటుల జెప్పుటచే

తొలుత ప్రయోగింపబడిన నిరూహవస్తి వలవత్తి ప్రయోగముచే ఁగు ప్రవాహ సమువలన బైలువెడలునపుడు మఱియొకనిరూహవస్తిని ప్రయోగింపవలెనని వాక్యంబగు చున్నది.

### నిరూహవస్తి సమ్యగ్యోగలక్షణము

**విరిక్తవచ్చ యోగాదీన్ విద్యాత్**

నిరూహవస్తియొక్క సమ్యగ్యోగాదులను విరిక్తునివలెనే తెలియవలయును. విరిక్తునియొక్క సమ్యగ్యోగాదులు వమనవిరేకాధ్యాయమునందు "హృత్కుక్షిశుద్ధిః" అనువచనము మొదలుకొని "భవంత్యతి విరిక్తస్యతథాతిపమనాదయః" అను వచనము వరకు జెప్పబడి యున్నది.

### నిరూహవస్తి సమ్యగ్యోగమునందు పథ్యము

**యోగే తు భోజయేత్.** ౫౦

**కోష్ణేన వారిణా స్నాతం తనుధన్వరసౌదనమ్,**

నిరూహవస్తియొక్క సమ్యగ్యోగము కలిగి యుండునపుడు రోగిని సుఖోష్ణమైన యుదకములో స్నానము చేయించి లఘువైన జాంగలమాంసరసము, అన్నము వీనిని భుజింపజేయవలయును. "యూషః క్షీరరసైః క్రమాత్" అనగా యూషము, క్షీరము, మాంసరసము అనునవి పథ్యకరము లని ఉత్తరత్ర జెప్పబడుటచే నిచట జాంగల మాంసరసము, అన్నము వీనిని భుజింపజేయవలయు నని చెప్పినది అసంగత మనుశంక కలుగును. అయితే ప్రాయశః నిరూహవస్తి వాతవికారశమనార్థమే చెప్పబడియున్నది. దానియందు మాంసరసము అన్నము ఇవియే ఉత్కృష్టమైన పథ్యము, కాబట్టి క్రింద జెప్పబడు యూషక్షీరాదులు అయాదోషానుగుణముగ జెప్పబడిన వగుటవలన ప్రకృతమునం దెట్టి విరోధమును లేదు.

దోషశుద్ధి వమనవిరేచనములవలన ద్రవరూపమైనవస్తువులచే జేయించబడు నపుడు పేయాదిక్రమము పథ్యముగ నగునటుల నిరూహవస్తియందును పేయాదిక్రమమే పథ్యముగ కావచ్చు నని చెప్పుట యుక్తము కాదు. ఏలయనగా — విరేకవమనములచే జాఠరాగ్ని స్థానము మూయబడుచున్నది. దానివలన నగ్నిమాంద్యము కలుగును. కాబట్టి వమనవిరేకములయందు పేయాదిక్రమము పథ్యముగ జెప్పబడినది. నిరూహవస్తి యైననో నాభియొక్క ఊర్ధ్వభాగమును జెందకయే దోషములను బయలుపరచును. కాబట్టి యీనిరూహవస్తియందు అగ్నిమాంద్యము కలుగుటలేదు. దానం జేసియే యిచట పేయాదిక్రమము పథ్యము కానేరదు. మఱియు నిరూహవస్తి వాతవికారశమనార్థము చెప్పబడియుండుటవలన నిచట మాంసరసౌదనమే యుక్తమైన పథ్యము.

వికారా యే నిరూహస్య భవంతి ప్రచలైర్మలైః. ౫౧
తే సుఖోష్ణాంబుసిక్తస్య యాంతి భుక్తవతశ్శమమ్,

నిరూహవస్తియందు స్వస్థానమునం దుండి చలించియుండు వాతాదిదోషములచే గలుగువికారములు సుఖోష్ణమైన ఉదకములో స్నానము చేసి భుజించినవానికి శాంతి జెందును. కాబట్టి నిరూహవస్తి చేయించుకొనినవాడు సమ్యగ్యోగము కలిగియుండునపుడు సుఖోష్ణోదకముతో స్నానముచేసి భుజించుట యావశ్యకము.

## నిరూహానంతరము అనువాసనవస్తి

అథ వాతార్దితం భూయస్సద్య ఏవానువాసయేత్. ౫౨

నిరూహవస్త్యనంతరము వాతపీడితుడుగ నుండుపురుషునికి ఆదినముననే అనువాసనవస్తి చేయించవలయును.

## అనువాసనవస్తి సమ్యగ్యోగాదులు

సమ్యక్ హీనాతియోగాశ్చ తస్య స్యుః స్నేహపీతవత్,

అనువాసనవస్తియొక్క సమ్యగ్యోగ, హీనయోగ, అతియోగములు, స్నేహపాన సమ్యగ్యోగాదులవలెనే యుండును. స్నేహపానముయొక్క సమ్యగ్యోగాదులు "వాతానులోమ్యం" అనుశ్లోకము మొదలుకొని "ఘ్రాణవక్త్రగుదస్రవాః" అనునంతవరకు పూర్వమే చెప్పబడి యున్నది.

## ప్రకారాంతరానువాసనవస్తి సమ్యగ్యోగము

కించిత్కాలం స్థితో యశ్చ సపురీషో నివర్తతే. ౫౩
సానులోమానిలః స్నేహస్తత్సిద్ధమనువాసనమ్,

స్వల్పకాలమువరకు కోష్ఠమధ్యములో నుండి పిదప పురీషము, అనులోమవాతము, వీనితోకూడ స్నేహము బయలుపడుట సిద్ధమైన (అనగా రోగనివృత్తి కరమైన) అనువాసన మని తెలియవలయును.

## శ్లేష్మాదిరోగములయందు అనువాసనవస్తిప్రయోగక్రమము

ఏకం త్రీన్ వా బలాసే తు స్నేహవస్తీన్ ప్రకల్పయేత్. ౫౪
పంచ వా సప్త వా పిత్తే నవైకాదశవానిలే,
పునస్తతోఽప్యయుగ్మాంస్తు పునరాస్థాపనం తతః ౫౫

శ్లేష్మరోగమునందు 1 లేక 3 అనువాసనవస్తులను చేయవలయును. పిత్తరోగమునగు 5 లేక 7 అనువాసనవస్తులను చేయవలయును. వాతరోగమునందు 9 లేక

11 అనువాసనవస్తులను చేయవలయును. తర్వాత దేశీయైన అనువాసనములను చేయవల యును. పిదప మరల నిరూహవస్తిని చేయవలయును. వాతపీడితునికి

"వ్యాయామనిత్యాన్ దీప్తాగ్నీన్ రూక్షాంశ్చ ప్రతివాసరమ్"

అని పూర్వము చెప్పిన వచనప్రకారము పైజెప్పినరీతిగ దినముమార్చి దినముగాక ప్రతి దినమునను అనువాసనవస్తులను చేయవలయును.

నిరూహవస్తియందు పథ్యము

కఫపిత్తానిలేష్వన్నం యూషక్షీరరసైః క్రమాత్,

శ్లేష్మము, పిత్తము, వాతము, ఈరోగములయందు నిరూహవస్తి చేయించుకొనిన వాడు యథాక్రమముగా యూషము, క్షీరము, మాంసరసము, వీనితోడ నన్నమును భుజించుట పథ్యకరంబు.

వాతమునందు నిరూహవస్తిక్రమము

వాతఘ్నౌషధనిఃక్వాథ స్త్రివృతా సైంధవైర్యుతః. ౪౬
వస్తిరేకోఽనిలే స్నిగ్ధః స్వాద్వమ్లోష్ణరసాన్వితః,

తెల్లతెగడ, సైంధవలవణము, వీనితోగూడినదిగ, స్నిగ్ధముగ, మధురామ్లలవణ రసయుక్తముగ నుండు వాతహరమైన ఔషధములు (అనగా దశమూలాదులు) వీని యొక్క కషాయముచే వాతమునందు ఒకనిరూహవస్తి చేయుట హితకరము.

పిత్తమునందు నిరూహవస్తిక్రమము

న్యగ్రోధాదిగణక్వాథౌ *పత్రకాదిసితాయుతౌ ౪౭
పిత్తే స్వాదుహిమౌ సాజ్యక్షీరేక్షురసమాక్షికౌ,

న్యగ్రోధాదిగణ కషాయము, పత్రకాదిగణ కషాయము, పంచదార, ఘృతము, క్షీరము, చెఱకురసము, మాక్షికము, వీనితోగూడియుండు 2 నిరూహవస్తులు పిత్తము నందు హితకరము.

కఫమునందు నిరూహవస్తిక్రమము

ఆరగ్వధాదినిఃక్వాథవత్సకాదియుతాస్త్రయః ౪౮
రూక్షాః సక్షౌద్రగోమూత్రాస్తీక్ష్ణోష్ణకటుకాః కఫే,

ఆరగ్వధాది గణకషాయము, వత్సకాది గణకషాయము, మాక్షికము, గోమూత్రము, వీనితోగూడినదిగ, రూక్షముగ, తీక్ష్ణముగ, ఉష్ణముగ, కటువుగ నుండు మూడు నిరూహవస్తులు కఫమునందు హితకరములు.

---

* భద్రకాది ఇతిపా.

## సన్నిపాతమునందు వస్తిక్రమము

త్రయశ్చ సన్నిపాతేఽపి దోషాన్ ఘ్నంతి యతఃక్రమాత్. ౫౯

సన్నిపాతమునందును మూడే వస్తువులు హితకరములు. ఏలనగా —అవి క్రమముగా మూడు దోషములను హరింపజేయును.

## మతాంతరమునందు వస్తినియమము

త్రిభ్యః పరం వస్తిమతో నేచ్ఛంత్యన్యే చికిత్సకాః,
న హి దోషశ్చతుర్థోఽస్తి పునర్దీయేత యం ప్రతి. ౬౦

కావున మూడు నిరూహవస్తులకంటె నధికమైన నిరూహవస్తులను కొందరు వైద్యు లంగీకరించుటలేదు. ఏలనగా -నాలుగవ నిరూహవస్తి యేదోషము నుద్దేశించి ప్రయోగించవలయునో అటువంటి నాలుగవదోషము లేకుండుటవలన అని తెలియవలయును.

ఉత్క్లేశనం శుద్ధికరం దోషాణాం శమనం క్రమాత్,
త్రిధైవం కల్పయేద్వస్తిమిత్యన్యేఽపి ప్రచక్షతే ౬౧

దోషములను స్థానములోనుండి చలింపజేయుట, శుద్ధిచేయుట, శమనము చేయుట, వీని నిమిత్తము యథాక్రమముగా మూడు నిరూహవస్తులను ప్రయోగించవలయునని యితరవైద్యులు చెప్పుచున్నారు.

## దోషాద్యనుగుణముగా వస్తిప్రయోగము

దోషౌషధాదిబలత స్సర్వమేతత్ప్రమాణయేత్,

నిరూహవస్తిప్రయోగవిషయములో వాతాదిదోషములు, ఔషధము, సాత్మ్యము, మొదలగువాని ననుసరించి పైజెప్పినవస్తులను తగినప్రమాణమును గల్పించి ప్రయోగించవలయును.

సమ్యఙ్నిరూఢలింగం తు నాసంభావ్య నివర్తయేత్. ౬౨

నిరూహముయొక్క సమ్యగ్యోగలక్షణములు కల్గునంతవరకు నిరూహవస్తిని నిలుపంజనదు.

## కర్మాఖ్యవస్తివిశేషము

ప్రాక్ స్నేహ ఏకః పంచాంతే ద్వాదశాస్థాపనాని చ,
సాన్వాసనాని కర్మైవం వస్తయస్త్రింశదీరితాః ౬౩

తొలుత ఒకస్నేహవస్తి, అంతమునందు 5 స్నేహవస్తులు, అనువాసనముతో గూడియుండు 12 నిరూహవస్తులు (అనగా తొలుత నిరూహము పిదప అనువాసనము ఈప్రకారము 24 వస్తులు) ఇటుల 30 వస్తుల ప్రయోగించినచో కర్మవస్తి యనబడును.

కాలమను వస్తిభేదము

కాలః పంచదశైకోత్ర ప్రాక్స్నేహోఽంతే త్రయస్తథా,
షట్పంచ వస్త్యంతరితాః

తొలుత స్నేహవస్తి 1 అంతమునందు స్నేహవస్తులు 3, 5 నిరూహవస్తులచే అంతరితమైన 6 స్నేహవస్తులు (అనగా తొలుత స్నేహము పిదప నిరూహము ఈప్రకారము 11 వస్తులు) ఇటుల 15 వస్తులు కాలవస్తి యని చెప్పబడును.

యోగమను వస్తిభేదము

యోగోఽష్టౌ వస్తయోఽత్ర తు ౬౪
త్రయో నిరూహాః స్నేహాశ్చ స్నేహావాద్యంతయోరుభౌ,

నిరూహవస్తులు 3, స్నేహవస్తులు 3, మొదట అంతమున స్నేహవస్తులు 2 ఇటుల 8 వస్తులుచేరి యోగవస్తి యని చెప్పబడును.

స్నేహ నిరూహ వస్త్యాధిక్యనిషేధము

స్నేహవస్తిం నిరూహం వా నైకమేవాతిశీలయేత్. ౬౫
ఉత్క్లేశాగ్నివధౌ స్నేహాన్నిరూహాన్మరుతో భయమ్,

స్నేహవస్తి, లేక నిరూహవస్తి వీనిలో నొకదానినే విశేషముగా ప్రయోగింపం జనదు. స్నేహవస్తి నధికముగ ప్రయోగించుటచే ఉత్క్లేశము, అగ్నిమాంద్యము కలుగును. నిరూహము నధికముగ సేవించుటచే వాతరోగము కలుగును.

నిరూహానువాసన వస్త్యర్హులు

తస్మాన్నిరూఢః స్నేహ్యః స్యాన్నిరూహ్యశ్చానువాసితః ౬౬

కావున నిరూహవస్తి చేయించుకొనినవాడు స్నేహవస్తికి అర్హుడుగ నగును. అటులనే అనువాసనవస్తి చేయించుకొనినవాడు నిరూహవస్తికి అర్హుడుగ నగును.

వస్తికర్మఫలము

స్నేహశోధనయుక్త్యైవం వస్తికర్మ త్రిదోషజిత్,

ఈ ప్రకారము పూర్వోక్తస్నేహ శోధనయుక్తిచే సేవించబడిన వస్తికర్మ త్రిదోషములను జయించును

మాత్రావస్తి

హ్రస్వయా స్నేహపానస్య మాత్రయా యోజితస్సమః ౬౭
మాత్రావస్తిః స్మృతః స్నేహః

హ్రస్వమైనమాత్రతోడ (అనగా రెండుయామములలో జీర్ణ మగునట్టి స్నేహ మాత్రతోడ) ప్రయోగింపబడిన స్నేహవస్తి మాత్రావస్తి యని సద్వైద్యులచే జెప్ప బడును.

"షట్పలా తు భవేజ్జ్యేష్ఠా త్రిపలా మధ్యమా భవేత్,
కనీయస్యర్ధ్యర్ధపలా త్రిధా మాత్రానువాసనే"

6 పలములు ఉత్తమమాత్ర, 3 పలములు మధ్యమమాత్ర, $1\frac{1}{3}$ పలము హ్రస్వమాత్ర ఇటుల 3 ప్రకారములుగా అనువాసనవస్తిలో స్నేహమాత్ర యితరులచే చెప్పబడి యున్నది.

## మాత్రావస్తి సేవనఫలము

శీలనీయస్సదా చ సః,
బాలవృద్ధాధ్వభారస్త్రీవ్యాయామాసక్తచింతకైః
వాతభగ్నబలాల్పాగ్నినృపేశ్వరసుఖాత్మభిః,
దోషఘ్నో నిష్పరీహారో బల్యః సృష్టమలస్సుఖః. ౬౯

ఆ మాత్రావస్తిని బాలురు, వృద్ధులు, మార్గసంచారము, భారమును మ్రోయుట, స్త్రీసంయోగము, వ్యాయామము వీనియం దాసక్తిగలవారు, చింతాక్రాంతులు, వాతముచే నపహరింపబడిన బలము గలవారు, అగ్నిమాంద్యముగలవారు, రాజులు, మిగుల సౌఖ్యమును గోరువారు వీరలు సర్వకాలములయందు సేవింపవలయును, సేవించినచో దోషములను పోగొట్టి బలమును గలుగజేయును. మలమును బైలుపరచును. సుఖమును గలుగజేయును. చెరుపును చేయ నేరదు.

## ఉత్తరవస్తి

వస్తౌ రోగేషు నారీణాం యోనిగర్భాశయేషు చ,
ద్విత్రాస్థాపనశుద్ధేభ్యో విదధ్యాద్వస్తిముత్తరమ్ ౭౦

స్త్రీపురుషులయొక్క వస్తిస్థానములో గలుగు రోగములయందును, స్త్రీలయొక్క యోని, గర్భాశయము వీనియందుగలుగు రోగములయందును, 2 లేక 3 సంఖ్య గల నిరూహవస్తులచే శుద్ధులుగనుండు స్త్రీపురుషులకును పిదప ఉత్తరవస్తిని చేయించవల యును గుదమునకంటె ఉత్తరమార్గముగ ప్రయోగింపబడుటవలన నీవస్తికి ఉత్తరవస్తి యను నామము కలిగినది.

## ఉత్తరవస్తి యంత్రలక్షణము

ఆతురాంగులమానేన తన్నేత్రం ద్వాదశాంగుళమ్,
వృత్తం గోపుచ్ఛవన్మూలమధ్యయోః కృతకర్ణికమ్.

సిద్ధార్థకప్రవేశాగ్రం శ్లక్ష్ణం హేమాదిసంభవమ్,
కుందాశ్వమారసుమనఃపుష్పవృంతోపమం దృఢమ్. ౭౨

ఉత్తరవస్తియొక్కయంత్రము రోగియొక్క అంగుళములవలన 12 అంగుళముల ప్రమాణము నిడుపు గలదిగ, ఆవుతోకవలె గుండ్రముగ మూలమునందు మధ్యమునందు కర్ణికలు గలదిగ, కొనయందు తెల్లఆవగింజ లోన ప్రవేశించతగిన ద్వారము గలదిగ, నున్నగ, స్వర్ణాదులచే నిర్మించబడినదిగ, మృదువుగ, కుందము (అనగా మొల్ల) వాడగన్నేరు, జాజి పుష్పములయొక్క తొడిమలతో సమానమయినదిగ, దృఢముగ నుండవలయును. ఇది పురుషుల కుపయోగించునట్టి ఉత్తరవస్తియంత్ర మని తెలియవలయును.

## ఉత్తరవస్తియందు స్నేహమాత్ర

తస్య వస్తిర్మృదులఘుర్మాత్రా శుక్తిర్వికల్ప్య వా,

ఆయంత్రమునందు మృదువుగ లఘువుగనుండు వస్తిని చేర్చవలయును. ఉత్తరవస్తియందు రెండుకర్షముల ప్రమాణముగల స్నేహమునుగాని, లేక బలము, వయస్సు, సత్వము, దేహము, సాత్మ్యము మొదలగువానిని విచారించి వానివాని కనుగుణముగ గాని స్నేహమాత్రను నిర్ణయించి ప్రయోగింపవలయును.

## ఉత్తరవస్తి ప్రయోగక్రమము

అథ స్నాతాశితస్యాస్య స్నేహవస్తివిధానతః ౭౩
ఋజోస్సుఖోపవిష్టస్య పీఠే జానుసమే మృదౌ,
హృష్టే మేఢ్రే స్థితే చర్జౌ శనైః స్రోతోవిశుద్ధయే.
సూక్ష్మాం శలాకాం ప్రణయే త్తయా శుద్ధేఽనుసేవనీమ్,
ఆమేహనాంతం నేత్రం చ నిష్కంపం గుదవ త్తతః. ౭౪
*పీడితేఽంతర్గతే స్నేహే స్నేహవస్తిక్రమో హితః,

స్నేహవస్తిలో జెప్పియుండు విధిప్రకారము స్నానము చేసి భుజించినవాడై (అనగా స్నేహవస్తిలో జెప్పియుండునట్టి యాహారములను భుజించినవాడై) ఋజువుగ నుండువాడు మోకాలంతపొడవుగల ఆసనమునందు సుఖముగ కూర్చుండి యుండువాడు నగుపురుషునియొక్క మేఢ్రము నిట్రబొడుచుకొని ఋజువుగ నుండునపుడు సూక్ష్మమైన శలాకను స్రోతోమార్గశుద్ధ్యర్థమై మెల్లగ ప్రవేశింపజేయవలయును.

* పీడితేనుగతే ఇతిపా.

శలాకు మేఢ్రము శుద్ధమైయుండగా సేవనీనాడిమొదలు మేఢ్రఅగ్రభాగమువరకు (అనగా 6 అంగుళములవరకు) గుదమునందు అనువాసనాదివస్తులను ప్రయోగించునట్లు లనే ఆ యంత్రమును కదలించకుండా ప్రయోగింపవలయును. ప్రయోగించిన పిదప స్నేహము అంతర్గతమైయుండగా అనువాసన వస్తిలో జెప్పియుండు విధులను (అనగా అరచేతులచే స్ఫిక్ దేశములయందు తాడనాదులను) చేయవలయును.

వస్తినానేన విధినా దద్యాత్త్రీంశ్చతురోఽపి వా. ౭౬
అనువాసనవచ్ఛేషం సర్వమేవాస్య చింతయేత్,

పైజెప్పిన రీతిగ మూడు లేక నాల్గు ఉత్తరవస్తులను ప్రయోగింపవలయును. తక్కిన విధులనన్నిటిని అనువాసనవస్తియందు చెప్పిన ప్రకారము ఆచరించునది.

"యథాశేషం ప్రవేశ్యాథ స్నేహస్యార్ధపలం నయేత్,
ప్రత్యాగతే ద్వితీయం వా తృతీయం వా ప్రదాపయేత్.
స చేదనువసేత్తత్ర స్యాత్క్రియేయం విశేషతః,
పిప్పల్యారగ్వధాగారధూమ వత్సకసైంధవైః.
మూత్రామ్లపిష్టైర్గుళికాస్సర్షపా మాషసన్నిభాః,
ఛాయాసు శుష్కాస్తాశ్శిశ్నే దద్యాత్సర్షపసన్నిభాః.
పూర్వం మాషోపమాః పశ్చాత్తాభిః స్నేహం సమానయేత్,
స్నేహే ప్రత్యాగతే చ స్యాదనువాసనికో విధిః."

ఆ యంత్రము కొంచెము బైట మిగిలి యుండునటుల శిశ్నములో ప్రవేశింపజేసి అర్థపలము స్నేహములోన ప్రవేశించునటుల జేయవలయును. ఆ స్నేహము బైలుపడునపుడు రెండు లేక మూడుమార్లు మరల ప్రయోగింపవలెను. అస్నేహము బైలుపడకుండా లోననే నిలిచినయెడల, పిప్పలి, రేలజిగురు, కరుధూపము, కొడిసె, సైంధవలవణము వీనిని గోమూత్రము, కాంజికామ్లము వీనితో బాగుగ మర్దించి ఆవాలు, మినుములు వీనితో సమానమైన పరిమాణముగ గుళికలుచేసి నీడ నెండించి మేఢ్రమునందు తొలుత ఆవాలంత ప్రమాణముగల గుళికలను పిదప మినుములంత ప్రమాణముగల గుళికలను లోపల ప్రవేశింపజేసి ఆస్నేహమును బైటికి వెడలింపవలయును స్నేహము బైలువెడలునపుడు అనువాసనములో జెప్పియుండువిధులను చేయవలయు నని ఖరనాదమునందు జెప్పబడియున్నది.

## స్త్రీలకు ఉత్తరవస్తికాలము

స్త్రీణామార్తవకాలే తు యోనిర్గృహ్ణాత్యపావృతేః ౭౭

విదధీత తదా తస్మాదన్యకాలేఽపి చాత్యయే,
యోనివిభ్రంశశూలేషు యోనివ్యాపదసృగ్దరే. ౭౮

“ఋతుస్తు ద్వాదశనిశాః ఇత్యాది” వచనములచే జెప్పబడిన ఋతుకాలము నందు స్త్రీలకు యోని మూయబడకుండుటవలన ఉత్తరవస్తిని గ్రహించును. ఇతరకాలములయందు యోని మూయబడి యుండుటవలన గర్భమువలెనే స్నేహవస్తినికూడా గ్రహించకుండును. కాబట్టి యోని మూయబడకుండు ఋతుకాలమునందే ఉత్తరవస్తిని చేయవలయును. యోనివిభ్రంశము, యోనిశూల, యోనివ్యాపత్తు, అసృగ్దరము మొదలగు కష్టమైన రోగములు గలుగునపుడు ఋతుకాలమునకు వ్యతిరిక్తమైన కాలమునందుకూడ స్త్రీలకు ఉత్తరవస్తిని చేయవలయును.

### స్త్రీల - ఉత్తరవస్తి - యంత్రలక్షణము

నేత్రం దశాంగుళం ముద్గప్రవేశం చతురంగుళమ్,
అపత్యమార్గే యోజ్యం స్యాద్ద్వ్యంగులం మూత్రవర్త్మని. ౭౯
మూత్రకృచ్ఛ్రవికారేషు బాలానాం త్వేకమంగుళమ్,

స్త్రీలకుప్రయోగించునట్టి ఉత్తరవస్తి యంత్రము పది అంగుళములు నిడుపు, పెసరగింజ ప్రవేశించతగిన ద్వారముగల అగ్రప్రదేశము, పై జెప్పిన గోపుచ్ఛాకారము మొదలగు లక్షణములుగలదిగ నుండవలయును. స్త్రీలకు ఉత్తరవస్తి చేయునపుడు ఆయంత్రమును గర్భమార్గమునందు 4 అంగుళములు ప్రవేశింపజేయవలయును. రజస్వలకాని స్త్రీలకు మూత్రకృచ్ఛ్రాది రోగములలో మూత్రమార్గమునందు రెండు అంగుళములు లోనయంత్రమును ప్రవేశింపజేయవలయును. బాలస్త్రీలకు మూత్రకృచ్ఛ్రాది రోగములు కలిగి యుండునపుడు ఒక అంగుళప్రమాణముగల యంత్రమును మూత్రద్వారమునందు ప్రవేశింపజేయవలయును “చతురంగులం యోజ్యం” అని చెప్పినందుచే నాయంత్రము లోన నధికముగా ప్రవేశించకుండుటకై నాల్గు అంగుళములకు పైన ఆ యంత్రమునకు కర్ణిక యుండవలయు నని స్పష్టమగుచున్నది.

### స్త్రీలకు ఉత్తరవస్తి స్నేహప్రమాణము

ప్రకుంచో మధ్యమా మాత్రా బాలానాం శుక్తిరేవ తు. ౮౦

స్త్రీలకు ఉత్తరవస్తియందు స్నేహముయొక్క ప్రకుంచము మధ్యమ మాత్ర, బాలురకు స్నేహముయొక్క శుక్తి ప్రమాణము మధ్యమమాత్ర అని తెలియవలయును మఱియు స్త్రీలకు ఉత్తమ, కనిష్ఠమాత్రలను ప్రయోగింపంజనదు.

## స్త్రీలకు ఉత్తరవస్తి ప్రయోగక్రమము

ఉత్తానాయాశ్శయానాయాస్సమ్యక్సంకోచ్య సక్థినీ
ఊర్ధ్వజాన్వాస్త్రిచతురానహోరాత్రేణ యోజయేత్. ౮౧
వస్తింస్త్రిరాత్రమేవం న స్నేహమాత్రాం వివర్ధయేత్,

వెలికిలపరుండి యుండునదియును, పొడవుగ నెత్తబడిన మోకాళ్ళు గలదియునగు స్త్రీకి, తొడలను సంకోచము చేయించి మూడు లేక నాల్గు ఉత్తరవస్తులను ఒక అహోరాత్రమునందు ప్రయోగించవలయును. ఇటుల మూడు దినములు ఉత్తరవస్తి చేయవలయును. అటుల జేయునపుడు స్నేహమాత్రను యథాక్రమముగా ½ కర్షము, కర్షము ప్రమాణముచొప్పున వృద్ధి చేయవలయును. "ఉత్తానాయాశ్శయానాయాః" అని చెప్పియుండుటచే బోరగిల పరుండి యుండునపుడును, ప్రక్కవాటుగా పరుండియుండునపుడును, కూర్చుండియుండునపుడును, స్త్రీలకు ఉత్తరవస్తి చేయకూడదని భావం బగుచున్నది.

త్ర్యహమేవచ విశ్రమ్య ప్రణిదధ్యాత్పునస్త్ర్యహమ్. ౮౨

ఇటుల మూడు దినములు ఉత్తరవస్తిని ప్రయోగించి మరల మూడు దినములు వదలి మరల మూడు దినములు పూర్వోక్తక్రమముగా ఉత్తరవస్తిని ప్రయోగింపవలయును. ఇటులనే పురుషులయొక్క మేఢ్రమునందు ఉత్తరవస్తిప్రయోగము చేయవలయును.

## వమనవిరేచనాదికాలనిర్ణయము

పక్షాద్విరేకో వమితే తతః పక్షాన్నిరూహణమ్,
సద్యోనిరూఢశ్చానువాస్యః సప్తరాత్రాద్విరేచితః ౮౩

ఉత్తమమైన శుద్ధిచే శుద్ధుడైన వమితునికి ఒక పక్షమునకు తర్వాత విరేకము చేయించవలయును. ఏలనగా—ఉత్తమశుద్ధిచే శుద్ధుడైనవమితునికి ఏడు దినములలో పేయాదిక్రమముగా ప్రకృతిభోజనము కలుగుచున్నది. పిదప నేడు దినములలో ఒక దినము విడిచి ఒక దినము అనువాసనవస్తి ప్రయోగము చేయుటచే స్నిగ్ధుడుగ నగుచున్నాడు. పిదప విరేచనము చేయించుకొనినవానికి ఒక పక్షమునకు (పదునైదుదినములకు) పైన నిరూహవస్తి చేయించవలయును. ఏలనగా—విరేకము చేయించుకొనిన వానికి ఏడు దినములలో ప్రకృతిభోజనము కలుగును. పిదప ఏడు దినములలో నొక దినమువిడిచి మరుదినము అనువాసనవస్తిని చేయుటచే స్నిగ్ధుడుగ నగుచున్నాడు. నిరూహవస్తి చేయించుకొనినవానికి ఆదినమునందే అనువాసనవస్తిని చేయించవలయును. ఈయర్థమునే యీతంత్రకారుడు—

"అథ వాతార్దితం భూయ స్సద్య ఏవానువాసయేత్."

అనువచనముచే పూర్వమే చెప్పియున్నాడు. నిరేకము జేయించుకొనినవానికి ఏడు దిన ములలో ప్రకృతిభోజనము కలుగుటవలన నేడుదినములపైన అనువాసనవస్తిని జేయించవలయును.

## వస్తికర్మదోషమును హరింపజేయుటకు క్రమము

యథా కుసుంబాదియుతాత్తోయాద్రాగం హరేత్పటః,
తథా ద్రవీకృతాద్దేహాద్వస్తిర్నిర్హరతే మలాన్. ౭౪

కుసుంభ కుంకుమాది ద్రవ్యములతో గూడియుండు ఉదకములో తడపబడిన వస్త్రము కుసుంబాదులను గ్రహించక యెఱుపు వర్ణమునుమాత్రము గ్రహించునటులనే ద్రవముగ జేయబడిన దేహములో ధాతువులను వస్తికర్మహరించక ఆధాతువులలో మిశ్రముగ నుండు దోషములను మాత్రము హరింపజేయును.

## వస్తికర్మప్రశంస

శాఖాగతాః కోష్ఠగతాశ్చరోగా మర్మోర్ధ్వసర్వావయవాంగజాశ్చ
యే సంతి తేషాం న తు కశ్చిదన్యో వాయోః పరం జన్మని హేతురస్తి.
విట్శ్లేష్మపిత్తాదిమలాచయానాం విక్షేపసంహారకరస్స యస్మాత్,
తస్యాతివృద్ధస్య శమాయ నాన్యద్వస్తేర్వినా భేషజమస్తి కించిత్.

శాఖలయందు (అనగా 2 తొడలు, 2 హస్తములయందు) జనించినవియును, కోష్ఠమునందు (అనగా మహాస్రోతస్సునందు) జనించినదియును, మర్మములు, మెడకొంకులకు పైబడినభాగములు, సర్వాంగము, అవయవములు వీనియందు జనించినదియును నగురోగములయొక్క ఉత్పత్తియందు వాతమునకంటె ముఖ్యమైన వేరే హేతువు ఏదియును లేదు. ఏలనగా — వాతము పురీషము, శ్లేష్మము, పిత్తము, మూత్రము, స్వేదము మొదలగు మలసమూహముయొక్క విక్షేపము (అనగా చలనము) సంహారము వీనికి కారణముగ నుండును. కాబట్టి వాతప్రకోపశమనార్థమై వస్తికర్మకంటె వేరుగ నేవిధ చికిత్సయును లేదు. వాతము చలనముగలదియగుటచే పిత్తశ్లేష్మములను స్వస్థానములో నుండి చలింపజేసి బైలుపరచును. పిత్తశ్లేష్మములు చలనములేనివి యగుటచే వాతమును చలింపజేయుటయందసమర్థములుగ నుండును. మఱియును వాతహరణరూపమగు స్నేహ స్వేదాద్యనేకచికిత్స లుండినను అవి వాతమును నిశ్శేషముగా హరింపజేయుటయం దస మర్థములుగ నుండుటవలన వాని నీతంత్రకారుడు గౌరవింపక యుపేక్షించెను. మెడ కొంకులకుపైన జనించునవి ముఖరోగాదులు జ్వరాదులు సర్వాంగజనితంబులు. శ్వేత్ర

వస్థాదులు ఆవయవజాతరోగంబులు. వాతము ముఖ్యమైన హేతువని చెప్పినందుచేతనే పిత్తశ్లేష్మములు ముఖ్య హేతువు కాకుండ వాతమునకు ఉపబలముగనుండు నని యేర్పడుచున్నది. పై జెప్పిన రోగములనుగురించి ఉత్తరతంత్రములో పంచవిధులు స్పష్టముగా వివరించబడును.

తస్మాచ్చికిత్సార్ధ ఇతి ప్రదిష్టాకృత్స్నా చికిత్సాపి చ వస్తిరేకైః,
తథా నిజాగంతువికారకారి రక్తౌషధత్వేన సిరావ్యధోఽపి. ౮౭

దోషములన్నిటిలో వాతము ప్రధానముగనుండును అట్టివాతమును శమింపజేయు చికిత్సలలో 'వస్తిర్వాతహరాణాం' అను ప్రమాణమువలన వస్తిప్రధానమైనది. కావున చికిత్సలన్నిటిలో వస్తికర్మ సగపాలుగ నుండు నని మునివరులు శాసించిరి. కొందరాచార్యులు వస్తికర్మ పూర్ణమైన చికిత్స యని యుపదేశించిరి. వస్తికర్మనే అర్ధచికిత్స యని సంపూర్ణమైన చికిత్స యని చెప్పునెడ వైద్యౌషధాదివిభాగములను, ఇతర చికిత్సలను విశేషముగ జెప్పునట్టి శాస్త్రములు వ్యర్థములగునవే యాక్షేపము కలుగును. అయినప్పటికిని వాతరోగములు 80 విధములని చెప్పబడియున్నవి. పిత్తశ్లేష్మరోగములు 2-ను చేరి 60 విధములని చెప్పబడియున్నవి. పిత్తశ్లేష్మములకంటె ప్రధానముగనుండు వాతమునకు వస్తికర్మ ప్రధానచికిత్స యగుటవలన చికిత్సలో వస్తికర్మ అర్ధాంశ మని చెప్పబడినది, లేక పిత్తము, శ్లేష్మము, మలము, వీనితోగూడియుండువాతమును వస్తికర్మ నిశ్శేషముగా హరింపజేయుటవలన వస్తికర్మ సంపూర్ణమైనచికిత్స యని కొందరాచార్యులచే

"యానీహ కర్మాణ్యుక్తాని విసర్పవినివృత్తయే,
ఏకతస్తాని సర్వాణి రక్తమోక్షణమేకతః."

విసర్పరోగనివృత్త్యర్థమై చెప్పబడియుండు సమస్తమైన చికిత్సలు ఒక భాగము, రక్తమోక్షణము ఒక భాగము, అని చరకాచార్యుడుకూడ పైప్రకారమే చెప్పియున్నాడు. వాతాదిదోషములచే జనించిన నిజరోగములను, విషము, అగ్ని మొదలగువానిచే జనించిన ఆగంతుకరోగములను కలుగజేయునట్టి రక్తమునకు సిరావేధనము ముఖ్యచికిత్సగ నుండుటవలన నాసిరావేధనము చికిత్సలలో నర్ధభాగ మని ఆచార్యులచే జెప్పబడినది. శీతోష్ణస్నిగ్ధరూక్షాదిచికిత్సలచే సాధ్యములుగ నుండు నితరమైనరోగములుకూడ సిరావేధనమువలన నివృత్తియగుచున్నది. కాబట్టి సిరావేధనమే సంపూర్ణమైన చికిత్స యని మఱికొందరాచార్యులు వచింపుచున్నారు.

ఏకోనవింశాధ్యాయము ముగిసెను.

# వింశాధ్యాయము

పంచకర్మలయొక్క ప్రస్తావమువలన వమన, విరేక, అనువాసన, నిరూహ కర్మలంజెప్పి తదనంతరము ఈయధ్యాయమునందు నస్యవిధి జెప్పబడుచున్నది.

నస్యవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతో నస్యవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

వస్తివిధ్యధ్యాయానంతరము నస్యవిధిని దెలిపెడు నస్యవిధ్యధ్యాయమును వివరించెదము.

నస్యార్హములగు రోగములు

ఊర్ధ్వజత్రువికారేషు విశేషాన్నస్యమిష్యతే,
నాసా హి శిరసో ద్వారం తేన తద్వ్యాప్య హంతి తాన్. 1

మెడకొంకులకుపైన జనించుశిరోరోగము మొదలగువానియందు నస్యకర్మ విశేషముగా హితకరమైన దని ఆచార్యులచే జెప్పబడియున్నది ఏలనగా — నాసికము శిరస్సునకు ద్వారముగ నుండుటవలన దానిమూలముగా నస్యము, కర్ణములు, శృంగాటకము, నేత్రములు, కంఠము, శిరస్సు, ముఖము మొదలగువానియందు ప్రవేశించి శిరమునందు వ్యాపించి వానియందు జనించునట్టి రోగములను పోగొట్టును. "విశేషాత్" అని చెప్పినందుచేత పైజెప్పిన ఊర్ధ్వజత్రు రోగములయందు వమనసిరావ్యధాది చికిత్సలును చేయందగు నని భావంబగుచున్నది.

నస్యత్రైవిధ్యము

విరేచనం బృంహణం చ శమనం చ త్రిధాపి తత్,

విరేచనము, బృంహణము, శమనము నని నస్యము మూడువిధములు.

విరేచననస్యోపయోగము

విరేచనం శిరశ్శూలజాడ్యస్యందగలామయే 2
శోఫగండక్రిమిగ్రంథికుష్ఠాపస్మారపీనసే,

విరేచన మను నస్యము శిరశ్శూల, జడస్వము, స్యందము, కంఠరోగము, శోఫ, గండరోగము, కృమిరోగము, గ్రంధి, కుష్ఠము అపస్మారము, పీనసము వీనియందు హిత

కరమైనది. ఊర్ధ్వజత్రురోగములలో చేరని అపస్మారముకూడ విరేచన మను నస్యముచే శమించుటవలన ఊర్ధ్వజత్రురోగములతోకూడ జేర్చి చెప్పబడినది. మఱియును విరేచన మనునస్యము కఫప్రకోపము, నోటియం దరుచి, వాసన తెలియకుండుట, మొదలగు రోగములయందును హితకరమైన దని తెలియవలయును.

బృంహణ నస్యోపయోగము

బృంహణం వాతజే శూలే సూర్యావర్తే స్వరక్షయే. 3
నాసాస్యశోషే వాక్సంగే కృచ్ఛ్రబోధేఽపబాహుకే,

వాతజశూల, సూర్యావర్త మను శిరోరోగము, స్వరహాని, ముక్కును నోరును తడిలేక యెండుట, వాగ్బంధము, అతి కష్టముమీద కండ్లు తెరుచుట, అపబాహుక మను వాతరోగము, వీనియందు బృంహణ మను నస్యము హితకరమైనది.

శమననస్యోపయోగము

శమనం నీలికావ్యంగకేశదోషాక్షిరాజిషు. ४

నీలిక, వ్యంగము, తలవెండ్రుకలు రాలుట నేత్రరాజి వీనియందు శమన మను నస్యము హితకరమైనది. నీలిక, వ్యంగము అను నీ 2 రోగములు క్షుద్రరోగ ప్రకరణము నందు చెప్పబడును.

విరేచననస్యోత్పత్తి

యథాస్వం యౌగికైః స్నేహైర్యథాస్వం చ ప్రసాధితైః,
కల్కక్వాథాదిభిశ్చాద్యం మధుపట్వాసవైరపి. ౫

ఆయారోగానుగుణముగా మిరియములు, శుంఠి మొదలగుద్రవ్యములచే సంస్కారముచేయబడిన యోగార్హమైన ఆవతైలము మొదలగువానిచేతను, కఫహర మయిన దింటెన మొదలగువానికల్కము, క్వాథము, స్వరసము మొదలగువానిచేతను, తేనె, సైంధవాదిలవణములు, ఆసవ మను మద్యవిశేషము వీనిచేతను చేయబడిన నస్యము విరేచననస్య మనబడును. నస్య మన ముక్కులో నుపయోగింపదగిన తైలనస్యాదులు. అయ్యది నాసారంధ్రములనుండి దోషమలాదుల వెడలించు నెడ విరేచననస్య మనబడును.

బృంహణం ధన్వమాంసోత్థరసాసృక్ఖపురైరపి,
శమనం యోజయేత్పూర్వైః క్షీరేణ చ జలేన చ. ౬

జాంగలదేశమున జనించిన మాంసరసములచేతను, జాంగలదేశమున జనించిన జంతువులయొక్క రక్తములచేతను, ఖపురము (అనగా చెట్టుబంకలు) చేతను, పైజెప్పిన తీక్ష్ణగుణరహితమైన స్నేహములచేతను, ఉపయోగింపబడునది బృంహణ మను నస్యము,

పూర్వము చెప్పిన తీక్ష్ణగుణరహితమైన ఘృతాది స్నేహములచేతను, మాంసాదులచేతను, క్షీరము, ఉదకము వీనిచేతను చేయబడునది శమన మనునస్యము అగును.

"తత్తు నస్యం దేయం వాతాభిభూతే శిరసి దంతకేశశ్మశ్రుశాతదారుణ కర్ణశూల కర్ణక్ష్వేడతిమిరస్వరోపఘాతనాసారోగముఖశోషేషు అవబాహుకాకాలపలిత ప్రాదుర్భావదారుణప్రతిబోధే వాతపైత్తికేషు చాన్యేషు ముఖరోగేషు వాతపిత్తహర ద్రవ్యసిద్ధేన స్నేహేన బృంహణమేవనస్యం దేయమ్, విరేచనంకఫాభివ్యాప్తకంఠశిరసాం నిద్రాభిభూతానాం శిరోగౌరవశూలార్థావభేదక కృమిప్రతిశ్యాయాపస్మార ఘ్రాణాజ్ఞానేష్వన్యేషు చోర్ధ్వజత్రుగదేషు కఫజేషు వికారేషు, సమ్యగ్విరిక్తశిరసి సర్పిర్నస్తో నిషేచయత్, అవపీడంతు శిరసో విరేచనవదభిష్యందసర్పదష్టవిషజేభ్యో దద్యాత్, శిరోవిరేచనద్రవ్యాణామన్యతమమాసాద్యావపీడయేత్, చేతోవికారకృమివిషాభిపన్నానాం చూర్ణంప్రధమేత్, శర్కరేక్షురసఘృతమాంసరసానామన్యతమం క్షీణానాం శోణితపిత్తే చ దద్యాత్, కృశదుర్బలభీరూణాం సుకుమారస్య యాపితాసృజః స్నేహశ్శిరశ్శోధ్యః కల్కస్తేభ్యో యథాహితః."

ఆత్రివిధనస్యములలో శిరము వాతపీడితముగ నుండునపుడును, దంతములు, కేశములు, శ్మశ్రువులు (అనగా గడ్డము, మీసముల వెండ్రుకలు) ఇవి ఊడిపడుట, దారుణమైన కర్ణశూల, కర్ణక్ష్వేడ మను కర్ణరోగము, తిమిరరోగము, స్వరభంగము, నాసికారోగము, ముఖశోష, అకాలమున తలవెండ్రుకలు నెరయుట, అతికష్టముమీద నేత్రములు తెఱచుట, మొదలగు రోగములయందును, వాతపిత్తములచే గలిగిన యితరములగు ముఖరోగములయందును, వాతహరద్రవ్యములవలన సిద్ధముచేయబడిన స్నేహముచే బృంహణ మను నస్యమునే చేయవలయును. కఫముచే వ్యాప్తమైన కంఠము, శిరముంగలవారికిని, నిదురచే పీడింపబడినవారికిని, శిరోగౌరవము, శిరశ్శూల, అర్ధావభేదకము, కృమిరోగము, పీనసము, అపస్మారము, గంధాజ్ఞానముగలవారికిని, మెడకొంకులకు పైభాగమునందు ఇతరమైన రోగములుగలవారికిని, కఫజనితమైనరోగములుగలవారికిని, విరేచననస్యమును ప్రయోగింపవలయును. బాగుగ విరేకమైనశిరముగలవారికి నాసికాద్వారమువలన ఘృతమును ప్రయోగింపవలయును. అభిష్యందము, సర్పదష్టవిషము, ఇవిగలవారలకు అవపీడన మనునస్యమును ప్రయోగింపవలయును. మఱియు అవపీడన మనునస్యమును శిరోవిరేచనద్రవ్యములలో నేదైన నొకదానిచే జేయవలయును. చిత్తవికారము, కృమిరోగము, విషము వీనిచే పీడింపబడినవారికి చూర్ణమును నాసారంధ్రములనుండి పీల్చునట్లు చేయవలయును. క్షీణులు, రక్తపిత్తరోగులు వీరలకు శర్కర, చెఱకురసము, ఘృతము, మాంసరసము వీనిలో దేనిచేనైన నస్యమును ప్రయోగింపవలయును.

కృశులు దుర్బలులు, భయపడువారు, సుకుమారులు, రక్తమోక్షణము చేయించుకొనినవారు వీరలకు శిరస్సును శోధించునట్టి స్నేహముగాని, కల్కముగాని హితకర మని సుశ్రుతము నందు జెప్పబడియున్నది.

మర్శ ప్రతిమర్శనస్యస్నేహ భేదములు

మర్శశ్చ ప్రతిమర్శశ్చ ద్విధా స్నేహోఽత్ర మాత్రయా,

ఈనస్యభేదములయందు స్నేహము మాత్రాభేదముచేత మర్శము, ప్రతిమర్శము అని ద్వివిధంబుగ నగును.

శిరోవిరేచననస్యము

కల్కాద్యైరవపీడస్తు తీక్ష్ణైర్మూర్ధవిరేచనః. ౭

అవపీడన మనునస్యము కల్కాదులచే జేయవలయునేకాని స్నేహముచే జేయంజనదు. మఱియు నాయవపీడనమును తీక్ష్ణమైన శుంఠ్యాదులయొక్క కల్కము క్వాథము, రసము మొదలగువానిచే జేయవలయునేకాని మృదువైన ద్రవ్యములచే జేయంజనదు. అవపీడన మను నస్యమునకు శిరోవిరేచనమనియు నామాంతరము కలదు.

శమనమను విరేచననస్యము

ధ్మానం విరేచనశ్చూర్ణో

మిరియములు మొదలగువానిచే జేయబడినదియైనను, దోషములను బైలుపరచునదియునై చూర్ణము ప్రధ్మాన మనుపేరం బరగునట్టి నస్యముగ నగును.

విరేచననస్యోపయోగక్రమము

యుంజ్యాత్తంముఖవాయునా,

షడంగులద్విముఖయా నాడ్యా భేషజగర్భయా. ౮

స హి భూరితరం దోషం చూర్ణత్వాదపకర్షతి,

ఆరు అంగుళములు నిడుపుగలదియును, ఊర్ధ్వాధోభాగములయందు రంధ్రము గలదియును, లోనత్రికటుకము మొదలగు నౌషధములచూర్ణముచే నిండింపబడినదియైనగు గొట్టముచే నాచూర్ణమును ముఖవాతమువలన లోన ప్రవేశింపజేయవలయును. మఱియు నాచూర్ణము లోన నుండు అనేకదోషములను బైలుపరచును. అటులనే కల్క క్వాథాదులను ప్రయోగింపవలయును. లోన నుండు దోషములను వెలిపరచుటచే దీనికి విరేచన మను నామము కలిగినది.

నస్యౌషధప్రమాణవివరము

ప్రదేశిన్యంగుళీపర్వద్వయాన్మగ్నసముద్ధృతాత్. ౯

యావత్పతత్యసౌ బిందు ర్దశాష్టౌ షట్క్రమేణ తే,
మర్శస్యోత్కృష్టమధ్యోనా మాత్రా స్తావేవ చ క్రమాత్. ౧౦
బిందుద్వయోనాః కల్కాదేః

ఔషధములో జుట్టనవ్రేలిని 2 గణుపులవరకు లోన మునుగునట్లుల ప్రవేశింప జేసి దానితో బొట్టనవ్రేలిని జేర్చి యెత్తినయెడల నెంతయౌషధమువచ్చునో అది బిందు వనబడును. అట్టి 10, 8, 6 సంఖ్యగలబిందువులు యథాక్రమముగా మర్శ మను నస్యముయొక్క ఉత్కృష్టమాత్రగ, మధ్యమమాత్రగ, కనిష్ఠమాత్రగ నగును. (అనగా 10 బిందువులు ఉత్కృష్టమాత్ర యని, 8 మధ్యమమాత్ర యని, 6 కనిష్ఠమాత్ర యని భావము) యథాక్రమముగా 2 బిందువులు తగ్గింపబడినయెడల పైజెప్పినమాత్రలే కల్కస్వరసాదులకు ఉత్కృష్ట, మధ్యమ, కనిష్ఠమాత్రలుగ నగును. (అనగా కల్క స్వరసాదులకు 8 బిందువులు ఉత్కృష్టమాత్ర యని, 6 మధ్యమమాత్ర యని, 4 కనిష్ఠ మాత్ర యని తాత్పర్యము.)

### నస్యకర్మానర్హులు

యోజయేన్న తు నావనమ్,
తోయమద్యగరస్నేహపీతానాం పాతుమిచ్ఛతామ్. ౧౧
భుక్తభక్తశిరఃస్నాతస్నాతుకామస్రుతాసృజామ్,
నవపీనసవేగార్తసూతికాశ్వాసకాసినామ్. ౧౨
శుద్ధానాం దత్తవస్తీనాం తథానార్తవదుర్దినే,
అన్యత్రాత్యయికాద్వ్యాధేః

ఉదకము, మద్యము, విషము, స్నేహము వీనిని పానముచేసినవారు, పానము చేయుట కిచ్ఛగొనినవారు, అన్నమును భుజించినవారు, శిరస్స్నానముచేసినవారు, శిరస్స్నానముచేయ నిచ్ఛగొనినవారు, రక్తమోక్షణము చేయించుకొనినవారు, నూతన మయిన పీనసరోగముగలవారు, మలాదివేగములచే పీడింపబడినవారు, ప్రసవించిన స్త్రీ, శ్వాసకాసరోగములుగలవారు, వమనవిరేచనములు చేయించుకొనినవారు, వస్తికర్మ చేయించుకొనినవారు ఇట్టివారికిని, వర్షఋతువుకు వ్యతిరిక్తమైన దుర్దినమునందును, నస్యప్రయోగము చేయంజనదు. అయితే కష్టమైన రోగముగలిగి యుండు నపుడు పైనిషేధమును పాటించక నస్యప్రయోగము చేయవలయును

ఉదకాదులను పానముచేసినవారికిని, పానముచేయ నిశ్చయించువారికిని నస్య ప్రయోగము చేసినయెడల నాసికము ముఖము వీనియందు రోగములను తిమిర మను

నేత్రరోగమును, శిరోరోగములను గలుగజేయును. అన్నమును భుజించినవారికి నస్యప్రయోగము చేసినయెడల దోషములు ఊర్ధ్వస్రోతోమార్గముల నావరించి వమనము, శ్వాసము, కాసము, పీనసము ఈ రోగములను గలుగజేయును. శిరస్స్నానము చేసినవారికి నస్యప్రయోగము చేసినయెడల శిరస్సు, నేత్రములు, కర్ణములు వీనియందు శూల, కంఠరోగము, పీనసము, హనుస్తంభము, మన్యాస్తంభము, అర్దితవాతము, శిరః కంపము అనునీరోగములనుగలుగజేయును స్నానముచేయనిచ్ఛయించువారికి నస్యప్రయోగము చేసినయెడల శిరమునందు దోషము స్తబ్ధమై జడత్వము, అరుచి, పీనసము అను నీరోగములను గలుగజేయును. రక్తమోక్షణము చేయించుకొనినవారికి నస్యప్రయోగము చేసినయెడల శరీరకార్శ్యము, అరుచి, అగ్నిమాంద్యము గలుగును. నూతనమైన పీనసరోగము గలవారికి నస్యప్రయోగము చేసినయెడల స్రోతోమార్గప్రతిబంధమువలన దుష్టమైన పీనసరోగము, కృమిరోగము, దురద, విచర్చిక అనునీరోగములు గలుగును. మలమూత్రాది వేగములవలన పీడింపబడినవారికి నస్యప్రయోగము చేసినయెడల మలాదిధారణమువలన గలుగునట్టిరోగములను మిక్కుటముగాగలుగజేయును. ప్రసవించినస్త్రీకి నస్యప్రయోగము చేసినయెడల రక్తమోక్షణము చేయించుకొనినవానికి నస్యప్రయోగముచే జనించునట్టి రోగములే గలుగును. శ్వాసకాసరోగములుగలవారికి నస్యప్రయోగము చేసినయెడల వ్యాధి వృద్ధిజెందును. వమనవిరేచనములు చేయించుకొనినవారికి నస్యప్రయోగము చేసినయెడల శ్వాసము, కాసము, స్వరహాని, ఇంద్రియనాశము, శిరోగురుత్వము, కృమిరోగము, దురద గలుగును. వస్తికర్మ చేయించుకొనినవారికి నస్యప్రయోగముచేసినయెడల వారిస్రోతోమార్గములు తెరవబడియుండుటవలన ఆనస్యము అధికముగా శరీరమునందు వ్యాపించి శ్వాసకాసాది రోగములను గలుగజేయును. వర్షఋతువుకంటె వ్యతిరిక్తమైన దుర్దినములయందు నస్యప్రయోగముచేసినయెడల శైత్యమువలన శీఘ్రముగానే శిరోరోగము, కంపము, స్తబ్ధత్వము, నోటిలోపలిదౌడ, నేత్రములు వీనియందు దురదతో గూడినపుండు, మన్యాస్తంభము, కంఠరోగము, పీనసము, అరూంషిక ఈరోగములు గలుగును. ఇటువంటి నస్యదోషములు గలుగునపుడు ఆ యాదోషములయొక్క స్థానమును, దోషాధిక్యమును ఆలోచించి స్నేహము, స్వేదము, శిరోవిరేకము ముఖలేపము, సేకము, తీక్ష్ణమైన అవపీడనము, ధూమము, గండూషము మొదలగువానిని ఆయా దోషానుగుణముగా ప్రయోగింపవలయును.

"గర్భిణ్యాశ్చభక్తద్వేష జ్వరమూర్చ్ఛర్ద్యావభేదకాః స్యుః, అపత్యంచ వికలేంద్రియమున్మాదాపస్మారయుక్తం వా స్యాత్, తత్ర గర్భిణీ 'రూక్షే నస్యకర్మణి వర్షాభూకాకోలీకపికచ్ఛూభిః శృతం పయః పిబేత్, బలావిదార్యంశుమతీమేదాభిర్వై భి

శేవ చ శృతం హావిర్వాతహరసిద్ధశ్చ స్నేహశ్శిరోవస్తౌ కర్ణపూరణే చ యోజ్యాశ్చ, సర్వం చ బృంహణమన్నపానమ్."

గర్భిణిస్త్రీకి నస్యప్రయోగమువలన అన్నద్వేషము, జ్వరము, మూర్ఛ, అర్ధావభేదకము అను సీరోగములుగలుగును. మఱియుఁ గర్భస్థశిశువునకు ఇంద్రియవైకల్యముఁగాని, లేక ఉన్మాద అపస్మారరోగములుగాని గలుగును. రూక్షకరమైన నస్యకర్మను జేయించుకొనిన గర్భిణిస్త్రీ గలిజేరు, కాకోలి, దురదగొండి వీనియుక్తముగ కాచబడినపాలను పానము జేయవలయును. చిట్టాముట్టి, నేలగుమ్మడు, ముయ్యాకుపొన్న, మేద వీనిగూర్చి కాచ బడినపాలనుగాని, చిట్టాముట్టి మొదలగువానితోఁజేర్చి పక్వముజేయబడిన ఘృతము నుగాని ఉపయోగపరచవలయును. వాతహరద్రవ్యములచే సిద్ధముజేయబడిన స్నేహ మును శిరోవస్తియందును, కర్ణపూరణమునందును ఉపయోగ పరచవలయును. మఱి యును బృంహణమైన సర్వాన్నపానములనుకూడ ఉపయోగపరచవలయును.

## నస్యప్రయోగకాలము

అథ నస్యం ప్రయోజయేత్. ౧౩

ప్రాతః శ్లేష్మణి మధ్యాహ్నే పిత్తే సాయం నిశోశ్చలే,

శ్లేష్మరోగమునందు ప్రాతఃకాలమునను, పిత్తరోగమున మధ్యాహ్నమునందును, వాతరోగమున సాయంకాలము రాత్రి ఈకాలములయందును నస్యప్రయోగము జేయ వలయును —

"లాలాస్రావసుప్తిప్రలాపదంతకటకటాయన క్రథనకృచ్ఛోన్మీలన పూతిముఖ కర్ణనాదార్దితశిరోరోగశ్వాసకాసోన్నిద్రేషు రాత్రౌ."

జొల్లుకారుట, నిద్రించునపుడు ప్రలాపించుట, కటకటయని దంతములనుకొరుకుట, నిద్రలోమూలుగుట, అతికష్టముమీద నేత్రములుతెరుచుట, నోటియందు దుర్గంధము కల్గుట, కర్ణములయందుఘోష, అర్దితవాతము, శిరోరోగము, శ్వాసకాసములు, నిద్రాధిక్యము ఈరోగములయందు రాత్రులయందు నస్యప్రయోగము చేయవలయును. అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడియున్నది.

స్వస్థవృత్తే తు పూర్వాహ్ణే శరత్కాలవసంతయోః. ౧౪
శీతే మధ్యందినే గ్రీష్మే సాయం వర్షాసు సాతపే,

స్వస్థవృత్తునికి శరద్వసంతఋతువులయందు ప్రాతఃకాలమునందును, హేమంత శిశిరఋతువులయందు మధ్యాహ్నమునందును, గ్రీష్మఋతువునందు సాయంకాలము నందును వర్షఋతువునందు సూర్యుడు ప్రకాశింపుచు నెండతోఁగూడుకొని యుండు నపుడును నస్యప్రయోగము చేయవలయును.

వాతహిధ్మాదిరోగములయందు నస్యప్రయోగకాలము

వాతాభిభూతే శిరసి హిధ్మాయామపతానకే. ౧౫
మన్యాస్తంభే స్వరభ్రంశే సాయంప్రాతర్దినేదినే,
ఏకాహాంతరమన్యత్ర సప్తాహం చ తదాచరేత్. ౧౬

వాతవ్యాధిచే పీడింపబడిన శిరము గలవానికిని, హిధ్మ, (ఎక్కిళ్లు) అపతానకము, మన్యాస్తంభము, స్వరభ్రంశము, అను నీరోగములయందును ప్రతిదినము సాయంప్రాతఃకాలములయందు నస్యప్రయోగము చేయవలయును. పైజెప్పినవానికంటె నితరరోగములయందు దినము మార్చి దినము వంతున నేడుదినములు సాయంప్రాతఃకాలములయందు నస్యప్రయోగము చేయవలయును. ఏడుదినములకంటె నధికకాలము నస్యప్రయోగము చేయంజనదు.

నస్యప్రయోగక్రమము

స్నిగ్ధస్విన్నోత్తమాంగస్య ప్రాక్కృతావశ్యకస్య చ,
నివాతశయనస్థస్య జత్రూర్ధ్వం స్వేదయేత్పునః. ౧౭
అథోత్తానర్జుదేహస్య పాణిపాదే ప్రసారితే,
కించిదున్నతపాదస్య కించిన్మూర్ధని నామితే. ౧౮
నాసాపుటం పిధాయైకం పర్యాయేణ నిషేచయేత్,
ఉష్ణాంబుతప్తం భైషజ్యం ప్రణాడ్యా పిచునాథవా. ౧౯

శిరమునకు తొలుత స్నేహకర్మ పిదప స్వేదకర్మ చేయించుకొనినవాడును, తొలుత నావశ్యకమైన మలమూత్రోత్సర్గదంతధావనాదికృత్యములను చేసినవాడును వాతములేని ప్రదేశమునందు శయ్యపైపరుండినవాడు నగుపురుషునికి మెడకొంకులకు పైభాగమునందు మరల స్వేదకర్మ చేయించవలయును. పిదప రుజువుగా వెల్లికిల పరుండియుండు శరీరముగలవాడు, కొంచెము పొడవుగ నెత్తబడిన కాళ్లు గలవాడు నగుపురుషునియొక్క హస్తపాదములను బాగుగ చాచునటులను, శిరమును కొంచెము వంగునటులను చేయించి ఒకనాసికాద్వారమును మూసి గొట్టముచేగాని, ప్రత్తిచేగాని, ఉష్ణజలముచే తప్తమైన యౌషధమును పర్యాయముగా ప్రయోగించవలయును. పర్యాయమనగా:—ఒకనాసికను మూసి మఱియొక దానిలో నౌషధమును విడిచి దానిని మూసి మఱియొక దానిలో నౌషధమును విడుచుట యని యర్థము.

నస్యప్రయోగానంతరకర్తవ్యము

దత్తే పాదతలస్కంధహస్తకర్ణాదిమర్దయేత్,

అటుల నస్యప్రయోగము చేయుచుండగా అఱకాలు, భుజములు, హస్తములు, చెవులు, మెడ నుదురు వీనిని మర్దించవలయును —

"వస్త్రాచ్ఛాదితనేత్రాయ ప్రదేశిన్యోన్నామిత నాసికాగ్రాయ దక్షిణహస్తేన స్నేహముష్ణాంబుతప్తం రజతాదిశుక్తీనా మన్యతమస్థం అవచ్ఛిన్నధారం సించేత్."

నస్యకర్మ చేసికొనువాని నేత్రములను వస్త్రముచె మూసి నాసికాగ్రమును బొట్టనవ్రేలిచే నూర్ధ్వముగ నెత్తి ఉష్ణోదకముచేత తప్తముగను, రజతాదిపాత్రలయం దుంచబడినదిగ నుండునౌషధమును దక్షిణహస్తముచే నొకటే ధారగ విడువవలయు నని సుశ్రుతమునందు చెప్పబడియున్నది.

శనైరుచ్ఛిద్య నిష్ఠీవేత్పార్శ్వయోరుభయో స్తతః. ౨౦

అటుల మర్దించినపిదప కఫమును భుజింపక మెల్లగ పార్శ్వ కఫముతోగూడియుండు మలములను రెండు నాసారంధ్రములనుండియు బైట వెడలింపవలెను. అటుగాక యౌషధ్యౌషధమును మ్రింగినచో జాఠరాగ్ని నాశము దోషవృద్ధి కలుగును. ఒకపార్శ్వమునందలి నాసారంధ్రముచే వెడలించినచో ఔషధము అన్నినరలయందును వ్యాపించనేరదు.

— నస్యప్రయోగక్రమము

ఆభేషజక్షయాదేవం ద్విస్త్రిర్వా నస్యమాచరేత్,

పైజెప్పిన క్రమప్రకారము ఔషధము నిశ్శేష మగువరకు 2 పర్యాయములు గాని లేక 3 పర్యాయములుగాని నస్యము ప్రయోగింపవలయును. నస్యముమాత్రము ఒకటే మారు వేయవలయును. ఔషధమును హీనప్రమాణముగా ప్రయోగింపజనదు. ఏలయనగా—హీనప్రమాణముగా ప్రయోగింపబడిన యౌషధము దోషములను స్వస్థానములోనుండి చలింపజేసి బైలుపరచక గురుత్వము, అరుచి, కాసము, ప్రసేకము, పీనసము, వాంతి, కంఠరోగము మొదలగువానిని గలుగజేయును. అధికమాత్రగా ప్రయోగించబడిన యౌషధము అతియోగమువలన విశేషదోషములను గలుగజేయును. ఒకటే పర్యాయము ఔషధము నంతటిని ప్రయోగించినయెడల శిరోరోగము, పీనసము ఘ్రాణక్లేదము, ఉచ్ఛ్వాసము వెడలకుండుట మొదలగు నుపద్రవములను గలుగజేయును. నస్యౌషధమును అత్యుష్ణముగా ప్రయోగించినయెడల తాపము, పాకము, జ్వరము, రక్తాంగత్వము, మూర్ఛ, భ్రమ కలుగును. అతిశీతముగా ప్రయోగించినయెడల హీనమాత్రగల నస్యౌషధప్రయోగమునకు జెప్పబడినరోగములనే గలుగజేయును. మిగుల పొడవుగ నెత్తబడిన శిరము గలవానికి నస్యప్రయోగము చేసినయెడల హీనమాత్రవిషయములలో జెప్పబడిన రోగములే గలుగును. మిక్కుటముగ వంచబడిన శిరము గలవానికి నస్యౌషధప్రయోగము చేసినయెడల నాయౌషధము శరీరమునం దధికముగా వ్యాపించి

మూర్ఛ, జడత్వము, జ్వరము వీనిని గలుగజేయును శరీరమును ముడుచుకొని యుండు వానికి నస్యౌషధప్రయోగముచేసినయెడల అది ధమనులయందు బాగుగా వ్యాపించ కయే దోషములను స్వస్థానములోనుండి చలించునటుల మాత్రము జేయును.

నస్యజమూర్ఛాచికిత్స

మూర్ఛాయాం శీతతోయేన సించేత్పరిహరన్ శిరః. ౨౧

నస్యప్రయోగము చేయునపుడు మూర్ఛ గలుగుపక్షములో శీతోదకముచే శిరస్సు తప్ప తక్కినయంగములను తడుపవలయును.

"న చ నస్యే దీయమానే కోప హాస వ్యవహారస్యందనోచ్ఛేదనాన్యాచరేత్. తథాహి శిరోరుక్ప్రతిశ్యాయ కాసతిమిరఖలితవ్యంగతిలకాలకముఖదూషకానాం సంభవః."

నస్యప్రయోగము చేయునపుడు కోపము, నవ్వు, సంభాషణము, శరీరచలనము, ఉచ్ఛేదనము యీ మొదలగువానిని చేయంజనదు. చేసినచో శిరోరోగము, పీనసము, కాసము, తిమిరరోగము, ఖలితము, పలితము, వ్యంగము, తిలకాలకము, ముఖదూషకము అను నీరోగములు కలుగును. అని సంగ్రహము నందు చెప్పబడియున్నది.

విరేచననస్యానంతరకర్తవ్యము

స్నేహం విరేచనస్యాంతే దద్యాద్దోషాద్యపేక్షయా,

విరేచన నస్యముయొక్క అంతమునందు దోష, దేశ, సాత్మ్యముల కనుగుణముగా స్నేహప్రయోగము చేయవలయును:—

"అథ నస్యార్హం నరమవ్యాహతవేగం ధౌతాంతర్బహిర్ముఖమవస్థితశిరసం ప్రాయోగికధూమపానవిశుద్ధస్రోతసం స్వాస్తీర్ణనివాతశయనస్థ ముత్తానశీర్ష మీషదున్నతపాదం ప్రసారితచరణం చ జత్రూర్ధ్వం పాణితాపేన పునఃపునః స్వేదయేత్."

మలమూత్రాదివేగముల నడ్డగించనివాడు, శుద్ధమైన అంతర్బహిర్ముఖము గలవాడు, కొంచెము వంచబడిన శిరము గలవాడు, ధూమపానముచే శుద్ధమైన స్రోతస్సులు గలవాడు గాలిలేనిప్రదేశమునందు బాగుగ పరచబడిన శయనములో కొంచెము ఎత్తుగ నుండు దిండును తలక్రింద నునుచుకొని వెల్లికిల పరుండియుండువాడు, కొంచెము పొడవుగ నెత్తబడి చాపబడినపాదములు గలవాడు నగునస్యార్హపురుషునికి మెడకొంకలకు పైభాగములో పాణితాపముచే పలుమారు స్వేదకర్మ చేయింపవలయును. అని తంత్రాంతరమునందు చెప్పబడి యున్నది.

నస్యాంతే వాక్శతం తిష్ఠేదుత్తానః

నస్యప్రయోగము చేసినపిదప నూరక్షరముల నుచ్చరించునంత కాలము వెలికిల బరుండి యుండవలెను.

ధారయేత్తతః ౨౨
ధూమం పీత్వా కవోష్ణాంబుకబళాన్ కంఠశుద్ధయే,

పిదప కంఠశుధ్యర్థము ఆ యాయాయోగములలో జెప్పియుండు విరేచనాది ధూమపానములలో దేనినైన నొకదానిని పానముచేసి కొంచెము ఉష్ణముగ నుండు ఉదకకబళములను నోట నుంచుకొనవలెను. పిదప స్నేహపానమునందు చెప్పియుండువిధుల ననుష్ఠించవలయును.

బాగుగ స్నిగ్ధమైన శిరస్సు కలవానిలక్షణము

సమ్యక్‌స్నిగ్ధే సుఖోచ్ఛ్వాసస్వప్నబోధాక్షపాటవమ్ ౨౩

శిరము బాగుగా స్నిగ్ధమైయుండునపుడు సుఖముగ ఉచ్ఛ్వాసనిశ్వాసములు, సుఖకరమైననిద్ర సుఖముగ నిదురలో నుండి మేలుకొనుట, ఇంద్రియపాటవము ఇవి గలుగును.

"సమ్యక్‌స్నిగ్ధే మూర్ధ్ని విరిక్తే వా సుఖోచ్ఛ్వాసనిశ్వాససుఖసుప్తబోధాక్షపాటవాని స్యుః"
అని పైయర్థమే అష్టాంగసంగ్రహమునందును చెప్పబడి యున్నది.

రూక్షముగ నుండు శిరము కలవానిలక్షణము

రూక్షేఽక్ష్ణోః స్తబ్ధతాశోషో నాసాస్యే మూర్ధశూన్యతా,

శిరస్సు రూక్షముగ నుండునపుడు నేత్రములయందు స్తబ్ధత్వము, నాసికము, ముఖము ఇవి ద్రవములేక యెండును. శిరస్సున నేమియు లేక శూన్యముగ నుండును.

అతిస్నిగ్ధశిరోలక్షణము

స్నిగ్ధేఽతికండూగురుతా ప్రసేకారుచిపీనసాః ౨౪

శిరస్సు అతిస్నిగ్ధముగ నుండునపుడు దురద, గురుత్వము, నోట నీరూరుట, అరుచి, పీనసము గలుగును.

సువిరిక్తశిరోలక్షణము

సువిరిక్తేఽక్షిలఘుతా స్వరవక్త్రవిశుద్ధయః,

శిరము బాగుగ విరేకమైయుండగా నేత్రములకు లఘుత్వము, స్వరశుద్ధి, ముఖశుద్ధి, (అనగా నోటిశుద్ధి) గలుగును.

### దుర్విరిక్తాదిశిరోలక్షణము

దుర్విరిక్తే గదోద్రేకః క్షామతాతివిరేచితే. ౨౫

శిరమునందు బాగుగ విరేకము కాకుండునపుడు రోగాధిక్యము గలుగును. అతివిరేకము గలిగినపుడు కార్శ్యము గలుగును.

### ప్రతిమర్శస్నేహప్రయోగార్హులు

ప్రతిమర్శః క్షత*క్షామబాలవృద్ధసుఖాత్మసు,
ప్రయోజ్యోఽకాలవర్షేఽపి

క్షతములుకలవాడు, కృశుడు, బాలుడు, వృద్ధుడు, సుఖి, వీరి విషయమునందును, అకాలవర్షమునందును, పైజెప్పిన ప్రతిమర్శమును ప్రయోగింపవలయును.

### ప్రతిమర్శస్నేహనిషిద్ధులు

న త్విష్టో దుష్టపీనసే. ౨౬
మద్యపీతేఽబలశ్రోత్రే కృమిదూషితమూర్ధని,
ఉత్కృష్టోత్క్లిష్టదోషేచ హీనమాత్రతయా హి సః. ౨౭

నాసారోగప్రకరణములో జెప్పబడు దుష్టపీనసరోగముగలవాడు, మద్యపానము చేసినవాడు, కర్ణద్వారప్రతిబంధము గలవాడు, కృములచే దూషించబడిన శిరము గలవాడు, వృద్ధి జెందినదియును, స్వస్థానములోనుండి చలించినదియునైన దోషములు గలవాడు వీరికి ప్రతిమర్శను ప్రయోగింపరాదు. ఏలయనగా — ప్రతిమర్శము హీనమాత్ర గలదిగ నుండుటవలన దోషములను స్వస్థానములోనుండి చలింపజేయును.

### ప్రతిమర్శప్రయోగకాలము

నిశాహస్సుక్తవాంతాహః స్వప్నాధ్వశ్రమరేతసామ్,
శిరోఽభ్యంజనగండూషప్రస్రావాంజనవర్చసామ్. ౨౮
దంతకాష్ఠస్య హాసస్య యోజ్యోఽంతేఽసౌ ద్విబిందుకః,

రాత్రి, మధ్యాహ్నము, భోజనము, వమనము, పగటినిద్ర, మార్గసంచారము, శ్రమ, మైథునము, శిరోభ్యంగము, గండూషము, మూత్రోత్సర్జనము, అంజనము, మలవిసర్జనము, దంతకాష్ఠభక్షణము, నవ్వు అనునీ పదునైదు కాలములయొక్క అంతమునందు రెండు బిందువుల ప్రమాణముగల పైజెప్పిన ప్రతిమర్శమును వశ్యముగ ప్రయోగింపవలయును.

* క్షీణ ఇతిపా.

### ప్రతిమర్శప్రయోగఫలము

పంచసు స్రోతసాం శుద్ధిః క్లమనాశస్త్రిషు క్రమాత్. ౨౯
దృగ్బలం పంచసు తతో దంతదార్ఢ్యం మరుచ్ఛమః,

ప్రతిమర్శ మను నస్యమును పైజెప్పిన పదునైదు కాలములలో రాత్రి, మధ్యాహ్నము, భోజనము, వమనము, పగటినిద్ర అనుని ఐదింటియొక్క అంతమునందు ప్రయోగించినయెడల స్రోతస్సులకు శుద్ధి గలుగును. మార్గసంచారము, శ్రమ, మైథునము అను నీమూటియొక్క అంతమునందు ప్రయోగించినయెడల శ్రమ నశించుటయే గాక మనఃప్రసాదము, శిరోలాఘవము గలుగును. శిరోభ్యంగము, గండూషము, మూత్రోత్సర్గము, అంజనము, మలోత్సర్జనము అనునీ ఐదింటియొక్క అంతమునందు ప్రయోగించినయెడల దృష్టికి బలము గలుగును. దంతకాష్ఠము, నవ్వు వీనియంతమునందు ప్రయోగించినయెడల యథాక్రమముగా దంతములకు దృఢత్వము, వాతశమనము గలుగును.

### నస్యధూమాదిప్రయోగానర్హులు

న నస్యమూనసప్తాబ్దే నాతీతాశీతివత్సరే. ౩౦
న చోనాష్టాదశే ధూమః కబళో నోనపంచమే,
న శుద్ధిరూనదశమే న చాతిక్రాంతసప్తతౌ. ౩౧

ఏడు సంవత్సరముల వయస్సుకు లోబడినవానికిని, ఎనుబది సంవత్సరముల వయస్సుకు పైబడినవానికిని నస్యప్రయోగము చేయంజనదు. పదునెనిమిది సంవత్సరములు పూర్తి కాకుండువానికి ధూమమును ప్రయోగింపంజనదు. ఐదు సంవత్సరములు పూర్తి కానివానికి కబళమును ప్రయోగింపంజనదు. పది సంవత్సరములకంటె తక్కువైన వయస్సు గలవారికిని, డెబ్బది సంవత్సరముల వయస్సుకు పైబడినవారికిని వమనవిరేకములు మొదలగు శుద్ధిప్రయోగము చేయంజనదు.

### ప్రతిమర్శప్రశంస

ఆజన్మమరణం శస్తః ప్రతిమర్శస్తు వస్తివత్,
మర్శవచ్చ గుణాన్ కుర్యాత్సహి నిత్యోపసేవనాత్. ౩౨
న చాత్ర యంత్రణా నాపి వ్యాపద్భ్యో మర్శవద్భయమ్,

ప్రతిమర్శ మను నస్యము వస్తివలెనే జననము మొదలుకొని మరణమువరకు హితముగ నుండును. మఱియు నాప్రతిమర్శము మర్శ మనుదానివలెనే సుఖోచ్ఛ్వాసాది గుణములను సదాభ్యాసమువలన గలుగజేయును. ప్రతిమర్శ మను నస్యమునందు

"ఉష్ణోదకోపచారీస్యాదిత్యాది" శ్లోకములచే జెప్పబడినపథ్యము ననుసరింపవలసిన నిర్బంధము లేదు. మర్శమునందుగలుగు నేత్రస్తబ్ధత్వాదిరోగభయమును లేదు.

నస్యవిషయమునందు తైలప్రాశస్త్యము

తైలమేవ చ నస్యార్థే నిత్యాభ్యాసేన శస్యతే. 33
శిరసః శ్లేష్మధామత్వాత్ స్నేహాః స్వస్థస్య నేతరే,

శిరస్సు కఫమునకు స్థానము అట్లగుటవలన తైలము నిత్యాభ్యాసముచే నస్యవిషయమునందు శ్రేష్ఠముగ నుండును. ఇతరమైన స్నేహములు శ్లేష్మకారు లగుటచే నస్యవిషయమునందు శ్రేష్ఠములు కావు.

మర్శప్రతిమర్శగుణభేదములు

ఆశుకృచ్చిరకారిత్వం గుణోత్కర్షాపకృష్టతా. 34
మర్శే చ ప్రతిమర్శే చ విశేషో న భవేద్యది,
కో మర్శం సపరిహారం సాపదం చ భజేత్తతః. 35
అచ్ఛపానవికారాఖ్యౌ కుటీ వాతాతపస్థితీ,
అన్వాసమాత్రావస్తీ చ తద్వదేవ చ నిర్దిశేత్. 36

మర్శము శీఘ్రముగా గుణమును కలుగజేయును. ప్రతిమర్శము ఆలస్యముమీద గుణమును గలుగజేయును. మర్శము ఉత్కృష్టమైన గుణములు గలది. ప్రతిమర్శము హీనమైనగుణములు గలది. మర్శమునందును ప్రతిమర్శమునందును భేదములేక పోవునేని పరిహారములోను వ్యాపత్తులోను గూడినదిగనుండు మర్శము నొకడును సేవింపనేరడు. (కాబట్టి యీరెంటికిని భేదము చెప్పబడినది.) మర్శ, ప్రతిమర్శ భేదమువలెనే అచ్ఛపానము, వికారము అనెడి పేర్లుగల స్నేహములకును, కుటీప్రవేశము, వాతాతపస్థితి అనెడిపేర్లుగల రెండురసాయనములకును; అనువాసనవస్తి, మాత్రావస్తి, అనునీరెండు వస్తికర్మలకును యథాక్రమముగా శీఘ్రకారిత్వము, ఉత్కృష్టగుణము, చిరకారిత్వము హీనగుణము గలిగియుండు నని తెలియవలయును.

అణుతైలలక్షణము

జీవంతీజలదేవదారుజలదత్వక్సేవ్యగోపీహిమం
దార్వీత్వఙ్మధుకప్లవాగురువరాపుండ్రాహ్వబిల్వోత్పలమ్,
ధావన్యౌ సురభిః స్థిరే కృమిహాం పత్రం త్రుటిం రేణుకం
కింజల్కం కమలాహ్వయం శతగుణే దివ్యేఽంభసి క్వాథయేత్,

తైలాద్రసం దశగుణం పరిశేష్య తేన
తైలం పచేచ్చ సలిలేన దశైవ వారాన్,
పాకే క్షిపేచ్చ దశమే సమమాజదుగ్ధం
నస్యం మహాగుణమణంత్యణుతైలమేతత్.　　3౮

మనుబాల, కురువేరు, దేవదారు, తుంగముస్తెలు, లవంగపుచెక్క, వట్టివేరు, సుగంధిపాల, కర్పూరము, మ్రానిపసుపు, అతిమధురము, కలుజువ్వి, అగరు, త్రిఫలములు పౌండరీకము, మారేడు, కలువ, ములక, ప్రాకుడు, అందుగు, మయ్యాకుపొన్న, కోలపొన్న, వాయువిడంగములు, తాళిసపత్రి, ఏలకలు, రేణుకలు, పూదారములు, తామరపువ్వు అనునీద్రవ్యములను తైలమునకంటె 100 భాగము లధికముగ నుండు దివ్యోదకములో వేసి తైలమునకంటె 10 భాగము లధికముగా రసము శేషించునటుల కషాయము కాచి ఆకషాయముచే తైలమును 10 మార్లు పాకము చేయవలయును. 10-వ పాకములో తైలమునకు సమముగ మేకపాలను చేర్చి మరల పాకము చేయవలయును. ఇటుల జేసినయెడల నిది గుణాధిక్యముగల అణుతైల మనబడునని వైద్యశాస్త్రజ్ఞులు వచించెదరు. అణుతైల మనగా—సూక్ష్మరూపముగల యింద్రియములలోను, స్రోతస్సుల లోను ప్రవేశించతగిన తైల మనియర్థము

## నస్యశీలనఫలము

ఘనోన్నతప్రసన్నత్వక్స్కంధగ్రీవాస్యవక్షసః,
దృఢేంద్రియాస్త్వపలితా భవేయుర్నస్యశీలినః.　　3౯

నస్యపరిశీలనము చేయుచుండుమనుజులు గట్టిగ, ఉన్నతముగ, ప్రసన్నముగ నుండుత్వక్కు, భుజములు, మెడ, ముఖము, రొమ్ము గలవారుగ, ఇంద్రియపుష్టి గల వారుగ, పలితములేనివారుగ నయ్యెదరు.

వింశాధ్యాయము, ముగిసెను.

# ఏకవింశతితమాధ్యాయము

అవ. ఊర్ధ్వాంగచికిత్సా ప్రసంగమువలన నస్యవిధ్యధ్యాయానంతరము ధూమపానవిధ్యధ్యాయము చెప్పబడుచున్నది.

ధూమపానవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతో ధూమపానవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహు రాత్రేయాదయో మహర్షయః.

నస్యవిధ్యధ్యాయానంతరము ధూమపానవిధ్యధ్యాయమును వివరించెదము.

ధూమపానప్రయోజనము

జత్రూర్ధ్వం కఫవాతోత్థవికారాణామజన్మనే,
ఉచ్ఛేదాయ చ జాతానాం పిబేద్ధూమం సదాత్మవాన్. ౧

బుద్ధిమంతుడగుమనుజుడు (అనగా హితాహారవిహారముల సేవించుచుండువాడు) మెడకొంకులకు ఊర్ధ్వప్రదేశమునందు శ్లేష్మవాతములచే రోగములు గలుగకుండుటకును, జనించిన రోగములు నివర్తించుటకును ధూమము నెల్లపుడు పానము చేయవలయును,

వాతాదులయందు ధూమప్రయోగక్రమము

స్నిగ్ధో మధ్యః సతీక్ష్ణశ్చ వాతే వాతకఫే కఫే,
యోజ్యః

ధూమము స్నిగ్ధము, మధ్యము, తీక్ష్ణము అని త్రివిధంబు. అట్టిమూడు విధములైన ధూమములను వాతాదులయందు యథాక్రమముగా (అనగా వాతమునందు స్నిగ్ధధూమమును వాతకఫమునందు మధ్యధూమమును, కఫమునందు తీక్ష్ణధూమమును) ప్రయోగింపవలయును.

రక్తపిత్తాదిరోగములయందు ధూమపాననిషేధము

న రక్తపిత్తాతివిరిక్తోదరమేహిషు. ౨
తిమిరోర్ధ్వానిలాధ్మానరోహిణీదత్తవస్తిషు,
మత్స్యమద్యదధిక్షీరక్షౌద్రస్నేహవిషాశిషు, ౩
శిరస్యభిహతే పాండురోగే జాగరితే నిశి,

రక్తపిత్తము, ఉదరరోగము, మేహరోగము, తిమిరము, ఊర్ధ్వవాతము, ఆధ్మానము, రోహిణి అనునీరోగములు గలవారు, విరేకము, వస్తికర్మ వీనిని చేయించుకొనిన

వారు; మత్స్యములు, మద్యము, పెరుగు, పాలు, తేనె, స్నేహము, విషము వీనిని భుజించినవారు; శిరోభిఘాతము, పాండురోగము గలవారు, రాత్రిజాగరణము చేసినవారు వీరలు ధూమపానము చేయంజనదు.

వాతము, వాతకఫము. కఫము వీనియందు ధూమపానము చేయవలయు నని పూర్వశ్లోకములో చెప్పినందుచేత నే పిత్తరోగముగలవారు స్నేహపానము చేయకూడదని సిద్ధం బగుచున్నది. అట్లుండగా రక్తపిత్తరోగి ధూమపానము చేయకూడదని మరల నిషేధించినది అసంగత మనే యాక్షేపము కలుగును. అయితే వాతప్రకృతిగల మనుజునకు వాతపిత్తరోగము గలిగినపుడు ప్రకృతి కనుగుణమైన చికిత్స చేయవలయు ననెడి యుద్దేశముతో వైద్యాధముడు భ్రాంతిచే ధూమపానము చేయించును. కాబట్టి ఆధూమపానము నిషేధించుటకై రక్తపిత్తరోగి ధూమపానము చేయకూడదని మరల జెప్పబడినది. లేక పిత్తప్రకృతి కలమనుజునకు శ్లేష్మరోగము ప్రకోపించి యుండునపుడు ధూమపానము నిషేధించుటకై పిత్తరోగి ధూమపానము చేయకూడదని మరల నిచట జెప్పబడినది. కాబట్టి పైజెప్పినయాక్షేపమునకు ఆధారము కనుపడదు. య వాగూపానము చేసినవారుకూడ ధూమపానము చేయకూడ దని కొందరాచార్యులు వచించెదరు.

అకాలధూమపానదోషము

రక్తపిత్తాంధ్యబాధిర్యతృణ్మూర్ఛామదమోహకృత్. ౪
ధూమోఽకాలేఽతిపీతో వా

అకాలమునందును లేక పైజెప్పినరక్తపిత్తాది రోగములయందును పానము చేయబడినధూమము. అధికముగ పానము చేయబడిన ధూమము, ఇవి రక్తపిత్తము, అంధత్వము, చెవిటితనము, దప్పి, మూర్ఛ (అనగా సంజ్ఞానాశము), మదము, మోహము (అనగా చిత్తనాశము) వీనిని కలుగజేయును.

ధూమపానదోషశమనోపాయము

తత్ర శీతో విధిర్హితః,

పైజెప్పిన రక్తపిత్తాదిరోగములలో యథాక్రమముగ ఘృతపానము, నస్యము, లేపము, పరిషేకము మొదలగు శీతకరమైన చికిత్సలు హితకరంబులు.

త్రివిధ ధూమపానకాలము

క్షుతజృంభితవిణ్మూత్రస్త్రీసేవాశస్త్రకర్మణామ్. ౫
హాసస్య దంతకాష్ఠస్య ధూమమంతే పిబేన్మృదుం,
కాలేష్వేషు నిశాహారనావనాంతే చ మధ్యమమ్ ౬
నిద్రానస్యాంజనస్నానచ్ఛర్దితాంతే విరేచనమ్,

తుమ్ము, ఆవలింత, మలోత్సర్జనము, మూత్రోత్సర్జనము, మైథునము, శస్త్రకర్మ, హాస్యము, దంతధావనము అను నీయెనిమిది కృత్యములయొక్క అంతమునందు మృదువైన స్నేహన మను ధూమమును పానము చేయవలయును. పై జెప్పిన తుమ్ము మొదలగువానియంతమునందును, రాత్రిభోజనము, నస్యము లేక నావనము, అను వానియంతమునందును, మధ్యమధూమమును పానము చేయవలయును. నిద్ర, నస్యము, అంజనము, స్నానము, ఛర్ది, వీనియంతమునందు విరేచన మను ధూమమును పానము చేయవలయును.

నావనము, నస్యము, అనునొకటే యర్థము గల శబ్దము లిచట ప్రయోగింపబడి యుండుటచే స్నిగ్ధమైన నస్యముయొక్క అంతమునందు స్నిగ్ధమైన ధూమమును పానము చేయవలయు ననియును, తుమ్ము మొదలగువానియంతమునందు ఆచార్యోపదేశముచే స్నిగ్ధమైన ధూమమును పానము చేయవలయు ననియు, మధ్యాహ్నముయొక్క అంతమునందు మధ్యమమైన ధూమమును పానము చేయవలయు ననియును, భావం బగుచున్నది "కాలేషు" అనుబహువచన ప్రయోగమువలన పైజెప్పిన తుమ్ము మొదలగువానియంతమునందు మధ్యమధూమపానమును, నిద్ర, నస్యము మొదలగువానియంతమునందు విరేచన ధూమపానమును చేయవలయు నని తాత్పర్యము

## ధూమపానయంత్రలక్షణము

వస్తినేత్రసమద్రవ్యం త్రికోశం కారయేదృజు. ౭
మూలాగ్రేఽంగుష్ఠకోలాస్థిప్రవేశం ధూమనేత్రకమ్,

ధూమపానమునకు సాధనమైనయంత్రము వస్తి నేత్రమునకు చెప్పబడిన ధాతువు, మ్రాను, గజదంతము, వెదురు మొదలగువానిచే 3 గణుపులు గలదిగ, వంకర లేనిదిగ మూలాగ్రభాగములయందు యథాక్రమముగా బొట్టనవ్రేలు, రేగుగింజ ఇవి ప్రవేశించతగినద్వారము గలదిగ నుండునటుల శిల్పిచే జేయించవలయును.

## ధూమపానయంత్రప్రమాణము

తీక్ష్ణస్నేహనమధ్యేషు త్రీణి చత్వారి పంచ చ. ౮
అంగుళానాం క్రమాత్పాతుః ప్రమాణేనాష్టకాని తత్,

తీక్ష్ణము, స్నేహము, మధ్యము అనుని 3 ధూమపానములయందు యంత్రము యథాక్రమముగా 24, 32, 40, అంగుళముల నిడుపు గలదిగ నుండవలయును (అనగా తీక్ష్ణ మను ధూమపానములో ధూమయంత్రము పానము చేయువాని యంగుళముచే 24 అంగుళములు నిడుపు గలదిగ, స్నేహనధూమములో 32 అంగుళములనిడుపు గలదిగను

మధ్యమధూమములో 40 అంగుళములు నిడుపుగలదిగ నుండవలయు ననిభావము.) అనేకములగు గణుపులు, సూక్ష్మత్వము, దైర్ఘ్యము, ఇవి ధూమయంత్రమునకు గలిగి యుండవలయును. ఇటుల నుండినచో ధూమము నేత్రములు చెవులు యీ మొదలగునింద్రియములకు బాధను గలుగ జేయనేరదు. మఱియును,

"దూరాద్వినిర్గతః పర్వచ్ఛిన్నో నాడీతనూకృతః,
నేంద్రియం బాధతే ధూమః"

దూరములోనుండి వచ్చునదియును, గణుపులచే నడ్డగింపబడినదియును, యంత్రద్వారముచే కృశముగ జేయబడినదియును నగుధూమము ఇంద్రియములను బాధించకుండును అని పై యర్థమునే చరకాచార్యుడును జెప్పి యున్నాడు.

### ధూమపానక్రమము

ఋజ్వాపవిష్ట స్తచ్చేతా వివృతాస్య స్త్రిపర్యయమ్. ౯
పిధాయ చ్ఛిద్ర మేకైకం ధూమం నాసికయా పిబేత్,

మనుజుడు ఋజువుగ కూర్చుండి ధూమపానమునందే మనస్సు నునిచి నోరును తెరచికొని ఆక్షేపము, విసర్గము, ఆపనము అనుమూడు పర్యాయములచే నొక్కొక నాసికాద్వారమును మూసికొని మఱియొక నాసికాద్వారముచే నాధూమమును పానము చేయవలయును. (అనగా ఒక నాసికాద్వారమును మూసికొని మఱియొక నాసికాద్వారమువలన ధూమము నాకర్షించుకొని ధూమమును పానముచేయవలయు ననియును, మఱియొక నాసికాద్వారమును మూసికొని ఆ ధూమమును మఱియొక నాసికాద్వారమువలన వెలుపరచవలయు ననియును భావము)

### నాసాశిరోగములయందు ధూమపానక్రమము

ప్రాక్ పిబేన్నాసయోత్క్లిష్టే దోషే ఘ్రాణశిరోగతే ౧౦
ఉత్క్లేశనార్థం వక్త్రేణ విపరీతం తు కంఠగే,

నాసికను జెందియుండు దోషముగాని, లేక శిరమును జెందియుండు దోషముగాని స్వస్థానములో నుండి చలించి యుండగా తొలుత నాసికమువలన ధూమమును పీల్చవలయును. పై జెప్పినదోషములు స్వస్థానములోనుండి చలించకుండునపుడు అవి చలించుటకై నోటితో పొగను పీల్చవలెను. పిమ్మట నాసారంధ్రములచే పీల్చవలెను. దోషములు కంఠము నడ్డగించియుండగా ఆ కంఠగతదోషము ఆస్థానములోనుండి చలించుటకై ధూమమును విపరీతముగ పానము చేయవలయును. విపరీత మనగా—తొలుత నాసికమువలన పానముచేసి పిదప ముఖమువలన పానము చేయవలయునని యర్థము.

### ధూమోత్సర్గక్రమము

ముఖేనైవ వమేద్ధూమం నాసయాదృగ్విఘాతకృత్, ౧౧

నాసారంధ్రములచే నైనను నోటిచే నైనను పీలుపబడిన ధూమమును నోటినుండియే బైటవెడలించవలెను. నాసారంధ్రమునుండి వెడలింపంజనదు. ఏలయనగా, నాసికము వలన వెలిపరచబడిన ధూమము నేత్రములకు తిమిరము మొదలగు రోగములను గలుగ జేయును.

ఆక్షేపమోక్షైః పాతవ్యో ధూమస్తు త్రిస్త్రిభిస్త్రిభిః,

మూడుమూడు ఆక్షేపములవలన మూడుమార్లు ధూమమును పానము చేయవలయును. ఆక్షేపమనగా —పొగను లోనికి ఆకర్షించుట. మోక్షము అనగా—పొగను బయట వెడలించుట.

### ధూమపానసంఖ్య

అహ్నః పిబేత్సకృత్ స్నిగ్ధం ద్విర్మధ్యం శోధనం పరమ్. ౧౨
త్రిశ్చతుర్వా

స్నిగ్ధమను ధూమమును దినమునం దొకమారు పానము చేయవలయును. మధ్యమమనుధూమమును ఒక దినమునకు రెండు మార్లు పానము చేయవలయును. తీక్ష్ణ మను ధూమమును ఒక దినమునకు మూడు మార్లుగాని లేక నాల్గు మార్లుగాని పానము చేయవలయును.

### స్నిగ్ధ ధూమద్రవ్యములు

మృదౌ తత్ర ద్రవ్యాణ్యగురుగుగ్గులుః,
ముస్తస్థౌణేయశైలేయనలదోశీరవాలకమ్. ౧౩
వరాంగకౌంతీమధుకబిల్వమజ్జైలవాలుకమ్,
శ్రీవేష్టకం సర్జరసో ధ్యామకం మదనం ప్లవమ్ ౧౪
సల్లకీ కుంకుమం మాషా యవాః కుందురకం తిలాః,
స్నేహాః ఫలానాం సారాణాం మేదోమజ్జావసాఘృతమ్ ౧౫

పై జెప్పినమూడు విధములైన ధూమములలో అగరు, గుగ్గిలము, తుంగముస్తెలు, స్థౌణేయము, జాలిపువ్వు, తెల్లవట్టివేరు, వట్టివేరు, కురువేరు, లవంగపుచెక్క, రేణుకలు, యష్టిమధుకము, మారేడుగింజలు, నాగుదోస, మడ్డిపాలు, సర్జరసము, కామంచిపూరి, మ్రంగకాయ, కలుజువ్వి, అందుగు, కుంకుమపువ్వు, మినుములు, యవలు, కుందురుష్కము, కొండగోలుగు, నారికేళము ఈమొదలగు ఫలములయొక్క స్నేహ,

ములు, చంద్ర, వేగిస మొదలగువానియొక్క స్నేహములు, మేదస్సు, మజ్జ, వస, ఆవు నెయ్యి, అనునవి స్నిగ్ధ మను ధూమోపయుక్తద్రవ్యములు.

### శమనధూమద్రవ్యములు

శమనే సల్లకీ లాక్షా పృథ్వీకా కమలోత్పలమ్,
న్యగ్రోధోదుంబరాశ్వత్థప్లక్షలోధ్రత్వచస్సితా. ౧౬
యష్టీమధుః సువర్ణత్వక్ పద్మకం రక్తయష్టికా,
గంధాశ్చాకుష్ఠతగరాః

అందుగు, లక్క, బొంపయేలకలు, తామరపువ్వు, నల్లకలువ, మఱ్ఱి, మేడి, రావి, జువ్వి, లొద్దుగు వీనియొక్కపట్టలు, శర్కర, అతిమధురము, సువర్ణత్వక్క, పుష్కరమూలము, మంజిష్ఠ, అను నీద్రవ్యంబులును, చెంగల్వకోష్టు గ్రంథితగరము లప్పు తక్కిన గంధద్రవ్యంబులును శమనధూమపానమున కుపయోగింపదగును.

### తీక్ష్ణధూమద్రవ్యములు.

తీక్ష్ణే జ్యోతిష్మతీ * నిశా. ౧౭
దశమూలమనోహ్వాలం లాక్షా శ్వేతా ఫలత్రయమ్,
గంధద్రవ్యాణి తీక్ష్ణాని గణో మూర్ధవిరేచనః. ౧౮

మెరపుతీగె (మాల్కంగిని), పసుపు, దశమూలములు, మణిశిల, లక్క, తెల్ల అతివస, త్రిఫలములు, గంధద్రవ్యములలో తీక్ష్ణములైన చెంగల్వకోష్టు, గ్రంథితగరము మున్నగు గ్రంథద్రవ్యములు. "వేల్లాపామార్గ" అని యుపక్రమించి అష్టాంగసంగ్రహములో జెప్పియుండు శిరోవిరేచనద్రవ్యములు ఇవి యన్నియు తీక్ష్ణధూమోపయుక్త ద్రవ్యములు

### ధూమపానవర్తివిధానము

జలే స్థితామహోరాత్రమిషీకాం ద్వాదశాంగులామ్,
పిష్టైర్ధూమౌషధై రేవం పంచకృత్వః ప్రలేపయేత్. ౧౯
వర్తిరంగుష్ఠకస్థూలా యవమధ్యా యథా భవేత్,
ఛాయాశుష్కాం విగర్భాం తాం స్నేహాభ్యక్తాం యథాయథమ్
ధూమనేత్రార్పితాం పాతుమగ్నిప్లుష్టాం ప్రయోజయేత్,

పండ్రెండు అంగుళములు నిడుపుగల ఇషీక (రెల్లు దర్భకాడ)ను ఒక యహోరాత్రము జలములో వేసి యుంచి ధూమపానమునకై చెప్పబడిన యోషధములను పిండి ఐలె నూరి ఆ ఇషీకపై ఐదు మార్లు పూయవలయును. అటుల పూసినయెడల ఒకఅంగుష్ఠ

* నిశే ఇతిపా.

ప్రమాణమంత లావు, యవలు ప్రవేశించతగిన మధ్యద్వారము గల యొక వత్తిగ నగును ఆ వత్తిని నీడ నెండించి పిదప దాని మధ్యమునం దుండు ఇషీక నెత్తివేసి ఆయాదోషముల కనుగుణముగ ఘృతము మొదలగు స్నేహములచే దడిపి ధూమయంత్రద్వారములో నునిచి కొనయందు నిప్పుచే కాల్చి ధూమపానార్థమై ప్రయోగింపవలయును.

మఱియొకవిధమగు ధూమపానక్రమము

శరావసంపుటచ్ఛిద్రే నాడీం న్యస్య దశాంగులామ్. ౨౧
అష్టాంగులాం వా వక్త్రేణ కాసవాన్ ధూమమాపిబేత్,

మూకుడుయొక్క సంపుటములో ద్వారము చేసి యా ద్వారమునందు పది లేక యెనిమిది అంగుళముల ప్రమాణము గలగొట్టము నునిచి దానిమార్గమునుండి ముఖముచే ధూమమును కాసరోగము గలవాడు పానము చేయవలయును. అది యెట్లనగా — పొగ లేకుండు చంద్ర, రేగు మొదలగు కట్టెలయొక్క గట్టియైన అంగారశకలముల నొక మూకుడులో సంపూర్ణముగ వేసి దానిలో స్నేహముతో గూడియుండు కాసహర చూర్ణమునుగాని గుళికలనుగాని వేసి నడుమద్వారముగల మూకుడుచే మూసి ఆద్వారము నందు ఎనిమిదిలేక పది యంగుళములనిడుపు గలగొట్టము నునిచి దానినుండి కాసరోగము గలవాడు నోటిచే ధూమమును పానము చేయవలయును.

ధూమపానఫలము

కాసశ్వాసః పీనసో విస్వరత్వం
పూతిర్గంధః పాండుతా కేశదోషః,
కర్ణాస్యాక్షిస్రావకండ్వార్తిజాడ్యం
తంద్రా హిధ్మా ధూమపం న స్పృశంతి. ౨౨

కాసము, శ్వాసము, పీనసము, స్వరవికారము, ముఖమునందును నాసికము నందును దుర్గంధము, ముఖమునందు పాండువర్ణము, కేశదోషము (అనగా వెండ్రు కలకు శ్వేతపింజరాదివర్ణములు) కర్ణ ముఖ నేత్రములయందు స్రావము, దురద, శూల, జడత్వము, తంద్ర, హిధ్మ (ఎక్కిళ్లు) అనునీ రోగములు ధూమపానము చేయు వానికి గలుగనేరవు.

ఏకవింశాధ్యాయము, ముగిసెను.

---

# ద్వావింశతితమాధ్యాయము



అవ.—గండూషము నస్య ధూమ పానములబోలె ఊర్ధ్వాంగముల కనుకూల మైన చికిత్స యగుటంజేసి ధూమపానమును జెప్పినపిదప గండూషావిధుల దెల్పు నధ్యాయము చెప్పబడుచు.

గండూషాదివిధ్యధ్యాయప్రారంభము

సూ॥ అథాతో గండూషాదివిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

ధూమపానవిధ్యధ్యాయానంతరము గండూషకబళాదివిధులను తెలియపఱచు నట్టి గండూషాదివిధ్యధ్యాయమును వివరించెదము.

చతుర్విధగండూషములు

చతుష్ప్రకారో గండూషః స్నిగ్ధః శమనశోధనౌ,
రోపణశ్చ

గండూషము స్నిగ్ధము, శమనము, శోధనము, రోపణము అని నాలుగువిధంబులు.

గండూషప్రయోగ క్రమము

త్రయస్తత్ర త్రిషు యోజ్యాశ్చలాదిషు, ౧
అంత్యో వ్రణఘ్నః

పై జెప్పిన నాల్గు విధములైన గండూషములలో స్నిగ్ధము మొదలగు మూడు గండూషములను వాతాది త్రిదోషములయందు యథాక్రమముగా (అనగా వాతము నందు స్నిగ్ధ మను గండూషమును, పిత్తమునందు శమన మను గండూషమును, కఫము నందు శోధన మను గండూషమును) ప్రయోగింపవలయును. రోపణ మను గండూషము వ్రణమును పోగొట్టును. కాబట్టి దానిని వ్రణమునం దుపయోగపఱచవలయును.

స్నిగ్ధగండూషలక్షణము

స్నిగ్ధోఽత్ర స్వాద్వమ్లపటుసాధితైః,
స్నేహైః

ఆ గండూషములలో స్నిగ్ధ మనుగండూషము మధురముగ, అమ్లముగ, లవణ ముగ నుండు ద్రవ్యములచే సిద్ధము చేయబడిన స్నేహములవలన చేయబడును.

శమనగండూషలక్షణము

సంశమన *స్తిక్త కషాయమధురౌషధైః, ౨

సంశమన మను గండూషము తిక్తముగ, కషాయముగ, మధురముగ నుండు చేదుపొట్ల, వేప, నేరేడు, మామిడి, ఇప్ప అనువానికషాయము, శర్కరోదకము, తేనె మొదలగు నౌషధములచే సిద్ధమగును.

శోధన గండూషలక్షణము

శోధనస్తిక్తకట్వమ్లపటూష్ణైః

శోధన మను గండూషము తిక్తముగ, కటువుగ, అమ్లముగ, లవణముగ, ఉష్ణముగ నుండు ఔషధములచే సిద్ధ మగును.

రోపణగండూషలక్షణము

రోపణః పునః,

కషాయతిక్తకైః

రోపణమను గండూషము కషాయముగ, తిక్తముగ నుండు ఔషధములచే సిద్ధమగును.

గండూషములయందు స్నేహాద్యుపయోగము

తత్ర స్నేహః క్షీరం మధూదకమ్ 3

శుక్తం మద్యం రసం మూత్రం ధాన్యామ్లం చ యథాయథమ్,

కల్కైర్యుక్తం విపక్వం వా యథాస్పర్శం ప్రయోజయేత్. ౪

పైజెప్పిన గండూషములలో స్నేహము, క్షీరము, మధూదకము, శుక్తము, మద్యము, మాంసరసము, మూత్రము, ధాన్యామ్లము, వీనిని ఆయాదోషానుగుణముగా కల్కములతో గలిపి పక్వము జేసి శీతలముగగాని, ఉష్ణముగగాని సుఖస్పర్శముగగాని ప్రయోగింపవలయును.

దంతహర్షాదులయందు తిలకల్కోదకోపయోగము

దంతహర్షే దంతచాలే ముఖరోగే చ వాతికే,

సుఖోష్ణమథవా శీతం తిలకల్కోదకం హితమ్. ౫

దంతహర్షము, దంతచలనము, ముఖరోగము, వాతరోగము వీనియందు దోషానుగుణముగా సుఖోష్ణముగగాని, శీతలముగగాని తిలకల్కోదకము (నువ్వులపిండితో జేరిననీళ్ల నుపయోగించుట) హితకరమైనది.

---

* స్నిగ్ధ ఇతి పా.

గండూషధారణమునందు తైలోపయోగము

గండూషధారణే నిత్యం తైలం మాంసరసోఽథవా,

గండూష ధారణమునం దెల్లపుడు తైలము, లేక మాంసరసము హితకరమైనది.

కొన్నిరోగములయందు ఘృతాద్యుపయోగము

ఊషాదాహాన్వితే పాకే క్షతే వాగంతుసంభవే ౬
విషక్షారాగ్నిదగ్ధే చ సర్పిర్ధార్యం పయోఽథవా,

తాపంబును మంటయును కల నోటిపూంటునందును, దెబ్బ తగులుట మున్నగునా గంతుకకారణములచే నైన గాయమునందును, విషమునందును, క్షారముచేనైనను, నిప్పుచే నైనను కాలినను నేతిని పాలను గండూషమునకై యుపయోగింప నగును.

మాక్షికగండూషధారణగుణము

వైశద్యంజనయత్యాస్యే సందధాతి ముఖవ్రణాన్. ౭
దాహతృష్ణాప్రశమనం మధుగండూషధారణమ్,

మాక్షిక (తేనె) గండూషధారణము నోటియందు నైర్మల్యమును గలుగ జేయును. నోటివ్రణముల నార్చును. తాపమును, దప్పిని శమనము జేయును

ధాన్యామ్ల గండూషధారణగుణము

ధాన్యామ్లమాస్యవైరస్యమలదౌర్గంధ్యనాశనమ్. ౮

ధాన్యామ్ల గండూషము నోటియొక్క అరుచి, మలము, దౌర్గంధ్యము వీనిని హరింపజేయును.

తదేవాలవణం శీతం ముఖశోషహరం పరమ్,

మఱియు నాధాన్యామ్లమునే లవణముతో జేర్చక యుపయోగపరచినయెడల మిగుల శీతలముగ నుండును. మిక్కుటముగ ముఖశోషను హరింపజేయును

క్షారోదకగండూషగుణము

ఆశు క్షారాంబుగండూషో భినత్తి శ్లేష్మణశ్చయమ్. ౯

స్వర్జికము మొదలగు క్షారములతో గూడియుండు ఉదకముయొక్క గండూషము కఫవృద్ధి నతి శీఘ్రముగ హరించును.

ఉష్ణోదకగండూషగుణము

సుఖోష్ణోదకగండూషైర్జాయతే వక్త్రలాఘవమ్,

సుఖోష్ణముగ నుండు ఉదకముచే చేయబడిన గండూషము ముఖలాఘవమును గలుగజేయును.

### గండూషధారణక్రమము

నివాతే సాతపే స్విన్నమృదితస్కంధకంధరః. ౧౦
గండూషమపిబన్ కించిదున్నతాస్యో విధారయేత్.

తొలుత స్వేదకర్మను చేయించికొని పిదప భుజములు, కంధరము (అనగా మెడ) వీనియందు మర్దనము చేయించుకొనిన పురుషుడు ఎండతోఁగూడి గాలి లేకుండు ప్రదేశమునం దొకింత ముఖము పై కెత్తుకొని గండూషమును నోటియందు ధరించవలయును. అట్టిద్రవము త్రాగంజనదు.

### గండూషధారణకాలము

కఫపూర్ణాస్యతా యావత్స్రవద్ఘ్రాణాక్షతాథవా. ౧౧

నోరు కఫముచే పూర్ణమగువరకుగాని, లేక నాసికము, నేత్రములు వీనియందు నీళ్లు గారునంత వరకుగాని గండూషమును ధరించుకొని యుండవలయును. ఇత్తెరంగున నాలు గైదు పర్యాయములుగాని లేక స్వస్థత గలుగునంత వరకుగాని గండూషమును ధరించవలయును.

### గండూషకబళస్వరూపము

అసంచార్యో ముఖే పూర్ణే గండూషః కబలోఽన్యథా,

నోరును కదలించుట కశక్యముగ నుండునటుల సంపూర్ణముగా నౌషధము నుంచుకొనుట గండూష మనబడును. నోరును కదలించుటకు శక్యముగ నుండునటుల నౌషధమును కొంచెము తక్కువగ నోటనుంచుకొనుట కబళ మనబడును.

### మన్యాదిరోగములయందు కబళోపయోగము

మన్యాశిరఃకర్ణముఖాక్షిరోగాః ప్రసేకకంఠామయవక్త్రశోషాః,
హృల్లాసతంద్రారుచిపీనసాశ్చ సాధ్యా విశేషాత్కబలగ్రహేణ

మెడయందు వెనుకప్రక్కనుండు మన్య యనునరములు, శిరస్సు, చెవులు, నోరు, నేత్రములు అను వానియందు గలుగురోగములును, నోట నీరుగారుట, నానావిధములైన కంఠరోగములు, ముఖశోష, హృల్లాసము, తంద్ర, అరుచి, పీనసము అను నీరోగములును, విశేషముగా కబళధారణముచే సాధింపదగి యుండును.

### త్రివిధప్రతిసారణము

కల్కో రసక్రియా చూర్ణం త్రివిధం ప్రతిసారణమ్, ౧౩

ప్రతిసారణము కల్కము (అనగా జలాదులచే నూరబడినది) రసక్రియ (అనగా మాక్షికాదులచే ద్రవముగ జేయబడినది) చూర్ణము అని మూడు విధంబులు.

—౩ ప్రతిసారణప్రయోగక్రమము ౭—

యుంజ్యాత్తత్ కఫరోగేషు గండూషవిహితౌషధైః,

శ్లేష్మరోగములయందు శోధన గండూషోపయుక్తమగు నౌషధములచే నా ప్రతిసారణమును ప్రయోగింపవలయును. ఇచట "గండూషవిహితౌషధైః" అని సామాన్యముగ జెప్పి యుండినను పైజెప్పిన చికిత్స కఫరోగవిషయమైనందున శోధనగండూషములో జెప్పియుండు ఔషధములచే ప్రతిసారణమును చేయవలయు నని తాత్పర్యము.

—౩ త్రివిధ ముఖాలేపము ౭—

ముఖాలేపస్త్రిధా దోషవిషహా వర్ణకృచ్చ సః ౧౪

ముఖాలేపము దోషఘ్నము, విషఘ్నము, వర్ణకరము అని త్రివిధంబు.

—౩ ముఖాలేపప్రయోగక్రమము ౭—

ఉష్ణో వాతకఫే శస్తః శేషేష్వత్యర్థశీతలః,

వాతశ్లేష్మరోగములందు ఉష్ణముగ నుండు ముఖాలేపము హితకరము. పిత్తమునందును, వాతాధిక్యమునందును, మిగుల శీతలముగ నుండు ముఖాలేపము హితకరము.

—౩ ముఖాలేపప్రమాణము ౭—

త్రిప్రమాణశ్చతుర్భాగ త్రిభాగార్ధాంగుళోన్నతిః. ౧౫

పైజెప్పిన 3 విధములగు ముఖాలేపములు యథాక్రమముగా 4-గుభాగముల ఔన్నత్యము, 3 భాగముల ఔన్నత్యము, అర్ధాంగుళౌన్నత్యము అని 3 విధప్రమాణములు గలవై యుండును. (అనగా దోషఘ్నముఖాలేపము 1 అంగుళప్రమాణము దళము గలదిగ, విషఘ్నముఖాలేపము $\frac{3}{4}$ అంగుళప్రమాణము దళము గలదిగ, వర్ణకర ముఖాలేపము $\frac{1}{2}$ అంగుళ ప్రమాణము దళము గలదిగ నుండవలయు నని భావము.)

—౩ ముఖాలేపధారణక్రమము ౭—

అశుష్కస్య స్థితిస్తస్య శుష్కో దూషయతి చ్ఛవిమ్,
తమార్ద్రయిత్వాఽపనయేత్తదంతేఽభ్యంగమాచరేత్. ౧౬

ఆ ముఖాలేపములను ఎండక తడిగ నుండువరకు నుంచుట ప్రశస్తము. ఎండినచో చర్మమును చెరిచి కాంతిని చెరచును. కాబట్టి ముఖాలేపనము యెండినయెడల దానిని తడిపి యెత్తివేసి పిదప నభ్యంగము చేసికొనవలయును.

—౩ ముఖాలేపనమునందు దివాస్వాపాదినిషేధము ౭—

వివర్జయేద్దివాస్వప్న భాష్యాగ్న్యాతపశుక్క్రుధః,

ముఖాలేపనము చేసికొనినవాడు పగటినిద్ర, సంభాషణము, నిప్పునెగయందును

ఎండయందు నుండుట, శోకము, క్రోధము వీనిని వర్జించవలయును. ఏలననగా — పగటి నిద్ర మొదలగువానివలన దురద, శోఫ, పీనసము, దృష్టిమాంద్యము మొదలగునుపద్రవములు గలుగును

### పీనసాదులయందు ముఖాలేపనిషేధము

న యోజ్యః పీనసేఽజీర్ణే దత్తనస్యే హనుగ్రహే. ౧౬
అరోచకే జాగరితే

పీనసరోగి, అజీర్ణరోగి, నస్యము చేయించుకొనినవాడు, హనుగ్రహరోగి అరోచకము గలవాడు, జాగరణము చేసినవాడు వీరలకు ముఖాలేపమును ప్రయోగింపఁజనదు.

### ముఖాలేపసేవనఫలము

స చ హంతి సుయోజితః,
అకాలపలితవ్యంగవలీతిమిరనీలికాః ౧౭

విధిప్రకారము సేవించబడిన యీముఖాలేపము అకాలమునందు వెండ్రుకలు నెరయుట, వ్యంగము, వళులు, తిమిరము, నీలిక, మొదలగు రోగములను హరింపజేయును.

### షడ్విధ ముఖాలేపములు

కోలమజ్జా వృషాన్మూలం శాబరం గౌరసర్షపాః,
సింహీమూలం తిలాః కృష్ణా దార్వీత్వఙ్నిస్తుషా యవాః. ౧౯
దర్భమూలహిమోశీరశిరీషమిసితండులాః,
కుముదోత్పలకల్హారదూర్వామధుకచందనమ్. ౨౦
కాలేయకతిలోశీరమాంసీతగరపద్మకం,
తాలీసగుంద్రాపుండ్రాహ్వాయష్టీకాశనతాగురుః. ౨౧
ఇత్యర్ధార్ధోదితా లేపా హేమంతాదిషు షట్ స్మృతాః,

రేగుగింజ, అడ్డసరపువేళ్లు, తెల్లలొద్దుగు, తెల్లావాలు, వీనిచే సిద్ధము చేయబడిన కోలమజ్జాది ముఖాలేపము 1. ములకవేళ్లు, నల్లనువ్వులు, పసుపు, మ్రానిపసుపు, లవంగపుచెక్క, పొట్టులేనియవలు, వీనిచే సిద్ధము చేయబడిన సింహీమూలాది ముఖాలేపము 2. దర్భవేరు, కర్పూరము; వట్టివేరు; దిరిసెనము; సదాప బియ్యము వీనిచే సిద్ధము చేయబడిన దర్భమూలాది ముఖాలేపము 3. తెల్లకలువ; నల్లకలువ, చెంగలువ; గరికెగడ్డి; యష్టిమధుకము; చందనము వీనిచే సిద్ధము చేయబడిన కుముదాది ముఖాలేపము 4. శ్రీగంధము, నువ్వులు, వట్టివేరు, జటామాంసి, గ్రంధితగరము, పుష్కరమూలము వీనిచే సిద్ధము చేయబడిన కాలేయకాది ముఖాలేపము 5. తాళిసపత్రి.

భద్రముస్తెలు ప్రపౌండరీకము, యష్టిమధుకము, రెల్లుదర్భవేళ్లు, తుంగగడ్డలు, అగరు వీనిచే సిద్ధము చేయబడిన తాళీసాది ముఖాలేపము ఈ 6 విధములైన ముఖాలేపములు హేమంతాది ఋతువులయందు యథాక్రమముగా (అనగా గోలమజ్జాది ముఖాలేపము హేమంతఋతువునందును, సింహీమూలాది ముఖాలేపము శిశిరఋతువునందును, దర్భమూలాది ముఖాలేపము వసంతఋతువునందును, కుముదాది ముఖాలేపము గ్రీష్మఋతువునందును, కాలేయకాది ముఖాలేపము వర్షాకాలమునందును, తాళీసాది ముఖాలేపము శరత్కాలమునందును) హితకరము లని మునులచే జెప్పబడినది.

### ముఖాలేపగుణము

ముఖాలేపనశీలానాం దృఢం భవతి దర్శనమ్. ౨౨
వదనం చాపరిమ్లానం శ్లక్ష్ణం తామరసోపమమ్,

ముఖాలేపనము నభ్యసించుమనుజులకు దృష్టి దృఢముగ నగును. మఱియును ముఖము వాడక మృదువై తామరపుష్పముతో సమానముగ నగును.

### శిరస్సు కుపయుక్తమగు చతుర్విధతైలములు

అభ్యంగసేకపిచవో వస్తిశ్చేతి చతుర్విధమ్. ౨౩
మూర్ధతైలం బహుగుణం తద్విద్యాదుత్తరోత్తరమ్,

శిరమునం దుపయోగింపబడు తైలములు అభ్యంగము, సేకము, (అనగా శిరమునందు తైలమును ధారగా విడుచుట), పిచు (అనగా ప్రత్తినిగాని లేక వస్త్రఖండమును గాని తైలముచే దడిపి శిరము పై నునుచుట), వస్తి (అనగా ఉత్తరత్ర జెప్పబడు శిరోవస్తి విధిప్రకారము శిరమునందు తైలమును ధరించుట), అని నాల్గు విధంబులు. ఆ నాల్గు విధములైన తైలములు ఉత్తరోత్తరము యథాక్రమము గా (అనగా అభ్యంగమునకంటె సేకము, దానికంటె పిచువు, దానికంటె వస్తి) బహుగుణములు గలవి యని తెలియవలయును.

### అభ్యంగతైలోపయోగము

తత్రాభ్యంగః ప్రయోక్తవ్యో రౌక్ష్యకండూమలాదిషు. ౨౪

ఆ నాలుగువిధములగు తైలములలో అభ్యంగముతైలము రూక్షత, దురద, మలము మొదలగు నుపద్రవములయందు ప్రయోగింపవలయును.

### పరిషేకతైలోపయోగము

అరూంషికాశిరస్తోదదాహపాకవ్రణేషు తు,
పరిషేకః

పరిషేకమను తైలమును అరూంషిక, శిరమునందు శూల, తాపము, పాకము, వ్రణము వీనియందు ప్రయోగింపవలయును.

## పిచుతైలోపయోగము

పిచుః కేశశాతస్ఫుటనధూపనే ౨౫
నేత్రస్తంభే చ

పిచు వను తైలమును వెండ్రుక లూడుట, వెండ్రుక చీలుట, ధూపనము, నేత్రస్తంభము వీనియందు ప్రయోగింపవలయును.

## వస్తితైలోపయోగము

వస్తిస్తు ప్రసుప్త్యర్దితజాగరే,
నాసాస్యశోషే తిమిరే శిరోరోగే చ దారుణే. ౨౬

వస్తి యను తైలమును ప్రసుప్తివాతము, అర్దితవాతము, జాగరణము, నాసికము, ముఖము వీనియందు ద్రవములేకయెండుట, తిమిరరోగము, దారుణమైన శిరోరోగము, అనువ్యాధులయందు ప్రయోగింపవలయును.

## శిరోవస్తిప్రయోగక్రమము

విధిస్తస్య నిషణ్ణస్య పీఠే జానుసమే మృదౌ,
శుద్ధాక్తస్విన్నదేహస్య దినాంతే గవ్యమాహిషమ్. ౨౭
ద్వాదశాంగులవిస్తీర్ణం చర్మపట్టం శిరస్సమమ్,
ఆకర్ణబంధనస్థానం లలాటే వస్త్రవేష్టితే. ౨౮
చైలవేణికయా బద్ధ్వా మాషకల్కేన లేపయేత్,
తతో యథావ్యాధిశృతం స్నేహం కోష్ణం నిషేచయేత్. ౨౯
ఊర్ధ్వం కేశభువో యావద్ద్వ్యంగులం

తొలుత వమనాదులచే శుద్ధముగ, తైలాదులచే నభ్యక్తముగ, స్వేదకర్మచే స్విన్నముగనుండు శరీరముగలవాడును, మోకాటిపొడవుగలిగి మృదువుగనుండు ఆసనమునందు కూర్చుండియుండువాడు నైనపురుషునికి సాయంకాలమునందుగాని లేక రాత్రియందుగాని లలాటమునందు వస్త్రము చుట్టి 12 అంగుళముల ప్రమాణముతో గూడినట్టియును, శిరమునకు సమమైనదియును, చెవివరకు కట్టతగినదియునైన గోచర్మపట్టముగాని మహిషచర్మపట్టముగాని చీలవేణికచేత (అనగా వస్త్రఖండముచేత) శిరమునందు కట్టి దానిపై మాషకల్కమును లేపనముచేసి పిదప వ్యాధి, దోషము, దూష్యము వీనికనుగుణముగా పక్వముచేయబడినదియును, సుఖోష్ణముగనుండునదియునైన స్నేహ

ము కేశప్రదేశమునకుపైన రెండంగుళముల ప్రమాణము ఆసేచనము చేయవలయును. ఇది యే శిరోవస్తియొక్కవిధి.

"అథ శుద్ధతనోస్సాయం రాత్రౌ వా నివాతస్థస్య స్వభ్యక్తస్విన్నస్య సోపాశ్రయాసనోపవిష్టస్య కేశాంతే శ్లక్ష్ణం త్ర్యంగులం మాషపిష్టేన సూక్ష్మేణ సద్యస్సుఖాంబునా మృదితేన ఉభయతః ప్రదిగ్ధం వస్త్రపట్టం బధ్నీయాత్. తదుపరిష్టాత్ సంధాయం వస్తిం వస్తిమూలం చ దృఢ మవలీకం సమంచైలవేణికయా బద్ధ్వా పునర్మాషపిష్టేనోపరిస్రావి కృత్వా యథా వ్యాధిదోష దూష్యహితసిద్ధ మఘృతముం స్నేహం సుఖోష్ణ మాసేచయేత్."

వమనవిరేచనాదులచే శుద్ధమైనశరీరము గలవాడును, అభ్యంగము, స్వేదకర్మ వీనిని జేయించుకొనినవాడును నగు పురుషుని సాయంకాలమునందుగాని లేక రాత్రియందుగాని గాలి లేకుండు ప్రదేశములో కొంచెము పొడవుగనుండు ఆసనమునందు సుఖముగా కూర్చుండబెట్టి ఉష్ణోదకముచే బాగుగ మర్దనము చేయబడిన సూక్ష్మమయిన మినుపపిండిని 3 అంగుళముల వెడల్పు గలదిగను, నున్నగనుండు వస్త్రపట్టముయొక్క యిరుప్రక్కల యందుపూసి వాని కేశాంతమునందు దృఢముగ కట్టి పిదప దానిపై వస్తియొక్క మూలము సంధానము చేసి గట్టిగ, సమముగ చైలవేణికచే కట్టి మరల మినుపపిండిని దానిపై పూసి పిదప వ్యాధి, దోషము, దూష్యము వీనికనుగుణముగా సిద్ధము చేయబడిన ఘృతము మొదలగుస్నేహములలో దేనినైన నొకదానిని సుఖోష్ణముగా ఆసేచనము చేయవలయును అని అష్టాంగసంగ్రహమునందు శిరోవస్తివిధానము చెప్పబడి యున్నది.

శిరోవస్తి ధారణకాలప్రమాణము

ధారయేచ్చతమ్,

ఆవక్త్రనాసికోత్క్లేదాత్

ఆస్నేహమును నాసికము, నోరు వీనియందు నీరుగారువరకు ధరించవలయును.

దశాష్టౌ షట్చలాదిషు. 30

మాత్రాసహస్రాణి

వాతాదిదోషములలో యథాక్రమముగా (అనగా వాతములో 10,000మాత్రాకాలమును, పిత్తములో 8000 మాత్రాకాలమును, కఫములో 6000 మాత్రాకాలమును) శిరోవస్తి స్నేహమును ధరించవలయును.

అరుజే త్వేకం

రోగములేకుండా స్వస్థవృత్తుడుగ నుండువాడు 1000 మాత్రాకాలము ఆ శిరోవస్తిస్నేహమును ధరించవలయును.

శిరోవస్త్యనంతరకర్తవ్యము

స్కంధాదిమర్దయేత్,

ముక్తస్నేహస్య

పిదప శిరోవస్తిని విప్పి వేసి వానియొక్క భుజములు, శిరస్సు, మెడ మొదలగు వానిని మర్దించి పిదప "ఉష్ణోదకోపచారీస్యా"దిత్యాది వచనములచే పూర్వము చెప్ప బడినవిధుల నన్నిటి నాచరింపంజేయవలయును.

శిరోవస్తి సేవనకాలనియమము

పరమం సప్తాహం తస్య సేవనమ్, 30

ఆ శిరోవస్తియొక్క ముఖ్యమైనకాలము 7 దినములు. ఇటుల జెప్పుటచే 3 లేక 4 లేక 7 దినములు శిరోవస్తిని చేయవలయు నని భావంబగుచున్నది.

కర్ణపూరణధారణకాలము

ధారయేత్పూరణం కర్ణే కర్ణమూలం విమర్దయన్,
రుజః స్యాన్మార్దవం యావ న్మాత్రాశతమవేదనే. 31

చెవిబాధ శాంతియగువరకు కర్ణమూలమును మర్దనము చేయుచు కర్ణపూరణమును ధరించవలయును. స్వస్థవృత్తుడుగ నుండునపుడు ఆకర్ణపూరణమును 100 మాత్రా కాలము ధరించవలయును.

మాత్రాలక్షణము

యావత్పర్యేతి హస్తాగ్రం దక్షిణం జానుమండలమ్,
నిమేషోన్మేషకాలేన సమం మాత్రా తు సా స్మృతా. 33

దక్షిణహస్తాగ్రము దక్షిణజానుమండలమును నిమేషోన్మేషకాలముచే సమముగా నెంతకాలములో చుట్టివచ్చునో అట్టికాలము మాత్ర యనబడు నని మునులచే జెప్పబడి యున్నది.

మూర్ధతైల సేవనఫలము

కచసదనసితత్వపింజరత్వం
పరిఫుటనం శిరసః సమీరరోగాన్,
జయతి జనయతీంద్రియప్రసాదం
స్వరహనుమూర్ధబలం చ మూర్ధతైలమ్. 34

శిరస్తైలము తలవెండ్రుక లూడుట, తలవెండ్రుకలు తెల్లనగుట, తలవెండ్రుకలు పింజరవర్ణముగ నగుట, కొసలో చీలుట మొదలగువానిని శిరమున జనించు వాతరోగములను హరింపజేయును. మఱియు నింద్రియములకు నైర్మల్యమును, స్వరము, శిరస్సు వీనికి బలమును గలుగజేయును.

ద్వావింశతితమాధ్యాయము, ముగిసెను.

# త్రయోవింశతితమాధ్యాయము

అవ. జత్రూర్ధ్వరోగప్రస్తావముచే నేత్రములయొక్క ఆశ్చోతన అంజనాదివిధులు ఈయధ్యాయమునందు చెప్పబడుచున్నవి.

ఆశ్చోతనాంజనవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాత ఆశ్చోతనాంజనవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః

గండూషాదివిధ్యధ్యాయానంతరము ఆశ్చోతనము, అంజనము అను నీవిధులను తెలియపరచునట్టి ఆశ్చోతనాంజనవిధ్యధ్యాయమును వివరించెదను.

నేత్రరోగములయందు ఆశ్చోతనము

సర్వేషామక్షిరోగాణామాదావాశ్చోతనం హితమ్,
రుక్తోదకండూఘర్షాశ్రుదాహ *రోగనిబర్హణమ్. ౧

సకల నేత్రరోగములకు తొలుత ఆశ్చోతనము హితకరము. ఆ ఆశ్చోతనము నేత్రములయందు బాధ, నేత్రములయందు సూదులచే పొడుచునటుల పోటు, నేత్రములయందు దురద, నేత్రఘర్షము, కంటిలో నీరుకారుట, నేత్రములయందు మంట వీనిని హరింపజేయును. ఆశ్చోతన మనగా —

"ఉన్మీలితేఽక్ష్ణి ధృజ్మధ్యే బిందుభిర్ద్వ్యంగుళాద్ధితమ్"

అనెడి వచనప్రకారము నేత్రములను తెరచి రెండంగుళముల పొడవులోనుండి ఔషధ బిందువులను విడుచుట యని యర్థము.

"అవ్యక్తేష్వేవ రుజాదిష్వేవం తుల్యగుణాం పక్ష్మపరిహారేణ అక్షికోశాలేపనం తచ్చ బిడాలకసంజ్ఞకమ్."

రోగము స్పష్టముగ దెలియకుండునపుడు రెప్పలను వదలి నేత్రకోశములో జేయబడు ఆలేపనము ఆశ్చోతనముతో సమానమైన గుణముగలదై యుండును. ఆ ఆలేపనము బిడాలక మను పేరంబరగును; అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడి యున్నది.

వాతాదిజనితనేత్రరోగములయందు ఉష్ణాద్యాశ్చోతనము

ఉష్ణం వాతే కఫే కోష్ణం తచ్ఛీతం రక్తపిత్తయోః,

ఆయాశ్చోతనము వాతములో ఉష్ణముగను, కఫములో కించిదుష్ణముగను, రక్తములోను, పిత్తములోను శీతలముగ నుండుట హితకరము.

ఆశ్చోతనవిధి

నివాతస్థస్య వామేన వామేన పాణినోన్మీల్య లోచనమ్ ౨

---

* రాగ ఇతిపా.

శుక్త్యా ప్రలంబయాऽన్యేన పిచువర్త్యా కనీనికే,
దశ ద్వాదశ వా బిందూ౯ ద్వ్యంగులాదవసేచయేత్. ౩
తతః ప్రమృజ్య మృదునా చైలేన కఫవాతయోః,
అన్యేన కోష్ణపానీయ ప్లుతేన స్వేదయేన్మృదు. ౪

గాలిలేని ప్రదేశమునందు రోగిని కూర్చుండబెట్టి వాని నేత్రములను వైద్యుడు వామహస్తముచే తెఱచి నేత్రములకు రెండంగుళముల పొడవులోనుండి పిచువర్తిచేతగాని లేక వ్రేలాడుచుండు శుక్తిచేతగాని పది పండ్రెండు బిందువులను దక్షిణహస్తముచే నల్లగ్రుడ్డుపై విడువవలయును. పిదప మృదువుగ శుద్ధముగనుండు వస్త్రఖండముచే నేత్రమును తుడిచి సుఖోష్ణమైన ఉదకములో తడుపబడినట్టియు, మృదువైనట్టియు, మఱియొక వస్త్రఖండమును నేత్రములపై మృదువుగ నద్దుటచే స్వేదకర్మ చేయించవలయును. ఈ విధిని వాత, కఫసంబంధముగల నేత్రరోగములయందు చేయవలయునేకాని పిత్త రక్తసంబంధముగల నేత్రరోగములయందు చేయంజనదు.

### అత్యుష్ణాశ్చ్యోతనాది జనితోపద్రవములు

అత్యుష్ణతీక్ష్ణం రుగ్రాగ దృఙ్నాశాయాక్షిసేచనమ్,
అతిశీతం తు కురుతే నిస్తోదస్తంభవేదనాః ౫
కషాయవర్త్మతాం ఘర్ష కృచ్ఛ్రాదున్మేషణం బహు,
వికారవృద్ధిమత్యల్పం సంరంభమపరిస్రుతమ్. ౬

అత్యుష్ణముగ, అతితీక్ష్ణముగనుండు ఆశ్చ్యోతనము నేత్రములకు రోగమును, ఎఱుపువర్ణమును, నేత్రనాశమును గలుగజేయును. అతిశీతలముగనుండు ఆశ్చ్యోతనము నేత్రములయందు సూదులచే బొడుచునటుల పోటును, నేత్రస్తంభము, నేత్రశూల, నేత్రములు కలకబారుట, నేత్రఘర్షము (అనగా ఒకటితో నొకటి యంటుకొనుట) మొదలగువానిని గలుగజేయును. అధికముగ జేయబడిన ఆశ్చ్యోతనము అతికష్టముమీద నేత్రములను తెఱచునటుల జేయును. మిగుల నల్పముగ చేయబడిన ఆశ్చ్యోతనము నేత్రవికారములను వృద్ధి జేయును. అపరిస్రుతమైన ఆశ్చ్యోతనము నేత్రములకు క్షోభను గలుగజేయును.

### ఆశ్చ్యోతనాద్యౌషధకృత్యము

గత్వా సంధి* శిరోఘ్రాణ ముఖస్రోతాంసి భేషజమ్,
ఊర్ధ్వగాన్నయనే న్యస్త మపవర్తయతే మలాన్. ౭

* సిరా ఇతిపా.

నేత్రములయందు ప్రయోగించబడిన ఔషధము నేత్రకోశసంబంధముగల సంధులు, శిరస్సు, నాసికము, ముఖము వీనియందలి స్రోతోమార్గములం జెంది ఊర్ధ్వాంగములలోనుండు మలములను బయలుపరచును.

అంజనప్రయోగము

అథాంజనం శుద్ధతనోర్నేత్రమాత్రాశ్రయే మలే,
పక్వలింగేఽల్పశోఫార్తికండూపైచ్ఛిల్యలక్షితే. ౮
మందఘర్షాశ్రు * రోగేఽక్ష్ణి ప్రయోజ్యం ఘనదూషికే,
ఆర్తే పిత్తకఫాసృగ్భిర్మారుతేన విశేషతః. ౯

వమనాదులచే శుద్ధమైన శరీరముగల పురుషునికి మలము శరీరమునందు వ్యాపించక నేత్రముల నాశ్రయించియుండునపుడు స్వల్పమైనశోఫ, అధికమైనదురద, పిచ్ఛిలత్వము మొదలగుపక్వలక్షణములు గలుగును. అట్టిసమయమునందు స్వల్పమైన ఘర్షము, కంటినీరు, ఉపద్రవము, అధికమైనమలము ఇవిగలనేత్రమునందును పిత్తము, కఫము, రక్తము, వాతము వీనిచే పీడితముగనుండు నేత్రమునందును విశేషముగా అంజనమును ప్రయోగింపవలయును.

త్రివిధాంజనములు

లేఖనం రోపణం దృష్టిప్రసాదనమితి త్రిధా,
అంజనం

అంజనము లేఖనము, రోపణము, దృష్టిప్రసాదనము నని మూడు విధంబులు. లేఖన మనగా —శుక్రార్మాదిరోగములను శస్త్రముచే ఛేదించునటుల ఛేదింపతగినది యని యర్థము. రోపణమనగా —అభిష్యందాదిరోగములను హరింపజేసి పుండును మాన్పునదియని యర్థము. దృష్టిప్రసాదన మనగా —నేత్రములను నిర్మలముగ జేయునది యని యర్థము. మఱియును తంత్రాంతరములో జెప్పబడియుండు స్నేహనమను అంజనము రోపణము, దృష్టిప్రసాదనము అను నీ రెండు విధములగు అంజనములలో నంతర్గతంబై యుండుటవలన నీతంత్రకారుడు ప్రత్యేకముగా జెప్పక విరమించెను.

లేఖనాంజనము

లేఖనం తత్ర కషాయామ్లపటూషణైః. ౧౦

పైజెప్పినమూడు విధములైన అంజనములలో లేఖన మనుఅంజనము కషాయము,

* రాగేఽక్ష్ణి ఇతి పా.

అమ్లము, లవణము, కటు అను నీ రసములుగల వస్తువులచే సిద్ధం బగును. దానిని శుక్రార్శాదిరోగములలో ప్రయోగింపవలయును.

### రోపణాంజనము

రోపణం తిక్తకై ర్ద్రవ్యైః

రోపణమను అంజనము తిక్తరసముగల ద్రవ్యములచే సిద్ధంబగును.

### ప్రసాదనాంజనము

స్వాదుశీతైః ప్రసాదనమ్,

ప్రసాదనమను అంజనము మధురముగ, శీతలముగనుండు ద్రవ్యములచే సిద్ధం బగును. మఱియును మధురముగ, శీతలముగ నుండు ద్రవ్యములచే సిద్ధము చేయబడిన చూర్ణరూపమైన అంజనము అధిక తాపముగల నేత్రములో ప్రయోగింపబడునప్పుడు దానికి ప్రత్యంజన మనుసంజ్ఞ కలుగును.

"తీక్ష్ణాంజనాభిసంతప్తే నయనే తత్ప్రసాదనమ్,
ప్రయుజ్యమానం లభతే ప్రత్యంజనసమాహ్వయమ్."

తీక్ష్ణమయిన అంజనప్రయోగముచే తాపము నొందియుండు నేత్రతాపశాంత్యర్థమై ప్రయోగింపబడు ప్రసాదనాంజనము ప్రత్యంజనమను పేరం బఱంగునని అధికపాఠము కొన్నిగ్రంథములయందు గన్పట్టుచున్నది.

### అంజనశలాకాలక్షణము

దశాంగులా తనుర్మధ్యే శలాకా ముకులాననా. ౧౧
ప్రశస్తా లేఖనే తామ్రీ రోపణే కాలలోహజా,
అంగులీ చ సువర్ణోత్థా రూప్యజా చ ప్రసాదనే. ౧౨

అంజనప్రయోగమునందు పది యంగుళముల నిడుపు గలదిగను, అలచందలంత దళము గలదిగను, నడుమ నొకింత సన్నగను, మొగ్గవంటి ముఖముగలదిగ నుండుశలాక ప్రశస్తము. లేఖనాంజనప్రయోగమునందు తామ్రముచే చేయబడినశలాక ప్రశస్తము. రోపణాంజనములో ఇనుముచే జేయబడినశలాక, అంగుళులు (అనగా వ్రేళ్ళు) ఇవి ప్రశస్తంబులు. ప్రసాదన మను అంజనములో సువర్ణముచే జేయబడిన శలాక, రజతముచే జేయబడినశలాక ఇవి ప్రశస్తంబులు.

### త్రివిధాంజనకల్పన

పిండో రసక్రియా చూర్ణ స్త్రిధైవాంజనకల్పనా,
గురౌ మధ్యే లఘౌ దోషే తాః క్రమేణ ప్రయోజయేత్.

పిండము, రసక్రియ (అనగా ద్రవ రూపమున నుండునది) చూర్ణము అని అంజనకల్పన మూడు విధంబులు. అట్టిమూడువిధములైన అంజనంబులను యథాక్రమముగా (అనగా దోష మధికముగ నుండునపుడు పిండమును, మధ్యమముగ నుండునపుడు రసక్రియను, స్వల్పముగ నుండునపుడు చూర్ణమును) ప్రయోగింపవలయును. పిండమనగా —

"పిండీ కబలికా ప్రోక్తా బధ్యతే పట్టవస్త్రకైః"

అనెడి వచనముచొప్పున ఔషధములను నూరి ఉండగజేసి నేత్రములపై నునిచి వస్త్రపట్టముచే కట్టఁదగిన అంజన మని యర్థము.

పిండాంజనాదిప్రమాణము

**హరేణుమాత్రం పిండస్య వేల్లమాత్రా రసక్రియా,**
**తీక్ష్ణస్య ద్విగుణం తస్య మృదునః**

తీక్ష్ణద్రవ్యములచే జేయంబడిన పిండ మనుసంజ్ఞగల అంజనమునకు ఒక హరేణువు (అనగా బోడసెనగలంత) ప్రమాణ మని, మృదుద్రవ్యములచే జేయబడిన పిండమను సంజ్ఞగల అంజనమునకు రెండు హరేణువులు ప్రమాణ మని, రసక్రియ యను సంజ్ఞగల అంజనమునకు ఒకవాయువిడంగప్రమాణ మనియు వైద్యులు వచించెదరు.

చూర్ణాంజనప్రమాణము

**చూర్ణితస్య చ,** ౧౪
**ద్వే శలాకే తు తీక్ష్ణస్య తిస్రస్స్యురితరస్య చ.**

తీక్ష్ణద్రవ్యములచే జేయబడిన చూర్ణమను సంజ్ఞగల అంజనములో రెండు శలాకలు ప్రమాణ మనియు, మృదుద్రవ్యములచే జేయబడిన చూర్ణమను సంజ్ఞగల అంజనములో మూడు శలాకలు ప్రమాణ మనియు, వైద్యులు వచించెదరు.

"లేఖన మంజనం తామ్రరజతకాంస్యాద్యన్యతమేషు ధార్యమ్. రోపణం సువర్ణపటశంఖాన్యతమేషు. ప్రసాదనం స్ఫటికప్లక్షచందనాన్యతమేషు ధార్యమ్. ఏవం హ్యంజన మవ్యాపన్నగుణం భవతి. వర్త్మేర్ఘర్షణార్థం శిలా నిమ్నమధ్యా౽నుద్గాఽఽణీ పంచాంగుళాయతా త్ర్యంగుళవిస్తారా."

లేఖనమను అంజనమును తామ్రము, రజతము, కంచు అనువానిలో దేనిచేనేని జేయబడినపాత్రలో నుంచవలయును. రోపణమను అంజనమును సువర్ణపాత్ర, గవ్వ

శంఖము వీనిలో దేనియందేని ఉంచవలయును. ప్రసాదనమను అంజనమును స్ఫటికము, జువ్విచెక్క, చందనపుచెక్క, వీనిలో దేనిచేనేని జేయబడిన పాత్రయం దుంచవలయును. ఇట్టుల నంజనము నునిచిన దానిగుణము చెడకుండును. మఱియు నాఅంజనవర్తిని నూరునట్టి రాయి నడుమ పల్లముగను, తాయి తెగనిదిగను, ఐదు అంగుళములు నిడుపు, మూడు అంగుళములు వెడల్పు గలదిగ నుండవలయునని తంత్రాంతరమునందు చెప్పబడియున్నది.

"పిండస్య తీక్ష్ణద్రవ్యస్య మృదుద్రవ్యకృతస్య చ,
హరేణుమాత్రం ద్విగుణం ప్రమాణం కథయంత్యపి.
రసక్రియాయామప్యాహు ర్విళంగఫలమాత్రకమ్,
శలాక్యా ద్విగుణాం తీక్ష్ణే చూర్ణే చ త్రిగుణాం మృదౌ."

అనగా తీక్ష్ణద్రవ్యములచే జేయబడిన పిండమను అంజనమునకు ఒక హరేణువు ప్రమాణమనియు, మృదుద్రవ్యములచే జేయబడిన పిండమను అంజనమునకు రెండు హరేణువులు ప్రమాణ మనియు, రసక్రియ యను అంజనమునకు ఒక విడంగము ప్రమాణ మనియు, తీక్ష్ణద్రవ్యములచే జేయబడిన చూర్ణమను అంజనమునకు రెండు శలాకలు ప్రమాణ మనియు, మృదుద్రవ్యములచే జేయబడిన చూర్ణమను అంజనమునకు మూడు శలాకలు ప్రమాణమనియు నధికపాఠము కొన్ని గ్రంథములయందు గన్పట్టుచున్నది.

## అంజనప్రయోగకాలము

నిశి స్వప్నే న మధ్యాహ్నే*మ్లానే చోష్ణగభస్తిభిః. ౧౫
అక్షిరోగాయ దోషాస్స్యు ర్వర్ధితోత్పీడితద్రుతాః,
ప్రాతస్సాయం చ తచ్ఛాంత్యై వ్యభ్రేఽర్కేఽతోంజయేత్సదా.

రాత్రి, నిద్ర, మధ్యాహ్నము అను నీకాలములయందును, ఉష్ణకరమైన సూర్యకిరణములు, మద్యపానము మొదలగువానిచే నేత్రములు కలక బారి యుండునపుడును, అంజనమును ప్రయోగింపంజనదు. అట్టిసమయములయందు అంజనప్రయోగము చేసినచో దోషములు వృద్ధిని, ప్రకోపమును జెంది ద్రవించి నేత్రములయందు రోగములను గలుగజేయును. కావున నట్టిరోగశాంత్యర్థమై సూర్యుడు మేఘములచే మూయబడకుండునపుడు సాయంప్రాతః కాలములయందు అంజనమును ప్రయోగింపవలయును.

## మతాంతరమునందు అంజనప్రయోగకాలము

వదంత్యన్యేతు న దివా ప్రయోజ్యం తీక్ష్ణమంజనమ్,
విరేకదుర్బలం చక్షురాదిత్యం ప్రాప్య సీదతి. ౧౭

* పానాన్నోష్ణగభస్తిభిః ఇతిపా.

మధ్యాహ్నమునందు తీక్ష్ణమయిన అంజనమును ప్రయోగింపఁజనదు. ఏలన గా — నేత్రములు తీక్ష్ణాంజనముచే మిక్కుటముగ నీరును స్రవింపజేసి దుర్బలములగునై సూర్యకిరణ సంబంధమువలన చెరుపును జెందును. కావున తీక్ష్ణమైన యంజనమును పగటి పూట నుపయోగింపం జనదని కొంద రాచార్యులు వచించెదరు.

స్వప్నేన రాత్రౌ కాలస్య సౌమ్యత్వేన చ తర్పితా,
శీతసాత్మ్యా దృగాగ్నేయీ స్థిరతాం లభతే పునః. ౧౮

రాత్రులయందు నిద్రచేతను, రాత్రికాలము సౌమ్యముగ నుండుటచేతను తృప్తిని జెందియుండునట్టియు, అధికముగా తేజస్సంబంధము గలిగి యుండునట్టియు, శీతలమైనవస్తువునందు సాత్మ్యమును జెందియుండునట్టియు నగుదృష్టి తీక్ష్ణాంజనప్రయోగముచే క్షోభను జెందినప్పటికి మరల స్థైర్యమును జెందును. కాబట్టి రాత్రులయందు తీక్ష్ణాంజనమును ప్రయోగించుట యుక్తము.

అత్యుద్రిక్తే బలాసేతు లేఖనీయేఽథవా గదే,
కామమహ్న్యపి నాత్యుష్ణే తీక్ష్ణమక్ష్ణి ప్రయోజయేత్. ౧౯

కఫము మిగుల నధికముగ నుండునపుడును లేక లేఖనక్రియకు అర్హమైన శుక్రార్మమొదలగు రోగములయందును, మధ్యాహ్నమునందు అత్యుష్ణము లేకుండునపుడు తీక్ష్ణాంజనమును ప్రయోగింపందగును. అత్యుష్ణముగనుండు మధ్యాహ్నమునందు తీక్ష్ణాంజనప్రయోగము చేసినయెడల కాలము, అంజనము అనునీ రెండు తీక్ష్ణములుగ నుండుట వలన దృష్టికి చెరుపును గలుగజేయును.

అశ్మనో జన్మ లోహస్య తత ఏవ చ తీక్ష్ణతా,
ఉపఘాతోఽపి తేనైవ తథా నేత్రస్య తేజసః. ౨౦

లోహమునకు పాషాణములోనుండి ఉత్పత్తియు, ఆ పాషాణముచేతనే తీక్ష్ణత్వమును, మఱియు నా పాషాణములోనుండి చెరుపు చేటుల గలుగునో అట్లేయగునని నేత్రములకును అగ్నిరూపమైన తేజస్సులోనుండి ఉత్పత్తియు, సూర్యరూపమైన తేజస్సులోనుండి దర్శనసామర్థ్యరూపమయిన తీక్ష్ణత్వమును, అత్యుష్ణముగ నుండు ఆ సూర్యరూపమైన తేజస్సులోనుండి చెరుపును గలుగును. కాబట్టి మధ్యాహ్నమునందు అంజనప్రయోగము చేయకూడదని కొంద రాచార్యులు వచించెదరు.

రాత్ర్యంజనప్రయోగమతదూషణము

న రాత్రావపి శీతేతి నేత్రే తీక్ష్ణాంజనం హితమ్,
దోషమస్రావయత్ స్తంభకండూజాడ్యాదికారి తత్. ౨౧

రాత్రులయందు నేత్రము కఫాధిక్యమువలన నతిశీతలముగ నుండునపుడు తీక్ష్ణాంజనప్రయోగము హితకరము మైనది కాదు. ఏలయనగా—రాత్రికాలము సౌమ్యమై యుండుటవలన నపుడు ప్రయోగింపబడిన తీక్ష్ణాంజనము దోషములను స్రవింపజేయ సమర్థముగాక దురద, జడత్వము, స్తంభము మొదలగునుపద్రవములను గలుగజేయును. కాబట్టి "స్వప్నే న రాత్రౌ కాలస్యేత్యాది" శ్లోకముచే పూర్వము చెప్పియుండు రాత్ర్యాంజనప్రయోగమంనను యుక్తియుక్తము కాదు.

## అంజనప్రయోగనిషిద్ధులు

నాంజయేద్భీత వమిత విరిక్తాశిత వేగితే,
క్రుద్ధ జ్వరిత తాంతాక్షి శిరోరుక్ శోక జాగరే. ౨౨
అదృష్టేఽర్కే శిరఃస్నాతే పీతయోర్ధూమమద్యయోః,
అజీర్ణే ఽగ్న్యర్కసంతప్తే దివా సుప్తే పిపాసితే. ౨౩

భయపడినవాడు, వమనకర్మ చేయించుకొనినవాడు, విరేకమునకు దీసికొనినవాడు, అపుడే భుజించినవాడు, మలమూత్రాది వేగములు కలవాడు, కోపము, జ్వరము, అతిసూక్ష్మముగ, అతిప్రకాశముగనుండు వస్తుదర్శనముచే శ్రమను జెందిన నేత్రములు, శిరోరోగము, దుఃఖము, వీనిలో నేదైన నొక యుపద్రవముగలవాడు, జాగరణము, శిరఃస్నానము, మద్యపానము, ధూమపానము, వీనిలో దేనినైన నొకదానిం జేసినవాడు, అజీర్ణరోగి, అగ్ని, సూర్యుడు, వీరలచే తపింపబడినవాడు, దివాస్వాపము చేసినవాడు, దప్పిగలవాడు, ఇట్టివారియొక్క నేత్రములయందు వైద్యుడు అంజనప్రయోగము చేయంజనదు. మఱియు నటులనే మేఘాదులచే సూర్యుడు మూయబడి కంటికి తెలియరాకుండునపుడును అంజనప్రయోగము చేయంజనదు.

## నిషిద్ధాంజనములు

అతితీక్ష్ణమృదుస్తోకబహ్వాచ్ఛఘనకర్కశమ్,
అత్యర్థశీతలం తప్తమంజనం నావచారయేత్. ౨౪

అతితీక్ష్ణముగ, అతిమృదువుగ, అత్యల్పముగ, అత్యధికముగ, మిక్కిలి లేటగ, మిక్కిలిగట్టిగ అతికఠినముగ, అతిశీతలముగ, అతితప్తముగనుండు అంజనమును ప్రయోగింపంజనదు.

'సుఖోపవిష్టస్యాతురస్య సూపవిష్టో వైద్యో వామాంగుష్ఠేనోత్తరం వర్త్మోత్క్షిప్య కృష్ణభాగస్యాధః కనీనికాదపాంగం యాపదంజనం నయేత్."

వైద్యుడు సుఖముగ గూర్చుండినవాడై రోగియాసనమునందు సుఖముగ గూర్చుండి యుండు రోగియొక్క కంటిపై రెప్పను వామాంగుష్ఠముచే జాడవుగ నెత్తిపట్టుకొని కంటి లోని నల్లగ్రుడ్డుకు క్రిందిప్రదేశమునందు నల్లగ్రుడ్డుమొదలుకొని కంటికొనవరకును అంజనము వేయవలయునని అంజన విధి తంత్రాంతరమునందు జెప్పబడి యున్నది.

## అంజన ప్రయోగానంతర కర్తవ్యము

అథానన్మీలయన్ దృష్టిమంతః సంచారయేచ్ఛనైః,
అంజితే వర్త్మనీ కించి చ్చాలయేచ్చైవమంజనమ్.
*తీక్ష్ణం వ్యాప్నోతి సహసా న చోన్మేషనిమేషణం,
నిష్పీడనం చ వర్త్మభ్యాం క్షాళనం వా సమాచరేత్. ౨౬

పిదప అంజనస్వరూప విధులను తెలిసికొని నేత్రములకు విధ్యుక్తప్రకారము అంజనమును ప్రయోగించి యుండునపుడు నేత్రములను తెరవక దృష్టిని లోననే మెల్లగ సంచరింప జేయవలయును. మఱియు రెప్పలను కొంచెముగా చలింపజేయవలయును. ఇటుల జేసినయెడల అంజనము నేత్రములయం దంతట శీఘ్రముగ వ్యాపించును. ఈవిధికి వ్యతిరిక్తముగా ఉన్మేషనిమేషములను చేయంజనదు. ఆటులనే రెప్పలచే నేత్రముల నణచ కూడదు. నేత్రముల నుదకముచే గడుగంజనదు.

## నేత్రాంజన ప్రక్షాళనము

అపేతౌషధసంరంభం నిర్వృతం నయనం యదా,
వ్యాధిదోషర్తుయోగ్యాభిరద్భిః ప్రక్షాళయేత్తదా. ౨౭

ఔషధవేగ మంతయు నివర్తించి నేత్రములు సుఖముగనుం డునపుడు అభిష్యం దాదిరోగములు, వాతాదిదోషములు, వసంతాదిఋతువులు, వీనికి యోగ్యమైన ఉదక ములచే నేత్రములను ప్రక్షాళనము చేయవలయును.

దక్షిణాంగుష్ఠకేనాక్షి తతో వామం సవాససా,
ఊర్ధ్వవర్త్మని సంగృహ్య శోధ్యం వామేన చేతరత్. ౨౮

ప్రక్షాళనము చేసినపిదప పై రెప్పను యెత్తిపట్టుకొని వస్త్రముతో గూడియుండు దక్షిణాంగుష్ఠముచే వామనేత్రమును, వస్త్రముతో గూడియుండు వామాంగుష్ఠముచే దక్షిణనేత్రమును, శుద్ధిజేయవలయును. (అనగా తుడువవలయు నని యర్థము.)

---

* నేత్రం ఇతి పా.

వర్త్మప్రాప్తాంజనాద్దోషో రోగాన్కుర్యాదతోఽన్యథా,

అటుల శుద్ధిజేయక యుపేక్షించినయెడల ఱెప్పలోనుండు అంజనముచే జనించినదోషము రోగములను గలుగజేయును. కాబట్టి నేత్రములను శుద్ధి చేయవలయును.

## తీక్ష్ణాంజనాది ప్రయోగము

కండూజాడ్యేఽంజనం తీక్ష్ణం ధూమం వా యోజయేత్పునః.

దురద, జడత్వము ఇవి కలిగి యుండునపుడు తీక్ష్ణమయిన అంజనముగాని లేక తీక్ష్ణమైన ధూమముగాని ప్రయోగింపవలయును.

తీక్ష్ణాంజనాభితప్తే తు * పూర్ణం ప్రత్యంజనం హితమ్. ౨౯౪

తీక్ష్ణాంజనముచే తాపముచెందియుండు నేత్రమునందు ప్రత్యంజనము హితకరముగ నుండును.

త్రయోవింశతితమాధ్యాయము, ముగిసెను.



* చూర్ణం ఇతిపా.

# చతుర్వింశతితమాధ్యాయము



అవ. ఆశ్చ్యోతన, అంజనములచే నేత్రములకు తఱచుగా దౌర్బల్యము కలుగును. కాబట్టి తన్నివారణార్థము తర్పణాద్యుపయోగ మావశ్యకము. కావున ఆశ్చ్యోతనాంజన విధ్యధ్యాయానంతరము తర్పణపుటపాకవిధ్యధ్యాయము చెప్పబడుచున్నది.

తర్పణపుటపాక విధ్యధ్యాయ ప్రారంభము

సూ. అథాత స్తర్పణపుటపాకవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః

ఆశ్చ్యోతనాంజన విధ్యధ్యాయానంతరము తర్పణము, పుటపాకము, వీని విధిని తెలియపరచునట్టి తర్పణపుటపాక విధ్యధ్యాయమును వివరించెదను.

తర్పణప్రయోగము

నయనే తామ్యతి స్తబ్ధే శుష్కే రూక్షేఽభిఘాతితే,
వాతపిత్తాతురే జింహే శీర్ణపక్ష్మావిలేక్షణే ౧
కృచ్ఛ్రోన్మీలసిరాహర్ష శిరోత్పాతతమోఽర్జునైః,
స్యందమంథాన్యతోవాతవాతపర్యాయశుక్రకైః, ౨
ఆతురే శాంతరాగాశ్రుశూలసంరంభదూషికే,
నివాతే తర్పణం యోజ్యం శుద్ధయోర్మూర్ధకాయయోః 3
కాలే సాధారణే ప్రాతః సాయం చోత్తానశాయినః,

నేత్రములు వాడియుండుట, స్తబ్ధముగనుండుట, ద్రవములేక శుష్కముగనుండుట, రూక్షగనుండుట, అభిఘాతమును జెందియుండుట, వాతపిత్తములచే పీడితములుగనుండుట, కుటిలములుగ నుండుట, ఱెప్పవెండ్రుకలూడుట, స్పష్టముగ చూపు లేకుండుట, నేత్రరోగప్రకరణమునందు జెప్పబడు కృచ్ఛ్రోన్మీలనము, సిరాహర్షము, సిరోత్పాతము, తమస్సు, అర్జునము, స్యందము, మంథము, అన్యతోవాతము, వాతపర్యాయము శుక్రకము అను నీరోగములచే నేత్రములు పీడితములుగ నుండుట, నస్యమునకు అనర్హముగ నుండుట, నేత్రములయందు ఎఱుపువర్ణము, కంటినీరు, శూల, పుసి ఇవి శాంతమయియుండుట, ఇట్టికాలములయందు శిరస్సును, దేహమును, వమనవిరేచన నస్యములచే శుద్ధి చేయించి వసంతము మొదలగు సాధారణ కాలములయందు సాయంకాలమునందు

గాని లేక ప్రాతఃకాలమునందుగాని గాలి, ఎండ, దుమ్ము, పొగ మొదలగునవి లేకుండు ప్రదేశములో శయనమునందు వెల్లకిల పరుండియుండువానికి తర్పణక్రియను చేయవలయును.

### తర్పణవిధానము

యవమాషమయీం పాలీం నేత్రకోశాద్బహిస్సమామ్. ४
ద్వ్యంగులోచ్చాం దృఢాం కృత్వా యథాస్వం సిద్ధమావపేత్,
సర్పిర్నిమీలితే నేత్రే తప్తాంబుప్రవిలాపితమ్. ౫

నేత్రకోశమునకు వెలుపట యిరుపార్శ్వములయందు 2 అంగుళముల పొడవు గలదిగ, మిట్టపల్లము లేనిదిగ, దృఢముగనుండు పాళిని (అనగాపాదిని) యవల పిండి మినుపపిండి వీనిచే జేసి దోషదూష్యముల కనుగుణముగా సిద్ధము జేయబడిన ఘృతమును బాగుగా కాచబడిన ఉష్ణోదకముచే కరిగించి మూయబడియుండు నేత్రముపై విడువవలయును,

నక్తాంధ్యవాతతిమిరకృచ్ఛ్రబోధాదికే వసామ్,
ఆపక్ష్మాగ్రాత్

రేచీకటి, వాతరోగము, తిమిరము, కృచ్ఛ్రోన్మీలనము, మొదలగు రోగములయందు దోషదూష్యాదుల కనుగుణముగా సిద్ధము చేయబడిన వసను (అనగా మాంసములోని క్రొవ్వును ఉష్ణోదకముచే కరిగించి కంటిరెప్ప వెండ్రుకలు మునుగువరకు విడువవలయును.

### తర్పణక్రియాధారణకాలము

అధోన్మేషం శనకైస్తస్య కుర్వతః ౬
మాత్రాం విగణయేత్తత్ర వర్త్మసంధిసితాసితే,
దృష్టౌ చ క్రమశో వ్యాధౌ శతం త్రీణి చ పంచ చ. ౭
శతాని సప్త చాష్టౌ చ దశ మంథే దశానిలే,
పిత్తే షట్ స్వస్థవృత్తే చ బలాసే పంచ ధారయేత్. ౮

పై జెప్పిన ఘృతాది ప్రక్షేపానంతరము రోగి మెల్లమెల్లగ నేత్రోన్మీలనము చేయుచుండునపుడు వర్త్మ, సంధి, సిత, అసిత, దృష్టి అనునీ నేత్రభాగములయందు జనించు నేత్రరోగములయందు యథాక్రమముగా 100, 300, 500, 700, 800 (అనగా వర్త్మగతరోగమునందు 100, సంధిగతరోగమునందు 300, సితగతరోగమునందు 500, అసితగతరోగమునందు 700, దృష్టిగతరోగమునందు 800) మాత్రల నెంచవలయును. మంథరోగమునందు 1000, వాతరోగమునందు 1000, పిత్తరోగమునందును

నీరోగముగ నుండునపుడును 600, కఫమునందు 500 మాత్రల నెంచవలయును. ఆయా మాత్రల నెంచునంతకాలము రోగి ఘృతమును నేత్రమునందు ధరించుకొని యుండవలయును.

### తర్పణానంతరకర్తవ్యము

కృత్వాపాంగే తతో ద్వారం స్నేహం పాత్రే తు గాలయేత్,
పిబేచ్చ ధూమం నేక్షేత వ్యోమ రూపం చ భాస్వరమ్ ౯

పైజెప్పిన మాత్రాకాలమువరకు ఆఘృతమును ధరించినపిదప కంటికొనయందు పైజెప్పిన పాళిలో ద్వారముచేసి దానివలన వచ్చునట్టి స్నేహము నొకపాత్రమున పిసికొనవలయును. పిదప సక్తువుల పిండిచే అక్షికోశమును తుడిచి కఫోపశమనార్థమై ధూమపానముచేయించి పిదప నేత్రమును కడిగి మాత్రగా భోజనము చేయించవలయును. మఱియు నారోగిమధ్యాహ్నమునం దాకాశమును, ప్రకాశమైన రూపమును చూడరాదు.

### వాతాదిదోషములయందు తర్పణక్రమము

ఇత్థం ప్రతిదినం వాయౌ పిత్తే త్వేకాంతరం కఫే,
స్వస్థే చ ద్వ్యంతరం దద్యాదాతృప్తేరితి యోజయేత్. ౧౦

పైజెప్పిన క్రమప్రకారము వాతమున ప్రతిదినము తర్పణక్రియను చేయుచుండవలయును. పిత్తమున నడుమ నొక్కొకదినము విడిచి తర్పణక్రియను చేయుచుండవలయును. కఫమునందును స్వస్థముగ నుండునపుడును నడుమ రెండేసి దినములను విడిచి తర్పణక్రియను చేయుచుండవలయును. ఈప్రకారము నేత్రములకు తృప్తి గలుగువరకు తర్పణక్రియను చేయుచుండవలయును.

### తృప్తాదిలక్షణము

ప్రకాశక్షమతా స్వాస్థ్యం విశదం లఘు లోచనమ్,
తృప్తే విపర్యయోఽతృప్తే ఽతితృప్తే శ్లేష్మజా రుజః. ౧౧

నేత్రములకు పూర్తిగా తృప్తి కలిగియుండునపుడు ప్రకాశమైనవస్తువును, కాంతిని, సహించగలశక్తి నేత్రములకు కలుగును మఱియు నేత్రములు నిర్మలముగ, తేలికగ, స్వస్థముగ నగును. నేత్రములు తర్పణక్రియచే పూర్తిగా తృప్తి జెందకుండునపుడు ప్రకాశము మొదలగువానిని జూడ సహించకుండుట, స్వస్థత లేకుండుట, నైర్మల్య రహితముగనుండుట, కనురెప్పలు బరువుగ నుండుట మొదలగు లక్షణములు గలుగును. నేత్రములకు తర్పణక్రియచే నతితృప్తి కలిగియుండునపుడు దురద మొదలగు కఫసంబంధమైన రోగములు గలుగును.

### పుటపాకవిధి

స్నేహపీతా తనురివ క్లాంతా దృష్టిర్హి సీదతి,
తర్పణానంతరం తస్మా ద్దృగ్బలాధానకారిణమ్. ౧౨
పుటపాకం ప్రయుంజీత పూర్వోక్తేష్వేవ యక్ష్మసు,

స్నేహపానముచేసి యుండు నేత్రము స్నేహపానము చేసియుండు దేహమువలెనే బడలికను జెంది దౌర్బల్యమును జెందును. కాబట్టి తర్పణానంతరము నేత్రములకు బలము నిచ్చునట్టి పుటపాకమును తర్పణసాధ్యరోగములయందు చేయవలయును.

### దోషానుగుణపుటపాకము

స వాతే స్నేహనశ్శ్లేష్మసహితే లేఖనో హితః. ౧౩
దృగ్దౌర్బల్యేఽనిలే పిత్తే రక్తే స్వస్థే ప్రసాదనః,

వాతమున స్నేహనమను పుటపాకము హితకరము, కఫయుక్తవాతమున లేఖనమనుపుటపాకము హితకరము. నేత్రదౌర్బల్యము, వాతము, పిత్తము, రక్తము, స్వాస్థ్యము, వీనియందు ప్రసాదనమను పుటపాకము హితకరము.

### స్నేహనపుటపాకకల్పన

భూశయప్రసహానూపమేదోమజ్జావసామిషైః ౧౪
స్నేహనం పయసా పిష్టై ర్జీవనీయైశ్చ కల్పయేత్,

బిలేశయము (అనగా కప్ప, ఉడుము, మొదలగుజంతువులు), ప్రసహము (అనగా ఆవు, గాడిదె మొదలగుజంతువులు), అనూపము (అనగా మహామృగము, వారిచరము, వారిశయము మొదలగుజంతువులు) అనువానియొక్క మేదస్సు, మజ్జ, వస, మాంసము వీనిచేతను, పాలనుగూర్చి నూరబడిన జీవంతి, కాకోళి మొదలగు జీవనీయ ద్రవ్యములచేతను, స్నేహన మనుపుటపాకమును సిద్ధముచేయవలయును.

### లేఖనపుటపాకకల్పన

మృగపక్షియకృన్మాంసముక్తాయస్తామ్రసైంధవైః. ౧౫
స్రోతోజశంఖఫేనాలై ర్లేఖనం మస్తుకల్పితైః,

హరిణము మొదలగు మృగములయొక్కయు, విష్కిరము ప్రతుదము మొదలగు పక్షులయొక్కయు, మాంసములు, ముత్తియములు, ఇనుము, తామ్రము, సైంధవలవణము, స్రోతోంజనము, శంఖము, సముద్రపునురుగు, ఆలము వీనిని మస్తుతో జేర్చి కలిపి లేఖనమను పుటపాకమును సిద్ధము చేయవలయును. దీనియందు జాంగలమృగ, పక్షిమాంసములను చేర్చుకొనవలయును.

## ప్రసాదనపుటపాకకల్పః

మృగపక్షియకృన్మజ్జావసాంత్రహృదయామిషైః, ౧౫
మధురైస్సఘృతై స్తన్య క్షీరపిష్టైః ప్రసాదనమ్,

మృగము, పక్షి మొదలగువానియొక్క యకృత్తు, మజ్జ, వస, ఆంత్రము (అనగా ప్రేగులు), హృదయమాంసము వీనిని మధురవర్గమందులో జెప్పబడిన స్నిగ్ధవస్తువులచేతను, స్త్రీ స్తన్యక్షీరముచేత నూరి ప్రసాదన మను పుటపాకమును సిద్ధము చేయవలయును.

## పుటపాకప్రయోగక్రమము

బిల్వమాత్రం పృథక్ పిండం మాంసభేషజకల్కయోః, ౧౬
ఉరుబూకవటాంభోజపత్రైస్స్నేహాదిషు క్రమాత్,
వేష్టయిత్వా మృదా లిప్తం ధవధన్వనగోమయైః. ౧౭
పచేత్ప్రదీప్తైరగ్న్యాభం పక్వం నిష్పీడ్య తద్రసమ్,
నేత్రే తర్పణవద్యుంజ్యాత్

పైజెప్పిన స్నేహాదిపుటపాకములలో జెప్పియుండు మాంసమును, ఔషధకల్కమును వెవ్వేరుగా మారేడుకాయంత ఉంటగ జేసి వానిని యథాక్రమముగా ఆముదపాకులు, మఱ్ఱియాకులు, తామరాకులు, వీనిచే జుట్టి వానిపై కృష్ణమృత్తికను, రెండంగుళముల ప్రమాణము లేపనము చేసి యథాక్రమముగా చంద్రకట్టెలు, తడకట్టెలు, ఏరు పిడకలు అనువానిచే పాకము చేయవలయును. (అనగా మాంసము, ఔషధకల్కము వీని పిండమును స్నేహనపుటపాకమున ఆముదపాకులచే జుట్టి చంద్రకట్టెలచే మంటవేసి పాకము చేయవలయును. లేఖనపుటపాకమున మఱ్ఱియాకులచే జుట్టి తడకట్టెలచే మంటవేసి పాకము చేయవలయును. ప్రసాదన మను పుటపాకమున తామరాకులచే జుట్టి ఏరుపిడకలచే మంటవేసి పాకము చేయవలయును అని తాత్పర్యము) పైజెప్పిన పిండములు ఎఱ్ఱగ కాలి నిప్పువలె నుండునపుడు అవి పక్వంబులైన వని తెలిసికొని వానిని గ్రహించి వానిపైజేసియుండు లేపనమును, పత్రములను తీసివేసి, శుద్ధమయిన వస్త్రములో నుంచుకొని దానిరసమును పిండి తీసికొని యారసమును తర్పణక్రియవలెనే నేత్రములయందు ప్రయోగింపవలయును.

శతం ద్వే త్రీణి ధారయేత్. ౧౮
* లేఖనస్నేహనాంత్యేషు

లేఖనము, స్నేహనము, ప్రసాదనము, అను నీ పుటపాకములను యథాక్రమముగా (అనగా లేఖనపుటపాకమును 100 మాత్రాకాలమువరకును, స్నేహనపుటపాకమును 200 మాత్రాకాలమువరకును, ప్రసాదనపుటపాకమును 300 మాత్రాకాలము వరకును) ధరించవలయును.

* రూక్షస్నేహనమధ్యేషు ఇతిపా.

పూర్వో కోష్ణౌ హిమోఽపరః,

స్నేహన, లేఖన పుటపాకముల రెండిటిని సుఖోష్ణముగా ప్రయోగింప వలయును. ప్రసాదన మను పుటపాకమును శీతలముగా ప్రయోగింపవలయును.

పుటపాకానంతరధూమపానము

ధూమపోఽంతే తయోరేవ

స్నేహన, లేఖన, పుటపాకముల రెంటియొక్క అంతమునందుమాత్రము కఫ శమనార్థము ధూమపానము చేయవలయును.

పుటపాకసమ్యగ్యోగాదులు

యోగాస్తత్ర చ తృప్తివత్. ౨౦

పైజెప్పిన పుటపాకములయొక్క సమ్యగ్యోగ, అయోగ, అతియోగములను తర్పణక్రియయొక్క సమ్యగ్యోగ, అయోగ, అతియోగమువలెనే తెలిసికొనవలయును.

తర్పణ పుటపాకానర్హులు

తర్పణం పుటపాకం చ నస్యానర్హే న యోజయేత్,

తర్పణము, పుటపాకము ఈరెంటిని నస్యకర్మకు అనర్హుడుగ నుండువాని విషయమునందు ప్రయోగింపంజనదు.

తర్పణాదులయందు హితాహారాదులు

యావంత్యహాని యుంజీత ద్విస్తతో హితభాగ్భవేత్. ౨౧

ఎన్నిదినములు తర్పణము, పుటపాకము వీనిం జేసికొనునో అంతకంటె ద్విగుణ కాలమువరకు హితాహారవిహారాదులను సేవించుచుండవలయును.

మాలతీమల్లికాపుష్పైర్బద్ధాక్షో నిశి సేన్నిశి,

తర్పణపుటపాకములను చేయించుకొనినవాడు రాత్రియందు జాజిపూలు, మల్లెపూలు వీనిని నేత్రములపై నునిచి కట్టుకొని యుండవలయును.

నస్యకర్మాద్యావశ్యకత్వము

సర్వాత్మనా నేత్రబలాయ యత్నం కుర్వీత నస్యాంజనతర్పణాద్యైః,
దృష్టిశ్చ నష్టా వివిధం జగచ్చ తమోమయం జాయత ఏకరూపమ్.

నేత్రములకు బలము గలుగుటకై మనజుడు నస్యము, అంజనము, తర్పణము, మొదలగువానిని సర్వప్రకారములచే జేయించుకొనుటకు యత్నించవలయును. ఏలనగా — నేత్రములు నష్టమగునేని వివిధప్రపంచము తమస్స్వరూపము గలదియై యేకరూపముగ గనుపించును. కావున అట్టినేత్రముల కాపాడుకొనుటకై యెన్నివిధములనైనను పైజెప్పిన నస్యాంజనపుటపాకాదులను జేసికొనవలెను.

చతుర్వింశతితమాధ్యాయము, ముగిసెను.

# పంచవింశతితమాధ్యాయము



అవ. వస్తి, నస్యము, అంజనము, క్షారకర్మ, అగ్నికర్మ మొదలగునవి యన్త్ర సాధ్యంబు లగుటవలన అంజనవిధ్యధ్యాయానంతరము యన్త్రవిధ్యధ్యాయము చెప్పబడు చున్నది —

## యన్త్రవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతో యన్త్రవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

అంజనవిధ్యధ్యాయానంతరము యన్త్రవిధ్యధ్యాయమును వివరించెదము. యన్త్ర మనగా—శస్త్రమునకు వ్యతిరిక్తంబైన పటకారు, చిమటా, శ్రావణము, శలాకు మొదలగు మొక్కపోగ నుండునాయుధము లని యర్థము.

## యన్త్రనిరూపణము

నానావిధానాం శల్యానాం నానాదేశ* ప్రబాధినామ్,
ఆహర్తుమభ్యుపాయో యస్తద్యన్త్రం యచ్చ దర్శనే. ౧
అర్శోభగందరాదీనాం శస్త్రక్షారాగ్నియోజనే,
శేషాంగపరిరక్షాయాం తథా వస్త్యాదికర్మణి.
ఘటికాలాబుశృంగం చ జాంబవోష్ఠాదికాని చ,

నానావిధమైన శరీరప్రదేశములను బాధించుచుండునట్టి శల్యము, వెదురుపాషాణము మొదలగు నానావిధశల్యములను చూచుటకును, వానిని వెలికిం దీయుటకును, అర్శస్సు, భగందరము, నాడీవ్రణము మొదలగురోగములలో శస్త్రక్షారాగ్నికర్మల చేయుటకును నీరోగముగ నుండు నితరాంగములను రక్షించుటకును, వస్త్యాదికర్మలం జేయుటకును సాధనముగ నుండునది యన్త్ర మనబడును. మఱియును పిడువుచే (అనగా ప్రత్తిగుడ్డచే) రక్తము నాకర్షించుటకు సాధనముగ నుండుచిన్నకుండ సొరకాయబుఱ్ఱ, పశువులు మొదలగువాని కొమ్ములు, జాంబవోష్ఠము (అనగా నేరేడు విత్తుతో తుల్యమైనముఖములు గల ఒకవిధమగు శలాకాయన్త్రము) మొదలగునవియును యన్త్రము లనబడును.

"యన్త్రశతమేకోత్తరమత్ర హస్తమేవ ప్రధానతమం యన్త్రాణా మవగచ్ఛ.

---

* ప్రవేశినాం ఇతి పా.

కింకారణమ్ యస్మాద్ధస్తాదృతే యంత్రాణామప్రవృత్తిరేవ; తదధీనత్వాద్యంత్రకర్మణామ్, తత్ర మనశ్శరీరాబాధకరాణి శల్యాని. తేషామాహరణోపాయో యంత్రాణి తాని షట్ప్రకారాణి. తద్యథా — స్వస్తికయంత్రాణి, సందంశయంత్రాణి, తాలయంత్రాణి, నాడీయంత్రాణి, శలాకాయంత్రాణి, ఉపయంత్రాణిచేతి. తత్ర చతుర్వింశతిః స్వస్తికయంత్రాణి, ద్వేసందంశయంత్రే, ద్వే ఏవ తాలయంత్రే, వింశతిర్నాడ్యః, అష్టావింశతిశ్శలాకాః, పంచవింశతిరుపయంత్రాణి."

యంత్రములు 101. మనశ్శరీరంబులకు గడుబాధలంగలుగ జేయు శల్యములం దీయుటకై సాధనంబులుగ నుండు పటకారు, చిమటా, శ్రావణము, శలాకు మొదలగునవి యంత్రములనబడును. సమస్తయంత్రవ్యాపారంబులు హస్తాధీనంబులై యుండుటం జేసి హస్తములన్నిటిలోను ప్రధానంబై యుండును. అట్టియంత్రములు స్వస్తికయంత్రంబు లనియు, సందంశయంత్రంబు లనియు, తాల యంత్రంబు లనియు, నాడీ యంత్రంబు లనియు, శలాకాయంత్రంబు లనియు, ఉపయంత్రంబు లనియు 6 విధంబులు. వానిలో స్వస్తికయంత్రములు 24 విధంబులుగ, సందంశయంత్రములు 2 విధంబులుగ, తాలయంత్రములు 2 విధంబులుగ, నాడీయంత్రములు 20 విధంబులుగ, శలాకాయంత్రములు28 విధంబులుగ, ఉపయంత్రములు 25 విధంబులుగ నుండును, అని సుశ్రుతమునందు జెప్పబడియున్నది.

ఈయంత్రములను ఇండియాదేశములోని పూర్వీకపుప్రణవైద్యులు 2 కార్యములయం దుపయోగించుచుండిరి. అవి యెవ్వి యనగా — మొదటిది ఆకస్మికమువలన మనుజుని శరీరములో ప్రవేశించిన పదునుగల రాతితునుకలు, కొనయందు సన్నముగ నుండు వెదురుమేకులు మొదలగువాని నాకర్షించుటకును, వ్యాధులచే గలుగు కణతుల నాకర్షించుటకును, యుద్ధములో శరీరమునందు ప్రవేశించిన బాణముయొక్క కొస మొదలగువానిం దీయుటకును, కంఠము, కర్ణములు, నాసికము, యోని, భుజములు మొదలగువానిం జెంది యుండుశల్యముల దీయుటకును, గర్భములో మృతి జెందిన శిశువు, అర్బుదము, రాళ్లు, పుచ్చిపోయిన దంతములు, మూత్రకోశములో జేరియుండు రాళ్లు మొదలగువానిందీయుటకును, రెండవది — రోగమును పరీక్షించుటకును, అర్శస్సు, భగందరము మొదలగురోగములయందు శస్త్రక్షారాగ్నికర్మాదుల జేయుటకును అని తెలియవలయును.

## యంత్రనిర్మాణక్రమము

అనేకరూపకార్యాణి యంత్రాణి వివిధాన్యతః. 3
వికల్పయేత్ కల్పయేద్బుద్ధ్యా

స్వస్తికాదియంత్రములు కంకముఖము (అనగా రాపులుగువంటిముఖము) మొదలగు ననేకవిధములగు నాకారములు, అస్థ్యాదులను జేరియుండు శల్యములను బయలుపరచుట మొదలగు ననేకవిధములగు కృత్యములు గలవిగ నుండును. కావున నా స్వస్తికాదియంత్రములను బుద్ధిచే బాగుగ నాలోచించి ఆయాకార్యముల కనుగుణముగా నిర్మించుకొనవలయును.

"తాని ప్రాయశో లోహాని భవంతి. తత్ప్రతిరూపకాణి వా తదలాభే. తత్ర నానాప్రకారాణాం వ్యాలానాం మృగపక్షిణాం ముఖైర్ముఖాని యంత్రాణాం ప్రాయశః సదృశాని తస్మాత్తత్సారూప్యా దాగమాదుపదేశాదన్యయంత్రదర్శనాద్యుక్తితశ్చ కారయేత్. సమాహితాని యంత్రాణి ఖరశ్లక్ష్ణముఖాని చ, సుదృఢాని సురూపాణి సుగ్రహాణి చ కారయేత్."

పైజెప్పిన యంత్రంబుల నన్నిటిని తఱుచుగ లోహాదులచే జేయవలయును. ఇట్టి లోహయంత్రంబులు సమయమునకు సంఘటింపకున్న నయ్యోశల్యస్థానంబుల కుపయుక్తంబగు దారు మొదలగువానిచే జేయబడిన యంత్రముల నుపయోగింపందగును. మఱియు నీ యంత్రంబులు నానావిధ మృగపక్షి సర్పాదుల ముఖముతో తుల్యమైన ముఖము గలవిగ నుండుంగాన నందు కొన్నిటిని సారూప్యమువలనను, కొన్నిటిని శాస్త్రజ్ఞానమువలనను, కొన్నిటిని గురూపదేశమువలనను, మఱికొన్నిటిని ఇతరయంత్రముల జూచుటవలనను, మఱి కొన్నిటిని నిజయుక్తివైశద్యంబువలనను జేయందగును. యంత్రముల నన్నిటిని సమంబులుగను, నునుపుగల తీక్ష్ణముఖంబులు గలవిగను, దృఢంబులుగను, చూచుటకు సొగసుగను, సొగసైన పిడులతోగూడినవిగను జేయించవలయును అని సుశ్రుతము నందు జెప్పబడి యున్నది.

యథాస్థూలం తు వక్ష్యతే,

ఇచట స్థూలముగా యంత్రములు చెప్పబడును. కావున వానివలెనే సూక్ష్మములగు నితరయంత్రములనుగూడ స్వబుద్ధిచే కల్పన జేసికొనవలయును.

## స్వస్తికయంత్రనిరూపణము

తుల్యాని కంకసింహర్క్షకాకాదిమృగపక్షిణామ్. ౪
ముఖైర్ముఖాని యంత్రాణాం కుర్యాత్తత్సంజ్ఞకాని చ,
అష్టాదశాంగులాయామాన్యాయసాని చ భూరిశః. ౫
మసూరాకారపర్యంతైః కంఠే బద్ధాని కీలకైః,
విద్యాత్స్వస్తికయంత్రాణి మూలేఽంకుశనతాని చ. ౬
తైర్దృఢైరస్థిసంలగ్నశల్యాహరణమిష్యతే,

స్వస్తికయంత్రములను కంకము, సింహము, ఋక్షము మొదలగు మృగములు, కాకము మొదలగుపక్షులు వీనిముఖములతో తుల్యమయిన ముఖములు (అనగా శల్యమును తీయునట్టి భాగములు లేక నోళ్లు) గలవిగ, 18 అంగుళముల నిడుపు, కొనయందు చిఱుసెనగలయాకారముగల కీలకములచే (అనగా మేకులచే * కంఠప్రదేశమునందు బంధనము, మూలప్రదేశమునందు (అనగాయంత్రమును చేతితోపట్టుకొనునట్టి స్థలమునందు) అంకుశమువలె నొకింత వంకర గలవిగ, తఱుచుగ అయోమయములుగ నిర్మింపవలయును. అటుల నిర్మింపబడు స్వస్తికయంత్రములకు సుఖానుగుణరుగు నామములే కలుగును. (అనగా కంకముఖము వలె నుండుస్వస్తికయంత్రమునకు కంకముఖమను నామమును, సింహముఖమువలె నుండు స్వస్తికయంత్రమునకు సింహముఖ మను నామమును, ఇటుల రూపానుగుణముగా నామములు కలుగును అని తాత్పర్యము.) దృఢముగనుండు కంకముఖము మొదలగు స్వస్తికయంత్రములచే అస్థినాశ్రయించి యుండు శల్యములను తీసివేయవలయును.

"తత్ర స్వస్తికయంత్రాణ్యష్టాదశాంగుల ప్రమాణాని, సింహవ్యాఘ్రవృకతరక్ష్వృక్ష ద్వీపి మార్జార సృగాల మృగైర్వారుక కాక కంక కురర భాస శశఘాత్యులూకచిల్లి శ్యేన గృధ్ర క్రౌంచ భృంగరాజాంజలికర్ణావభంజన నందిముఖముఖాని, మసూరాకృతిభిః కీలై రవబద్ధాని, మూలేఽంకుశవదావృత్తవారంగాణ్యస్థివిసక్తశల్యోద్ధరణార్థముపదిశ్యంతే." అను వచనముచే స్వస్తికయంత్రములు 18 అంగుళములు నిడుపుగలిగి సింహము, వ్యాఘ్రము (అనగా పెద్దపులి), వృకము (అనగా తోడేలు). తరక్షు (అనగా సివంగి) ఋక్షము (అనగా ఎలుగుగొడ్డు) ద్వీపి (అనగా చిఱుతపులి,) మార్జాలము (అనగా పిల్లి,) సృగాలము (అనగా నక్క), మృగము (అనగా జింక), ఐర్వారుకము, కాకము (అనగా కాకి), కంకము (అనగా రాపులుగు), కురరము (అనగా కలహంస,) భాసము (అనగా పీతిరిగద్ద) శశఘాతి (అనగా భైరవడేగ) ఉలూకము (అనగా గుడ్లగూబ,) చిల్లి (అనగా చిందపిట్ట), శ్యేనము (అనగా డేగ), గృధ్రము (అనగా గద్ద), క్రౌంచ పక్షి, భృంగరాజము (అనగా కూకటిమూగ పిట్ట), అంజలికర్ణము (అనగా చుంచు), అవభంజనము, నంది (అనగా ఎద్దు,) వీనిముఖంబులం బోలిన (అనగా నోళ్లంబోలిన) ముఖంబులం గలిగి చిఱుసెనగలవంటి కీలకములచే (అనగా చీలలచే) బిగియింపంబడి యంకుశపు పిడివంటిపిడితో గూడియుండవలయు ననియు, అవి అస్థిగతశల్యంబులం దీయ నుపయుక్తంబు లగుననియు, సుశ్రుతమునందు చెప్పబడి యున్నది.

---

*కంఠప్రదేశ మనగా —ఆయంత్రముయొక్క 2 తుండ్లను నొకటిగ జేర్చి మేకుచే బంధింపబడు ప్రదేశము.

**సందంశయంత్రనిరూపణము**

కీలబద్ధవిముక్తాగ్రౌ సందంశౌ షోడశాంగులౌ. ౭
త్వక్సిరాస్నాయుపిశితలగ్నశల్యాపకర్షణౌ,

చిఱుసెనగల యాకారముగల కీలకములచే ముఖప్రదేశమునందు బంధించబడి యుండు సందంశయంత్రము 1, ముఖప్రదేశమునందు బంధింపబడక విడువబడి యుండు సందంశయంత్రము 1, ఇటుల సందంశయంత్రములు 2 విధంబులు వానిలో బంధనముతో గూడియుండు సందంశయంత్రము కమ్మరవానిచే జేయబడుచు దీనినే కొందరు పటకార యనియు ననియెదరు. బంధనము లేకుండు సందంశయంత్రము సీపుకా రనబడును. సందంశముల రెండు యంత్రములు 16 అంగుళముల నిడుపు గలవిగ నుండును. వీనినిత్వక్కు, సిరలు, స్నాయువులు, మాంసము, వీని నాశ్రయించి యుండు శల్యములం దీయుటయం దుపయోగింపబడియును.

**పక్ష్మాద్యాకర్షణసందంశయంత్రము**

షడంగులోఽన్యో హరణే సూక్ష్మశల్యోపపక్ష్మణామ్. ౮

మఱియు నొకవిధమగు సందంశయంత్రము కలదు. అది ఆఱంగుళముల నిడుపు గలదిగ నుండును. అది నాసారోమాదులు, కంటిరెప్ప వెండ్రుకలు మొదలగు సూక్ష్మమైన శల్యముల నాకర్షించుటయం దుపయోగించును దీనినే కొందరు ముచుండి యనియు ననియెదరు. దీనికి చింటా అని వ్యవహారనామము కలదు.

**ముచుండీయంత్ర నిరూపణము**

ముచుండీ సూక్ష్మదంతర్జుర్మూలే రుచకభూషణా,
గంభీరవ్రణమాంసానామర్మణశ్శేషితస్య చ ౯

ముచుండి యనునామము గలయంత్రము సూక్ష్మమైన దంతములు గలదిగను, వంకర లేనిదిగను, మూలప్రదేశమునందు (అనగా పట్టుకొనునట్టి స్థలమునందు) ఉంగరముల వలె నుండువలయములతో గూడినదిగ నుండును- మిక్కిలి లోతున వ్యాపించి యుండు వ్రణమునందలి మాంసముల నాకర్షించుటయందును, ఛేదింపగా శేషించి యుండు అర్శ రోగమున నాకర్షించుటయందు నుపయోగించును. ముచుండి యను యంత్రముయొక్క ఉంగరములను పట్టుకొని యదిమినచో నది మాంసాదుల లాగుటయందు సమర్థముగ నుండును.

**తాలయంత్రనిరూపణము**

ద్వే ద్వాదశాంగులే ఽమత్స్యతాలవద్వ్యేకతాలకే,
తాలయంత్రే స్మృతే కర్ణనాడీశల్యాపహారిణీ. ౧౦

తాలయంత్రము 12 అంగుళముల నిడుపు గలదిగను, మత్స్యముయొక్క నోటి లోపలి దౌడవంటి యాకారము గలదిగ నుండును. ఈ తాలయంత్రము ద్వితాలకము (అనగా నిరుపార్శ్వములయందు మత్స్యముఖాకారము గలది) ఏకతాలకము (అనగా ఒక పార్శ్వమునందు మత్స్యముఖాకారము గలది) అని రెండు విధంబులు. ఇవి కర్ణనాడియందలి శల్యముల నాకర్షణము చేయుటయం దుపయోగించును.

## నాడీయంత్రనిరూపణము

నాడీయంత్రాణి సుషిరా ణ్యేకానేకముఖాని చ,
స్రోతోగతానాం శల్యానామామయానాం చ దర్శనే. ౧౧
క్రియాణాం సుకరత్వాయ కుర్యాదాచూషణాయ చ,
తద్విస్తారపరీణాహదైర్ఘ్యం స్రోతోఽనురోధతః. ౧౨

నాడీయంత్రములు వస్తియంత్రాదులవలె ద్వారములు గలవిగ నుండును. వానిలో గొన్నిటికి ఏకద్వారము కొన్నిటికి అనేకద్వారములు గలిగి యుండును. ఇవి కర్ణము మొదలగు స్రోతస్సులను జెంది యుండు శల్యములను, కంఠము మొదలగు స్రోతస్సులను జేరియుండు రోగములను దర్శించుట (అనగా కనిపెట్టుట) యందును, శస్త్రకర్మ, క్షారకర్మ, అగ్నికర్మ, ప్రక్షాళనము, ఔషధప్రయోగము మొదలగు కర్మలను సుఖముగా జేయుటయందును, విషదగ్ధముగ నుండు అంగములు మొదలగు వానిని ఆచూషణము చేయుటయందును (అనగా పీల్చుటయందును) ఉపయోగించును. (రెండు ద్వారములుగల నాడీయంత్రమును ఆచూషణమునందును, అనేక ద్వారములుగల నాడీయంత్రమును లోపనుండు కల్మషమును బైటవెడలింప జేయుటయందును, ఏక ద్వారము గల నాడీయంత్రమును శస్త్రక్షారాగ్ని ప్రక్షాళ నౌషధప్రయోగమునందును ఉపయోగింపవలయును.) మఱియు నా నాడీయంత్రములను అనువాసనవస్తి, ఉత్తరవస్తి, నస్యము, వీనికర్మలయం దుపయోగించునాడులవలె నాయాస్రోతస్సుల కనుగుణముగా విరివి, వెడల్పు, నిడుపు గలవిగ జేయించుకొనవలయును.

## కంఠశల్యావలోకన నాడీయంత్రము

దశాంగుళార్ధనాహాంతః కంఠశల్యావలోకనే,
నాడీ

కంఠముయొక్క లోభాగమున జేరియుండు శల్యములం జూచుటకై ఉపయోగించు నాడీయంత్రము 10 అంగుళముల నిడుపు, 5 అంగుళములు విరివి గలదిగ నుండవలయును.

### శల్యాహరణనాడీయంత్రము

పంచముఖచ్ఛిద్రా చతుష్కర్ణస్య సంగ్రహే. ౧౩
వారంగస్య ద్వికర్ణస్య త్రిచ్ఛిద్రా తత్ప్రమాణతః,

నాలుగు కర్ణములు గల వారంగమును (అనగా ఖడ్గము మొదలగువాని పిడులను) ఆకర్షించుటకై ఉపయోగించునట్టి నాడీయంత్రము ౫ ముఖద్వారములు గలదిగ నుండవలయును. 2 కర్ణములు గలవారంగము నాకర్షించుటకై ఉపయోగించెడు నాడీయంత్రము 3 ముఖద్వారములు గలదిగ నుండవలయును.

### శరీరాంతర్గతశల్యావలోకననాడీయంత్రము

వారంగకర్ణసంస్థానానాహదైర్ఘ్యానురోధతః
నాడీరేవంవిధాశ్చాన్యా ద్రష్టుం శల్యాని కారయేత్,

శరీరాంతర్గతమైన శల్యములను చూచుటకు వారంగముయొక్క కర్ణము, ఆకారము, వెడల్పు, నిడుపు వీని ననుగుణముగా యితరమైన నాడీయంత్రములను కూడ చేయించుకొనవలయును.

### శల్యనిర్ఘాతననాడీయంత్రము

పద్మకర్ణికయా మూర్ధ్ని సదృశీ ద్వాదశాంగులా. ౧౪
చతురంగుళసుషిరా నాడీ శల్యనిర్ఘాతినీ మతా,

శిరఃప్రదేశమున పద్మకర్ణికతో (అనగా తామరదుద్దుతో) సమానముగను, 12 అంగుళముల నిడుపు గలదిగను, అంగుళప్రమాణముగల ద్వారము గలదిగనుండు నాడీయంత్రము శల్యనిర్ఘాతిని యనబడును. దీనిని శల్యములను నశింపజేయుటయందుపయోగింపవలయును.

### అర్శోనాడీయంత్రనిరూపణము

అర్శసాం గోస్తనాకారం యంత్రకం చతురంగులమ్. ౧౫
నాహే పంచాంగుళం పుంసాం ప్రమదానాం షడంగులమ్,
ద్విచ్ఛిద్రం దర్శనే వ్యాధేరేకచ్ఛిద్రం తు కర్మణి. ౧౬
మధ్యేఽస్య త్ర్యంగులం ఛిద్రమంగుష్ఠోదరవిస్తృతమ్,
అర్ధాంగుళోచ్ఛ్రితోద్వృత్తకర్ణికం తు తదూర్ధ్వతః. ౧౭
శమ్యాఖ్యం తాదృగచ్ఛిద్రం యత్ర మర్శః ప్రపీడనమ్,

అర్శోరోగ చికిత్సోపయోగయంత్రము గోస్తనాకారముగను, 4 అంగుళములు నిడుపు గలదిగ నుండవలయును. మఱియు నది పురుషులకైనయెడల ౫ అంగుళములు వెడల్పు, స్త్రీలకైనయెడల 6 అంగుళములు వెడల్పు గలదై యుండవలయును.

ఏలనగా — స్త్రీలయొక్క గుదము స్వభావముగనే పెద్దదిగ నుండును. వ్యాధిని చూచునట్టి అర్శోయంత్రము 1, శస్త్రక్షారాగ్నికర్మలం జేయునట్టి అర్శోయంత్రము 1, అర్శస్సును పీడించునట్టి (అనగా నలుపునట్టి) యంత్రము 1. ఇటుల అర్శోయంత్రములు 3 విధంబులు. వానిలో వ్యాధిని చూచునట్టియంత్రము ఇరుపార్శ్వములయందు ద్వారములు గలదిగ నుండవలయును. శస్త్రక్షారాగ్ని కర్మలం జేయునట్టి యంత్రము ఒకపార్శ్వమున ద్వారము గలదిగ నుండవలయును. శస్త్రక్షారాగ్నికర్మోపయుక్తయంత్రమునకు మధ్యమునందు 3 అంగుళములు నిడుపు, అంగుష్ఠమధ్యతుల్యమైన విరివిగల ద్వారమును, దానికిపైన ½ అంగుళము ఉన్నతముగ గుండ్రముగనుండు కర్ణికయును గలిగి యుండవలయును. పైజెప్పిన 3-వదియగు అర్శోయంత్రము శమ్యా యను పేరం బరంగును. ఇది అర్శోయంత్ర తుల్యలక్షణము గలదిగను, ద్వారములే లేనిదిగ నుండ వలయును. ఇది అర్శోరోగమును పీడించుటయందు (అనగా నలుపుటయందు) ఉపయోగించును.

### భగందరనాడీయంత్రనిరూపణము

సర్వథాపనయేదోష్ఠం ఛిద్రాదూర్ధ్వం భగందరే. ౧౯

భగందరయంత్రము ద్వారమునకుపైన సర్వప్రకారములచే ఓష్ఠము లేనిదిగ నుండవలయును.

### ఘ్రాణార్బుదాద్యుపయుక్తనాడీయంత్రము

ఘ్రాణార్బుదార్శసామేకఛిద్రా నాడ్యంగులద్వయా,
ప్రదేశినీపరిణాహా స్యాద్భగందరయంత్రవత్. ౨౦

ఘ్రాణార్బుదము, ఘ్రాణార్శస్సు అను నీరోగములయం దుపయోగించునట్టి నాడీయంత్రము ఏకద్వారము గలదిగను, 2 అంగుళములు నిడుపు గలదిగను, ప్రదేశినీ (అనగా జుట్టనవ్రేలికి) తుల్యమయిన వెడల్పు గలదిగను, భగందరయంత్రమువలె ఓష్ఠము లేనిదిగ నుండవలయును.

### అంగుళిత్రాణకయంత్రము

అంగుళిత్రాణకం దాంతం వార్క్షం వా చతురంగులమ్,
ద్విచ్ఛిద్రం గోస్తనాకారం తద్వక్త్రవివృతౌ సుఖమ్. ౨౧

అంగుళిత్రాణకమను యంత్రము దంతముచేగాని, కొయ్యచేగాని చేయబడినదిగను, 4 అంగుళముల ప్రమాణము గలదిగను, ఇరుపార్శ్వములయందు ద్వారములు గలదిగను, అర్శోరోగయంత్రమువలె గోస్తనాకారము గలదిగ నుండవలయును. మఱియు

నా యంత్రముచే నోరును సులభముగ తెఱచుటకు సాధ్యముగ నుండును. అంగు
త్రాణక మనగా, దంతములచే గాయము కలుగకుండ ప్రక్షేపకాధారయంత్రము.

## యోనివ్రణదర్శనాడీయంత్రము

యోనివ్రణే క్షణం మధ్యే సుషిరం షోడశాంగులమ్,
ముద్రాబద్ధం చతుర్భిత్తమంభోజముకులాననమ్ ౨౨
చతుశ్శలాకసూత్రాంతం మూలే తద్వికసేన్ముఖే,

యోనియందుండునట్టి వ్రణమును చూచుటకు సాధన మగునట్టియంత్రము మధ్య
మునందు ద్వారము, 16 అంగుళములు నిడుపు గలదిగను, తిరుగునట్టి యుంగరముతో
గూడినదిగను, 4 పత్రములు, 4 శలాకలు గలదిగను, తామరమొగ్గతో సమానమైన
అగ్రభాగము గలదిగ నుండవలయును. మఱియు నాయంత్రమూలమునందుండు శలాకు
నీడ్చుటవలన దానిముఖము వికసించును.

## ప్రక్షాళనాది నాడీయంత్రము.

యంత్రే నాడీవ్రణాభ్యంగక్షాళనాయ షడంగులే. ౨౩
వస్తియంత్రాకృతీ మూలే ముఖేఽంగుష్ఠకలాయఖే,
అగ్రతోఽకర్ణికే మూలే నిబద్ధమృదుచర్మణీ. ౨౪

నాడీవ్రణములయొక్క అభ్యంగప్రక్షాళనములయం దుపయోగించునట్టి యం
త్రములు 2 విధంబులు. అవి 6 అంగుళములు నిడుపు, వస్తియంత్రమునకు తుల్యమయిన
యాకారము (అనగా గోపుచ్ఛాకారము), మూలమునందు బొటనవ్రేలితో తుల్య
మయినద్వారము, ముఖమునందు బఠానిగింజతో తుల్యమయిన ద్వారము గలవిగను,
అగ్రభాగమునందు కర్ణికలు లేనివిగను, మూలములో 2 కర్ణికలు గలవిగను, మూల
ములో వస్తిపుటకాకారమయిన మృదు వగుచర్మమునే కట్టబడినవిగ నుండవలయును.

## ఉదకోదరనాడీయంత్రము.

ద్విద్వారా నలికా పిచ్ఛనలికా వోదకోదరే,

ఉదకోదరరోగమునందు జలమును స్రవింపజేయుటకై యుపయోగించెడు నాడీ
యంత్రము ఇరుపార్శ్వములయందు ద్వారము గలదిగ నుండవలయును, లేక నెమలి
ఈక్కచే జేయబడినదిగగాని యుండవలయును.

ధూమవస్త్యాదియంత్రాణి నిర్దిష్టాని యథాయథమ్ ౨౫

ధూమపానము, వస్తికర్మ మొదలగువానియం దుపయోగించునట్టి నాడీయం
త్రములు ధూమపానాద్యధ్యాయములయందు చెప్పబడి యున్నది.

శృంగయంత్రము.

త్ర్యంగులాస్యం భవేచ్ఛృంగం చూషణేఽష్టాదశాంగులమ్,
అగ్రే సిద్ధార్థకచ్ఛిద్రం సునద్ధం చూచుకాకృతి. ౨౬

దుష్టమయిన వాతము, విషము, రక్తము, ఉదకము, దుష్టమయిన చనుబాలు, వీనిని పీల్చుటయం దుపయోగించెడు శృంగయంత్రము (అనగా పశువులకొమ్ములు, చిమ్మనగ్రోవి మొదలగునవి) 3 అంగుళములు వెడల్పుగల ముఖద్వారము గలదిగను, 18 అంగుళములు నిడుపు గలదిగను, అగ్రభాగమునందు (అనగా పీల్చుటకు శరీరముతో నుంచబడు ప్రదేశమునందు) ఆవగింజంత ద్వారము గలదిగను, స్త్రీల స్తనాగ్రములవంటి యాకారము గలదై బాగుగ కట్టబడినదిగ నుండవలయును.

అలాబుయంత్రము.

స్యాద్ద్వాదశాంగులోఽలాబుర్నాహే త్వష్టాదశాంగులః,
చతుస్త్ర్యంగులవృత్తాస్యో దీప్తోఽంతః శ్లేష్మరక్తహృత్. ౨౭

అలాబుయంత్రము (అనగా సొరకాయబుఱ్ఱ) 12 అంగుళములు నిడుపు, 18 అంగుళములు వెడల్పు, 4 లేక 3 అంగుళములు గుండ్రముగ నుండునట్టి ముఖము గలదిగను, లోభాగములో భుజపత్రి మొదలగువానిదూదులచే జ్వలింపుచుండునదిగను నుండవలయును. ఇది దుష్టమయిన శ్లేష్మమును, రక్తమును హరింపజేయును.

ఘటీయంత్రము.

తద్వద్ఘటీ హితా గుల్మవిలయోన్నమనే చ సా,

ఘటీయంత్రము (అనగా చిన్నకుండ) పైజెప్పిన అలాబుయంత్రముతో తుల్యమయిన నిడుపు, వెడల్పు కృత్యము గలదిగ నుండును. అయితే ఘటీయంత్రము గుల్మమును నశింపజేయుటయందును పొడవుగ నెత్తుటయందును హితకరమయినది.

శలాకాయంత్రస్వరూపము

శలాకాఖ్యాని యంత్రాణి నానాకర్మాకృతీని చ ౨౮
యథాయోగప్రమాణాని

శలాక యను పేరంబరగుయంత్రములు నానావిధమైన యాకారములు, కృత్యములు గలవిగ నాయాయోగములకు తగిన ప్రమాణము గలవిగ నుండును. ఎక్కువచే జేయబడినదిగాని ఉండవలయును.

గండూపదముఖశలాకాయంత్రములు

తేషామేషణకర్మణీ,
ఉభే గండూపదముఖే

పైజెప్పిన శలాకాయంత్రములలో గండూపదములకు (అనగా ఎఱ్ఱలకు) సమాన మైనముఖముగల 2 శలాకాయంత్రములు గలవు. అవి ఏషణమను కర్మయందు (అనగా వ్రణమార్గమును పరీక్షించుటయందు) ఉపయోగించును.

మసూరదళవక్త్రశలాకాయంత్రములు

స్రోతోభ్యశ్శల్యహారిణీ ౨౯
మసూరదళవక్త్రే ద్వే స్యాతామష్టనవాంగులే,

చిఱుసెనగల పప్పుతో తుల్యమైనముఖము గలవిగను, ౮, 9 అంగుళముల నిడుపు గలవిగ నుండునట్టి 2 శలాకాయంత్రములు గలవు, అవి స్రోతస్సులలోనుండి శల్యములను బైలుపరచుటయం దుపయోగించును.

శంకుయంత్రము లారు, అందు సర్పముఖ శంకుయంత్రము

శంకవష్షట్ ఉభౌ తేషాం షోడశ ద్వాదశాంగులౌ. 3౦
వ్యూహనేఽహిఫణావక్త్రౌ

శంకుయంత్రము లారు. వానిలో సర్పముయొక్క పడిగెవంటి ముఖముగల శంకువులు 2 గలవు. అవి 16 లేక 12 అంగుళములు నిడుపుగలవిగ నుండును. వానిని వ్యూహనకర్మయందు (అనగా వ్రేలునటుల జేయుటయందు) ఉపయోగింపవలయును.

శరపుంఖశంకుయంత్రము

ద్వౌ దశద్వాదశాంగులౌ,
చాలనే శరపుంఖాఖ్యౌ

శరపుంఖ మనుశంకువులు 2 గలవు. అవి 10 లేక 12 అంగుళములు నిడుపు గలవిగను, బాణముయొక్క పింజమువంటి ముఖము గలవిగ నుండును. వానిని చాలన కర్మయందు (అనగా కదిలించుటయందు) ఉపయోగింపవలయును.

బడిశ శంకుయంత్రము

ఆహార్యే బడిశాకృతీ 3౧

బడిశము (అనగా గాలము) యొక్క యాకారము గలవిగ నుండు శంకువులు 2 గలవు. అవి ఆకర్షణకర్మయం దుపయోగించును.

గర్భశంకుయంత్రము

నతోఽగ్రే శంకునా తుల్యో గర్భశంకురితి స్మృతః,
అష్టాంగులాయతస్తేన మూఢగర్భం హరేత్ స్త్రియాః 3౨

అగ్రభాగమునందు వంకరగను, కీలకముయొక్క ఆకారము గలదిగను, 8 అం

గుళములు నిడుపుగలదిగ నుండునది గర్భశంకువని మునులచే జెప్పబడుచున్నది. దానిచే స్త్రీలయొక్క మూఢగర్భమును బైట లాగవలెను.

అశ్మర్యాకర్షణ సర్పఫణాఖ్య శంకుయంత్రము

అశ్మర్యాహరణే సర్పఫణావద్వక్త్రమగ్రతః,

సర్పఫణ మనుయంత్రము అగ్రభాగమునందు పాముపడిగెవంటి ముఖము గలదిగ నుండును. దీనిచే అశ్మరి నాకర్షణము చేయవలయును.

దంతాకర్షణ శరపుంఖముఖాఖ్య శంకుయంత్రము

శరపుంఖముఖం దంతపాతనం చతురంగులమ్. 33

4 అంగుళములు నిడుపుగల శరపుంఖమనుయంత్రము గలదు. అది బాణముయొక్క పింజముతో సమానమయినముఖము గలదిగనుండును. దీనిచే చలింపుచుండు దంతములను, క్రిములు మొదలగువానిచే భక్షించబడిన దంతములను తీసివేయవలయును.

శలాకాభేదములు, వానియుపయోగములు

కార్పాసవిహితోష్ణీషాః శలాకాః షట్ప్రమార్జనే,
పాయావాసన్నదూరార్థే ద్వే దశద్వాదశాంగులే. 34
ద్వే షట్ సప్తాంగులే ఘ్రాణే ద్వే కర్ణేఽష్టనవాంగులే,

క్షారక్లేదాదులను ప్రక్షాళనముజేసి శుద్ధిచేయుటకై కొనలో ప్రత్తిచే జుట్టబడిన శలాకులు 6 గలవు. వానిలో 10 అంగుళములు నిడుపుగల శలాకు 1, 12 అంగుళములు నిడుపుగల శలాకు 1, ఇటుల 2 శలాకలు గలవు. 10 అంగుళములు నిడుపుగల శలాకను గుదములో సమీపమునందును, 12 అంగుళములు నిడుపుగల శలాకను దూరమునందును ప్రయోగింపవలయును. 6 అంగుళముల నిడుపుగల శలాకు 1, 7 అంగుళములు నిడుపుగల శలాకు 1; ఇటుల 2 శలాకులు గలవు. అందు 6 అంగుళములు నిడుపుగల శలాకను నాసికములో సమీపమునందును, 7 అంగుళములు నిడుపుగల శలాకను దూరమునందును ప్రయోగింపవలయును. అటులనే 8 అంగుళములు నిడుపుగల శలాకు 1, 9 అంగుళములు నిడుపుగల శలాకు 1, ఇటుల 2 శలాకులు గలవు. అందు 8 అంగుళములు నిడుపుగల శలాకను కర్ణములో సమీపమునందును, 9 అంగుళములు నిడుపుగల శలాకను దూరమునందును ప్రయోగింపవలయును.

కర్ణశోధనశలాకాయంత్రము

కర్ణశోధనమశ్వత్థపత్రప్రాంతం స్రువాననమ్ 35

కర్ణశోధన మను పేరుగల శలాకాయంత్రము రావియాకుయొక్క కొనతో సమానమైన కొన గలదిగను, గరిటెవంటి ముఖముగలదిగ నుండవలయును.

## క్షారాగ్నికర్మోపయుక్తశలాకలు

శలాకాజాంబవోష్ఠానాం క్షారేఽగ్నౌ చ పృథక్ త్రయమ్,
యుంజ్యాత్ స్థూలాణుదీర్ఘాణాం

స్థూలముగ, సూక్ష్మముగ, దీర్ఘముగనుండు శలాకలు 3. అట్లనే జాంబవోష్ఠములు 3. ఇటుల 6 శలాకాయంత్రములు గలవు. వీనిని క్షారకర్మయం దుపయోగించవలయును. మఱియును స్థూలముగ, సూక్ష్మముగ, దీర్ఘముగనుండు శలాకలు 3. అటులనే జాంబవోష్ఠములు 3. ఇటుల 6 శలాకాయంత్రములు గలవు. వీనిని అగ్నికర్మయం దుపయోగింపవలయును. క్షారాగ్ని కర్మోపయుక్త శలాకాయంత్రములు పైజెప్పిన ప్రకారము 12 విధంబులుగ నుండునని తెలిసికొనవలయును.

## ఆంత్రవృధ్ద్యుపయుక్త శలాకాయంత్రము

శలాకామంత్ర*వర్ధ్మని. 36

మధ్యోర్ధ్వవృత్తదండాం చ మూలేచార్ధేందుసన్నిభామ్,

ఆంత్రవృద్ధియందు మధ్యభాగమునకు పైన గుండ్రముగను, దండాకారముగను మూలభాగమునందు అర్ధచంద్రాకారముగ నుండునట్టి శలాకను నుపయోగింపవలయును.

## నాసార్శాదులయం దుపయోగించెడి కోలాస్థిశలాక

కోలాస్థిదళతుల్యాస్యా నాసార్శోర్బుదదాహకృత్. 37

కోలాస్థిదళము (అనగా రేగుగింజ పప్పుతో) సమానమైన ముఖముగల శలాకను నాసార్శస్సు, నాసార్బుదము, వీనియందు అగ్నికర్మ జేయునపు డుపయోగింపవలయును.

## క్షారకర్మోపయుక్తశలాక

అష్టాంగులా నిమ్నముఖా స్తిస్రః క్షారౌషధక్రమే,
కనీనీమధ్యమానామిానఖమానసమైర్ముఖైః. 38

చిటికెనవ్రేలు, నడిమివ్రేలు, దర్భవ్రేలు, వీనియొక్క నఖములకు సమానమైన వెడల్పుగలవిగను, పల్లముగనుండు ముఖములు గలవిగను, 8 అంగుళములు నిడుపుగలవిగనుండు 3 శలాకలు గలవు. వానిని క్షారౌషధప్రయోగమునం దుపయోగింపవలయును.

స్వంస్వముక్తాని యంత్రాణి మేఢ్రశుద్ధ్యంజనాదిషు,

మేఢ్రశుద్ధి, అంజనము, మొదలగు విషయములయందును, ఉత్తర వస్త్యాదుల యందు నుపయోగించెడియంత్రములు ఆయా ప్రకరణములయందు పూర్వమే చెప్పబడియున్నవి.

---

* వర్ధ్మని ఇతి పా.

### ఉపయంత్రములు

అనుయంత్రాణ్యయస్కాంతరజ్జువస్త్రాశ్మముద్గరాః. ౩౯
వధ్రాంత్రజిహ్వావాలాశ్చ శాఖానఖముఖద్విజాః,
కాలః పాకః కరః పాదో భయం హర్షశ్చ తత్క్రియాః,
ఉపాయవిత్ప్రవిభజేదాలోచ్య నిపుణం ధియా. ౪౦

ఉపాయము నెఱిగియుండువైద్యుఁడు అయస్కాంతము, దారము, వస్త్రపట్టములు, ఱాయి, ముద్గరము (అనగా సమ్మెట), తోలువారు, ప్రేగులు, నాలుక, వెండ్రుకలకట్ట, ప్రేళ్ళు, నఖము, నోరు, దంతము, కాలము, పాకము, హస్తము, పాదము, భయము, సంతోషము అను నీ 19 ఉపయంత్రములను, వానియొక్క నిర్ఘాతనాదికర్మలను బుద్ధిచే బాగుగ నాలోచించి ప్రయోగింపవలయును.

### యంత్రకృత్యములు

నిర్ఘాతనోన్మథనపూరణమార్గశుద్ధి
సంవ్యూహనాహరణబంధనపీడనాని,
ఆచూషణోన్నమననామనచాలభంగ
వ్యావర్తనర్జుకరణాని చ యంత్రకర్మ ౪౧

నిర్ఘాతనము (అనగా తాటించుట) ఉన్మథనము (అనగా చిలుకుట) పూరణము (అనగా నిండించుట.) మార్గశుద్ధి(అనగా మూత్రద్వారములలో శలాకవేసి అందలిమలాదుల శుద్ధిచేయుట) వ్యూహనము (అనగా అంగములను వేరులనటుల జేయుట) ఆహరణము (అనగా బైలుపరచుట) బంధనము (అనగా కట్టుకట్టుట) పీడనము (అనగా పిసుకుట) ఆచూషణము (అనగా పీల్చుట) ఉన్నమనము (అనగా పొడవుగ నెత్తుట) నామనము (అనగా వంచుట) చాలనము (అనగా స్థానాంతరమునకు కదలించుట) భంగము (అనగా విరుచుట) వ్యావర్తనము (అనగా త్రిప్పుట) ఋజుకరణము (అనగా నిడుపుగ జేయుట) మొదలగునవి యంత్రకర్మములు. చకారమువలన ప్రక్షాళనము కూడ యంత్రము యొక్క కర్మ యని తెలియవలయును.

### కంకముఖయంత్రశ్రేష్ఠత్వము

నివర్తతే సాధ్వవగాహతే చ
గ్రాహ్యం గృహీత్వోద్ధరతే చ యస్మాత్,
యంత్రేష్వతః కంకముఖం ప్రధానం
స్థానేషు సర్వేష్వధికారి యచ్చ. ౪౨

కంకముఖయంత్రము లోనికి జేగి వైట వచ్చును. లోన బాగుగా ప్రవేశించును. లోన గ్రహించవలసిన వస్తువులను గ్రహించుకొని వెలికి తీసికొని వచ్చి విడుచును. సర్వ ప్రదేశములయందు ప్రవేశించతగిన యధికారము కలది. కాబట్టి సమస్తమైన యంత్రములలో కంకముఖమను యంత్రము ప్రధానంబు.—

"తత్రాతిస్థూలమసార మతిదీర్ఘమతి హ్రస్వమగ్రాహి విషమగ్రాహి వక్రం శిథిల మత్యున్నతం మృదుకీలం మృదుముఖం మృదుపాశమితి ద్వాదశయంత్రదోషాః.

ఏతైర్దోషైర్వినిర్ముక్తం యంత్రమష్టాదశాంగులమ్,

ప్రశస్తం భిషజా జ్ఞేయం తద్ధి కర్మసుయోజయేత్."

మిక్కిలి లావుగనుండుట, దృఢముగ లేకుండుట, మిక్కిలి పొడవుగనుండుట, కడు కుఱుచగ నుండుట, శల్యోద్ధరణమునం దసమర్థముగ నుండుట, శల్యమును విషమముగ గ్రహించుట, వంకరగనుండుట, శిథిలముగ నుండుట, మిక్కిలి యున్నతముగ నుండుట, సారములేని కీళ్లం గలిగియుండుట, మందమగు నగ్రంబుల గలిగియుండుట, శిథిలమైన దారములం గలిగియుండుట అను 12 దోషంబులీయంత్రంబులకు వెలయును. కావున వైద్యుడు పైజెప్పిన దోషములులేక పదునెనిమిదంగుళముల ప్రమాణముగల యంత్రం బన్నిట నెక్కుడని యెంచి యట్టి దానిచే పైజెప్పిన నిర్ఘాతనాది క్రియల జేయందగును. అని సుశ్రుతమునందు చెప్పబడి యున్నది.

పంచవింశతితమాధ్యాయము, ముగిసెను.

# షడ్వింశతితమాధ్యాయము

అవ: యంత్రవిధ్యధ్యాయానంతరము శస్త్రస్వరూపవిజ్ఞానార్థము శస్త్రవిధ్యధ్యాయము చెప్పబడుచున్నది.

శస్త్రవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతశ్శస్త్రవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

యంత్రవిధ్యధ్యాయానంతరము శస్త్రస్వరూపమును తెలియపరచునట్టి శస్త్రవిధ్యధ్యాయమును వివరించెదము.

శస్త్రస్వరూపము

షడ్వింశతిస్సుకర్మారైర్ఘటితాని యథావిధి,
శస్త్రాణి రోమవాహీని బాహుల్యేనాంగులాని షట్. ౧
సురూపాణి సుధారాణి సుగ్రహాణి చ కారయేత్,
అకరాళాని సుధ్మాతసుతీక్ష్ణావర్తితేఽయసి.
సమాహితముఖాగ్రాణి నీలాంభోజచ్ఛవీని చ,
నామానుగతరూపాణి సదా సన్నిహితాని చ. 3
స్వోన్నానార్ధచతుర్థాంశఫలాన్యేకైకశోఽపి చ,
ప్రాయో ద్విత్రాణి యుంజీత తాని స్థానవిశేషతః. ౪

శస్త్రములు 26 విధంబులు. అవి తఱుచుగ 6 అంగుళములు నిడుపుగలవిగ, శస్త్రకర్మయందు సమర్థులగువారిచే విధిప్రకారము చేయబడినవిగ, రోమములను ఛేదించుటయందు సమర్థమైన పదను కలవిగ, బాగుగ కరిగించబడినఉక్కు, ఇనుము వీనిచే జేయబడినవిగ, మంచిరూపముగలవిగ, చూచుటకు సొగసుగ, మంచిపదును గలవిగ, సుఖముగ పట్టుకొనతగిన పిడులు గలవిగ, బాగుగా జేయబడిన అగ్రభాగములు గలవిగ, నల్లకలువ రేకువలె కాంతి గలవిగ, పేరుకుతగిన యాకారములు గలవిగ, ఎల్లప్పుడు తనసమీపమునందుంచుకొనతగినవిగ, శస్త్రముయొక్క నిడుపులో 8-వ భాగము (అనగా మువ్పాతిక భాగము) ఫలము (అనగా అలుగు) గలవిగ నుండవలయును. మఱియు నాశస్త్రములను తఱుచుగ నొక్కొకటిగగాని, లేక స్థానవిశేషానుగుణముగా రెంటినిగాని, లేక మూటినిగాని ప్రయోగింపవలయును.

◆ మండలాగ్రశస్త్రము ◆

మండలాగ్రం ఫలే తేషాం తర్జన్యంతర్నఖాకృతి,
లేఖనే ఛేదనే యోజ్యం పోథకీశుండికాదిషు. ౫

ఆ శస్త్రములలో మండలాగ్రమనునది జుట్టనవ్రేలియొక్క లోనఖమువంటి యాకారముగల అలుగునుగలదై యుండును. దీనిని పోథకీ, శుండికా, వర్త్మ మొదలగు రోగములలో లేఖనము ఛేదనము వీనింజేయుటయం దుపయోగింపపలయును.

◆ వృద్ధిపత్రశస్త్రము ◆

వృద్ధిపత్రం క్షురాకారం ఛేదభేదనపాటనే,
ఋజ్వగ్రమున్నతే శోఫే గంభీరే చ తదన్యథా. ౬
నతాగ్రం పృష్ఠతః

వృద్ధిపత్రమను పేరుగలశస్త్రము క్షురము (అనగా మంగలకత్తి) యొక్కయా కారము, వంకరలేని యగ్రభాగము గలదిగ నుండును. దనిని ఉన్నతమైనశోఫలో ఛేదనము, భేదనము, పాటనము, వీనిం జేయుటయం దుపయోగింపవలయును. గంభీరమైన శోఫలో పృష్ఠప్రదేశమునందు వంగియుండునట్టి యగ్రభాగముగల వృద్ధిపత్రమను శస్త్రమును ప్రయోగింపవలయును.

◆ ఉత్పలశస్త్రము అధ్యర్ధధారశస్త్రము ◆

దీర్ఘహ్రస్వవక్త్రం * యథాశయమ్,
ఉత్పలాధ్యర్ధధారాఖ్యే ఛేదనే భేదనే

ఉత్పలపత్రము, అధ్యర్ధధారము అనెడి పేర్లుగల 2 శస్త్రములు యథాక్రమ ముగాదీర్ఘముగ, హ్రస్వముగ నుండునట్టి ముఖములుగలవిగ నుండును. (అనగా ఉత్పల మనుశస్త్రము దీర్ఘముఖము గలదిగ అధ్యర్ధధారమను శస్త్రము హ్రస్వముఖము గలదిగ నుండు నని భావము,) వీనిని ఛేదన, భేదనములయం దుపయోగింపవలయును.

◆ సర్పవక్త్రశస్త్రము ◆

తథా. ౭
సర్పాస్యం ఘ్రాణకర్ణార్శశ్ఛేదనేఽర్ధాంగుళం ఫలే,

సర్పవక్త్ర మనుశస్త్రము సర్పముఖముతో తుల్యమైనముఖము, అర్ధాంగుళము నిడుపైన అలుగు గలదిగ నుండును. దీనిని ఘ్రాణార్శస్సు, వీనిఛేదనభేదనములయం దుపయోగింపవలయును.

---

* యథాక్రమమ్ ఇతిపా.

ఏషణీశస్త్రము

గతేరన్వేషణే శ్లక్ష్ణా గండూపదముఖైషిణీ. ౮
భేదనార్థేఽపరా సూచీముఖా మూలనివిష్టఖా,

ఏషణి యను పేరుగలశస్త్రము మృదువైన స్పర్శము, గండూపదము (అనగా ఎఱ్ఱల) యొక్క ముఖమువంటి ముఖముగలదిగ నుండును. దీనిని వ్రణముయొక్క గతిని శోధించి గమనించుటయం దుపయోగింపవలయును. ఏషణియను మఱియొక శస్త్రము సూదివంటి ముఖముగలదిగ, మూలభాగమునందు (అనగా పట్టుకొనునట్టి ప్రదేశమునందు) ద్వారముతోగూడినదిగ నుండును. దీనిని భేదనమునం దుపయోగింపవలయును.

వేతసపత్త్రశస్త్రము

వేతసం వ్యధనే

ప్రబ్బలియాకువంటి యాకారముగల వేతసమను శస్త్రము 6 అంగుళములు నిడుపుగలదిగ నుండును. దీనిని వ్యధనమునం దుపయోగింపవలయును.

శరార్యాస్యశస్త్రము

స్రావ్యే శరార్యాస్యంత్రికూర్చకే. ౯

శరార్యాస్యము అనుశస్త్రమును త్రికూర్చకమునందును, స్రావ్యమునందును, ఉపయోగింపవలయును. శరార్యాస్య మనగా ఆడేలయొక్క ముఖముతో తుల్యమైన యాకారముగల శస్త్రము.

కుశాటాశస్త్రము

కుశాటా వదనే స్రావ్యే ద్వ్యంగుళం స్యాత్తయోః ఫలమ్,

కుశాటా యను శస్త్రమును ముఖమునందు పూయాదులను స్రవింపజేయుటకై యుపయోగింపవలయును శరార్యాస్యము, కుశాటా వీనియొక్క అలుగు 2 అంగుళములు నిడుపుగలదై యుండును.

అంతర్ముఖశస్త్రము

తద్వదంతర్ముఖం తస్య ఫలమధ్యర్ధమంగులమ్.

అంతర్ముఖ మను పేరుగల శస్త్రము కుశాటా యను శస్త్రమునకు తుల్యముగ నుండును. మఱియు నా అంతర్ముఖశస్త్రముయొక్క అలుగు $1\frac{1}{2}$ అంగుళప్రమాణము గలది

అర్ధచంద్రాననశస్త్రము

అర్ధచంద్రాననం చైతత్తథా

అర్ధచంద్రాననమను శస్త్రము కుశాటాయను శస్త్రమునకు తుల్యముగ నుండును.

### ప్రీహివక్త్రశస్త్రము

అర్ధార్ధాంగుళం ఫలే,
వ్రీహివక్త్రం ప్రయోజ్యం చ తచ్ఛిరోదరయోర్వ్యధే. ౧౧

వ్రీహివక్త్ర మనుశస్త్రము $1\frac{1}{2}$ యంగుళము నిడుపుగల అలుగుతో గూడి యుండును. దీనిని సిరావ్యధ, ఉదరవ్యధ వీనియం దుపయోగింపవలయును.

### కురారీశస్త్రము

పృథుః కుఠారీ గోదంతసదృశార్ధాంగులాననా,
తయోర్ధ్వదండయా విధ్యేదుపర్యస్థ్నాం స్థితాం సిరామ్. ౧౨

కురారి యను శస్త్రముసు (అనగా గొడ్డలి) విస్తీర్ణముగను, గోదంతమునకు సదృశమయిన $\frac{1}{2}$ అంగుళము నిడుపుగల ముఖము (వాదర) గలదిగ నుండును. ఊర్ధ్వభాగమునందు దండముగల కురారియను శస్త్రముచే అస్థులకు పైనసుండు సిరలను వేధించవలయును.

### తామ్రశలాక

తామ్రీ శలాకా ద్విముఖీ ముఖే కురవకాకృతిః,
లింగనాశం తయా విధ్యేత్

తామ్రముచే జేయబడిన శలాకయను శస్త్రము 2 ముఖములుగలదిగ, గోరింట పుష్పమునకు సమానమయిన యాకారమువంటి ముఖముగలదిగ నుండును. దానిచే కఫోత్థపటల మను సంజ్ఞగల లింగనాశమును వేధించవలయును.

### అంగుళిశస్త్రము

కుర్యాదంగుళిశస్త్రకమ్. ౧౩
ముద్రికానిర్గతముఖం ఫలే త్వర్ధాంగులాయతమ్,
యోగతో వృద్ధిపత్రేణ మండలాగ్రేణ వా సమమ్. ౧౪
తత్ప్రదేశిన్యగ్రపర్వప్రమాణార్పణముద్రికమ్,
సూత్రబద్ధం గళస్రోతోరోగచ్ఛేదనభేదనే.

అంగుళిశస్త్రము ముద్రికలోనుండి (అనగా ఉంగరములోనుండి) వెలివడి యుండు ముఖముగలదిగను, $\frac{1}{2}$ అంగుళము నిడుపుగల అలుగుతోగూడినదిగను, వృద్ధిపత్రముతోగాని, మండలాగ్రముతోగాని తుల్యమయిన అకారముగలదిగను, వైద్యుడు జేన జుట్టనవ్రేలియొక్క అగ్రపర్వములో ధరించతగిన ఉంగరముతోగూడినదిగను నుండవలయును. దీనిని దారముచే మణిబంధమునందు కట్టుకొని కంఠస్రోతోగతరోగములను ఛేదించుటయందు భేదించుటయందు నుపయోగింపవలయును.

## బడిశశస్త్రము

గ్రహణే శుండికార్శాదేః బడిశం సునతాననమ్,

బడిశ మను శస్త్రము అంకుశమువలె వంగినముఖము గలదిగ నుండును. దీనిని శుండికా, అర్శ్శ, ప్రతిజిహ్వికా మొదలగువానిని గ్రహించుటయం దుపయోగింప వలయును.

## కరపత్రశస్త్రము

ఛేదేఽస్థ్నాం కరపత్రం తు ఖరధారం దశాంగులమ్, ౧౬
విస్తారే ద్వ్యంగుళం సూక్ష్మదంతం సుత్సరుబంధనమ్,

కరపత్ర మను శస్త్రము (అనగా ఱంపము) తీక్ష్ణమయినపదును, 10 అంగుళములు నిడుపు, 2 అంగుళములు విస్తారము, సూక్ష్మమైనదంతములు గలదిగ, మంచిపిడితో గూడి నదిగ నుండును. ఇది అస్థులను ఛేదించుటయం దుపయోగించును.

## కర్తరీశస్త్రము

స్నాయుసూత్రకచచ్ఛేదే కర్తరీ కర్తరీనిభా. ౧౭

కర్తరియను శస్త్రము కత్తెరతో సమానముగ నుండును. ఇది స్నాయువులు, సూత్రము, కేశములు వీనిని ఛేదించుటయం దుపయోగించును.

## నఖశస్త్రము

వక్రర్జుధారం ద్విముఖం నఖశస్త్రం నవాంగుళమ్,
సూక్ష్మశల్యోద్ధృతిచ్ఛేదభేద *ప్రచ్ఛనలేఖనే. ౧౮

నఖ మను శస్త్రము వంకరగ, ఋజువైన పదునుగల 2 ముఖములు గలదిగ (అనగా ఒకముఖము వంకరగ, మఱియొకముఖము ఋజువుగ) 9 అంగుళములు నిడుపుగలదిగ నుండును. ఇది సూక్ష్మమయిన శల్యములం దీయుటయందును, నఖములను ఛేదించుట యందును, భేదించుటయందును, చివ్వుటయందును, గీచుటయందును నుపయోగించును.

## దంతలేఖనశస్త్రము

ఏకధారం చతుష్కోణం ప్రబద్ధాకృతి చైకతః,
దంతలేఖనకం తేన శోధయేద్దంతశర్కరామ్. ౧౯

దంతలేఖన మను శస్త్రము ఒకప్రదేశమునందు పదునుతో గూడినదిగను, 4-గు కోణములు గలదిగను, ఒకప్రదేశమునందు కట్టబడినదిగ నుండును. దానిచే దంతశర్కరను శోధించవలయును.

---

* ప్రచ్ఛన్న ఇతిపా.

## సూచీవివరము

వృత్తా గూఢదృఢాః పాశే తిస్రః సూచ్యోఽత్ర సీవనే,
మాంసలానాం ప్రదేశానాం త్ర్యశ్రా త్ర్యంగులమాయతా,
అల్పమాంసాస్థిసంధిస్థవ్రణానాం ద్వ్యంగులాయతా,
వ్రీహివక్త్రా ధనుర్వక్రా పక్వామాశయమర్మసు. ౨౧
సా సార్ధద్వ్యంగులా

సూదులు మూడు. అయ్యవి గుండ్రములై దారము గ్రుచ్చుటకు వానిమొదట దృఢములైన రంధ్రములు కల్గి యుండవలెను. వానిలో నధికమాంసముగల శరీర ప్రదేశములను కుట్టుటయందు త్ర్యశ్రముగను (అనగా కొనయందు 3 పార్శ్వములు గలదిగను) 3 అంగుళములు నిడుపుగలదిగ నుండుసూచిని (అనగా సూదిని) యుపయోగింపవలయును. అల్పమాంసముగల ప్రదేశములను, సంధులు, అస్థులు వీని నాశ్రయించి యుండు వ్రణములను కుట్టుటలో 2 అంగుళములు నిడుపు గుండ్రమైనముఖము గల సూది నుపయోగింపవలయును. పక్వాశయము, ఆమాశయము, మర్మస్థానము వీనియం దుండువ్రణములను కుట్టుటలో వ్రీహి (అనగా వడ్లవంటి) ముఖముగలదిగను, ధనుస్సువలె వంకరగను, $2\frac{1}{2}$ అంగుళము నిడుపుగలదిగ నుండుసూది నుపయోగింపవలయును.

## సూచీకూర్చశస్త్రము

సర్వ వృత్తాస్తాశ్చతురంగులాః.
కూర్చో వృత్తైకపీఠస్థాః సప్తాష్టౌ వా సుబంధనాః ౨౨
సయోజ్యో నీలికావ్యంగకేశశాతనకుట్టనే,

సూదియంతయు గుండ్రనై నాలుగంగుళములనిడుపు కల్గియుండి, అట్టిసూదులు ఏడెనిమిదినొకటిని ఒకగుండ్రమైనపీఠమున దృఢముగ నుండున ట్లమర్చిన నయ్యది సూచీకూర్చ మని చెప్పబడును. ఈశస్త్రమును నీలిక, వ్యంగము, కేశశాతనము మున్నగు వ్యాధులయందు కుట్టనమునకై యుపయోగింపనగును.

## ఖజశస్త్రము

అర్ధాంగుళైర్ముఖైర్వృత్తైరష్టాభిః కంటకైః ఖజః. ౨౩
పాణిభ్యాం మథ్యమానేన మాన్త్రేణా త్తేన హా రేత్ సృక్,

అర అంగుళము నిడుపుగల కొనతోగూడిచవిగ, గుండ్రముగనుండు 8 సూదులం గలది ఖజశస్త్ర మనబడును. హస్తములచే నాసికములో ఖజ మనుశస్త్రమును చిలికి రక్త స్రావము చేయించవలయును.

## యూథికాశస్త్రము

వ్యథనే కర్ణపాలీనాం యూథికా ముకులాననా. ౨౪

యూథిక యను శస్త్రము మొగ్గవంటి ముఖముగలదై యుండును. ఇది కర్ణపాశలను (అనగా చెవితమ్మెలను) వేధించుటయం దుపయోగించును.

## ఆరా శస్త్రము

ఆరార్థాంగులవృత్తాస్యా తత్ప్రవేశా తథోర్ధ్వతః,
చతురస్రా తయా విధ్యేచ్ఛోఫం పక్వామసంశయే. ౨౫
కర్ణపాళిం చ బహుళాం

ఆర యను పేరుగలశస్త్రము అర్ధాంగుళము గుండ్రముగనుండు ముఖము గలదిగను, అర్ధాంగుళము లోన ప్రవేశింపతగినదిగను, ఊర్ధ్వభాగమునందు నాల్గుకోణములు గలిగి అర్ధాంగుళము నిడుపుగలదిగనుండును. శోఫయొక్క పక్వ, అపక్వవిషయమునందు సంశయము గలుగునపుడు ఈశస్త్రముచే నాశోఫను వేధించవలయును. మఱియు నధికమాంసముగల కర్ణపాళినికూడ నీశస్త్రముచేతనే వేధించవలయును.

## కర్ణవేధినీశస్త్రము

* బహులాయాశ్చ శస్యతే,
సూచీ త్రిభాగసుషిరా త్ర్యంగులా కర్ణవేధనీ. ౨౬

మూడవభాగమునందు ద్వారము గలదిగను, మూడుఅంగుళములు నిడుపుగలదిగను నుండుసూది కర్ణవేధిని యని చెప్పబడును. కర్ణవేధిని యనుసూదికూడ అధికమాంసముగల కర్ణపాళిని వేధించుటయందు ప్రశస్తంబైనది.

## ఉపశస్త్రములు

జలౌకః క్షారదహనకాచోపలనఖాదయః,
అలౌహాన్యనుశస్త్రాణి తాన్యేవం చ వికల్పయేత్. ౨౭
అపరాణ్యపి యంత్రాదీన్యుపయోగం చ యౌగికమ్,

జలగలు, క్షారము, అగ్ని, గాజు, రాయి, నఖము మొదలగునవి ఉపశస్త్రములు. ఇవి లోహసంబంధరహితమైనవి. నఖాదియను ఆది శబ్దముచేత అయస్కాంతము, టేకాకు, నల్లవావిలియాకు మొదలగువానిని గ్రహించుకొనవలయును. ఇటులనే సద్వైద్యుడగువాడు స్వబుద్ధిచే నితరములగు యంత్రాదులను, తదుపయోగములను ఊహించుకొనవలయును.

---

* తస్యా ఏవచ శస్యతే ఇతిపా.

### శస్త్రకృత్యములు

ఉత్పాట్య పాట్యసీవ్యైష్య లేఖ్య ప్రచ్ఛనకుట్టనమ్ ౨౯
ఛేద్యం భేద్యం వ్యధో మంథో గ్రహో దాహశ్చతత్క్రియాః,

ఉత్పాట్యము (అనగా పెల్లగించుట), పాట్యము (అనగా చీల్చుట), సీవ్యము (అనగా కుట్టుట), ఏష్యము (అనగా వ్రణమార్గమును పరీక్షించుట), లేఖ్యము (అనగా గీచుట), ప్రచ్ఛనము (అనగా చెక్కుట), కుట్టనము (అనగా పొడుచుట), ఛేద్యము (అనగా ఛేదించుట), భేద్యము (అనగా బద్దలుచేయుట), వేధనము (అనగా గ్రుచ్చుట), మంథము (అనగా చిలుకుట), గ్రహణము (అనగా పట్టుకొనుట), దాహము (అనగా కాల్చుట), ఇవి పైజెప్పిన యిరువదియారు శస్త్రములయొక్క కృత్యము లని తెలియవలయును. ఉత్పాట్యమునందు నఖమను శస్త్రమును, పాటనమునందు వృద్ధిపత్త్రాదిశస్త్రములను, సీవ్యమునందు సూదులను, లేఖనమునందు మండలాగ్రాది శస్త్రములను, భేదనమునందు ఏషణి, సూచీముఖము అనునీ శస్త్రములను, వేధనమునందు వేతపత్త్రాది శస్త్రములను, మంథనమునందు ఖజమను శస్త్రమును, గ్రహణమునందు సందంశ మను యంత్రమును, దాహమునందు శలాకాదులను ప్రయోగింపవలయును.

### శస్త్రదోషములు

కుంఠఖండతనుస్థూలహ్రస్వదీర్ఘత్వవక్రతాః.
శస్త్రాణాం ఖరధారత్వమష్టౌ దోషాః ప్రకీర్తితాః,

కుంఠత్వము (అనగా మొక్కగనుండుట), ఖండత్వము (అనగా కొసవిరిగి యుండుట), తనుత్వము (అనగా మిక్కిలి సన్నముగ నుండుట), స్థౌల్యము (అనగా మిక్కిలి లావుగ నుండుట), హ్రస్వత్వము (అనగా మిక్కిలి కుఱచగనుండుట), దైర్ఘ్యము (అనగా మిక్కిలి నిడుపుగనుండుట), వక్రత (అనగా వంకరగ నుండుట), ఖరధారత్వము (అనగా కర్కశమైనపదును గలిగియుండుట), ఇవి యెనిమిదియు శస్త్రదోషము లని ఋషులచే జెప్పబడియున్నవి.

### శస్త్రగ్రహణవిధి

ఛేదభేదనలేఖ్యార్థం శస్త్రం వృంతఫలాంతరే. ౩౦
తర్జనీమధ్యమాంగుష్ఠై ర్గృహ్ణీయాత్సుసమాహితః,

ఛేదనము, భేదనము, లేఖనము, అనునీ కర్మలయందు జుట్టనవ్రేలు, నడిమివ్రేలు, బొట్టనవ్రేలు, వీనిచే శస్త్రముయొక్క పిడి, అలుగు, వీనిమధ్యభాగమునందు మిగుల జాగరూకుడై పట్టుకొనవలయును.

---

* ప్రచ్ఛన్న ఇతిపా.

విస్రావణాని వృంతాగ్రే తర్జన్యంగుష్ఠకేన చ ౩౧

రక్తాదులను స్రవింపజేయునట్టి శరార్యాస్యము మొదలగు శస్త్రములను వృంతము నందు (అనగా పిడియొక్క అగ్రభాగమునందు) జుట్టనవ్రేలు, బొట్టనవ్రేలు వీనిచే పట్టుకొనవలయును.

తలప్రచ్ఛన్నవృంతాగ్రం గ్రాహ్యం వ్రీహిముఖం ముఖే,

వ్రీహిముఖమను నాయుధముయొక్క అగ్రభాగమును అఱచేతిచే మూసికొని ముఖభాగమునందు పట్టుకొనవలయును.

మూలేష్వాహరణార్థే తు క్రియాసౌకర్యతోఽపరమ్.

ఆకర్షణార్థమై శస్త్రములను మూలభాగమునందు పట్టుకొనవలయును. ఇతరమైన శస్త్రముల నేవిధముగ పట్టుకొనిన క్రియలను సుఖముగ జేయుట కనుకూలించునో అత్తెఱంగున వానిం బట్టుకొనవలయును.

### శస్త్రకోశలక్షణము

స్యాన్నవాంగులవిస్తారస్సుఘనో ద్వాదశాంగులః,
క్షౌమపత్రోర్ణకౌశేయదుకూలమృదుచర్మజః. ౩౩
విన్యస్తపాశస్సుస్యూతస్సాంతరోర్ణార్థశస్త్రకః,
శలాకాపిహితాస్యశ్చ శస్త్రకోశస్సుసంచయః. ౩౪

శస్త్రకోశము (అనగా ఆయుధముల నుంచునట్టియొర) 9 అంగుళములు వెడల్పు గలదిగను, మిగులదట్టమైనదిగను, 12 అంగుళములు నిడుపు గలదిగను, క్షౌమము (అనగా వెలిపట్టువస్త్రము), పత్రోర్ణము (అనగా తెల్లపట్టు), కౌశేయము (అనగా పట్టుపురుగుచే కట్టబడిన కాయలనుండి పుట్టునూలు తీసి దానిచే చేయబడిన పట్టుబట్ట) దుకూలము (అనగా పట్టువస్త్రము), మృదువైన చర్మములు, వీనిచే జేయబడినదిగను, పాశముతో (అనగా ఉచ్చుతో) గూడినదిగను. బాగుగ కుట్టబడినదిగను, శలాకచే మూయబడిన ముఖము గలదిగను, సొగసైనసంచయముతో (అనగా అరలతో) గూడినదిగ నుండవలయును.

"నిశాతనీ తు శస్త్రాణాం సూక్ష్మాశిలైకామాషముద్గప్రభా."

శస్త్రములను పదునుబెట్టునట్టితాయి మినుములు, పెసలు వీనివంటికాంతిగలదిగ నుండవలయునని తంత్రాంతరమునందు చెప్పబడియున్నది.

### జలూకాప్రయోగము

జలౌకసస్తు సుఖినాం రక్తస్రావాయ యోజయేత్,

సుఖిగా నుండు మనుజులకు రక్తస్రావము చేయించుటకై జలగలను ప్రయోగింపవలయును.

అవి జలగలు విషముతోఁగూడినవి, విషరహితములగునవి అని రెండు విధంబులు. వానిలో విషముతోఁగూడియుండు జలగలను రక్తస్రావమునం దుపయోగించుట అపాయకరంబు. అట్లగుటచే వానిలక్షణములు తొలుత చెప్పబడుచున్నవి.

### విషయుక్త జలూకాలక్షణము

దుష్టాంబుమత్స్యభేకాహిశవకోథమలోద్భవాః. 3౫
రక్తాః శ్వేతా భృశం కృష్ణాశ్చపలాః స్థూలపిచ్ఛిలాః,
ఇంద్రాయుధవిచిత్రోర్ధ్వరాజయో రోమశాశ్చ తాః. 3౬
సవిషా వర్జయేత్

దుష్టమైన ఉదకము, మత్స్యములు, కప్ప, పాము, పీనుగులయొక్క కోథము. (కుళ్ళినమాంసము) మూత్రపురీషాది మలములు వీనిలోనుండి జనించినజలగలు విషముతోఁగూడి యుండును. అవి రక్తవర్ణము, తెలుపువర్ణము, మిగుల కృష్ణవర్ణము గలవిగ, స్థూలముగ, పిచ్ఛిలముగ, ఇంద్రధనుస్సువలె చిత్రవర్ణముగల ఊర్ధ్వరేఖలు గలవిగ, విశేష రోమములతోఁగూడినవిగ నుండును. అట్టి విషముతో గూడియుండునట్టి జలగలను రక్తస్రావమునం దుపయోగింపం జనదు.

### విషయుక్తజలూకోపద్రవములు

తాభిః కండూ*పాకజ్వరభ్రమాః,
విషపిత్తాస్రనుత్కార్యం తత్ర

విషముతో గూడియుండు జలగలను మోహముచే రక్తస్రావమునం దుపయోగించినయెడల దురద, పాకము, జ్వరము, భ్రమము, తాపము, శోఫ, మూర్ఛ మొదలగు నుపద్రవములు గలుగును. అట్టియెడ విషమును పిత్తమును హరింపజేయునట్టి చికిత్సలను చేయవలయును.

### విషరహితజలూకాలక్షణము

శుద్ధాంబుజాః పునః 3౭
నిర్విషాః శైవలశ్యావా వృత్తా నీలోర్ధ్వరాజయః,
కషాయపృష్ఠా_స్తన్వంగ్యః కించిత్పీతోదరాశ్చ యాః 3౮

శుద్ధమైన ఉదకములో జనించినజలగలు, చెంగలువ, కలువ, తామరపువ్వు, అధికమైనజలము, పాచి, వీనిలో జనించినజలగలు, ఇవి నిర్విషములుగ నుండును మఱియును నాజలగలు పాచివలె కపిలవర్ణము గలవిగ, గుండ్రముగ, నీలవర్ణముగల ఊర్ధ్వరేఖలు

---

* పాండు ఇతిపా.

గలవిగ, కషాయవర్ణముగల (అనగా మఱ్ఱిమొదలగువాని పట్టలకు సమానమైన వర్ణము గల) పృష్ఠభాగముగలవిగ, కృశమైనశరీరము గలవిగ, ఒకింతపీతవర్ణముగల ఉదరప్రదేశము గలవిగ నుండును.

### రక్తముచే మదించియుండు జలగలస్వరూపము.

తా అప్యసమ్యగ్వమనాత్ప్రతతం చ నిపాతనాత్,
సీదంతీస్సలిలం ప్రాప్య రక్తమత్తా ఇతి త్యజేత్. 3౯

పైజెప్పబడిన నిర్విషము లగుజలగలు రక్తపానమునుజేసి మత్తుగొని యున్నచో వానినిగూడ చికిత్స కుపయోగింపంజనదు రక్తమును పీల్చుటకై జలగల ప్రయోగించినపుడు అవి పీల్చినరక్తమును బాగుగ వెళ్లగ్రక్కకున్నను, రక్తమును పీల్చుటకై ప్రయోగించినపుడు మెల్లమెల్లగపట్టుకొనినను, నీటిలో నుంచినపుడు కదలక మెదలక చేష్టలుడిగి యున్నను, ఆట్టిజలగలు దుష్టరక్తమునుత్రాగి మత్తుకొనినవి యని యెఱుంగునది.

### జలూకాప్రయోగక్రమము.

అథేతరానిశాకల్కయుక్తేఽంభంసి పరిప్లుతాః,
అవంతి సోమే తక్రే వా పునశ్చాశ్వాసితా జలే, ౪౦
లాగయేద్ఘృత *మృత్స్నాంగ శస్త్రరక్తనిపాతనైః,
పిబంతీరున్నతస్కంథా శ్ఛాదయేన్మృదువాససా. ౪౧

పిదప పసుపు కల్కముతోగూడియుండు ఉదకములోగాని లేక కాంజికములోగాని లేక తక్రములోగాని తేలునవిగ, మరల శుద్ధమైన ఉదకములో నీదతగినవిగ ఉత్సాహముతో గూడియుండునవిగనుండు జలగలను శరీరప్రదేశమునందు ఘృతము లేక శ్లేష్మమైనమృత్తిక వీనిని లేపనము చేయుటచేతగాని లేక శస్త్రముచే రక్తస్రావము చేయించుటచేతగాని, కరచునటుల జేయవలయును. శిరము నెత్తుకొని రక్తపానము చేయుచుండు నాజలగను రక్తము పీల్చుచున్నదని తెలిసి సూక్ష్మమైన వస్త్రముచే మూయవలయును. ఇటుల మూసినయెడల ఈగ మొదలగువానియొక్క యుపద్రవము లేకుండుటవలన నాజలగలు శరీరమునందు బాగుగ నంటుకొని దుష్టమైనరక్తమును, బాగుగ పీల్చును.

### జలగలు దుష్టరక్తమును పానము చేసెడిక్రమము

సంపృక్తాద్దుష్టశుద్ధాస్రాజ్జలౌకా దుష్టశోణితమ్,
ఆదత్తే ప్రథమం హంసః క్షీరం క్షీరోదకాదివ. ౪౨

* మృత్ స్తస్య ఇతిపా.

హంస క్షీరముతోఁగూడియుండు ఉదకములోనుండి క్షీరమునుమాత్రము గ్రహించునటులనే జలగలు పరస్పరము మిళితములగనుండు దుష్టశుద్ధ రక్తములోనుండి దుష్ట రక్తమునుమాత్రము తొలుత గ్రహించును.

జలూకాదంశమోక్షణము.

దంశస్య తోదే కండ్వాం వా మోక్షయేద్వామయేచ్చ తామ్,

కరచిన స్థలమునందు బాధయైనను, దురదయైనను గలుగునప్పుడు శుద్ధరక్తమును పీల్చనీయక కాపాడుటకై యాజలగను విడిపించవలయును. మఱియు నది రక్తపానమునం దాసక్తివలన విడువకుండినచో దానిముఖముపై పసుపుచూర్ణముగాని లవణచూర్ణముగాని వేసి విడిపించి పిదప నా జలగకు వమనము చేయించవలయును. "తాం" అను ఏకవచన ప్రయోగముచే నొక్కొకజలగగా విడువవలయుననియును, ఏకకాలమునం దన్ని జలగలను విడువకూడదనియు నర్థంబగుచున్నది.

జలూకావమనక్రమము.

పటుతైలాక్తవదనాం శ్లక్ష్ణకండనరూక్షితామ్. ౪౩

జలగయొక్క ముఖమునందు సైంధవలవణముతోఁ గూడియుండు తైలమును పూసి సూక్ష్మమయిన బియ్యపునూకలను దానిపై జల్లుటచే వమనము చేయించవలయును.

జలూకావమనానంతరకర్తవ్యము.

రక్షేత్ రక్తమదాద్భూయః సప్తాహం తాం న పాతయేత్,

వమనముచేసియుండు యాజలగలకు రక్తమదము గలుగకుండా రక్షించుటకై మఱల నేడుదినములవరకు వానిని బ్రయోగింపంజనదు.

వమనముచే జలగలకు గలుగు గుణము.

పూర్వవత్పటుతా దార్ఢ్యం సమ్యగ్వాంతే జలౌకసామ్, ౪౪

జలగలకు బాగుగా వమనంబైనయెడల పూర్వమువలెనే పటుత్వమును, దార్ఢ్యము కలుగును.

వమనాధిక్యముచే జలగలకుగలుగునుపద్రవము.

క్లమోఽతియోగాన్మృత్యుర్వా

జలగలకు అధికముగా వమనంబులైనయెడల బడలికగాని లేక మరణముగాని కలుగును.

వమనాభావముచే జలగలకు గలుగు దోషము.

దుర్వాంతే స్తబ్ధతా మదః,

జలగలకు బాగుగా వమనము కాకుండునపుడు స్తబ్ధత్వము, మత్తతయు గలుగును.

అన్యత్రాన్యత్ర తాః స్థాప్యా ఘటే మృత్స్నాంబుగర్భిణి. ౪౫
లాలాదికోథనాశార్థం సవిషాస్స్యుస్తదన్వయాత్,

జలగలు నిర్విషంబులుగ నుండినవానికి లాలామూత్రపురీషాదిసంబంధముచే దోషము కలుగును. కావున తచ్ఛమనార్థమై ప్రశస్తమైన మృత్తికతో గూడియుండుజలముచే పూరితములగు వేరువేరు కుండలయందు 3 దినముల కొకమారుగాని లేక 5 దినముల కొకమారుగాని ఆ జలగలను విడువవలయును. అటుకాదేని యవి పైజెప్పిన లాలాదులసంబంధమువలన విషయుక్తంబులుగ నగును.

### అశుద్ధరక్తస్రావము.

అశుద్ధౌ స్రావయేద్దంశాన్ హరిద్రాగుడమాక్షికైః. ౪౬

రక్తము అశుద్ధముగనుండునటుల దెలియవచ్చినయెడల జలగలు కరిచిన స్థలములో పసుపు బెల్లము, తేనె, వీనిచే మరల రక్తమును స్రవింపజేయవలయును.

### ఘృతపిచు ప్రయోగము.

శతధౌతాజ్యపిచవస్తతో లేపాశ్చ శీతలాః,

పిదప ననేకపర్యాయములు కడుగబడిన శతధౌతఘృతమునను ప్రత్తిని తడిపి జలగకరిచిన గాయముపై నుంచవలెను. ఘృతపిచువులను ప్రయోగింపవలయును. మఱియును శీతలముగనుండు యష్టిమధుకము, చందనము, వట్టివేరు మొదలగు లేపనములనుకూడ చేయవలయును.

### దుష్టరక్తస్రావ ఫలము

దుష్టరక్తాపగమనా త్వద్దోష† రోగరుజాం శమః. ౪౭

దుష్టరక్తము వెలివడుటవలన రోగము, బాధ మొదలగునవి తత్క్షణముననే శాంతిజెందును. మఱియును వాపు, శైథిల్యము, దాహము ఇవికూడ శాంతిజెందును.

### పర్యుషితరక్తస్రావము

అశుద్ధం చలితం స్థానాత్స్థితం రక్తం ప్రణాశయే,
అమ్లాభ వేత్పర్యుషితం తస్మాత్తత్స్రావయేత్పునః. ౪౮

---

* "గుల్మార్శోవిద్రధీకుష్ఠ వాతరక్తగలామయాన్. † రాగ ఇతిపా.
నేత్రరుగ్విషవీసర్పాన్ శమయంతి జలౌకసః,"

గుల్మము, అర్శస్సు, విద్రధి, కుష్ఠము, వాతరక్తము, కంఠరోగము, నేత్రరోగము విషము, విసర్పి వీనిని జలగలప్రయోగించుటచే శమింపజేయనగును. అనెడి ప్రక్షిప్తపాఠం బిచట గన్పట్టుచున్నది.

అశుద్ధమయిన రక్తము స్వస్థానములోనుండి చలించి ప్రణస్థానమును జెంది చిర కాలమువరకుండినచో అమ్లభావమును జెందును. కాబట్టి దానిని మరల స్రవింపజేయ వలయును.

పిత్తదుష్ట రక్తస్రావమునందు అలాబుప్రయోగ నిషేధము.

యుంజ్యాన్నాలాబుఘటికా రక్తే పిత్తేన దూషితే,
తాసామనలసంయోగాత్

రక్తము పిత్తముచే దూషింపబడి యుండునపుడు అలాబువును, ఘటికను, ప్రయోగింపంజనదు. ఏలనగా.—అలాబుఘటికలకు అగ్ని సంయోగము గలిగి యుండుటచే నవి పిత్తరక్తములను ప్రకోపింపజేయును.

కఫవాత దుష్టరక్త స్రావణోపాయము.

యుంజ్యాచ్ఛ కఫవాయునా.　　　　౪౯

రక్తము కఫవాతములచే దూషించబడి యుండునపుడు దానిని స్రవింపజేయుటకై అలాబు, ఘటిక వీనిని ప్రయోగింపవలయును.

కఫదుష్ట రక్తస్రావమునందు శృంగనిషేధము

కఫేన దుష్టం రుధిరం న శృంగేణ వినిర్హరేత్,
స్కన్నత్వాత్

కఫముచే దూషింపబడిన రక్తము స్కన్నముగ (అనగా దట్టముగ) నుండుట వలన దానిని శృంగముచే బైలుపరుపంజనదు. ఏలనగా—శృంగమునకు అగ్ని సంయోగము లేకుండుటవలన కఫదుష్టమైన రక్తమును స్రవింపజేయుటకు సామర్థ్యము లేకుండును.

వాతపిత్త దుష్టరక్త స్రావణోపాయము.

వాతపిత్తాభ్యాం దుష్టం శృంగేణ నిర్హరేత్.　　　　౫౦

వాతపిత్తములచే దూషించబడిన రక్తమును శృంగములచే బైలుపరచవలయును.

రక్తస్రావణక్రమము.

గాత్రం బద్ధ్వోపరి దృఢం రజ్జ్వా పట్టేన వా సమమ్,
స్నాయుసంధ్యస్థిమర్మాణి త్యజన్ * ప్రచ్ఛానమాచరేత్.　　　　౫౧
అధోదేశప్రవిసృతైః పదైరుపరిగామిభిః,
న గాఢఘనతిర్యగ్భిర్న పదే పాదమాచరేత్.
† ప్రచ్ఛానేనైకదేశస్థం గ్రంథితం జలజన్మభిః,
హరేచ్ఛృంగాదిభిస్సుప్తమసృగ్వ్యాపి సిరావ్యధైః.　　　　౫౩

* ప్రశ్చన ఇతిపా.　† ప్రశ్ఛనే ఇతిపా.

సిరావ్యధ చేయతగిన శరీర పైభాగమును దారముచేగాని, వస్త్రపట్టముచేగాని గట్టిగ కట్టి యాప్రదేశమునం దుండు స్నాయువులను, అస్థులను, సంధులను, మర్మములను వదలి అధోదేశము, ఊర్ధ్వదేశము వీనియందు వ్యాపించునవియును గట్టిగ, తీక్ష్ణముగ అడ్డముగ నుండకుండునవియును నగు శలాకచే పొడవవలయును. శలాకపై శలాకను ప్రయోగింపంజనదు. మఱియు నేకదేశమునందుండు రక్తమును శలాకచే బొడిచి ఆకర్షింపవలయును. గ్రంధి, అర్బుదము మొదలగు రోగములయందు గడ్డకట్టియుండు రక్తమును జలగలచే బైలుపరచవలయును. సుప్తముగ (అనగా నిశ్చేతనముగ) నుండు రక్తమును శృంగాదులచేతను, సర్వశరీరమునందు వ్యాపించుచుండు రక్తమును సిరావేధనముచేతను, హరింపజేయవలయును.

* ప్రచ్ఛానం పిండితే వా స్యాత్

రక్తము గడ్డకట్టియుండునపుడు శలాకను ప్రయోగింపందగును.

అవగాఢే జలౌకసః,

రక్తము లోతులో బ్రవేశించి యుండునపుడు జలగలను ప్రయోగించవలయును.

త్వక్స్థేஉలాబుఘటీశృంగం

రక్తము చర్మము నాశ్రయించి యుండునపుడు ఘటి, శృంగము, వీనిని ప్రయోగింపవలయును.

సిరైవ వ్యాపకేஉసృజి. ॥౪

సర్వశరీరములో వ్యాపించి యుండురక్తమును స్రవింపజేయుటయందు సిరావేధనము చేయవలయును.

మతాంతరమునందు రక్తస్రావక్రమము.

వాతాదిధామ వా శృంగజలౌకోஉలాబుభిః క్రమాత్,

వాతాదిదోషస్థానములను జెందియుండు రక్తమును యథాక్రమముగా శృంగజలౌక అలాబువులచే (అనగా వాతస్థానగత రక్తమును శృంగముచేతను, పిత్తస్థానగత రక్తమును జలగలచేతను, శ్లేష్మస్థానగతరక్తమును అలాబుచేతను) హరింపజేయవలయును.

రక్తస్రావానంతర కర్తవ్యము.

స్రుతాసృజః ప్రదేహాద్యైశ్శీతైస్స్యాద్వాయుకోపతః. ॥౫

సతోదకండూశ్శోఫస్తం సర్పిషోష్ణేన సేచయేత్. ॥౫

రక్తమోక్షణము చేయించుకొనిన పురుషునికి శీతలమైన ప్రలేపములచే వాతము ప్రకోపించి పోట్లు, దురద వీనితోఁగూడియుండు శోఫను కలుగజేయును. కావున నటువంటిశోఫను ఉష్ణమైనఘృతముచే సేచనము చేయవలయును.

షడ్వింశతితమాధ్యాయము ముగిసెను.

---

* ప్రచ్ఛనం ఇతిపా.

# సప్తవింశాధ్యాయము



అవ పూర్వాధ్యాయమునందు రక్తమోక్షణమునకు సాధనములైన శృంగము మొదలగువానిం జెప్పి "ప్రచ్ఛానేనైకదేశస్థం" అనునీవాక్యముచేత శృంగాదివిషయములుకూడ జెప్పబడినవి. మఱియును సిరావ్యధనుగురించి విశేషముగా జెప్పవలసియుండుటచే దానినిగూర్చి యీయధ్యాయము చెప్పబడుచున్నది.

సిరావ్యధవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతస్సిరావ్యధవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

శస్త్రవిధ్యధ్యాయానంతరను సిరావిధిని తెలియజేయునట్టి సిరావ్యధవిధ్యధ్యాయమును వివరించెదము. సర్వశరీరమునందు రక్తమును వ్యాపింపజేయు పోలునరములు సిర లనబడును.

శుద్ధరక్తలక్షణము

మధురం లవణం కించిదశీతోష్ణమసంహితమ్,
పద్మేంద్రగోప హేమావిశశలోహితలోహితమ్. ౧
లోహితం ప్రవదేచ్ఛుద్ధం తనోస్తేనైవ చ స్థితిః,

మధురముగ, ఒకింత ఉప్పగ, కొంచెము ఉష్ణముగ, కొంచెము శీతలముగ, ద్రవముగ, పద్మము, ఇంద్రగోపపురుగులు, బంగారము, వీనివలె నెఱ్ఱగ, మేక, చెవులపిల్లి, వీని రక్తమువలె నెఱుపువర్ణము గలదిగ నుండు రక్తము శుద్ధమయిన దని తెలియవలయును. మఱియు నటువంటిశుద్ధమయిన రక్తముచేతనే శరీరము స్థిరముగ నిలుచును. శుద్ధరక్తము అనేకవర్ణములు గలదిగ నగుపడుటచే పద్మాద్యనేకదృష్టాంతములు లిచట జెప్పబడినవి.

రక్తదోషము

తత్పిత్తశ్లేష్మలైః ప్రాయో దూష్యతే

మఱియు నారక్తము తఱుచుగ పిత్తకరమైన ఉప్పు, కారము, తీక్ష్ణము మొదలగు వస్తువులచేతను, మినుములు, నువ్వులు మొదలగు శ్లేష్మకరమయిన వస్తువులచేతను పూర్వజన్మార్జితకర్మచేతను దూషింపబడును. మఱియును శరత్కాల స్వభావమువలన వాతకర ద్రవ్యములచేకూడ రక్తము ఒకానొకపుడు చెడును. కాబట్టి ప్రాయః అనుపదము మూలమునందు ప్రయోగించబడినది.

రక్తదోషజనితరోగములు

కురుతే తతః. ౨

విసర్పవిద్రధిప్లీహగుల్మాగ్ని సదనజ్వరాన్,

ముఖనేత్రశిరోరోగమదతృట్ లవణాస్యతాః. ౩

కుష్ఠవాతాస్రపిత్తాస్రకట్వమ్లోద్గిరణభ్రమాన్,

శీతోష్ణస్నిగ్ధరూక్షాద్యైరుపక్రాంతాశ్చయే గదాః. ౪

సమ్యక్సాధ్యా న సిధ్యంతి తే చ రక్తప్రకోపజాః,

ఆరక్తంబటుల దూషింపబడుటవలన విసర్పము, విద్రధి, ప్లీహము, గుల్మము, అగ్నిమాంద్యము, జ్వరము, ముఖరోగము, నేత్రరోగము, శిరోరోగము, మదము, దప్పి, నోరుప్పగనుండుట, కుష్ఠము, వాతరక్తము, పిత్తరక్తము, ఒకానొకపుడు కారముగ మఱియొకపుడు పుల్లగ నుండు తేనుపులు, భ్రమ, వీనిని గలుగజేయును. మఱియు శీతలము, ఉష్ణము, స్నిగ్ధము, రూక్ష మొదలగు చికిత్సలవలన సుఖకరాలముగా జెందకుండు సాధ్య రోగములుకూడ రక్తప్రకోపముచేతనే జనించినవి యని తెలియవలయును.

సిరావ్యధ విధి

తేషు స్రావయితుం రక్తముద్రిక్తం వ్యధయేత్సిరామ్. ౫

పైజెప్పిన విసర్పాది రోగములయందు ప్రకోపమును జెందియుండు రక్తమును స్రవింపజేయుటకై సిరలను వేధించవలయును. వ్యధన మనగ గ్రుచ్చుట, శరీరమునందలి రక్తమును నలుప్రక్కల వ్యాపింపజేయు బొంగుసరములను రక్తమును వెలికిం దీయుటకై ఉచితమైనసాధనముచే గ్రుచ్చుట సిరావ్యధన మనబడును.

సిరావ్యధనమునకు అనర్హులు

న తూనషోడశాతీతసప్తత్యబ్దస్రుతాసృజామ్,

అస్నిగ్ధాస్వేదితాత్యర్థస్వేదితానిలరోగిణామ్. ౬

గర్భిణీసూతికాజీర్ణపిత్తాస్రశ్వాసకాసినామ్,

అతీసారోదరచ్ఛర్దిపాండుసర్వాంగశోఫినామ్. ౭

స్నేహపీతే ప్రయుక్తేషు తథా పంచసు కర్మసు,

నాయంత్రితాం సిరాం విధ్యేన్న తిర్యఙ్నాప్యనుత్థితామ్. ౮

నాతిశీతోష్ణవాతాభ్రేష్వన్యత్రాత్యయికాద్గదాత్,

16 సంవత్సరములవయస్సుకు లోబడినవారు, 70 సంవత్సరములవయస్సుక

పైబడినవారు, రక్తస్రావము చేయించుకొనినవారు, అస్నిగ్ధులు, స్నేహకర్మ చేయించుకొనిన వారు, అధికముగ స్వేదకర్మ చేయించుకొనినవారు, గర్భిణులు, ప్రసవించిన స్త్రీ, వాత రోగము, అజీర్ణము, పిత్తరక్తము, శ్వాసము, కాసము, అతిసారము, ఉదరరోగము, ఛర్ది, పాండువు, సర్వాంగములయందుశోప ఈరోగములు గలవారు అట్టివారికి సిరా వ్యధనము చేయంజనదు. మఱియును స్నేహపానము చేసినప్పుడును, వమనాది పంచ కర్మలు చేయబడి యుండునప్పుడును, సిరావేధ చేయంజనదు. సిరను బంధించకుండ వేధింపంజనదు. అడ్డముగ వేధింపంజనదు. పొడవుగ లేపకుండుసిరను వేధింపంజనదు. అతిశీతలముగగాని లేక అత్యుష్ణముగగాని నుండుకాలమునందును, అధికమైనవానములో గూడి యుండు కాలమునందును, ఆకాశము మేఘములచే నావరింపబడియుండినప్పుడును సిరావేధనము చేయంజనదు. మఱియు నతికష్టమైనరోగిములు, విషాదిక మొదలగు రోగములయందుతప్ప తక్కినరోగములలో పై జెప్పిన కాలములయందు సిరావేధనము చేయంజనదు. అతికష్టమైన రోగము గలిగియుండునప్పుడు శీతోష్ణవర్షములకు తగినట్లు ప్రతీకారము చేసి సిరావేధం జేయవలయును.

### శిరోనేత్రరోగములయందు వేధింపదగిన సిర

శిరోనేత్రవికారేషు లలాట్యాం మోక్షయేత్సిరామ్ ।
అపాంగ్యాముపనాస్యాం వా

శిరము, నేత్రములు వీనిలో జనించురోగములయందు లలాటమునం దుండు సిరను వేధించవలయును. లేక అపాంగమునం దుండు (అనగా కంటి కొనయం దుండు) సిరను గాని, నాసికాసమీపమునం దుండు సిరనుగాని వేధించవలయును.

### కర్ణరోగమునందు సిరావేధనము

కర్ణరోగేషు కర్ణజామ్,

కర్ణరోగములయందు కర్ణసమీపమునం దుండు సిరను వేధించవలయును.

### నాసారోగమునందు సిరావేధనము

నాసారోగేషు నాసాగ్రే స్థితాం

నాసికారోగములయందు నాసికాగ్రమునం దుండు సిరను వేధించవలయును.

### పీనసరోగమునందు సిరావేధనము

నాసాలలాటయోః. ౧౦

పీనసే

పీనసరోగమునందు నాసిక, లలాటము వీనియం దుండు సిరను వేధించవలయును.

### ముఖరోగమునందు సిరావేధనము

ముఖరోగేషు జిహ్వోష్ఠహనుతాలుగాః,

ముఖరోగములలో నాలుక, పెదవి, తాలువులు,నోటిలోపలిదౌడ వీనియందుండు సిరలను వేదించవలయును.

### జత్రూర్ధ్వరోగములయందు సిరావేధనము

జత్రూర్ధ్వం గ్రంథిషు గ్రీవాకర్ణశంఖశిరః శ్రితాః. ౧౧

మెడకొంకులకు పైభాగమునందు జనించుగ్రంథులలో మెడ, చెవులు, కణత, శిరస్సు వీని నాశ్రయించి యుండు సిరలను వేధించవలయును.

### ఉన్మాదరోగమునందు సిరావేధనము

ఉరోఽపాంగలలాటస్థా ఉన్మాదే

ఉన్మాదమునందు ఱొమ్ము, కంటికొన, లలాటము, వీని నాశ్రయించి యుండు సిరలను వేధించవలయును.

### అపస్మారరోగమునందు సిరావేధనము

అపస్మృతౌ పునః,

హనుసంధౌ సమస్తే వా సిరాం భ్రూమధ్యగామినీమ్ ౧౨

అపస్మారములో తాలువులసంధులయం దుండు సిరనుగాని, లేక తాలువులయం దంతట వ్యాపించి యుండు సిరనుగాని లేక కనుబొమలకు మధ్యమునం దూర్ధ్వముఖముగ వ్యాపించి యుండుసిరనుగాని వేధించవలయును.

### విద్రధి పార్శ్వశూల వీనియందు సిరావేధనము

విద్రధౌ పార్శ్వశూలే చ పార్శ్వకక్షాస్తనాంతరే,

విద్రధి, పార్శ్వశూల వీనియందు పార్శ్వమునం దుండుసిరను, చంకలకును స్తనములకును నడుమ నుండు సిరను వేధించవలయును.

### తృతీయకజ్వరమునందు సిరావేధనము

తృతీయకేఽంసయోర్మధ్యే

తృతీయకజ్వరమునందు భుజశిరస్సులసంధియం దుండుసిరను వేధించవలయును.

### చాతుర్థికజ్వరమునందు సిరావేధనము

స్కంధస్యాధశ్చతుర్థకే. ౧౩

చాతుర్థికజ్వరములో భుజశిరస్సులకు క్రిందిభాగమునం దుండు సిరను వేధించవలయును.

### గ్రహణీరోగమునందు సిరావేధనము

ప్రవాహికాయాం శూలిన్యాం శ్రోణితో ద్వ్యఙ్గులేస్థితామ్,

శూలతో గూడియుండు ప్రవాహికారోగమునందు కటిప్రదేశమునకుపైన రెండంగుళములదూరమునం దుండుసిరను వేధించవలయును.

### శుక్రరోగమునందు సిరావేధనము

శుక్రమేఢ్రామయే మేఢ్రే

శుక్రరోగము, మేఢ్రరోగము వీనియందు మేఢ్రమునం దుండు సిరను వేధించవలయును.

### గళగండమునందు సిరావేధనము

ఊరుగాం గళగండయోః. ౧౪

రెండు విధములైన గళగండరోగములయందు తొడయం దుండుసిరను వేధించవలయును.

### గృధ్రసీరోగమునందు సిరావేధనము

గృధ్రస్యాం జానునోఽధస్తా దూర్ధ్వం వా చతురఙ్గులే,

గృధ్రసీరోగమునందు మోకాలికిక్రిందిభాగమునందుగాని లేక పైభాగమునందుగాని నాలుగంగుళముల దూరమున నుండుసిరను వేధించవలయును.

### అపచీరోగమునందు సిరావేధనము

ఇంద్రవస్తేరధోఽపచ్యాం ద్వ్యఙ్గులే

అపచీరోగమునందు ఇంద్రవస్తిమర్మమునకు అధోభాగములో రెండంగుళములయం దుండు సిరను వేధించవలయును.

### సక్థిరోగమునందు సిరా వేధనము.

చతురఙ్గులే, ౧౫

ఊర్ధ్వం గుల్ఫస్య సక్థ్యర్తౌ

సక్థిపీడయందు చీలమండయొక్క ఊర్ధ్వభాగములో నాల్గంగుళములయందుండు సిరను వేధించవలయును.

### క్రోష్టుక శీర్షమునందు సిరా వేధనము

తథా క్రోష్టుకశీర్షకే,

క్రోష్టుకశీర్షక మను ఊర్ధ్వాంగవాతరోగమునందు పై జెప్పినప్రకారము చీలమండయొక్క ఊర్ధ్వభాగములో నాల్గంగుళములయం దుండు సిరను వేధించవలయును.

పాదదాహాదిరోగములయందు సిరావేధనము

పాదదాహే ఖుడే హర్షే విపాద్యాం వాతకంటకే. ౧౬
చిప్పే చ ద్వ్యంగులే విద్ధ్యే దుపరి క్షిప్రమర్మణః,

పాదదాహము, ఖుడము, పాదహర్షము, విపాది, వాతకంటకము, చిప్పము, ఈ రోగములయందు క్షిప్రమర్మమునకు పైభాగమున రెండంగుళములయందు సిరను వేధించవలయును

విశ్వాచీరోగమునందు సిరావేధనము

గృధ్రస్యామివ విశ్వాచ్యాం

విశ్వాచీరోగములో గృధ్రసీరోగమునందు చెప్పిన సిరనే వేధించవలయును.

వేధనార్హమైనసిర లగుపడనప్పుడు సిరావేధనక్రమము

యథోక్తానామదర్శనే ౧౭
మర్మహీనే యథాసన్నే దేశేఽన్యాం వ్యధయేత్సిరామ్,

ఆయారోగములకు నిర్ణయించి చెప్పబడిన సిరలు కనబడకుండునపుడు మర్మప్రదేశమును విడలి ఆసిరకు సమీపప్రదేశమునందుండు వేరేసిరను వేధించవలయును.

సిరావేధనక్రమము

అథ స్నిగ్ధతనుః సజ్జసర్వోపకరణో బలీ. ౧౮
కృతస్వస్త్యయనః స్నిగ్ధరసాన్నప్రతిభోజితః,
అగ్నితాపాతపస్విన్నో జానూచ్చాసనసంస్థితః. ౧౯
మృదుపట్టాత్తకేశాంతో జానుస్థాపితకూర్పరః,
ముష్టిభ్యాం వస్త్రగర్భాభ్యాం మన్యే గాఢం నిపీడయేత్. ౨౦
దంతప్రపీడనో * త్కాసగండాధ్మానాని చాచరేత్,

స్నిగ్ధమయినశరీరము గలవాడు, వస్త్రము, స్నేహము, గైరికము మొదలగు ఉపకరణములను సిద్ధము చేసికొనినవాడు, పుష్టివంతుడు నగుపురుషుడు బలిని, మంగళహోమమును చేసికొని స్నిగ్ధమైన రసముతోగూడియుండు అన్నమును భుజించి అగ్నితాపము, ఎండ వీనిచే స్విన్నుడై మోకాలంత పొడవు గల ఆసనమునందు కూర్చుండినవాడై సూక్ష్మమయిన వస్త్రపట్టముచే కట్టబడినకేశములు, మోకాలుపై నుంచబడిన మోచేతులు గలవాడై వస్త్రమును లోన నిముడ్చుకొని యుండు పిడికిళ్లచే పెడతలపెద్దనరములను దృఢముగా పీడించవలయును. మఱియు నట్టిపురుషుడు దంతప్రపీడనము (అనగా పండ్లు కొరుకుట), ఉత్కాసము, అధ్మానము, వీనిని కూడ చేయవలయును.

---

* చ్ఛ్వాప ఇతి పా.

పృష్ఠతో యంత్రయేచ్చైనం వస్త్రమావేష్టయన్నరః. ౨౧
కంధరాయాం పరిక్షిప్య న్యస్యాంత ర్వామతర్జనీమ్,
ఏషోఽంతర్ముఖవర్జానాం సిరాణాం యంత్రణే విధిః. ౨౨

పైజెప్పినప్రకారము కూర్చుండి యుండురోగికి పృష్ఠదేశమునందును (అనగా వీపునందును) గొంతునందును వస్త్రమును చుట్టి దానినడమ ఎడమ జుట్టనవ్రేలును దృఢముగ నునిచి సిరలను కట్టవలయును. ఇది ముఖములో నుండుసిరలుతప్ప తక్కిన సిరలను కట్టునట్టివిధి యని తెలియవలయును.

తథా మధ్యమయాంగుళ్యా వైద్యోఽంగుష్ఠవిముక్తయా,
తాడయేత్

అటుల కట్టినపిదప బొట్టనవ్రేలితో చేరకుండు ఎడమచేతియొక్క మధ్యమాంగుళిచే నాసిరను వైద్యుడు కొట్టవలయును.

ఉత్థితాం జ్ఞాత్వా స్పర్శాంగుష్ఠప్రపీడనైః. ౨౩
కుఠార్యా లక్షయేన్మధ్యే వామహస్తగృహీతయా,
ఫలోద్దేశే సునిష్కంపం సిరాం తద్వచ్చ మోక్షయేత్. ౨౪

పిదప స్పర్శముచేగాని, లేక బొట్టనవ్రేలివలన నదుముటచేగాని ఉత్థితమైన (అనగా పైకి లేచిన) సిరలను తెలిసికొని కురారిక యనునాయుధమును వాదరకు సమీపమున కుడి చేతిచే గట్టిగపట్టుకొని దానిచే సిరామధ్యమున గుర్తుపెట్టి యాస్థలముననే రక్తమోక్షము చేయునది.

తాడయన్ పీడయేచ్చైనాం విధేర్వ్రీహిముఖేన తు,

వ్రీహిముఖ మనునాయుధముచే మరల నాసిర నొకమారు తాడనము చేసిన బొట్టనవ్రేలిచే బాగుగ నదుముకొని వ్రీహిముఖ మను నాయుధముచేతనే ఆసిరను వేధించవలయును.

నాసికాసమీప సిరావేధనక్రమము

అంగుష్ఠేనోన్నమయ్యాగ్రే నాసికాముపనాసికామ్ ౨౫

నాసికాగ్రభాగమును బొట్టనవ్రేలిచే పొడవుగ నెత్తికట్టుకొని నాసికాసమీపమునం దుండుసిరను వేధించవలయును.

జిహ్వాధోభాగ సిరావేధనక్రమము

అభ్యున్నతవిదష్టాగ్రజిహ్వాస్యాధస్తదాశ్రయామ్,

పైతాలు ప్రదేశమున కభిముఖముగా నాలుకం దీసికొనివచ్చి యానాలుక యొక్క కొనను దంతములచే బాగుగా కరుచుకొనియుండునపుడు నాలుకకు అధోభాగమునం దుండు సిరను వేధించవలయును.

మెడయందు సిరావేధనక్రమము

యంత్రయేత్ స్తనయోరూర్ధ్వం గ్రీవాశ్రితసిరావ్యధే ౨౬

మెడ నాశ్రయించియుండు సిరలను వేధించునపుడు స్తనములయొక్క పై ప్రదేశమునందు వస్త్రముచే చుట్టవలయును.

పాషాణగర్భహస్తస్య జానుస్థే ప్రసృతే భుజే,
కుక్షేః రారభ్య మృదితే విధ్యేద్బద్ధోర్ధ్వపట్టకే. ౨౭

రాయిని హస్తమునం దుంచుకొని యుండు పురుషునియొక్క హస్తములు మోకాళ్ళపై జాచబడి యుండునపుడు కుక్షి మొదలుకొని మెడ వరకు మర్దనము చేసి వేధించవలసిన స్థలమునకు పైన వస్త్రమును కట్టి మెడసిరను వేధించవలయును.

హస్తసిరావేధనక్రమము

విధ్యేద్ధస్తసిరాం బాహావనాకుంచితకూర్పరే,
బద్ధ్వా సుఖోపవిష్టస్య ముష్టిమంగుష్ఠగర్భిణీమ్. ౨౮
ఊర్ధ్వం వేధ్యప్రదేశాచ్చ పట్టికాం చతురంగులే,

సుఖముగా కూర్చుండి యుండుపురుషుడు మోచేతులను ముడిచికొనక చాచబడిన చేతులు కలవాడై యుండునపుడు బొట్టనవ్రేలు అఱచేతిలో గూఢముగ నుండునటుల ముష్టిని పట్టించి వేధించవలసిన స్థానమునకుపైన నాల్గంగుళములయందు వస్త్రపట్టమును కట్టి హస్తసిరను వేధించవలయును.

పార్శ్వసిరావేధనక్రమము

విధ్యేదాలంబమానస్య బాహుభ్యాం పార్శ్వయోస్సిరామ్ ౨౯

హస్తములచే దేని నైనను పట్టుకొని వ్రేలాడుచుండునపుడు పార్శ్వములయందలి సిరను వేధించవలయును.

మేఢ్రసిరావేధనక్రమము

ప్రహృష్టే మేహనే

మేఢ్రము స్తబ్ధముగ నుండునపుడు మేఢ్రమునం దుండు సిరను వేధించవలయును.

జంఘాసిరావేధనక్రమము

జంఘాసిరాం జానున్యకుంచితే,

మోకాళ్లు వంచబడియుండునపుడు పిక్కయందుండుసిరను వేధించవలయును.

పాదసిరావేధనక్రమము

పాదే తు సుస్థితేఽధస్తాజ్జానుసంధేర్నిపీడితే. 30
గాఢం కరాభ్యామాగుల్ఫం చరణే తస్య చోపరి,
ద్వితీయే కుంచితే కించిదారూఢే హస్తవత్తతః 3౧
బుద్ధ్వా విధ్యేత్సిరాం

పాదమును భూమియందు సుఖముగా నునుచుకొని యుండునపుడు మోకాలు సంధికి క్రింద చీలమండవరకు దృఢముగా హస్తములచే మర్దించి క్రింద నునిచి యుండు కాలిపై రెండవ కాలును కొంచెము వంచి యునుచుకొని యుండగా వేధించవలసినస్థానమునకుపైన నాల్గంగుళములయందు వస్త్రపట్టమును కట్టి పాదసిరను వేధించవలయును.

ఇత్థ మను క్తేష్వపి కల్పయేత్,
తేషు తేషు ప్రదేశేషు తత్తద్యంత్రముపాయవిత్. 3౨

ఉపాయము నెఱిగినవైద్యుడు చెప్పబడని యితరమైన ఆయా అవయవముల యందును పైజెప్పిన రీతిగా స్వబుద్ధిచే యుక్తప్రకారము యంత్రవేధనక్రమమును కల్పించుకొనవలయును.

వ్రీహిముఖకుఠారికా శస్త్రప్రయోగము

మాంసలే నిక్షిపేద్దేశే వ్రీహ్యాస్యం వ్రీహిమాత్రకమ్,
యవార్ధమస్థ్నాముపరి సిరాం విధ్యన్ కుఠారికామ్ 33

అధికమాంసము గల శరీరావయవములయందు వ్రీహిముఖ మను శస్త్రమును వడ్లగింజంత ప్రమాణము ప్రయోగింపవలయును. మఱియును అస్థులపై నుండుసిరలను వేధించునపుడు కుఠారిక యనుశస్త్రమును అర్ధయవప్రమాణము ప్రయోగింపవలయును.

సమ్యగ్వేధలక్షణము

సమ్యగ్విద్ధే స్రవేద్ధారాం యంత్రే ముక్తేతు న స్రవేత్,

బాగుగ వేధించబడినసిరయందు రక్తముధారగ స్రవించును. దానియందలి కట్టును విప్పివేయగానే రక్తము స్రవింపనేరదు.

దుర్విద్ధ అతివిద్ధ లక్షణము

అల్పకాలం వహత్యల్పం దుర్విద్ధాతైలచూర్ణనైః 3౪
సశబ్దమతివిద్ధాతు స్రవేద్దుఃఖేన ధార్యతే,

బాగుగ వేధించబడని సిర స్వల్పకాలమువరకు స్వల్పముగ రక్తమును స్రవింప

జేయును. అధికముగ వేధించబడినసిర శబ్దముతో రక్తము నధికముగ స్రవింపజేయును. ఆరక్తము తైలము, చూర్ణము వీనిచే బహుకష్టముమీద నిలుచును.

రక్తము స్రవింపకుండుటకు హేతువు

భీమూర్ఛాయంత్రశైథిల్యకుంఠశస్త్రాతితృప్తయః. 34
క్షౌమత్వవేగితాస్వేదా రక్తస్యాస్రుతిహేతవః,

భయము, మోహము, యంత్రశైథిల్యము (అనగా దృఢముగా యంత్రమును ప్రయోగింపకుండుట), పదునులేని శస్త్రము, అధికతృప్తి, దౌర్బల్యము, మలమూత్రాది వేగము గలిగియుండుట, స్వేదము లేకుండుట, ఇవి రక్తస్రావము గలుగకుండుటకు హేతువు లని తెలియవలయును. మఱియును పైజెప్పినభయాదులు రక్తము స్రవించకుండుటకు కారణముగ నుండుటచే భయాదులు కలిగి యుండునపుడు రక్తస్రావము చేయంజనదు అని తాత్పర్యము.

రక్తము బాగుగ స్రవింపకుండునపుడు వేల్లాదిలేపనము

అసమ్యగస్రే స్రవతి వేల్లవ్యోషనిశానతైః. 35
సాగారధూమలవణతైలైర్దిహ్యాత్సిరాముఖమ్,

రక్తము బాగుగా స్రవింపకుండినయెడల వాయువిడంగములు, త్రికటుకములు, పసుపు, గ్రంథితగరము, కరిదూపము, లవణము, తైలము వీనిచే సిరయొక్క ముఖమునందు లేపనము చేయవలయును.

రక్తము బాగుగ స్రవించునపుడు తైలాదిలేపనము

సమ్యక్ప్రవృత్తే కోష్ణేన తైలేన లవణేన చ 36

రక్తము బాగుగా స్రవించునపుడు కొంచెము ఉష్ణముగనుండు తైలము, లవణము వీనిచే సిరాముఖమునందు లేపనము చేయవలయును.

దుష్టరక్తస్రావక్రమము

అగ్రే స్రవతి దుష్టాస్రం కుసుంభాదివ పీతికా,

ఎరుపు పసుపు రంగులు కలిసియున్న కుసుంభమునుండి తొలుత పచ్చని రసము స్రవించునట్లు దుష్టరక్తంబును శుద్ధరక్తంబును కలిసి యుండునపుడు సిరావ్యధనము చేసినయెడ తొలుత చెడ్డరక్తము స్రవించును.

విశేష రక్తస్రావ నిషేధము

సమ్యక్స్రుత్వా స్వయం తిష్ఠేచ్ఛుద్ధం తదితి నాహరేత్. 37

దుష్టరక్తము బాగుగా స్రవించిన పిదప శుద్ధరక్తము స్వయత్నము లేకయే నిలిచి

పోవు నట్టిదెలంపుతో రక్తమును విశేషముగా స్రవింపజేయంజనదు. ఏల ననగా — రక్తము ప్రాణాధారమునకు హేతువుగ నుండును.

మూర్ఛ గలిగియుండునపుడు రక్తస్రావనిషేధము

యన్త్రం విముచ్య మూర్ఛాయాం వీజితే వ్యజనైః పునః,
స్రావయేన్మూర్ఛతి పునస్త్వపరేద్యుస్త్ర్యహేఽపి వా ౩౯

సిరావేధ జేయునపుడు మూర్ఛ గలిగినయెడల యంత్రమును తీసివేసి విసనకఱ్ఱల వలన విసురుటచే రోగిని ఓదార్చి మరల రక్తమును స్రవింపజేయవలయును. మరల నారోగి మూర్ఛ జెందినయెడల అశుద్ధరక్తమునుగూడ ఆ దినమునందు స్రవింపజేయక మరుదినమునందుగాని లేక మూడవ దినమునందుగాని స్రవింపజేయవలయును.

వాతదుష్టరక్తలక్షణము

వాతాచ్ఛ్యావారుణం రూక్షం వేగస్రావ్యచ్ఛఫేనిలమ్,

వాతమువలన శ్యామవర్ణము, ఎఱుపువర్ణము, రూక్షత, తీవ్రమైనస్రావము నైర్మల్యము, నుఱుగు వీనితోగూడియుండురక్తము స్రవించును.

పిత్తదుష్టరక్తలక్షణము

పిత్తాత్పీతాసితం విస్రమస్త్యంద్యోష్ణ్యాత్సచంద్రకమ్ ౪౦

పిత్తమువలన పీతవర్ణము, నల్లనివర్ణము, దుర్గంధము, చంద్రకము వీనితోగూడి నదిగ, దట్టముగ నుండు రక్తము స్రవించును.

కఫదుష్టరక్తలక్షణము

కఫాత్ స్నిగ్ధమసృక్పాండు తంతుమత్పిచ్ఛిలం ఘనమ్,

కఫమువలన స్నిగ్ధము, తెలుపువర్ణము, తంతువులు వీనితోగూడినదిగ, గట్టిగ, పిచ్ఛిలముగ నుండురక్తము స్రవించును.

సంసర్గదుష్టరక్తలక్షణము

సంసృష్టలింగం సంసర్గాత్

దోషసంసర్గమువలన వాతపిత్త కఫములకు వేరు వేర జెప్పిన లక్షణముల సంసర్గము కల్గినరక్తము స్రవించును.

సన్నిపాత దుష్టరక్త లక్షణము

త్రిదోషం మలినావిలమ్ ౪౧

త్రిదోషముచే మలినముగ, కలకబారినదిగ నుండురక్తము స్రవించును.

అశుద్ధరక్తస్రావప్రమాణము

అశుద్ధం బలినోఽప్యస్రం న ప్రస్థాత్స్రావయేత్పరమ్,

బలిష్ఠుడుగ నుండుపురుషునికిన్నూడ ప్రస్థమున కధికముగా అశుద్ధరక్తమును స్రవించునటుల జేయంజనదు.

## అధికరక్తస్రావజనితోపద్రవములు

అతిస్రుతౌ హి మృత్యుస్స్యాద్దారుణా వా చలామయాః. ౪౨

అధికముగా రక్తస్రావము చేయించినయెడల మరణముగాని లేక దారుణమైన వాతరోగములుగాని కలుగును.

## అధికరక్తస్రావచికిత్స

తత్రాభ్యంగరసక్షీరరక్తపానాని భేషజమ్,

అధిక రక్తస్రావమునందు అభ్యంగముచేయుట, మాంసరస, క్షీర, రక్తముల పానముచేయుట ఇవి యౌషధంబులు.

## రక్తస్రావానంతరకర్తవ్యము

స్రుతే రక్తే శనైర్యంత్రమపనీయ హిమాంబునా. ౪౩
ప్రక్షాళ్య తైలప్లోతాక్తం బంధనీయం సిరాముఖమ్,

బాగుగా రక్తము స్రవించినపిదప మెల్ల మెల్లగా యంత్రమును విడిపించి సిరాముఖమును శీతోదకముచే గడిగి దానిపై తైలమును పూసి బంధించవలయును.

## పునః రక్తస్రావము

అశుద్ధం స్రావయేద్భూయః సాయమహ్న్యపరేఽపి వా. ౪౪

వాతాదులచే దుష్టమైనరక్తము నిశ్శేషముగ వెడలక మిగిలి యున్నయెడ నాదినముయొక్క సాయంకాలమునందు గాని, లేక మరుదినమునందు గాని మరల రక్తమును స్రవింపజేయవలయును.

స్నేహోపస్కృత దేహస్య పక్షాద్వా భృశదూషితమ్,

పైజెప్పినరీతిగ దుష్టరక్తమును స్రవింపజేసినను ఇంకను మిక్కిలి రక్తము దుష్టముగనే యున్నచో శరీరమునెల్ల స్నేహకర్మచే స్నిగ్ధముగ జేసి పదునైదు దినములకు పిమ్మట మరల పైజెప్పినరీతిగ సిరావ్యధనముచే రక్తమోచనము జేయించునది. పైజెప్పిన ప్రకారము అశుద్ధమైన రక్తమును రోగాద్యనుగుణముగా సాయంకాలమునందుగాని, లేక మరుదినమునందుగాని, లేక ఒకపక్షమునకు పైనగాని ప్రస్థప్రమాణమే స్రవింపజేయవలయును. రక్తమును ప్రస్థమున కధికముగా స్రవింపజేయంజనదు.

"వమనే చ విరేకే చ రక్తాతీసారయోరపి,
సార్ధత్రయోదశపలం ప్రస్థమాహుర్మనీషిణః"

వమనము, విరేకము, రక్తస్రావము, అతిసారము వీనియందు (13½పలము) 1 ప్రస్థ మని పండితులు వచించెద రని తంత్రాంతరమునందు ప్రస్థపరిమాణము చెప్పబడి యున్నది.

సావశేష దుష్టరక్తస్రావము

కించిద్ధి శేషే దుష్టాస్రే నైవ రోగోఽతివర్తతే. ౪౫
సశేషమప్యతో ధార్యం న చాతిస్రుతిమాచరేత్,

దుష్టరక్తము కొంచెము శేషించియుండినను దానిచే రోగము అధికము కానేరదు. కాబట్టి దుష్టరక్తము కొంచెము శేషించి యుండినను దానిని సశేషముగ ధరించవలయునేకాని అధికముగా స్రావము చేయింపం జనదు. ఏలయనగా —రక్తము ప్రాణాధారముగ నుండును.

"సశేషం దుష్టరుధిరమపి కుర్యాద్విచక్షణః,
న చాతిప్రసృతిం కుర్యాత్ శేషం సంశమనైర్జయేత్."

సమర్థుడగు వైద్యుడు దుష్టరక్తమునుకూడా కొంచెము శేషించి యుండునటుల స్రవింపజేయవలయునేకాని అధికముగా స్రవింపజేయంటనదు అయితే శేషించియుండు దుష్టరక్తమును సంశమనౌషధములచే చికిత్సచేసి శాంతి నొందింపనగును. అని సుశ్రుతమునందు చెప్పబడి యున్నది.

అపశిష్టదుష్టరక్తస్రావక్రమము

హరేచ్ఛృంగాదిభిశ్శేషం ప్రసాదమథవానయేత్. ౪౬
శీతోపచారపిత్తాస్రక్రియాశుద్ధివిశోషణైః,
దుష్టం రక్తమనుద్రిక్తమేవమేవ ప్రసాదయేత్. ౪౭

స్రవించి శేషించియుండు దుష్టరక్తమును శృంగము, సొరకాయబుఱ్ఱ, ఘటికా మొదలగువానిచే వెలిపరచవలయును. లేక నాదుష్టరక్తమును శీతోపచారము, పిత్తరక్త చికిత్స, వమనవిరేచనాదిరూప మయినశుద్ధి, లంఘనరూపమయినవిశోషణము, వీనిచే ఉద్రేకము బెందకుండునటులంజేసి పిదప నాదుష్టరక్తమునకు ప్రసన్నత్వమును కలుగజేయవలయును. స్రవించి శేషించియుండు దుష్టరక్తమునకు పూర్వోక్త శీతోపచారములచే ప్రసన్నత్వమును గలుగజేయవలయునేకాని సిరావ్యధాదులచే నాదుష్టరక్తమును వెలిపరుపం జనదు. ఏల యనగా —సిరావ్యధాదులచే ఉద్రేకమును బెందకుండునట్టి రక్తమును వెలిపరచుట అపాయకరము

అధికరక్తస్రావమునందు స్తంభనక్రియ

రక్తే త్వతిష్ఠతి క్షిప్రం స్తంభనీమాచరేత్క్రియామ్,

రక్తము నిలువక స్రవించుచుండగా నతిశీఘ్రముగా నిక జెప్పబడు స్తంభన క్రియను జేయవలయును.

## స్తంభనక్రియావిశేషము

రోధ్రప్రియంగుపత్తంగమాషయష్ట్యాహ్వగైరికైః. ౪౮
మృత్కపాలాంజనక్షౌమమషీక్షీరిత్వగంకురైః,
విచూర్ణయేద్వ్రణముఖం పద్మకాదిహిమం పిబేత్. ౪౯

లొద్దుగు, ప్రేంకణము, రక్తచందనము, మినుములు, అతిమధురము కావిరాయి, చిల్లపెంకు, అంజనము, పట్టువస్త్రముయొక్క మషి, క్షీరవృక్షములయొక్క పట్టలు, చిగుళ్లు వీనిచే వ్రణముఖమును మూయవలయును. మఱియును పద్మకాదిగణములచే సిద్ధముచేయబడిన శీతలమైనకషాయమును పానము చేయవలయును.

తామేవ వా సిరాం విద్ధ్యేద్వ్యధాత్తస్మాదనంతరమ్,

పిదప తొలుత వేధించిన సిరయందు వేధించియుండు ప్రదేశమునకు సమీపమున మరల వేధించవలెయును.

సిరాముఖం చ త్వరితం దహేత్తప్తశలాకయా. ౫౦

లేక నా సిరాద్వారమును శీఘ్రములో అగ్నితప్తమయిన శలాకచే దహింపజేయవలయును.

## రక్తస్రావానంతర హితాహారాది సేవనక్రమము

ఉన్మార్గగా యంత్రనిపీడనేన స్వస్థానమాయాంతి పునర్నయావత్,
దోషాః ప్రదుష్టారుధిరం ప్రపన్నాస్తావద్ధితాహారవిహారభాక్స్యాత్.

యంత్రపీడనముచే స్వమార్గమును పదలి మార్గాంతరమును జెందియుండు నవియును దుష్టంబై దుష్టమయినరక్తమును జెందియుండు నవియును నగువాతాదిదోషములు మరల స్వస్థానమును జెందువరకు హితాహారవిహారములం జేయుచుండవలయును.

నాత్యుష్ణశీతం లఘు దీపనీయం రక్తేఽపనీతే హితమన్నపానమ్,
తదా శరీరం హ్యనవస్థితాస్రమగ్నిర్విశేషాదితి రక్షణీయః. ౫౧

కాబట్టి రక్తస్రావము చేయించి యుండగా అత్యుష్ణము, అతిశీతలము కానిదియును, స్వభావముచేతను మాత్రచేతను లఘువుగ, సంస్కారాదులచే అగ్నిదీపనకారిగనుండునదియు నగు అన్నపానములు హితకరములు. ఏల యనగా.—ఆ కాలమునందు

శరీరము అతిచంచలమయిన రక్తముతో గూడి యుండును. రక్తము శరీరమున కాధారము. ఆరక్తమునకు పిత్తము ఆధారము; పిత్తమునకు అగ్ని ఆధారము; కాబట్టి అతి యత్నముచే అగ్నిని రక్షింపవలయును. అత్యుష్ణముగ నుండు అన్నపానము రక్తముచు జెరచును. అతిశీతలముగ నుండు అన్నపానము అగ్నిమాంద్యమును గలుగజేయును.

ప్రసన్నవర్ణేంద్రియమింద్రియార్థా
నిచ్ఛంతమవ్యాహతపక్తృవేగమ్,
సుఖాన్వితం పుష్టిబలోపపన్నం
విశుద్ధరక్తం పురుషం వదంతి. ౫౩

ప్రసన్నమయినవర్ణము, ఇంద్రియములు గలవాడు, స్వభావముగనే శబ్దాదివిషయముల నిచ్ఛయించువాడు, చెరచబడని జారరాగ్ని వేగముగలవాడు, ఆరోగ్యముతో గూడియుండువాడు, పుష్టి బలము గలవాడు నగుపురుషుడు శుద్ధమయిన రక్తము గలవాడని సద్వైద్యులు వచించెదరు. (అనగా శుద్ధమైన రక్తముగల శరీరమునకు పైజెప్పిన ప్రసన్నవర్ణేంద్రియత్వాదులు లక్షణ మని భావము.) శుద్ధమయిన రక్తలక్షణము "మధురంలవణ మిత్యాది" శ్లోకముచే నీ యధ్యాయప్రారంభమునందే చెప్పబడి యున్నది.

సప్తవింశాధ్యాయము, ముగిసెను.

# అష్టవింశాధ్యాయము.

అవ సిరావ్యధవిధ్యధ్యాయమునందు సకల శరీరవ్యాపియగు శల్యరూపమైన రక్తమును సిరావేధనోపాయముచేత వెలిపరచునట్టివిధి చెప్పబడినది. ఇక శల్యాహరణ విధ్యధ్యాయమునందు శరీరముయొక్క ఏకదేశమునం దుండు లోహాదిరూపమైన శల్యలక్షణము, వానిని వెలిపరచునట్టి ఉపాయము మొదలగునవి చెప్పబడును.

శల్యాహరణవిధ్యధ్యాయప్రారంభము.

సూ. అథాతశ్శల్యాహరణవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

సిరావ్యధవిధ్యధ్యాయానంతరము శల్యములను వెలిపరచునట్టిక్రమమును తెలియపరచెడి శల్యాహరణవిధ్యధ్యాయమును వివరించెదను.

శల్యములకు పంచవిధగతులు

వక్రర్జుతిర్యగూర్ధ్వాధశ్శల్యానాం పంచధా గతిః,

(శల్య మన—'శలగతౌ' అను గత్యర్థక మైన శలధాతువువలన 'శలతి గచ్ఛతీతి శల్యం' అను వ్యుత్పత్తిచేత ఒకస్థానమునుండి వేరొకచోటికి పోవునట్టి స్వభావముకల్గినది శల్య మని యర్థము. అయ్యది ఇనుపముక్కముస్నగు భేదముచే పలువిధముల నుండును.) అట్టి శల్యముయొక్కగతి పలుదెరంగుల నున్నను వక్రగతి, ఋజుగతి, తిర్యగ్గతి, అధోముఖగతి అని ఐదు విధములుగ నుండును. శల్యములు ఒకానొకపుడు వక్రముగ ప్రవేశించి అడ్డముగ గాని లేక ఊర్ధ్వముగ గాని లేక అధోముఖముగ గాని వ్యాపించును. ఒకానొకపుడు ఋజువుగ ప్రవేశించి అడ్డముగ గాని లేక ఊర్ధ్వముగ గాని లేక అధోముఖముగ గాని వ్యాపించును. ఇటుల శల్యములకు ఐదు విధము లైనగతులు గలిగియుండు నని తెలియవలయును.

అంతశ్శల్యసామాన్యలక్షణము

శ్యావం శోఫం రుజావంతం స్రవంతం శోణితం ముహుః, ౧
అభ్యుద్గతం బుద్బుదవత్పిటికోపచితం వ్రణమ్,
మృదుమాంసం విజానీయాదంతశ్శల్యం సమాసతః. ౨

శ్యామవర్ణముగను, శోఫ గలదిగను, బాధతోగూడినదిగను, పలుమారు రక్తమును స్రవింపజేయునదిగను, ఒకింత ఉన్నతముగను, బుద్బుదతుల్యముగను, పిటికలచే వ్యాప్త

ప్తముగను, మృదువైన మాంసను గలదిగ నుండు ప్రణము అంతశ్శల్యము గలది యని తెలిసికొనవలయును. ఇదియ అంతశ్శల్య సామాన్యలక్షణము.

## చర్మగతశల్యలక్షణము

విశేషాత్త్వగ్గతే శల్యే వివర్ణః కఠినాయతః,
శోఫో భవతి

త్వక్కు నాశ్రయించియుండు శల్యమునందు శోఫ, వికారవర్ణము, కాఠిన్యము, దీర్ఘత్వము ఈలక్షణములు విశేషముగా గలిగి యుండును. మఱియును పూర్వశ్లోకమునందు జెప్పియుండు శ్యామవర్ణము మొదలగు సామాన్యలక్షణము లన్నియు సర్వశల్యములయందును గలిగియుండు నని తెలియదగును.

## మాంసగతశల్యలక్షణము

మాంసస్థే చోషశ్శోఫో వివర్ధతే. 3
పీడనా క్షమతా పాకశ్శల్యమార్గో న రోహతి,

మాంసము నాశ్రయించి యుండు శల్యమునందు చోష (అనగా సర్వాంగము నందు వ్యాపించి యుండునదియును, అతిగాఢము నగు మనస్సునకు అతిక్లేశము గలుగజేయునదియునైన తాపము) గలుగును. శోఫ వృద్ధి జెందును. బాధను సహించకుండుట, పాకము ఇవి గలుగును. శల్యము చొచ్చినమార్గము మానదు.

## పేశీగతశల్యలక్షణము

పేశ్యంతరగతే మాంసప్రాప్తవచ్ఛ్వయథుం వినా. ౪

శల్యము పేశియొక్క మధ్యమును జెంది యుండగా పైజెప్పిన మాంసగత శల్యోపద్రవములే కలుగును. అయితే వాపు మాత్రము గలుగదు. పేశి అనగా దీర్ఘలంబాకృతి గల మాంసావయవ విశేష మని యర్థము.

## స్నాయుగతశల్యలక్షణము

ఆక్షేపస్నాయుజాలస్య సంరంభస్తంభవేదనాః,
స్నాయుగే దుర్హరం చైతత్

శల్యము స్నాయువులను జెందియుండునపుడు స్నాయుసమూహములు ఈడ్చుకొనుట, క్షోభ, స్తబ్ధత్వము, శూల గలుగును. ఈస్నాయుగతమైన శల్యము బహు ప్రయాసచే వెలివడును.

## సిరాగతశల్యలక్షణము

సిరాధ్మానం సిరాశ్రితే. ౫

శల్యము సిర నాశ్రయించి యుండునపుడు సిరలకు ఆనాహము గలుగును. ఆనాహ మనగా ఉబ్బుట.

### స్రోతోగతశల్యలక్షణము

స్వకర్మగుణహానిస్స్యాత్స్రోతసాం స్రోతసి స్థితే,

శల్యము స్రోతస్సులను జెందియుండునపుడు ఆ స్రోతస్సులకు తమతమ కృత్యములయందును గుణములయందును (ద్వారమును) హాని కలుగును. అది యెట్లనగా — శల్యము కంఠగత స్రోతస్సును జెందియుండునపుడు పానము, భక్షణము, వీనికి ప్రతిబంధకమును గలుగ జేయును మఱియు నాస్రోతస్సులకు నిర్దుష్టత్వము మొదలగు గుణములును కొఱవడును. ఇటులనే యితరమైన స్రోతస్సులయొక్క కర్మహానిని గుణహానిని తెలిసికొనవలయును.

### ధమనీగతశల్యలక్షణము

ధమనిస్థేఽనిలో రక్తం ఫేనయుక్తముదీరయేత్. ౬

నిర్యాతి శబ్దవాన్ స్యాచ్చ హృల్లాసస్సాంగవేదనః,

శల్యము ధమనినాశ్రయించి యుండునపుడు వాయువు నురుగుతో గూడియుండు రక్తమును బయలుపఱచును. వాతము శబ్దసహితముగ బయలువెడలును. శరీరమున బాధయు హృల్లాసంబును కల్గును.

### అస్థిసంధిగతశల్యలక్షణము

సంఘర్షో బలవానస్థిసంధిప్రాప్తేఽస్థిపూర్ణతా. ౭

శల్యము అస్థిసంధుల నాశ్రయించి యుండునపుడు బలవత్తరమైన యొరపిడియు అస్థిపూరణమును గలుగును.

### అస్థిగతశల్యలక్షణము

నైకరూపా రుజోఽస్థిస్థే శోఫః

శల్యము అస్థి నాశ్రయించి యుండునపుడు పలుదెఱంగులైనబాధలును శోఫయు కల్గును.

### సంధిగతశల్యలక్షణము

తద్వచ్చ సంధిగే,

చేష్టానివృత్తిశ్చ భవేత్

శల్యము కీళ్లయందుజేరినపుడు అస్థి నాశ్రయించి యుండుశల్యమునకు జెప్పబడిన ఉపద్రవములును, చలనాది వ్యాపారహానియును గలుగును. అస్థిసంధుల నాశ్రయించి యుండుశల్యమునకు లక్షణము పూర్వము చెప్పబడినది. ఇపుడు చెప్పినది రక్తశరీరసంధి నాశ్రయించియుండు శల్యమునకు లక్షణ మని తెలియవలయును. శరీరసంధి యనగా అస్థిసంధులకంటె వేఱైనది యని యర్థము. అటులనే "శరీరసంధీనాదిశ్య" అని రాజయక్ష్మనిదానమునందు ఈతంత్రకారుఁడు చెప్పబోవుచున్నాఁడు.

### కోష్ఠమర్మగతశల్యలక్షణము

ఆటోపః కోష్ఠసంశ్రితే. ౮

అనాహోఽన్నశకృన్మూత్రదర్శనం చ వ్రణాననే,

విద్యాన్మర్మగతం శల్యం మర్మవిద్ధోపలక్షణైః, ౯

శల్యము కోష్ఠమును జేరి యుండునపుడు క్షోభము, కడుపుబ్బరము వ్రణముఖమునందు అన్న, మల, మూత్ర, దర్శనము కలుగును. మర్మగతమగు శల్యమునందు మర్మవేధమునకు జెప్పియుండు లక్షణములే గలుగు నని తెలిసికొనవలయును.

"దేహప్రసుప్తిర్గురుతా సంమోహశ్శీతకామతా,

స్వేదో మూర్ఛా వమిశ్శ్వాసో మర్మవిద్ధస్య లక్షణమ్"

శరీరము చచ్చుపాఱుట, గురుత్వము, మోహము, శీతపదార్థమునం దిచ్ఛ, స్వేదము మూర్ఛ, వాంతి, శ్వాసము, ఇవి మర్మవేధనమునకు లక్షణము లని అష్టాంగసంగ్రహములో జెప్పబడి యున్నది.

యథాస్వం చ పరిస్రావైః* త్వగాదిషు విభావయేత్,

శ్యామవర్ణము, శోఫ, ఇత్యాదిపూర్వోక్త సామాన్య లక్షణములచే మాత్రము శల్యములను తెలిసికొనుట కష్టము. త్వక్కు మొదలగు స్థలములం జెందియుండు శల్యములకు జెప్పియుండు విశేషలక్షణముల చేతను, ఆయాశల్యములయొక్క స్రావము చేతను, త్వగాదులయం దుండు శల్యములం దెలిసికొనవలయును.

రుహ్యతే శుద్ధదేహానామనులోమస్థితం తు తత్ ౧౦

దోషకోపాభిఘాతాదిక్షోభాద్భూయోఽపి బాధతే,

పై జెప్పిన శల్యము అనులోమముగ నుండినయెడల వమనవిరేచనాదులచే శుద్ధమయిన దేహము గలవారికి ఆరినటులనే యుండును. మఱియు నాశల్యము బాగుగ నారకుండుటవలన వాతాదిదోషప్రకోపము, అభిఘాతము మొదలగు క్షోభలచే మరల బాధించును.

### చర్మనష్టశల్యజ్ఞానోపాయము

త్వఙ్నష్టే యత్ర తత్ర స్యురభ్యంగస్వేదమర్దనైః. ౧౧

రాగరుగ్దాహసంరంభా యత్ర చాజ్యం విలీయతే,

ఆశు శుష్యతి లేపో వా తత్ స్థానం శల్యవద్వదేత్. ౧౨

ఏప్రదేశమునందు అభ్యంగ, స్వేద, మర్దనములచే ఎఱుపువర్ణము, శూల, తాపము, క్షోభ గలుగునో, పేరిననెయ్యి నునిచినతోడనే కరగిపోవునో లేక చంద

---

* త్వగాద్యాశ్రితం విభావయేత్ ఇతిపా.

నాదిలేపనము చేసిన అతిశీఘ్రములో నెండిపోవునో, అట్టి స్థానమునందు శల్యము చర్మమునందు అడ్డుపడక లోపలనే యున్నదని తెలియవలయును.

—మాంసనష్టశల్యజ్ఞానోపాయము—

మాంసప్రనష్టం సంశోధ్ధ్యా కర్శనాచ్ఛ్లథతాం గతమ్,
క్షోభాద్రాగాదిభిశ్శల్యం లక్షయేత్

మాంసమునందు అగుపడకయుండు శల్యము వమనవిరేచనశుద్ధులచే కృశత్వమును జెంది శైథిల్యమును జెందును. మఱియు నా మాంసనష్టశల్యమును అనేకవిధములైన శూలలచేతను, చర్మమునం దెఱుపువర్ణము మొదలగువానిచేతను తెలిసికొనవలయును.

—పేశ్యాదినష్టశల్యజ్ఞానోపాయము—

తద్వదేవ చ. ౧౩

పేశ్యస్థిసంధికోష్ఠేషు నష్టం

పేశి, అస్థిసంధి, కోష్ఠము, వీనియందు నష్టమైనట్టి శల్యమును పైని జెప్పిన మాంసనష్టశల్యలక్షణముల చేతనే తెలిసికొనవలయును.

—అస్థినష్టశల్యజ్ఞానోపాయము—

అస్థ్నితు లక్షయేత్,

అస్థ్నామభ్యంజనస్వేదబంధపీడనమర్దనైః. ౧౪
ప్రసారణాకుంచనతః సంధినష్టం తథాస్థివత్,

అస్థులలో నష్టమైయుండు శల్యమును అస్థులయొక్క అభ్యంజన, స్వేదన, బంధన, పీడన, మర్దన, ప్రసారణ, ఆకుంచనములచే తెలిసికొనవలయును. సంధులలో నష్టమయినశల్యమును అస్థులయందు నష్టమయిన శల్యమునకు చెప్పియుండు లక్షణములచే తెలిసికొనవలయును.

—స్నాయ్వాదినష్టశల్యజ్ఞానోపాయము—

నష్టే స్నాయుసిరాస్రోతోధమనీష్వసమే పథి. ౧౫
అశ్వయుక్తం రథం ఖండచక్రమారోప్య రోగిణమ్,
శీఘ్రన్నయేత్తతస్తస్య సంరంభాచ్ఛల్యమాదిశేత్. ౧౬
మర్మనష్టం పృథఙ్నోక్తం తేషాం మాంసాదిసంశ్రయాత్,

శల్యము స్నాయువులు, సిరలు, స్రోతస్సులు, ధమనులు వీనియందు నష్టమైయుండగా మిట్టపల్లము గల మార్గములయందు విరిగిన చక్రములు గల్గి అశ్వయుక్తమైన రథములో శల్యము గల రోగి నెక్కించి అతిశీఘ్రముగ అశ్వమును తోలవలయును. దాని వలన రథమునం దుండు రోగికి గలుగు క్షోభవలన శల్యస్థానమును తెలిసికొనవలయును.

మర్మములు మాంసాదుల నాశ్రయించి యుండుటచేతను, మాంసాదులకంటె మర్మములు వేరుగ లేకుండుటచేతను, ఆ మర్మములందు నష్టమయినశల్యమును ప్రత్యేకముగా నిచట జెప్పక విరమింపబడెను.

నష్టశల్యస్థానసామాన్యలక్షణము

సామాన్యేన సశల్యం తు క్షోభిణ్యా క్రియయా సరుక్. ౧౭

క్షోభను గలుగజేయతగిన క్రియలచేత (అనగా వ్యసనము, ప్రాణాయామము మొదలగుక్రియలచేత) ఏస్థానము ఉపద్రవముతో గూడియుండునో అట్టిదానిని శల్యముతోగూడినస్థాన మని సామాన్యముగా తెలిసికొనవలయును.

అదృశ్యశల్యాకారము

వృత్తం పృథు చతుష్కోణం త్రిపుటం చ సమాసతః,
అదృష్టశల్యసంస్థానం వ్రణాకృత్యా విభావయేత్. ౧౮

వర్తులము, స్థౌల్యము, చతుష్కోణము, త్రికోణము, ఇవి సంక్షేపముగా అదృశ్యముగ నుండు శల్యములకు ఆకారములు. అట్టి శల్యములయాకృతి కనుగుణములైన వ్రణాకారములనుబట్టి శల్యములయొక్కస్థితిని తెలిసికొనవలయును.

అదృశ్యశల్యాకర్షణోపాయము

తేషామాహరణోపాయౌ ప్రతిలోమానులోమకౌ,

దృశ్యము కాకుండు శల్యములయొక్క ఆకర్షణోపాయము, ప్రతిలోమము అనులోమము అనిద్వివిధంబు. ప్రతిలోమ మనగా శరీరాంతఃప్రవేశములేకుండుట, అనులోమ మనగా శరీరాంతఃప్రవేశముతో గూడియుండుట అని యర్థము.

అర్వాచీనపరాచీనే నిర్హరేత్తద్విపర్యయాత్. ౧౯

మఱియు నాప్రతిలోమ, అనులోమోపాయములయొక్క విపర్యయమువలన అర్వాచీనము,పరాచీనము లగుశల్యముల నాకర్షణము చేయవలయును ఎట్లనగా — ప్రతిలోమములో అర్వాచీనము నాకర్షణము చేయవలయును. అనులోమములో పరాచీనము నాకర్షణము చేయవలయును.

తిర్యగ్గతశల్యాకర్షణోపాయము

సుఖాహార్యం యతశ్ఛిత్త్వా తతస్తిర్యగ్గతం హరేత్,

తిర్యగ్గత మయిన (శరీరమునం దడ్డముగ ప్రవేశించిన) శల్యమును శరీరములో నేప్రదేశమునందలి మాంసాదులను ఛేదించి సుఖముగ నాకర్షింపదగునో అట్టి ప్రదేశము నందు ఛేదించి ఆ శల్యము నాకర్షణము చేయవలెను

శల్యం న నిర్ఘాత్యముః కక్షావంక్షణపార్శ్వగమ్. ౨౦
ప్రతిలోమమనుత్తుండం ఛేద్యాః పృథుముఖం చ యత్,

చంకలు, గజ్జలు, ప్రక్కలు, వీని నాశ్రయించి యుండుశల్యము, ప్రతిలోమముగ నుండు శల్యము. వెలపట బుద్బుదము (నీటిబుడగ)వలె ఉన్నతముగ నుండకుండు శల్యము, విస్తీర్ణమయినముఖము గలశల్యము, ఇవి నిర్ఘాత్యములు కావు. అనగా ఛేదింప తగినవి కావు అని యర్థము.

శల్యవిశేషాకర్షణనిషేధము

నైవాహరేద్విశల్యఘ్నం నష్టం వా నిరుపద్రవమ్. ౨౧

విశల్యఘ్నశల్యమును (అనగా ఆకర్షణము చేయగానే మనుజుని చంపునట్టి శల్యమును) ఆకర్షణము చేయంజనదు. నష్టమై (అనగా దృశ్యము కాకుండ) ఉపద్రవములను గలుగజేయకుండు శల్యము నాకర్షణము చేయంజనదు.

హస్తముచే శల్యాకర్షణము

అథాహరేత్కరప్రాప్యం కరేణైవ

చేతికి చిక్కునట్టిశల్యమును హస్తముచేతనే ఆకర్షణము చేయవలయునే కాని కంకముఖాద్యాయుధములవలన నాకర్షణము చేయంజనదు.

దృశ్యశల్యాకర్షణోపాయము

ఇతరత్పునః,

దృశ్యం సింహాహిమకరవర్మి కర్కటకాననైః. ౨౨

హస్తమునకు దొరకనట్టిదియు, కంటి కగుపడునదియు నగు శల్యమును సింహము, సర్పము, మొసలి, వర్మి యనుమత్స్యము, ఎండ్రపీత వీనిముఖమువంటి ముఖములుగల యంత్రములచే నాకర్షణము చేయవలయును.

అదృశ్యశల్యాకర్షణోపాయము

అదృశ్యం వ్రణసంస్థానాత్ గృహీతుం శక్యతే యతః,
కంకభృంగాహ్వకురరశరారీవాయసాననైః. ౨౩

కంటి కగుపడని శల్యమును వ్రణముయొక్క యాకారమువలన బాగుగా నిశ్చయించుకొని ఆశల్యమును రాపులుగు, భృంగాహ్వము, కురరపక్షి, ఆడేలు, కాకి వీని ముఖమువంటిముఖము గల యంత్రములచే నాకర్షణము చేయవలయును.

త్వగాదిగతశల్యాకర్షణోపాయము

సందంశాభ్యాం త్వగాదిస్థం

త్వక్కు, సిరలు, స్నాయువులు, మాంసము మొదలగువానియం దుండు శల్యమును సందంశ మను నాయుధముచే (అనగా కమ్మరవాని పటకారులచే) నాకర్షణము చేయవలయును.

సుషిరశల్యాకర్షణోపాయము.

తాలాభ్యాం సుషిరం హరేత్,

త్వక్కు మొదలగువానియం దుండు సుషిరశల్యమును (రంధ్రముతో గూడియుండు శల్యమును) తాలయంత్రములచే నాకర్షణము చేయవలయును.

రంధ్రగతశల్యాకర్షణోపాయము

సుషిరస్థం తు నళకైః

సుషిరమునం దుండు (అనగా రంధ్రమునం దుండు) శల్యమును నాళీయంత్రములచే నాకర్షణము చేయవలయును.

అనుక్తశల్యాకర్షణోపాయము

శేషం శేషైర్యథాయథమ్. ౨౪

శస్త్రేణ వా విశస్యాదౌ తతో నిర్లోహితం వ్రణమ్,
కృత్వా ఘృతేన సంస్వేద్య బద్ధ్వా చారికమాదిశేత్. ౨౫

పైజెప్పినవానికన్న నితరములగు శల్యములను తక్కిన యంత్రములచే అనుకూలానుగుణముగా నాకర్షణము చేయవలయును. లేక శస్త్రమును ముందుగా మాంసాదులను ఛేదించి శల్యమును వెలికిం దీయనగును. పిదప వ్రణమునందలి రక్తమును పోకడచి ఘృతముచే స్వేదకర్మను చేయించి వస్త్రపట్టము మొదలగువానిచే ఘృతమధువులను కట్టి స్నేహవిధియందు చెప్పబడిన "ఉష్ణోదకోపచారీస్యాదిత్యాది" విధుల ననుసరింపజేయవలయును.

సిరాగతశల్యాకర్షణోపాయము

సిరాస్నాయువిలగ్నం తు చాలయిత్వా శలాకయా,

సిరలు, స్నాయువులు వీనియం దుండు శల్యమును శలాకచే కదిలించి ఆకర్షణము చేయవలయును.

హృదయగతశల్యాకర్షణోపాయము

హృదయే సంస్థితం శల్యం త్రాసితస్య హిమాంబునా. ౨౬
తతః స్థానాంతరం ప్రాప్తమాహరేత్తద్యథాసుఖమ్,

హృదయము నాశ్రయించి యుండు శల్యము శీతజలముచే భయపెట్టబడిన పురుషునికి స్థానాంతరమును జెందును. కావున నట్టి స్థానమును తెలిసికొని దానిని తగుమైన యంత్రములచే నాకర్షణము చేయవలయును.

**స్థానాంతరగతశల్యాకర్షణోపాయము**

యథామార్గం దురాకర్షమన్యతోఽప్యేవమాహరేత్. ౨౭

ఇతరప్రదేశమును జెందియుండుశల్యము అధికప్రయాసచే నాకర్షణము చేయ తగినదిగ నుండినయెడల దానినికూడ స్వమార్గమునకు దీసికొనివచ్చి పైజెప్పిన ప్రకారమే ఆకర్షణము చేయవలయును అది యెట్లనగా — హృదయము నాశ్రయించియుండు శల్యము స్థానాంతరమును జెందినపిదప నెటుల నాకర్షించబడునో అత్తెఱంగుననే వేరు ప్రదేశమునం దుండు శల్యమునుకూడ తగుమైన యుపాయముచే సరియైనమార్గమునకు తీసికొని రావలయును.

**అస్థిగత శల్యాకర్షణోపాయము**

అస్థినష్టే నరం పద్భ్యాం పీడయిత్వా వినిర్హరేత్,
ఇత్యశక్యే సుబలిభిస్సుగృహీతస్య కింకరైః. ౨౮
తథాప్యశక్యే వారంగం వక్రీకృత్య ధనుర్జ్యయా,
సుబద్ధం వక్త్రకటకే బద్ధ్వా యాత్నసమాహితః. ౨౯
సుసంయతస్య పంచాంగ్యా వాజినః కశయాథ తమ్,
తాడయేదితి మూర్ధానం వేగేనోన్నమయన్ యథా. ౩౦
ఉద్ధరేచ్ఛల్యమేవం వా శాఖాయాం కల్పయేత్తరోః,
బద్ధ్వా దుర్బలవారంగం కుశాభిశ్శల్యమాహరేత్. ౩౧
శ్వయథుగ్రస్తవారంగం శోఫముత్పీడ్య యుక్తితః,

శల్యము అస్థిలో జేరియుండునపుడు బలిష్ఠుడుగ నుండుపురుషుని కాళ్లచే నదుముకొని దాని నాకర్షణము చేయవలయును. ఇట్టి యుపాయముచేతకూడ నా శల్యము నాకర్షణముచేయుట కశక్యముగ నుండినయెడల వైద్యుడు వానిని బలిష్ఠులగు పరిచారకులచే దృఢముగ పట్టుకొనునటులజేసి కంకముఖాద్యాయంధములచే నాకర్షణము చేయవలయును ఇట్టియుపాయముచేతకూడ శల్యము నాకర్షించుట కశక్యముగ నుండిన యెడల వారంగమును (అనగా శస్త్రాదిస్వరూపముగల శల్యముయొక్క కొనను) వంచి దానిని స్నాయువులు మొదలగువానిచే నిర్మించబడిన విల్లుత్రాడుచే బాగుగ కట్టి పిదప పంచాంగి యనుబంధనముచే బాగుగా కట్టబడియుండు గుఱ్ఱముయొక్క వక్త్రకటక ములో (అనగా నోటికళ్ళెములో) వైద్యుడు జాగరూకుడై యా విల్లు త్రాడునుకట్టి పిదప నాగుఱ్ఱము తలను పొడవుగ నెత్తుకొని బలముచే శల్యము నెటుల నాకర్షణము జేయునో అత్తెఱంగున దానిని జాటిచే కొట్టవలయును. పంచాంగి యనగా:— 4-గు కాళ్లను మూతిని జేర్చి కట్టునట్టికట్టు లేక పైజెప్పినప్రకారము వారంగమును వంకరగ

జేసి దానిని విల్లుత్రాటిచే కట్టి మిగుల జాగరూకత గలవైద్యుడు గొప్పవృక్షముయొక్క శాఖను పరిచారకులచే వంచునటుల జేసి అది పరిచారకులచే విడువబడగానే పాదపుగ లేచి యెటుల నాశల్యమును శీఘ్రముగ నాకర్షణము జేయునో అట్టియంగుళ శల్యాకర్షణార్థము ఆ శాఖలో విల్లుత్రాటిని కట్టవలయును. వారంగము దుర్బలముగ నుండిన యెడల దానిని కుశాదులచేగట్టి ఆశల్యము నాకర్షణము జేయవలయును. వారంగము శోఫచే మూయబడి యుండినయెడల యుక్తిచే పైభాగమునందు గుంటుశోఫము బోకడచి శల్యము నాకర్షణము చేయవలయును

### ఉత్తుండిత శల్యాకర్షణోపాయము

ముద్గరాహతయా నాడ్యా నిర్ఘాత్యోత్తుండితం హరేత్. ౩౨
తైరేవ చానయేన్మార్గమమార్గోత్తుండితం తు యత్,

ఉత్తుండితమయిన (అనగా బుద్బుదమువలె వెలపట నభిముఖముగ వచ్చియుండు) శల్యమును ముద్గరముచే (అనగా కమ్మరవాని సుత్తెవంటి ఆయుధముచే) కొట్టబడిన నాడీ యంత్రముచే గదిలించి (అనగా శల్యపార్శ్వములయందు నాడీయంత్రము నునిచి ముద్గరముచే కొట్టి కదిలించి) ఆకర్షణము చేయవలయును ముద్గర మని జెప్పినది పాషాణాదులకు ఉపలక్షణము. కావున పాషాణాదులచేతను కొట్టి కదిలించి ఉత్తుండిత మగు శల్యము నాకర్షింపందగును మార్గము గానరాక పైకుబికియుండు శల్యమును ముద్గరాదులచేతనే సరియైనమార్గమునకు తీసికొనివచ్చి ఆకర్షణము చేయవలయును.

### భల్లాదిశల్యాకర్షణోపాయము

మృదిత్వా కర్ణినాం కర్ణం నాడ్యాస్యేన నిగృహ్య వా ౩౩

భల్లము (అనగా బాణము) మొదలగువానియొక్క కర్ణములను విరిచి దాని నాకర్షించవలయును. లేక నాడీయంత్రముయొక్క ముఖముచే పట్టుకొనియైన నాకర్షించవలయును.

### కర్ణరహిత శల్యాకర్షణోపాయము

అయస్కాంతేన నిష్కర్ణం వివృతాస్యమృజు స్థితమ్

కర్ణము లేనిదియును, ప్రకాశమయినముఖము గలదియును, ఋజువుగ నుండునది యునగు శల్యమును అయస్కాంతముచే నాకర్షించవలయును.

### పక్వాశయగతశల్యాకర్షణోపాయము

పక్వాశయగతం శల్యం విరేకేణ వినిర్హరేత్. ౩౪

పక్వాశయమును జెందియుండునట్టి శల్యమును విరేచనములచే వెలిపఱుపవలయును.

దుష్టవాతవిషస్తన్యరక్తతోయాది చూషణైః,

దుష్టమయినవాతము, విషము, స్తన్యము, రక్తము, ఉదకము ఈమొదలగు వానిని చూషణములచే (నోటితో పీల్చి) బైటవెడలింపవలెను. 'చూషణైః' అనుబహు వచనప్రయోగముచే శృంగము మొదలగువానిచేతను వెడలింపందగు నని యర్థం బగు చున్నది.

### కంఠస్రోతోగత శల్యాకర్షణోపాయము

కంఠస్రోతోగతే శల్యే సూత్రం కంఠే ప్రవేశయేత్. ౩౫
బిసేనార్తే తతశ్శల్యే బిసం సూత్రం సమం హరేత్,

శల్యము కంఠగత స్రోతస్సులను జెంది యుండినచో ప్రత్తిదారములను తామర తూండ్లతో జేర్చి కంఠమునందు ప్రవేశింపజేయవలయును. పిదప నా శల్యము తామర తూండ్లలో నంటుకొనును. అటుల నంటుకొనిన శల్యమును, తామరతూండ్ల సూత్రమును ఏకకాలమునందు వెలిపరచవలయును.

### కంఠగత శల్యాకర్షణోపాయము

నాడ్యాఽగ్నితాపితాం క్షిప్త్వా శలాకామప్స్థిరీకృతామ్, ౩౬
ఆనయేజ్జాతుషం కంఠాత్

లక్కసంబంధమైన శల్యము కంఠస్రోతస్సులయందు ప్రవేశించినచో కంఠము నందు నాడీయంత్రమును ప్రవేశింపజేసి దానియందుండు ద్వారముమూలముగా అగ్నిచే తప్తమయిన శలాకను ప్రవేశింపజేసి లక్కసంబంధమైన శల్యము కరిగి శలాకలో నంటుకొనగానే శలాక నుదకముచే జల్లార్చి శల్యము నాకర్షింపవలయును.

జతుదిగ్ధామజాతుషమ్,

లత్తుకసంబంధములేని కొయ్య, వెదురు మొదలగు శల్యములు కంఠస్రోతస్సుల నాశ్రయించి యుండునపుడు లక్కపూయబడి యుండు శలాకను అగ్నిచే తపింపజేసి పూర్వమువలె నాడీయంత్రద్వార మూలముగా కంఠములో ప్రవేశింపజేసి శల్యము నాకర్షింపవలయును.

కేశోండుకేన పీతేన ద్రవైః కంటకమాక్షిపేత్. ౩౭
సహసా సూత్రబద్ధేన వమతః

మత్స్యాదులయొక్క కంటకము మాంసముతోడ భుజింపబడి కంఠస్రోతస్సును జెందియున్నచో కేశసమూహమును నిడుపుగ సన్నముగ నుండు నూలుతో కట్టి దానిని

వమనద్రవ్యములతో సిద్ధము చేయబడిన ఉదకము మొదలగువానితోడ పానము చేసి వమనము చేయునపుడు శల్యమును పైసూత్రముచే నతిశీఘ్రముగా నాకర్షింపవలయును.

తేన చేతరత్,

కేశసమూహము అజ్ఞానముచే అన్నసహితముగ భుజింపబడి కంఠ ప్రోతస్సును జెందియుండగా నిడుపుగ దృఢముగ సన్నముగ నుండు సూత్రములో కంటకమును కట్టి వమనకరద్రవ్యములచే సిద్ధము చేయబడిన ఉదకములోవేసి పానముచేయించి వమనము చేయునపుడు శీఘ్రముగ దాని నాకర్షించవలయును. అటుల జేయుటచే కంఠమునందు గాయము గలిగినయెడల తేనె, ఘృతము, శర్కర వీనితో జేరియుండు త్రిఫలసులను కంఠములో బూయవలయును.

“అస్థిశల్యమన్యద్వా తిర్యక్స్థితమపేక్ష్య కేశోందుకం దృఢదీర్ఘసూత్రబద్ధం ద్రవభక్తోపహితం పాయయేద్వామయేచ్చ, వమతశ్చ కంఠశల్యైకదేశే సక్తం సూత్రం సహసా త్వాక్షిపేన్మృదునా వా దంతధావనకూర్చకేనాహరేత్ప్రిణుదేద్వా.”
అస్థిని జెందియుండునట్టి శల్యముగాని, అడ్డముగ వ్యాపించియుండు ఇతర శల్యమును గాని ఆకర్షించుటకై దృఢముగ, దీర్ఘముగనుండు సూత్రములో కట్టబడిన కేశసమూహమును ద్రవమయిన ఆహారముతోడ జేర్చి పానము చేయించి తోడనే దానిని వమనము చేయించవలయును. వమనము చేయునపుడు కంఠగతమయిన శల్యములో తగులుకొనియుండు నా సూత్రమును శీఘ్రముగా నీడ్వవలయును లేక మృదువగు నుంచు దంతధావన కూర్చముచేగాని ఆ శల్యము నాకర్షింపవలయును. అని సుశ్రుతమునందు చెప్పబడి యున్నది.

## ముఖనాసికాగతశల్యాకర్షణోపాయము

ఆశక్యం ముఖనాసాభ్యామాహర్తుం పరతో నుదేత్. ౩౮

ముఖము, నాసికము, వీనిని జెందియుండుశల్యము ముఖనాసికముల ద్వారములనుండి యాకర్షించుటకు సాధ్యము కానియెడల యితరమార్గమునుండి బయలుపడుపవలయును. ఇటుల జెప్పుటచే నాశల్యము నేదోయొక యుపాయమువలన కోష్ఠమును జెందునటుల చేయవలయు నని భావం బగుచున్నది.

## కబళశల్యాంతఃప్రవేశోపాయము

అప్పావస్కంధఘాతాభ్యాం గ్రాసశల్యం ప్రవేశయేత్,

గ్రాసశల్యము (అన్నముయొక్క కబళముతోగూడ కంఠబిలమున చిక్కియుండు

శల్యమును) ఉదకపానము, స్కంధాఘాతము (అనగా ముష్ట్యాగులచే భుజశిరస్సుల యందు కొట్టుట) వీనిచే కోష్ఠమధ్యమును జెందునటుల జేయవలయును.

### నేత్రము వ్రణము వీనియందలి శల్యాకర్షణోపాయము

సూక్ష్మాక్షివ్రణశల్యాని క్షౌమవాలజలైర్హరేత్. ౩౯

నేత్రములు, వ్రణములు వీనియందుండు సూక్ష్మమయిన శల్యములను క్షౌమము (అనగా వెలిపట్టువస్త్రము) వాలము (వెండ్రుకలు), ఉదకము, వీనిలో దేనిచేనైన బయలు పఱుపవలయును. (అనగా ఆయాశల్యములకు తగినటుల నొకకాలమునందు క్షౌమము చేతను, మఱియొకపుడు వాలముచేతను వేఱొకపుడు ఉదకముచేతను బయలుపఱుప వలయు నని భావము)

### ఉదకశల్యాకర్షణోపాయము

అపాం పూర్ణం విధునుయాదవాక్ఛిరసమాయతమ్.
వామయేద్వా ముఖం భస్మరాశౌ వా నిఖనేన్నరమ్ ౪౦

తటాకాదులయం దకస్మాత్తుగ బడుటచే నుదకమువలన పూరితముగనుండు ఉదరముగల మనుజుని తలక్రిందుగ త్రిప్పి దీర్ఘముగజేసి విదిలించి పిదప వైద్యుడు వమనము చేయించవలయును. లేక ముఖమువరకు (అనగా నోటివరకు) భస్మరాశి (అనగా బూడిదెసమూహము) లోనైనా పూడ్చవలయును.

"ఉదకపూర్ణస్య చక్రాద్యారోపణేన ఉదకనిస్సారః కార్యః."
ఉదకపూరితమయిన ఉదరము గలమనుజుని చక్రాదులయం దారోపణము చేయించుట వలన ఉదకమును వెలిపరచవలయును. అని తంత్రాంతరమునందు చెప్పబడి యున్నది.

### కర్ణశల్యాకర్షణోపాయము

కర్ణేఽంబుపూర్ణే హస్తేన మథిత్వా తైలవారిణీ,
క్షిపేదధోముఖం కర్ణం హన్యాద్వా చూషయేత వా. ౪౧

కర్ణములు ఉదకముచే పూరితములగునపుడు తైలము, ఉదకము అను నీరెంటిని మిశ్రముజేసి హస్తములచే మథించి కర్ణములలో వేయవలయును. లేక కర్ణము నధోముఖముగ నునిచి కొట్టవలయును. లేక శృంగాదులచే పీల్చవలయును.

### కర్ణగతకీటాద్యాకర్షణోపాయము

కీటే స్రోతోగతే కర్ణం పూరయేల్లవణాంబునా,
శుక్తేన వా సుఖోష్ణేన మృతే క్లేదహరో విధిః. ౪౨

చీమలు, నల్లజెఱ్ఱి మొదలగు పురుగులు చెవులయందు ప్రవేశించినయెడల లవణ మిశ్రితముగ నుండు ఉదకముచేగాని, సుఖోష్ణమయినశుక్తముచేగాని కర్ణము పూరణము చేయవలయును. మఱియు నాపురుగులు చచ్చిన పిదప క్లేదహరమయిన (లోపలి చెమ్మను హరించు) విధిని చేయవలయును.

జాతుషాదిశల్యవిలయము

జాతుషం హేమరూప్యాదిధాతుజం చ చిరస్థితమ్,
ఊష్మణా ప్రాయశశ్శల్యం దేహజేన విలీయతే. ౪౩

లక్కసంబంధము గలవియును, స్వర్ణము, రజతము మొదలగు ధాతువుల సంబంధమైనవియు నైనశల్యములు శరీరమునందు చిరకాలమువరకు నుండినయెడల దేహజనితమయినఉష్ణముచే తఱుచుగా కరిగిపోవును.

మృదాదిశల్యవిలయాభావము

మృద్వేణుదార్వశ్మశృంగాస్థిదంతవాలోపలాని చ,
శల్యాని న విశీర్యంతే శరీరే మృణ్మయాని వా. ౪౪

మృత్తు, వెదురు, మ్రాను, శృంగము, అస్థి, దంతము, ఱాయి వీని సంబంధములైనశల్యములు దేహసంబంధమయిన ఉష్ణముచే కరగనేరవు.

విషాణాదిశల్యభంగము

విషాణవేణ్వాయస్తాలదారుశల్యం చిరాదపి,
ప్రాయో నిర్భుజ్యతే తద్ధి పచత్యాశు పలాసృజీ. ౪౫

శృంగము, వెదురు, ఇనుము, తాటి, మ్రాను, వీనిసంబంధములైన శల్యములు చిరకాలముమీద తఱుచుగా విరిగిపోవునుగాని శరీరమువేడిచే కరుగనేరవు. ఏలయనగా.—ఆశల్యములు శీఘ్రముగానే మాంసరక్తముల పచింపజేయును. కావున నవి యెల్ల విశీర్ణము లగునుగాని బొత్తుగ నశింపవు.

మాంసప్రవిష్టశల్యాకర్షణోపాయము

శల్యే మాంసావగాఢే చ స దేశో న విదహ్యతే,
తత స్తం మర్దనస్వేదశుద్ధికర్షణబృంహణైః. ౪౬
తీక్ష్ణోపనాహపానాన్నఘనశస్త్రపదాంకనైః,
పాచయిత్వా హరేచ్ఛల్యం పాటనైషణభేదనైః. ౪౭

శల్యము మాంసములో దాగి యుండునపుడు ఆ శల్యముండు ప్రదేశము పాకము

జెందకుండినచో యేప్రదేశమునందు శల్య ముండునో ఆప్రదేశమును మర్దనము చేతను, ఒకానొకపుడు స్వేదనముచేతను, ఒకానొకపుడు వమనాదిశుద్ధులచేతను, ఒకానొకపుడు కర్షణముచేతను, ఒకానొకపుడు బృంహణముచేతను, ఒకానొకపుడు తీక్ష్ణమయిన ఉపనాహస్వేదముచేతను, ఒకానొకపుడు తీక్ష్ణ మయిన అన్నపానములచేతను, ఒకానొకపుడు శస్త్రముచేతను యథాక్రమముగా పాకముచేయించి పాటనము వ్రణభేదనము అను క్రియలచే శల్యమును బయలుపఱుపవలయును.

శల్యప్రదేశయంత్రాణామవేక్ష్య బహురూపతామ్,
తైస్తైరుపాయైర్మతిమాన్ శల్యం విద్యాత్తథా హరేత్. ౪౮

ధాతువులు, శృంగము, వెదురు, మొదలగు ననేకవిధ శల్యభేదములను, త్వక్కు మాంసము మొదలగు ననేకవిధ ప్రదేశభేదములను, స్వస్తికము మొదలగు ననేకవిధయంత్రభేదములను బుద్ధిమంతు డగువైద్యుడు బాగుగ దెలిసికొని యిదివరకు జెప్పబడినవియును జెప్పబడనివియునైన ఉపాయములచే శల్యముల నాకర్షించవలయును.

'వ్రణే ప్రసన్నే ప్రాంతేషు నాతిస్పర్శాసహిష్ణుతా,
అల్పే శోఫే చ తాపే చ నిశ్శల్యమితి నిర్దిశేత్.''

వ్రణము ప్రసన్నముగ నుండుట, సమీపప్రదేశమునందు స్పర్శమును సహింపకుండుట, స్వల్పమయినవాపు, స్వల్పమయినతాపము గలిగియుండుట, ఇట్టిలక్షణములచే శల్యము లే దని తెలిసికొనవలయును.

అష్టవింశాధ్యాయము, ముగిసెను.

# ఏకోనత్రింశాధ్యాయము

అవ పూర్వాధ్యాయమునందు "శస్త్రేణవా విశస్యాదా" అనగా తొలుత శస్త్రముచే మాంసాదులను ఛేదించి అని చెప్పియుండుటవలన నీయధ్యాయమునందు శస్త్రకర్మవిధి చెప్పబడుచున్నది.

## శస్త్రకర్మవిధ్యధ్యాయప్రారంభము

సూ. అథాతశ్శస్త్రకర్మవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామ,
ఇతిహస్మాహురాత్రేయాదయో మహర్షయః.

శల్యాహరణవిధ్యధ్యాయానంతరము శస్త్రకర్మ జేయవలసిన క్రమమును తెలియ జేసెడు శస్త్రకర్మవిధ్యధ్యాయమును వివరించెదము.

## శోఫచికిత్సాక్రమము

వ్రణస్సంజాయతే ప్రాయః పాకాచ్ఛ్వయథుపూర్వకాత్,
తమేవోపచరేత్తస్మాద్రక్షన్పాకం ప్రయత్నతః. ౧
సుశీతలేపసేకాస్రమోక్షసంశోధనాదిభిః,

తొలుత వాపుతో గూడియుండునట్టి పాకముచే తఱుచుగా వ్రణము గలుగును. కాబట్టి ఆ పాకమును ప్రయత్నపూర్వకముగా స్పర్శముచేతను, వీర్యముచేతను, శీతలముగనుండు లేపసేకములచేతను, రక్తమోక్షణముచేతను, వమనవిరేచనాది శుద్ధులచేతను, కషాయపాన, ఘృతపానాదులచేతను, రక్షించుచు ఆ వాపును చికిత్సింపవలయును. మఱియును వాపు, పాకము లేకయె శస్త్రాద్యభిఘాతముచే వ్రణము గలుగును. కావున తఱుచుగా అను నర్థమును తెలియజేసెడు 'ప్రాయః' అను పదము ఇచట ప్రయోగింపబడినది.

## ఆమశోఫలక్షణము

శోఫోఽల్పోఽల్పోష్మరుక్సామస్సవర్ణః కఠినస్స్థిరః. ౨

ఆమమైన (పక్వముగాని) శోఫ స్వల్పముగ, స్వల్పమైన ఉష్ణము, శూల, వీనితో గూడినదిగ, చర్మముతో సమానమైన వర్ణము గలదిగ, పక్వమైన శోఫవలె మృదువుగనుండక కఠినముగ స్థిరముగ నుండును.

### పచ్యమానశోఫలక్షణము

పచ్యమానో వివర్ణస్తు రాగీ వస్తిరివాతతః,
స్ఫుటతీవ ససిస్తోదస్సాంగమర్దవిజృంభికః. 3
సంరంభారుచిదాహోషాతృట్ జ్వరానిద్రతాన్వితః,
స్త్యానం విష్యందయత్యాజ్యం వ్రణవత్ స్పర్శనాసహః. ౪

పక్వావస్థ నొందుచుండుశోఫ వివర్ణముగనైనను రక్తవర్ణము కలదిగనైననుండి గాలిచే నిండిన తోలుతిత్తివలె నుబ్బి యుండును. పగులునట్లుండియుండియు తీవ్రమైన పోటుపుట్టును. శరీరావయవములెల్ల నొచ్చును. ఆవలింతలు విశేషముగ వెడలును. ఇట్టిదని నోట చెప్పశక్యముగాక తనకుమాత్రము గోచరములగు నానావిధములైన బాధలును, అరోచకమును, శరీరమునం దెల్ల మంటయుం, శోఫస్థానమున విశేషమైనమంటయు, దప్పియు, జ్వరమును, విశేముగ కల్గును. నిదుర పట్టదు. అట్టివాపు కల్గినస్థలమున పేరిన నెయ్యి నునిచినచో నీరుగ కరుగును. చేత తాకినచో పుండుపై రాకినవిధముగ స్పర్శను నోర్వజాలకుండును ఇట్టి లక్షణములుకల్గునదియొగ వ్రణపాకావస్థ నొందుచున్నదని యెఱుంగునది.

### పక్వశోఫలక్షణము

పక్వేఽల్ప* వేగతా మ్లానిః పాండుతా వలిసంభవః,
నామోఽంతేషూన్నతిర్మధ్యే కండూశోఫాతి మార్దవమ్. ౫
స్పృష్టే పూయస్య సంచారో భవేద్వస్తావివాంభసః,

శోఫ పక్వమైయుండగా స్వల్పవేగము, వాడియుండుట, పాండురవర్ణము, వళులు (ముడతలు) అంచులయందు పల్లము, మధ్యమునం దున్నతము, దురద, శోఫ తగ్గియుండుట ఈలక్షణములు గలుగును. ఆ శోఫమును స్పృశించునపుడు వస్తియందు ఉదక సంచారమువలెనే పూయసంచారము కలుగును.

### శోఫపాకనిదానము

శూలం నర్తేఽనిలాద్దాహః పిత్తాచ్ఛోఫః కఫోదయాత్. ౬
రాగో రక్తాచ్చ పాకస్స్యాదతో దోషైస్సశోణితైః,

వాతము లేకయే శూల గలుగ నేరదు. పిత్తము లేకయే తాపము (అనగా మంట) గలుగ నేరదు. కఫము లేకయే శోఫ గలుగ నేరదు. రక్తము లేకయే యెఱుపువర్ణము గలుగ నేరదు. కాబట్టి రక్తముతో గూడియుండునట్టి వాతాదిదోషముల మూడిటిచేతనే శోఫ పాకమును బొందును.

---

* వేదనా ఇతి పా.

### పాకాధిక్యశోఫలక్షణము

పాకేఽతివృత్తే సుషిరస్తనుత్వగ్దోషభక్షితః. ౭
వలీభి రాచితశ్శ్యావశ్శీర్యమాణతనూరుహః,

పాకము అతిక్రాంతమైయుండగా శోఫయొక్క ప్రదేశము పల్లముగ, మృదువైన చర్మము గలదిగ, చీముచే భక్షింపబడినదిగ, వళుల (ముడతల)చే వ్యాప్తముగ, శ్యామవర్ణము గలదిగ, రోమములు రాలిపోయినదిగ నుండును.

### రక్తపాకలక్షణము

కఫజేషు తు శోఫేషు గంభీరం పాకమేత్యసృక్. ౮
పక్వలింగం తతోఽస్పష్టం యత్ర స్యాచ్ఛీతశోఫతా,
త్వక్సావర్ణ్యం రుజోఽల్పత్వం ఘనస్పర్శత్వమశ్మవత్. ౯
రక్తపాకమితి బ్రూయాత్తం ప్రాజ్ఞో ముక్తసంశయః,

కఫాధిక్యముచే గలిగిన శోఫలయందు రక్తము గంభీరమైన పాకమును జెందును. (మిక్కిలి లోతున శోఫపక్వమగుననుట) అది మిక్కుటముగ లోన మరిగియుండుటవలన నేత్రములకు గన్పడదు. కాబట్టి సర్వలక్షణము స్పష్టముగ దెలియనేరదు. ఆ పాకములో శీతగుణసంబంధముచే శీతలమైన శోఫయును, చర్మముతో సమానమైన వర్ణమును, స్వల్పమైనబాధయును చేతులు మొదలగువానిచే తాకిన రాయివలె కఠినమైన స్పర్శయును గలిగియుండును. అటువంటి శోఫయొక్క పాకమును బుద్ధిమంతుడగు వైద్యుడు సంశయరహితుడై రక్తపాక మని చెప్పుటయేగాక దానియందు కఫ లేదనియు జెప్పవలయును.

### శ్వయథుపాకమున దారణకర్మము

అల్పసత్త్వేఽబలే బాలే పాకే చాత్యర్థముద్ధతే. ౧౦
దారణం మర్మసంధ్యాది స్థితే చాన్యత్ర పాటనమ్,

స్వల్పబలము గలవాడు, బలములేనివాడు, బాలుడు, వీరికి జనించియుండు శోఫయందును, పాకముచే మిక్కిలి అతిక్రాంతమైన శోఫయందును

"గుగ్గుల్వతసిగోదంతస్వర్ణక్షీరీకపోతవిట్,
క్షారౌషధాని క్షారాశ్చ పక్వశోఫవిదారణమ్."

అని వ్రణప్రతిషేధాధ్యాయములో జెప్పబడు గుగ్గులు, అగసి, గోదంతము, స్వర్ణక్షీరి, పావురపురెట్టమలము, క్షారౌషధము, క్షారములు యీ మొదలగు దారణద్రవ్యములచే దారణము చేయవలయును (పగులునట్లు చేయవలెనని). మర్మము, సంధులు మొదలగు వానియందుండు శోఫయందును దారణద్రవ్యములచే దారణముచేయవలయును. దారణ

మునకు యోగ్యమని చెప్పబడిన స్థానములకంటె నితరస్థానములయందుండు శోఫయందు శస్త్రముచే పాటనము చేయవలయును. (పాటన మన శస్త్రముచే పగులదీయుట)

### ఆమశోఫదారణజనితోపద్రవములు

ఆమచ్ఛేదే సిరాస్నాయువ్యాపదోఽసృగతిస్రుతిః. ౧౧
రుజోఽతివృద్ధిర్దరణం విసర్పో వా క్షతోద్భవః,

ఆమమయినశోఫను శస్త్రముచే ఛేదించునపుడు సిరలు, స్నాయువులు, వీనికి వ్యాపత్తు కల్గును. మఱియు నధిక రక్తస్రావము, బాధాధిక్యము గలుగును. విదరణము (అనగా స్ఫుటనము) లేక గాయముచే జనించు విసర్పరోగము గలుగును.

### పక్వశోఫను ఛేదించకుండుటచే గల్గునుపద్రవములు

తిష్ఠ*న్నంతః పునః పూయస్సిరాస్నాయ్వసృగామిషమ్. ౧౨
వివృద్ధో దహతి క్షిప్రం తృణోలపమివానలః,

పక్వమైనశోఫ నుపేక్షించినచో చీము లోప్రదేశమునందుండినదై మరల విశేషముగా వృద్ధిచెంది సిరలు స్నాయువులు, రక్తము, మాంసము వీనిని అగ్ని తృణములను దహింపజేయునటుల శీఘ్రముగా హరింపజేయును.

### ఆమపాకచ్ఛేదనిషేధము

యశ్ఛినత్త్యామమజ్ఞానాద్యశ్చ పక్వముపేక్షతే. ౧౩
శ్వపచావివ విజ్ఞేయౌ తావనిశ్చితకారిణౌ,

ఏ పురుషుడు అజ్ఞానముచే ఆమమయిన (పక్వముగాని) శోఫను ఛేదించునో, పక్వమైన శోఫను ఛేదనము చేయక యుపేక్షించునో అటుల బాగుగా యోచించి చేయకుండు ఆయిరువురు వైద్యులును రోగిని జంపుదురు. కావున వారిని చండాలురతో సమాను లని తెలియవలయును.

### శస్త్రకర్మపూర్వకర్తవ్యము

ప్రాక్శస్త్రకర్మణశ్చేష్టం భోజయేదన్నమాతురమ్. ౧౪
పానపం పాయయేన్మద్యం తీక్ష్ణం యో వేదనాక్షమః,

శస్త్రకర్మకుముందు రోగికి ఇష్టమైన అన్నమును (అనగా వ్రణమునం దపథ్యముగ నుండు అన్నమునుకూడ బలము గలుగుటకై) భోజనము చేయించవలయును. శస్త్రపీడను సహించలేనిరోగికి మద్యపానాభ్యాసము కలిగి యుండినచో అధికముగ మదకరమైనమద్యమును పానము చేయించవలయును.

---

* స్పక్వే ఇతిపా.

న మూర్ఛత్యన్నసంయోగాన్మత్తశ్శస్త్రం న బుధ్యతే. ౧౫

అన్నమును భుజించుటవలన మూర్ఛను జెందనేరడు. తీక్ష్ణమయిన మద్యపానముచే మదించియుండురోగి తన శరీరమునందు ప్రయోగించబడు శస్త్రముచే గలిగినబాధను తెలిసికొననేరడు. (అనగా శస్త్రోపద్రవముచే చలించకుండు నని తాత్పర్యము.) * కనుక యథోచితముగ నన్నము నైనను మద్యపానార్హునకు మద్యమునైనను శస్త్రకర్మమునకు ముం దుపయోగించవలె ననుట.

### అశ్మరీరోగాదులయందు శస్త్రకర్మకు పూర్వము అన్నాదినిషేధము

అన్యత్ర మూఢగర్భాశ్మముఖరోగోదరాతురాత్,

మూఢగర్భము, అశ్మరి, ముఖరోగము, ఉదరరోగము రోగములు గలవారిని వర్జించి యితరమైనరోగులకు ఇష్టమయిన అన్నాదులను, మద్యపానమును నొసంగవలయును.

### శస్త్రప్రయోగక్రమము

అథాహృతోపకరణం వైద్యః ప్రాఙ్ముఖమాతురమ్. ౧౬
సమ్ముఖో యన్త్రయిత్వాశు న్యస్యేన్మర్మాది వర్జయన్,
అనులోమం సునిశితం శస్త్రమాపూయదర్శనాత్. ౧౭
సకృదేవాహరేత్తచ్చ

పిదప తత్కాలయోగ్యమయిన యంత్రములు, శస్త్రములు, అగ్ని, జాంబవౌష్ఠము, దూదితో గూడియుండు బట్ట, స్నేహనము, మధుకల్కము ఈ మొదలగు వానిని తన సమీపమునందు సిద్ధముగా నుంచుకొని యుండువాడును, తూర్పు ముఖముగా కూర్చుండి యుండురోగికి అభిముఖముగా (అనగా పశ్చిమముఖముగా) నుండువాడును నగు వైద్యుడు యంత్రణముచేసి మర్మసిరాదులను వర్జించి మిక్కిలి పదునుగల శస్త్రమును విలంబము చేయక అనులోమముగా ప్రయోగింపవలయును. ఆ శస్త్రమును చీము కనబడువరకు నొకటే సారిగా ప్రయోగింపవలయును. చీము కనబడిన పిదప శస్త్రమును వ్రణమున ప్రయోగింపరాదు.

పాకే తు సుమహత్యపి,
పాటయేద్ద్వ్యఙ్గులం సమ్యగ్ద్వ్యఙ్గులం త్ర్యఙ్గులాన్తరమ్.
ఏషిత్వా సమ్యగేషిణ్యా పరితస్సుప్రరూపితమ్,
అఙ్గులీనాలవాలైర్వా యథాదేశం యథాశయమ్. ౧౮

* దోషర ఇతిపా.

మహత్తయిన పాకములో తత్పార్శ్వమునందు 2 లేక 3 అంగుళముల ప్రదేశమును విడిచి 2 అంగుళముల పరిమాణముగల మఱియొక వ్రణమును చేసి అంతటను బాగుగ చూచి ఏషిణి యనునాయుధముచేగాని, వ్రేళ్లచేగాని, పద్మోత్పలాది నాళములచేగాని, పంది మొదలగు జంతువులయొక్క వాలములచేగాని చక్కగ పరిశీలించి వ్రణము ఎంతవరకు వ్యాపించి యుండునదియు స్ఫుటముగ నిర్ణయించి వాతాదిదోష, వ్రణస్థానానుగుణముగా శస్త్రకర్మ చేయనగును.

యతో గతాం గతిం విద్యాదుత్సంగో యత్ర యత్ర చ,
తత్ర తత్ర వ్రణం కుర్యాత్సువిభక్తం నిరాశయమ్, ౨౦
ఆయతం చ విశాలం చ యథాదోషో న తిష్ఠతి,

ఏయే ప్రదేశమునందు బహుదూరము వ్రణనాడి వ్యాపించి యుండునో దానిం దెలిసికొని ఆయా ప్రదేశములయందును, ఏయే శోఫప్రదేశమునం దౌన్నత్యము గలిగి యుండునో దానిం దెలిసికొని ఆయా ప్రదేశములయందును, పుండు చేయవలెను. అట్లు చేయబడిన వ్రణములు ఒండొంట గలియక వేరువేరుగ నేర్పడి పూయాదిదోషములు నిలిచి యుండుట కెడమీయక విశాలములై యుండవలెను. అట్టివ్రణములనుండి పూయాదులు బైటవెడలి వ్రణభాగమున నిలువక నిశ్శేషముగ నుండవలెను.

శస్త్రకర్మయందు వైద్యున కుండవలసినగుణములు

శౌర్యమాశుక్రియాతీక్ష్ణం శస్త్రమస్వేదవేపథుః, ౨౧
అసంమోహశ్చ వైద్యస్య శస్త్రకర్మణి శస్యతే,

వైద్యునికి పాటనము మొదలగు శస్త్రకర్మలయందు ధైర్యము, హస్తచాతుర్యము (అనగా శీఘ్రములో పాటనాదికృత్యములను చేయు సామర్థ్యము) తీక్ష్ణమయిన శస్త్రము, స్వేదము, కంపము లేకుండుట, తత్కాలోచితకార్యములయందు మోహము లేకుండుట, ఇవి ప్రశస్తంబులు. వైద్యునికి శస్త్రకర్మయందు ధైర్యము ప్రశస్తమని చెప్పినందుచేతనే ధైర్యముగలవానికి స్వేదము, కంపము లేకుండు నని యేర్పడుచున్నది. అయినప్పటికి ఉష్ణకాలవశముచేగాని ప్రకృతివశముచేగాని యెవనికైన నొకవైద్యునికి స్వేదము, కంపము గలుగును. తత్పరిహారార్థము ప్రత్యేకముగా "అస్వేదవేపథు" అని చెప్పబడినది. స్వేదముతో గూడియుండు వైద్యుడు శస్త్రకర్మ చేయుటకై యత్నించునపుడు వానికి శస్త్రగ్రహణమే సాధ్యము కానేరదు, అటులనే కంపముతో గూడిన వానికిని శస్త్రగ్రహణము సాధ్యము కానేరదు. కావున నా స్వేదకంపములు లేకుండుట యుక్తము.

### లలాటాదులయందు ఛేదనక్రమము

తిర్యక్ఛింద్యాల్లలాటభ్రూదంతవేష్టకజత్రుకే ౨౨
కుక్షికక్షాక్షికూటౌష్ఠకపోలగళవంక్షణే,

లలాటము, కనుబొమలు, దంతవేష్టకము (అనగా దంతముల కాధారములగుచిగుళ్లు), మెడకొంకులు, ఉదరము, చంకలు, అక్షికూటము, పెదవులు, చెక్కిళ్లు కంఠము, గజ్జలు వీనియందు అడ్డముగా ఛేదనము చేయవలయును.

### తిర్యక్ఛేదనిషిద్ధస్థలములు

అన్యత్ర చ్ఛేదనాత్తిర్యక్ సిరాస్నాయువిపాటనమ్. ౨౩

పైజెప్పినవానికంటె నితరప్రదేశములయందు అడ్డముగా ఛేదనము చేయుట వలన సిరలు, స్నాయువులు తెగును.

### శస్త్రప్రయోగానంతరకర్తవ్యము

శస్త్రేఽవచారితే వాగ్భిశ్శీతాంభోభిశ్చ రోగిణమ్,
ఆశ్వాస్య పరితోఽంగుళ్యా పరిపీడ్య వ్రణం తతః. ౨౪
క్షాళయిత్వా కషాయేణ ప్లోతేనాంభోఽపనీయ చ,
గుగ్గుల్వగురుసిద్ధార్థహింగుసర్జరసాన్వితైః. ౨౫
ధూపయేత్పటుషడ్గ్రంథానింబపత్రైర్ఘృతప్లుతైః,

శస్త్రము ప్రయోగించునపుడు తత్కాలోచితముగ స్వస్థుడవైతివి. భయపడవలదు అని యీప్రకారముగా మధురమైన వార్తలచేతను, చల్లనినీళ్లను చల్లుటచేతను రోగిని ఓదార్చి ఆవ్రణమును నాల్గు ప్రక్కలయందు వ్రేళ్లచే బిసికి దానియందుండు చీముమొదలగు దోషములను వెలిపరచి పిదప అతిమధురము మున్నగువానిచే సిద్ధము చేయబడిన కషాయముచే గడిగి ప్రత్తినూలుచే నిర్మింపబడిన వస్త్రముచే తుడిచి గుగ్గిలము, అగురు, తెల్లావాలు, ఇంగువ, సర్జరసము, వీనితోఁగూడినదిగను, అధికమైన ఘృతముతోఁ జేర్చబడినదిగ నుండు సైంధవలవణము, నల్లయితివస, వేపాకు వీనిచే నావ్రణమునకు పొగ బట్టవలయును. మఱియు,

'గుగ్గుల్వాదిభిరేవం శయనాసనాది ద్విరహ్నో ధూపయేత్''

అని యష్టాంగసంగ్రహమునందున్నది. కావున పైజెప్పిన గుగ్గిలము మున్నగువానిచే దినమునకు రెండుమార్లు వ్రణమునకు పొగ బట్టుటయేకాక ఆరోగి పరుండు శయనమునకును, ఆస్తరణము మున్నగువానికిని పొగ బట్టవలె నని తెలిసెడి.

### వ్రణమునందు వర్తిప్రయోగము

తిలకల్కాజ్యమధుభి ర్యథాస్వం భేషజేన చ ౨౬
దిగ్ధాం వర్తిం తతో దద్యాత్తైరేవాచ్ఛాదయేచ్చ తామ్,

పిదప యథాక్రమముగా తిలకల్కము, ఘృతము, తేనె, వీనిచే పూయబడిన కార్పాసమయమైన వత్తిని ఆవ్రణములో ప్రవేశింపజేయవలయును. మఱియు నా వ్రణములో వేయబడినవత్తిని ఆతిలకల్కాదులచేతనే మూయవలయును. యథాక్రమ మనగా — వాతవ్రణమునందు తిలపిష్టముచే పూయబడినవత్తిని, పిత్తవ్రణమునందు ఘృతముచే పూయబడినవత్తిని, కఫవ్రణమునందు తేనెచే పూయబడినవత్తిని ప్రవేశింపజేసి మూయవలయు నని యర్థము. సర్వదోషములలో నేక కాలమునందు తిలకల్కము, ఘృతము, తేనె యీ మూటిచే పూయబడినవత్తిని ప్రయోగింపవలయు నని కొందరు వచించెదరు.

### వ్రణాచ్ఛాదనము

ఘృతాక్తైస్సక్తుభిశ్చోర్ధ్వం

వత్తికి పైన ఘృతయుక్తమైన సక్తువులచే మూయవలయును. —

"నాతిభ్రష్టయవసక్తుభిర్ఘృతాక్తైరొచ్ఛజనాం తేఽంభసా దక్షిణాంగుళీభిః సుమృదితైరేవ చ్ఛాదయేత్."

రోగి భుజించినపిదప కొంచెముగ వేయించబడిన యవసక్తువులలో నెయ్యిని జేర్చి ఉదకముతోడ దక్షిణహస్తముయొక్క వ్రేళ్లచే బాగుగ మర్దనముచేసి ఆసక్తువులచే నావత్తిని మూయవలయును. అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడి యున్నది.

### వ్రణబంధనక్రమము

ఘనాం కబళికాం తతః, ౨౭
నిధాయ యుక్త్యా బధ్నీయాత్పట్టేన సుసమాహితమ్,
పార్శ్వే సవ్యేఽపసవ్యే వా నాధస్తాన్నైవ చోపరి. ౨౮

వ్రణములోపల ప్రయోగింపబడినవత్తిని మూసినపిదప అనేకవస్త్రఖండములను చేర్చి సిద్ధముచేయబడిన ఘనమైన కబళికను దానిపై నునిచి దళమైన వస్త్రఖండముచే దోషము, కాలము వీని కనుగుణమైనయుక్తిచేత వామపార్శ్వమునందుగాని, దక్షిణపార్శ్వమునందుగాని వ్రణము నతిజాగ్రత్తతో కట్టవలయును. మఱియును వ్రణము నధోభాగమునందును, ఊర్ధ్వభాగమునందును కట్టం జనదు. దోషము, కాలము వీని కనుగుణమైన యుక్తి యనగా. —

"వాతశ్లేష్మోద్భవాం స్తత్ర ద్విస్త్రిర్వా వేష్టయేద్వ్రణాన్.
సకృదేవ పరిక్షిప్య రక్తపిత్తాభిఘాతజాన్. తథా.
శస్త్రక్షతరుజాయాం తు ప్రతతాయాం యష్టిమధుక సర్పిషా కోష్ణేన వ్రణం సించేత్.
ఉదకుంభాదాపో గృహీత్వా ప్రోక్షయేత్పరిత ఉపచరేత్."

వాతశ్లేష్మములచే జనించిన వ్రణములను వస్త్రపట్టముచే రెండు చుట్లుగాని లేక మూడు చుట్లుగాని చుట్టికట్టవలయును. రక్తపిత్త, అభిఘాతమువలన జనించిన వ్రణములను ఒకే చుట్టుచుట్టి కట్టవలయును. అని అష్టాంగసంగ్రహములో జెప్పబడియున్నది. శస్త్రము యొక్క గాయముచే గలిగిన వ్రణమును ఉష్ణమైన యష్టిమధుకముతో గూడియుండు ఘృతముచే తడుపవలయును. మఱియు ఉదకకుంభములోనుండి జలము నెత్తి దానిపై చల్లుచుండవలయును. అని అష్టాంగసంగ్రహములో జెప్పబడి యున్నది.

### వ్రణబంధనపట్టములు

శుచిసూక్ష్మదృఢాః పట్టాః కబళ్యస్సవికేశికాః,
ధూపితా మృదవశ్లక్ష్ణా నిర్వలీకా వ్రణే హితాః. ౨౯

తెల్లగ, సూక్ష్మముగ, గట్టిగ నుండుపట్టములు వ్రణమునందు హితకరంబులు. ఘృతముచే ధూపము వేయబడినదిగ, మృదువుగ, నునుపు గలదిగ, ముడతలు లేనిదిగ, పట్టవర్తులతోగూడినదిగ నుండు కబళికలు వ్రణమునందు హితకరంబులు.

### వ్రణరక్షణము

కుర్వీతానంతరం తస్య రక్షాం రక్షోనిషిద్ధయే,
బలిం చోపహరేత్తేభ్యః

పిదప శస్త్రకర్మ చేయబడిన రోగియొక్క వ్రణమునందు మాంసమును భుజించు నట్టిరాక్షసులు సోకకుండునటుల రక్ష చేయవలయును. మఱియు నారాక్షసులకును బలుల నియ్యవలయును.

### మూర్ధౌషధధారణము

సదా మూర్ధ్నాఽవధారయేత్. ౩౦
లక్ష్మీం గుహామతిగుహాం జటిలాం బ్రహ్మచారిణీమ్,
వచాం ఛత్రామతిచ్ఛత్రాం దూర్వాం సిద్ధార్థకానపి. ౩౧

సర్వకాలమునందును మునుగుదామర పెక్కతోకపొన్న, మొగలిపొన్న జటామాంసి, బ్రహ్మచారిణి (అన గంటుభారంగి), వస, సదాప, విషాణిక, గరికె తెల్లావాలు అనునీ మహౌషధులను శిరమునందు ధరింపవలయును.

### ప్రణితోపచారము

తతస్స్నేహాదినేహోక్తం తస్యాచారం సమాదిశేత్,

పిదప సాత్రీవ్రణితునికి స్నేహపానవిధియందు చెప్పబడిన "ఉష్ణోదకోపచారీస్యా దిత్యాది" విధుల నుపదేశింపవలయును.

### వ్రణమునందు దివాస్వాపనిషేధము

దివా స్వాపో వ్రణే కండూరాగరుక్ శోఫపూయకృత్. 32

పగటినిద్రచే వ్రణమునందు దురద, ఎఱుపువర్ణము, శూల, శోఫ, చీము ఇవి గలుగును. కాబట్టి వ్రణితుడు పగటినిద్రను వర్జించవలయును.

### వ్రణమునందు స్త్రీదర్శనాదినిషేధము

స్త్రీణాం తు స్మృతిసంస్పర్శదర్శనైశ్చలితస్రుతే,
శుక్రే వ్యవాయజాన్దోషానసంసర్గేఽప్యవాప్నుయాత్, 33

స్త్రీలయొక్క స్మరణము, స్పర్శము, దర్శనము, వీనిచే రేతస్సు స్వస్థానములో నుండి చలించి స్రవించినయెడల స్త్రీయొక్క సంసర్గమైథునమును లేకుండినను, మైథునముచే గలుగునట్టి దోషములు గలుగును. కాబట్టి స్త్రీలయొక్క స్మరణము, దర్శనము, స్పర్శనము మొదలగువానిని వ్రణితుఁడు వర్జించవలయును.

### వ్రణమునందు పథ్యము

భోజనం తు యథాసాత్మ్యం యవగోధూమషష్టికాః
మసూరముద్గతువరీజీవంతీసునిషణ్ణకాః 34
బాలమూలకవార్తాకతండులీయకవాస్తుకమ్,
కారవేల్లకకర్కోటపటోలకటుకాఫలమ్. 35
సైంధవం దాడిమం ధాత్రీ ఘృతం తప్తహిమం జలమ్,
జీర్ణశాల్యోదనం స్నిగ్ధమల్పముష్ణం ద్రవోత్తరమ్. 36
భుంజానో జాంగలైర్మాంసైః శీఘ్రం వ్రణముపోహతి,

యవలు, గోధుమలు, షష్టికములు (అరువదినాళ్లసంబావులు), చిఱుసెనగలు, పెసలు, కందులు మొదలగుధాన్యములను, మనుబాల, చెంచలికూర, లేతముల్లంగి, వంకాయ, చిర్రికూర, చక్రవర్తికూర, కాకరకాయ, ఆగాకర, పొట్లకాయ, తక్కోల పండు అనునీ శాకములను, సైంధవలవణము, దాడింబ, ఉసిరికెకాయ, ఘృతము, బాగుగా కాచి చల్లార్చిన ఉదకము, ప్రాతవియగు శాలితండులముల యన్నము, వీనిని సాత్మ్యానుగుణముగ (ఎవనెవని కెది అభ్యాసమువలన హితముగ నుండునో ఆప్రకార

ముగ) జాంగలమాంసము, స్నేహము వీనితోడ అల్పముగ, ఉష్ణముగ, ద్రవోత్తరముగ భుజించు వ్రణితునికి శీఘ్రముగ వ్రణము ఆరును.

అశితం మాత్రయా కాలే పథ్యం యాతి జరాం సుఖమ్. ౩౭
అజీర్ణే త్వనిలాదీనాం విభ్రమో బలవాన్ భవేత్,
తతశ్శోఫరుజాపాకదాహానాహానవాప్నుయాత్. ౩౮

యుక్తమైనకాలమునందు మితముగ భుజించబడిన పథ్యమైనయాహారము సుఖముగా జీర్ణమును జెందును. కాబట్టి పథ్యకరమైన యాహారమును యుక్తమైన కాలమునందు భుజింపవలయును. అజీర్ణముగ నుండునపుడు వాతాదులకు బలవత్తరమయిన ప్రకోపము, దానిచే శోఫ, శూల, పాకము, సర్వాంగతాపము, కడుపుబ్బరము మొదలగు నుపద్రవములు కలుగును. కావున నెప్పుడును అజీర్ణము గలుగునటుల నాహారాదుల జేయంజనదు

వ్రణమునందు వర్జ్యాహారాదులు

నవధాన్యం తిలాన్ మాషాన్ మద్యం మాంసం త్వజాంగలమ్,
క్షీరేక్షువికృతీరమ్లం లవణం కటుకం త్యజేత్. ౩౯
యచ్చాన్యదపి విష్టంభి విదాహి గురు శీతలమ్,
వర్గోఽయం నవధాన్యాదిర్వ్రణినస్సర్వదోషకృత్. ౪౦

నూతనధాన్యములు, నువ్వులు, మినుములు, మద్యము, జాంగలదేశమునందు జనించు జంతువులకన్న నితరములగు జంతువులమాంసము, క్షీరవికారము, ఇక్షువికారము, అమ్లము, లవణము, కారము, మలబంధకరముగ, విదాహిగ, గురువుగ నుండు నితరమయినవస్తువులు, శీతోదకము మొదలగు శీతలమైనవస్తువులు, వీనిని వ్రణితుడు త్యజింపవలయును. ఈనవధాన్యాదివర్గము వ్రణితునికి సర్వదోషములు గలుగజేయును.

"నవధాన్యం విష్టంభి మాషకలాయకులుత్థనిష్పావశింబీశీతాంబుమద్యేక్షుక్షీరపిష్టతిలవికృతిశుష్కశాకపిణ్యాకహరితకామ్లలవణకటుకక్షారవృష్యామిషాణి వర్జయేత్." నూతనధాన్యము, మలబంధకరములగు వస్తువులు, మినుములు, బోడసెనగలు, ఉలవలు, అనుములు, కందులు మొదలగు కాయధాన్యములు శీతోదకము, మద్యము, చెఱకు, పాలు, పిండి, నువ్వులు వీనివికారములు, ఎండినశాకములు, తెలికపిండి, మునగాకు, అమ్లము, లవణము, కారము, క్షారము, శుక్రవృద్ధికరమయిన మాంసములు వీనిని వర్జింపవలయును. అని అష్టాంగసంగ్రహమునందు చెప్పబడి యున్నది.

మద్యం తీక్ష్ణోష్ణరూక్షామ్లమాశు వ్యాపాదయేద్వ్రణమ్,

తీక్ష్ణముగ, ఉష్ణముగ, రూక్షగ, అమ్లముగ నుండు మద్యము శీఘ్రములో వ్రణమునం దాపత్తును కల్గించును. తీక్ష్ణాదిగుణములతోగూడిన మద్యము వ్రణితున కుపయోగింపంజనదు.

మరియు "సస్నేహం మధురప్రాయం నాతితీక్ష్ణమకర్కశమ్,
తమయత్సుఖపేయం చ మార్ద్వీకేషు తదుత్తమమ్."

స్నేహముతోగూడినదిగ, మధురముగ, అతితీక్ష్ణముగ, అతికార్కశ్యములేనిదిగ, చేటగ, సుఖముగ పానముచేయతగినదిగ నుండు మద్యము మార్ద్వీకమద్యములలో ఉత్తమమైన దని తంత్రాంతరమునందు చెప్పబడి యున్నది. కాబట్టి మార్ద్వీకాది ప్రాయముగ నుండు మద్యము, రోధ్రాసవము మొదలగుమద్యము ఇవి సాత్మ్యముగ నుండుటచే వానిని కొంచెముగా పానము చేయవచ్చును.

వ్రణోపచారము

వాలోశీరైశ్చ వీజ్యేత న చైనం పరిఘట్టయేత్. ౪౧
నితుదేన్న చ కండూయే చ్ఛేష్టమానశ్చ పాలయేత్,
స్నిగ్ధవృద్ధద్విజాతీనాం కథాశ్శృణ్వన్మనః ప్రియాః. ౪౨
ఆశావాన్వ్యాధిమోక్షాయ క్షిప్రం వ్రణమపోహతి,

వాలము, వట్టివేరు, వీనిచే వ్రణమును విసరవలయును. వ్రణముపై నదుమకూడదు. పొడవ కూడదు. గోక కూడదు. ఏదైననొకవ్యాపారమునుచేయించుచునే ఆవ్రణమును కాపాడవలయును. స్నేహితులు, వృద్ధులు, బ్రాహ్మణులు వీరిమూలముగా మనస్సుకు ప్రియమయిన కథలను వినుచు రోగవిమోచనమునం దాశ గలవ్రణితుడు శీఘ్రముగా వ్రణమును పోగొట్టుకొనును.

ద్వితీయదివసమున వ్రణప్రక్షాళననిషేధము

తృతీయేఽహ్ని పునః కుర్యాద్వ్రణకర్మ చ పూర్వవత్. ౪౩
ప్రక్షాళనాది దివసే ద్వితీయే నాచరేత్,

మూడవదినమునందు మరల ప్రక్షాళనాదికర్మలను మునుపటివలెనే చేయవలయును రెండవనాడు వ్రణప్రక్షాళనాది కృత్యములను చేయంజనదు.

తథా,

తీవ్రవ్యథో విగ్రథితశ్చిరాత్సంరోహతి వ్రణః. ౪౪

రెండవదినమునందు ప్రక్షాళనము చేసినయెడల వ్రణము తీవ్రమైన ఉపద్రవములు గలదిగ, గ్రంథులతోగూడినదగనై చిరకాలమునకు ఆరును.

వ్రణవర్జ్యపదార్థాదులు

స్నిగ్ధాం రూక్షాం శ్లథాం గాఢాం దుర్న్యస్తాం చ వికేశికామ్,

వ్రణే న దద్యాత్కల్కం చ స్నేహాత్క్లేదో వివర్ధతే. ౪౫
మాంసచ్ఛేదోఽతిరౌక్ష్యాత్స్యాద్దరణం శోణితాగమః,
శ్లథాతిగాఢదుర్న్యస్తైర్వ్రణవర్త్మావఘర్షణమ్. ౪౬

స్నిగ్ధముగ, రూక్షగ, శిథిలముగ, గట్టిగ, ప్రవేశించుట కసాధ్యముగ పలువిధములచీలియున్నదిగనుండువత్తిని వ్రణమునందుంచంజనదు. అటులనే అతిస్నిగ్ధముగ, అతి రూక్షగ, శిథిలముగ, గట్టిగ నుండుకల్కమును వ్రణములో నుంచజనదు. ద్రవయుక్త వస్తువుతో చేర్చి పిష్టము చేయబడిన ఔషధము కల్కమని చెప్పబడును. "అతిస్నేహాత్ క్లేదః" అధికస్నేహముచే వ్రణమున చెమ్మకలుగునని అష్టాంగసంగ్రహమునందు జెప్పబడియున్నది. పైజెప్పినవత్తి అతిస్నేహముతోగూడియుండుటవలన పూయాదిద్రవమును వృద్ధిజేయును. మఱియు నావత్తి అతిరూక్షగనుండుటవలన మాంసచ్ఛేదము, తీవ్రమైనబాధ, దరణము, విశేషముగా రక్తస్రావము వీనిని గలుగజేయును. వత్తి శిథిలముగ, అతిలావుగ, లోనప్రవేశింపజేయుట కశక్యముగ నుండుటవలన వ్రణమార్గమున నొరిపిడికల్గి వ్రణమును పెద్దదిగ జేయును. కావున పైజెప్పిన యతిస్నేహాదిదోషములు లేకయుండు వర్త్యాదులను వ్రణమున నుంచవలెనను.

—— వికేశికావర్తిప్రయోజనము ——

సపూతిమాంసం సోత్సంగం సంగతిం పూయగర్భిణమ్,
వ్రణం విశోధయేచ్ఛీఘ్రం స్థితా వ్యాంతర్వికేశికా. ౪౭

దుర్గంధమైన మాంసముతోగూడినదిగ, నడుమ నున్నమైనదిగ పలుదెరంగులవ్యాపించుస్వభావముగలదిగ, లోన చీము గలదిగనుండు వ్రణమును వికేశిక యనువత్తి శీఘ్రములో శుద్ధి జేయును. కాబట్టి పైజెప్పిన లక్షణములుగల వ్రణములలో వికేశిక యను వత్తిని వ్రణములోపల ప్రయోగింపవలయును.

—— ఛేదింపబడిన అపక్వ వ్రణోపచారము ——

వ్యమ్లం తు పాటితం శోఫం పాచనైస్సముపాచరేత్,
భోజనైరుపనాహైశ్చ నాతివ్రణవిరోధిభిః. ౪౮

పక్వమైన వ్రణమును అపక్వమని అజ్ఞానముచే ఛేదించినయెడల వ్రణమునకు మిగుల అవిరోధిగ, పాచనముగ (అనగా ఆమ్లకటుకతీక్ష్ణ, ఉష్ణలవణప్రాయముగ) నుండు భోజనములు ఉపనాహములు వీనిచే నుపచరింపవలయును.

—— కుట్టకగిన వ్రణములు ——

సద్యస్సద్యోవ్రణాన్ సీవ్యేద్వివృతానభిఘాతజాన్,

మేదోజాన్ లిఖితాన్ గ్రంథీన్ హ్రస్వాః పాల్యోశ్చకర్ణయోః. ౪౯
శిరోఽక్షికూటనాసౌష్ఠగండకర్ణోరుబాహుషు,
గ్రీవాలలాటముష్కస్ఫిజ్మేఢ్రపాయూదరాదిషు. ౫౦
గంభీరేషు ప్రదేశేషు మాంసలేష్వచలేషు చ

కర్ణపాళులు (అనగా చెవితమ్మెలు), శిరస్సు, అక్షికూటము, నాసికము, పెదవులు, చెక్కిళ్ళు, చెవులు, తొడలు, హస్తములు, కంఠము, లలాటము, వృషణములు, పిఱుదులు, మేఢ్రము, గుదము, ఉదరము మొదలగు నవయవములయందును; గంభీరముగను, అధికమాంసముగలవిగను, చలింపకుండునవిగ నుండు ప్రదేశమునందును అభిఘాతముచే జనించి విస్తీర్ణమయిన ముఖముగల సద్యోవ్రణములను తత్క్షణముననే సూదులచే కుట్టవలయును. మఱియు మేదస్సుచే గలిగిన గ్రంథులను గీచి తోడనే సూదులచే కుట్టవలయును. "వివృతాన్" అని చెప్పినందుచే సంకోచమైన ముఖముగల వ్రణములను కుట్టకూడదని భావంబగుచున్నది. అభిఘాతముచే గలిగిన సద్యోవ్రణములు చిరకాలమైనచో వానినికూడ కుట్టకూడదని తెలియపరచుటకై "సద్యః" అనుపదము ప్రయోగింపబడినది.

కుట్టతగని వ్రణములు

న తు వంక్షణకక్షాదావల్పమాంసచలే వ్రణాన్, ౫౧
వాయునిర్వాహిణశ్శల్యగర్భాన్ క్షారవిషాగ్నిజాన్,

అల్పమాంసము గలదిగ, చంచలముగనుండుగజ్జలు, చంకలు మొదలగు ప్రదేశములయం దభిఘాతముచే గలిగిన వ్రణములను కుట్టంజనదు. అటులనే వాయువును వెలిపరచునట్టి వ్రణములను లోన శల్యముతోగూడియుండు వ్రణములను, క్షారవిషాగ్నులచేగలిగిన వ్రణములను కుట్టంజనదు. విశేషమాంసముగల ఉదరాది ప్రదేశములయందు జనించియుండు వ్రణములను కుట్టవలయునని చెప్పినందుచేతనే అల్పమాంసముగల ప్రదేశములయం దుండు వ్రణములను కుట్టకూడదని అర్థము సిద్ధం బగుచున్నది. అయినప్పటికి అల్పమాంసము గలదిగ, చంచలముగ నుండునట్టి ప్రదేశములయందు అభిఘాతమువలన జనించిన వ్రణముల నెపుడును కుట్టంజనదని తెలియపరచుటకై యీశ్లోకము చెప్పబడినది.

వ్రణములను కుట్టవలసిన క్రమము

సీవ్యేచ్చలాస్థిశుష్కాస్రతృణరోమాపనీయ తు. ౫౨
ప్రలంబి మాంసం విచ్ఛిన్నం నివేశ్య స్వనివేశనే,
సంధ్యస్థ్యవస్థితే రక్తే స్నాయ్వా సూత్రేణ వల్కలైః. ౫౩
సీవ్యేన్న దూరే నాసన్నే గృహ్ణన్నాల్పం న వా బహు,

స్థానములోనుండి చలించిన యస్థులు, ఎండిన రక్తము, తృణము, రోమములు వీటిని యెత్తి పారవేసి శస్త్రాదులచే కోయబడి వ్రణమందు మాంసము, సంధిని, అస్థిని, స్వస్థానమునందుంచి రక్తమును స్రవింపజేయక పూర్వమే స్నాయువుచేతగాని, పిండి బండ మొదలగు వృక్షములయొక్క నారచేచేయబడిన దారముచేతగాని కుట్టవలయును. కుట్టునపుడు అతిదూరమునందును, అతిసమీపమునందును కుట్టజనదు. మఱియును వ్రణభాగమును మిగుల నల్పముగగాని మిక్కిలి అధికముగగాని గ్రహించి కుట్టజనదు.

## సేవనానంతరకర్తవ్యము

సాంత్వయిత్వా తతశ్చిత్తం వ్రణే మధుఘృతప్లుతైః. ౫౪
అంజనక్షౌమజమషీ ఫలినీశల్లకీఫలైః,
సరోధ్రమధుకైర్దిగ్ధే యుంజ్యాద్బంధాది పూర్వవత్. ౫౫

అటుల కుట్టిన పిదప శీతోదకమును పైన చల్లుట, విసనకఱ్ఱలచే విసురుట మొదలగువానిచే రోగిని ఓదార్చి, తేనె ఘృతము వీనితోడ జేర్చి కలియబెట్టబడిన అంజనము, వెలిపట్టువస్త్రముయొక్క మషి, ప్రేంకణము, అడుగుపండు, లొద్దుగు, ఇప్ప వీనిచే వ్రణమునకు లేపనముజేసి పై జెప్పిన ప్రకారము కషాయముచే ప్రక్షాళనమును కబళిక మొదలగువానిని ప్రయోగించి యుక్తముగ కట్టవలెను.

## రక్తరహితౌష్ఠ వ్రణసీవనక్రమము

వ్రణో నిశ్శోణితౌష్ఠో యః కించిదేవావలిఖ్య తమ్,
సంజాతరుధిరం సీవ్యేత్సంధానం హ్యస్య శోణితమ్ ౫౬

వ్రణముయొక్క ఓష్ఠముల (అంచుల) యందు రక్తములేక యెండి యున్నపుడు శస్త్రముచే నొకింత గీచి రక్తము స్రవింపుచు[illegible]ను కుట్టవలయును. అది యేల యనగా—రక్తము వ్రణమును సంధాన[illegible]

## వ్రణబంధ[illegible]

బంధనాని తు దేశాదీన్ వీక్ష్య [illegible]షు చ,

ఆవికాజినము మొదలగుబంధములను దేశ[illegible]ల నాలోచించి ఆయా వ్రణమునకు తగినటుల చేయవలయును.

## వ్రణబంధనస్వరూ[illegible]

[illegible]క్షౌమకౌశేయముష్ణం క్షౌమ[illegible]. ౫౭
శీత[illegible]తూలసంతానకార్పాస[illegible]జమ్,

ఆవికా[illegible] (అనగా మేకచర[illegible]యము (అనగా పట్టు పురుగుల

వలన బుట్టేబట్టలు) ఇవి ఉష్ణవీర్యము గలవి. క్షౌమము (అనగా వెలిపట్టువస్త్రము) శీతవీర్యము గలది. తూలసంతాన మను బంధనము (అనగా బూరుగుదూది సూత్రములచే జేయబడిన బంధనము) ప్రత్తినూలుచే జేయబడిన బంధనము స్నాయువుచే జేయబడిన బంధనము, పట్టలచేజేయబడిన బంధనము ఇవి శీతోష్ణవీర్యము గలవి.

**వ్రణబంధనోపయుక్తద్రవ్యములు**

తామ్రాయస్త్రపుసీసాని వ్రణే మేదఃకఫాధికే. ౫౮
భంగే చ యుంజ్యాత్ఫలకం చర్మవల్కకుశాది చ,

మేదస్సు, కఫము ఇవి అధికముగనుండు వ్రణములలో తామ్రము, ఇనుము, తగరము, సీసము, వీటిని లేఖనార్థ ముపయోగింపవలయును. విరిగిన అంగములను బంధించుటలో పైజెప్పిన తామ్రాదులను మ్రాను మొదలగువానిపలకలు, చర్మము, వృక్షముల యొక్కపట్టలు, నదురు మొదలగువానిబద్దలు వీని నుపయోగింపవలయును.

**వ్రణబంధభేదములు**

స్వనామాను గతాకారా బంధాస్తు దశ పంచ చ ౫౯
కోశస్వస్తికముత్తోళి చీనాదామానువేల్లితమ్,
ఖట్వావిబంధస్థగికా వితానోత్సంగగోఫణాః. ౬౦
యమకం మండలాఖ్యం చ పంచాంగీ చేతి యోజయేత్,
యో యత్ర సునివిష్టః స్యాత్తం తేషాం తత్ర బుద్ధిమాన్. ౬౧

కోశను, స్వస్తికము, ముత్తోళి, చీనము, దామము, అనువేల్లితము, ఖట్వము, విబంధము, స్థగికా, వితానము, ఉత్సంగము, గోఫణము, యమకము, మండలాఖ్యము, పంచాంగి అనియు బంధభేదములు పదునైదు విధంబుల నుండును. అయ్యవి తమ పేరుకు తగిన యాకారములుగలవి [illegible] అట్టికోశబంధము మొదలగు పదునైదు బంధములలో దేని నేస్థలమునందు [illegible] తంబుగ నుండునో దానిని బుద్ధిమంతుడగువైద్యుడాస్థలమునం దుపయోగి[illegible].

అంగుష్ఠ [illegible] బంధము [illegible] ప్రస్లిగణుపులయందును, స్వస్తికమును బంధనమును సంధి, [illegible] మలు, స్తనాంతరము (అనగా రెండు స్తనములకు మధ్యప్రదేశము), చం[illegible] ములు, చెక్కిళ్లు, కర్ణములు వీనియందును; ముత్తోళిని మెడ మేఢ్రము [illegible] చీనమును కంటికొనలయందును; దామమును సంధి, గజ్జలు మొదలగుప్రదేశ[illegible] అనువేల్లితమును చేతులు [illegible] మొదలగు శాఖలయందును; [illegible] చెక్కిళ్లు వీనియందును; [illegible] మును ఉదరము,

తొడలు, పీపు వీనియందును; స్థగికను బొటనవ్రేళ్లు, మేఢ్రము, అంత్రవృద్ధి, మూత్రవృద్ధి వీనియందును; వితానమును శిరము మొదలగు గొప్ప అంగములయందును; ఉత్సంగమును వ్రేలుచుండు బాహువులమొదలగు అంగములయందును, గోఫణమును నాసికము, పెదవులు, గడ్డము, తొడలు వీనియందును; యమకమును జంటవ్రణములయందును; మండలమును గుండ్రముగనుండు అంగములయందును; పంచాంగిని మెడకొంకులకు పై భాగము నందును నుపయోగింపవలయు ననుట.

### దృఢబంధనార్హస్థానములు

బధ్నీయాద్గాఢమూరుస్ఫిక్కక్షావంక్షణమూర్ధసు,

తొడలు, పిఱుదులు, చంకలు, గజ్జలు, శిరస్సు వీనియందు దృఢముగా కట్టవలయునే కాని ఒదులుగా కట్టజనదు.

### సమబంధనార్హస్థానములు

శాఖావదనకర్ణోరః పృష్ఠపార్శ్వగళోదరే ౬౨
సమం మేహనముష్కే చ

కాళ్లు మొదలగుశాఖలు, ముఖము, కర్ణములు, ఱొమ్ము, పృష్ఠము, పార్శ్వములు, కంఠము, ఉదరము, మేఢ్రము, వృషణము వీనియందు సమముగా కట్టవలయును.

### శిథిలబంధనార్హస్థానములు

నేత్రే సంధిషు చ శ్లథమ్,

నేత్రములు, సంధులు, వీనియందు ఒదులుగా కట్టవలయును.

### వాతశ్లేష్మజ వ్రణబంధనక్రమము

బధ్నీయాచ్ఛిథిలస్థానే వాతశ్లేష్మోద్భవే సమమ్ ౬౩
గాఢమేవ సమస్థానే భృశం గాఢం తదాశ్రయే,

శిథిలమైనబంధము చెప్పబడిన స్థానమునందు గలిగెడు వాతశ్లేష్మ వ్రణములను సమముగా కట్టవలయునే కాని గట్టిగను, శిథిలముగను కట్టంజనదు. సమమయిన బంధము చెప్పబడిన స్థానమునందు గలిగెడు వాతశ్లేష్మవ్రణములను మిగుల దృఢముగా కట్టవలయును. దృఢబంధము చెప్పబడిన స్థానములయందుగలిగెడు వాతశ్లేష్మవ్రణములను మిక్కిలి దృఢముగా కట్టవలయును.

శీతే వసంతే చ తథా మోక్షణీయా త్ర్యహాత్త్ర్యహాత్, ౬౪

వాతశ్లేష్మములచేగలిగిన వ్రణములను హేమంతశిశిర వసంతకాలములయందు మూడు దినములకొకమారు విప్పి కట్టవలయును.

### పిత్తరక్తజ వ్రణబంధనక్రమము

పిత్తరక్తోత్థయోర్బన్ధో గాఢస్థానే సమో మతః,
సమస్థానే శ్లథో నైవ శిథిలస్యాశయే తథా. ౬౫

దృఢబంధము చెప్పబడినస్థానమునందు గలిగెడు పిత్తరక్త వ్రణములకు సమమయినబంధము చేయవలయును. సమమైనబంధము చెప్పబడియుండు స్థానమునందు (అనగా శాఖావదనాదులయందు) పిత్తరక్తముచే గలిగిన వ్రణములకు శిథిలమయినబంధము చేయవలయును. శిథిలమయినబంధము చెప్పబడిన స్థానమునందు బంధమే చేయంజనదు.

సాయంప్రాత స్తయోర్మోక్షో గ్రీష్మే శరది చేష్యతే,

పిత్తరక్తములచే జనించిన వ్రణములను సాయంప్రాతఃకాలములయందు విప్పి కట్టవలయును. ఇతరదోషములచే జనించిన వ్రణములనుకూడ గ్రీష్మశరదృతువులందు సాయంప్రాతఃకాలములయందు విప్పి కట్టవలయును.

### బంధనరహిత వ్రణోపద్రవములు

అబద్ధో దంశమశకశీతవాతాదిపీడితః. ౬౬
దుష్టీభవేచ్చిరం చాత్ర న తిష్ఠేత్స్నేహభేషజమ్,
కృచ్ఛ్రేణశుద్ధిం రూఢిం వా యాతి రూఢో వివర్ణతామ్. ౬౭

కట్టబడకుండువ్రణము ఈఁగలు, దోమలు, శీతలము, వాతము, పొగ, ధూళి వీనిచే పీడింపబడినదై దుష్టముగ నగును. మఱియు నావ్రణమునందు బంధము లేకయె ఉపయోగింపబడిన వ్రణహారములగు స్నేహాద్యౌషధములు చిరకాలమువరకు నుండ నేరవు. బంధనమును చేయక బాగుగానుపచరించినప్పటికి వ్రణము బహుకష్టముమీద శుద్ధిని జెంది ఆరును. కష్టముచే నావ్రణము ఆరినను ఆవ్రణము కల్గినమచ్చ శరీరమునకంటె విరుద్ధమైన వర్ణమును జెందును.

### వ్రణబంధనగుణము

బద్ధస్తు చూర్ణితో భగ్నో విశ్లిష్టః పాటితోఽపి వా,
ఛిన్నస్నాయుసిరోఽప్యాశు సుఖం సంరోహతి వ్రణః. ౬౮
ఉత్థానశయనాద్యాసు సర్వేహాసు న పీడయేత్,

కట్టు కట్టబడినవ్రణము అస్థినాశ్రయించినదిగ, భగ్నముగ, సంధిస్థానమునకంటె నితరమయినస్థానము నాశ్రయించినదిగ, పాటితముగ, సర్వప్రదేశము నాశ్రయించినదిగ, స్నాయువు, సిరలు ఛేదించబడినదిగ నుండినను బంధనప్రభావమునంజేసి

సుఖముగ నారిపోవును. లేచుట, పరుండుట మొదలగు సర్వచేష్టలయందు వ్రణమును పీడింపజనదు.

బంధనసాధ్యవ్రణములు

ఉద్వృత్తౌష్ఠస్సముత్సన్నో విషమః కఠినోఽతిరుక్. ౧౯
సమో మృదురరుక్క్షిప్రం వ్రణశ్శుధ్యతి రోహతి,

ఊర్ధ్వమునందు వర్తులాకారమయిన అంచులుగల వ్రణము, చుట్టు ఉన్నతముగ నుండు వ్రణము, విషమమయిన యాకారముగల వ్రణము, కఠినమైన వ్రణము, తీవ్రమైనబాధగల వ్రణము, యీ ౕ విధములగు వ్రణములును కట్టుగట్టుటవలన సమముగ, మృదువుగ, బాధరహితముగ నై శీఘ్రములో శుద్ధిజెంది మానును.

స్థిరాదివ్రణౌషధోపయోగము

స్థిరాణామల్పమాంసానాం రౌక్ష్యాదనుపరోహతామ్. ౨౦
ప్రచ్ఛాద్యమౌషధం పత్త్రైర్యథాదోషం యథర్తు చ,
అజీర్ణతరుణాచ్ఛిద్రైస్సమంతాత్సునివేశితైః ౨౧
ధౌతైరకర్కశైః క్షీరిభూర్జార్జునకదంబజైః,

స్థిరములుగ (అనగా దీర్ఘకాలమువరకు మానక బాధించునవిగ) స్వల్పమైన మాంసముగలవిగ, రౌక్ష్యమువలన మాననివిగ నుండు వ్రణములపై కల్కస్నేహాదిరూపమైన ఔషధము నునిచి, రాలనివిగ, నూతనముగ, ఛిద్రములు లేనివిగ, ఉదకాదులచే నిర్మలముగ జేయబడినవిగ, కాఠిన్యరహితముగనుండు జిల్లేడు, భూర్జపత్రి, మద్ది, కడిమి వీనియాకులను వ్రణముపై నంతట నునిచి వాతాదిదోషములు, ఋతుభేదములు వీని కనుగుణముగ (అనగా వాతవ్రణములో హేమంతశిశిర ఋతువులయందు స్నిగ్ధముగ, ఉష్ణముగనుండు పత్రములచేతను, పిత్తవ్రణములో గ్రీష్మకాలమునందు శీతస్వభావముగల పత్రములచేతను, కఫవ్రణములో ఉష్ణకాలమునందు రూక్షగ, ఉష్ణముగనుండు పత్రములచేతను) మూయవలయును. ఇటులనే సాధారణమయిన కాలమునందును, మిశ్రదోషమునందును, ఊహించుకొనవలయును.

బంధనార్హవ్రణములు

కుష్ఠినామగ్నిదగ్ధానాం పిటికామధుమేహినామ్. ౨౨
కర్ణికాశ్చోందురువిషే క్షారదగ్ధా విషాన్వితాః,
న మాంసపాకే చ బధ్నీయాద్గుదపాకే చ దారుణే. ౨౩
శీర్యమాణాస్సరుగ్దాహాశ్శోఫావస్థావిసర్పిణః,

కుష్ఠరోగియొక్క వ్రణములను, అగ్నిదాహమువలన గలిగిన వ్రణములను, పిటిక, మధుమేహము గలవారియొక్క వ్రణములను, ఎలుకవిషముచేగలుగు కోశరూప

మైన కర్ణికలను, క్షారధాహముచే గలిగిన వ్రణములను, విషముతోఁ గూడియుండు వ్రణములను, మాంసపాకమువలనఁ గలిగిన వ్రణములను, దారుణమైన గుదపాకమువలన గలిగిన వ్రణములను, మాంసము కుళ్ళి రాలుచు శూల, సర్వాంగతాపము, శోఫ, విసర్పావస్థ వీనితోఁ గూడియుండు వ్రణములను బంధింపఁజనదు.

## అరక్షితవ్రణోపద్రవములు

అరక్షయా వ్రణే యస్మిన్ మక్షికా నిక్షిపేత్క్రిమీన్. ౭౪
తే భక్షయంతః కుర్వంతి రుజాశోఫాస్రసంస్రవాన్,

పైజెప్పబడిన క్రమప్రకారము కట్టుగట్టి విధ్యుక్తప్రకారము జాగ్రత్తతో కాపాడక వ్రణముల నుపేక్షించువెడ నట్టి వ్రణద్వారమునందు ఈగలు ముసరి పురుగుల గల్గించును. అట్టి క్రిములు వ్రణమునందలి మాంసాదులఁదినుచు నొప్పిని మంటను వాపును కల్గించి నెత్తురును స్రవింపజేయును.

## క్రిమియుక్తవ్రణచికిత్స

సురసాది ప్రయుంజీత తత్ర ధావనపూరణే. ౭౫
సప్తపర్ణకరంజార్కనింబరాజాదనత్వచః,
గోమూత్రకల్కితో లేపస్సేకః క్షారాంబునా హితః. ౭౬
ప్రచ్ఛాద్య మాంసపేశ్యా వా వ్రణం తానాశు నిర్హరేత్,

అట్టి వ్రణములో సురసాదిగణమును ప్రక్షాళనపూరణములయం దుపయోగించవలయును. మఱియు నా వ్రణమునందు ఏడాకు లరటి, క్రానుగు, జిల్లేడు, వేము, చారచెట్టు వీనిపట్టలను గోమూత్రముచే నూరి కల్కముచేసి లేపనము చేయుటయేగాక క్షారోదకముచే సేకమును చేయుట హితకరము. లేక యా వ్రణమును మాంసపేశిచే మూసి క్రిములను శీఘ్రముగా బయలుపరచవలయును.

## వ్రణమును త్వరపడి యార్పరాదనుట

న చైనం త్వరమాణోఽంతస్సదోషముపరోహయేత్. ౭౭
సోఽల్పేనాప్యపచారేణ భూయో వికురుతే యతః,

వ్రణములోపల పూయాదిదోషములతో గూడియుండునపుడు వైద్యుడు త్వరపడి దాని మానుపఁజనదు. ఏలయనగా — ఆ వ్రణము తత్కాలమునం దారినను లోన దోషముండుటచే స్వల్పమయిన అపచారముచేతనే మరల వికారమును జెందును.

## వ్రణరోపణానంతరవర్జనియమములు

రూఢేఽప్యజీర్ణవ్యాయామవ్యవాయాదీన్వివర్జయేత్. ౭౮

హర్షం క్రోధం భయం వాపి యావదాస్థైర్యసంభవాత్,
ఆదరేణానువర్త్యోఽయం మాసాన్ షట్ సప్త వా విధిః. ౭౯

వ్రణము మానియుండినను అజీర్ణకరమయిన వస్తువులు, వ్యాయామము, మైథునము, సంతోషము, కోపము, భయము, వీనిని 6 లేక 7 మాసములవరకుగాని లేక బలము గలుగునంతవరకుగాని వర్జింపవలయును.

## అనిర్దిష్ట వ్రణచికిత్సాప్రకారము

ఉత్పద్యమానాసు చ తాసుతాసు వార్తాసు దోషాదిబలానుసారీ,
తైస్తైరుపాయైః ప్రయతశ్చికిత్సేదాలోచయన్విస్తరముత్తరోక్తమ్.

ఆయాయవస్థలు గలుగుచు నుండగా వాతాదిదోషములు, దేశము, కాలము, వీనిబలము ననుసరించువాడును, జాగ్రతతో గూడినవాడునునగు వైద్యుడు ఉత్తరతంత్రములో వ్రణభంగవిధానమునందు సవిస్తరముగ జెప్పియుండు విషయమును బాగుగా పర్యాలోచనచేసి ఆయా వ్రణములకు జెప్పియుండు ఉపాయములచే చికిత్స జేయవలయునేకాని స్వేచ్ఛగా నేదియును చేయంజనదు.

ఏకోనత్రింశాధ్యాయము, ముగిసెను.

# త్రింశాధ్యాయము



అపి శస్త్రసాధ్యములగురోగములు పాటనాదిశస్త్రకర్మలచే చికిత్స చేయంబడు నట్లనే క్షారాగ్నికర్మలచేతను చికిత్సచేయందగును. కాబట్టి శస్త్రవిధ్యధ్యాయానంతరము క్షారాగ్నికర్మవిధ్యధ్యాయము చెప్పబడుచున్నది.

## క్షారాగ్నికర్మవిధ్యధ్యాయప్రారంభము

సూ॥ అథాతః క్షారాగ్నికర్మవిధిమధ్యాయం వ్యాఖ్యాస్యామః,
ఇతిహ స్మాహురాత్రేయాదయో మహర్షయః.

శస్త్రవిధ్యధ్యాయానంతరము, క్షారకర్మ అగ్నికర్మ వీనివిధిని తెలియజేసెడు క్షారాగ్నికర్మ విధ్యధ్యాయమును వివరించెదము. క్షారాగ్నికర్మలలో క్షారము బాహ్యాభ్యంతరములయందు నుపయోగింపబడుటచే తొలుత జెప్పబడుచున్నది.

## క్షారప్రాశస్త్యము

సర్వశస్త్రానుశస్త్రాణాం క్షారశ్శ్రేష్ఠో బహూని యత్,
ఛేద్యభేద్యాది కర్మాణి కురుతే విషమేష్వపి. ౧
దుఃఖావచార్యశస్త్రేషు తేన సిద్ధిమయాత్సు చ,
అతికృచ్ఛ్రేషు రోగేషు యచ్చ పానేఽపి యుజ్యతే. ౨

సమస్తమైన శస్త్రములు, అనుశస్త్రములు వీనిలో క్షారము మిగుల శ్రేష్ఠంబైనది. ఏల యనగా—క్షారము ఛేద్యము, భేద్యము, లేఖనము, పాటనము మొదలగు ననేకకర్మలను జేయును. బహుకష్టముమీద శస్త్రప్రయోగముచేయతగిన నాసార్శస్సు అర్బుదము మొదలగురోగములయందును, హెచ్చుతక్కువలుగనుండు ప్రదేశములయందును, శస్త్రకర్మచే నివృత్తించకుండునవియును, తఱుచుగా ప్రకోపమును జెంది అతి కష్టసాధ్యముగ నుండునవియు నగు దుష్టవ్రణాది రోగములయందును, క్షారము ఉపయోగించతగినదిగ నుండును. మఱియు నాక్షారము శరీరాంతర్గత రోగశాంత్యర్థమై పానవిషయమునందును ఉపయోగింపబడుచున్నది. ("పానేఽపి" అను అపి శబ్దమువలన బాహ్యరోగనివృత్త్యర్థమై లేపనమునందుకూడ క్షారము ఉపయోగింపబడునని యర్థమగుచున్నది.) కావున పలువెరంగులైన శస్త్రములలోను అనుశస్త్రములలోను క్షారము మిక్కిలి ప్రశస్తమైనదని భావము.

## అర్శోరోగాదులయందు క్షారపానము

ప పేయోఽర్శోఽగ్నిసాదాశ్మగుల్మోదరగరాదిషు,

మఱియు సాక్షారము అర్శస్సు, అగ్నిమాంద్యము, అశ్మరి, గుల్మము, ఉదర రోగము, విషము, †ఆనాహము, శూల మున్నగు రోగములయందు పానము చేయతగి నదిగ నుండును.

## మషాదిరోగములయందు క్షారలేపనము

యోజ్యస్త్వాక్షారో మషశ్విత్రబాహ్యార్శఃకుష్ఠసుప్తిషు. 3
భగందరా*ర్బుదగ్రంథినాడీదుష్టవ్రణాదిషు,

మఱియు సాక్షారము మషము, శ్విత్రము, బాహ్యార్శస్సు, కుష్ఠము, సుప్తి రోగము, భగందరము, అర్బుదము, గ్రంథి, దుష్టమయిన నాడీవ్రణము వీనియందు లేపనరూపముగ నుపయోగింపతగినది. "నాడీవ్రణాది" అను ఆదిశబ్దమువలన చర్మము, కిలాసము, వర్త్మము, తిలకము మొదలగురోగములయందును క్షారలేపనము చేయవలయు నని అర్థం బగుచున్నది.

## పిత్తాదిరోగములయందు క్షారనిషేధము

న తూభయోఽపి యోక్తవ్యః పిత్తే రక్తే బలేఽబలే. ౪
జ్వరేఽతిసారే హృన్మూర్ధరోగే పాండ్వాం తథాఽరుచౌ,
తిమిరే కృతసంశుద్ధౌ శ్వయథౌ సర్వగాత్రగే. ౫
భీరుగర్భిణ్యృతుమతీప్రోద్వృత్తఫలయోనిషు,
అజీర్ణేఽన్నే శిశౌ వృద్ధే ధమనీసంధిమర్మసు. ౬
తరుణాస్థిసిరాస్నాయుసేవనీగలనాభిషు,
దేశేఽల్పమాంసే వృషణమేఢ్రస్రోతోనఖాంతరే ౭
వర్త్మరోగాదృతేఽక్ష్ణోశ్చ శీతవర్షోష్ణదుర్దినే,

పైజెప్పినప్రకారము పానలేపనభేదములచే ద్వివిధముగనుండు క్షారములను పిత్త రోగము, రక్తరోగము, విశేషబలము, అధికబలహీనము, జ్వరము, అతిసారము, హృద్రోగము, శిరోరోగము, పాండురోగము, అరోచకము, తిమిరరోగము, సర్వాంగ శోఫ అను నీ రోగములయందును, వమనవిరేచ[illegible] [illegible]డు, భీరుడు గర్భిణి, ఋతుమతి, ఉత్తరతంత్రములో సుహృరో[illegible] [illegible] [illegible] ప్రోద్వృత్త ఫలయోనిరోగము (అనగా —

---

* పచ ఇతి పా.

"వేగాదావర్తనాద్యోనిం ప్రపీడయతి మారుతః,
సఫేనిలం రజః కృచ్ఛ్రాదుదావృత్తం విముంచతి.
ఇయం మాపదుదావర్తా"

అను వచనముచొప్పున వాతము వేగముగ చుట్టుటచే యోనిని పీడించి నురుగుతోఁగూడి యుండు రజస్సును బహుకష్టముమీద స్రవింపజేయునట్టి ఉదావర్తరోగము) గలస్త్రీ, అజీర్ణరోగి, శిశువులు, వృద్ధులు, వీరియందును, ధమనులు, సంధులు, మర్మము, తరుణాస్థి, సిరలు, స్నాయువులు, సేవనీలు, కంఠము, నాభి, అను శరీరప్రదేశములయందును స్వల్పమాంసముగల ప్రదేశమునందును; వృషణము, మేఢ్రము, స్రోతస్సు, నఖమధ్యము, వీనియందును ప్రయోగింపఁజనదు. అటులనే కంటియొక్క వర్త్మరోగమునందుతప్ప నితరమయిన రోగములయందును ప్రయోగింపం జనదు. వర్త్మరోగమునందు క్షారము ఉపయోగించతగినదేను. మఱియును నా క్షారమును హేమంతము, శిశిరము, వర్షము, గ్రీష్మము అను నీఋతువులయందును, మేఘములచే మూయబడిన మధ్యాహ్నముగల దుర్దినములయందును ప్రయోగింపఁజనదు.

మధ్యమక్షారపాకవిధానము

కాలముష్కకశమ్యాకకదలీపారిభద్రకాన్. ౮
అశ్వకర్ణమహావృక్షపాలాశాస్ఫోతవృక్షకాన్,
ఇంద్రవృక్షార్కపూతీకనక్తమాలాశ్వమారకాన్. ౯
కాకజంఘామపామార్గమగ్నిమంథాగ్నితిల్వకాన్,
సార్ద్రాన్ సమూలశాఖాదీన్ ఖండశః పరికల్పితాన్. ౧౦
కోశాతకీశ్చతస్రశ్చ శూకనాళం యవస్య చ,
నివాతే నిచయీకృత్య పృథక్తాని శిలాతలే. ౧౧
ప్రక్షిప్య ముష్కకచయే సుధాశ్మాని చ దీపయేత్,
తతస్తిలానాం కుంతాలైర్దగ్ధ్వాఽగ్నౌ విగతే పృథక్. ౧౨
కృత్వా సుధాశ్మనాం భస్మ ద్రోణం త్వితరభస్మనః,
ముష్కకోత్తరమాదాయ ప్రత్యేకం జలమూత్రయోః. ౧౩
గాలయేదర్ధభారేణ మహతా వాససా చ తత్,
యావత్పిచ్ఛిలగక్తాచ్ఛస్తీక్ష్ణో జాతస్తదా చ తమ్. ౧౪
గృహీత్వా క్షారనిస్యందం పచేల్లోహ్యాం విఘట్టయన్,
పచ్యమానే తతస్తస్మింస్తాస్సుధాభస్మశర్కరాః. ౧౫

శుక్తిక్షారపంకశంఖనాభీశ్చాయసభాజనే,
కృత్వాగ్నివర్ణాన్ బహుశః క్షారోత్థే కుడవోన్మితే ౧౬
నిర్వాప్య పిష్ట్వా తేనైవ ప్రతివాపం వినిక్షిపేత్,
శ్లక్ష్ణం శకృద్ధకశిఖిగృధ్రకంకకపోతజమ్. ౧౭
చతుష్పాత్పక్షిపిత్తాలమనోహ్వాలవణాని చ,
పరితస్సుతరాం చాతోదర్వ్యా తమనుఘట్టయేత్. ౧౮
సబాష్పైశ్చ యదోత్తిష్ఠేద్బుద్బుదైర్లేహవద్ఘనః,
అవతార్య తతశ్శీతో యవరాశౌ వయోమయే ౧౯
స్థాప్యోఽయం మధ్యమః క్షారో

నల్లమొక్కపుచెట్టు, రేల, ఆరటి, వేము, ఏపిచెట్టు, బొంతజెముడు, మోదుగు, విష్ణుక్రాంతము, నందివృక్షము, కొడిసె, జిల్లేడు, నెమలడుగుమ్రాను, క్రానుగు, గన్నేరు, గురిగింజచెట్టు ఉత్తరేణు, కూరసెల్లి, చిత్రమూలము, ఎఱ్ఱలొద్దుగు వీనినన్నిటికి సమూలముగను, శాఖాసహితముగను, పచ్చివిగను గ్రహించి కత్తి మొదలగువానిచే ఖండఖండములుగ జేసి ప్రత్యేక ప్రత్యేకము నుంచుకొనవలయును. ఇటులనే 4-గు విధములగు బీరలు (అనగా బీర, పెద్దబీర, ఏనుగుబీర, చేమబీర), యవశూకము, యవనాళము వీనిని ఖండఖండములుగ జేసి ప్రత్యేకప్రత్యేకముగా నుంచుకొనవలయును. పైజెప్పిన ప్రకారము ప్రత్యేక ప్రత్యేకముగ నుంచియుండు నల్లమొక్కప్రచెట్టు మొదలగువాని ఖండములను, 4-గు విధములగు బీరలు మొదలగువానిఖండములను గాలిలేకుండు ప్రదేశములో కత్తిరిబాయిపై వెవ్వేరుగను, గుంపుగుంపుగను పరచి వానిపై సున్నపురాళ్ళను వేసి నువ్వులదంట్లచే ప్రత్యేకప్రత్యేకముగా కాల్చవలయును. నిప్పు చల్లారినపిదప సున్నపురాళ్ళయొక్క భస్మమును దోణప్రమాణము ప్రత్యేకముగ నెత్తియుంచుకొనవలయును. మఱియు నితరమైన రేల మొదలగు ద్రవ్యభస్మముల నొక దోణప్రమాణమును, నల్లమొక్కపుచెట్టు భస్మమును ద్రోణమునకంటె నధికముగ నెత్తియుంచుకొని అర్ధభారము జలముచేతను, అర్ధభారము మూత్రముచేతను, ప్రత్యేకప్రత్యేకముగా క్షారస్రావము గలుగువరకు, విశాలమైనవస్త్రముచే గాలనము చేయవలయును. పిచ్ఛిలముగ, రక్తవర్ణముగ, నిర్మలముగ, తీక్ష్ణముగ నాక్షారము స్రవించునపుడు దానిని ఇనుపపాత్రలో బాణలిలో నినిచి స్నేహపాకవిధిచే గరిటెవలన కలియబెట్టుచు పాకముచేయవలయును. పాకం బగుచుండు క్షారస్రావములో నెనిమిది పలములను ఊక్కుపాత్రలో జేకొని ప్రత్యేకముగ నుంచుకొనవలయును. పిదప శుక్తులు (అనగా ముత్యపుచిప్పలు) క్షారపంకము (అనగా ప్రలేపకము) శంఖనాభి వీనిని ఇనుపపాత్రలో వేసి అగ్నివర్ణమువలె నెఱ్ఱగ

వేయించి పలుమారు పైజెప్పిన క్షారస్రావములలో ముంచుటచే చల్లార్చి పిదప ప్రత్యేక ముగ నెత్తి యునిచియుండు సున్నపురాళ్లభస్మమును; కోడి, నెమలి, డేగ, రాపులుగు, పావురపిట్ట అనువానిమలములను; పశువు మొదలగు చతుష్పాదజంతువులు, పక్షులు అనువాని పిత్తములను; హారిదలము, మణిశిల సైంధవలవణము మొదలగు లవణములను పైజెప్పిన శుక్తులు మొదలగువానితోడ జేర్చి జాలిపైనుబిచి ప్రత్యేకముగ నెత్తి యునిచి యుండు క్షారస్రావముచే నున్నగ నూరి పిసికి పాకంబగుచుండు క్షారస్రావమునకు ప్రతీవాపమును (అనగా కల్కమును) వేయవలయును ప్రతీవాపమనగా—ద్రవద్రవ్యము లలో ద్రవ్యాంతరములను జేర్చి నున్నగ నూరి పిసికివేయబడునది యనియర్థము. అటుల ప్రతీవాపము వేసినపిదప నాల్గు ప్రక్కలయందు గరిటెచే బాగుగా కలియబెట్టవల యును ఎపుడాక్షారస్రావము ఉష్ణముగనుండు బుద్బుదములతోడ గట్టిగనై లేహ్యము వలె పొడవుగ లేచునో (అనగా పాకమువలన నెపుడుగట్టిగనై, లేహతుల్యముగనై గరి టెలో నంటుకొనివచ్చునో) అపుడు దానిని పొయిమీదనుండి దించుకొని యినుపపాత్ర యం దునిచి చల్లార్చి యవధాన్యరాశిలో నుంచవలయును. ఇదియ మధ్యమక్షారపాక విధానము.

## మృదుక్షారవిధానము

న తు పిష్ట్వా క్షిపేన్మృదౌ,
నిర్వాపాప్యపనయేత్

మృదువైనక్షారమును పైజెప్పిన మధ్యమక్షారమువలెనే పాకముచేయవలయును. అయితే అది పక్వంబగుచుండునపుడు దానిలో సున్నపురాళ్లభస్మము, శుక్తులు మొద లగువానినివేసి తత్క్షణముననే దించివేయవలయునే కాని పైచెప్పిన మధ్యమక్షారములో చెప్పియుండునటుల ప్రతీవాపద్రవ్యములనునూరి వేయవలసినదిలేదు.

## తీక్ష్ణక్షారవిధానము

తీక్ష్ణే పూర్వవత్ప్రతివాపనమ్. ౨౦
తథా లాంగలికాదంతిచిత్రకాతివిషావచాః,
స్వర్జికాకనకక్షీరిహింగుపూతీకపల్లవాః. ౨౧
తాలపత్రీ బిడం చేతి సప్తరాత్రాత్పరం తు సః,
యోజ్యః

తీక్ష్ణమైనక్షారమునుకూడ పైజెప్పిన మధ్యమక్షారమువలెనే పాకముచేసి మధ్యమ క్షారమునకు జెప్పియుండు ప్రతీవాపద్రవ్యములతోడ పొత్తిగడ్డ, దంతి, చిత్ర మూలము, అతివస, వస, స్వర్జికాక్షారము, హేమమాక్షికము, ఇంగువ, నెమలడుగు

చిగుళ్లు, సదాప, బిడాలవణము, వీనినిగూడాజేర్చి బాగుగ నూరి తీక్ష్ణమైన క్షారస్రావములో ప్రతీవాపము వేయవలయును. ఈతీక్ష్ణమైనక్షారమును ఏడు దినములకు పిమ్మట నుపయోగింపందగును.

తీక్ష్ణ క్షారోపయోగము

తీక్ష్ణోఽనిలశ్లేష్మమేదోజేష్వర్బుదాదిషు. ౨౨

తీక్ష్ణమైనక్షారమును వాతము, శ్లేష్మము, మేదస్సు, వీనిచే గలిగిన అర్బుదాదిరోగములనికముగ నుండునపుడు మాత్రమే ప్రయోగింపవలయును. మఱియును అర్బుదాదిరోగములు మధ్యమముగ నుండునపుడు ఇతరక్షారములను ప్రయోగించ వలయును. అర్బుదాది యను ఆదిశబ్దమువలన తీక్ష్ణక్షారముచే సాధ్యమగు నితరరోగములయందును ఆక్షారము నుపయోగింపవలయు నని భావంబగుచున్నది.

మధ్యమక్షారోపయోగము

మధ్యేష్వేవ చ మధ్యః

వాతకఫమేదస్సులచే గలిగిన అర్బుదాదిరోగములు మధ్యమముగ నుండు నపుడు (అనగా అధికముగాకను, తగ్గకను, సమముగ నుండునపుడు) మధ్యమక్షారమును ప్రయోగింపవలయును.

మృదుక్షారోపయోగము

అన్యః పిత్తాస్రగుదజన్మసు,

మృదువైనక్షారమును పిత్త రక్తముచే జనించిన అర్శోరోగమునందు ప్రయోగింపవలయును. పిత్తరక్తముచే జనించిన అర్శోరోగములయందు తీక్ష్ణమధ్యక్షారములను ప్రయోగింపజనదు.

క్షారాంబుసంయోగము

బలార్థం క్షీణపానీయే క్షారాంబు పునరావపేత్. ౨౩

ఆక్షారము ద్రవహీనమై గట్టిగనగునపుడు దానికి బలముకలుగుటకై మరల క్షార విధిచే కాచబడిన క్షారోదకమును దానిలో జేర్చవలయును.

క్షారగుణములు

నాతితీక్ష్ణో మృదుః శ్లక్ష్ణః పిచ్ఛిలశ్శీఘ్రిగస్సితః,
శిఖరీ సుఖనిర్వాప్యో న విష్యందీ న చాతిరుక్. ౨౪
క్షారో దశగుణశ్శస్త్రతేజసోఽపి కర్మకృత్,

క్షారము అతితీక్ష్ణము గాకయు, మృదువుగను, శ్లక్ష్ణముగను, పిచ్ఛిలముగను, శీఘ్రిములో వ్యాపించునదిగను, శిఖరముగలదిగను (అనగా పిటికలను గలుగజేయతగినన్ని

గను) పులికడుగు మొదలగువానిచే సుఖముగా శమింపజేయతగినదిగను, స్రావరహితము గను, మిగుల బాధను గలుగజేయనిదిగను ఇటుల పది గుణములు గలదిగ నుండును. మఱియు నీక్షారము శస్త్రముయొక్క ఛేదనపాటన లేఖనాదికృత్యములను వ్యాధిశమన రూపమగు అగ్నికృత్యములను జేయును.

"అత్యుష్ణోఽతిశీతోఽతితీక్ష్ణోఽతి మృదురతితనురతిఘనోఽతిపిచ్ఛిలోఽతి విసర్పి హీనౌషధో హీనపాకశ్చ."

అత్యుష్ణము, అతిశీతలము, అతితీక్ష్ణము, అతిమృదుత్వము, మిక్కిలి తేటగ నుండుట, మిక్కిలి గట్టిగనుండుట, అతిపిచ్ఛిలత్వము, అతివిసర్పిగ నుండుట, హీనమైన ఔషధముతో గూడియుండుట, హీనపాకము అను దోషములు పదియును క్షారమునకు గలవని అష్టాంగ సంగ్రహములో జెప్పబడి యున్నది.

ఆచూషన్నివ సంరంభాద్గాత్రమాపీడయన్నివ. ౨౫
సర్వతోఽనుసరం దోషానున్మూలయతి మూలతః,
కర్మ కృత్వా గతరుజః స్వయమేవోపశామ్యతి ౨౬

క్షారము తనవేగమువలన శరీరమును పీల్చునటులను, పీడించునటుల నుండును. సర్వశరీరమునందు వ్యాపించి శస్త్రసాధ్యమైన దోషములను వేరుతో నాశము జేయును. అటుల తనదాహాదికృత్యమును జేసినపిదప రోగము నివృత్తియైనపిదప స్వయముగనే శమనమును జెందును.

## క్షారోపయోగక్రమము

క్షారసాధ్యే గదే ఛిన్నే లిఖితే స్రావితేఽథవా,
క్షారం శలాకయా దత్వా ప్లోత ప్రావృతదేహయా. ౨౭
మాత్రాశతముపేక్షేత

క్షారసాధ్యముగనుండు అర్శోర్బుదాదిరోగములు ఛేదింపబడి యుండునపుడును, లేఖనముచేయబడి యుండునపుడును (లేఖనము అనగా శస్త్రముచే గీచుట) లేక రక్తస్రావము చేయించబడి యుండునపుడును, వస్త్రఖండముచే చుట్టబడిన శలాకచే క్షారమును ప్రయోగించి నూరు మాత్రాకాలమువరకు నుపేక్షింపవలయును. (అనగా పులికడుగు మొదలగువానిచే నాక్షారమును శమనముచేయకూడదని భావము.) ఛిన్నే, లిఖితే, అని చెప్పియుండుటచే ఛేదనాదికర్మలం జేసినపుడుమాత్రము క్షారమును ప్రయోగించవలయు నని యును, ఇతరకాలమునందు ప్రయోగించకూడదనియు స్పష్టమగుచున్నది

## అర్శోరోగమున క్షారప్రయోగము

తత్రార్శసస్స్వభృతాననమ్
హస్తేన యన్త్రం కుర్వీత

క్షారసాధ్యమైన అర్శోరోగమునందు క్షారప్రయోగము జేసి నూఱు అక్షరముల నుచ్చరించునంతకాలమువరకు అర్శోయంత్రము యొక్క ముఖమును హస్తముచే మూసికొని యుండవలయును.

## వర్త్మరోగాదులయందు క్షారలేపము

వర్త్మరోగేషు వర్త్మనీ ౨౮
నిర్భుజ్య పిచునాచ్ఛాద్య కృష్ణం గం వినిక్షిపేత్,
పద్మపత్రతనుః క్షారలేపో ఘ్రాణార్బుదేషు చ. ౨౯

క్షారసాధ్యమైన వర్త్మరోగములయందు నేత్రములయొక్క వర్త్మప్రదేశములను వెలికిలజేసి తారకప్రదేశమును (అనగా నల్లగ్రుడ్డును) ప్రత్తి మొదలగువానిచే జేయబడిన పిచువుచే మూసి క్షారమును ప్రయోగింపవలయును. మఱియు నానేత్రములయందు తామరపువ్వురేకంతదళముగల క్షారలేపమును చేయవలయునేకాని గుదార్శస్సునందు చేయునటుల దళముగా లేపనము చేయంజనదు. మఱియు నాసికార్బుదరోగములయందును తామరపువ్వురేకువలె సన్నముగ క్షారలేపనము చేయవలయును.

## ఘ్రాణార్బుదమునందు క్షారలేపము

ప్రత్యాదిత్యం నిషణ్ణస్య సమున్నమ్యాగ్రనాసికమ్,
మాత్రా విధార్యః పంచాశత్

నాసికార్బుదరోగములయందు పురుషుడు సూర్యాభిముఖముగ కూర్చుండి నాసికాగ్రమును పొడవుగ నెత్తుకొని క్షారలేపనముజేసి యేబదియక్షరముల నుచ్చరించునంతకాలమువరకు ధరించుకొని యుండవలయును. వర్త్మరోగములో నేత్రస్థానము మిగుల సుకుమారముగ నుండుటవలన క్షారలేపమును మిగుల నల్పమైన మాత్రాకాలమువరకు ధరించవలయును.

## కర్ణార్శస్సునందు క్షారలేపము

తద్వదర్శసి కర్ణజే. ౩౦

కర్ణమునగలుగు అర్శోరోగమును నాసికార్శస్సువలెనే చికిత్స జేయవలయును. (అనగా తామరపువ్వురేకుతో సమానము పలుచనైన క్షారలేపమును ఏబది మాత్రల నుచ్చరించు కాలమువరకు ధరిపవలయునని యర్థము.)

## క్షారప్రమార్జనాదికృత్యము

క్షారం ప్రమార్జనేనాను పరిమృజ్యావగమ్య చ,
సుదగ్ధం ఘృతమధ్వాక్తం తత్పయోమస్తుకాంజికైః. ౩౧

నిర్వాపయేత్తతస్త్వాజ్యైః స్వాదుశీతైః ప్రదేహయేత్,

క్షారలేపమును నిర్ణయమైన కాలమువరకు ధరించిన పిదప వస్త్రము మొదలగువానిచే తుడిచి అర్శోబుర్బుదాదిస్థానములు క్షారముచే బాగుగదగ్ధమైనవాయని తెలిసికొని క్షారముచే దగ్ధమైయుండు నాస్థానములయందు ఘృతము, తేనె వీనిని లేపనముచేసి పిదప మధురముగ, శీతలముగనుండు క్షీరము, మస్తు, పులికడుగు వీనిలో ఘృతమును జేర్చి ఆస్థానమును తడిపి క్షారవేగమును శమనము చేయింపవలయును.

క్షారకర్మయందు పథ్యము

అభిష్యందీని భోజ్యానిభోజ్యాని క్లేదనాయ చ. 32

పిదప శ్లేష్మకరమైన మినుములు, పెరుగు మొదలగుఅన్నపానములు వీటిని క్షారముచే దగ్ధమైయుండు స్థానములయందు చెమ్మగలుగుటకై భుజింపజేయవలయును

యది చ స్థిరమూలత్వాత్ క్షారదగ్ధం న శీర్యతే,
ధాన్యామ్లబీజయష్ట్యాహ్వతిలైరాలేపయేత్తతః. 33

క్షారముచే దగ్ధమైయుండు రోగస్థానము దృఢమైనమూలము గలదియై శ్లేష్మకరమైన యాహారాదులచే శిథిలము కాకుండినయెడల ఆ రోగస్థానమునందు ధాన్యామ్లబీజము (అనగా అన్నము), అతిమధురము, నువ్వులు వీనిని లేపనము చేయవలయును.

వ్రణహార తిలకల్కలేపము

తిలకల్కస్సమధుకో ఘృతాక్తో వ్రణరోపణః,

అతిమధురము, ఘృతము వీనితోగూడియుండు తిలకల్కము వ్రణము నార్చును.

క్షార సమ్యగ్దగ్ధలక్షణము

పక్వజంబ్వసితం సన్నం సమ్యగ్దగ్ధం

క్షారముచే బాగుగా దగ్ధమైనస్థానము పండిన నేరేడుపండువలె నల్లగ, పల్లముగ నుండు నని తెలియవలయును.

క్షారదుర్దగ్ధలక్షణము

విపర్యయే. 34

తామ్రతాతోదకండ్వాద్యైర్దుర్దగ్ధం

దగ్ధమైనస్థానము పండిన నేరేడుపండువలె నల్లగ నుండక ఎఱుపువర్ణము, పోట్లు, దురద, శోఫ, విస్ఫోటము వీనితోగూడియుండినయెడల బాగుగా దగ్ధము కాలేదని తెలిసికొనవలయును.

దుర్దగ్ధమునకు పునర్దాహము

తం పునర్దహేత్,

బాగుగా దగ్ధముకాని స్థానమును మరల క్షారప్రయోగముచే దహింప జేయవలయును.

క్షారాతిదగ్ధలక్షణము.

అతిదగ్ధే స్రవేద్రక్తం మూర్ఛాదాహజ్వరాదయః. 34

క్షారముచే మిక్కుటముగా దగ్ధమైయుండునపుడు రక్తము స్రవించును. మఱియు మూర్ఛ, తాపము, జ్వరము మొదలగు నుపద్రవములు గలుగును. జ్వరాదియను ఆదిశబ్దమువలన విసర్పము, శోఫ, విశేషముగా సర్వాంగములయందు తాపము, విస్ఫోటము మొదలగు నుపద్రవములు గలుగునని భావంబగుచున్నది,

గుదాతిదాహోపద్రవములు

గుదే విశేషాద్విణ్మూత్రసంరోధోఽతిప్రవర్తనమ్,
పుంస్త్వోపఘాతో మృత్యుర్వా గుదస్య శాతనాద్ధ్రువమ్. 35

క్షారకర్మచే గుదము విశేషముగా దగ్ధమయియుండునపుడు మలమూత్రములు వెడలకుండుట, ఒకానొకపుడు మలమూత్రము లధికముగ వెడలుట, పై శ్లోకములో జెప్పియుండు రక్తస్రావాద్యుపద్రవములు, శుక్రక్షయముచే స్త్రీసంభోగమునందు అసామర్థ్యము గలుగును. లేక గుదము విదారణ మగుటచే మరణము నిశ్చయముగ గలుగును.

నాసాతిదాహోపద్రవములు

నాసాయాం నాసికావంశదరణాకుంచనోద్భవః,
భవేచ్చ విషయాజ్ఞానం

క్షారకర్మచే నాసికము అధికముగ దగ్ధమయియుండగా నాసికాదండము పగులుట, ముడుచుకొనుట, వాసన తెలియకుండుట అనునీలక్షణములు గలుగును.

కర్ణాద్యతిదాహోపద్రవములు

తద్వచ్చోత్రాదికేష్వపి 36

క్షారకర్మచే చెవులు, నేత్రములు, రసనము ఇవి అధికముగ దగ్ధమయియుండగా ఆయాయింద్రియములకు విషయజ్ఞానము గలుగును.

క్షారాతిదాహశమనోపచారము

విశేషాదత్ర సేకోఽమ్లైర్లేపో మధుఘృతం తిలాః,
వాతపిత్తహరా చేష్టా సర్వైవ శిశిరా క్రియా. 37

శరీరప్రదేశములు క్షారముచే నధికముగ దగ్ధమయియుండునపుడు విశేషముగా పులిగడుగు మొదలగువానిచే సేకము, తేనె, ఘృతము, నువ్వులు వీనిచే లేపము, వాతపిత్తహరముగ, శీతలముగనుండు క్రియలన్నియు విశేషముగ హితకరంబులు.

"పాయయేతాతియోగేన తం శీఘ్రం సఘృతం దధి,
సగుడం వా దధి సరం తైలం వా ససితోపలమ్"

క్షారకర్మచే నతిదగ్ధుడైన పురుషునికి అతిశీఘ్రములో ఘృతముతో గూడియుండు పెరుగునుగాని, లేక బెల్లముతోగూడియుండు పెరుగునుగాని, బెల్లముతోగూడియుండు మస్తువునుగాని, పంచదారతోగూడియుండు తైలమునుగాని పానముచేయించవలయును. అని అష్టాంగసంగ్రహములో చెప్పబడియున్నది.

అమ్లోహి శీతస్స్పర్శేః క్షార స్తేనోపసంహితః,
యాత్యాశు స్వాదుతాం తస్మాద మ్లైర్నిర్వాపయే త్తరామ్ ౩౯

పులిగడుగు స్పర్శముచే శీతలముగనుండును. మఱియు నాపులిగడుగుసంబంధము వలన క్షారము తత్క్షణమునసే కటుకలవణాది గుణములను విడిచి మాధుర్యమును జెందును, కాబట్టి పులిగడుగు మొదలగువానిచే క్షారదగ్ధమయిన స్థలమును విశేషముగా కడిగి శమనము చేయించవలయును. నిర్వాపయేత్తరాం అని చెప్పియుండుటవలన ఒకానొకపుడు దేశము, సాత్మ్యము, బలము మొదలగువాని ననుసరించి క్షీరము మొదలగువాని చేతను, క్షారదగ్ధస్థానమును శమింపజేయందగునని భావంబగుచున్నది.

అగ్నికర్మదాని శ్రేష్ఠత్వము

అగ్నిః క్షారాదపి శ్రేష్ఠ స్తద్దగ్ధానామసంభవాత్,
భేషజక్షారశస్త్రైశ్చ న సిద్ధానాం ప్రసాధనాత్. ౪౦

క్షారమునకంటె అగ్ని మిగులప్రశస్తమైనది. ఏలయనగా—అగ్నిచేదగ్ధమైన అర్శస్సు మొదలగురోగములు మరల జనించకుండును. మఱియు నౌషధము, క్షారము శస్త్రము వీనిచే శాంతిజెందకుండురోగములను అగ్నికర్మ శమింపజేయును.

అగ్నికర్మోపయోగస్థలములు

త్వచి మాంసే సిరాస్నాయుసంధ్యస్థిషు యుజ్యతే,

అగ్నికర్మ చర్మము, మాంసము, సిరలు, స్నాయువులు, సంధులు, అస్థులు వీనియందుపయోగింపబడును.

మషాది రోగములయందు చర దాహము

మషాంగగ్లానిమూర్ధార్తిమంథకీలతిలాదిషు. ౪౧
త్వగ్దాహో వర్తిగోదంతసూర్యకాంతశరాదిభిః,

మషము, అంగగ్లాని శిరోరోగము, మంథము, కీలము, తిలము మొదలగురోగములయందు వర్తి (అనగా పిచువర్తి) గోదంతము, సూర్యకాంతము, బాణము, మొదలగువానిచే చర్మమునందు అగ్నిదాహము చేయవలయును. "కీలతిలాదిషు" అను

ఆదిశబ్దమువలన క్షుద్రరోగాధ్యాయమునందుచెప్పబడు నితరరోగములయందును చర్మమునకు అగ్నిదాహము చేయవలయు నని అర్థమగుచున్నది.

అర్శాది రోగములయందు మాంసదాహము

అర్శోభగందరగ్రంథినాడీదుష్టవ్రణాదిషు. ౪౨
మాంసదాహో మధుస్నేహజాంబవౌష్ఠగుడాదిభిః,

అర్శస్సు, భగందరము, గ్రంథి, నాడీరోగము, దుష్టవ్రణము మొదలగు (అనగా అర్బుదము, గండమాల) అనునీరోగములయందు తేనె, స్నేహము, జాంబవౌష్ఠమనుశలాకు, బెల్లము మొదలగువానిచే మాంసమునందు అగ్నిదాహము చేయవలయును. అనగా.—ఒకానొకపుడు తేనెచేతను, ఒకానొకపుడు ప్రత్యేకముగా స్నేహములచేతను, ఒకానొకపుడు జాంబవౌష్ఠమను శలాకుచేతను అగ్నితాపము చేయవలెనని తెలియవలయును.

శ్లిష్టవర్త్మారోగములయందు సిరాదాహము

శ్లిష్టవర్త్మన్యసృక్స్రావనీలీసమ్యగ్వ్యధాదిషు. ౪౩
సిరాదిదాహస్తైరేవ.

శ్లిష్టవర్త్మ రక్తస్రావము, నీలిక, సిరావ్యధనము జేసినప్పుడు పద్ధతి నుల్లంఘించి చేయుట, మొదలగువానియందు పైజెప్పిన తేనె మొదలగువానిచేతనే సిరాదాహము చేయవలయును.

అగ్నికర్మకు అనర్హులు

న దహేత్క్షారవారితాన్,
అంతశ్శల్యాసృజో భిన్నకోష్ఠాన్ భూరివ్రణాతురాన్. ౪౪

క్షారకర్మయం దనర్హులు, లోన శల్యరూపమగు రక్తము గలవారు, భిన్నమైన కోష్ఠము గలవారు, అధికముగా వ్రణములచే పీడితులుగ నుండువారు వీరికి అగ్నిదాహము చేయంజనదు. అగ్నిదాహ మనగా:—అగ్నిచేత తప్తమైన శలాకాదులచే రఢ వేయుట.

అగ్నికర్మ సమ్యగ్దగ్ధోపచారము

సుదగ్ధం ఘృతమధ్వక్తం స్నిగ్ధశీతైః ప్రదేహయేత్,

రోగస్థానము అగ్నిచే బాగుగ దగ్ధమైనదని తెలిసికొని దానియందు ఘృతము, తేనె వీనిని అభ్యంగము చేయించి స్నిగ్ధముగ, శీతలముగనుండు అతిమధురము, పొన్నగంటి మొదలగువానిని లేపనము చేయవలయును.

◆ అగ్నికర్మ సమ్యగ్దాహలక్షణము ◆

తస్య లింగం స్థితే రక్తే శబ్దవల్లసికాన్వితమ్, ౪౫
పక్వతాలకపోతాభం సురోహం నాతివేదనమ్,

అగ్నితాపము చేయుంకాలమునందు ప్రవర్తించురక్తము నిలుచునపుడు ఆస్థానము బుస్సుదశబ్దము, లసికపీనితోఁగూడినదిగ (లసికఅనగా కుశశస్త్రములచే గాయముగలుగునపుడు తోలంత జలమువలె గనుపించుచర్మముపైనీరు) పక్వమైనతాటిపండు, పావురపిట్ట పీనితో సమానమైనవర్ణముగలదిగ, అధికమైనవేదనలేనిదై సుఖముగ వారతగినదిగ నుండును. ఇటుల నుండుటబాగుగదగ్ధమైన స్థానముయొక్కలక్షణ మని తెలియవలయును.

◆ అగ్నికర్మ దుర్దాహ అతిదాహ సామాన్యలక్షణము ◆

ప్రమాదదగ్ధవత్సర్వం దుర్దగ్ధాత్యర్థదగ్ధయోః ౪౬

దుర్దగ్ధము, అతిదగ్ధము, వీనియొక్కలక్షణము ప్రమాదముచే సామాన్యముగ గలిగిన అగ్నిదగ్ధముతో తుల్యముగ నుండును,

◆ చతుర్విధదుర్దగ్ధలక్షణము ◆

చతుర్ధా తత్తు తుత్థేన సహ

అట్టి ప్రమాదదగ్ధము తుత్థదగ్ధలక్షణముతోడ నాల్గు విధంబులు. ఎట్లన్న — ఆలోచించక అజాగ్రతగా జేయబడిన అగ్నిదాహము ఒకానొకపుడు సమ్యగ్దగ్ధలక్షణముగలదిగ, ఒకానొకపుడు దుర్దగ్ధలక్షణము గలదిగ, ఒకానొకపుడు అతిదగ్ధలక్షణము గలదిగ, ఒకానొకపుడు మైలతుత్తముచేకాలినలక్షణము గలదిగనుండును.

◆ తుత్థదగ్ధలక్షణము ◆

తుత్థస్య లక్షణమ్,
త్వగ్వివర్ణోష్యతేఽత్యర్థం న చ స్ఫోటసముద్భవః. ౪౭

చర్మము మిగుల వివర్ణముగ నగుట, మిక్కుటముగ మంటలుగలుగుట, స్ఫోటకములు గలుగకుండుట ఇవి తుత్థదగ్ధముయొక్క లక్షణము.

◆ దుర్దగ్ధలక్షణము ◆

సస్ఫోటదాహతీవ్రోషం దుర్దగ్ధం

స్ఫోటకములు, తాపము, అతితీవ్రమయిన అంతస్తాపము ఇవి గలుగుట దుర్దగ్ధముయొక్క లక్షణము.

◆ అతిదగ్ధలక్షణము ◆

అతిదాహతః,

మాంసలంబనసంకోచదాహధూపనవేదనాః. ౪౮

సిరాదినాశ స్తృణ్మూర్ఛా వ్రణగాంభీర్యమృత్యవః,

అతిదాహమువలన రోగస్థానమునందు మాంసము వ్రేలాడుట, సిరలు మొదలగు వానికి సంకోచము, తాపము, ధూమాపనము (అనగా పొగలేచున ట్లుండుట) వేదన, సిరాదులకు నాశము, గంభీరమయిన వ్రణము (అనగా లోతుగనుండు వ్రణము) మరణము ఇవి గలుగును.

### తుత్థదగ్ధచికిత్స

తుత్థస్యాగ్ని ప్రతపనం కార్యముష్ణం చ భేషజమ్. ౪౯

స్త్యానేఽస్రే వేదనాత్యర్థం విలీనే మందతా రుజః,

తుత్థదగ్ధములో గడ్డకట్టియుండురక్తము ద్రవించుటకై అగ్నితాపమును, ఉష్ణమయిన యౌషధమును చేయవలయును. ఏలనగా — తుత్థదగ్ధస్థానములో రక్తముపేరి గడ్డకట్టియుండునపుడు విశేషముగా బాధ గలుగును. రక్తము ద్రవించియుండునపుడు ఆయుపద్రవములు నివర్తించును. కావున రక్తమును ద్రవింపజేయు ఉష్ణమైన యౌషధాదుల నుపయోగించవలెను.

### దుర్దగ్ధచికిత్స

దుర్దగ్ధే శీతముష్ణం చ యుంజ్యాదాదౌ తతో హిమమ్. ౫౦

దుర్దగ్ధములో తొలుత శీతలముగ, ఉష్ణముగ నుండు నౌషధమును ప్రయోగించి పిదప శీతలముగ నుండు ఔషధమును ప్రయోగింపవలయును.

### సమ్యగ్దగ్ధచికిత్స

సమ్యగ్దగ్ధే తుగాక్షీరిప్లక్షచందనగైరికైః,

లింపేత్సాజ్యామృతైరూర్ధ్వం పిత్తవిద్రధివత్క్రియా. ౫౧

సమ్యగ్దగ్ధములో ఘృతము, తిప్పతీగె వీనితోగూడియుండు తవక్షీరి (వెదురుప్పు), జువ్వి, చందనము, జేగురురాయి వీనిచే తొలుత ప్రలేపమునుచేసి పిదప పిత్తవిద్రధికి జెప్పియుండు క్రియలను చేయవలయును

### అతిదగ్ధచికిత్స

అతిదగ్ధే ద్రుతం కుర్యాత్సర్వం పిత్తవిసర్పవత్,

అతిదగ్ధములో పిత్తవిసర్పమునకు జెప్పియుండు బాహ్యాభ్యంతరౌషధములను శీఘ్రముగా జేయవలయును.

## స్నేహదగ్ధచికిత్స

స్నేహదగ్ధే భృశతరం రూక్షం తత్ర తు యోజయేత్. ౫౨

స్నేహదగ్ధములో మిక్కుటముగా రూక్షకరమైన యౌషధములను ప్రయోగింపవలయును. (తు) అనుశబ్దమువలన తెలుచుగా రూక్షకరమైన ప్రలేపాదులను, దేహము, దేశము, కాలము, సాత్మ్యము వీని కనుగుణముగా నాయా యవస్థకుతగినటుల స్నిగ్ధమైన ఔషధాదులను విధిప్రకారము ప్రయోగింపవలయునని యర్థం బగుచున్నది.

## సూత్రస్థాననిగమనము

సమాప్యతే స్థానమిదం హృదయస్య రహస్యవత్,

హృదయమువలె నతిరహస్యార్థములంగల అష్టాంగహృదయ మను నీతంత్రము యొక్క సూత్రస్థానము ముగింపబడుచున్నది.

అత్రార్థాసూత్రితాసూక్ష్మాః ప్రతన్యంతే హి సర్వతః. ౫౩

ఈ స్థానమునం దతిసూక్ష్మబుద్ధిగలవారలచే నెఱుంగదగిన యర్థములు సూచనగా జెప్పబడియున్నవి. ఈయర్థములే సమస్తతంత్రములయందు విస్తరింపబడెను.

త్రింశాధ్యాయము ముగిసెను

ఇతి శ్రీ వైద్యపతి సింహగుప్తసూను వాగ్భట
విరచితాయాం అష్టాంగహృదయసంహితాయాం
ఆంధ్రతాత్పర్యసహితాయాం
ప్రథమం సూత్రస్థానం
సంపూర్ణమ్



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1948.

# వైద్యగ్రంథములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| చరకసంహిత, సూత్రస్థానము I | ... | 6 | 0 |
| ,, శారీర, ఇంద్రియ, నిదాన, విమానస్థానములు II | ... | 5 | 0 |
| ,, చికిత్సాస్థానము III | ... | 8 | 0 |
| ,, సిద్ధి-కల్పస్థానములు IV | ... | 3 | 8 |
| అమపానమంజరి | ... | 0 | 12 |
| అజీర్ణమంజరి | ... | 0 | 4 |
| అష్టాంగహృదయము, సూత్రస్థానము | ... | 8 | 0 |
| డిటో చికిత్సాకల్పస్థానములు | ... | 5 | 0 |
| డిటో శారీరనిదానస్థానములు | ... | 3 | 8 |
| డిటో ఉత్తరస్థానము | ... | 6 | 0 |
| కాలజ్ఞానము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 0 | 4 |
| రావణకుమారతంత్రము ,, | ... | 0 | 6 |
| గదనిగ్రహము ,, | ... | 2 | 8 |
| ఘృతతరంగము ,, | ... | 1 | 4 |
| చికిత్సాసారము ,, | ... | 2 | 8 |
| నాడీజ్ఞానము | ... | 0 | 4 |
| బసవరాజీయము | ... | 12 | 0 |
| భేషజకల్పము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 8 |
| దేహతత్త్వనిర్ణయము ,, | ... | 0 | 4 |
| మశూచికము (Small-pox) | ... | 0 | 4 |
| హోమియోపతి గృహవైద్యము | ... | 1 | 0 |
| వైద్యశతశ్లోకి | ... | 0 | 6 |
| రసరత్నాకరము, ఆంధ్ర తాత్పర్యసహితము | ... | 8 | 0 |
| రాజమార్తాండము ,, | ... | 0 | 10 |
| లోలంబరాజీయము, సవైద్యజీవనము ,, | ... | 0 | 12 |
| వస్తుగుణమహోదధి, తెనుగువచనము | ... | 6 | 0 |
| వృక్షాయుర్వేదము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 6 |
| శార్ఙ్గధరసంహిత, క్రొత్తకూర్పు ,, | ... | 5 | 0 |
| శార్ఙ్గధరకృతత్రిశతి | ... | 0 | 8 |
| సుశ్రుతశారీరము | ... | 2 | 8 |
| షడ్రసనిఘంటువు, అభిధానరత్నమాల | ... | 0 | 12 |
| సహదేవపశువైద్యశాస్త్రము, తాత్పర్యము | ... | 0 | 6 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| సర్వౌషధిగుణకల్పకము, తాత్పర్యసహితము | ... | 2 | 8 |
| సూతికాచికిత్స, డా॥ వరదప్పనాయఁడు | ... | 1 | 4 |
| దేశీయవైద్యవిజ్ఞానము | ... | 1 | 0 |

## జ్యోతిష గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| అష్టకవర్గు, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| అఱువది(గత)సంవత్సరములపంచాంగము 1867—1927 | ... | 10 | 0 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము | ... | 0 | 12 |
| కాలామృతము, మేలుప్రతి | ... | 3 | 8 |
| కేరళప్రశ్నము, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము ,, | ... | 0 | 12 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు | ... | 0 | 3 |
| భప్పన్నము, ప్రశ్నశాస్త్రము, తాత్పర్య[illegible] | ... | 0 | 8 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రటీకాసహితము | ... | 0 | 6 |
| నక్షత్రచూడామణి, చక్కనిప్రతి | ... | 0 | 6 |
| పుష్పబంధము, సాధారణప్రతి | ... | 0 | 8 |
| బృహద్యోగరత్నాకరము, తెనుగువచనము | ... | 0 | 8 |
| భృగుసూత్రములు ,, | ... | 0 | 6 |
| భావార్థచంద్రిక ,, | ... | 1 | 0 |
| మయవాస్తువు, సాంధ్ర తాత్పర్యము | ... | 0 | 4 |
| ముహూర్తదర్పణము, సటీక | ... | 2 | 0 |
| లఘుజాతకము సాంధ్రతాత్పర్యము | ... | 1 | 4 |
| ఫణిమాల (వర్షఫణి) ,, | ... | 0 | 4 |
| వాస్తుసర్వస్వము ,, | ... | 0 | 6 |
| వృద్ధపారాశర్యము, సాంధ్రతాత్పర్యము | ... | 1 | 0 |
| శకునశాస్త్రము, (శ్రీఖనరసింహశతకము) | ... | 0 | 4 |
| షోడశప్రశ్నరత్నావళి, నెపోలియన్ అ[illegible] గ్రంథమునకు తెనుఁగు | | 0 | 4 |
| సనత్కుమారగృహవాస్తువు, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 4 |
| సనత్కుమారశిల్పశాస్త్రము, ,, | ... | 0 | 4 |
| స్వప్నశాస్త్రము ,, | ... | 0 | 3 |
| సారావళి, సాంధ్రతాత్పర్యము | ... | 3 | 8 |
| సాముద్రికశాస్త్రము, సటీక | ... | 0 | 6 |
| డిటో తెనుఁగుపద్యకావ్యము | ... | 0 | 6 |
| హోరారత్నమాల, ఆంధ్రతాత్పర్యము | ... | 0 | 12 |